చిలకమర్తి లక్ష్మీనృసింహాకవి

# సంపూర్ణ గ్రంథావళి

## షష్టిపూర్తి ముద్రణము

### ౮-వ సంపుటము - కథలు

భాగవతకథామంజరి - భారతకథామంజరి

వినోదములు - చమత్కారమంజరి



షష్టిపూర్తి సంఘకార్యదర్శి :

పాలకోడేటి గురుమూర్తిగారిచే

ప్రకటితము.

1927

 [ Price Rs. 3

H




## పరీక్షితుఁడు.



పాండవమధ్యముఁడైనయర్జునుఁడు ద్రౌపదినిగాక శ్రీకృష్ణుని చెల్లెలైన సుభద్రినుగూడవివాహమాడెను. ఆమెవలననభిమన్యుఁడను కుమారుఁడుగలిగెను. పాండవులు దుర్యోధనునిచేత జూదమునందోటువడి పండ్రెండువత్సరములరణ్యవాసము జేసి పదమూఁడవవత్సరమున విరటునియింట నజ్ఞాతవాసము జేసిరి. అప్పుడర్జునుఁడు పూర్వముధర్మదేవతయిచ్చినవరమునుబట్టి పేడివాఁడై బృహన్నలయను పేరుబెట్టుకొని విరటునికూఁతురైన యుత్తరకు నృత్యమునేర్పెను. అజ్ఞాతవాసము ముగిసినతరువాత విరటుఁడు పాండవులు తనయింటమాఱువేసములు వేసికొని నీచవృత్తులతోఁ దన్నుఁగొలిచిరని విని ఖేదపడి తనప్రియపుత్రికయయినయుత్తరనువివాహమాడుమని బలవంతపెట్టెను. తనయొద్దనామె విద్యనేర్చుకొనుటచేఁ దనకామెపుత్రికాప్రాయురాలగుటనామెను వివాహమాడుటకిష్టములేక యర్జునుఁడు తనకుమారుఁడైన యభిమన్యున కాబాలికనిచ్చి పెండ్లిసేయుమని విరటునడిగెను. పరమహర్షముతో విరటుఁడుసమ్మతించి శ్రీకృష్ణబలరామాదిబంధువులను రావించి యుత్తరను సౌభద్రునకిచ్చి యతివైభవముగాఁ బరిణయంబు జేసెను. పిమ్మటదుర్యోధనాధులగు కౌరవులకును, యుధిష్ఠిరాదులగు పాండవులకును శ్రీకృష్ణుఁడు స్వయముగాదూతయై ప్రయత్నించినను సంధికుదురకపోవుటచే పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రమందు ఘోరమైన

యుద్ధముజరిగెను. ఆమహాసంగ్రామమున పదిదినములుయుద్ధముచేసి భీష్ముఁడు పడినవెనుక సకలకురుకులశిక్షకుఁడైన ద్రోణాచార్యుఁడు సేనాపతియయ్యెను. అతఁడైదుదినములుఁ కయ్యముచేసెను. అతఁడు మూఁడవనాఁడు పద్మవ్యూహముపన్నెను. అర్జునుఁడు నభిమన్యుఁడు దక్కఁదక్కినపాండవు లావ్యూహమును భేదింపఁజాలరు. ఆనాఁడు కృష్ణార్జునులిరువురునారాయణగోపాలు రతో సమరము జేయఁబోయిరి పద్మవ్యూహము భేదింపఁదగిన మహాయోధులు లేకపోవుటచే ధర్మ రాజు ఖిన్నుఁడైయుండ తానావ్యూహము భేదింపఁజాలునట్లు యుధిష్ఠి రునకు నచ్చఁజెప్పి యభిమన్యుఁడువ్యూహముఁజొచ్చెను. సైంధవుఁడు శివునివరమున వ్యూహమునకడ్డము నిలిచి భీమసేనాదిపాండవులను లోనఁ బ్రవేశింపనీయఁ డయ్యెను. కావున నభిమన్యుఁ సడహాయుఁడై శత్రుసైన్యములు మెచ్చునట్లు దేవతలాశ్చర్యపడి భళి! యని ప్రశం సించునట్లు తానేకాకియయ్యు మహాసంగ్రామముచేసి యలసి మరణ మునొందెను. అతఁడుపోవునప్పటికి భార్యయగు నుత్తర గర్భవతియై యుండెను. ద్రోణాచార్యుఁడు సాధారణముగానోడిపోయి చావఁడని “అశ్వత్థామహతః” యని ధర్మరాజు గట్టిగాద్రోణుఁడువినునట్లుబద్ధ మాడి తనలో మెల్లగా ‘కుంజరః’ అనుకొనెను. అనఁగా నశ్వత్థామ యను యేనుఁగప్పుడేచచ్చుటచేతనదిచచ్చినదనియునశ్వత్థామచచ్చెనని యు రెండర్థములువచ్చునట్లు యుధిష్ఠిరుఁడుపలికెను. “అశ్వత్థామ హతః” అనుమాటవిని ద్రోణుఁడు ప్రాయోపవేశముచేసి యోగమా ర్గమునఁ బ్రాణమువిడిచెను. మృతినొందినద్రోణుని సమీపించి పాండ వసేనాపతియు, ద్రౌపదిసోదరుఁడునైన దృష్టద్యుమ్నుఁడు పాంచాలు రకుఁ దమకుఁగలపూర్వవైరముచేత గాఢ క్రోధావిష్టుఁడై యావృద్ధ బ్రాహ్మణునిశిరస్సుఖండించెను. అదిచూచి యశ్వత్థామతీవ్రముగా శోకించి పాంచాలకులమును, పాండవవంశమును నాశనముచేయవలె

నని ప్రతిజ్ఞబట్టెను. యుద్ధము ముగిసినతిరువాత శిబిరములో బండు కొని హాయిగా నిద్రించుచున్న ద్రౌపదీకుమారులైన యుపపాండవుల నైదుగురిని, శిఖండి దృష్టద్యుమ్నుఁడు మొదలగు పాంచాలకుమారు లను నతిదారుణముగాఁ బశువులవధించినట్లు చంపి దానితోఁదనివినొం దక లోక మపాండవము సేయసంకల్పించి యుత్తరగర్భములోనున్న పిండమునుగూడఁ గడ తేర్పవలెనని బ్రహ్మాస్త్రంబుప్రయోగించెను. ఆమహాస్త్రజ్వాలలకు నుత్తరకడుపులోనున్నపిండము మాడిపోకుండ శ్రీకృష్ణుఁడు తనపరిభావముచేతఁ గాఁపాడెను. ఆయుత్తరకుఁ బుట్టిన కొడుకే పరీక్షితుఁడు. ఆతనిజననప్రకార మించుకదెలియుట మంచిది గావున దానినీకిందఁ బొందుపఱచుచున్నాఁడను.

భారతరణమున యుధిష్ఠిరుఁడు రాజ్యకాంక్షచే నెల్లచుట్టములఁ జంపినందుకు మిక్కిలి విచారగ్రస్తుఁడై వ్యాసమహాముని యనుమత మున జ్ఞాతివధమహాపాతకము బాపుకొనుటకై యశ్వమేధము జేయఁ బ్రయత్నించి తన్నిమిత్తముగావలసిన ధనముం దెచ్చుటకై హిమవ త్పర్వతప్రాంతమున కనుజసమేతుఁడై పోయెను. ధర్మరా జశ్వమేధ ము సేయుననివిని శ్రీకృష్ణబలరాములు బంధుమిత్రసహితముగా హస్తిపురికిఁ బోయిరి. ధర్మరాజు మొదలగువారు గృహంబున లేని సమయమున నుత్తర ప్రసవించెను. మగపిల్లవాఁడుగలిగెను. కానియ శ్వత్థామ యతఁడు గర్భస్థుఁడైనకాలమునఁ బ్రయోగించిన దారుణా స్త్రప్రభావముచే జచ్చిపుట్టెను. ఉత్తరాగర్భమున నందనుఁడుగలుగు ననియు, నందువలనఁ గురువంశము నిలుచుననియు నెంతో యువ్విళు లూరుచున్న కుంతీసుభద్రాద్రౌపదీప్రముఖలగు నంగనలయాసలు మృతశిశువుం జూచినతోడనే యడుగంటెను. అంతఃపురమందలి యంగన లందఱు గొల్లుమని యేడ్చిరి. కురువంశ విచ్ఛేదమైనదని గాంధారిమున్నగు నంగనలు గూడ విలపించిరి. అప్పు డాయార్తనా

దమువిని యేమదియని వాసుదేవుఁడగు మేనత్తయగు కుంతీ మహాదేవి నల్లునితోనిట్లనియె. "దేవా! వాసుదేవా! నాకును నా సంతతికిని నీవేగతివి. నాఁడులక్కయింట మమ్ముంబెట్టి దురాత్ములైన దుర్యోధనాదులు చిచ్చుపెట్ట నేను నాబిడ్డలు చెక్కుచెదరకుండ జీవింపఁజేసితివి. సుయోధనుఁడు భీమునకు విషాన్నప్రయోగంబు జేయించి నప్పు డవ్విష మమృతమట్లు జీర్ణంబుచేయించితివి. గాంధారీనందనులు ద్రుపదరాజపుత్రికను గొప్పుపట్టి సభకీడ్చి వలువలొల్చిన సమయంబున దానిని మానభంగంబు గాకుండఁ గాఁపాడితివి. కృపకర్ణభీష్మ ద్రోణ పరిభృతులగు మహావీరులశస్త్రాస్త్రములచే నాబిడ్డ లించుకేని యు నలగకుండ రక్షించితివి. ఇప్పుడు మాకులమునకు మహాపద సంభవించినది. నీమేనల్లునికొడుకు చచ్చిపుట్టె. దురాత్ముఁడైన యశ్వత్థామప్రయోగించిన మహాస్త్రజ్వాలలచేత నతఁడిట్లయ్యెఁ గావలయు ఈకుమారునను గ్రహించి బ్రతికింపుము. ఆచార్యపుత్రుఁడు ఘోరాస్త్రము బ్రయోగించినసమయమున నుత్తరగర్భమును నేనురక్షించెద నని నీవు ప్రతినచేసితివి. ఆప్రతిజ్ఞను నేఁడుపరిపాలింపుము. ఈబాలు నితోడిదే నాబ్రతుకు. నాబ్రతుకెకాదు ద్రుపదరాజనందన బ్రతుకును సుభద్రబ్రతుకును నబ్బాలకునితోడిదె. ఈశిశువుబ్రతుకకున్న యుధిష్ఠిరుండు జీవింపఁడు. భీమార్జునులు వానిమార్గంబెయనుసరింతురు. ము న్నొకనాఁడు భర్తృవిహీనయయినయుత్తరనుజూచినీగర్భస్థశిశువునకు భయములేదు. నేను రక్షించెదనని యూఅడించితివి. కావున బాలుఁ బునర్జీవితుంజేసి కురుకులంబు నిలుపుము" అని వేఁడుకొని దుఃఖాతిశయంబున నాపాండురాజమహిషి నేలంగూల దేవకీనందనుఁ డామె నూరార్చె. అంతట సుభద్ర కంట నీరువెట్టుకొనుచు సోదరుఁడగు దామోదరు సమీపించి యిట్లనియె.

అశ్వత్థామ చేసినక్రూరకర్మఫలంబు నేఁ డనుభవంబునకువచ్చె.

నీమఱంది నిజవంశోద్ధారకుఁడైన మనుమఁడు జనియించునని పుట్టె డాసపెట్టుకొని యుండె. పిడుగువంటి యీవార్తవినిన పిదప నమ్మహాత్మఁ డేమగునో నీవ యెఱుఁగుదువు. ఈమాట వినిన యుధిష్ఠిరుండు దేహంబు ధరింపఁగలఁడె. పవననందనుమేన ప్రాణవాయువు లుండునా? నకులసహదేవులుజీవింపఁగలరా? ద్రోణనందనుఁడునాఁడుపాండవ వంశనాశనము చేయఁదలంచి యుత్తరాగర్భస్థుఁడైన యబ్బాలుని మీఁద మహాస్త్రము ప్రయోగించినపుడు వాని క్రూరకర్మంబు నేవగించి నీవు "నీయస్త్రప్రయోగంబు వ్యర్థంబు చేసెద చూడు" మని యతనితో నంటివి. నీప్రతిన నిలుపుకొనుటకుఁ దగినసమయమువచ్చినది. నీనోట వెడలిన యమ్మాట వరంబని కరంబునమ్మి యూఱడిలి యుంటి. నీవు దయామయుఁడవు. శ్రితజనచింతామణివి. ఆర్తరక్షణయు, భక్తరక్షణయు నీకు నైజంబులు. నీమహిమంబు మే మెఱింగినవారమగుటచే నిన్నె నమ్ముకొని యింతకాలమున్నవారము. కావున నీకురుకులము నను గ్రహింపుము. చతుర్దశభువనములునొక్కపెట్ట నాశనమొందినను క్షణమాత్రంబున వాటిని మరల వెలయింపఁగలవు. అట్టినీవు నీయల్లు గుఱ్ఱకొడుకును వెండియుం బ్రతికింపఁజాలవె? వెఱ్ఱివాండ్రమగుటచే మేమింత వేఁడుకొనుచున్నాము గాని కర్తవ్యము నీవయెఱుంగుదువు" అని విలపించు చెల్లెలిం గనికరించి యాదవేంద్రుఁడు "శిశువును రక్షించెద. వగవకుండు" మని మేఘగంభీరనాదంబునఁబలికి కుంతియు సుభద్రయుఁ దనవెంట రా సమస్త మంగళపరికరంబులతోడను, పీడాపరిహారక వస్తుచయముతోడను చికిత్సలయందారితేరిన వృద్ధాంగనలతోడను నిండియున్న పురిటియిల్లుఁ జొచ్చెను. పాంచాలి యంతకుముందె యతిత్వరితమున సూతికాగృహముఁ బ్రవేశించి మిక్కిలి దుఃఖించుచున్న యుత్తరం జూచి "వాసుదేవుఁ డిటువచ్చుచున్నాఁడు. లేచి వినయంబున నతనికి నమస్కరింపుము.

భయములేదు. వగవకు” మని సమాశ్వాసింప నంతలో శ్రీకృష్ణుఁడు సమీపించెను. ఉత్తరయుత్తమాంబున వికీర్ణవేణియు బాష్పాకులిత లోచనయు గద్గదగాత్రియునై వాసుదేవుని కెదురుపోయి “దేవా! భక్తజనుల యాపదగడువం బెట్టుట నీకు సతంబు వ్రతంబుగాదె! ఈశిశువును దయామయుండవై రక్షింపుము. నీగారాబు మేనల్లుని కొడుకును ద్రోణనందనుఁడా చంపువాఁడు? నీవుండఁగా నీతండు మృతుండగునె? భర్తమరణదుఃఖమునఁ గుందుచున్న నేను పుత్రశోకంబును బొందఁగలనె? దేవకీనందనా! ఈనందనుఁడు నాకుం దక్కఁడేని నేను సుభద్రానందనుపాలికి క్షణమబోయెద. గర్భస్థుఁడైన యీకుఱ్ఱనిమీఁద నాసలుపెట్టుకొని గాదె నాఁడు ప్రాణనాథునితో నేఁబోక బ్రతికియుంటి. ఇంక నేమిచూచుకొని జీవింతును? కుమారుఁడు గలుగు అక్కుమారుని నక్కునం జేర్చి ముద్దాడుదు. వాసుదేవుఁడు వచ్చినప్పుడు బాలకునెత్తికొని వానిచేత వందనములు చేయింతునని యెన్నెన్నో కోరికలు నాడునాఁటికి వర్ధిల్లఁజేసికొని యీమేనఁబ్రాణంబులు నిలుపుకొంటి. అవియన్నియు నేఁడు ద్రోణనందనుని కతంబున వమ్మయ్యెగదె!” అని జగన్నాథుని వేఁడుకొని యంత నిలువక దుఃఖాతిశయంబునం జేసి బాలుని శవంబు తనయొడిలోనం బెట్టుకొని వాని మొగంబుజూచి “అన్నా! నీతాత జగన్నాథుండువచ్చియున్నవాఁడు. చిన్నిచేతులు జోడించి యామహాత్మునకు మొక్కవేమి? సకలధర్మరహస్యవేదియైన తండ్రికింబుట్టి పెద్దలయెడఁ జేయవలసిన సముదాచారము దాఁటఁదగునా? కిలకిల నవ్వవేమి? కన్నులు విచ్చి కుంతీమహాదేవిని జూడుము. నీమీఁద బంచప్రాణములు పెట్టుకొన్న నన్నుఁ జూడుము. నీవు జన్మింతువని గంపెడాస పెట్టుకొన్న ద్రుపదనందనం జూడుము. నీ తండ్రి తల్లి సుభద్ర వాపోవుచున్నది యామెనైనం జూడుము.” అని దుఃఖాతిరేకమున

బరవశమై యుత్తర మూర్ఛిల్లె. కౌరవాంగనల మొగములు పాడవెను. అందఱికన్నుల బాష్పములు స్రవించెను. అంతలో నుత్తర మూర్ఛదేఱి తన ఫాలతలంబున కేలుమొగిచి "జగన్నాథా! ఆర్తావనశరణ్యా! ఆశ్రితజనచింతామణీ! సురాసుర వందితచరణారవిందా! దయామయా! శరణు శరణు!" అని నెవ్వగపెంపున నవ్వల నేమియుం బలుకక యూరకుండెను. అప్పుడు వాసుదేవుఁడు కరుణాతరంగితమనస్కుఁడై వెఱువకు వెఱువకు మని యభయంబిచ్చి పాదప్రక్షాళన మాచరించి యాచమనంబు చేసి తొల్లి యశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామక మహాస్త్రప్రభావంబుఁ దన ప్రభావంబున నుపసంహరించి యాబాలకుని శవంబు పాన్పుమీఁదం బెట్టఁ బనిచి మెల్లవారలం గనుఁగొని యిట్లనియె. "నామాట బొంకుగాదు. నాఁడు నేఁ జేసినయభయప్రదానంబు తిరంబుజేసెద. శిశువును రక్షించెద. కురుకులంబు వర్ధిల్లుఁగాక. ఇది విని యుధిష్ఠిరాదులు ప్రమోదభరితులగునట్లు చేసెద. శత్రువుల విషయమందైనను నే నెన్నఁడు బొంకనివాఁడనైతినేని, రణరంగమునుండి నేనెన్నఁడును పిఱికితనమున వెనుకంజయిడనివాఁడనైతనేని యీ బాలకుఁడు పునర్జీవితుఁడగుఁ గాక! బ్రాహ్మణులయెడ నాకత్యంతభక్తిగలదేని ధర్మసంస్థాపనార్థమై నేను పాటుపడుదునేని యీయర్భకుని మేన వెండియుఁ బ్రాణములుచేరుఁగాక! అర్జునునియెడ నాకు నిష్కల్మషమైన యనురాగముగలదేని నీకుమారుఁడు మరల బ్రదుకుఁగాక! కంసుఁడు మొదలగు లోకకంటకులను నేను ధర్మసంరక్షణార్థమై వధించితినేని సజ్జనులకెల్ల నేఁ జేసినయాపనిసమ్మతమేని నీపిన్నవాఁడు జీవించుఁగాక! సత్యనిత్యతయు, ధర్మాసక్తియు, బ్రహ్మచర్యదీక్షయు నాయందు స్థిరములై యుండునేని నీశిశువు వెండియుఁబ్రదుకుఁగాక" అని వాసుదేవుఁడు శపథంబులుచేసినతోడనే బాలకునిశరీరమునఁ బ్రాణంబులు చేరెను. చైత

న్యము గలిగెను. పిన్నవాఁడు కాలుసేతులు గదలింపమొదలుపెట్టెను. కృష్ణునుద్దేశించి కావుకావుమని పలికిన తెఱంగునఁ నాడింభకుఁడు కావుకావుమని యేడ్చెను. చిన్నితమ్మిరేకులం బోలినకన్నులువిచ్చి చూచెను. అత్తెఱంగు గనుంగొని కుంతియు సుభద్రియు ద్రౌపదియు మనంబులు పరమహర్షంబున నుప్పొంగ మేనులపులకాంకురంబులు నిండ నేత్రంబులనుండి యానందబాష్పములు దొరగ నుల్లాసంబున నుండిరి. తక్కిన కౌరవాంగనల మొగములును దెలివొందెను పురిటి యిల్లు మిక్కిలి శోభానంతమయ్యె. ఆకాశవాణి జగన్నాథుఁడైన వాసుదేవుని మహిమంబు పొగడఁజొచ్చె. అప్పుడుత్తర యుత్తలపాటు దొరంగి చిత్తమానందాయత్తమగుడు నత్తనూభవు నెత్తికొనివాసు దేవుని చరణారవిందంబులపయిం బడవైచి యాతనినీదీనసలందించి తానును ఫాలభాగంబు నేలసోక గోపాలదేవుని యడుగుఁ దామర లకు నభివాదంబుచేసి నిలిచిననతఁడు సంతసించి మేనల్లునికొడుకునకు రతనంబులు కనకాభరణంబులు కానుకగానొసంగె. బలరామాది యదుపుంగవులును బంధుమిత్రులును వెలలేనిసొమ్ముల నుపాయనం బులుగానిచ్చిరి. అంతటనక్కమలనాభుఁడు కొంతొజనంబులువినుచుండ "నితఁడు తనకులముపరిక్షీణమైనతఱి జన్మించుటంజేసి పరిక్షితుఁడను పేరు తాల్చుఁగాక! ఈతనివంశంబు వర్ధిల్లుగాక." యని నామకరణం బుచేసి యాశీర్వదించె అట్లాబాలకుఁడు పునర్జీవితుండై క్రమక్రిమం బున బెరుగుచు నొక్కమాసప్రాయంబువాఁడైనతఱి యుధిష్ఠిరాదులు హయమేధంబుకొఱకు ధనముదీసికొని హస్తినాపురికిఁబోయి పుండరీ కాక్షునిచేతఁ దనమనుమఁడు పునర్జీవితుఁడయ్యెననివిని తమయదృష్టం బునకును వాసుదేవుని ప్రభావంబునకును మిక్కిలియక్కజంబునొంది కురువంశంబు నిలిచినందులకు మహానందభరితులై యశ్వమేధంబు విధివిధానంబుగాఁజేసి నారాయణుని సహాయంబువలను, బాదరా యణుని యనుగ్రహంబునను గృతకృత్యులైరి.

అట్లు కొంతకాలమతిక్రమించె పాండవరక్షితుఁడై పరిక్షితుఁడు నానాఁటికి వృద్ధిబొంది సకలవిద్యలయందు సుశిక్షితుడై యౌవనంబును సమీపించుచుండె. ఆసమయమున నారదునిశాపమున యాదవకులమున ముసలము జనియించెను. దానికతమున యాదవులందఱు మద్యపానము జేసి సముద్రతీరంబునకరిగి యొండొరులతోఁ బోరాడిమడిసిరి. శ్రీకృష్ణబలరాములును మేనులుబాసిరి. కృష్ణుఁడు వైకుంఠంబునకరిగె. బలదేవుఁడనంతునిఁగలిసె. యాదవక్షయమును, వాసుదేవబలదేవుల నిర్యాణమును ధనంజయుఁ డెఱింగింపవిని ధర్మరాజు మేరమీఱిన నెవ్వగఁజెంది శోకసంభ్రాంతమతుడై మంత్రియై మేనమఱఁదియై సుహృత్ప్రియుఁడై క్షేమంకరుఁడై కంటికిఱెప్పవలె దమ్ముగాచిన యదుకులకమలాకరప్రభాకరుఁడైన పురుషోత్తముఁడు లేనిప్రపంచంబున నుండఁగూడదని నిశ్చయించి భీమార్జున నకుల సహదేవులయనుమతిబడసి మహాప్రస్థానమునకు బోవసమకట్టెను. ప్రస్థానమనఁగాఁ బ్రయాణము. మహాప్రస్థానమనగా మహాప్రయాణము. గమ్యస్థానమిదియని నిర్ణయముచేసికొనకయె మరణముగలుగువఱకు బయనము సేయబడుట మహాప్రస్థానమనఁబడును. అట్లుసంకల్పించి యుధిష్ఠిరుఁడుహస్తిపురంబునందలిప్రజలనందఱ రావించి వారికి దనయభిమతమెఱింగించి, వారియనుమతమున తనముద్దులమనుమడగు పరిక్షితునకు కృష్ణద్వైపాయనప్రముఖులగు మునులయు ధౌమ్యప్రభృతులగు బ్రాహ్మణులయు సన్నిధానమున యథావిధిగఁ బట్టాభిషేకముచేసి హస్తిపురరాజ్యమతనియందు నిలిపి యాదవవంశస్థుఁడైన వజ్రుఁడను బాలునకు నింద్రప్రస్థపురరాజ్యమునిచ్చి యతనినచ్చట నభిషిక్తుంజేసెను. ప్రజాపరిపాలనంబునకీతెఱంగున నేర్పాటులు చేసి మఱఁదలగు సుభద్రనురావించి ధర్మనందనుఁడామె కిట్లనియె—

"కళ్యాణీ! ద్వాపరయుగాంతమైనది. కలియుగప్రారంభమగుచున్నది. దానిచిన్నెలు పొడగట్టుచున్నవి. ఆర్తరక్షణపరాయ

ణుఁడైన నారాయణుఁడు బలదేవసమేతుఁడై నిర్యాణమొందె. అతఁ డస్తమించినతోడనే మాయాశ లస్తమించె. నామనోహర్షమస్తమించె. జగమిప్పుడు నాకంధకారబంధురమై తోఁచుచున్నది. ఇంక నొక్కనిమేషమైన నేనీప్రపంచమున నుండఁజాల. వాసుదేవుఁడు లేని యీజగము ప్రాణంబులుబాసిన శవముకావున నీవు శోకింపక పట్టాభిషిక్తుడైన నీమనుమని గనిపెట్టుకొనియుండుము. మే మరిగిన వెనుక నతనికిప్పుడు పెద్దదిక్కెవ్వరును లేరు. నీవెన్నడు నాకుమారుమాటాడి యెఱుఁగవు. నేనుచెప్పినచొప్పున నడువుము. నీవు మమ్మనుసరింపఁ దగవు" అనవుడు సుభద్ర సోదరుఁడగు దామోదరుని వియోగంబునకుఁ దోడుగ తనకు భర్తృవియోగంబును బంధువియోగంబును సంప్రాప్తించినందుకు మిగుల వగచి కాలవైపరీత్యంబునకుఁ బ్రతికారము లేమి మహాదుఃఖపూరితయై యుధిష్ఠిరునిమాటకు మారాడ లేక యూరకుండెను. అనంతరమామహారాజు కడువృద్ధుండగు కృపాచార్యునింజూచి నమస్కరించి యిట్లులనియె—"మహాత్మా! మీరు సకల కురుకుమారశిక్షకులై చిన్ననాట మాకు విలువిద్దె గఱపిరి. మాకుమారకులకును శిక్షకులైరి. ఇప్పుడు పరీక్షితునకుఁగూడ నాచార్యక మొనరించిరి. మూఁడుతెరములనుండి మాకాచార్యులరై హితులరై మమ్ముఁగాచితిరి. ఈపరీక్షితుఁడు మీబాలుఁడుగాని మా బాలుడుగాడు. ఇతనిని మీకప్పగించి నేను నిశ్చింతతో మహాప్రస్థానంబు చేయఁగడఁగెద. మీబుద్ధిబలమును బాహుబలమును వీనికి వజ్రకవచములై పెట్టనికోటలై యుండుగాక నాకనుజ్ఞనిండు." అని బంధుమిత్రులకడ, బురోహితులకడ నాచార్యులకడఁ బురజనంబులకడ సెలవుఁ గైకొని, పురముబాసి చనియెను.

పరీక్షితుఁడు తండ్రిమొగమైన నెఱుఁగక పుట్టిననాటంగోలె తాతల సంరక్షణంబుననుండంజేసి చాలదవ్వు వారివెనుకనరిగి వారు

తనవంకకైనఁ దిరిగిచూడక పోయినపోకగాఁ బోవుటంజేసి వారి దెస నాసలువిడిచి బిట్టువగచుచు హస్తిపురంబునకు మరలిపోయెను. దుఃఖ మిల్లుకట్టుకొని యెల్లకాలము కాపురముండదు. పరీక్షితుఁడు కాంతామతల్లియైన తల్లింజూచికొని సర్వసుగుణభద్రియైన సుభద్రింజూచుకొని ధైర్యముదెచ్చుకొని క్రిమక్రిమముగ విచారంబువిడిచి ధర్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయఁదొడంగెను.

అతని పరిపాలనారంభమున సర్వదోషంబులకు మూలంబగు కలి ప్రపంచమునఁ బ్రవేశించినదని విని యామహారాజు వానిం దన రాజ్యంబునుండి పాఱఁదోలవలెనని సంకల్పించి దిగ్విజయార్థమై బైలుదేరి పూర్వ దక్షిణపశ్చిమదిక్కులవరకుగల నేలనంతయు జయించి యటమీఁద నుత్తరకురుభూములగెల్చి తనచేత నోటువడినరాజులు సమర్పించిన వెల్లడియైన కానుకలంగొనితెచ్చి యెడనెడ సైన్యంబులు విడిసినచోటుల వందిమాగధులు పూర్వరాజుల వినుతించి వారి చరిత్రింబులు వినుపించుచుండ మిక్కిలి యానందముతో నాకర్ణించుచుండెను. ఆవృత్తాంతములలో ముఖ్యముగా యాదవపాండవుల చరిత్రిము పారములేని భక్తితో నాలకించి కృష్ణార్జునుల మైత్రియు, యుధిష్ఠిరుని ధర్మనిత్యతయు,వాసుదేవుఁడు దన్ను బ్రదికించుటయు మున్నుగాగల కథల విన్నప్పుడు వారివారిగుణగణంబులు మెచ్చి ప్రహృష్టహృదయుం డగుచుండును. జయముపై జయముగొనుచు నానృపాలుఁడు దేశమెల్లెడఁ దిరుగుచుండ వృషభరూపధారియై యొంటికాలితోఁ దిరుగుచున్న ధర్మదేవుడు వానికొక్కెడ గనఁబడెను. ఆచెంతనే గోరూపమునుదాల్చిన భూదేవియు నుండెను. ఎద్దురూపుగొన్న ధర్మదేవునకును గోరూపిణియైన భూదేవికిని బరీక్షితుఁడు వినుచుండ నీక్రింది సంభాషణము జరిగెను.—

"అన్నా! వృషభరాజా! నీవు సామాన్యవృషభంబవు కావు. నీవొంటికాలితోఁ దిరుగుట కేమికారణము. నీయుదంతము జెప్పి నన్ను ధన్య జేయుము" అని భూదేవి యడిగెను. అడుగుటయు ధర్మదేవత యిట్లనియె. "అమ్మా! నేను ధర్మదేవతను ధర్మము కృతయుగమున నాలుగుపాదములతో నడిచెను. త్రేతాయుగమున మూడుపాదములతో మాత్రము సంచరించెను. ద్వాపరమున రెండుపాదములతోనే విహరించెను. కలియుగమున ధర్మ మొక్కపాదమై నడచునుగావున నేనొంటికాలితో నడచుచున్నాను. నీవు గోరూపముధరించిన భూమివని నేనెఱుఁగుదును. నీవేల యిట్లు విచారించుచున్నదానవు. నీకన్నులనుండి నీరు సంతతధారగా నేల ప్రవహించుచున్నది. నీమేను చిక్కియున్నది. నీమొగము వాడిపోయినది. ఏల యింతవంత నీదగ్గఱచుట్టాల కేదైనఁ బ్రమాదము వాటిల్లెనా? లేక యొంటికాలితో దిరుగుచున్న నన్ను దురాత్ము లెవ్వరైనబట్టుకొందురని తలఁచి నా యవస్థకు గుందుచుంటివా? ఈకలియుగంబున నికమీఁద యజ్ఞములుండవుగనుక దేవతలకు హవిర్భాగము లుండవని విచారించుచుంటివా? భర్తలు భార్యలను సరిగాఁజూడరని విలపించుచుంటివా? బిడ్డలు తలిదండ్రుల సరిగా నాదరింపరని విషాద మొందుచుంటివా? విద్య దుర్జనుల పాలగుననిదురపిల్లు చుంటివా? బ్రాహ్మణులు వేదాభ్యాసముమాని, రాజులను సేవించి జీవింతురని చింతించుచుంటివా? దేవేంద్రుడు యథాప్రకారముగా వానలుగురియింపడుగావున బ్రజలు కష్టముల పాలగుదురని గాసిలుచుంటివా? హీనవంశజాతులు నిన్ను పరిపాలింతురని పలవించుచుంటివా? రాజ్యములు పాడిపంటలుగలిగి రంజిల్లవని చిత్తక్షోభము చెందుచుంటివా? మానవు లికమీఁద భోజనప్రియులు, భోగప్రియులు, నిద్రాప్రియులు, నిర్వ్యాపారులు, నై యుందురని వగచుచుంటివా? ఓతల్లీ! నీభారమును దించుటకై శ్రీమన్నారాయ

ణు డింతకాలము ప్రపంచమునందుండి యిప్పు డవతారముచాలించి పరమపదము జేరుటచే నింక నే దుష్టనృపాలుఁడువచ్చి నిన్నుపాలిం చునోయను భయమున పొక్కుచుంటివా? ఔను పాపము దేవతలైనను మెచ్చఁదగిన నీయొప్పిదమంతయుఁ గాలవశముచేత నారాయణుఁ డవతారము చాలించినతోడనే మారిపోయినదిగదా!" యని ధర్మ దేవుఁడు ప్రశ్నించుటయు భగవతి వసుంధర యాతనికి ట్లుత్తరమిచ్చె ను. "నా యవస్థ యెట్లున్నదో నీయవస్థయు నట్లెయున్నది. పూర్వ ము నాలుగుపాదములతో నెంతో ముచ్చటగానడచునట్టి నీవు నేఁడొం టికాలితో నడచుచున్నావు. శమముదమము క్షాంతి యార్జవము దు ష్టశిక్షణము శిష్టరక్షణము ధర్మసంస్థాపనాసక్తి మొదలగు సద్గుణం బులకెల్ల నిలయమైన నీరజనాభుఁడు కాలవశముచేత నవతార సమా ప్తి జేయుటంజేసి కలిప్రేరణముచేత జనులు పాపాసక్తులగుచున్నారని నేను విచారించుచుంటిని. దేవతలకు బ్రహ్మర్షులకు సకలపితృదేవతలకు విద్వాంసులకు సకలవర్ణాశ్రమధర్మములకు గోవులకు వెయ్యేల నీకు నాకుమిక్కిలి కష్టముగలుగునని వందురుచుంటిని. పరమేష్ఠి మొదలగు దేవత లెవ్వని యనుగ్రహము సంపాదించుకొఱకు నతినిష్ఠమై దపంబు సేయుచుందురో, యాదిలక్ష్మి తనకు నెలవగుపద్మమునువిడిచి యెవ్వని పాదపద్మముల నాశ్రయించెనో, పరమయోగు లెవ్వని దమహృదయ పీఠములందు నిరుపమానభక్తితో నిలుపుకొందురో, నాల్గువేదము లెవ్వని యసాధారణప్రభావంబు గొనియాడలేక వెగడువడియెనో, అట్టి వాసుదేవుని శంఖచక్రపద్మప్రముఖశుభలక్షణములతోడ లక్షిత ములైన దివ్యపాదములీకమీఁద నన్ను సోఁకవని నేను శోకించెద. హరి పాదంబులు నామీఁదనిలుచుచున్నవని యింతకాలంబు నేను గర్వించియానందించుచుంటి. అబ్జనాభుఁడా గర్వ మడఁచి నన్ను విడనాడిచనియెను. ఆ జగన్నాధుఁడు లీలామానుష

విగ్రహుఁడై ధర్మము యథావిధిగా నడపించుటకై దుర్జనుల శిక్షించుటకును, సాధుల సంరక్షించుటకును నీలోకమునకు వచ్చియుండె. ఆమధురాలాపము లామందహాసము లాముఖపంబులా దయారసంబు లావిహారము లాధర్మోపదేశము లాప్రేమపూరితకటాక్షవీక్షణములు జూచినవారు వానింబాయనేర్తురె. ఆయాదవవల్లభుఁడు చిగురుటాకులవంటి తనమెత్తనియడుగులు నాపైఁబెట్టినతోడనే నామేనుమీఁద పులకాంకురములు బైలుదేరెనోయనునట్లు సస్యములు సమృద్ధిగా మొలచుచుండెడివి. ఇఁకమీఁదనవి మొలచునో లేదోయని భయం పడుచుంటి.

ఆగోవృషభులసంభాషణములు సరస్వతీ తీరమందు విహరించుచున్న పరిక్షితుని జెవినిబడినతోడనె యాతడువారిని సమీపించెను. అప్పుడు కైలాసపర్వతమువలె నున్నతమై తెల్లనిమేనికాంతులతో వెలయుచున్న యావృషభమును దంతహస్తుఁడై మూర్తిభవించిన క్రోధమోయనునటులున్న హీనజాతుఁడైన రాజొకఁడు నిష్కారణముగా దనకాలితోఁదన్నెను. అంత నిలువక యాక్రూరుఁడు దాని చెంత బాష్పపూరితనేత్రమై యంభాయని యఱచుచు శరీరము గంపింప దుఃఖపడుచున్న గోరూపధారిణియైన భూమినిగూడ నొక్కతాపుదన్నెను. అత్తెఱఁగున గోవృషభంబులను దన్నిన యారాజవేషధారినిజూచి బరీక్షితుఁడు తనరథము వడివడి దోలించుకొని యాతడున్నకడకుబోయి క్రొక్కారుమబ్బులగర్జనమువలె గంభీరములైన వచనంబుల నాతనికిట్లనియె.

"ఓరోరిదురాత్మా! ఏయపరాధముఁజేయని యాగోవృషభముల నేల దన్నితివి. గడ్డితిని నీళ్ళుత్రాగి జగదుపకారంబుసేయునట్టి జంతువులను హింసింప నీకు మనసెట్లొప్పె. అవినిన్ను గొమ్ములతో బొడిచెనా పాదములతోదన్నెనా, నీకవియేమియపకారము గావించి

నవి. నేను పాలించుమహీమండలమున దోషంబు లుండగూడదు. చూడగా నీవు రాజువేసముదాల్చియున్నాఁడవు రాజులు గోబ్రాహ్మణ రక్షణంబును సాధులరక్షణమును సేయుటధర్మముగదా! ధర్మమీవిధమున దగ్ధముచేసినట్టి నీవెవ్వడవు? ఈయకార్యమునకు నిన్ను ఖండించెదఁ జూఁడుము నరనారాయణు లిరువురు భూమండలమును బాసిపోయిరిగదా, యింకశాసించువా రెవ్వరులేరు. నేనెట్టిదుండగములనైన సేయవచ్చునని నిర్భయముగానీవిట్టిదుష్కార్యమొనర్చితివి గాఁబోలు! ఈవసుంధరయనాథగాదు. దండింపఁదగనివారిని దండించితివి గావున నీవేదండనకర్హుఁడవు" అనియాతనితోఁ బలికి గోమూర్తియైన ధర్మదేవత నుద్దేశింఛియిట్లనియె.—"ఓధర్మదేవతా! పార్థుని మనుమఁడు నభిమన్యునిపుత్రుఁడునగు పరిక్షిత్తుఁడు నేల నాలుగు చెఱగులనేలుచుండ నీకు దురాత్ములవలన భయములేదు. నీవుమన క్షోభము నొందకుము ఈదురాత్ముని శాసించి నిన్ను నాలుగుపాదములతో నడపించెద. ఇట్లు నిన్నునిర్హేతుకముగా బాధించిన దురాత్ముఁడు పాతాళంబున దాగినను నాగలోకమున నక్కినను నాకాశంబున నణఁగినను వానిఁదండించెదగాని విడిచిపెట్ట"నని దానినిసమాశ్వాసించి యావుహాపుగొన్న భూకాంతతో నిట్లుపలికెను. "అమ్మా! నారాయణుఁడు నిన్ను విడిచిపోయెనని వగలంబొగలకుము. నేనుండగా నీకు భయములేదు. ఈపాపకర్ముని! శిక్షించి నీకు ప్రియంబు గూర్చెద. క్షత్రియవంశజాతుఁడై వసుంధరాభారముబూని సకలోపభోగంబు లనుభవించుచున్న రాజు సాధులబాధనడంపడేని వాడధముఁడు. వాని యాయువు వానిధనము వానిసిరియల్పకాలమున నశించును. దుష్టులనిగ్రహించుటయు శిష్టులననుగ్రహించుటయు రాజులకు వేదశాస్త్రచోదితములైన ధర్మములు" అని పలుకుచున్న మహీపాలు నుద్దేశించి వృషభాకారుఁడైన ధర్మదేవుడిట్లనియె. "క్షమాధా

నీతలంపు నేనెఱుఁగుదును. దుష్కార్యనిరతులగు దురాత్ములను దండించి సజ్జనులను సంరక్షించునట్టి పాండువంశంబున నీవు జన్మమొందితివి. నీపెద్దలు తద్దయుదయాళువులై వసుంధరఁబాలించి ధర్మంబు నెలకొల్పిరి. వారట్టియోగ్యులగుటచేతనే నారాయణస్వరూపుఁడైన శ్రీకృష్ణుడు మాతాతలకు దూతయై పిమ్మట పార్థునకు రథసారథియై హితమొనరించెను. మేమెవ్వరికి నపకారులముగాము. మావలన దేహపీడగాని మనఃపీడగాని నొందెడువాడు లేడు. మాకపకారంబు చేసిన పాపకర్ములు తత్ఫలంబుతప్పక యనుభవింతురు. పుణ్యపాపంబులంగని యాథార్థ్యంబుగా మోక్షనరకంబులం బ్రసాదించుటకు సర్వేశ్వరుండుగలఁడు." అనవుడు నావృషభంబునకు రాజవృషభుఁ డిట్లనియె. "ఓవృషభేంద్రిమా! నీవుధర్మదేవతవగుట ధర్మముపలికితివి. పాపకర్ముఁడవశ్యముపాపఫలమనుభవించును. దానిననుభవింపఁజేయువాఁడు మహీపాలుఁడు అట్లుచేయనిరాజు పాపముచేసినవాడు పోవుగతికే బోవును. నీవు కృతయుగమునఁ దపస్సు, శౌచము, దయ సత్యము ననునాలుగుపాదములతో విహరించుచుంటివి. త్రేతాయుగమున నాలుగుచరణములలో మొదటిది లోపించె. ద్వాపరమున రెండుకాళ్ళుపోయె. కలియుగమున చరణత్రియమునశించె. అధర్మము నీనాలుగవకాలుఁగూడ నీకలియుగమున నాశనముచేయజూచుచున్నది గోరూపిణియైన యీభూదేవి యెట్లువగచుచున్నదో చూచితివా? దుష్టరాజులు తన్నుశాసింతురని భయపడి కంటికి నేలకు నేకధారగా నేడ్చుచున్నది." అని గోవృషభముల రెంటిని నూఱడించి పరీక్షిత్తుఁడు రాజవేషధారియైన యాకష్టచరితుని వెన్నంటితఱిమిపట్టుకొనవాడు భయమున గడగడవణకి నెన్నుదుట చేతులుమోడ్చి నమస్కరించి యారాజచంద్రుని పాదములపైబడి యిట్లుదీనాలాపంబులం బలికెను. "అయ్యా! నేనీయుగాధిదేవతయగు కలిపురుషుఁడను.

చాపహస్తుఁడవైన నిన్నుం గనుగొనినంతట నా మేను వడకుచున్నది. నన్నుం జంపక రక్షింపుము. కౌరవవంశజాతులు శరణాగతత్రాణపరాయణులుగదా యని పాదంబులువిడువకున్న తెక్కలివంటి యక్కలింగని యా రాజతిలకుండిట్లనియె. శరణాగతరక్షణపరాయణుఁడైన నా రాయణునకును ధర్మనిరతుఁడైన యుధిష్ఠిరునకును జగత్ప్రసిద్ధ విజయుఁడైన విజయునకును మనుమఁడైన పరిక్షితుఁడు శరణంబన్నవారిని రక్షించునుగాని శిక్షింపఁడు నీకభయంబొసఁగితిగాని నీవు సకలపాపములకు దగ్గఱచుట్టమవు. నీవున్నచోట నెట్టిధర్మంబులుండజాలవు. నా రాజ్యంబున నీవుండగూడదు. అసత్యము లోభము చౌర్యము దౌర్జన్యము దురాచారము మాయాకలహము కాపట్యము కలుషము దారిద్ర్యము భయము మొదలగు ధర్మవిరోధలక్షణములు నిన్నాశ్రయించియుండు. నీవు నా రాజ్యమందుండువేని పాలితులగు ప్రజలకు నీగుణములలవడు కావున మహర్షులతోడను మాన్యులగు జనుల తోడనునిండి పుణ్యభూమియైన యార్యావర్తనమున నీవుండ జనదు నీయిచ్చవచ్చినచోటికింబొమ్ము” అని యముని తెఱంగున నానృపాలుఁడు శాసించుటయు నాకలిపురుషుఁడు భయవినయంబులు గదుర నిట్లనియె “మహాత్మా! కోపంబునఁ జాపంబుదాల్చియున్న నిన్ను జూడ నాగుండెలు పగులుచున్నవి. నేనెందుజూచినను రోషణభీషమైన నీయాకారమె నాకు గానఁబడుచున్నది. నాకు నిలువనీడ లేదు. నేనెందువసియింపవలెనో నీవయానతిమ్ము” అనిప్రార్థించినకలింజూచి రాజేంద్రుఁడిట్లానతిచ్చె “ఓయీ! నీవు జీవహింస, దుష్టస్త్రీ, జూదము, సురాపానమునను నాలుగుస్థానములయందు వసియింపుము. ఇవిచాలవందువేని ధనమూలములైన యసత్యమదకామహింసావైరంబులను నైదు తావులఁగూడ నొసంగుచున్నవాఁడ. ఈతొమ్మిదిప్రదేశములయందును యథేచ్ఛముగా విహరింపుము. ఇవిదాటి నేసేలునేల నడుగుపెట్టె

దవేని నీమేన జీవంబులుండవు పొమ్ము" అని వానినంపి ధర్మదేవత ననుగ్రహించి తపస్సు శౌచము దయ యను తక్కినమూడుపాదం బులు మరలనిచ్చి చరణచతుష్టయంబుతో నాదేవతనునడిపించి ప్రజా నురంజకుఁడై యాకురుకులచంద్రుఁడు వసుంధరాపరిపాలనము సేయు చుండె.

అంత నొకనాఁడు పరిక్షితునకు వేఁటమీఁద మనసుపోవమిక్కి లి నేర్పరులగు వేఁటకాండ్రనుబిలిపించి యురులు నుచ్చులువలలు దీమ ములు వేఁటకుక్కలు మొదలగు సాధనంబులఁ దెప్పించి మహారణ్య మునకుజని వేదండంబుల తండతండంబుగాఁగూల్చి వ్యాఘ్రంబుల శీఘ్ర గాములగు బాణంబుల ప్రాణంబులు లేనివానిగఁ జేసి సింగంబులయంగం బులు దెగనఱికి దుప్పులఁ గుప్పతిప్పలుగాఁ గూలనేసి యెలుఁగుల సిలు గులంబెట్టి బరిమార్చి మఱియు నానావిధక్షుద్రమృగంబుల నేలపాలు జేసిమిక్కిలియలసెను. మెనెల్ల జెమ్మటగ్రమ్మెను. అతిదాహముచేనొరెం డెను. దప్పిదీర్చికొనుటకుఁజల్లని నిర్మలోదకములకు నెలవైనసరోవరము సమీపమునందెందును గానఁబడదయ్యెను. ఎండిన నాలుకతో వాడిన మొగముతో నుస్సురుస్సురనుచు నతఁ డిట్టటు కొంతదవ్వరుగ నెట్ట యెదుట నొక యాశ్రమము గనఁబడెను. ఆశ్రమంబులలో తప్పక చల్లని నీరు లభించునని యాసపడి యామేదినీశ్వరుఁడు తపోవనంబు బ్రవేశించెను. ప్రవేశించి యచ్చట నొక వృక్షమూలమున కన్ను దమ్ములు మొగిడ్చి, పంచేంద్రియంబులఁ జిక్కఁబట్టి బాహ్యప్రపంచ సంబంధము లేక పరమధ్యానసమేతుఁడై యంతరంగమున హరిచర ణారవిందంబులు నిలిపి నిర్వికల్పకసమాధిలో నున్న శమీకుఁడను మహామునిం గాంచె. తాలువు లెండిపోవుటంజేసి సరిగారాని మాట లతో దాహము దాహ మని పలికెను. పరమనిష్ఠాగరిష్ఠుఁడైన నమ్ము నిశ్రేష్ఠునిచెవుల నమ్మాటలు జొరఁబడవయ్యె. అందుచేత నతఁడు

నృపాలుని దప్పిదీర్చుట కెట్టిప్రయత్నము చేయఁడయ్యె. అప్పుడు పరీక్షితుఁడు తనలో నిట్లని వితర్కించె. "నేను మహీమండలమంతయు నేలు మహారాజును. దిగంతవిశ్రాంతయశులగు పాండవుల పౌత్రుఁడను. నారాయణావతారుఁడగు వాసుదేవుని మేనల్లుని పుత్రుఁడను. అన్నివిధములచేత నే నెంతో పూజనీయుఁడనై యుండ నిమ్మహాముని కన్నుల విచ్చి నావంక జూడఁడు. అర్ఘ్యపాద్యముల నిచ్చి మునిజనుల కుచితములైన యతిథిసత్కారములఁ జేయఁడు. మీదుమిక్కిలి దాహము దాహ మని కుయ్యివెట్టుచుండ తన్ను గా నట్లు వినిపించుకోఁడు. లోకమున మునులు లేరా? సమాధినిష్ఠితులు లేరా? భక్తశిఖామణులు లేరా? ఎందైన నింత యొడలెఱుఁగని తప ముండునా? ఇతఁడు దంభమౌనివలెఁ గన్పడుచున్నాఁడు. కలియుగ మారంభమైనది గనుక విశిష్యుండగు దంభుని ప్రచారము చాలదూరమువఱకు వ్యాపించినది కాఁబోలు! దారుణపిపాసచేతఁ బీడితులగువారికిఁ జల్లని నీరిచ్చి పండుకొనుటకు శీతలప్రదేశం బొసగి యాఁకలిదీర్చుకొనుటకుఁ దియ్యని పండ్లు నిచ్చి యాదరించుటకన్న ముక్కు మూసికొని కన్నులు మూసికొని జింకతోలు గప్పుకొని పులితోలు గట్టుకొని దర్భాసనంబులఁ గూర్చుండి తపముచేయుట గొప్పయగునా? ఈతఁడు నిజముగా సమాధిలోనున్నవాఁడో మాబోంట్లకడ దంభములు చేయుచున్నాఁడో చూచెదఁగాక! అతిదాహబాధచే బ్రాణములు బోవుటకు సిద్ధముగా నున్నవారిని రక్షింపని వీనితపంబేల కాల్పనా?" అని క్రోధావిష్టుడై యాసమీపమునఁ జచ్చిపడియున్న యొక పాముం జూచి తన వింటికొప్పునం దానిం బట్టి తపోనిష్ఠితుఁడైన శమీకమహాముని మెడయందు వైచి యారాజు తన దారిం బోయెను.

శమీకుఁ డది యించుకయును నెఱుఁగఁడు. నిర్వికల్పకసమా

ధియందుండి యజ్ఞానాంధకారము జ్ఞానతేజంబున నడంచి యాత్మా రాములై వెలుఁగులకెల్ల వెలుఁగగు పరబ్రహ్మమును సందర్శించునట్టి యవస్థలోనున్న మహానుభావులకు నపమానంబు చేయఁ దలంచిన వారు తమ్ముఁ దామే యవమానంబు చేసికొందురు. అట్టి వారికంఠంబుల మృతసర్పంబుల నైచినను బుష్పహారంబుల నైచినను వారి కొక్కచందమే యగును. అవమానంబునకు విచారింపరు. సన్మానంబునకు సంతసింపరు. అట్టి మౌనులజాడ లెఱుఁగక మహీపాలుఁడు పడుచుదనపు గరువముచేతను, నధికారాంధకారముచేతను నాక్షణమున యుక్తాయుక్తవివేచనాశూన్యుండై తాను గావించునది యకార్యమని తెలిసికొనఁజాలక శమీకునియెడ మహాపచారము గావించెను. ఆరాజుచేత లన్నియు దాపుననున్న మునికుమారులు జూచి మునికుమారుఁడైన శృంగి యనువానితోఁ జెప్ప నతఁడును దారుణకోపానలంబుచే మండిపడుచు నిట్లనియె. "అన్నన్నా యెంత పని? ఒకరాజాధముఁడు వచ్చి నాతండ్రి మెడలోఁ జచ్చిన పామును నైచెనే. అధికారగర్వంబున వాఁ డెంత కన్నులు గానకున్నవాఁడు? మహీమండల సంరక్షణార్థమై మౌనులు రాజుల నియోగించిరి. అది యెఱుఁగక వీఁడు తృళ్ళిపడుచున్నాఁడు. ప్రజలు తేయుంబవళ్ళు కష్టపడి చమటయూడ్చి సంపాదించిన ద్రవ్యంబు పన్నుపేర పోగుచేసి మేడలు మిద్దెలు గట్టుకొని వెలలేని బంగారునగలు మణిభూషణములు ధరియించి పంచభక్ష్యపరమాన్నంబులు మెక్కి యడవిదున్నలవలె తెగబలిసి యచ్చరమచ్చెకంటులంబోలు పడఁతులం గూడి నిరంతర భోగపరాయణులై మన్నును మిన్నునుం గానకయున్న రాజులెక్కడ మునిజనంబులయెడ భక్తియెక్కడ? అనార్యమైన యీకార్యము చేయుటకు నాతండ్రి యీతని కేమియపకారంబు గావించె? నాతండ్రి పల్లెత్తి తన్నొక్క చెడుమాటనైన నాడఁడు. తన వైరులం

గూడడు. దుంపలు కాయలు పండ్లు దిని నదీజలములం దాగివి పొట్టఁ బోసుకొనుంగాని దన్ను యాచింపడు. లోనిచూడ్కులనేగాని పై చూడ్కులు జూడడు. మాధవచరణారవిందములయందెగాని మనసు నిలుపడు. అట్టివాని నిట్లు పరాభవింపనేల? మే మెవ్వరిని వంచించి విత్తము తెచ్చికొనలేదు. గోదానభూదాన హిరణ్యదానము లిమ్మని తనయింటికిఁ బోవలేదు. అడవులలోఁ గాయలు కసవులు దిని బ్రతుకునట్టి మాజోలి తనకెందుకు? తన కైశ్వర్యమున్నపక్షమున నెచ్చెలులతో జుట్టములతో గుడువవచ్చు. చీనిచీనాంబరంబులు గట్టవచ్చు మందిరోద్యానముల విహరింపవచ్చు గాని తన్నెన్నఁడు జూచియైన నెఱుగని బడుగుజడదారులమీఁదఁ జచ్చినపాముల వైవఁదగునా? పరమేశ్వరుఁడగు నారాయణుఁడు లోకంబును బాసిపోవుటంజేసి దురాచారులను శాసించువారు లేరు కావున నిట్టి కష్టచరితులు బైలువెడలుచున్నారు. ఇట్టివాని నుపేక్షింపఁగూడదు. తక్కిన రాచమూఁకకెల్ల బుద్ధివచ్చునట్లు వీనిని శపించెద" నని కౌశికీనదికిం బోయి జలంబులు చేతంబట్టుకొని "సమాధినిష్ఠితుఁడైన మజ్జనకుని కంఠంబున మృతభుజంగంబు దగిలించిన యాదుష్టనృపాలుఁడు నేటి కేడవదినమున తక్షకసర్పదష్టుఁడై మృతినొందుఁగాక!" యని ఘోరశాపం బిచ్చె.

అనంతరము మునికుమారులతోఁగలసి యతఁ డాశ్రమంబునకుంబోయి తన తండ్రిమెడనున్న మృతసర్పము మరల బ్రతికి తన జనకుని గఱచునేమో యని భయంపడి సర్పకళేబరంబును దాను తీయలేక సాయముచేయుం డని రోదనము చేసెను. అతని యార్తనాదంబు విని శమీకుఁడు ప్రబోధితుఁడై సమాధినుండి లేచి పాము పీనుఁగును చేతితో దీసి పాఱవైచి కొడుకుంజూచి "వత్సా! మన మెవ్వరి కపకారము సేయము. సర్పశవము నాయఱుత నెట్లుదగిలె?"

నని పలుక శృంగి "జలాపేక్షియైవచ్చిన రాజు కంఠంబున మృత సర్పంబుం దగుల్చుటయుఁ దానతనికి శాపమిచ్చుటయు లోనుగాఁగల వృత్తాంత మెఱింగించెను. అది విని శమీకుఁడు వేఁటకై వచ్చినవాఁడు పరీక్షితుఁడని తన దివ్యదృష్టి నెఱిఁగి వానికి శాపమిచ్చి కొడుకు గావించినపని కిష్టపడక యిట్లనియె. "కుమారా! ఎంతపని చేసితివి? ఆరాజు పరీక్షితుఁడు. అతిపిపాసచేత నోరెండుకొనిపోవ బాధాపరవశుఁడై యిట్టి పొరబాటు చేసెనుగాని సహజముగ నతఁడు మిక్కిలి యోగ్యుఁడు. కౌరవవంశసంజాతుఁడు. న్యాయముగా మహీపాలనము చేయుచున్నాఁడు. చేసినది చిన్నతప్పు. అది పొరబాటు. జన్మమధ్యమున నెట్టిసజ్జనుఁడైన నొకానొకపొరబాటు చేయకపోవునే? అంతమాత్రమునకై యతఁడుగావించిన సత్కార్యకోటి దలఁపక దండింపఁ దగునే. పాపమతఁడు గర్భస్థుఁడైనకాలమున నశ్వత్థామ, ప్రయోగించిన మహాస్త్రముచేఁ గడుపులో మృతినొంది జనియింప బురుషోత్తముఁ డతనినిబ్రతికించె. ఇతఁడు వర్ణాశ్రమధర్మంబులు యథాస్థితిగ నిలిపి పాలించుచున్నాఁడు. అతిదాహముజెంది మనయాశ్రమంబున కతఁడు వచ్చినప్పుడు త్రాగ శీతలజల మిచ్చి తిని సుఖింప పండ్లిచ్చి సత్కరించి పంపఁదగునుగాని శాపంబిచ్చి పంపఁదగునే? ఏమి సేయుదు? ఈశాపంబు నే మరలింపఁజాల. కుమారా! నీవు దేశమునకు రాజకులమునకు మహాపకారము చేసితివి. అనుభవమే గాని దీనికిఁ బ్రతిక్రియలేదు" అని పెద్దయుంబ్రొద్దు విచారించి శిష్యు నొక్కనిం బిలిచి యావార్త పరీక్షితక్షితిపాలున కెఱిఁగింపుమని పంచె. అతండును రాజుకడకరిగి ముని చెప్పిన చొప్పున నంతయు విన్నవింప నాతఁడును దాను గావించిన యపరాధఫలంబు దానవశ్యము గుడువక తీరదని యాక్షణమ వేఁటచాలించి రాజధాని యగు హస్తిపురంబునకుం జనియె.

అంతట మంత్రిసామంతులు నంతఃపురకాంతలు తద్వృత్తాంతమెఱింగి చింతాక్రాంత మనంబులతో నెద్దియుం దోఁచక యుండిరి. రాజు తన మనంబునఁ దనగావించిన దుష్కార్యమునకు మిగుల బశ్చాత్తాపముఁ బొంది సహజముగ సాధుశీలుం డగుటం జేసి ముని కుమారునకుఁ బ్రతిశాపమియ్యక "అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభ" మ్మను నార్యోక్తి ననుసరించి తన జ్యేష్ఠకుమారుఁడైన జనమేజయుని రావించి పట్టాభిషేకంబుజేసి రాజ్యభారంబువహింప నియోగించి తాను నారచీరెలుదాల్చి తులసిపూసలు మెడవైచి గంగానదికిం జని దాని దక్షిణతీరంబున దర్భశయ్య నేర్పఱచుకొని యాహారంబు వర్జించి యాశయ్యపైఁ బండుకొని ప్రాయోపవిష్టుఁడయ్యె.

ఆమహారా జట్లగుటవిని వ్యాస పరాశర కశ్యప భరద్వాజ ప్రముఖులైన మహర్షులందఱును వానిం జూడవచ్చిరి. వారు వచ్చిన కొంతతడవున కాజన్మబ్రహ్మచారియు నిరస్తసమస్త కలుషుండును దిగంబరుండును బ్రహ్మజ్ఞాన సంపన్నుండును పరమభాగవతోత్తముండును వ్యాసనందనుండును నయిన శుకయోగీంద్రుండునుగూడ నాతావునకుఁబోయె. అతనిం దవ్వులఁ జూచినతోడనే పరీక్షిన్నరేంద్రుండు ప్రముదితమనస్కుండై ప్రత్యుత్థానముచేసి పాదరాజీవములకు నమస్కరించి వినమిత మనస్కుఁడై సమ్మమహాత్మునితో నిట్లనియె. "దేవా! నేను శాపగ్రస్తుఁడనై నవాఁడ. ఏడుదినంబులలో నీమేను దొఱఁగి పోయెద. "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మను నార్యోక్తికలదు. ఎఱిగియు నెఱుంగకయు బహుపాపంబులు చేసియుంటి. అదియునుఁ గాక బ్రహ్మానుసంధానము చేయుచున్న శమీక మహాముని మెడ యందు మృతసర్ప కళేబరంబు వైచితి. ఈపాతకంబు లన్నియు శమియించునట్లు నాకు మోక్షపదంబు ప్రాపించునట్లు పరమధర్మంబు లుపదేశింపవలయు. ఎద్దానివలన నరుఁడు పునర్జన్మరహితుండై య

క్షయలోక సుఖంబు లనుభవించు, నెయ్యది సర్వజనుల కక్షేక్షణీయంబు, నెయ్యది సులభసాధ్యంబు నట్టిమార్గంబు నాకెఱింగింపవలయు" నని ప్రార్థించుటయు శుకయోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. "రాజా! భక్తిమార్గంబుకన్న మోక్షంబునకు వేఱు దగ్గఱత్రోవ లేదు. మార్గము లనేకములున్నవని శాస్త్రంబులుచెప్పుచున్నవి. కర్మమార్గముకన్న జ్ఞానమార్గముకన్న నతిసులభమై సర్వజనప్రాపణీయంబై యతిమనోహరంబై భక్తిమార్గముండు. అత్రోవనం బోయితివేని గమ్యస్థానంబగు మోక్షంబు చేరఁగలవు. తన్నిమిత్తమై గోవిందపదారాధనంబు కర్తవ్యంబు. కావున నీవు సర్వసంగ పరిత్యాగివై దారపుత్రాదులమీది మోహంబు విసర్జించి రాజ్యాది భోగంబులురోసి కామక్రోధలోభాదుల జయించి పరిశుద్ధమనస్కుండవై జితేంద్రియుండవై గోవిందచరణారవిందమకరందమును త్రావుచున్మోదవై యుండుము. అనేకాఖ్యానములతోడ నుపాఖ్యానములతోడ రాజర్షి వంశకీర్తనములతోడ పుణ్యతీర్థాభివర్ణనములతోడ మహర్షి పావనచరిత్రములతోడ నారాయణుని యనంతావతారములతోడ ముఖ్యముగ దశావతారములతోడ నిండియుండి లీలామానుషవిగ్రహుఁడై ధరణీభారము మాన్పుటకు యాదవకులమున జన్మించిన నారాయణుని చరిత్రము ప్రధానముగాఁ గలిగి నవరసభరితమై నవనవోత్సాహంబు క్షణక్షణంబు గలిగించు భాగవతమంతయు నీ యేడుదినములలో నీకు వినిపించెద. అది విని కృతార్థుండవై పురుషార్థంబులలో నాలవదియగు మోక్షంబు ప్రాప్తించెదవు.

అనవుడు ధన్యోస్మి! ధన్యోస్మి! ఇంక నాకు మరణభయంబు లేదు. పాపభయము లేదు. పునర్జన్మభయము లేదు. తత్కథావిధానమంతయు సంగ్రహించి యెఱింగింపవే యని యతండు వినయ

పూర్వకముగా వేడుకొనియెను. అంతట శుకయోగీంద్రుండు భాగవతమంతయు నానరపాలునకు వినుపించెను. వినిపించి యెట్టకేల కిట్లనియె.

ఉ. ఏను మృతుండ నౌదునని యింతభయంబు మనంబులోపల
నా్మనుము సంభవంబు గలమానవకోట్లకుఁ జావు నిత్యమౌఁ
గాన హరిం దలంపు మిఁకఁ గల్గదు జన్మము నీకు ధాత్రిపై.
మానవనాథ! పొందెదవు మాధవలోకనివాససౌఖ్యముల్.

శరీరధారులకు మరణము సహజము. ఎంతకాలము జీవించిన నంతియే చాలునని నరుండు తృప్తిజెందవలయునుగాని నేనింతకాలమే జీవించుచున్నానని విచారపడగూడదు. మానవున కెన్నటికైనను మరణము తప్పదు. ఎంతకాలము జీవించినను జంతువులు చావన్న భయపడును. ఎంతకాలము జీవించిన నింక మఱికొంతకాలము జీవింపవలె ననియే యుండును. అట్టి యిచ్ఛ నీమనంబునుండి త్రోసిపుచ్చుము. మరణము జంతువులను బరలోకమునకుఁ దీసికొనిపోవునట్టి రథము. దాని నారోహించుటకు భయపడ నక్కఱలేదు. ఈలోకమున జీవించినంతకాలము సత్కార్యముల నాచరించుచు సజ్జనసాంగత్యము గలిగి సరసీరుహాక్షుని పాదసరసీరుహముల నర్చించి పవిత్రచరిత్రుఁ డగువానికి మరణభయంబుండదు. చదువురాని మూఢబాలుఁడు గురువుం జూడ వెఱచినట్లు పవిత్రచరిత్రలేని పతితుఁడు పరమేశ్వరుని సందర్శింప వెఱచును. శుద్ధచరిత్రుఁ డీశ్వరసాన్నిధ్యమునకుఁ బోవఁ జంకఁడు. పరమేశ్వరుఁడు దయావారిధి. తప్పులు లేనివారిం గాచుటయేగాక తప్పులుచేసినవారు సైతము తాము చేసిన పాపములగురించి పశ్చాత్తాపపడి వాటిని మరలఁజేయక దన్ను స్మరించిన పక్షమునఁ బరమదయాళువై రక్షించును. అట్టి కారుణ్యరత్నాకరుఁడు దొరకుట దుర్లభము. నీవు సహజముగ శుద్ధచరిత్రుండవు.

విశేషించి యీ యేడు దినములనుండియు శ్రీమన్నారాయణకథా శ్రవణ పరాయణుఁడవై యుండుటంజేసి నీవు శుద్ధుండవైతివి. నీవు మరణభయంబు నొందకుము." అని చరమవాక్యంబులు బోధించి వాని మనంబు మరణభయశూన్యంబుగా నీశ్వరాయత్తంబుగాఁ జేసి శుకయోగీంద్రుఁడు యథేచ్ఛం జనియెను. పరీక్షితుఁడు మరణమునకు సిద్ధుండై యుండెను.

అక్కడ మునికుమారునిచేతఁ దక్షకుఁడు ప్రేరితుఁడై పరీక్షితుని గఱచి చంపవలయునని సంకల్పించి యతఁడున్నచోటికిఁ బోవుచుండెను. మార్గమధ్యమున వైద్యశాస్త్రవేత్తయు సర్పవిషరోగ చికిత్సకుఁడు నైన కశ్యపుఁడను బ్రాహ్మణుఁడు వాని కెదురయ్యెను. అతఁడు పరీక్షితుని కడకుంబోయి యాతని సర్పము గఱచినపక్షమున విషవిముక్తుని జేసి రక్షింపవలెనని పోవుచుండెను. తక్షకుఁడు బ్రాహ్మణుని బిలిచి యెందుబోయెదవని యడిగె. వాని సంకల్పమెఱిఁగి వానికపారమైన ధనమిచ్చి మరల గృహంబునకుఁ బంపెను. లంచగొండులకు ధర్మాధర్మము లుండవుగదా! సొమ్ము కక్కుఱితి గలవారిని విశ్వసింపరాదు. బ్రాహ్మణుఁ డట్లు గృహంబునకు మరలి పోయినవెనుక దన సంకల్పము నెఱవేర్చుకొనవలయునని తక్షకుఁడు నిజరూపముతోఁ బరిక్షితుని సమీపంబున కరిగినపక్షమున నాటంకము లెన్నో గలుగవచ్చునని శంకించి పరిక్షితుఁ డాహరించు నొకఫలమునఁ జిన్నరూపు దాల్చి ప్రవేశించెను. సామాన్యమైన ఫలమనుకొని సేవకులు దానిని మహారాజునకు భక్షింపనిచ్చిరి. ఆఫలమతఁడు భక్షించుచుండ నదివఱకు చిన్నపురువై యున్న యాఫణీశ్వరుఁడు భయంకరాకారముఁదాల్చి పరిక్షితుని గఱచెను. వెంటనే యానరపాలుఁడు నారాయణ నారాయణ యనుచు ప్రాణములు విడచెను. వాని శరీరమంతయు సర్పరాజుయొక్క దారుణ విషంబువలన

భస్మమైపోయెను. అట్లు తాను గావించిన చిన్ని తప్పుచేత ముని శాపోపహతుఁడై పరిక్షితుఁడు పరిక్షయమొందినపిదప నాతని జ్యేష్ఠ కుమారుఁడు జనమేజయుఁడు సర్పములపైఁ బగబూని యెల్ల సర్పముల నాశనము చేయఁ దలఁచి సర్పయాగము నారంభించెను. ప్రపంచ మండలి సర్పము లన్నియు హోమగుండంబునం బడి యతిదారుణముగ మృతినొందెను. తక్షకునిఁగూడ హోమము చేయవలెనని యా రాజు సంకల్పింప నాపాపజేఁడు మహేంద్రుని సింహాసనము చుట్టుకొని యతని శరణువేఁడెను. అది విని రాజు "సహేంద్ర తక్షకాయస్వాహా" యని మంత్రము చదివెను. అనగా నింద్రునితో గూడ తక్షకుఁడు హోమము గావలెనని దానిభావము. అప్పుడు మహేంద్రుండు బృహస్పతి మొదలగు వారలు వచ్చి జనమేజయుని దర్శించి వానికి ధర్మోపదేశముచేసి యాకౄరకర్మంబునుండి మాన్పి తక్షకుని రక్షించిరి. మహాత్ముల నాశ్రయించినవారికి భయములుండవు. పరిక్షితునిచరిత్రమువలన .మనము చిన్నతప్పులైనను జేసితిమేని దానిఫల మొకప్పు డతిఘోరమై యుండునని నీతి నేర్చికొనవలయును.



# ధ్రువుఁడు.

బ్రహ్మదేవునకు శివునియంశమున స్వాయంభువమనువు జన్మించెను. అతనికి శతరూపయను భార్యవలనఁ బ్రియవ్రతుఁడు, నుత్తానపాదుఁడు నను కుమారు లిరువురుగలిగిరి. వారిలో నుత్తానపాదునకు సునీతి, సురుచియను నిద్దఱుభార్యలు గలరు. సునీతికి ధ్రువుఁడను కొమారుఁడు కలిగెను. ఉత్తముఁడను కుమారుఁడు సురుచి కుద్భవించెను. సునీతి భర్తృప్రీతియు, నధికవిఖ్యాతియుఁ గలిగిన నాతియై యెల్లవారలచే మెప్పువడయుచుండెను. సురుచి విశేష దేహరుచిగలదయ్యు విద్యలయం దభిరుచిలేనిదై యసూయకునికిపట్టయియుండెను కాని, యామెలనాఁగ నిండుజవ్వనమును, నెఱజాణతనమును, సాటిలేని చక్కఁదనమును, గలదగుటచే భర్తను దనవలలోవైచికొని, పట్టమహిషియైన సునీతిని ధిక్కరించుచుండెను. సునీతి పట్టపుదేవియయ్యు సురుచికన్న వయసునం బెద్దదియగుటచేతను, మాయలు మర్మములు దెలియనిదగుటచేతను, మగనియనుగ్రహమున కంతగాఁ బాత్రము కాదయ్యెను. ఉత్తానపాదుఁడు జ్యేష్ఠభార్యమొగమైనంజూడక, నామె కోరిక లెవ్వియుందీర్పక నామెయంతఃపురమునకుఁ బోవక, నామెతో మాటనైన నాడక, నిరంతరము సురుచియంతిపురముననే యుండి, యామెతోడనే ముచ్చటలాడుచు యామెకటాక్షవీక్షణములు తనపై బ్రసరించినఁ దనజన్మము ధన్యమగునని సంతసించుచు, నామె యేమి గోరిన నదితక్షణమె తెప్పించియిచ్చుచు నామెచిఱునవ్వులే తనకు జీవనాధారములుగా, నామె గీచినగీటు దాఁటక గాలక్షేపము సేయుచుండెను. ధ్రువుఁడు సురుచిపుత్త్రుఁడైన యుత్తమునికన్నఁ జక్కఁదనమునందును, బుద్ధివిశేషమందును, విద్యయందును, విలువిద్యయందును, నెక్కువవాఁడైనను, జనకుఁడు ముద్దులుమూటగట్టుచున్న యాతని

మొగమెన్నఁడుఁ గనక, వానినెన్నఁడు ముద్దాడక, చేరఁబిలిచి యాద రింపక, చిత్తమున నుత్తమునియందె యధికప్రీతిగలిగి, వానియందసా ధారణప్రేమగలిగి, యుపలాలనము సేయుచుండెను. ఉత్తానపాదుఁ డొకనాఁడు సురుచిమందిరమునఁ గూర్చుండి యుత్తమునిఁ దనతొడ పై నిడికొని ముద్దులాడుచుండెను. ఆసమయమున ధ్రువుఁ డానగరు నకుఁబోయి, తండ్రియెదుట నిలిచెను. కఠినాత్ముఁడైన యాతండ్రి బాలుం బలుకరింపలేదు. చేయిచాచి కౌఁగలింపలేదు. అయినను దన కుఁగల చనువుపెంపున ధ్రువుఁడు తండ్రిదాఁపునకుఁబోయి రెండవ తొడమీఁద గూర్చుండెను. అప్పుడు సురుచి మొగము మటమటలాడఁ గనుఁలెఱ్ఱజేసి విసవిస రాజుకడకుఁబోయి ఱెక్కపట్టుకొని బాలుని మగనితొడమీఁదినుండి క్రిందికిదిగిచి యిట్లనియె— "ఏమి నీదుండ గము? నాకొడుకుకూర్చున్నప్పుడె నీవు తండ్రితొడపై నెక్కవలెనా? నీతండ్రి నాయింట నున్నప్పుడు నీవాయనకడకు రావద్దు. మీ యింటి కాయన వచ్చినప్పుడు నీయిష్టమువచ్చినట్లు తొడమీఁద నెక్కవచ్చు మెడమీఁద నెక్కవచ్చును. నాకెట్టి యాక్షేప ణము లేదు. అదిగాక నీతండ్రి యొడిలోఁ గూర్చుండు నట్టి మహాభాగ్యము నీకుఁ గలిగెడుపక్షమున నీవు నిర్భాగ్యురా లైన సునీతికడుపునం బుట్టక నాగర్భముననె జన్మించియుందువు. తక్కువనోములు నోచినవారి కెక్కువఫలములు రమ్మన్న నెట్లువచ్చు నుఁ? ఉత్తముఁడు సర్వవిధముల నుత్తముఁడగుటచేతను, బూర్వజన్మ మున వాఁడు భగవంతుని బంగారుపూవులతోఁ బూజచేసియుండుట చేతను, నాగర్భమున జన్మించి జనకుని యంకపీఠమెక్కి కూర్చున్న వాఁడు. నీవును నాకడుపునఁబుట్టి యీభాగ్య మనుభవింపఁదలఁతువేని రమాధవునిఁగూర్చి తపముచేసుకొనుము. ఇటువంటిచనవులు నీకుఁ జెల్లవు. ఇట్టియాగడము మఱియొకసారి చేసితివేని గట్టిగా బుద్ధిచెప్పె

ద. జాగ్రత్త" యని కఠినోక్తులాడి బాలునిగెంటి యావలకుఁబంపెను. సురుచి యాతీరునకోపనయై పసిపాపని మిక్కిలికసరి తూలనాడుచుండ చెవులార వినియుఁ గనులారఁజూచియు నుత్తానపాదుఁడు భార్యనుమందలింపలేదు. రారమ్మని బాలుని బిలువలేదు. ఱాయివలె మొద్దువలె మెదలక గదలక గూర్చుండెను. బాలునియం దభిమానము లేకపోవుటయు బాలునిపక్షముఁ బూనినపక్షమున సురుచిదన్ను మిక్కిలితూలనాడుననియు భయముచేత నతఁడాతీరునఁ జేసియుండును. అహోహో! భోగపరాయణులై, కాంతాలోలురై, యున్నవారికి యుక్తాయుక్త వివేచనాజ్ఞానము నశించునుగదా. ప్రతిష్ఠచెడునని భయముండదుగదా! అట్టివారిహృదయములు సామాన్యమానవహృదయముల ట్లుండక యదయములై శిలలతెఱంగునఁ గఠినములగును.

ధ్రువుఁ డాతీరున సవతితల్లిచేత నవమానితుఁడై పెద్దపెట్టున నేడ్చుచుఁ గన్నీరుకాలువలై పాఱఁ దల్లికడకుఁబోయెను. తల్లి వాని రోదనమువిని చిత్తమున నుత్తలపాటు హెచ్చ దత్తఱంబున వానికెదురుగాఁ బోయి యెత్తుకొని, యమ్మహాదుఃఖమునకుఁ గారణమేమని యడిగెను. దుఃఖాతిశయమున బాలుఁడు చెప్పలేకపోయెను. ఆవృత్తాంతమెఱిఁగిన పరిచారికలు జరిగినవిషయమంతయు నామెకు విన్నవించిరి. అదివిని సునీతి గాఢవిషాదముగలిగి తనయవస్థకుఁ గుమారుని యవస్థకుఁ గుంది తనయునింజూచి యిట్లనియె. "నాయనా! ఏల నీవు సురుచియంతఃపురమున కరిగితివి? మీనాయనగారు మనయందు లేశమైన నభిమానములేక సురుచియందు నిండాఱుప్రేమగలిగియున్నవారని నీవెఱుఁగవా ? పాపము! కసుగందువు నీవది యెట్లెఱుఁగుదువు? లోకములో నందఱుబిడ్డలవంటివాఁడవే యని తలంచి తండ్రితొడపై నెక్కఁబోయితివి గాఁబోలు? నాచిన్నియన్నా ! నీవందఱుబిడ్డలవంటి వాఁడవు కావు. మందభాగ్యురాలనైన నాగర్భమున నీవు జన్మించుట

చేత నీవుగూడ నిర్భాగ్యుఁడవైతివి. సురుచికడుపునఁ బుట్టినయెడల నీకిట్టిపాట్లు రాకయుండునుగదా? హా! నేనెంత నిర్భాగ్యురాలను. స్వాయంభువమనువునకు మనుమఁడై పట్టమహిషినైన నాకుదయించి చక్కఁదనమున నెవ్వరికిం దీసిపోక యల్లారుముద్దుగానున్న నాముద్దుబిడ్డఁడు తండ్రితొడపైఁ గూర్చుండుటకైన నర్హత గాంచకపోయెను గదా! ఓకాలమా! నీవెట్టిమార్పులైనఁ దెచ్చిపెట్టుచుందువు. మహారాజుగారు నాతోడిదె స్వర్గము, నాతోడిదె మోక్షమునని నాయందనురక్తుఁడై నాసౌధములయందే కాలక్షేపముచేసిన కాలముగూడ నుండెనుగదా. అహా! ఎంతలో నెంతవైపరీత్యము సంభవించినది. లోకమునందు సవతితల్లులంజూచితిమిగాని, యింతకఠినాత్మురాలను నెందైనఁ జూచితిమా? ఆమెకుఁ బసిబాలుఁడన్న జాలిలేదే. క్షణకాలముకూరుచున్నమాత్రమున తండ్రితొడ ,యరిగిపోవునా ? తొడమీఁదినుండి దింపుట కామెకుచేతు లెట్లాడెను? ప్రపంచమున నెంతకైన సాహసులుందురు. నిజమె! ప్రాణములతోనైనఁ బోనిచ్చినది. నాతండ్రీ! ఇఁక మీఁద నెన్నఁడు నక్కడికిఁబోకుము. నీసవతితల్లి నీయందిష్టము లేనిదయ్యు నీకు గొప్పయుపదేశము చేసినది. రమాధవునిగూర్చి తపము సేయుమనిగదా యామెచెప్పినది. ఆమెహితోపదేశము శిరసావహింపుము. నేనును నట్లెచెప్పుచున్నాను. పరమేశ్వరుఁడైన నారాయణునిసేవయే పరమకర్తవ్యము. ఆదేవదేవునిసేవ చేయక చెడినవారున్నారు గాని, చేసి చెడినవారులేరు. ఆపరాత్పరుని సేవించుటచేతనే క్షీరసాగరకన్యయైన లక్ష్మికి నతనిఁ జెట్టఁబట్టుభాగ్యము గలిగెను. ఆలోకనాయకుని నారాధించుటచేతనే బ్రహ్మదేవునకు సకలచరాచరవస్తువులను నిర్మింపఁగల సామర్థ్యము గలిగెను. ఆజగన్నాథునిఁ గొల్చుటచేతనే దేవతలకు సకలసామర్థ్యములు సకలవైభవములు సమకూరెను. ఆపుండరీకాక్షుని పూజించుటవలననే నారదప్రముఖులైన

బ్రహ్మర్షి రాజర్షి దేవర్షి గణములకు దూరదర్శన దూరశ్రవణ దూరగమనాదిశక్తులు చేకుఱెను. ఆనలినాక్షునిఁ గొలుచుటచేతనే నరులు రాజులై సార్వభౌములై చక్రవర్తులై భూమిమీఁద నాఖండల వైభవంబుల ననుభవించుచుందురు. కాఁబట్టి సకలకళ్యాణప్రదాయకుఁడైన రమానాయకుని పాదారవింద సేవ నీవునుజేసి ధన్యుఁడవు గమ్ము. నీముత్తాతయైన పరమేష్ఠియు నీతాతయైన స్వాయంభువమనువును నారాయణసేవాపరాయణులై లోకవిఖ్యాతి గనిరి. వత్సా! నీవును వారిమార్గమనుసరింపుము. కించిజ్ఞులును గిల్బిష సమేతులును నైన మానవుల నమ్ముకొన్న లాభము లేదు. మనకుఁగల కొఱంతలు మనుష్యు లేమితీర్పఁగలరు? సామాన్య మనుష్యులేగాదు. రాజులైనను దీర్పలేరు. తల్లులకుఁ దల్లియుఁ దండ్రులకుఁ దండ్రియు, రాజులకు రాజు, దేవతలకు దేవుఁడు, నీశ్వరులకు నీశ్వరుడునైన పరమేశ్వరుఁడు మనోరథంబులఁదీర్పవలయును గాని, మనుష్యులు దీర్పఁగలరె? తపమున నాతని మెప్పించితివేని తండ్రితొడయేగాదు, జయంతునితండ్రితొడయు, గణేశ్వరునితండ్రితొడయు నీవెక్కఁగలవు. నీతండ్రి సింహాసనమే గాదు, మహేంద్రునిసింహాసనమైన నెక్కఁగలవు. నాయనా! రాజకుమారవేషమునుదీసి, మునిరాజకుమారవేషమును ధరింపుము. వెలలేని యీదువ్వలువలు విడిచి నారచీరలుగట్టుము. ముత్యాలహారములఁదీసివైచి రుద్రాక్షమాలలు దాల్పుము. కమ్మనితావుల నిచ్చు మేనిపూతలు కడిగికొని బూడిదబూసికొమ్ము. కస్తూరితిలకముఁ దుడిచివైచి భస్మోర్ధ్వపుండ్రము స్వీకరింపుము. సువర్ణమకుటముదాల్ప వలసిన నీమస్తకమునఁ బ్రశస్తమైన జటల దాల్పుము. అట్లుచేసితివేని శ్రీమన్నారాయణుని వామనావతారమందలి మూర్తిని బోలియుందువు."

అట్లు పలికినతల్లిమాటల నాలించి యాకుమారుఁడు విషాద

మునువదలి తనకు హరిసేవ లభింపఁగలదని సంతసించి నెమ్మొగము వికసింప తల్లియొడినుండి దిగి నారచీరలు మొదలగు మునిచిహ్నములు ధరియించి తల్లియడుగులకు నమస్కరించి నిలిచెను. అప్పుడు మాతృవాత్సల్యముపొంగిపొరల సునీతి ప్రీతిమీఱ నందనుని బిగియార గౌఁగిలించుకొని చెక్కులుముద్దాడి శిరంబునిమిరి బాష్పాకులితలోచనయై "వత్సా! నీకు భూతపిశాచాదిభయము గలుగకుండ, దుష్టమృగంబులు నీజోలికి రాకుండ దేవతలు, మనగృహదేవతలు, భూదేవతలు నిన్ను రక్షింతురుగాక! అదితినందనుఁడైన వామనునకుఁబోలె నీకు సర్వదా జయమగుఁగాక!" యని దీవించి యక్కుమారు మఱియొకసారి యక్కునంజేర్చి విడువలేకవిడువలేక విడిచెను. ఆమె కన్నులనుండి నీరు విరివిగాఁ బ్రవహించెను. ఆమెకడఁ గడసారిసెలవుగైకొనుచు ధ్రువుఁడు "తల్లీ! పామరులయట్లు నీవు నన్నుగుఱించి విచారింపగూడదు. నేను మహోన్నతదశ పొందించుటకై తపోనియమంబు గైకొనఁబోవు చున్నాను. వార్ధకమునందు సంసారము రాజ్యము బుత్త్రులకప్పగించి మహాపురుషులేధర్మమవలంభింతురో నేనుచిన్ననాఁడే యాధర్మమవలంబించితిని. చిరతపోనిష్ఠులైన యోగీంద్రులకుసైతము దుర్లభమైన పదవినందుటకై హరిచరణరాజీవముల నేనర్చింపఁబోవుచున్నాను. కావున నీవిట్టిసమయమునఁ గంటఁదడివెట్టఁగూడదు. నీయశ్రుజలములు మహానదులట్లు నామార్గమున కడ్డువడును. నీవిషాదము మహాపర్వతమువలె నాపయనము నిరోధించును. నీబాష్పములానందబాష్పములగుగాక! నీమనము ప్రసన్నమగుఁగాక!" యని కడసారి నమస్కరించి యచ్చోటు వాసిపోయెను. జనని తనయుఁడు కనఁబడినంతసేపు వానివంకనే చూచుచు దృష్టిగోచరుఁడు గాకపోయినపిదప దీనముఖియై యంతిపురిఁ బ్రవేశించి మొగమువాచునట్లు వగచి యన్నపానాదుల నొల్లక యుండెను.

సవతికొడుకు జడదారియై యడవులకరిగెనని విని సురుచి తన కొడుకు గద్దెయెక్కుటకుఁగల యడ్డు తీఱిపోయెనని కడుంగడు సంతసించెను. ఉత్తానపాదుఁడు మాత్రము సహజమైన పుత్రప్రేమచే నించుక విచారము నొందెను. కాని, తనవిచారము వెలిబుచ్చిన సురుచి పిశాచమువలెఁ దన్ను బీడించునని భయపడి దుఃఖము లోలోనడఁచుకొనియె.

అట్లుధ్రువుఁడుమాతృదేవతనుబాసి,మందిరముబాసి,దాసదాసీజనంబులబాసి,సంపదలనురోసి,యొంటరిగవనముల కరుగుచుండ దైవవశమున నతనికి బ్రహ్మమానసపుత్త్రుడును, సర్వలోకసంచారియు నగు నారదమహాముని యెదురై యిట్లనియె. "కుమారా! నీవెవ్వఁడవు? రూపరేఖావిలాసములఁబట్టిజూడ రాచకొడుకు వని తోఁచెడిని. కాని నీజాతికిని, నీసొబగునకును ననర్హమైన మునివృత్తి నవలంబించుటకుఁ గారణమేమి? తల్లిదండ్రులు లేరా? వారు లేకున్న రక్షింపఁగల చుట్టములు లేరా? ఇంతచిన్నతనమున నింతసుకుమారివైన నీవు తపోనియమమునకు బోవుట యతిచిత్రముగా నున్నది. నీయుదంతము నా కెఱిఁగింతువేని సంతసించెద." అనవుడు ధ్రువుఁడు మునికి నమస్కరించి "దేవా! నేను ధ్రువుడ. ఉత్తానపాదుని బుత్త్రుఁడ. సవతితల్లి పలుకులనెడు ములుకులవలన నాహృదయమునఁ బడిన గాయముల మాన్పుకొనుటకై భవరోగచికిత్సకుని సమాశ్రయింపఁ బోవుచున్నవాఁడ. ప్రాకృతజనంబుల చికిత్సలవలన నట్టివ్రణములు మానవుగదా" యని యుత్తరమిచ్చిన నారదుఁడు వానిపలుకుల చమత్కృతికిఁ బ్రముదితాంతరంగుఁడై నతనికి హితోపదేశము చేయఁదలఁచి యిట్లనియె. "కుమారా! నీకు సవతితల్లివలన జరిగినపరాభవము నేను దివ్యదృష్టివలన నెఱిఁగితిని. కాని తేనెతేటలొలుకు నీపలుకులఁ గర్ణరసాయనముగా విని యానందింపఁదలఁచి నిన్నడిగితి. సవతితల్లులు

సవతులబిడ్డలపై ద్వేషముబూనుట సహజము. కాని, కడుపాఱఁగన్న తండ్రి యట్లాచరించుట ధర్మవిరుద్ధముగా నున్నది. స్త్రీలమాయల లోఁ బడినవారి చర్య లిట్టివెగదా! ఎట్లయినను సంసారబంధమును గోసివైచి యాపలఁబడితివిగావున నీవు ధన్యుఁడవు. కాని, నీకొక్క హితోపదేశంబు చేసెద.అది యాలకింపుము. నీది చిఱుతపాయము. సవయస్కులంగలసి యాటలాడుకొను నీడు. ఇంతకాల మంతఃపుర ములలో నుంటివి. ఇప్పుడు క్రూరమృగశరణ్యములగు నరణ్యములకు బోవుచుంటివి. అచ్చట నాడుకొనుటకు నీచెలికాండ్రు గానఁబడరు. అడుగడుగునకు నీకూడిగములుచేయుటకుఁ బరిజనము లుండరు. ఆఁకలిగొన్నచో షడ్రసోపేతమగు నన్నము నీకక్కడ లభింపదు. పండ్లు దుంపలు దినవలయు. కొండలనుండిపాఱు సెలయేళ్ళనీరుదక్క సరసములగు పానీయము లుండవు. ఏవంక జూచిన కొండలు. ఏప్రక్క జూచిన మృక్కడిమృగముల ధ్వనులు, బెబ్బులుల బొబ్బలు. చిలుకల గోరువంకల గోయిలల పలుకులు విని యానందించు నీకు సింహ శార్దూలాది భీకరజంతువుల యారావములు భయముగలిగింపకుండు నే? బాలుఁడవు బేలవుగావున నిట్టి పరియత్నమునకుం జొచ్చితివి. కా రడవులలో నీవొక్కపూట గడుపఁగలవా? రాచనగరున వందల కొలఁది దీపములవెలుతురున నడచునీవు మహారణ్యమున గాఢాంధ కారబంధురములగు తావుల నిశలెట్లు గడుపఁగలవు? మెత్తనియంచ రెక్కలపానుపులపైఁ బండుకొనునట్టి సుకుమారుడవు కఠినశిలాతలము లపై నెట్లు బండుకొనియెదవు? కావున బెద్దవాఁడనగు నాపలుకు లా లించి నీ నిమిత్తమై బెంగపెట్టుకొనియుండు తల్లికడకుం బోవుము." అనవుడు ధ్రువుఁడు చిఱునవ్వునవ్వి దేవర్షి కిట్లు ప్రత్యుత్తరమిచ్చె. "మహాత్మా! మనుష్యునకు మనస్సుపరిధానము. మనోదార్ఢ్యముగల వానికిగారడవియైనను గనకసౌధమైనను సమానముగానే యుండును.

వైరాగ్యము జనించినప్పు డడవి యంతఃపుర మగును. పండుటాకుల కుప్ప హంసతూలికా తల్ప మగును సెలయేటి నీళ్ళు పానకము లగును. పండ్లు,కాయలు పరమాన్నము లగును. చెట్లనీడలు మేడలగును. నారబట్టలు నవ్యచీనాంబరము లగును. నేను శ్రీమన్నారాయణుని చరణంబులు శరణంబులు చేసికొని వనంబున వసింప మనంబు దిట్టపఱచుకొంటి. పురాభిముఖుఁడనగుటకు నామనం బొప్పదు. కావున మీహితోపదేశము నాలింపనందుకు నన్ను క్షమింపనల యు" నని బదులుచెప్పుటయు నమ్మునిరాజు రాజకొడుకుపలుకులకు మిక్కిలి యలరి కౌఁగిలించుకొని శిరంబుముద్దాడి వెండియు నిట్లనియె—

వత్సా! ఆయుష్మంతుఁడవు గమ్ము! ప్రాయమునఁ జిన్నవయ్యు జ్ఞానవైభవమున వయసుమీఱిన మహర్షుల మించితివి. స్వాయంభువుని పౌత్రుఁడవగుటకుఁ దగుదువు. నీమనంబు తెలుఁగు నెఱుఁగ మనసు విఱుగు పలుకులు బలికితినిగాని, తపోనియమమునుండి నిన్ను మఱల్చుటకుఁ గాదు. ఉత్తమహితోపదేశంబు చేసెద వినుము. ఇక్కడి కనతిదూరమున యమునాతరంగిణి కలదు. దాని దాపున మధువనము గలదు. ఆవనము తపోనియమంబులకు మిక్కిలి యనుకూలమైనది. ఘాతుకమృగంబులవలన దుష్టజనంబులవలన బాధలుగాని విఘ్నములుగాని గలుగవు. అచ్చట జేరి నియమవంతుండవై యేకాగ్రచిత్తమున దేవోత్తముని బురుషోత్తముని ధ్యానించుచుండుము. అన్యవిషయంబులు మనంబునం జొఱనీకుము. పరమేశ్వరసందర్శన మగువఱకుఁ దపంబు మానకుము. అంతట నీకు మిత్రుఁడును, నిర్మలుఁడును, నిర్వికారుఁడును, నిరంజనుఁడును, నిరాకారుడును, నిర్గుణుఁడును, నిశ్చలుడును, నాఘ్యుఁడును, ననంతుడును, నవ్యయుడును, నద్వితీయుఁడును, నప్రమేయుడును, ననవద్యుండును, నధోక్షజుఁడును,

నఖిలాంతర్యామియు నఖిలప్రమాణగోచరుడును నైనపరమేశ్వరుఁడు వాచామగోచరుడు పరమయోగిదుర్లభుడు వేదాంతవేద్యుఁడు సాక్షాత్కరించును. వ్రతములచేత దానముచేత జపములచేతఁ దపములచేత నియమములచేత నిష్ఠలచేత వేదాధ్యయనములచేత వేదాంతచర్చలచేత యోగములచేత త్యాగములచేత ధర్మములచేత కర్మములచేత నెవ్వనియనుగ్రహము సంపాదించుటకై యుత్తమదానవులు మానవులు సిద్ధులు సాధ్యులు విద్యాధరులు కిన్నరులు కింపురుషులు తమ జీవితములు ధారవోయుచుందురో యట్టి పరాత్పరుఁడు పరమపురుషుడు నీకడకు స్వయముగ విచ్చేసి నిన్ననుగ్రహించును. ఏడ్చుచున్న బిడ్డకడకు జాలిపెంపునఁ దల్లిదండ్రులు చేరుతెఱంగున, నంబా యని యఱచుచున్న దూడకడకు టెవ్వటెవ్వనఁ బఱుగెత్తివచ్చు నావు తీరునఁ దన సాన్నిధ్యమును బడయఁదలఁచు పరమభాగవతోత్తముని కడకు భక్తవత్సలుఁడు దయాసింధువు నాత్మబంధువు నగునారాయణుఁడు పరతెంచును. భక్తియను శృంఖలముచేత నరసింహదేవుడు బంధింపఁబడును. ఆసంకిళ్ళు విడిపించుకొని యతఁ డవ్వలకుం బోవఁ జాలఁడు. గరుడకేతనునకు భక్తివంటి యెఱ మఱియొకటి లేదు. ఆ యెఱ జూపితిమా దాని కాసపడి యతఁడు వైకుంఠము బాసి క్షణంబున వచ్చును. అతఁడు భక్తవశంకరుఁడు. కాదు కాదు- భక్తకింకరుఁడని చెప్పవచ్చును. పరమేశ్వరుని సాన్నిధ్యము బొందుటకు జ్ఞానమార్గముకన్న భక్తిమార్గము సులభమైనది. జ్ఞానమార్గము కష్టసాధ్యము. భక్తిమార్గము నిరపాయము. కావున వత్సా! నీ వాదారింభొమ్ము. నీకు శుభమగుఁగాక!" అని యానతిచ్చి దివ్యముని యచ్చోటు వాసి కలహాశనుండు గావున ధ్రువుని జనకుఁడైన యుత్తానపాదుని సన్నిధికిఁ బోయి యాతనిచేత సన్మానితుఁడై సుఖాసీనుఁడై "రాజా! ఎంతో కలకలలాడు నీ మొగము విన్నవోయియున్న దేమి?

నీమనంబు విచారజలధిలో మునింగినట్లు కనంబడుచున్నది. రాజ్యవ్యాపారములు సరిగా జరుపుచున్నట్లు కనంబడుటలేదు. దానికిం గారణమేమి" యని యడిగెను. అడుగుటయు రాజు మహర్షి కిట్లనియె. "మునివర! నాయవస్థ యేమని విన్నవింతు? విద్యావినయవంతుండు గుణవంతుండు నగు నాకుమారుండు నాదుశ్చేష్టితమువలన మహారణ్యముల కరిగెను. రెండవపెండ్లమువలలోం జిక్కి నేను వానికివ్వాలదలంచితిని. ఆడుదానిమాయలం దగిలినవాండు కార్యాకార్యము లెఱుంగనేర్చునే? కటకటా! నాచిన్నియన్న క్రూరమృగంబులపాలు గాకుండునే? ఆఁక డీపాటికి మరణింపకుండునే? ఎందుంబోవుదు, నెందు వెదకుదు? సేవకులం బనిచి పలుతావులు వెదకించితిని. ఎందును గానంబడండయ్యె. నేను మందభాగ్యుండను. మూర్ఖుండను. స్వాయంభువమనువుయొక్క వంశము నావలనం గళంకితమయ్యె. సవతులగు యువతులు సవతిబిడ్డలమీఁద మత్సరముబూనియుండు టెందయినం గలదుగాని, కన్నతండ్రి కొడుకు ననాదరించుట కలదె? అతిసుకుమారుండైన కుమారుండు నట్టడవుల నవయుచుండ నేను రాజ్యోపభోగంబు లెట్లనుభవింపంగలను? రాజ్యవ్యాపార మెట్లు చేయంగల్గుదును. నాకుమారు నెందైన మీరు చూచితిరేని సత్వరమ చెప్పుడు. నే నచ్చోటికిం బోయెద. ఆయడవియే నాకు మందిరమగును. పూర్ణచంద్రపరిభావంతమైన యాతని మొగమె నాకానందామృతమిచ్చి నన్ను రక్షించు. అట్టి గుణరత్నాకరుండైన కొడుకు నా కెట్లుదక్కును?" అని విలపించుచుండ నారదుం డతని సమాశ్వాసింపందలంచి యిత్తెఱంగునం బలికెను: "రాజా! విచారింపకుము. తపోదీక్షితుండైన నీకుమారుండు నాకుం గానంబడియె. అతండు సేమముగా నున్నవాండు. నారాయణపాదకమలముల నాశ్రయించిన యక్కుమారునకు భయముండునా? అతండు తపము సేయుచున్న వనము

నే నెఱుంగుదునుగాని, నీకిప్పుడు చెప్పను. చెప్పితినేని మీారక్కడికిఁ బోయి యాతని తపము విఘ్నముచేయుదురు. లోకరక్షకు డతని రక్షకుఁడు. దుష్టమృగములు దురాచారులు వాని జోలికిఁ బోజాలరు. నీకుమారుడు లోకోత్తరగుణరత్నాకరుఁడై నారాయణునివలన వరం బులువడసి సుఖియై మరల నింటికివచ్చు. ఆతనివలన నీవంశంబు వన్నెకెక్కు. సకలపురాణేతిహాసములయందు నతనిపేరును నాతని తండ్రివై నకతమున నీనామమును నవినాభావముగాఁ బేర్కొనఁబడు చుండును. ఎంతకాలము సూర్యచంద్రాదిగ్రహములు గగనవీథిని సం చరించునో యంతకాలము నీనందనునిపేరుం బ్రతిష్ఠయు జతుర్దశభువ నములయందు నిలిచియుండును. ఇదియంతయు బరమేశ్వరుఁడగు పద్మ నాభుని ప్రిభావంబునం గలుగు. ఇంతకన్న నీకుఁ గావలసిన దేమి న్నది? నీకొడుకు సామాన్యుఁడుగాడు. అసాధారణప్రతిభావంతుఁడు. అట్లైకాకున్న నింతచిఱుతప్రాయమున ధైర్యము గలిగి యెవ్వఁడు తపోవనంబున కరుగఁగలఁడు. కావున నీవు వానింగురించి ఖేదపడక ధైర్యవంతుఁడవై మహీపాలనముసేయుము. కాని, నీకొక్కమాట చెప్పవలసియున్నది. చతుర్ముఖుని మనుమడవై స్వాయంభువుని నం దనుండవై సకలధర్మాధర్మవేత్తవైయున్న నీవు పామరజనులైనను జేయరాని యకార్యము గారాబుకొడుకునెడఁ జేయుట దూష్యము. ధర్మమును బాలింపవలసిన నీవే యిట్లుచేయ లోకమున నితరు లెట్లు వర్తింతురు? "యథా రాజా తథా ప్రిజా" యనునట్లు ప్రిజలు రాజు మార్గము ననుసరింతురు. కావున రాజు సద్గుణసంపన్నుఁడై యుండ వలయు, సత్ప్రివర్తనముగలిగి సదాచారముగలిగి యుండవలయు. గతించినదానినిమిత్తమై నీవు పశ్చాత్తాపమునొందితివి గావున దాని వలన పాపము నశించినది. ఇఁకమీఁద నెన్న, డిట్టి పొరబాటు చేయ కుము. నేనింకఁ బోయివచ్చెద" అని పీఠమునుండి లేమటయు రాజు

వానికి నమస్కరించి "మునీంద్రా! నాచిత్త మిప్పు డూరటజెందినది. కాని నాముద్దుబిడ్డండు నాకంటఁ బడువఱకు మనసు మనసులో నుండదు. నీవాగమృతముఁ గ్రోలుటం జేసి నాకిప్పుడు ధైర్యము గలిగినది. కుమారునిరాకకై రాకకై చకోరము లెదురుచూచునట్లు నిరీక్షించియుండెద" నని యమ్మునిని సాగనంపి యించుక చిత్తశాంతి కలిగియుండె.

అచ్చట ధ్రువుండు మధువనంబు జేరి యమునాతరంగిణిలో స్నానముచేసి తపంబు సేయఁదొడంగె. అతఁడు కొన్నిదినములు వెలగపండ్లు రేగుబండ్లు తిని యుండె. పిమ్మట నాఱుదినముల కొకసారి జీర్ణములైన యాకులం దిని పొట్టబోసికొనుచు నట్లొక మాసముగడచినపిదప తొమ్మిదిదినముల కొకసారి జలభక్షణంబు సేయుచు మహాతపంబు చేసె. అట్లు రెండుమాసములు గడుచుటయు మూడవనెలలో బండ్రెండుదినముల కొకసారి వాయుభక్షణము సేయుచు దినములు బుచ్చె. పిమ్మట నాలవమాసంబున నేకపాదమున నిలిచి నిరాహారుఁడై యూపిరి బిగబట్టి ఘోరతపంబు గావించె. అనంతర మైదవమాసమున నచేతనుఁడైన స్థాణువట్లు నిలిచియుండె. ఆమహాతపమునకు సకలభూతంబులును హాహాకారములుచేసెను. దేవతలు దిక్పాలకులు గడగడ వడంకిరి. వసుంధర వడఁకెను. అప్పుడు మహేంద్రాదిదిక్పాలకులు వాని తపఃప్రభావమునఁ బ్రపంచమున కేదేనిమహాపద వాటిల్లునని శంకించి వైకుంఠపురమునకుం బోయి శ్రీమన్నారాయణునితో మొఱపెట్టుకొనిరి. దయాసాగరుఁ డగుదామోదరుఁడు వారి విన్నపము లాలకించి "యమరులారా! మీరు వెఱువకుఁడు. భూమండలమున నుత్తానపాదమహారాజుకుమారుఁడు ధ్రువుఁడు తపము చేయుచున్నాఁడు. ఆతని కోరిక దీరునట్లు వరము లిచ్చి జగముల యాపద నడిపెద" నని యభయమిచ్చి వారిని యథాస్థానంబుల కంపి జనా

ర్దనుఁడు గరుడవాహన మారోహించి సనకసనందనవిష్వక్సేనాదు లగు పరమభక్తులు వెంబడింప మధువనంబునకుం బోయి ధ్రువుని కట్టెదుట నిలిచెను. ధ్రువుఁడు తపము చాలించి కన్నులువిచ్చి యంత కాలమునుండి తన హృదయపద్మకర్ణికాపీఠంబు నధిష్టించిన పరమేశ్వరునిమూర్తియే తన యెట్టయెదుటఁ గానఁబడుట జూచి కన్నుదమ్ములనుండి మంచుబిందువులట్లు హర్షబాష్పములు గార నెమ్మేను పులకరింప మన మానందసాగరమున మునుఁగ నమ్మహాదేవుని చరణరాజీవములకు నమస్కరించి భక్తిపారవశ్యంబున స్తుతియించుటకు నోరు రాక కొంతసేపు శిలావిగ్రహంబుచందంబున నిలిచియుండె. నారాయణుఁ డతనితలఁ పెఱింగి దైత్యరాజగర్వనిర్భేదకమైన తన శంఖంబుతో నాతనిశిరంబు స్పృశియించెను. అంతట నబ్బాలునకు నఖండమైన చైతన్యముదయింప బరమేశ్వరు నిట్లు వినుతించెను. "దేవా! నాలుగుమొగంబులు గలపరమేష్ఠియు వేయినాలుకలు గలయాదిశేషుఁడును, మహాప్రభావసంపన్నులైన మహర్షులును, నాలుగు వేదంబులును, మహేంద్రాదిదిక్పాలకులును నిన్నుం గొనియాడలేకుండ-బాలుఁడ నజ్ఞానుఁడనగు నే నేపాటివాడ? ఆకాశంబునకుఁ బారము గలదు. సముద్రమునకు మేరగలదు. బ్రహ్మాండమునకు హద్దుగలదు. కాని నీదయారసమునకు హద్దులేదు. రజోగుణముదాల్చి నీవు బ్రహ్మవై, సకలచరాచరప్రపంచము సృజియింతువు. సత్వగుణసంపన్నుఁడవై విశ్వంబునెల్ల బరిపాలించెదవు. తమోగుణప్రధానుడవై రుద్రుడవై బ్రహ్మాండమెల్ల నాశనముచేయుదువు. అట్టి సర్వవ్యాపకుఁడవు, సర్వశక్తుడవు సర్వజ్ఞుఁడవు నగునిన్నెవ్వ రెఱుంగగలరు? ప్రపంచమంతయు నీవలన నుద్భవమగుచున్నది. నీచేతనే వర్ధిల్లుచున్నది. నీయందే లయమగుచున్నది. ఈవిశ్వమంతయు నీలీల. ఆయింద్రాదు లందఱు నీచేతి కీలుబొమ్మలు. శంకరుండు నీకింకరుండు. హిరణ్యగర్భుండు

నీయర్భకుండు. నీవు కాలత్రియాబాధితుండవు. దేశకాలవస్తుపరిచ్ఛేద రహితుండవు. చిద్రూపుఁడవు. మహానందమయుఁడవు. నీచిఱునవ్వులు భక్తులకు మహైశ్వర్యప్రదములు. నీకనుబొమ్మముడులు వినాశనహేతువులు. సూర్యచంద్రులు గ్రహములు నీవు నిర్మించిన బ్రహ్మాండగృహమునందు దీపికలు. నీవక్షరుఁడవు. అవ్యయుఁడవు. అనాదినిధనుఁడవు. నన్ననుగ్రహింప వైకుంఠమునుండి వేంచేసితివి. ఈబ్రహ్మాండమునందుఁ జిన్నచీమకన్న నధముఁడనైన నానిమిత్తమై నీవు స్వయముగా వేంచేయుటం జేసి పిపీలికాదిబ్రహ్మపర్యంతము నీవు సమదర్శనుఁడవని తేటపడుచున్నది." అని బహువిధంబుల వినుతింప నాజగన్నాథుండు వాని విజ్ఞానమునకును బరమభక్తికిని మిక్కిలి సంతసించి నీకోరిన వరంబుల నిచ్చెద నడుగుమనిన నాడింభకుండు "దేవా! యనుగ్రహింపఁదలఁతువేని నన్నిప్పుడ వైకుంఠమునకుం గొనిపొమ్ము జీవన్ముక్తులలోఁ జేర్పుము. సంసారం బసారంబు. వివాహాదికార్యములు వజ్రపుసంకిళ్ళు. వానియందు నాకపేక్షలేదు. మోక్షసామ్రాజ్యంబు చూరఁగొనఁదలఁతును గాని మహీమండలరాజ్యం బొల్ల. నీ సన్నిధానంబునఁ గూరుచుండఁదలఁతుగాని పసిఁడిగద్దెమీఁదఁ గూరుచుండనొల్ల. నిన్ను నమస్కరించి శిరంబున మోడ్పుకేలు దాల్పఁదలఁతునుగాని, మాణిక్యమకుటంబు ధరింపనొల్ల. నీపాదసేవకుఁడనై యుండదలఁతునుగాని, సేవకులనొల్ల. కావున నన్ననుగ్రహించి నీ వెంటం గొనిపొమ్ము" అని ప్రార్థించెను. ఆతని వేఁడికోలు విని మందహాసము ముఖనీలోత్పలమునకు వన్నెవెట్టఁ గేశవుఁడు వాని మేనఁ జేయివైచి తట్టి మెల్లన నిట్లనియె. "కుమారా! వైకుంఠంబునకు వచ్చుటకు నీకిది కాలంబుగాదు. నీజనకుఁడు తపోవనంబున కరిగిన పిదప మహీభారంబు నీవు వహించి చిరకాలంబు పాలింపవలయు. అనంతరము నీవు సప్తర్షిమండలముకన్న నున్నతమై గగనవీధి కలం

కారమై సకలదేవశ్లాఘ్యమానమై వెలయు ధ్రువక్షితి యనుపదంబున నీవు బ్రహ్మకల్పాంతముదాఁక నుందువు. నీచుట్టును సప్తర్షిమండలము దిరుగు. అంతవఱకు నీవు భూలోకమున నుండవలయు" నని పలికి యచ్చోటనిలిచినఁ దన్నాతఁడు విడువఁడని శంకించి యమ్మాధవుఁడు తిరోధానంబుచేసె.

అంతట ధ్రువుండు గాఢవిషాదాయత్తచిత్తుఁడై "అయ్యో! చేయిజిక్కినపుడు నేల విడచితి? నాపాలిటి పెన్నిధానము, నాకల్పవృక్షము, నాభక్తచింతామణి, నాకన్నులచందమామ నన్ను విడిచి పోయె. వైకుంఠపురవాసము దొరకునని పుట్టెడాసపెట్టుకొనియుంటి. అట్టిభాగ్యము నాకు లేకుండఁజేసి తుచ్ఛసంసారసుఖంబు నన్ననుభవింపుమని విధించి యాదేవుఁడు చనియె. బహుభంగములతోగూడిన యీసంసారసముద్రి మెట్లు తరింపనేర్తు? ఎన్నఁడు నాకు రాజీవాక్షునిసాన్నిధ్యంబు గలుఁగు? ఎన్నఁ డాతని కటాక్షవీక్షణములు నాపై బ్రసరించు. ఎన్నడు నాకనుతుమ్మెదలు వాని యడుగుదామరలపై వ్రాలు? అయ్యో! ఇంతలో నాకాభాగ్యమబ్బదు. ఏమొగము పెట్టుకొని మరల పురంబరుగుదు? సాపత్నీమాతయు భ్రాతలు నన్నెగతాళిసేయకుందురే? జనకుండు నన్నాదరించునా? అయిన నీశ్వరాదేశంబు జరుగుఁగాక" యని తపంబు చాలించి నగరాభిముఖుఁడై పోవుచుండె.

తనయుఁడు వచ్చుచున్నాడన్నవార్త వేఁగులవాండ్రవలన విని యుత్తానపాదుఁడు మేరమీఱిన యానందమునొంది యరదంబులతో ద్విరదంబులతో హయంబులతో భటచయంబులతో వాని కెదురుగాఁ బోయి మౌనివేషముతోనున్న కుమారునిం గని, చింతయు సంతసంబును మల్లడిగొన, యతఁడు తనయడుగులకు మ్రొక్క దీవించి బిగియారఁ గౌఁగిలించి తనివిదీర ముద్దాడి, యానందబాష్పములతో

నతని శిరంబునభిషేకించెను. రాజువెంట సునీతియు సురుచియు నుత్తముండును నగుగుటం జేసి. ధ్రువుఁడు తల్లులకిద్దఱకు నమస్కరించి తమ్మునిఁగౌఁగిలించి గారవించెను.సునీతి మృతినొందిన పుత్త్రుఁడు మఱలవచ్చినట్లు మహానందమునొంది తనవిదీర నాలింగనముచేసికొని దీవించెను. సురుచియు వెనుకటిమాత్సర్యమును విడిచి సవతికొడుకుం దీవించి ముద్దువెట్టుకొనెను. అంతట నుత్తానపాదుఁడు ధ్రువుని నుత్తముని బట్టపుటేనుఁగుపై నెక్కించి మంగళధ్వనులతో నూరేగించెను. పౌరకామినులు విష్ణువరప్రసాదములు బడసివచ్చిన యాకుమారరత్నమునుజూచి సంతసించి యక్షతలు లాజలుపుష్పములు జల్లి గర్పూరపుటారతులిచ్చి దీవించి మరల పుత్రునిబడయ గలిగినందుకు సునీతిని బహూకరించిరి. ఆకుమారునకు యుక్తవయస్సు వచ్చువఱకు నుత్తానపాదుఁడు మహీమండలము బరిపాలించి పిమ్మట బ్రజానుమతిమున ధ్రువునకు రాజ్యాభిషేకము జేసి తాను సునీతినింగూడి మూఁడవయాశ్రమమగు వానప్రస్థముచేయుటకై తపోవనమునకరిగెను. ధ్రువుఁడు మను ధర్మశాస్త్రప్రకారముగా వర్ణాశ్రమధర్మంబులు తప్పకుండ ప్రజానురంజకుడై మహీపాలనము సేయఁదొడఁగెను. శింశుమారప్రజాపతి తనకొమార్తెయైన భ్రమి యనుదానిని ధ్రువునకిచ్చి వివాహముచేసెను. ఆయెలనాఁగవలన నతండు కల్పుఁడు మత్సరుఁడు నను నిరువురు కొడుకులం గనియె. అదియునుంగాక వాయుదేవుని పుత్రికయైనయిల యను కన్యారత్నమును నారాజేంద్రుడు పరిణయంబై యాయింతివలన నుత్కలుఁడను నందను నొక్కకూఁతునుగనియె. సవతితల్లియందును సవతితమ్మని యందును నెట్టిద్వేషములేక ధ్రువుఁడు నింతింతయనరాని ప్రేమతో వారినాదరించుచుండెను. అట్లుకొంతకాలము గడువనుత్తముఁడు వివాహముచేసికొనకయే దిరుగుచు నొకనాఁడు వేఁట తమకమున నట్టడ

వులకరిగి యటనుండి హిమవత్పర్వతప్రాంతములకరిగి యౌవనగర్వో న్మత్తుఁడై తనబలంబు నెదిరి బలంబు నెఱుంగక మహాబలసంపన్నుఁడై తృణీకృతహర్యక్షుఁడగు యక్షునొక్కని దాఁకి వానిచేత రణమున నిహతుఁడయ్యె. కొడుకుచావును విని సురుచి పుత్రశోకజ్వరము సహింపఁజాలక యాతడు పోయినమహాటవుల కేఁజని కాఱుచిచ్చునంబడి మృతినొందె. భ్రాతయు సవతితల్లియు నాతెఱంగున మడిసిరనువార్త విని ధ్రువుఁడు మిక్కిలి వగచి తమ్మునిం జంపినయక్షుల శిక్షలపాలుచేయవలెనని సంకల్పించి దండయాత్ర వెడలి కుబేరుని రాజధానియైన యలకాపురసమీపమున విడిసెను. సమర దక్షులు యక్షులు భూధవుని ధ్రువుని గని యుద్ధసన్నద్ధులైరి. అప్పుడుభయబలములకును ఘోరమైనసంగ్రామమయ్యె ధ్రువునిబలంబుముందఱ బాహుబలంబు ముందఱ యక్షులబలంబు నిలువజాలదయ్యె అప్పుడాయక్షులు రాక్షసులంగలసి బహుమాయోపాయంబులఁబన్ని ధ్రువుని సిలుగులం బెట్టిరి. అప్పుడు మహర్షుల యుపదేశంబున నతడు శ్రీహరిందలఁచి నారాయణాస్త్రంబుం బ్రయోగించెను. దానిప్రభావంబున రాక్షసమూహములెల్లఁ బటాపంచలయ్యెను. యక్షులు రాక్షసులు కుప్పతిప్పలుగాఁ గూలిరి. రక్తంబు వఱదలై ప్రవహించె. నెత్తురుటేరులఁ బీనుగులు తేలియాడె. ఆసంగ్రామమతిభయంకరమై దారుణమగుటం జేసి ధ్రువునిపితామహుఁడైన స్వాయంభువమనువు ననేకఋషిగణములతో సంగరమునకుంజని మనుమనిం గని యిట్లనియె. "వత్సా! నీపరాక్రమంబునకును నీభ్రాతృవాత్సల్యమునకును మెచ్చితి చిన్ననాఁట నిన్నవమానించి గాసిపెట్టిన సవతితల్లికొడుకుపై నింత ప్రేమ గలుగుట మిక్కిలిశ్లాఘనీయము. అతనివిషయమై నీవువిచారించుచున్నమాటనిక్కము. అయినను నీకొక్కహితోపదేశము చేయవలఁతు. యక్షులచేత జచ్చినవాఁడొక్కడు. ఒక్కనికై యిక్కరణిపెక్కం

డఱి నుక్కడంచి బరిమార్చుట తగవుగాదు. 'అహింసాపరమోధర్మః' అనువాక్యంబు నీవెఱుగనిదిగాదు. ఒక్కనిప్రాణంబునకై లక్షలకొలది ప్రాణంబులఁ దీయుట భావ్యమె ? నీవుసకలధర్మాధర్మవేత్తవు. విష్ణు చరణధ్యానైకశీలుఁడవు. నీవెఱుంగనిధర్మమర్మము లేదు. ఈయ క్షుల నీవిధమున హింసించుటతగవుకాదు. అతిదారుణమై పాపహే తువైన యీకర్మంబుడుగుము. మానవులకును సింహశార్దూలాది జంతువులకును భేదము దయ యనుదానియందె కలదు. జంతువులు నిర్దయాస్వభావములు. మానవుఁడు పరమేశ్వరకళాసంభూతుఁడు గావున దయారసము వానియందునెలకొనియుఁడు. దయాశూన్యుండు మానవుఁడుగాఁడు. దయచేతనేగాదె దానములుచేయుట. దయచేతనే గాదె బహులోకోపకారములుజరుగుట. దయవంటిగుణముమఱియొకటి లేదు. దయారహితమైన హృదయము బండగాని, గుండెకాదు. నీవు సహజముగాఁబరమదయాళుఁడవు భాతృవధామర్షంబున వీరిం దలఁపడి హింసించితివి. యక్షరాక్షసకులాంతకమగు. మురాంతకుని యస్త్రం బుపసంహరింపుము యక్షులంగావుము" అనవుడు సప్పితా మహునివాక్యంబుల నాలించి ధ్రువుండు నారాయణాస్త్రంబుపసం హరించి సమరంబుచాలించె. స్వాయంభువుడు సంతసించి మహర్షి గణముతో స్వస్థానంబునకరిగెను.

అనంతరము కుబేరుఁడు ధ్రువునిజూచి కుమారా! నీవు కృ పాళుఁడవై మీతాతయుపదేశంబున సమరంబుజాలించి యక్షరాక్ష సులను రక్షించితివిగాన నేనును మహానందమునొందితినని చెప్పిచనియె అనంతరము ధ్రువుఁడు నిజరాజధానికేఁజని ధర్మోత్తరముగా నిరు వదియాఱువేలవత్సరములు మహీమండలముఁ బాలించి పుత్రునకు రాజ్యాభిషేకముచేసి తపోవనమునకరిగెను. అచ్చటజిరకాలము దుస్స హతపముచేయుచుండ నొకనాఁడు సువర్ణమయమై రత్నఖచితమై దే

దీప్యమానప్రభాభాసురమైన యొక్క విమానంబువచ్చె. అందు శ్రీ మహావిష్ణువువలె జతుర్భుజములు పుండరీకనేత్రములు, జలధరశ్యామ దేహంబులు, శంఖచక్రశార్ఙ్గగదాఖడ్గములు గలపరమభాగవతోత్తము లిరువురు గూర్చుండిరి. వారింజూచి విష్ణుకింకరులుకావలయునని తలంచి ధ్రువుఁడులేచి నమస్కరించెను. వారుధ్రువునిదీవించియిట్లనిరి "మహాత్మా! సకలతపంబులకు యాగంబులకు ధర్మకార్యములకుఁ దగుఫలంబులనిచ్చునట్టి పరమేశ్వరుఁడు నారాయణుఁడు నిన్ను దోడి తెమ్మని యీవిమానంబునంపె. చిన్ననాఁట నీవుజేసినతపస్సు మెచ్చి హరి నీయందు దయగలవాఁడయ్యె. రమ్ము" అని యాహ్వానించుటయు నతఁడు తనతపంబు ఫలించెనని యానందించి విమానంబునెక్కి సృష్టిస్థితిలయకారణభూతుడైన దేవదేవునిసాన్నిధ్యమునొందెను. నారాయణుఁడు కృపాపరాయణుఁడై యాకాశమున నతనికొకస్థలమేర్పఱచి దానికి ధ్రువక్షితియని పేరుపెట్టి ప్రభావంతమైన నక్షత్రరూపమున నచ్చటనుండుమని యానతిచ్చె. నాటంగోలె ధ్రువుఁడు గగనమండలమున నక్షత్రమండలముకన్న సప్తర్షిమండలముకన్న సూర్యాది గ్రహములకన్న నున్నతస్థానమాక్రమించి హరిభక్తులలోనగ్రగణ్యుడై యుండె.



# వేనుఁడు

అంగుఁడను నొకానొకరాజు కలఁడు. అతఁడు సునీథయను కాంతం బరిణయంబై మహీపాలనము సేయుచుండె. ఒకసారియతఁ డశ్వమేధమును సేయుచుండెను. పూర్వకాలమందు యజ్ఞముల యందలిహవిర్భాగములను దేవతలు స్వయముగావచ్చి గ్రహించుచుండెడివారని పెద్దలుచెప్పుదురు. ఆహయమేధమునకుఁ దక్కినజన్నములకు చనినట్లు నిర్జరులుపోయి తమతమవంతు వచ్చిన హవిర్భాగముల ను స్వీకరింపరైరి. అదిచూచి విస్మయమంది ఋత్విక్కులు యజమానుఁడగు నంగభూనాయకునిం జూచి యిట్లనిరి. "రాజేంద్రా! మంత్రములచేత మేముదివ్యుల నాహ్వానించినను వారు రాకున్నవారు ప్రయోగింపఁబడు ఛందస్సు లెప్పటియట్ల వీర్యవంతంబులైయున్నవి. అగ్నులు దీప్తిమంతములై వెలుఁగుచున్నవి. హోమద్రవ్యములు పరిశుద్ధములు. మంత్రప్రయోగముచేయుచున్న బ్రాహ్మణులు పవిత్రులు. అన్నియుసరిపడియున్నను విబుధులు వేంచేయకున్నవారు. దానికిం గారణము మేమెఱుంగజాలము. నీ వెఱుఁగుదువేని చెప్పుము. దానికిందగు ప్రాయశ్చిత్తము చేసికొందము. నీవెఱుఁగవేని బ్రహ్మజ్ఞులైన యీసభాసదుల నడిగి తెలిసికొనుము" అనవుడు రాజు యాగదీక్షయందుఁ బూనిన మౌనవ్రతమువిడిచి లేచి సదస్యులకు నమస్కరించి "మహాత్ములారా! నేను చాక్షుషమనువువంశమున జనించినవాడను. చేయునది దేవప్రీతికరమైన యశ్వమేధము. యాగమంతయు సులక్షణముగా జరుగుచున్నప్పుడు సుపర్వు లెందుచేతనో వచ్చి యాగభాగంబుల గ్రహించుటలేదు. నావలన నెట్టియపరాధంబునులేదని నాయంతఃకరణము చెప్పుచున్నది. దీనిహేతువేమో మీరు సెలవియ్యవలయు"నని ప్రార్థించెను. ఆవేడికోలువిని సభాసదు

లిట్లనిరి. "రాజా! నీవు కావించుయాగమునందెట్టి యపరాధమును లేదు. నీయందునుదోషము లేదు. కాని యదృష్టలోపమున నీయందొక్క వెలితికలదు. నీకుసంతానము లేదు. సంతానహీనుల యజ్ఞములకు వేల్పులుపోయి యాగభాగములను గ్రహింపరు. కావున నీవు పుత్రకామేష్టియను మఖంబు సేయుము. దానివలన నీకుసంతానంబుగలుగు. అప్పుడు దేవతలు బితృదేవతలు సంతుష్టులై నీకిష్టులై యుందురు." అని వారానతిచ్చుటయు భూనాయకుఁడు వేదవిదులైన బ్రాహ్మణులను రావించి పుత్రకామేష్టిచేసెను. యాగాంతరమున జ్వలనగుండమునుండి హిరణ్మయవర్ణముగల దివ్యపురుషుఁడు పైకివచ్చి బంగారు గిన్నెలో దేవనిర్మితమైన పాయసముబోసి తెచ్చి యారాజన్యున కిచ్చెను. ఆమహీపాలుఁడు పాయసంబుగ్రహించి సహధర్మచారిణియైనసునీథకిచ్చెను. దేవదత్తమైన యాయుత్తమపాయసంబు భక్షించి యాయిల్లాలు చూలాలయ్యెను. నవమాసంబులు నిండినవెనుక నానెలంత ప్రసవించి కుమారునిఁగనెను. తనసంపద శాశ్వతంబుగా నవనియందునిలుచుననియు వంశవిచ్ఛేదమగునని విచారించుచున్న బితృదేవతలకుఁ దిలోదకపిండప్రదానంబులు గలుగుననియు దనకుత్తమగతులు సంప్రాప్తించుననియు సంతసించి యంగరాజు సంభావనల చేతను సన్మానములచేతను బ్రాహ్మణోత్తములందనిపి దేశమందంతట మహోత్సవములు జేయించి జాతకర్మనామకరణాది శుభకార్యంబులు చేయించి యానందనునకు వేనుఁడని వ్యవహారనామ మొసఁగెను. ముత్యములు రత్నములు సముద్భవించిన సముద్రమందు నత్తగుల్లలుపుట్టునట్లు ప్రశస్తమైన యావంశమందు దురాత్ముఁడుపుట్టెను. వేనుఁడు బాల్యమునందె తనయీడుబిడ్డలం బిలిపించి వారలనేకవిధంబుల హింసించుచుండును. విల్లునమ్ములు చేతబూని వేటయనిపేరుబెట్టి యావులు మేకలు మొదలగు సాధుజంతువులను వధించుచుండును.

దయయన్నమాట వానిహృదయమందెచ్చటను లేదు. పసిబిడ్డలనక యాఁడువాండ్రనక ముసలివారలనక యెల్లవారలను బహువిధంబుల బాధింపఁదొడఁగెను. రాజకుమారుఁడగుటచేతఁ బ్రజలు వానినెదిర్చి బ్రతికిక్రియ సేయజాలరైరి. పలువురు పలుమారు సరసాలునితో వాని దుండగములఁగూర్చి మొఱవెట్టుకొనిరి. వారికుయ్యాలించి నృపాలుఁడు కృపాలుఁడై దుడుకుకొడుకునుబిలిచి ముదుమున్న చీవాట్లుపెట్టి యా మందలింపులు వాఁడుసరకు గొనకపోవుటజేసి బహువిధంబులదండించెను. ఎన్ని దండనలుచేసిన నెన్ని తెఱంగుల బుద్ధులుసెప్పిన వాఁడు తన దుశ్చరితమును విడువఁడయ్యె. ప్రజలఘోష లెక్కువయ్యెను. అప్పుడు రాజుచింతయు సిగ్గును మనంబునమల్లడిగొని దిట్లుతలంచెను. మహాప్రయత్నముచేసి పుత్రకామేష్టిగావించి దేవతల యనుగ్రహము బడసి కోరి కొడుకునుగంటిని కాని వాఁడిట్టిదుష్టచిత్తుఁడయ్యె. ఇట్టి కుమారునింగనుటకన్న నపత్యుఁడనైయుంట మిక్కిలిమేలు. పూర్వ జన్మంబున నే నేపాపముచేసితినోగాని, పరమేశ్వరుఁడు నాకు గుణహీనుడైన కొడుకునిచ్చెను. ప్రకృతి జనులు వీని వలనఁ బడు బాధ లకు మితము లేదు. వారి బాధలు దుస్సహములుగా నున్నవి. వీఁడెంత మొండివాఁడోగాని యెన్నిదండనలు చేసినను సరకుగొనఁడు వీనికతమున నిష్కళంకమైన నావంశము కళంకితమయ్యె. "చెఱకు తుదవెన్నుబుట్టినఁ జెఱకునందలి తీపియెల్లఁజెడినయట్లు" కొరమాలిన యీకొడుకుగలిగిన కతమున మచ్చలేని నాకొలమునకు జెడ్డపేరు కలిగెను. పుత్రస్నేహమున వీనింజంపుటకుఁ జేతులాడవు. ప్రజలకష్టములా సహింపశక్యములుగాకున్నవి. ఈసమయమున మరణమొక్కటియే నాకు శరణమని తోచుచున్నది. ఆత్మహత్య మహాపాతకహేతువని యార్యులువక్కాణింతురు. అనఁటిచెట్టుకు గొలపుట్టినట్లు నా వినాశమునకై వీఁడుదయించెను. ఈప్రజలకష్టముల జూచి నేనుసైరిం

ప్రజాల. ప్రజారక్షణము సేయలేని రాజు రాజ్యము సేయుటకన్న పూజ్యమైన తపంబు సేయుటకర్తవ్యము. కష్టపడి చెమటయూడ్చి సంపాదించిన విత్తము పన్నులని పేరుబెట్టి ప్రజలనుండి నేనుగ్రహించివారిని నాకొడుకు బారినుండియే నేనుసంరక్షింపజాలనప్పుడు నాకీరాజ్యమేల ఈకిరీటమేల? ఈసింహాసనమేల? ఈవైభవమేల? కావున వీనినివర్జించి యెవ్వరికిం జెప్పకుండ నర్ధరాత్రిమున మహారణ్యమునకుబోవుదు. ఇట్టికొడుకును లొంగదీసికొనలేక ప్రజల మొగమెట్లుచూతునని వితర్కించి దృఢనిశ్చయంబుచేసికొని నాఁటినడిరేయి కానలివాండ్రు నిద్రాసక్తులై యున్నసమయంబున గాఢనిద్రగలిగియున్న భార్యనువిడిచి యంతఃపురమువిడిచి పురమువిడిచి యొంటిగ నెందేనిజనియెను. మఱునాఁడు నరనాథుసిగానక పరిజనంబులు మంత్రులకెఱింగించిరి. మంత్రిబాంధవులు విషాదమొంది రాజునువెదకుటకై పరిచారకులను నానాదిశలకంపిరి. వారు కొండలు గుహలు కాననములు మొదలగు ప్రదేశములు వెదకి వెదకి తమతేని నెందుగానక విసికివేసారిమఱలనగరంబునకువచ్చిరి. దేశమరాజకమయ్యె. తస్కరాది దుష్కరజనంబులు పెచ్చుపెరిగిరి. బలవంతులు బలహీనుల హింసింపఁదొడగిరి. ప్రజలచిత్తంబులు క్షోభించెను. శిష్టజనరక్షణంబును దుష్టజనశిక్షణంబును లేకపోయెను. దేశస్థులమనంబున భయంబు హెచ్చెను. అప్పుడు మంత్రిసామంతులును భృగువుమొదలగు మహర్షులును గలసి యాలోచించి సునీథాదేవియనుమతంబున దురాచారుఁడైన వేనునకేపట్టాభిషేకముచేసిరి. అట్లుమహీభారమువహించియు నతఁడు సహజమైన దుర్వారగర్వమున నెవరినిసరకుగొనక సత్పురుషుల నవమానించుచు నిరంతరము దుర్జనసాంగత్యముఁగలిగి జారచోరాదిదుర్జనులఁ దగినయట్లు దండింపకయుండెను. అదియునుఁగాక యతఁడుయథేచ్ఛముగా విమానములనెక్కి యాకాశసంచారముచేయును. పుపుదోఁటలలోను

మేడలమీఁదను నిచ్చవచ్చినపడుచుపడఁతులఁ గూడి క్రీడించును. అటులుండియుండి యొకనాఁడు "బ్రాహ్మణులు యజ్ఞములు చేయ గూడదు. ఎవ్వరును దానములు చేయఁగూడదు. హోమములు చేయగూడ"దని భూమియు నాకాశముపగులునట్లు భేరివేయించి చాటించెను. అదివినఁగానే కర్మిష్ఠులైన బ్రాహ్మణుల గుండియలు జల్లుమనెను. మహామునులమనస్సులు చలించెను. అందుచేతఋషులు విప్రులు నొక్కచోటజేరి యిట్లుసమాలోచించిరి. "కటకటా! పర మపతివ్రతయైన సునీథాదేవికిని, సద్గుణగరిష్ఠుఁడగు నంగరాజునకును జనించి యీతఁడింత దురాత్ముఁడగుట మిక్కిలియక్కజముగానున్నది అక్కజమననేల? అచ్చమగుపాలసముద్రమున హాలాహలవిషము పుట్టలేదె? బంగారుగనులులో బొగ్గులుండవే? పూవుఁదోఁటలలోఁ జికిలింత మొలచుటలేదా? మనమందఱము జేరి వీనికిబట్టాభిషేక ముచేసినందుకు మనమీఁదనే వీఁడుధ్వజమెత్తినాఁడు. పాలుపోసిపెంచి నపాము యజమానునింగఱచినట్లు వీఁడుమనయెడలనేద్రోహముదలపె ట్టినాఁడు. అయ్యో! వైదికకర్మంబు లడుగంట వలసెనే. క్రతువులు గంగపాలు గావలసెనే! అగ్నిహోత్రము లారిపోవలసెనే. కర్మల మాట యటుండగా రాజుగలిగియు దేశ మరాజకమైన ట్లున్నది. ధ ర్మమునశించినది. అధర్మమున కభ్యుదయము కలిగినది. జారచోరు లు విచ్చలవిథడి సంచరించుచున్నారు. దీనికొక్కటే కర్తవ్యము గలదు. మనమందఱము రాజుకడకుఁబోయి నొక్కసారి ప్రార్థింత ము" అని నిశ్చయించి యప్పుడు వారందఱు జనపాలుని సన్నిధికరిగి వినయంబుగదుర నిట్లనిరి. "నరేంద్రా! మేమొక్క మనవిసేయ వచ్చితిమి. సావధానుఁడవై యాకర్ణింపుము. ఆగ్రహింపవలదు. జన్నములు చేయవలదనియు దానములు చేయవలదనియు హోమ ములు చేయవలదనియు నీవు చాటింపఁ జేసితివి. ఇది నీకు తగదు.

పరిజల మతాచారములతోడ రాజెన్నఁడును జోక్యము కలుగఁజేసి కొనఁగూడదు. ఎవ్వారి యిష్టము వచ్చినట్లు వారు పరమేశ్వరు నారాధించుకొనవలయు. నీకిష్టములేనిచో నీవు మానవచ్చును. ఇష్టమున్నవారిని కర్మలు చేసికొననిమ్ము. అదిగాక వైదికకర్మలు లేని దేశము దేశముగాదు. హరి యజ్ఞపురుషుఁడు. యజ్ఞములు దేవతా ప్రీతికరములు. లోకేశ్వరుఁడైన హరికిని దేవతలకు నప్రియంబులు చేసినరాజు వర్ధిల్లఁడు. దైవభక్తి లేని దేశము దగ్ధమగును. దైవనిందితులు వర్ధిల్లరు. ఎవని రాష్ట్రమునందు యజ్ఞాది కర్మములు దానములు హోమములు జరుగవో యట్టిరాజు నశించును. దేవతలు హవిర్భాగములకై యెదురుచూచుచుందురు. యజ్ఞములు లేనిచో వా రుపవసింపవలయును. అది మహాపాతక హేతువు. కావున మఱల మఖంబులు చేసికొనుటకు విధివిధానములగు ననుష్ఠానములు జేసికొనుటకు సెలవిమ్ము." అనవుడు వేనరాజు కాలితొ్రిక్కిన్న త్రాచుఁ బామువలె లేచి మహాగ్రహపరీతచేతస్కుఁడై వారి కిట్లనియె. "చాలు మీవచనములు! విన్నాఁడను. మీరందఱు రాజద్రోహులు. జారకాంతలవంటివారు. జారకాంత తనమగని వంచించి పరపురుషులం గూడు తెఱంగున మీరు నన్ను కన్నుబ్రామి హవిర్భాగముల దేవతల కిచ్చి యారాధించుచున్నారు. దేవత లెవ్వరు? అష్టదిక్పాలకు లెవ్వరు? హరి యెవ్వఁడు? హరి యజ్ఞేశ్వరుండా? నేనే యజ్ఞేశ్వరుఁడను. హవిర్భాగములు మీరు నాకే సమర్పింపవలయు "నావిష్ణుః పృథివీపతిః" యను న్యాయములేదా? నేనే పృథివీపతిని గావున నేనే విష్ణుఁడను. నాకంటెదైవము లేఁడు. నన్నేపూజింపుఁడు. నాకే వందనములు సేయుఁడు. ఇట్లుగాక వేఱు తెఱంగున మీరు వర్తించితిరేని మీరు బ్రాహ్మణులని మహర్షులని స్వాధ్యాయవేత్తలని నేనాలోచింపక క్రూరదండనపాలు సేయుదు. మీ

గడ్డంబులు మీజడలు నన్ను బెదరింపఁజాలవు. జాగ్రత! ఇఁక మీఁద నటువంటి యధికప్రసంగము లెన్నఁడు చేయకుడు. పొండు” అని నొవ్వనాడుటయు నామహాత్ములు మనస్సులు విఱుగ నాగ్రహపూరితులై యావలకుఁబోయి యీతెఱంగున నాలోచించిరి. “అయ్యో! మనము నిష్కారణముగా వానిచేత నిందింపఁబడితిమి. పోనీ. మన నిందలకేమి? సకలలోక నియామకుఁడును సర్వజ్ఞుఁడు సర్వశక్తుఁడు సర్వవ్యాపియు నమిత వేదాంతవేద్యుఁడు నగు శ్రీమన్నారాయణునే వాఁడు నిందించెను. ఈశ్వరనిందకుని పరిపాలనమందు మన ముండ గూడదు. కావున వీనిని సంహరించుట కర్తవ్యంబు. రాజు సజ్జనుఁడై సదాచారుఁడై శిష్టరక్షణమును దుష్టశిక్షణమును జేయుచున్నంతకాలమే మనమాతనియందు భక్తిగలిగి యుండవలయును గాని వాఁడు పాపచిత్తుఁడై ప్రజలను బాధించునప్పుడు వానిని సింహాసన భ్రష్టునిఁ జేయుట దేశభ్రష్టుని జేయుట యవసరమైనప్పుడు వానిం జంపుట ధర్మమేయగునుగాని యధర్మముగాదు. ఇట్టిది రాజద్రోహము గాదు. ప్రజాద్రోహియు దేశద్రోహియు నైన రాజుం జంపుట శాస్త్రసమ్మతము. కాబట్టి వీఁ డవశ్యము వధ్యుఁడు. వేదంబులు సత్యంబు లగునేని మనము మనోవాక్కాయకర్మంబుల దోసంబులు చేయకుందుమేమి పరమేశ్వరుఁడు కలఁడేని జగంబున ధర్మంబు గలదేని ధర్మవిరోధియైన వేనరాజు మృతినొందుఁగాక”

అని శపించుటయు వేనుఁ డంతఃపురమున దన పానుపుపైఁ జచ్చియుండెను. సునీథాదేవి సహజమైన పుత్రప్రేమచేతఁ దనయుని మరణమునకు మిక్కిలికుంది .తనయోగశక్తిచేత వాని శరీరమును గాపాడుచుండెను. దేశ మరాజకమయ్యెను. వేనునకు సంతానము లేక పోవుటంజేసి గద్దె యెక్కుటకు రాజకుటుంబమునం దెవ్వరును లేక పోయిరి. అందువలన మఱల మునుపటికంటె దురాత్ములవలని భ

యంబు పరిజల కధికంబుగా గలిగెను. దుర్నిమిత్తంబులు పెక్కులు పుట్టె. మట్టివానలు గురిసెను. అది కనిపెట్టి సరస్వతీతీరమందున్న మునులు దేశ మరాజకంబగుటచేత తొంటికన్న నధికోపద్రవములు గలుగుచున్నవని తెలిసి రాజవంశంబు వెండియు నుద్ధరింపఁదలఁచి తల్లిచేత సంరక్షింపఁ బడుచున్న వేనుని కళేబరంబు దెప్పించి యాశవము యొక్క తొడను మథించిరి. ఆమథనముచేత నతనియూరువునందు మాలకాకివలెనల్లనై యెఱ్ఱని మీసములును వెండ్రుకలును గలిగి పొట్టికాళ్ళు పొట్టిచేతులు సొట్టముక్కు పెద్ద దవుడలు గల యొకానొక వికృతపురుషుఁడు జనియించెను. వానికి మహర్షులందఱు నిషాదుఁడను పేరువెట్టి యడవులం బ్రదుకుమనిరి. వాని సంతతివా రాటవికులై క్రూరకర్ములై యనాగరికులై వేనుని దుశ్చరితంబులను స్మరణకుఁ దెచ్చుచుందురు.



# పృథుమహారాజు

తాము ప్రారంభించిన శరీరమథనముచేతఁ దమ కోరినరీతిని సత్పురుషుండు జనియింపకపోవుటం జేసి వారు వెండియు వేనుని బాహువులను మథించిరి. ఆబాహుద్వయమునుండి దివ్యతేజోమయుఁడయిన యొకానొక పురుషుఁడును సాక్షాదశ్రీదేవి చందంబున నున్నయొక ముద్దుగుమ్మయు నుదయించిరి. ఆపురుషునకు మహర్షులు పృథుఁడను నామ మిడిరి. అర్చి యను పేర నావధూటి పఱగెను. సమానరూపంబులుగల యయ్యిరువురు నొండొరుల వరియించి దంపతులైరి. మహర్షులు కృతకృత్యులై యానందించిరి. వేల్పులు సంతసంబున విరులవాన గురిపించిరి. మునులు పృథునకుఁ బట్టముగట్టి రాజ్యభార మప్పగించిరి. సకలమంగళ లక్షణ లక్షితుఁడైన యాక్షితిపతి నారాయణాంశంబున జన్మించెననియు హుతాశనుని యర్చివలె వెలయుచున్న నాయర్చి లక్ష్మీదేవి యంశంబున నుద్భవించెననియు బ్రహ్మాదులైన సురముఖ్యులు పొగడిరి. అట్లు పట్టాభిషిక్తుఁడైన పృథుమహారాజునకుఁ సామంతులు ప్రకృతిజనంబులు వెలలేని కానుకల నర్పించిరి. జనంబులే యననేల రత్నాకరుఁడు మణుల కానుకలిచ్చె. పర్వతంబులు పంచలోహంబులు సమర్పించె. కాననంబులు ఫలపుష్పంబుల నులుపా యిచ్చె. వెయ్యేల సకలచరాచర పదార్థంబులు వాని కేదోవిధముగఁ గొన్ని కానుకలు సమర్పించెను. వెండియు నాపృథుపృథివీశ్వరునకు రాజరాజు వీరమయంబైన పీఠంబు నిచ్చె. వరుణుఁడు చల్లని జలకణంబుల నిచ్చునట్టి శ్వేతచ్ఛత్రము నొసంగె. వాయుదేవుఁడు తెల్లని చామరములఁ బ్రసాదించె. ధర్మదేవత కమ్మని తావుల నీను పుష్పహారంబు సమ

ర్పించెను. సునాశీరుఁడు సువర్ణకిరీటంబునిడె. శమనుఁడు దుష్టజనశమ నంబైన ప్రచండమగు దండంబు దయచేసెను. చతుర్ముఖుఁడు వేదమయ కవచంబు ననుగ్రహించె. వందితగీర్వాణియగు వాణి తన శరీరమువోలె ధవళమై స్వచ్ఛమై యమూల్యమైన ముత్యాల సరము నొసఁగె. నారాయణుఁడు నవక్రివిక్రిమంబుగల సుదర్శన చక్రింబును, చంద్రిశేఖరుఁడు చంద్రిరేఖ చిహ్నముగల ఖడ్గమును శైలరాజకన్య శతచంద్రిమను ఫలకమును, శీతకరుఁడు వెన్నెలవలెఁ దెల్ల నగు తురగంబులను త్వష్ట్రుప్రిజాపతి నిరుపమాన వేగముగల రథమును దివాకరుఁడు తేజస్వంతములగు బాణములను, అగ్నిహోతుృఁడు రణరంగంబులనప్రితిహతమగుచాపమును, భూదేవి యోగమయములైన పాదుకలును బ్రసాదించిరి. అదియునుంగాక ప్రిత్యహమును గగనంబు విరులవానలుగురియఁజొచ్చె. మహర్షులమోఘములగు నాశీర్వాదంబులు చేసిరి. సముద్రుఁడు శంఖంబునొసఁగె. వాహినులన్నియు వానియరదంబునకు మార్గము లొసఁగెను. ఇట్లు సకలదేవతానుగ్రహంబులు వడసి లోకోత్తరచరితుృఁడైన యామహారాజును వందిమాగధులు బహువిధంబుల నభినందించిరి. వారికై వాగంబుల నాలకించి చిఱునగవుమొగమునకు వన్నియవెట్ట ధీరోదాత్తుండైన యామేదినీపతి వారలతో నిట్లనె. "వందిమాగధులారా! మీరు నన్నిట్లువిశేషముగాఁ బొగడుటకు నాయందెట్టిగుణంబులును లేవు. గుణంబులుగలవారిని స్తుతియింపఁదగుగాని గుణవిహీనుని నుతియింపవచ్చునే. అదియునుంగాక నేను బాలుండను. మహీపాలనమునం దారితేఱినవాఁడఁగాను పొగడుటకు నాయొనర్చిన సత్కార్యము లింతవఱకెవ్వియును లేవు. నిర్వక్రిపరాక్రములై నిరుపమగుణరత్నాకరులై రత్నాకరంబువఱకుఁగల మహీమండల మాఖండలునట్లు పాలించిన నరనాయకులెందఱో గల్గు.

వారిం గొనియాడవచ్చునుగాని నన్నుం బ్రశంసింపరాదు. ఆత్మస్తుతి చేసికొనుటయు, నొరులుచేయుచుండఁగా విని యూరకుంటయు నుత్తమపురుషలక్షణంబులు గావు. కావున నాయెదుట నన్నుం గైవారము సేయవలదని వేడుకొనుచున్నవాఁడ." అని వైన్యుఁడు పలుక వందిమాగధు లిట్లనిరి. "దేవా! సాలగ్రామము చిన్నదైనను బెద్దదైనను నారాధ్యంబె. పూవుపుట్టినతోడనే దానిలక్షణంబు సువ్యక్తమగునట్లు మానవుని భావికాలవర్తనంబు బాల్యంబునందే దెలియుచుండును. నీగుణంబు లసాధారణంబులు వర్ణనీయంబులు కావుననే మేము వర్ణించుచుంటిమి. వందిమాగధ వైతాళికులవ్యాపారంబు రాజకీర్తనంబ. ఇదిమాకు వంశక్రమాగతంబైన కొలువు. కావున మమ్ముక్షమింపవలయు"నని విన్నవింప వారివచనంబులువిని యానరేంద్రుఁడు మందహాసంబుచేసి యూరకుండె. అతఁడు ప్రజాపాలనము సేయుచుండ జారచోరభయంబు లడుగంటెను. అందఱియందు సమదృష్టిగలిగి వర్తించుటచేత నతనియందు జనుల కవ్యాజమైన ప్రేమకలిగెను. తాను మహారాజను గర్వమునువిడచి యారాజెల్లవారికి దర్శనంబిచ్చుచు నెవ్వరు విజ్ఞాపనముచేసినను దిరస్కారభావము లేక యాలకించుచు నెవ్వారి కేకష్టములున్నను వానిని నివారించుచు సర్వజనరంజకుఁడై దుష్టజనభంజనుఁడై యుండెను. తప్పుచేసినవాఁడు తనయాప్తబంధువుఁడైనను వానిం దప్పక దండించును. సత్కార్యముచేసినవాడు తనకు బరమశత్రుఁడైనను వానిని బహూకరించును. పలుమాటలేల? అతఁడు ప్రజలలోఁ దండ్రిలేనివారికిఁ దండ్రియై సోదరులు లేనివారికి సోదరుఁడై తల్లిలేనివారికిఁ దల్లియై మిత్రులు లేనివారికి మిత్రుఁడై చుట్టములు లేనివారికిఁజుట్టమై యగతికులకు గతియై మహీమండలము పాలించుచుండెను. అట్లు కొంతకాలము నడువ క్రమక్రమంబున భూమి నిస్సారమయ్యెను. పంటలు యథాపూర్వముగాఁ బండవయ్యె. జనుల

కాహారంబు దొరకకపోవుటంజేసి వారు బహుకష్టంబులపాలై పృథుచక్రవర్తిని సమీపించి "దేవా! మీపరిపాలనంబు సర్వజనరంజకంబుగా నున్నది. కాని పంటలు పండకపోయిన కారణంబున మేమాఁకలిచేత మిక్కిలి పీడితులమై తొఱ్ఱలోనున్న నిప్పుచేత వృక్షములు దహింపఁబడునట్లు కాల్పఁబడుచున్నాము. ప్రజలదుఃఖములెల్ల మాన్పఁదగినవాఁడు భూపతియౌగావున నిన్నుశరణుజొచ్చితిమి. రక్షింపవలయు." నని ప్రార్థించిరి. చక్రవర్తి వారిమొఱల నాలించి మనంబునఁ గరంబు కనికరంబుగదుర బెద్దయుండడవు విచారించి యది యంతయు భూదేవివలనగలిగిన యపరాధం బని యూహించి ప్రచండమైన తనవింట బాణంబుసంధించి కోపఘూర్ణితచిత్తుఁడై భూదేవిం దండింపవలెనని సమకట్టెను. అవ్వసుంధరాదేవియు వానియుద్యమం బెఱింగి మిక్కిలి భయంబున గోరూపధారిణియై బరుగిడ మొదలు పెట్టెను. ధనుర్ధరుఁడై యారాజు దానిండఱిమికొని గహనంబులు పర్వతంబులు గడచిపోయెను. ఆతఁడు తన్నింకవిడువఁడని నిశ్చయించుకొని ధారుణీదేవి యాతనికి సాష్టాంగనమస్కారమొనరించి యిట్లనియె. "మహాభాగా! నీకింత క్రోధకారణమేమి? నాయొనర్చిన దోషమేదియులేదు. నీవు సకలభూతశరణ్యుండవు. ఏదోషముచేయని యాఁడుదాని నిట్లు వధింపఁదగునా? పరమేష్ఠిచేత నేనుసృజింపఁబడి యెల్ల జంతువులకు శరీరంబనై భూతధాత్రినై యుంటిని. జలమయంబైన యీవిశ్వంబున జంతుకోటి మునిఁగి చావకుండ నావనై నేనుంటి. నన్ను నీవు వధింతువేని సకలచరాచర పదార్థంబులు సకలప్రాణికోటులు జలంబులమునిఁగిపోవు. విశేషించి నీవు నారాయణాంశసంభూతుండవు. తొల్లి హిరణ్యాక్షుఁడను దానవునికతంబున నేనుసిలుగులంబడినప్పుడు నీవు శ్వేతవరాహమూర్తివై దుష్టనిశాటుని గీటడంచి నీకోరచివర నన్నుందాల్చితివి. నీవుచేసిన యుపకారంబునేనుమరువనేర్తునే?

ఇప్పుడును నేదోసమెఱుంగని నన్ను గావుము." అని వేఁడుకొనుటయు నామె ప్రార్థనంబువిని పృథుమహారాజిట్లనియె "ఓవిశ్వంభరా! నీవు నిస్సారవై జగతీజనంబులకుఁ దగిన తెఱంగున నాహారపదార్థంబుల నీయకయుంటివి. దానంజేసి సకలజంతుక్షోభంబుగలిగె. మానవులు కడుపునిండఁ గూడులేక మలమలమాఁడుచున్నవారు. వారి యార్తినే జూడఁజాల. నీవు ప్రజలకు మహోపకారంబు చేయుచున్నట్లు బలికితివి. ఇదియా నీయుపకారము? ఆవుహూపుదాల్చి పచ్చికయున్నపట్టుల కరిగి గడ్డిమేసి ప్రజలకు సస్యంబుల నోషధులఁ గాలానుసారంబుగా నొసఁగక దిరుఁగుచుంటివి. ఇట్టియధర్మప్రవర్తకురాలవగు నిన్నువధించి నీమేను నువ్వుగింజలంతంత ముక్కలుచేసి బుభుక్షాతురులైన ప్రజలను నీమేని మాంసంపుం గండలచేతఁ బరితృప్తి నొందించెద" అని రోషకషాయితనేత్రుఁడై యాధరిత్రీవల్లభుఁడు పలుకుటయు సుమతి యగు వసుమతి వెండియు నిట్లు విన్నవించె—"కరుణాభరణా! నన్ను వధించిన లాభములేదు. నేను జీవించియుండిన నిప్పుడుగాక పోయిన మఱొక్కప్పుడైన భూతకోటికి సమస్తసస్యంబులఁ నొసంగుదు. నావలననే పంటలుపండును. నావలననే వృక్షములనుండి మధుర ఫలంబులు కలుగును. నావలననే ప్రశస్తములైన సువర్ణాదిలోహములును పనిముట్లుగాజేసికొనుటకై యినుము మొదలగు పదార్థములును సంభవించుచున్నవి. భూతకోటికి నేనే శరీరమునై యుంటిని. కావున కరుణాయత్తచిత్తుండవై నీబాణము నుపసంహరింపుము. భూతవర్గంబు నిరపాయంబుగా జీవించు నుపాయంబు చెప్పెద నవధరింపుము. నేను గోరూపధారినై యుంటినిగదా! నాకుందగిన దూడను గల్పింపుము. అప్పుడు నేను చేఁపుదును. నేర్పుతోఁ గావలసినపదార్థంబులం బిదుకగల వారినిగూడ నేర్పఱుపుము. అప్పుడు నీకామితార్థంబులం బితుకుకొనవచ్చును" అని యుపదేశించిన సర్వంసహాదేవి వచనంబులు శ్రవ

ణానందకరంబు లగుటయు నమ్మేదినీనాయకుఁడు సాయకంబు నుప సంహరించి వింటి యెక్కుడించి యట్లకాకయని మనువును ప్రార్థించి యతనిని దూడగాఁ జేసి తానే దోగ్ధయై తన యఱచేయి పాత్రగాఁ జేసి సకలౌషధులను బిండెను. అంతట సకల సస్యంబులు యథా పూర్వంబుగాఁ బండెను. దేశంబు సుభిక్షంబయ్యె. జనులయార్తి దొరంగె.

ఆసమయంబు కనిపెట్టి సిద్ధసాధ్యగంధర్వవిద్యాధరప్రముఖులైన దివ్యులును పితృదేవతలును యక్షరాక్షస గరుడపన్నగులును, మృగంబులు విహంగంబులు మొదలగు జంతువులును, శైలంబులును తమలో నొక్కొకరిని దూడగాఁజేసి గోరూపిణియైన భూమినుండి కామితార్థంబులు పిదుకుకొనెను. అట్లు హరిమూర్తియైన పృథు చక్రవర్తి ప్రభావమున సకలభూతంబులు తృప్తిచెందెను. అనంతర మా మహారాజు క్రమంబునఁ దొంబదితొమ్మిది యశ్వమేధంబులు గావించెను. నూఱవయాగంబు సేయునప్పుడు యాగమునిమిత్తము నియమింపఁబడిన హయంబు నొక పాషండరూపంబు ధరియించి మహేంద్రుం డెత్తికొని పాఱిపోవుచుండె. అత్రిమహాముని యది యెఱింగి పృథుచక్రవర్తి తనయున కాయుదంతం బెఱిఁగించెను. అక్కుమారుఁడు వింట నమ్ముదొడిగి ప్రచండవేగంబున నాకశాస నుం దరుముకొనిపోయి మేనబూడిదబూసికొని జడలుదాల్చి పోవుచున్న యాయింద్రునిజూచి యతఁ డింద్రుఁడని తెలియక జడదారి నెట్లు చంపుదునాయని శంకించుచుండ నత్రిమహాముని వాఁ డింద్రుఁ డని చెప్పి బాణంబు విడువుమని యుపదేశించెను. బాణంబు తనపైఁ బడునను భయంబున హరిహయుండు హయంబువిడిచి యంతర్ధానంబు నొందెను. అక్కుమారుఁడు వాహనంబునుబట్టి తెచ్చి తండ్రికప్ప గించెను. నూఱుయజ్ఞములు నిర్విఘ్నముగాఁ జేసినవాఁడు దేవేంద్రు

పదము నధిష్ఠించునని వేదశాస్త్రంబులు చెప్పుటంజేసి మహేంద్రుఁడు నూఱవక్రతువు సమాప్తము కాకుండ విఘ్నంబుసేయ సమకట్టి మరల నాహయంబును హరించెను. రెండవసారికూడ రాజకుమారుఁడే యాతని వెన్నంటిపోయి యశ్వంబును దెచ్చి యిచ్చెను. అప్పుడు పృథుచక్రవర్తి యావృత్తాంతమంతయు విని కోపోద్దీపితుఁడై తానే కోదండంబు ధరియించి పాకశాసనుని భంజింపవలయునని ప్రయత్నించెను. అతని సందియంబు నుపలక్షించి ఋత్విగ్గణంబు వాని కిట్లనియె—"రాజేంద్రా! నీవు యజ్ఞదీక్షితుఁడవు. దీక్షయందున్న వారు యాగపశువులం జంపవచ్చునుగాని, తదన్యులం జంపరాదు. అందుచేత నిప్పుడు సంరంభంబు నుపసంహరింపుము. ఇంద్రునిగర్వ మణంచుటకు నీప్రయత్న మక్కఱలేదు. యాగమందు హవిర్భాగంబుఁగొనుట కాతఁ డిక్కడికి వచ్చినప్పుడు ఘోరములైన మారణమంత్రములం బఠించి మేమే యాతని నగ్నిహోత్రున కాహుతి చేసెదము" అనవుడు సంతసించి ధరాకాంతుఁడు యాగంబు నిర్వర్తించుచుండె. సంకల్పసిద్ధులగు ఋత్విక్కుల దృఢనిశ్చయంబు నెఱింగి పితామహుఁడు స్వయముగా యజ్ఞవాటంబునకుఁ బోయి పృథుచక్రవర్తిని ఋత్విగ్గణంబు నుద్దేశించి యిట్లనియె. "మహాత్ములారా! మీ రింద్రసంహారముఁ దలపెట్టితిరి. అది కర్తవ్యము కాదు. అతఁ డమరనాయకుఁడు త్రిలోకాధిపతి. అట్టివానియెడ నిట్టి యపచారము మీరు సేయరాదు. యజ్ఞహయంబు నపహరించుట దోషమే యగును. శతమఖంబులు చేసినవాఁడు మహేంద్రుం డగు నని వేదంబులు చెప్పుచున్నవి కావున తాను త్రిదివ సామ్రాజ్యభ్రష్టుఁడగు ననుభయంబున నాతఁ డపహరించె. ఇదియొక దోసంబగుఁగాక! తప్పు సేయనివా రెందైనం గలరె? ఆత్మసంరక్షణార్థమై చేసినతప్పు తప్పుగాదు. అదియునుం గాక యతఁడు విశ్వమునకు మహోపకారి.

మేఘరూపుఁడై వసుంధరపై వర్షంబులు గురియును. వర్షంబులచే వసుంధర సస్యశాలి యగుచున్నది. సస్యసమృద్ధిచే జంతుకోటి బ్రతుకు చున్నది. కావున నే విధంబునం జూచినను వాసవుఁడు వధ్యుఁడు కాఁడు. ఓ పృథుచక్రవర్తీ! నీవు నూఱుయాగంబులు చేసిన ఫలంబు నీ కిచ్చెద. కావున నీయజ్ఞ మిప్పుడు మానివేయుము. నీసంరంభంబు చాలింపుము." అని లోకపితామహుఁ డానతిచ్చుటయు, రాజును బుత్విగ్గణంబులును, దమ ప్రయత్నంబులు మానిరి. దేవేంద్రునకును వైన్యునకును బ్రహ్మ సంకల్పంబునం జేసి గాఢమైత్రి సంఘటిల్లె. రాజు యథావిధిగా నవబృథస్నానముచేసెను. చతుర్ముఖుండు నిజమందిరమున కరిగె. హోతలకు నుద్గాతులకు బుత్విక్కులకు పుడమితేఁడు భూరిదక్షిణలిచ్చి వారిని సంతృప్తులంజేసి యనిపెను. దేవతలతని కనేకవరము లిచ్చిరి. కేవలము శతమఖుఁడు గాకపోయినను వైన్యుఁడు శతమఖునంతవాఁడై యెంతవాఁడును దన్నుఁ దేరి చూడ శక్యముగాని ప్రతాపముతోడను వైభవముతోడను వర్ధిల్లెను. అంత నొకనాడు పరమభాగవత శ్రేష్ఠుఁడైన యారాజచంద్రుని కడకు మహేంద్రుని వెంటబెట్టుకొని శ్రీమన్నారాయణుఁడు పోయెను. పరమయోగులు వేలకొలది యేండ్లు ఘోరతపములుచేసి వెదకినను గనఁబడని దేవదేవుడు తనయింటి కయాచితముగ స్వయముగ వేంచేయుటంజేసి రాజువర్ణింప రానంత మహానందము నొంది సాష్టాంగదండప్రణామముచేసి యానందభాష్పములు విడుచుచు నిలువంబడియుండ ప్రసన్నుఁడై హరి వానికిట్లనియె "వత్సా! మహేంద్రుడు నీయెడ నపరాధము సేయుటంజేసి క్షమియింపుమని నిన్ను వేఁడుకొనుటకై వచ్చినాడు. క్షమాకవచంబుగల నీవు వానితప్పు సైరింతువుగాక! జ్ఞానమార్గముచేత మోక్షంబు పాలింపఁగల నీకు హింసకర్మతోఁగూడిన యాగంబులేల? భూరిసంభావనలచేతను నిర

తాన్నపరిదానములచేతను, మఱి యితరదానములచేతను యజ్ఞద్వారంబున భూసురులను దీనులను రక్షించుటకై యిట్లు సేయుచుందువని తలంచెద" నని వాక్రుచ్చెను. అమృతోపమానములగు నాతని వచనంబులు విని రాజు పరిహృష్టాంతరంగుడై "దేవా! త్రిలోకాధినాథుఁడగు నిర్జరేంద్రునిచేత క్షమాపణము బడయుటకు నే నెంతవాడ. నందనోద్యానమున మందారపారిజాత హరిచందనకుసుమంబుల పుష్పాదులచేత భావనములైన యాతని పాదరేణువులనైన నాకిరీటాగ్రమున ధరియించుటకు నేనసర్హుడను. కార్ముకంబెత్తి నే నామహాత్మునిమీద యుద్ధసన్నద్ధుండనైనందుకు నేనే యాతనికి క్షమార్పణము సేయుచున్నాడను" అని నిర్జరేంద్రునకు నమస్కరించి యున్న యా నృపపుంగవునిగనుంగొని నారాయణుఁడు వాని వినయంబునకుఁ బరమప్రీతుఁడై వానికనేకవరముల నొసఁగి యింద్రసమేతముగ నంతర్ధానము చేసెను. అనంతరము సనకసనందనాది దివ్యమునులు రాజచూడామణిం దర్శించి యతని కనేక ధర్మోపదేశంబులం జేసిరి. తరువాత నతఁడు ముదిమి గదురం జేసి రాజ్యంబు పెద్దకొడుకున కభిషేకంబుచేసి తక్కిన కొడుకుల నతనికి సామంతరాజులుగఁ జేసి ధర్మపత్నీసమేతుఁడై తపోవనంబున కరిగెను. అచ్చటఁ గొన్నిదినములు దుంపలుతిని పిమ్మటఁగొన్నినాళ్లు పండ్లుమెసవి యవ్వల కతిపయవత్సరంబులు జలభక్షణంబు గావించి యనంతరము కొంతకాలము వాయు వాహారంబుగఁ జేసికొని మహోగ్రగ్రీష్మకాలంబున మధ్యాహ్నవేళలఁ బంచాగ్నిమధ్యంబున నిలిచి యాకాశమంతయు నొక్కనీరుబుగ్గగా జడిగొన్న కాలమున వస్త్రంబుమీఁద గప్పుకొనక మహావర్షంబున నిలిచి సకలజంతుకోటి గడగడవడకించు శీతవాయువులు వీచువేళలఁ జల్లనినీళ్ళఁ గుత్తుకబంటిగ నిలిచి ఘోరతపంబుచేసి తుట్టతుదకు నారాయణ చరణారవిందము

లయందు హృదయభ్రిమరంబు నిలిపి యోగమార్గంబున బ్రాణంబులు విడిచెను. ఆతనిభార్య మహాపతివ్రత యర్చి యుత్తమక్షత్రియాంగనలకుఁ దగిన తెఱఁగున భర్తృసహగమనముచేసి దేవకాంతలు భళిభళి యని మెచ్చునట్లు పతితోఁగూడ వైకుంఠంబున కరిగె. ప్రజారంజకుఁడై ధర్మకార్య నిరతుఁడైన భూపాలకుఁ డిహపరలోకములందు నఖండసౌఖ్యంబుల నందుట యక్కజమా? పృథుచక్రవర్తివంటి రాజులు మేదిని బాలింతురుగాక! వేనునివంటి రాజులు శత్రుమండలములం దైనను రాజ్యము సేయకుందురుగాక!

---

## దక్షుఁడు

నవబ్రహ్మలయందు దక్షుఁడు ముఖ్యుఁడు. అతని కనేక భార్యలుగలరు కళత్రంబులవలన బహుస్త్రీపురుషసంతానంబు బడసితన కన్యకల ననేకుల కిచ్చి వివాహములుచేసె. అదితియను కూఁతును మహానుభావుఁడైన కశ్యపప్రజాపతికిని రోహిణి మొదలగు నిఱువదియేడుగురు కన్నియలను జగదేకసుందరుడగు చందురునకును సతీదేవిని బరమేశ్వరుఁడగు చంద్రశేఖరునకును నిచ్చి వివాహముచేసెను. సతీదేవి దక్షుని పుత్రికయగుటచే దాక్షాయణి యనుపేరం బరఁగను. ఒకసారి కొందఱు బ్రహ్మలు సత్రయాగము సేయుచుండిరి. చతురాననుఁడు మహేశ్వరుఁడు నారాయణుఁడు దేవేంద్రుఁడు మున్నగు మహాత్ములందఱు నాసత్రయాగమునుఁజూచు వేడ్కనరుదెంచి యుచితాసనంబుల గూరుచుండిరి. దిక్పాలకులు తక్కిన వేల్పులు వారివెనుక నాసీనులయిరి. నారదాది బ్రహ్మర్షులుగూడ నచ్చటకి విజయముచేసిరి. ఆజన్నమును జూచుకుతూహలంబున దక్షప్రజాపతియు నచ్చోటికరిగెను. బ్రహ్మలలోనెల్ల నగ్రగణ్యుఁడగుటచే నతనిం జూచినతోడనే శివుఁడు దక్క దక్కినవా రందఱులేచి బ్రత్యుత్థానముచేసిరి. శివుఁడు తన్నుగని లేచి యెదురు రామికి నమేయకుపితస్వాంతుఁడై దక్షప్రజాపతి నేత్రయుగమునుండి కోపాగ్ని స్ఫులింగంబులు చెదరఁ బండ్లు పట

పటం గీలుచు నెల్లవారు విన నిట్టులనియె. "ఓ వేల్పులారా! ఓము నులారా! బ్రహ్మతరువాత బ్రహ్మయంతవాఁడనైన నేను సత్రయాగసందర్శనార్థమై వచ్చుటంజేసి మీరందఱు నాయెడంగల భక్తివిశేషంబున మీమీ యాసనంబులనుండి లేచి ప్రత్యుత్థానముచేసి నా యడుగులకు నమస్కరించిరి. ఈగరళకంఠుఁడు నాయల్లుండయ్యు నన్నుఁజూచి పీఠమునుండి లేవఁడయ్యె. నాకెదురురాడయ్యె. నాకు నమస్కరింపఁడయ్యె. కుశలప్రశ్నలడిగి నన్ను బలుకరింపఁడయ్యె. వీని కింత గర్వమెందుకు? సకలచరాచరసృష్టికర్తయై, వాణీవల్లభుఁడై చతుర్ముఖుఁడైన బ్రహ్మదేవునికన్న నితఁడు గొప్పవాఁడా? విశ్వరక్షణపరాయణుఁడై లక్ష్మీనాథుఁడై పురుషోత్తముఁడైన నారాయణునికన్న గొప్పవాఁడా? త్రిలోకాధినాథుఁడై కామధేనువు చింతామణి కల్పవృక్షములు మొదలగు లోకైకపూజ్య పదార్థములకు నాయకుఁడై మహావిభావసంపన్నుఁడైన యింద్రునికన్న గొప్పవాఁడా? ఇది యేమిచూచుకొన్న ౘుళ్ళుపాటు? వీనికున్న యైశ్వర్యమేమి? ఉండబోయిన నిల్లులేదుగదా. ఇల్లు వల్లకాడు. పరిజనులన్ననో దయ్యములు, భూతములు. బిచ్చమెత్తుకొనినగాని తినుటకన్నములేదు. పట్టుమనియొకపాత్రమైన లేదు. కపాలమె వీని కన్నపాత్ర. శరీరముమీఁది యలంకారములఁ జూతమన్న నన్నియు ద్రాఁచుపాములే. కంఠమునిండ విషము. చక్కదనముమాట చెప్పనేయక్కఱలేదు. ఎగుడుదిగుడు కనులు. దేహమునిండ బూడిదబూసికొని తిరుగును. తనమిత్రుఁడైన నారాయణుఁడు చక్కని పీతాంబరము ధరించియుండ నితఁడు తోలుగట్టుకొని తిరుగును. శరీరమా పాండురోగి దేహమువలెఁ దెల్లగానుండును. మఱ్ఱియూడలవలె నెత్తిమీఁద గావలసినన్ని జడలు. ఆమీఁద గంగాధరుండు. ఆతఁడు తాల్చిన వస్తువులలో నెల్ల రవంతయందమైనది నెత్తిమీఁదనున్న చంద్రరేఖ

యే. ఒకచేతిలో త్రిశూలము. రెండవచేతిలో లేడిపిల్ల. ఆహాహా! ఆ చక్కదనమేమి? సంసారస్థితియేమి? ఆసంపదయేమి? వెయ్యినాలుకలుగల యాదిశేషుఁడైన వీనిని వర్ణింపఁజాలఁడు. ఇట్టి దివ్యమంగళుఁడు నిట్టి యనాచారుఁడు నిట్టి యసంగతుఁడు నాయంతవానినవమానించుచున్నాఁడు చూడుఁడు. నన్ను పరాభవించుటకు వీఁడెంతవాఁడు. ఎఱుఁగకపోయి మాణిక్యమువంటి నాకూఁతును సతీదేవిని వీనికిచ్చి పెండ్లిచేసి యాబిడ్డ గొంపదీసితిని. కట్టగుడ్డలేక తినుటకన్నములేక కాపురముండ యిల్లులేక పాపము పెనుభూతములనడుమ నీనిర్భాగ్యునితో గలిసి కాపురముచేయుచున్న మహాపతివ్రతయైన యాయిల్లాలు గాఁబట్టి గర్భదరిద్రుఁడైన వీనితో నిన్నాళ్ళు కాపురము చేసినదిగాని మఱియొకతెయైనచో దిక్కుమాలిన కాపురము చేయలేక పుట్టినింటికిం బోయియుండును. నాబిడ్డను నేను మెచ్చుకొనగూడదుకాని, దాని మంగళసూత్రప్రభావముచేతనే వీఁడుదీర్ఘాయుష్మంతుఁడై యున్నాఁడు. బ్రహ్మదేవుఁడు విష్ణుమూర్తి నన్నెంతోబ్రతిమాలి చెప్పబట్టి బంగారువంటి నాబిడ్డను వీనికిచ్చి వివాహముచేసితిని. నాబిడ్డనిచ్చి నేను వీని నొకయింటివానిని చేయనిచో ఘోటకబ్రహ్మచారియై వీఁడు దేశములవెంటఁ దిరుగుచుండవలసినదే గాని వీని స్థితిగతులెఱిఁగినవాఁ డెవఁడైన వీనికి తన బిడ్డనిచ్చునా! నిష్కారణముగా నాబిడ్డ గొంతుకోసికొంటిని. పిలిచి పిల్లనిచ్చి పెద్దఱికము చేసినందుకు వీఁడు నాయెడ నెంతద్రోహము చేసినాఁడో చూడుఁడు అల్లుఁడని పేరుపెట్టి పిండిబొమ్మనుచేసి పీటమీఁద బెట్టితిమా యదియెగిరియెగిరి పడునను లోకములోగల సామెత నేఁడు నిజమైనది. శంకరుఁడనఁగా మేలుచేయువాఁడుగదా. శివుఁడనఁగా మంగళపురుషుఁడుగదా. ఇట్టి శుభనామము లీనిర్భాగ్యునకుఁ దగునా? గరళకంఠుఁడు గంగాధరుఁడు కపాలధారి, నాగభూషణుఁడు నను నామధేయములే

వీనికిఁ దగినవి. శ్రీమన్నారాయణుని చరణారవింద మకరందమైన యాకాశగంగను వీఁడు శిరసావహించుటచేత జగములలో వీని కించుక గౌరవము కలిగినది. దానిచేత నలుగురిలోఁ దిరుగవలసిన యోగ్యత కలిగినది. అది లేనిచో వీఁడెందుకుం గొరగాఁడు." అని నోటికి వచ్చినట్లు దూషించుచున్న దక్షునకు వెఱచి వేల్పులెవ్వరును వానికి యెదురాడరైరి. అమేయపరిభావముగల పరమేశ్వరుని దూషించుట వారికిష్టములేదుగాని యెదురాడుటకు సామర్థ్యములేకపోయెను. శంకరుఁడు తనమామనోట వెడలుచున్నయసభ్యములు నశ్లీలములు నమంగళములునగు వచనములను వినియు నిండుకుండ తొణకదన్నట్లు తానుసహజముగ రుద్రుఁడయ్యు రౌద్రిభావమేమియుం దోపనీక శంభుఁడు శంకరుడను పేళ్ళు సార్థకములగునట్లు గాంభీర్యమునువిడువక యాతని యహంభావమునకు నచ్చెరువందుచు మందహాసముచేసి యూరకుండెను. అప్పరమేశ్వరుని శాంతమునకు దాంతమునకు దేవగణములెల్ల నద్భుతమునెంది పలుతెఱంగుల నాతనిమెచ్చిరి. అట్లుదూషించుటతోఁ దనివినొందక దక్షప్రజాపతి రుద్రునకు యాగములయందు హవిర్భాగములు లేకపోవుగాకయని శపించెను. రుద్రునకు భాగములేకుండ జన్నములుసేయుట యసంభవమని యెఱిఁగి యాశాపము వ్యర్థమేయని దేవతలుతలంచిరి. పిమ్మట గొంతకాలమునకు దక్షప్రజాపతి యొకయజ్ఞముసేయఁ దలపెట్టెను. దానిలో సదాశివునకు హవిర్భాగములేకుండఁ జేయసంకల్పించెను. ఆమఖమునిమిత్తము దక్షుడు శతమఖుఁడు మొదలగు దిక్పాలకులను జిత్రరథుడు మొదలగు గంధర్వులను సిద్ధసాధ్యవిద్యాధరులును, గిన్నరకింపురుషులను యక్షరాక్షసులను, గరుడపన్నగులను స్వయముగాఁబోయి యాహ్వానముచేసెను. కాని శంకరునిబిలువఁడయ్యె. పూర్వక్రోధముమనసునందుంచుకొని యాతఁడీయకార్యముగావించెను. ఎల్లవారిం బిలిచి

తన్నుఁ దనమగనిఁ బిలువకపోవుటచే గారాబుకూఁతురు మనసుచిన్న పోవునని యతఁడు తలంపఁడయ్యె. ఈపరాభవంబున కామెఖేదపడునని మనంబున భావింపఁడయ్యె. క్రోధమేమి సేయింపదు? అది పౌర్వాపర్వములు విచారింపనిచ్చునా? ఉచితానుచితముల భావింపనిచ్చునా పాత్రాపాత్రత గననిచ్చునా?

అట్లు దక్షప్రజాపతిచేత నాహూతులై పురుహూతుఁడు మొదలుగా సఖిల దేవతలు భృగువుమొదలగు మహర్షులును దక్కిన వారును గ్రతువుజూచు కుతూహలంబున దక్షునిగృహంబునకు జనిరి. సిద్ధవిద్యాధరకిన్నరాంగనలు దివ్యవిమానములెక్కి తమభర్తలతో సరససల్లాపములాడుచు నాయాగంబునకుఁ బోవుచుండ దాక్షాయణి కైలాసపర్వతముమీఁదనుండి వారుచెప్పుకొనుమాటలువిని తండ్రి యత్తఱి ప్రశస్తమగుయజ్ఞము చేయుచున్నవాఁడని తెలిసికొని దాని సందర్శించు కుతూహలంబున నచ్చటికిఁబోవలయునని యుబలాటపడి మహేశ్వరుని సాన్నిధ్యంబున కరిగి వినయంబున నాతనికిట్లనియె. "దేవా! నాతండ్రి గొప్పయాగము చేయుచున్నాఁడట. విమానము లెక్కిపోవుచున్న దివ్యులు చెప్పుకొనుచుండఁగా నేనావార్తవింటి. సమస్త దేవతలక్కడికి బోవుచున్నారుగావున మనముగూడ నరుగుద మని నాకెంతోకుతూహలము కలుగుచున్నది. ఆక్రతువు చూచుటకు నాచెల్లెండ్రు భర్తలతోఁగలిసి యచ్చటికి వత్తురు. నేను వారిని జూచి చిరకాలమైనది. కన్నులకరువుదీర నొకసారి నాముద్దుచెల్లెండ్రిం జూడ గలుగుదును. కావున మనమిద్దఱ మక్కడికిఁబోవుదమురండు. మఱదుల పిల్లలను జూచుటమీకుఁగూడ గావలసినదేకదా! కైలాసపర్వతము నుండి పెద్దబావగారు విచ్చేయుదురని వాండ్రెంతో ముచ్చటపడు చుందురు. మిమ్ముంజూచి వాండ్రుమిక్కిలి యానందింతురు. మన మిద్దఱముకలిసి మాతండ్రిగారి యింటికింజని చిరకాలమైనది. మా

తల్లినిగూడ నేను గనఁలారఁగని యెంతోకాలమైనది. ఎన్నిసారులో నన్నామె రమ్మని వర్తమానములంపినదిగాని, నేను పోజాలనైతిని. నేను రానందుల కామెయెంతయు విచారించుచుండును. ఇప్పుడచ్చటికిఁ బోయితిమేని వీరువారనక యెల్లచుట్టముల జూడవచ్చును. యజ్ఞములు వివాహములు మొదలగుకార్యములయందెకదా బంధువులందఱుఁ జేరుదురు. చుట్టములతోఁగలసి ముచ్చటలాడుటకన్న నానందకరమైన కార్యమేది? ఇట్టియుత్సవము లెంతకాలమునకోగాని తటస్థింపవు. తటస్థించినప్పుడు పోకపోతిమేని చుట్టాలమొగములెట్లు చూడగల్గుదుము? వచ్చుచు బోవుచుండినగదా చుట్టరికములు నిలుచును. ఒకవేళ యాగదర్శనకుతూహలము మీకు లేదందురేమో మీరు యజ్ఞేశ్వరులు. యజ్ఞము మీరు. హవిస్సు మీరు. హోతమీరు. అగ్ని మీరు. మీయందుసకల జగంబునిలుచు కావున మీకట్టికుతూహలముండకపోవచ్చును. పుట్టినింట జరుగుచున్న యుత్సవము జూచుటకాఁడుపడుచు నకువేడుకయుండదా? తల్లిదండ్రులు యజ్ఞదీక్షవహించి యగ్నిహోత్రములు సేయుచుండ మాచెల్లెండ్రిందఱు సమస్తభూషణ భూషితలై జననీజనకులపక్కను గూరుచుండ బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి గణములు సమస్త దేవతలు సభాసదులై యుండ, సామగానముతోడ నాప్రదేశములు ప్రతిధ్వనులు చేయుచుండ నాతండ్రి యజ్ఞవాటము జూచుటకు నాకెంతో వేడుకగలుగుచున్నది. ఒకసారి నాజన్మస్థానము చూడనిండు. వృద్ధులైన నాజననీజనకులం జూడనిండు. చాలకాలముకిందటనత్తవారింటికరిగిననాచెల్లెండ్రంజూడనిండు. ఎప్పుడు పుట్టినింట నుత్సవములువచ్చు? ఎప్పుడు తెక్కలుగట్టుకొని యక్కడ వ్రాలఁగలను? ఎప్పుడు తల్లిమొగము జూతును?" అని యాఁడుపుట్టువు బుట్టినప్రాలఁతి మనంబున నివ్విళ్ళూరుచుండును. మీతండ్రి మనలంబిలువలేదుగదా యెట్లుపోఁదలంచెదవందువేని వినుండు- పుట్టి

నయింటికి మెట్టినయింటికి బంధుమిత్రుల గృహములకు బిలువకపో యినను వెళ్ళవచ్చును. ఇది పెద్దలయాచారము. నీతండ్రి క్రోధావిష్టు డై యుండుటం జేసి నీవచ్చటికిం బోవరాదు. ఆహ్వానములేక నీవందు బోవుదువేని నిన్ను నీజనకుడు తప్పక యనాదరణముసేయును. పదు ను మొనలుగల యలుంగులచేత గాయములైనం బడవచ్చుంగాని,చేరు నచుట్టములచేత మర్మభేదకములైనమాటలం బడంజాలము. అతండు నిన్నవమానించినపక్షమున నీవదియోర్వంజాలవు. గాన నెంతయు నెగ్గుపుట్టు కావున నెన్నితెఱంగులజూచినను దక్షగృహంబునకరుగు టుచితంబుగాదు. కాదు కూడదంటివేని నీవరుగవచ్చు" నని పాణినా థుండు వలుక దాక్షాయణి "పోకయుండుటకు మనసొప్పదు. పోయిన బరాభవము జరుగునేమో యేమిసేయుదు" నని తద్దయుం బ్రొద్దు విచారించి యెట్టకేలకు స్త్రీస్వభావంబున మనస్సు నిలుపలేకపతిచేసిన హితోపదేశంబు పెడచెవినిబెట్టి తనకు నర్ధాంగమిచ్చిన యామహాత్ము ని విడనాడి మనంబున గాఢవిచారంబు గ్రిమ్ముకొన జనకునియజ్ఞ సందర్శనమునకే పయనమయ్యెను. ఆమెచిత్తవృత్తి యెఱింగి రుద్రుని యనుచరులగు ప్రమథులు వేయిమంది యయ్యంబికతోంగూడ పయ నమై యీశ్వరుని వృషభవాహనముమీద నామెనెక్కించి యామె యలంకారముల నన్నిటిని దీసికొనిపోయిరి. చనిచనివారందఱు నిరం తరప్రయాణంబులుజేసిదక్షునియజ్ఞవాటముగాంచియందుబ్రవేశించిరి. దక్షుండు సతీదేవింజూచియు చూడనట్లుండి పలుకరింపండయ్యె. ఆతనివలనభయంబున దేవతలు మహర్షులు నామెం బలుకరింపరైరి. తల్లియు సోదరులుమాత్రి మెదురుగావచ్చి యించుక యాదరించి సంభావించిరి. కాని తండ్రిచేసిన యవమానంబు కతంబున నామె వారుగావించిన యాదరణంబు సరకుగొనక వారు కౌంగలించి క్షేమ మడిగినం బ్రత్యుత్తరమీయక తలవంచుకొని కన్నులనీరుదొరంగ

నూరకుండెను. దీనాననయగు నామెయవస్థంజూచి రుద్రపూజాశూన్యమగు నామఖముంజూచి గర్వోన్మత్తచిత్తుఁడైన దక్షునిం జూచి తొల్లి దాక్షాయణి వెంటవచ్చిన ప్రమథగణంబు ప్రచండకోపంబున నాదక్షుని నిర్మూలింపనుద్యుక్తులైరి. కాని దాక్షాయణి వారిసంరంభంబునుడిపి దివ్యసభామధ్యంబున నిలిచి రోషకషాయితంబులై చింతనిప్పులవలె మెఱయుకన్నులతో నింద్రనీలపుంగణికలవలె నిగనిగనిగ్గులు వెదజల్లుచుఁ గోపాగ్నినుండి వెలువడిన ధూమరేఖలో యనునట్లులున్న కనుబొమలలో నస్తమించుసూర్యబింబమువలె నున్ననెఱ్ఱని నెమ్మొగముతో నెల్లవారికి నాఁడు మహిషాసురుం గడ తేర్చిన భయంకరరూపము జ్ఞప్తికిఁదెచ్చుచు మేఘగంభీరంబులైన భాషణంబులతో జనకున కభిముఖియైయుండి యిట్టులనియె. "ఓదక్షుఁడా! నీవు బ్రహ్మలలో నగ్రగణ్యుండవని గరువంబున విఱ్ఱవీగి నీకన్న వేయిమడుంగులు ప్రభావంబుగల మహానుభావుని దేవదేవుని భక్తక్షేమంకరుని శంకరుని దిరస్కరించి పలికి యామహాత్మునియందలి ద్వేషంబుకతంబునఁ బ్రియపుత్త్రికనైన నన్నుసైతము నవమానించితివి. అష్టైశ్వర్యసంపన్నుడును సకలలోకకల్యాణసంధాయకుండును రజితాచలనివాసుండును మేరుశైలధనుర్ధరుఁడును ధనదునకాప్తమిత్త్రుఁడును లక్ష్మీపతికి సంగడికాడునునైన పరమేశ్వరుని నోటికివచ్చినట్లు నీవు తూలనాడితివి. ఈపంచభూతములును సూర్యచంద్రులును హోతయు ననునెనమండ్రుగురు నాతనిమూర్తులు కారె? అతఁడష్టమూర్తి యనుమాట నీవువినలేదా? అతనికిల్లులేదని దూషించితివట! విశ్వమెల్లయిల్లుగాఁగలవానికి నొకయిల్లనియుండునే? కనకపాత్రములందు భుజించుచున్నమీరు కపాలపాణియైన శూలపాణికన్న నధికులే? కనకాంబరంబులు కట్టినవేల్పులు చర్మధారియైన శివునకుఁ గింకరులుగారె? తనభక్తులకెల్ల వైరాగ్యము బోధించుటకై తాను

సకలసంపదలు గల్గియు మహేశ్వరుఁడు విరాగియై నిరాడంబరజీవనము నేయుచున్నవాఁడు. అర్ధనారీశ్వరుఁడయ్యు దానుజితేంద్రియులలో నగ్రగణ్యుఁడయ్యె. ఇంతమాత్రము నీవెఱుంగక నోటికివచ్చినట్లు కారులఱచితివిగదా. నీవొక్కఁడవ యాతని నిట్లు దూషించిపరాభవింపఁ జూచితివిగాని యీమహేంద్రుఁడీ నారాయణుఁడీ చతుర్ముఖుఁడీ దిక్పాలకులు వానిచరణారవిందములను దమకిరీటమాణిక్యదీధితులచే ద్రికాలములయందు నివాళించుచున్నారు. అట్టివారు వానికిభక్తులై సేవించుచుండ నీవంటియధికులు వానిని సేవించిన నేమి సేవింపకున్న నేమి? మత్తగజేంద్రంబు చనుచుండ నీచుశునకంబులు మొఱగినట్లు గజారాతింగూర్చి నీవు తులువ మాటలాడితివి. అందుచేత నీనీచత్వంబును నీమనోలఘుత్వంబును లోకంబునకుఁ దేటపడినవిగాని యామహాత్మునకుఁగొఱంతగోరంతయులేదు. అందువలన నీవు మహాపాతకము మూటగట్టుకొన్నవాడవు. అనేకబ్రహ్మాండమండితంబైన యీవిశ్వంబు క్షణమాత్రంబున నతఁడు నశింపఁజేయఁ గలఁడు. లీలామాత్రంబున సృష్టింపఁగలఁడు. నీవకాదు ముప్పదిమూఁడుకోట్ల నిర్జరులాతని పాదరేణువైనను శిరంబునదాల్పనర్హులుగారు. ఆతనిప్రభావంబు నీనెఱుంగవేమో ? ఈసదస్యులందఱకు విదితంబు. సురాసురులు క్షీరసాగరము మథించినప్పుడు లోకభయంకరంబుగా హాలాహలవిషంబు దానజనించి విశ్వంబు దహించుచుండ వేల్పులుతొలివేల్పులు రక్షించువారులేక హాహాకారంబులుచేసి కావుకావు మని వేఁడ బ్రహ్మేంద్రాదులును నారాయణుఁడును జేయునదిలేక యూరకుండ నత్తటి హాలాహలం బల్లోనేరెడు మ్రింగిన తెఱంగున మ్రింగి విశ్వరక్షణము గావించినవాఁ డెవఁడు? ఆమహాకార్యంబునకు నీ మహేంద్రుఁడుసాక్షి. నారాయణుఁడుసాక్షి. పంకజాసనుఁడు సాక్షి. త్రిపురాసురులు విజృంభించి యాకాశంబున పట్టణంబులు కట్టుకొని ముజ్జగంబుల మం

గలంబున వేచినట్లు వేచి గాసిలఁ జేసిననాఁడు నళినగర్భుండును నారాయణుండును వారిం దెగటార్పఁ దమచేతగాదని యూరకున్న సమయంబున భూమి రథంబుగా వేదంబులు గుఱ్ఱంబులుగా బ్రహ్మదేవుఁడు సారథిగా సూర్యచంద్రులు చక్రంబులుగా కనకాద్రి విల్లుగా పద్మనాభుండు బాణంబుగాఁ జేసికొని వారి మూడుపట్టణంబులు భస్మంబుగావించి లోకకంటకులగు నాదానవులను దనకోపాగ్ని కాహుతులం జేయ లేదే? ఆగమములన్నియు నాతని మహిమములఁ బొగడుటలేదే? నీవంటి నీచుఁడు పొగడినఁ దెగడిన నొక్కటే. నాకాపురము చక్కగాలేదని నీవంటివఁట. నాకాపురంబునకేమి? నాది నిక్షేపమువంటి కాపురము. అట్టి జగత్కర్తయు హర్తయునగు భర్త బహుతపఃఫలంబునంజేసి నాకు సంప్రాప్తించెనుగాని మఱియెవ్వరికిఁ జేకూఱు? నా కాతనిశరీరమం దర్ధభాగము నిచ్చె. అట్టిభర్త యెందైనం గలఁడే? ఆయన కతంబున నేను సర్వమంగళనైతిని. నీకడుపునం బుట్టినందుకు నేను సిగ్గుపడుచున్నదానను. నీవు శివదూషణంబు చేసి యాతనియందు ద్వేషంబుపూని యాయన కతంబున నన్నవమానించితివి గావున నీచేత నవమానింపఁబడిన నాశరీరంబు నామహానుభావుని యర్ధదేహంబున నుండఁదగదు. కావున దీని నిప్పుడు నాశనంబుచేసెద. ఓసభాసదులారా! చూడుఁడు. ఈతనికిం బ్రళయకాలం బాసన్నంబగుటచేత నిట్టిబుద్ధులు పుట్టె. రుద్రపూజావిహీనంబైన యీ క్రతువేల కొల్పనా? వీనిం జూచిన యీపాపపుకన్నులతో మరల మహేశ్వరుని జూడనొల్ల. పాపభూయిష్ఠమైన వీనియజ్ఞవాటంబున బెట్టిన యడుగులు పరమ పావనమైన కైలాసంబునం బెట్టనోప. ఇదేచూడుఁడు. ఇంక నేను నీపుత్రికనుగాను. ఎన్నిజన్మంబులకైన నాకు మహేశ్వరుండె భర్త గావలయు. కైలాసంబు నివాసంబు గావలయు. ఆగరళకంఠునియర్ధశరీరం బే నపేక్షించెద. ఆపన్నగం

బులే భూషణంబులుగాఁగోరెద. ఆస్మశానంబె విహారస్థలంబు గాఁగోరెద." అని నేలఁ జతికిలఁబడి పద్మాసనంబునం గూరుచుండి యోగంబుచేత జాజ్వల్యమానంబగు నగ్నింగల్పించి యాజ్వాలామాలలకాహుతియై క్షణకాలంబున భస్మావశిష్టయయ్యెను. అప్పుడు సభాసదులందఱు హాహాకారంబులు చేసిరి. దక్షునకు వినాశకాలంబు సమీపించెనని కొందఱనిరి. దీనివలనఁ దమకేమి కీడుమూడునోయని శంకించి కొందఱు సన్నసన్నముగ నావలకుఁ దాటిరి. అప్పుడు శివకింకరులగు ప్రమథులు పార్షదులు రోషావేశంబున దక్షుని బరిమార్పనుంకించి యాయుధ పాణులైరి. అదిగని దక్షునిమిత్రుండగు భృగుమహాముని దక్షిణాగ్నియం దభిచారహోమంబుగావించి ఋభునామధేయులగు సహస్రయోధుల సృష్టించెను. వారు విజృంభించి రుద్రపార్షదులను పరాజయము నొందించిరి. అప్పుడు నారదుండు కలహప్రియుఁడగుటచేత సత్వరంబ కైలాసంబున కరిగి మహేశ్వరుని దర్శించి దాక్షాయణిని జనకుం డనాదరణంబు సేయుటయు నామె క్రోధావేశంబున వానిం దూలనాడి యోగాగ్నిచే దన్ను దగ్ధరాలిసిగాఁ జేసికొనుటయు బార్షదులు పరాజయము నొందుటయు లోనుగాఁగల వృత్తాంతము పూసగ్రుచ్చినట్లు తెలియఁబఱచెను.

అది విని మహేశ్వరుఁడు మహోగ్రుఁడై పండ్లు పటపట గొఱికి ప్రళయకాల మృత్యువు తెఱంగున దుర్నిరీక్ష్య తేజుండై జటాజూటమునుండి యొకజడ నూడఁబెఱికి నేలఁ బాఱవైచెను. వైచుటయు నందుండి కాటుకముద్దవలె నల్లనై యాకసమునంటుచున్న నల్లనిశరీరముతోడను నగ్నిజ్వాలలవలె మెఱయుచున్న కఱకువెండ్రుకలతోడను నిప్పులుగ్రక్కుచున్న కన్నుఁగవతోడను అంపములువలె మిక్కిలి కఱకులై భయంకరములైన కోరలతోడను వీరభద్రుఁడు జన్మించి తన వేయిచేతుల నెత్తి రుద్రునకంజలిచేసి నే

నిప్పు డేమిచేయుదునని యడిగెను. అడుగుటయు నవ్వీరభద్రునకు రుద్రదేవుం డిట్లనియె. "నీ విప్పుడ చని మహారభసంబున దక్షుని యజ్ఞవాటంబు బ్రవేశించి దక్షుం దెగటార్చి వానియజ్ఞము ధ్వంసము చేయుము. అచ్చట భృగుమహర్షి మొదలగు బ్రాహ్మణోత్తములు గలరని శంకింపకుము. బ్రాహ్మణతేజంబుకంటె రుద్రతేజంబు వీర్యవంతంబు. నీవు నా యంశంబున జన్మమందితివి. కావున నిన్నీ త్రిలోకంబులలో నెదుర్కొనువారు లేరు. నీవు నాసేనలకెల్ల నధిపతివై శత్రుగణమునెల్ల జయింపుము." అనవుడు వీరభద్రుఁడు పరమేశ్వరునకు ముమ్మారు ప్రదక్షిణములుచేసి రుద్రగణసమేతుఁడై మణిఖచితములయిన కాలియందియల ఝుళంఝుళ నాదము మారుమ్రోయ భూమి గ్రిక్కదలునట్లు విసవిస నడువఁజొచ్చె. ఆసైన్యముల పాదఘట్టనలకు భూరేణువులు లేచి రోదసీరంధ్రమంతయు నావరించి దక్షయజ్ఞవాటమునుగూడ నాక్రమించెను.

అది చీఁకటియని కొందఱు ధరణీపరాగమని మఱికొందఱు సభ్యులు చర్చించి భయపడిరి. తనకూఁతును నిష్కారణముగా నవమానించి దక్షుఁ డామెను మృతినొందించెను. గావున వాని పాపపరిపాక మీరూపము ధరించి వచ్చినదని కొందఱు చెప్పుకొనిరి. సృష్టిస్థితిలయకారణభూతుండై యంతకాంతకుఁడై మృత్యుంజయుఁడై సకలలోకారాధ్యుఁడైన ఫాలలోచనునకు నిర్నిమిత్తముగా నాగ్రహము గలిగించిన దక్షునకు మంగళంబు లేలగలుగును? ఇది వాని వినాశ హేతువైన దుర్నిమిత్త మని కొందఱు వచించిరి. అప్పుడు దక్షునకనేక దుశ్శకునంబులుపొడకట్టెను. అప్పుడురుద్రకింకరులు శంకలేక యజ్ఞవాటము జొచ్చిరి. కొందరు హోమాగ్నుల నార్పిరి. కొందరు సాలలఁ బరశురామప్రీతి గావించిరి. కొంద రాజ్యఘటంబులు నేల గ్రుమ్మరించిరి. కొందరు మునులను బాధించిరి. కొందరు దేవ

తల నిరోధించిరి. వీరభద్రుండు దక్షునిం బట్టుకొనియె. పూర్వము దక్షుఁడు శివుని నిందించుచుండ నది లెస్సయని మెచ్చి దక్షున కు త్సాహంబు గలుగునట్లు కన్నుగీటిన భృగునిబట్టి నందీశ్వరుండు వాని గ్రుడ్లు పీకివైచెను. సభాసదులు హాహాకారంబులుచేసిరి. అనేకులు భయభ్రాంతులయి పరుగులెత్తిరి. వీరభద్రుఁడు సూర్యుని పండ్లూడ దన్నె. నాటనుండియుదివాకరుఁడు పూషుఁడను నామంబునఁ బరగుచుం డెను. దక్షుఁడు శివుని బరాభవించునాఁడు మీసములు గడ్డములు చలించునట్లు భృగుమహర్షి నవ్వెను. అందుచే వీరభద్రుఁడు వాని గడ్డ ములు మీసములు నూడఁ బెఱికెను. అప్పుడు వీర భద్రుఁడు దక్షుని నేలఁ బడవైచి తన పాదంబున వక్షంబు ద్రొక్కిపట్టి ఖడ్గంబుతో వాని శరీరంబంతయు నఱికి మహా ప్రభావసంపన్నతచేత నతఁడు చావకునికి వాని కంఠంబు దెగనేసి యాతల హోమగుండంబున నగ్ని కాహుతిచేసెను. ప్రజాపతులలో నొకఁడైన దక్షునకు సంభవించిన యాఘోరవిపత్తును జూచి భువనం బులాక్రోశించెను. అట్లు సమస్తవిధముల దక్షునిమఖము ధ్వంసంబు గావించి వీరభద్రుఁడు సపరివారముగా వెండికొండకుఁ బోయి నీల కంఠున కావృత్తాంతమంతయు నెఱిఁగించెను. రుద్రగణములచేతను వీరభద్రునిచేతను నానావిధపరాభవంబులం బడసిన దేవతలు బ్రహ్మ దేవునికడ కరిగి తమపడిన బన్నములన్నియు విన్నవించిరి. రుద్రహీన మై దక్షయాగము భంగంబునొందునని తమ ప్రభావమువలన మున్నె యెఱింగి బ్రహ్మయు విష్ణుదేవుఁడును యాగంబునకు రారైరి. అందు చేత వేల్పులు సత్యలోకమునకుం బోయి మొఱవెట్ట నాచతురాన

నుడు వేలుపుల కిట్లనిమె. "తన యంతరమును దన యెదిరియంతర మును దెలిసికొనలేక మహాపురుషుల బరాభవించువాడు చెడిపోవక మానునె?" ప్రధానముగా నుండవలసిన రుద్రహవిర్భాగము లేని యజ్ఞమునకు మీరు పోయితిరి గావున మీకిట్టి పరాభవంబు జరిగె. కావున మీరందఱు చని యమ్మహాదేవుని వేఁడుఁడు. అతఁ డాశ్రిత సులభుఁడు. భక్తవత్సలుఁడు. కరుణాపాథోధి. అపరాధంబులుచేసిన కతమున మీరామహాత్ముని సమీపింప శంకింతురేని నేను మీవెంట వచ్చెద రండు పోదము." అని పయనమయ్యెను. చనిచని వారందఱు సకలకళ్యాణములకు నివాసంబై కమనీయవిలాసంబైన కైలాసంబు నం గని యాకొండమీద రమణీయంబగు వటవృక్షచ్ఛాయను పద్మా సనస్థుఁడై కూరుచుండి నారదునితో సల్లాపములుచేయుచున్న మహే శ్వరుంజూచి వారందఱు భయసంభ్రమంబులు దళుకొత్త సాష్టాంగ నమస్కారంబు గావించి నిలిచిన నాగభూషణుఁడు ప్రసన్నముఖు డగుట జూచి చతుర్ముఖుం డతని కిట్లనిమె. "దేవా! నీమహాప్రభా వంబు దెలియక దక్షుండు విపక్షుండై యీయవస్థం బ్రాపించె. వేల్పులు మూర్ఖులై చెడిరి. భృగువు భగుఁడు మొదలగువారును నీయె డ నపరాధంబు గావించి దండితులైరి. ఇంక వారి తప్పులు సైచి యనుగ్రహింపుము. దక్షుని వెండియుం బ్రదికింపుము. తక్కినవారి నింగూడఁ బ్రసన్నదృష్టిం బ్రోవుము" అనవుడు చంద్రశేఖరుఁడు మందహాసముచేసి యిట్లనిమె. "దక్షుఁడు మేఁకతల గలిగి బ్రతుకుఁ గాక. వీరభద్రునిచేత దెబ్బలుతిని శిథిలాంగులైన దేవతలు ఋత్వి క్కులు నశ్వినీదేవతలవలన నారోగ్యము నొందుదురుగాక. దివాక

రుకు యజ్ఞంబులయందు యజమానుని దంతములతో దనవంతు వచ్చిన పిష్టభాగంబు భక్షించుఁగాక" అని వారు కోరిన కోరికలం దీర్చి వారి ప్రార్థనంబున వారితో గలసి దక్షయజ్ఞవాటమునకుం జనియెను. మేఁకతలతో మరల బ్రతికిన దక్షుఁడు హరునియెడఁజూపిన పూర్వద్వేషంబు మరచి పరమభక్తితత్పరుఁడై తన కారణంబున బ్రాణంబులబాసిన కూఁతుం దలఁచి దుఃఖించి మహేశ్వరునకు నమస్కరించి తాను గావించిన మహాదోషంబు సైరింపుమని పలుతెఱంగుల వేడుకొనెను. శంభుడు కరుణాతరంగితహృదయుఁడై వాని వేడికోలు మన్నించి యనుగ్రహించి వానియాగంబు సఫలంబుగావించె.

---

 

# జడభరతుఁడు



పూర్వకాలమున ఋషభుఁడను నొక మహారాజు కలఁడు. అతనికి నూర్వురుకొడుకులు గల్గిరి. అం దగ్రజుఁడు భరతుఁడు. భరతుఁడనుటచే రఘురాముని తమ్ముఁడైన భరతుఁడో దుష్యంతమహారాజు తనయుడైన భరతుఁడో యని చదువరులు భ్రమింపవచ్చును. వారిరువురలో నీత డెవ్వడును గాడు. ఋషభుడు నారాయణాంశమున జన్మించెను. అతఁడు ధర్మోత్తరముగా ననేకసంవత్సరములు ధరాపరిపాలనముచేసి బ్రహ్మణ్యుడై వార్థకమునందు రాజ్యపరాఙ్ముఖుఁడై పెద్దకుమారుడగు భరతునకు రాజ్యాభిషేకముచేసి తాను తపోవనంబున కరిగి యచ్చటఁ జిరకాలము ఘోరనియమంబులతో నిరంతరతపము జేసి మరల విష్ణుదేవునిలో నైక్యముజెందెను. భరతుఁడు రాజ్యభారము వహించి విశ్వరూపుఁడను రాజేంద్రుని కూఁతురును లావణ్యఖనియు నైన పంచజనియను భామారత్నమును వివాహమయ్యెను. భరతుడు పరిపాలింపకమున్ను మన దేశమున కజనాభంబను పేరుండెను. ఆమహారాజు పరిపాలించుటచే దానికి భరతవర్షమని పేరు కలిగెను. ఆపంచజనివలన నతని కైదుగురు కుమారులు గలిగిరి. అత డనేకసంవత్సరములు నేలనేలి నారాయణప్రీతిగా ననేకయాగంబులుచేసి దేవతలను బితృదేవతలను నగ్నిహోత్రుని సంతృప్తులంజేసి ముదిమిగదిసినపిదప రాజ్యపాలనంబు భారంబగుటయుఁ గుమారుల కప్పగించి చిత్తంబు తపంబున కాయత్తంబుచేసికొని పరమపావనమై ప్రశాంతమై ప్రవిమలమై బహుఫలపుష్పభరితంబైన పులహాశ్రమంబునకుం జనియెను. చని, విషయవాంఛలనుండి చిత్తంబు మరల్చి భక్తిభరితమనస్కుఁడై నారాయణసేవాపరాయణుడై

శమదమాదులకు నిలయుండై ప్రపంచంబును మరచి తపంబు సేయుచుండెను.

ఒకనాఁ డారాజర్షి చక్రతీర్థంబునందు స్నానముచేయుచుండఁగా నిండుచూలుదాల్చిన యొక లేడి యచ్చటకుఁ బోయి మెల్లగా నీరు ద్రావుచుండెను. ఆసమయమున నక్కడికి మిక్కిలి దాపుననున్న యడవిలో సింహ మొకటి భయంకరముగా గర్జించెను. అతిదారుణమైన యాధ్వని విని యాలేడి మిక్కిలి బెదరి యొడలు తెలియక యాకాశముమీఁది కెగిరి నేలఁబడెను. భయముచేతను నాపాటుచేతను నది ప్రసవించెను. లేడిపిల్ల నీటంబడిపోయెను. ఆఁడులేడి వనంబునం బరుగులెత్తి మృతినొందెను. తల్లిలేని యాలేడిపిల్ల నీటంబడి గిజగిజ కొట్టుకొనుచుండ భరతుఁడు దాని దురవస్థంగని జాలినొంది దానికి జలగండంబు దప్పించి బ్రతికించి తన యాశ్రమమునకుఁ గొనిపోయి యచ్చట దానిని బలు తెఱంగులఁ గని పెట్టి పోషించుచుండెను. ప్రతి నిముసంబును దానిమీఁదనె ధ్యానంబు నిలిపి దాని కేమియాపద మూడునో యని కంటికి ఱెప్పయుంబోలె సంరక్షకుఁడై యుండుటం జేసి క్రమక్రమముగా నతనికి నిష్ఠలు నియమములు క్షీణించెను. ఆదిదేవుని చరణంబునకు నిలయంబైన యాతనిహృదయంబు హరిణంబునకు నిలయంబయ్యెను. అతఁడు తనమనంబున నప్పుడప్పు డిట్లు చింతించును. "కటకటా! ఇది పుట్టినయప్పుడ తల్లింబాసి నాపాలం బడినది. దీని నెక్కువమక్కువతోఁ గాచుటయే కర్తవ్యముగాని విడనాడుట యుక్తముగాదు. శరణని వచ్చినవారిని విడుచుట పాపహేతువు. ప్రాణభయం బెల్లజంతువులకు సామాన్యంబు. శరణాగతుండు మానవుడుగాని దానవుడుగాని జంతువుగాని యెవ్వఁడైనను వారి కభయ మొసఁగుట మానవుని ధర్మము. "అహింసా పరమోధర్మః" యని యార్యులు వక్కాణింతురు. అదియునుఁ గాక భూతదయకన్న

నుత్కృష్టధర్మము కలదె? కావునఁ నిది యవశ్యము రక్షణీయము
అనివితర్కించుచుఁదానుకూరుచున్నపుడును లేచినప్పుడునుపండుకొన్న
ప్పుడును స్నానమాచరించునెడను సమిధలు పువ్వులు పండ్లు దుంపలు
కాయలు మొదలగుపదార్థంబులం దెచ్చుతఱిని దేవతార్చనసమయం
బునను జపతపంబులుసేయుకాలంబులను దానిని తనయొద్దనే యుంచు
కొనుచు దుష్టమృగంబులవలన దానికేయపాయంబు కలుగకుండఁ దన
వెంట ద్రిప్పుచుఁ దనకృష్ణాజినముమీఁదనే దానిం బండుకొనబెట్టుచు
నొకప్పుడు మెడమీఁదను మఱియొకప్పుడు తొడమీఁదను వేఱొక్క
యెడ వక్షంబునను దానిని నిలిపిముద్దులాడుచు గారాము పెంపున
దానికి గడ్డిదినిపించుచు దానిదేహంబు మలినమైనప్పుడు నీళ్ళుపోసి
కడిగి తనయంగవస్త్రములతోఁ దుడుచుచు గన్నబిడ్డకంటె మిన్నగా
జూచుచుండెను. ఇన్నిమాట లెందుకు! ఆలేడిపిల్లయె యతనిప్రాణము
అదియె వానికన్నులచందమామ. అదియె యాతనిస్వర్గము అదియె
యాతనిమోక్షము. ఆహాహా! ఏకాలంబున నెట్టిమార్పులు ప్రాప్తిం
చునో నెవ్వఁడుచెప్పఁగలడు? భూమండలమును నంతఃపురమును సకల
భోగములను నాలుబిడ్డలను బంధుమిత్రులను విడచి వైరాగ్యంబునం
జేసి నిరంతర తపోనియమంబున నుండదలచి వనాంతరములకరిగి మహా
దీక్షతోఁ దపముచేయు సర్వసంగపరిత్యాగికి జింకపిల్లతగులంబునం
జేసి మనంబెట్లు మాఱిపోయెనో చూడుడు. అది గంతులువేయునెడ
యాతనిమనము సంతసంబునం గంతులువేయు. దానికేదైన చిన్నదెబ్బ
తగిలిన నాతనిమనంబు పెద్దగాయంబునొందు అదిగడ్డిమేయుటమానిన
నాతఁ డుపవసించు. అట్టులుండ నొకనాఁ డాహరిణశాబకము పర్ణ
శాలముందట నిట్టట్టుఁ బరుగులెత్తుచు నాదెసకు నీదెసకుంబోయి కా
నఁబడదయ్యె. అది కానరామికి భరతుండు దుఃఖభరితుండై యిట్లు
చింతించె. "అయ్యో! హరిణశాబకమా! యెందు బోయితివే? నీవెప్పు

డు వత్తువు? నిన్నెప్పుడు మిక్కుటంబగు మక్కువ గాఢాలింగనము చేసికొందు? అల్లారుముద్దుగా నన్న నీమొగము నెన్నఁడుజూతు? ఎన్నడు ముద్దువెట్టుకొందు? తల్లికడుపునుండి నీటంబడినవాదిగ గారాముసంబెంచిన నన్నెడఁబాసి పోవదగునె? కటకటా! ఏక్రూరమృగంబుబారిబడితివోకదా? నీకెంతకష్టము వచ్చెనే? నిన్ను రక్షింపలేని నా జన్మమెందుకు? నాతపమెందుకు? నీవులేమి నీయాశ్రమంబెంతో చిన్న వోయెనుగద. మున్ను నీవునిక్కి కళకళలాడు నీపర్ణశాల నేఁడు వెల వెలపోవుచున్నది. నాముందటి నింక గంతులు వైచువారెవ్వరు? నా తలమీఁదఁ గూర్చుండు వారెవ్వరు. అయ్యో! నీవులేమి జగమంధకారమైనట్లున్నది. ఆశ్రిమ మాశ్రిమముగా లేదు. నేను జపంబుచేసి కొనునెడ నీకొమ్ములతో నన్ను గోకుచుండెడిదానవు. మరల నెప్పుడు గోకుదువు? నాపూజాద్రివ్యంబులు నీవు పాదములం ద్రొక్కినప్పుడు నేనించుక కోపింప నీవునాపై నలిగి యించుకదూరంబునకుం జని నిలిచి మరల నేబిలుచునందాఁక వచ్చుచుండెడిదానవుగావు. ఈభూదేవి యెంత యదృష్టవంతురాలో? నీపాదచిహ్నంబులు దానిపై మోపుటంజేసి యతిపవిత్రియై మహామునీంద్రులు, బ్రాహ్మణోత్తములు చేయుయాగంబులకుఁ దాను తానకమయ్యె. చంద్రిమండలమునందు లేడికల దని పెద్దలుచెప్పుదురు. అందుచేతనే శతమయూఖునకు హరిణాంకుఁడనుపేరు కలిగె. తనలోనున్న హరిణంబుకన్న నీవెక్కుడు సొగసుగా నుండుటంజేసి యాచందురుడు హరియించెనేమో? పరమేశ్వరుఁడగు శివునిచేతియందు దొక లేడిపిల్ల కలదు. దానికన్న నీవెల్లతెఱంగుల మిన్నయగుటంజేసి పరమేశ్వరుఁడు నిన్ను బొలియించెనేమోకదా? నీవేలోకంబుననున్నదానవు? నిన్నెట్లు గనుగొందు? నిన్నెట్లు రక్షించుకొందు?" నని భరతుండు జపంబుతపంబు చాలించి వైరాగ్యంబు నొకమూలకుంద్రోసి మోహబంధంబునం దగుల్కొని యోగభ్రి

ష్టుండై యుండె. ఇట్లు విచారించుచుండ నెందెందో దిరిగి యామృగ పోతంబు వెండియు నాయాశ్రమంబుజొచ్చి యతనిం జేరె. అల్లంత దవ్వుల దానింజూచినతోడనే యారాజర్షి లేచి యెదురుగాఁబోయి యెత్తుకొని ముద్దాడి "నాతల్లీ! యెందుబోయితివే. నిన్న రేయి నాకు నిద్రాహారంబులు లేవు. నీవు నాపై నింతకాఠిన్యంబు పూనఁదగునే? నీవులేక నేను జీవింపఁగలనని నీవు తలంచితివే" యని దానియొడలు నిమిరి తన నారచీరతోఁ దుడిచి యానందబాష్పాకులితలోచనుఁడై యుండెను. అట్లు కొంతకాలము చన భరతునకు మరణకాల మాసన్నమయ్యె. చరమావస్థయం దతఁడు హరిస్మరణంబుగావింపక హరిణస్మరణంబు చేయుచు "నాప్రాణంబువోయిన దీనిం జూచువారెవ్వరు? నీరువోయువా రెవరు? దుష్టమృగంబుల బాఱిబడకుండఁ గాచువారెవ్వరు? దీనిగతి యేమానోకదా" యని విచారించుచు శరీరంబు విడిచె. ప్రాణోత్క్రమణ సమయమున మనంబున హరిణంబునునిలిపిన కతంబున నత డుత్తరజన్మమున నొక లేడికడుపునం బుట్టి పెరుగుచుండె.

మృగజన్మంబునందుండియు భరతుఁడు తన తపఃప్రభావమునఁ బూర్వజ్ఞానముగలిగి తనమనస్సున నిట్లు చింతించుచుండును. "హా! ఎంతకష్టము. నేను పూర్వజన్మమున మహారాజునై ,పరరాజులనోడించి భూవలయమంతయుఁ బాలించి సురరాజసమానుఁడనై కొడుకులను రాజులనుచేసి పిమ్మట వైరాగ్యమున సమస్తము జయించి తపంబు జేసి లేడిపిల్లం బెంచి దానిమీఁది ప్రేమాతిశయమున నీజన్మమున జంతువు నైతి. వివేకభ్రష్టుల కిట్టి యవస్థగాక యుత్తమజన్మ మెట్లు గలుగును? అయినను నేనీ జన్మమునందు సయితము నారాయణస్మరణంబు సేయుచు నియమంబునఁ గాలము పుచ్చెద." అని నిశ్చయించుకొని తల్లిని తక్కినమృగములను విడిచి యేకాకియై యడవులు

కొండలు దిరిగి పులహ మహాముని యాశ్రమముజేరి యచ్చటనున్న పుణ్యనదీజలములఁద్రావుచు నాకులుతీఁగలు గడ్డి మొదలైనవి మేయుచుఁ గొంతకాలము గడపి మనమున శ్రీహరిని నిలిపి ప్రాణత్యాగము చేసెను.

పిమ్మట నా భరతుఁడు బ్రహ్మావర్తదేశమున నంగీరసుఁడను నొకానొక బ్రాహ్మణునకుఁ గుమారుఁడై పుట్టి బాల్యమున వేద శాస్త్రముల నభ్యసించి పూర్వజన్మ సంస్కారవిశేషమున హరిభక్తి తత్పరుఁడై యుండెను. ఆయంగీరసున కిద్దఱు భార్యలు. ప్రథమ భార్యకు బిడ్డలు తొమ్మండుగురు కలిగిరి. రెండవభార్య కొక్క కుమారుడు నొక్క కుమార్తెయుం గలిగిరి. భరతుఁడు రెండవభార్య కుమారుఁడై పుట్టె. జ్ఞానమువచ్చినది మొదలుకొని యాబాలకుఁడు పరులతో సహవాసము బంధకారణమని తెలిసికొని యెవ్వరితోడం గలయక నిరంతరము నారాయణ చరణస్మరణంబు చేసికొనుచు నుండె. అట్లున్న యతనింజూచి చుట్టములు మొదలగు వారును గ్రామ వాసులును వాఁడు వెఱ్ఱివాఁడని జడుఁడని భావించిరి. కర్మముల వలన ఫలంబులేదని యాబ్రాహ్మణబాలకుండు తెలిసియు తనతండ్రి బలవంతపెట్టి చేయించుటంజేసి యాతని మనమునకు నొప్పి గలిగింప కుండునట్లు కర్మానుష్ఠానముల నెరపుచుండెను. అంతం గొంతకాలము న కంగీరసుండు దేహంబుబాసి చనియె. రెండవభార్యయు భర్తతో సహగమనముచేసె. అంత నా బాలకుఁడు దిక్కులేనివాఁ డగుటం జేసి సవతియన్నలు శాస్త్రములు చదువుకొననీక వానిని గృహకృత్యములయందు బెట్టిరి. అయినను నతఁ డాకృత్యములయందు శ్రద్ధ గలిగి యేమఱక చేయుచుండెను. ఎవ్వరితో మాటలాడక యెవ్వరితో స్నేహముచేయక నెవ్వరి యింటికిఁబోక తనపనిమాత్రము చేసికొనుచు నతఁ డుండుటంజేసి కొందఱు వానిని గ్రుడ్డివాఁడనియుఁ జెవిటి

వాఁడనియు వెఱ్ఱివాఁడనియు నెగతాళి సేయఁజొచ్చిరి. ఎగతాళికి విచారింపక స్తోత్రములకు సంతసింపక యతడు మెలఁగుచుండును. రుచిగల యాహారంబు వెట్టినను రుచిహీనమైన యన్నంబువెట్టినను సమానమైన తమకముతోడనే భక్షించుచు సవతియన్నలు తిట్టినను గొట్టినను మాటలాడఁడు. అట్లు కొంతకాలము జరిగినపిదప సోదరులు వానిని దమ చేనుకాపునకై నియోగించిరి. అట్లేయని యాపొలము లోనుండి యాబ్రాహ్మణబాలుఁడు తెలకపిండి తవుడు పొట్టు చిట్టు మొదలైనవి పంచభక్ష్యపరమాన్నములట్లు భక్షించుచు నేలఁబండు కొనుచు మలినవస్త్రంబు గట్టి తెగమాసి నల్లబడిన జందెములుఁదాల్చి చూచువారందఱు దన్నురోసి తొలంగున ట్లుండెను. ఆతని దేహమె యపరిశుద్ధముగా నుండెను గాని యంతఃకరణము పరిశుద్ధమై యుండెను. శరీరము మలినమయ్యెను గాని మనస్సు నిర్మలమై యుండెను. అట్లు పొలము గాచుచుండ నొక్కనాఁడు తత్పుర మేలుచున్న వృషలపతి కాళికాదేవికి నరబలి యిచ్చుటకై యొక్క పురుషునిం దెచ్చుచుండ నాతఁడు తప్పించుకొని పాఱిపోయెను. మఱియొకని నెం దైనం బట్టుకొని రమ్మని యాతఁడు భృత్యులకానతిచ్చెను. ఆభృత్యు లెల్లచోటులు వెదకి పొలములో నేలబండుకొనియున్న యాబ్రాహ్మ ణబాలకునిం గని వానిం దీసికొనిపోయి తలయంటి క్రొత్తబట్టలు గట్టఁబెట్టి పిండివంటలలో నన్నము గుడువంబెట్టి పూలదండలు మెడ వైచి కుంకుమబొట్టు పెట్టి కాళికాదేవతాలయమునకుం గొనిపోయి యాదేవికెదుర నిలువం బెట్టిరి. జరుగుచున్న పనియంతయు నెఱిఁగి యు నావిప్రయోగి మసిపాతనుగట్టిన మానికమట్టు నివురుగప్పిన నిప్పు లాగున నుండుటం జేసి దానికై విచారింపక తనశరీరము వారి యిచ్చ వచ్చినట్లు చేసికొనుటకు వారికి వదలివైచెను. అంతట వృషలపతి భయంకరమైన ఖడ్గము చేతఁబట్టుకొని యానరపశువు మెడ నొక్క

యేటునం దెగవేయ నుంకించు చుండె. కాళీమహాదేవి యానరప శువుయొక్క నెత్తురు ద్రావి తన మనోరథములు సంపూర్ణముగా నీడేర్చునని వృషలపతి తలంచెను. కాని, దైవయోగమున నది విపరీత మయ్యె. బ్రహ్మతేజస్సంపన్నుఁడును జ్ఞానరత్నాకరుఁడును, దేహాభిమానశూన్యుఁడును నైన నాయోగియొక్క నిరుపమాన బ్రహ్మతేజమును జూచి వేలకొలంది పశువులను బలిగొనుచున్న యా కాళి భయపడి గడగడ వడఁకి వెంటనే భయంకరాకారము దాల్చి యావృషలపతిని వాని యనుచరులను గొంతులు కొఱికి చంపి రక్తపానముచేసి యావృషలపతియొక్క శిరంబు చేతం బూని యాడిపాడి యానందించి మహాయోగులను బరమపవిత్రులైన బ్రాహ్మణులను హింసింపఁదలఁచినవారి కిట్టిపాటులే గలుగునని చెప్పెను. ఆబ్రాహ్మణ కుమారుఁడు లేశమైనను భయపడక యాక్రూరకర్మమునకు జంకక వృషలపతియందును వానిఖడ్గమునందును, కాళికాదేవియందును నారాయణ భావముంచి యాకార్యమేదియుఁ దన సంబంధముకాని యట్లుచూచుచుండెను. కాళికాదేవివలన విడువంబడి యాబ్రాహ్మణ కుమారుఁడు మరలం దనపొలముకాయుటకై పోయెను. అట్లుకొంత కాలము గడచుటయు నొక్కనాఁడు సింధుదేశపాలకుఁడైన రహూగణుఁడను భూపాలుఁ డిక్షుమతీనదీతీరమందున్న కపిలమహాముని వలన బ్రహ్మజ్ఞానోపదేశముఁ బడయఁదలఁచి పల్లకియెక్కి యాపొలములో నుండి పోవుచుండెను. ఆశిబిక మోయుబోయలు మందుఁడైన యా విప్రునింజూచి వానిచేత నాయందలము మోయింపఁదలఁచి రాజుసెలవైనదని వానిందోడితెచ్చి పల్లకిదండి వానిభుజముపై బెట్టిరి. ఆతఁడేదేమియనక వారితోఁగలసి యాపల్లకి మోయుచుండెను. కాని, పల్యంకికావహనమున కాతఁడలవాటుపడక పోవుటంజేసి యాబోయలతో సమానముగగా నడువఁజాలకపోయెను, అందుచే శిబికలోనున్న

రాజునకుఁ గొంతకుదుపు గలిగెను. రాజు తనకు బాధగలుగుచున్న దని చెప్పి బోయలపైఁ గోపపడెను. ఆబోయలు తమనేరము కాదని యుఁ, గొ్రొత్తగావచ్చిన బోయతప్పనియుఁ జెప్పిరి. బ్రహ్మజ్ఞానసంప న్నుఁడైన బ్రాహ్మణుఁడు తన యందలము మోయుచున్నవాఁడని యెఱుంగక యానరపాలుఁడు వానిమీఁదఁగూడ గోపించి నిష్ఠురో క్తులు బలికెను. ఆపలుకులు విని యు రోసముం జెందక బ్రాహ్మణుఁ డెప్పటియట్ల దనకృత్యము సేయుచుండెను. కుదుపంతకంతకు హె చ్చుచుండుటచేత జననాథుఁడు వెండియు దురాగ్రహావిష్టుఁడై యిట్ల నియె "ఓరీ! దురాత్మా! భూమండలాఖండలుఁడనైన నాయాజ్ఞ మ హారాజు లందఱు శిరమున వహించుచుండ నీవు సరకుగొనకయున్నాఁ డవు నాయాగ్రహంబునకుఁ బాత్రమైతివేని నిన్నిప్పుడె చూపుమా పెద. పల్లకి సరిగా మోయుమని యెన్నిసారులు చెప్పినను వినవదేల? నీమదం బడఁచెద. నన్ను ధిక్కరించుటయమునిధిక్కరించుటసుమీ!" ఆపలుకులువినియు బ్రాహ్మణుఁడు వానియహంకారంబునకును నజ్ఞానంబునకును మనం బున విచారించి దేహాభిమానంబు లేనివాడగుట వానికఠినోక్తుల కలుగక వానికి హితోపదేశంబు చేయఁదలఁచి యల్లననిట్లనియె. "రాజేంద్రా! నీవెన్నిదూషణోక్తులాడినను నీవున్నెన్ని దండనల పాలుచేసినను నవి నాశరీరంబునేగాని నన్ను బాధింపవు. ఏలయన పెరుగుట చిక్కుట తెగులుకొనుట నాకలిదప్పికజెందుట పగయు మక్కువయు గలిగియుండుట, ముసలితనము చావునొందుట, రోసము నిద్రజాగరముగలియుండుట అహంకారమమకారాదులు దేహంబువల న జనించును. తదంతరాత్మకుఁ జెందవు. స్వామిభృత్యసంబంధంబులు దేహంబునకేగాని యాత్మకుఁజెందవు. దైవవశంబున నీవిప్పుడు రాజు వైతివి. అధికారాంధకారమున నీవు పరులం దూలనాడుచుంటివి. ఈ

మైశ్వర్యంబులు శాశ్వతంబులుగావు. జీవనముబుద్బుదప్రాయము. ఐశ్వర్యము క్షణభంగురంబు. నీసంపదయంతయు వినశ్వరంబు. ఈమాత్రంబునకె తుళ్ళిపాటుతగదు. పరమేశ్వరుఁడొక్కఁడే స్థిరుఁడు. ఆతనిసేవయె నరులకపేక్షణీయము. నీవనేకశత్రువులం గెలిచితివి గాని యంతఃశత్రువులం గెలువఁజాలకపోయితివి వారునీలోనఁజేరి నిన్నెన్నో విధములసిలుగులం బెట్టుచున్నవారు రాజ్యగర్వంబున నదిగానకున్నవాఁడవు. నిన్నుజూడ నాకు మిక్కిలి జాలిగలుగుచున్నది." అనుటయు జ్ఞానగర్భితములైన యా బ్రాహ్మణునివచనంబులు విని రాజు తద్దయు విస్మితుండై పల్లకినుండి క్రిందికిదుమికి యాబ్రాహ్మణుని పాదములపైఁబడి యిట్లనియె. "మహాత్మా! నీవెవ్వఁడవో నేనెఱుఁగ. నివురుగప్పిననిప్పువలె నున్నవాఁడవు. నీవు సామాన్యుఁడైన బోయ వనుకొని నీయెడనేను మహాపరాధంబు గావించితి. ఈతప్పుసైరింపుము. సాధువులు బ్రహ్మజ్ఞానసంపన్నులునైన మహానుభావులకు వెఱచినట్లు నేను శ్రీహరిచక్రాయుధంబునకు వెఱువ. రుద్రునిశూలంబునకు వెఱువ. ఇంద్రునివజ్రాయుధంబునకు వెఱువ. కాలునిదండంబునకు వెఱువ. మహాత్మా! నాయహంకారంబునం జేసి నోటికివచ్చినట్లు ప్రేలితిని. నీవు నన్ననుగ్రహించుటకై వచ్చినకపిలమహామునివో చతుర్ముఖుఁడవో యెఱుఁగఁజెప్పుము. నేనుజ్ఞానోపదేశము బడయుటకై కపిలమహామునిసన్నిధి కరుగుచున్నవాఁడను. ఆడఁబోయిన తీర్థ మెదురైనయట్లు వెదుకఁబోయినతీగకాళ్ళకుందగిలినట్లు నామనోరథసిద్ధి చేయఁగలమహానుభావుఁడవు నీవిక్కడ సంభవించితివి. ఇంక ధన్యుఁడనైతి. నాయజ్ఞానంబుబాపి నన్నుఁ గృతార్థునిం జేయుము" అనివేఁడుకొనుటయు బ్రాహ్మణుఁడు రాజునులేవనెత్తి కృపాపరిపూర్ణమనస్కుఁడై యిట్లనియె. "రాజా! నీవు విద్వాంసుఁడవయ్యు విద్యావిహీనుఁడట్లుభాషించుచున్నవాఁడవు. పెద్దలీప్రపంచము సత్యమని

నమ్మరు. బ్రహ్మసత్యము జగన్మిథ్యయని తత్త్వవేత్తలుపల్కుచుందురు. ప్రపంచము నిత్యమని సత్యమని నమ్మువారు కర్మబోధంబులందవిలి మోక్షంబువడయఁజాలరు. తమతమ గుణకర్మంబులకుఁ దగినజన్మంబులనెత్తి జలంబులంబడి మునుఁగుచుఁ దేలుచునున్న వారిచందమున దుఃఖపడుచుందురు. విషయంబులయం దాసక్తి యెంతకాలంబు గలుగు నంతకాలంబు సంసారచక్రమునందగుల్కొని నరుండు తిరుగుచుండు. మహావీరుఁడైనను దనకు మనస్సుపరమశత్రువని భావించి దానిని స్వేచ్ఛగాఁ దిరుగనీయక శ్రీహరిపాదపద్మములపై నిలుచునట్లు చేయవలయును. అప్పుడే జన్మరహితంబైన మోక్షంబు సంప్రాప్తించు." అనవుడు సింధురాజు మేఱమీఱిన వాని మహిమమునకు వెఱఁగొంది వెండియునిట్లనియె. మహాత్మా! నివురుగప్పిననిప్పువలె నిరాడంబరమైన వేషముగల్గి జ్ఞానపుంజంబవైన నీకు నమస్కారము. జ్వరముచే బాధపడువానికి మందుమిక్కిలి ప్రీతికరముగా నుండునట్లు మిక్కిలి దాహముచేత సొక్కుచున్నవానికిఁ జల్లని తేటనీరు రుచియించునట్లు దురహంకారమనెడు సర్పముచేత దష్టుఁడనైన నాకు నీవాక్యామృతము పరమసంతోషదాయకమై మనంబునకుశాంతిగలుగఁ జేయుచున్నది. నాకుఁగల సందియములనెల్ల నీవలనంబాపుకొనఁ దలఁచుకొంటి. అనుగ్రహించి నాకు జ్ఞానోపదేశంబు సేయవలయు." అనవుడు రాజునకుఁ బ్రాహ్మణవేషియైన భరతుఁ డిట్లనియె. "రాజా! నీకులభించుచున్న ఫలములన్నియుఁ గర్మమూలములగుటచేతను, నీవు సంసారమునందువర్తించుచుండుటచేతను దత్త్వమూలంబు నీవెఱుఁగఁ జాలవు. బోయిలమైన మేము ముండ్లచేతను, గులకరాళ్ళచేతను దుర్గమమైనమార్గమున నడచుచు భుజంబులపై నీశిబికంబెట్టుకొని మోయుచున్నారము. అందునీవు సుఖాసీనుండవై నేనుమహారాజునను గర్వంబున నహంకారంబువహించి క్రిందుమీఁదు గానకయున్నవాఁడవు.

నీదురహంకారంబు కతంబున సభలలో నీ కించుకేనియుఁ బూజ్యత లేదు. మహారాజువైన నీవును నిఱుపేదనై బోయనైన నేనును సర్వే శ్వరుదృష్టికి సమానులము. పరమాత్మ జీవాత్మరూపంబున నీయందు ను నాయందును సమానంబుగ నున్నయది. కాంచనకిరీటంబు, రత్నా భరణములు, సువర్ణచేలములు దరించి ప్రాకృతజనులకు నీవుమహా పురుషుడట్లు కానబడుచున్నవాఁడవు. చిరతపఁబుచేత శరీరంబు శుష్కింపఁజేసి యింద్రియంబుల జయించి యహంకారదూరులమైన మేము కడునల్పులవలెఁ గానఁబడుచున్నారము. రాజవై ప్రజాపాల నంబు సేయుచుఁ నీవొనర్చిన మహాపాతకంబునకు మితి యుండదు. "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మను నార్యోక్తి స్మరింపుము. నీమకుటం బులు, నీయేనుఁగులు, నీవాహనంబులు, నీపరివారంబులు, నీసైన్యం బులు నీవెంటరావు. అవి నీకు మోక్షంబు నొసంగఁజాలవు. నీపాత కంబులకు నీవుపశ్చాత్తాపంబునొంది నీచిత్తంబు హరిచరణాయత్తంబు చేసి మహాత్ములయెడ వినయంబుగలిగి వర్తింతువేని నీకు మోక్షంబు గలుఁగు. బ్రహ్మసాక్షాత్కారము పరమభాగవతుల సేవచే లభించి నట్లుఁ దపములవలనను దానములవలనను గృహమేధిధర్మములవలనను యాగములవలనను దీర్థయాత్రలవలనను లభియింపదు. పరమభాగవత తుల సేవవలన మనంబు హరిపాదసరోజములయందు నిలుచు. దానం జేసి బంధమోక్షంబగు. నేను తొల్లి భరతుండనువాడను. అజ్ఞానవశం బున మృగముమీఁద నతిప్రీతిగలిగియుండి యుత్తరజన్మంబుని మృగ ము నయితి. అప్పుడు సైతము పూర్వజన్మస్మృతిగల్గి హరిధ్యానపరాయ ణుఁడ నగుటచే నీయుత్తమజన్మంబుగలిగె. కావున మోక్షంబునకు హరిధ్యానంబు పరమసాధనము. నరుఁడు సంసారమనియెడి మహార ణ్యమునందు సంచరించుచుండు. కామక్రోధలోభులనెడు తస్కరులు వాని కడనుండి ధర్మమనియెడి ధనంబు హరింపఁ జూతురు. కావున

సంసారియైనమానవుండు మెలకునగల్గి మెలగనలయు దారపుత్త్ర బంధుజనంబులనెడి తోఁడేళ్ళు సంసారియనెడు మెకమును మ్రింగివేయ జూచుచుండు. కుమ్మరిపురుగు మంటిలోఁ దిరుగుచుండియు మన్ను నంటని తెఱఁగును మానవుండు సంసారియయ్యు సయ్యరులలోఁజిక్క కానక యెప్పటికప్పుడు తనస్థితిజూచుకొనుచు జాగరూకతతో నుండ వలయు. ఎండమావులుజూచి మృగములు నిర్మలజలమని త్రాగబో యినతీరున నరుఁడు ధనాశచేత నిక్కడక్కడ యనక దిరిగి నశించు చుండును. కావున కామక్రోధంబులజయించి మనస్సునుయథేచ్ఛము గాఁ బోవనీయక హరిచరణరాజీవములయందు దానినిబంధించి నరుం డు మోక్షంబు గాంచవలయు" అని బ్రాహ్మణుఁ డుపదేశించిన రాజు పారములేనియానందముకొంది కృతార్థుండనైతి నని పలికి తాను గావించినతప్పు సైరింపుమని బహువిధంబులం బ్రార్థించి యథేచ్ఛం జనియె. బ్రాహ్మణుండును తనయిచ్ఛవచ్చిన తెఱంగునం జనియె.

---

# అజామిళుఁడు

అజామిళుఁడు బ్రాహ్మణుఁడు ఇతఁడు కన్యాకుబ్జపురమున పావనమైన యుత్తమవంశమునజన్మించెను. శాంతుఁడై దాంతుఁడైగురుకులవాసము జేసి భక్తిశ్రద్ధలతోఁజిన్ననాఁట వేదాధ్యయనము జేసెను. అతిథులనాదరించెను. గురువులఁబూజించెను. పెద్దలయెడ వినయంబుగ లిగిమెలఁగెను సత్యభాషణమందుఁ బరమాసక్తిగలిగియుండెను. నిత్యనైమిత్తికములు నిష్ఠతోఁజరిపెను. సర్వభూతదయాళుఁడై వన్నెకెక్కెను. ఇన్నిమాటలేల బాల్యకాలమున నతఁడు మంచిగుణములకెల్ల నునికి పట్టైయుండెను. స్నాతకవ్రతా నంతరమున నతకిని వివాహమయ్యెను. బాల్యముబోయి యవ్వనము క్రమక్రమముగా నంకురించెను. ఇటులుండ నొకనాఁ డతఁడు మిక్కిలి చక్కనిశూద్రాంగన నొకర్తెంగనుంగొని దానియందతిస్నేహముగలిగి దానిందనయధీనమునందుంచుకొని యగ్నిసాక్షిగాఁజేకొన్న భార్యనువిడనాడి యాశూద్రాంగనయే తనకేడ్పుఁగడయుగా భావించి సుఖింపఁదొడఁగెను. దానిసహవాసమునఁగలిగిన యాహ్లాదములనేగాని వేదములను స్మరింపఁడయ్యె. కామశాస్త్రంబునేగాని యితరశాస్త్రంబులఁ జూడఁడయ్యె శృంగారకర్మములనేగానిధర్మములసరకుసేయఁడయ్యె. దానివాక్కులేగాని బుక్కులువానికిరుచింపవయ్యె. ఆమెలనాఁగతంత్రంబులంజిక్కి మంత్రింబులమఱచె. పితార్జితమైనవిత్తమంతయు దానినిమిత్తమై వెచ్చపెట్టె. ధనహీనుఁడైనపిదప ద్రవ్యార్జనమునిమిత్తము జూదమాడఁ దొడఁగెను. అం దొకప్పుడు నష్టము నొకప్పుడు లాభము గలుగుచుండుటంజేసి ధనముచాలక దొంగమై కన్నములువైచియు దారులుగాచి బాటసారులఁదోఁచియుఁ దన్నిమిత్తమై నరహత్యలు గావించియు మిక్కిలిదురాచారుఁడయ్యెను. అశూద్రాంగనవలన

బదుగురుబిడ్డలంగనియెను. ఆదారపుత్రాదుల పోషణమునిమిత్తమై యీపని యాపని యనక చెప్పరానిచెడ్డపనులనెల్లజేసెను. కులధర్మములును శీలమునువిడచి పావనమైనతనవంశముమాటమఱచి యుంపుడుకత్తియ చేతికూఁడుదిని మాంసాశియై సురాపాయియై విహరింపఁ జొచ్చెను. వేయేల? అంతనిర్భాగ్యుఁడు జగంబునలేడని జనులుచెప్పుకొనసాగిరి.

కాలమొక్కరీతి నుండదుగదా! యౌవనము సెలయేటిప్రవాహమువలె నతివేగమునదాటిపోవునుగదా. క్రమక్రమముగా నతని యౌవనము జాఱిపోయెను. జీడిగింజలవలెనున్న నల్లనివెండ్రుకలు నూలుపోగులవలెఁ దెల్లనయ్యెను. మోహపాశంబులు క్రమక్రమమున జాఱిపోవఁదొడఁగెను. వానితోఁబాటుగాఁ నింద్రియపటుత్వము సడలెను. అంతకంతకుఁ దలవడకజొచ్చె. గళమున గద్గదస్వరముల బైలువెడలెను. చేతులు కంపించెను. కీళ్ళలోనొప్పులు బైలుదేరెను. నడచుట కష్టమయ్యెను. కన్నులుకనఁబడవయ్యెను. చెవుఁడుపుట్టెను దంతములూడెను. దగ్గువగర్పు బయలుదేఱెను. తలయేరు ప్రారంభమయ్యెను. మతిగూడజెడెను ముప్పుకాలమ్మునమీపించెను. ఈవిధముగా నెనుబదియెనిమిదిసంవత్సరములు నిండెను. అప్పటికైనను వాని చిత్తవృత్తి మార్పుజెందదయ్యెను. తానుగావించినదుష్కార్యములఁ దలంచి యత్తఁడించుకేనియుఁ బశ్చాత్తాపమునొందఁడయ్యె. హరినామస్మరణంబువంక యతనిబుద్ధిపోవదయ్యె. తనయుంపుడుకత్తెను దన బిడ్డలను జూచుకొని మురిసియుచుండెనేగాని పరలోకముమాట గలనైనఁ దలంపఁడయ్యె. అతనికడగొట్టుకొడుకు పిన్నవాఁడగుటంజేసి వాని నెంతయోగారాబమున బెంచుచు వానిపై నింతంతయనరాని ప్రేమగలిగి వానిమాటలకు మురియుచు వానియాటలకు సంతసించుచు వానిచేష్టలుమెచ్చుచుఁ గాలక్షేపము సేయుచుండెను. అంతట

వానికి మరణకాలంబు సంప్రాప్తించె. వానికనిష్ఠనందనునిపేరు నారాయణుఁడు. తనయాలుబిడ్డలను నందుముఖ్యముగఁజిన్నకొడుకగు నారాయణుని విడిచిపోవలసివచ్చెఁగదాయని మిక్కిలి దుఃఖపడుచు నిరంతరము "నారాయణా! నారాయణా! రారా! దగ్గఱఁగూర్చుండురా ముద్దుబెట్టరా" యని పలవించుచు గాలధర్మమునొందెను.

యమధర్మరాజుదూతలు వచ్చి యాతని లింగశరీరమును భయంకరములైన పాశములతోఁగట్టి తీసికొనిపోవసమకట్టిరి. మరణకాలమున నారాయణ నారాయణాయని యాబ్రాహ్మణుడు పలుకుటచేత నతనిపాపములన్నియు హరింపఁబడుటఁజేసి విష్ణుదూతలు వానినివైకుంఠమునకుఁ దీసికొనిపోవుటకై వచ్చి యమదూతల నదలించిరి. అప్పుడు యమకింకరులు వారితో నిట్లనిరి. "ఎవరయ్యా మీరు? మాతో నిష్కారణముగాఁ గలహింపవచ్చినారు. మేము యమదూతలము ఈబ్రాహ్మణుని లింగశరీరముం గొనిపోవుచున్నాము. మా చేయుపని మీరు నిరోధింపనేల? ధర్మనిర్ణయపరుఁడైన దండధరుని శాసనంబులు మీరు నగుబాటుసేయఁదలచిరా? మీరప్రాకృతదివ్యమంగళవిగ్రహములు గలిగి మాకన్నులకు వేడ్కసేయుచున్నారు. మీరు సిద్ధులా సాధ్యులా విద్యాధరులా? మీరుదివ్యపురుషులని మీయాకారములు చెప్పుచున్నవి. మీరు నీలమేఘశ్యామలదేహములుగలిగి పీతాంబరములు ధరించి మణికిరీటంబులు కుండలంబులు దాల్చి శంఖచక్రగదాదులగు నాయుధములు పూని విష్ణుదేవునివలె గనఁబడుచున్నారు. మీప్రయత్నములు మాకాశ్చర్యము గలుగజేయుచున్నవి. పాపాత్ములను దండించుటకు దండధరుఁడు నియమింపఁబడెనుగదా! అతఁడు తనధర్మమును నిర్వర్తించుటకొఱకు మమ్ము బుత్తెంచె. ఏల మీరుమమ్ము నివారించెదరు?" అనిపలుకుటయు నవ్విష్ణుదూతలు "మీధర్మంబు మీరునిర్వర్తించుట, కిష్టమే

కాని పుణ్యాత్ముఁడెవ్వఁడో పాపాత్ముఁడెవ్వఁడో విచారింపక యెల్ల వారిని యమలోకంబునకుం గొనిపోవుట పాడియగునా?" యని యడిగిరి. అడుగుటయు యమదూత లిట్లనిరి. "మహాత్ములారా! వేదంబు సర్వజనులకుంబ్రమాణంబు. వేదవిరుద్ధముగాఁ బ్రవర్తించిన వారందఱు దండ్యులు. ఎవరేకర్మంబు గావించినను విధివిధానంబుగ నాచరింపవలయు. అటులాచరింపనివారు వేదముల నతిక్రమించినవారు సమవర్తి లోకంబునకు వత్తురు. ఈ బ్రాహ్మణుఁడు మొదట నుత్తమవంశమున జన్మించి వేదశాస్త్రంబుల శిద్ధతో నభ్యసించి కొంతకాలము బ్రహ్మచర్యము నెఱపి వివాహితుఁడై తదనంతరము శూద్రకన్యాసంపర్కంబు గావించి మాంసభోజనుఁడై సురాపాయియై చోరుడై పుణ్యదూరుఁడై క్రూరుఁడై పతితుఁడయ్యెను. అక్కతంబున వీనింబట్టి పాశబద్ధుని జేసితిమి. ఇందు మేము గావించిన తప్పేమి? మీ కాగ్రహముగలుగుటకుఁ గతమేమి? ఇతఁడు మరణకాలమున నారాయణస్మరణంబు గావించి పుణ్యాత్ముఁడయ్యెనని మీరంటిరి. అది పొరబాటు. వీఁడు నారాయణా యనుటలో శ్రీహరినామస్మరణంబు సేయలేదు. తన యుంపుడుకత్తె కడగొట్టుకొడుకు పేరు నారాయణుఁడు. ప్రాణోత్క్రమణసమయమునసైతము వానియందలి గాఢానురాగంబు విడువలేక నారాయణా యని యాప్రియకుమారుని బిలిచెఁ గాని విష్ణునామస్మరణంబు సేయలేదు. అది మీరు విష్ణునామస్మరణంబుగా భావించితిరి గాఁబోలు! వీని చరిత్రమునం దొక్కసుకృతమైన లేదు. వీఁడు ద్రవ్యలోభమున స్త్రీహత్యయు శిశుహత్యయుఁ జేసె. కామాయత్తుండై యనేక దుష్కార్యంబుల నాచరించె. వీఁడు చేయనిపాపము లేదు. ఇట్టివానిపై మీకేల యభిమానము గలిగెనో మే మూహింపలేకున్నాము. వీఁడు గావించిన మహాపాతకములకు వీఁడు యమలోక

మున మహానరకము ననుభవించి దండ్యుఁడై సపక్షమున శుద్ధుండగు. అంతవరకును మహాపాపి. కావున గొంపోవుటకు మాకనుజ్ఞ నిండు." అనవుడు విష్ణుదూత లిట్లనిరి.

ఈతఁడు మహాపాతకుఁడన్నమాట సత్యము. మీరన్న ట్లీతఁడు చేయని దోషములేదు. ధర్మ మతనికిఁ గడుదూరము. అయినను మరణకాలమున నితఁడు కొడుకుం బిలుచు నెపంబుననైనను నారాయణనామస్మరణంబు గావించె. అందుచే నితఁడు సకలకల్మషములం బాసి సిద్ధుండయ్యె. పగచేతనైన వగచేతనైనఁ బ్రాణభీతినైన మరచియైన నిద్రిలోనైన హరిని ధ్యానించువారికి మోక్షంబు గలుగు. బిడ్డలపేరు పెట్టియైన మఱియేవిధముననైన హరిస్మరణంబు సేయుట మోక్షసాధకంబు.

సీ. బ్రహ్మహత్యానేక పాపాటవుల
కగ్నికీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మష క్రూరసర్పములకుఁ
గేరులు హరినామకీర్తనములు
తపనీయ చౌర్యసంతమసంబునకు
సూర్యకిరణముల్ హరినామకీర్తనములు
మధుపానకిల్బిషమదనాగసమితికిఁ
గేసరుల్ హరినామకీర్తనములు
గీ. మహిత యోగీంద్రనిత్యసమాధివిధుల
నలరు బ్రహ్మాది సురులకు నందరాని
భూరి నిర్వాణసామ్రాజ్యభోగభాగ్య
ఖేలనంబులు హరినామకీర్తనములు.
సీ. ముక్తికాంతైకాంత మోహనకృత్యముల్
కేలిమైహరినామకీర్తనములు

సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్
కేలిమై హరినామకీర్తనములు
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్
కేలిమై హరినామకీర్తనములు
బహుకాలజనిత తపఃఫలసారముల్
కేలిమై హరినామకీర్తనములు

గీ. పుణ్యమూలంబుల నపాయపోషకంబు
లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
లాగమాంతోపలబ్ధంబ లమృతసేవ
లార్తశుభములు హరినామకీర్తనములు.

ఏవిధముగ నైన మోక్షధామమైన యధోక్షజనామము దలఁచువాఁడు ధన్యుఁడుగాదా. ఔషధపరిభావము దెలియకయే దానిని మ్రింగిన రోగికి దానిగుణంబు గానఁబడునట్లు, హరినామస్మరణఫలంబునెఱుంగని పామరుఁడైనను నారాయణనామకీర్తనంబు గావించెనేని దాని ఫలంబు దప్పకఁ గలుగుచుండు.

మ. నిరతంబై నిరవద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై
నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ
హరినామస్మరణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణానంతంబున నిట్టిసజ్జనుని ధర్మంబేల వ్యర్థంబగున్.

అని పలికి ధర్మనిర్ణయంబుగావించి హరిదూతలు బ్రాహ్మణుని యమకింకరపాశంబులవలన విడిపించి వాని యదటు వాపిరి యమదూతలును చేయునది లేక జరిగినవృత్తాంతమంతయు యమధర్మరాజునకుం దెలియఁజేసిరి. భగవద్దూతలుచేసిన కార్యంబు సమంజసమని సమవర్తి సంతుష్టుఁడై యూరకుండెను.

అట్లు యమపాశవిముక్తుఁడై విప్రుఁడు పరమానందభరితుఁడై తనకు మహోపకారంబు గావించిన హరిదూతలకు రెండుచేతులు జోడించి మ్రొక్కి నుతియింపఁబోవుచుండ నంతలో వారంతర్ధానము నొందిరి. అదియంతయు శ్రీమన్నారాయణుని మహామహిమంబని తెలిసి బ్రాహ్మణుఁడు మనోవీథిని వివేకసూర్యోదయంబుగాగ నజ్ఞానాంధకారంబు పటాపంచలైపోవ నతఁడు పూర్వచరితంబు స్మరియించి పశ్చాత్తాపంబునొందెను.

సీ. వృషలియం దనురాగవృద్ధిఁ బిడ్డలఁగని
కులము గోదావరిఁగూలఁద్రోచి
రచ్చలకెక్కి పెన్రజ్జునేతల నరి
వారిలోపలఁ దలవంపుచేసి
కట్టడిముదుకనై కర్మబంధంబుల
పుట్టనై నిందలప్రోవ నగుచుఁ
దరుణులరోఁతలఁ దవిలిభోగించిన
కడఁది నాజన్మంబు గాలిపోయెఁ

గీ. జదువు చట్టువడియె శాస్త్రంబు మన్నయ్యె
బుద్ధిపురుపుమేసెఁ బుణ్యమడఁగె
నీతిమట్టువడియె నిర్మలజ్ఞానంబు
మొదలికుడిగె బోధమూరిఁబోయె.

చక్కని కన్నె లభించినదిగదా యని మక్కువగలిగి సమస్తము మఱచి చెడిపోయితిని. అగ్నిసాక్షిగా వివాహమాడిన యిల్లాలిని విడిచి బాధించితిని. చిన్ననాఁటనుండియు మిక్కిలి గారమునం బెంచిన తల్లిదండ్రులను వార్ధకమునం బోషింపక పలుతెఱఁగుల హింసించితిని. బంధువర్గమును బరాభవించితి. నెచ్చెలుల నిందించితి. బహుపాతకములు గావించి నరక మనుభవింప నర్హుఁడనైన నన్ను

యమకింకరులపాలుగాకుండ రక్షించిన యీమహానుభావులు నాపాలి దైవతములు. వారిప్పు డెందరిగిరోగదా! ప్రసన్నముఖులై శుభాకారులై కృపాయత్తచిత్తులైన యీమహాత్ముల దర్శనంబు నావంటి పాతకునకు లభించునే?

ఆ. పాతకుండ జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను
మానలోభ మోహమత్సరుండ
నాకునెట్లుదొరకు నారాయణుని దివ్య
నామవిమలకీర్తనంబు మదికి.

సీ. దారుణమోహాంధకారపూరితుఁడను
హరివిస్మయస్మరణార్హమతినె
పంచమహాతీవ్ర పాతకోపేతుఁడ
హరివిస్మయస్మరణార్హమతినె
కౌటిల్య కితవ వికారపారీణుండ
హరివిస్మయస్మరణార్హమతినె
యఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండ
హరివిస్మయస్మరణార్హమతినె

గీ. నిందలకునెల్ల నెలవైన నిర్గుణుండ
మందభాగ్యుండ నేనేడ మధువిరారి
దివ్యగుణనామకీర్తన తెఱఁగదేడఁ
బూర్వసుకృతంబు లేకెట్లుపొందఁగలుగు.

ఈదివ్యపురుషసందర్శనంబున నాపాపంబులెల్ల నశించె. కర్మబంధంబులనుండి విముక్తుడనైతి. నామనంబు కామాయత్తంబుజేసి నాకు శూద్రాంగనాసంపర్కంబు గలిగించిన యీమాయ సూర్యోదయంబునమంచు విడిసినట్లు విడిసిపోయె. హరిచరణారవిందములమీఁదమనస్సు నిలచుచున్నది.

క. హరిభక్తులతో మాటలు
ధరనెన్నఁడుఁ జెడని పుణ్యధనములమూట
ల్వరముక్తికాంత తేటలు
నరిషడ్వర్గంబు చొరని యరుదగుకోటల్.

అని యాబ్రాహ్మణుఁడు తత్వవేత్తయై గంగాద్వారమునకరిగి పశ్చాత్తాపమున శుద్ధుఁడై యోగమార్గంబుననుండి చిత్తంబు హరియందు గీలించి బహుకాలంబు దపంబుజేసి ముక్తుఁడై నారాయణ సాన్నిధ్యంబు వడసెను.

తే. అరయఁ బుత్రోపచారికమైనవిష్ణు
నామమవసానకాలంబునను భజించి
శార్ఙ్గినిలయంబుఁ జేరిన జామిళుండు
విష్ణుసద్భక్తిఁదలఁచిన నేమిసెప్ప.

—०००—

# అంబరీషుఁడు

పూర్వకాలంబున భరతఖండము నంబరీషుండను రాజు పాలించెను. అతఁడు సప్తద్వీపపరిమితమైన భూమండలము నేకచ్ఛత్రముగా నేలుచు సకలైశ్వర్యముల ననుభవించుచుఁ గర్వోన్మత్తుఁడు గాక హరిభక్తులతోఁ గలసిమెలసి కాలక్షేపము జేయుచునుండెను. ఆ రాజేంద్రుఁడు మనస్సు మాధవపదారవిందములయందును, కన్నులు కమలాక్షసందర్శనమునందును, చెవులు హరికీర్తనశ్రవణములందును, హస్తములు నారాయణపూజలయందును, జిహ్వ హరినామస్మరణమునందును, శిరస్సు మహాపురుషనమస్కారములయందును దగిలియుండునట్లు చేసి విష్ణుభక్తులలో నగ్రిగణ్యుఁడై యుండెను.

అతఁడు సరస్వతీనదీతీరమున వసిష్ఠాదిమహర్షుల సాహాయ్యంబున ననేకాశ్వమేధములుచేసి బ్రాహ్మణులకు విద్వాంసులకు భూరిదక్షిణలిచ్చి పేదలకు నిరతాన్నప్రదానంబులు గావించి తన కావించిన కర్మములన్నియు నారాయణార్పణముచేసి చిల్లపెంకును బంగారమును సమముగా నెంచి కామక్రోధలోభములకుఁ దన మనంబునఁ దావొసంగక నిర్మలచరిత్రుఁడై యుండెను. అతఁ డెవరితో మాట్లాడినను హరితో మాట్లాడినట్లె భావించుకొనును. ఏవస్తువుజూచినను హరిని జూచినట్లె తలంచు. దేని నంటినను హరి నంటినట్లెయెంచును. ఏశబ్దము వినినను హరిశబ్దము వినినట్లె తలచును. పలుపలుకులేల. విశ్వమంతయు హరిమయమనుమాట నమ్మినట్లు వర్తించెను. అట్లుండుటంజేసి యతనికి హయములమీఁద గజచయములమీఁద ధనములమీఁద యుద్ధసాధనములమీఁద పుత్త్రులమీఁద బంధుమిత్రులమీద బురములమీఁద నంతఃపురములమీదఁ గోరికలు నశించెను. కొంత కాలంబు గడిచినపిదప నతఁడు రాజ్యతంత్రవిముఖుఁడై యేకాంతం

బున హరిసేవ జేయుచునుండ భక్తవత్సలుఁడగు పురుషోత్తముఁడు సాక్షాత్కరించి శత్రుజనభయంకరమును సాధుజనశుభంకరమును నగు చక్రము నతనికిఁ బ్రసాదించె దానంజేసి ధన్యుఁడై భార్యాసమేతుఁడై యొకనదీతీరమున ద్వాదశీవ్రతము ప్రారంభించి గడునియమముతో భక్తితో దానిని నిర్వర్తించుచుండెను. వ్రతాంతమునఁ గార్తికమాసమున మూఁడురాత్రు లుపవాసముచేసి యమునానదీ పావనజలములు స్నానము జేసి మధువనమునందుఁ బరమభక్తితత్పరుఁడై హరికి నభిషేకముఁ గావించి నెత్తావుల వెదఁజల్లు పుష్పంబుల నర్పించి బంగారుకొమ్ములు వెండిగొరిజలుఁ గలిగి పాలు కుంభవృష్టిగాఁ గురియునట్టి యుత్తమగోవులను దూడలతోఁగూడ వేనవేలు దెప్పించి వేదవేత్తలగు విప్రసత్తములకు దానముచేసెను. పిమ్మట సాధువులును సకలశాస్త్రపారంగతులు నగుబ్రాహ్మణపుంగవులకు సంతుష్టిగా మృష్టాన్నముపెట్ట యవ్వలఁ దాను పారణసేయసమకట్టియుండెను.

అంతలో నతికోపనుఁడును దుర్వారతపోవిలాసుఁడును నగు దుర్వాసుఁడు రాజుకడకుఁబోయెను. అతనింగని యంబరీషుఁడు లేచి యెదురుగాఁ జని కుశలంబడిగి పాదంబులు గడిగి శిరంబునం జల్లుకొని పావనంబగు నాసనంబునఁ గూర్చుండఁబెట్టి నాఁడు ద్వాదశి యగుటచేఁ దనయింట భుజియింపుమని ప్రార్థించెను. అట్ల కాకయని మునిపావనమగు యమునానదీజలమున స్నానము చేయఁబోయి నీట మునిఁగి సమాధిం దగిలి యెంతసేపటికిని రాకపోయె. ద్వాదశిగడియలు మించిపోవుచుంటంజేసి యుపవాసఫలంబు తనకుఁ దక్కదని యా యవనీశ్వరుఁడు, భయపడి కర్తవ్యమేమని యాలోచించి బ్రాహ్మణుల రావించి బ్రాహ్మణుఁడు రాకుండ భుజింపరాదు. ద్వాదశి కా

లంబు మీఱఁ బెట్టరాదు దీని కేమి సేయఁదగు" నని వారి నడిగెను. అడుగుటయు వారు ధర్మవిచారణ మొనరించి యిట్లనిరి.—

"అతిథినివిడిచి భుజింపరాదు. ద్వాదశీపుణ్యకాలంబు పారణ సేయకుండఁ గడుపరాదు. కావున నించుక నీరుద్రావుము. దానం జేసి ద్వాదశీవ్రతము సఫలంబగు. బ్రాహ్మణ తిరస్కారంబుగాదు."

అట్లు వారు సందియంబు బాపుటయు, నారాజచంద్రుఁడు జలముఁ ద్రావి వ్రతదీక్ష నిలుపుకొనియెను. అంతలో స్నానము ముగించి దుర్వాసుండు వచ్చెను. రాజు వాని నెదుర్కొని భోజనము సేయుమని యడుగుటయు నతఁడు జలపారణచేసినట్లు తెలిసికొని బిట్టలిగి కనుబొమలు ముడివడఁ గన్నులఁ జింతనిప్పులవలె నెఱ్ఱఁబాఱఁ జుట్టుపరిక్కవారలంజూచి యిట్లనియె. "ఆర్యులారా, చూచితిరా! ఈతఁడు నన్ను ద్వాదశీపారణకుం బిలిచి నేను రాకమున్న జలపారణంబు జేసె. ఈవిధంబుగా నన్ను వీఁ డవమానించునే? ఐశ్వర్యమదోన్మత్తుఁడై వీఁడు క్రిందుమీఁదును గానక త్రుళ్ళిపడుచున్నాఁడు. కానిచో ముల్లోకములుం గడగడవడంకింపఁజాలు మహామహిమగల నన్ను నొకగడ్డిపోఁచగానైన నెంచక యిట్లు పరాభవింపఁగలఁడా? నేను చేసిన యాలస్యమేమి? స్నానము జేయఁబోయితిని. బ్రాహ్మణుఁడను. వేదాధ్యయనముచేసినవాఁడను. మునిగణములోఁ గొంత పేరువడసినవాఁడను. మహేంద్రాదిదిక్పాలకులకు వంద్యుఁడను. అట్టి నేను స్నానముచేయక సంధ్యావందన మాచరింపక గడియసేపు జపము సేసికొనక యూరక మ్లేచ్ఛుఁడువలెఁ గూఁడు గుడుతునా? వీని యన్న మెంత, వీఁడెంత? ఈపాడుపొట్ట నొక్కపూట నింపకపోయినంత మాత్రమున మరణము సంభవించునా? సంభవించిననేమి? ఈతని యింట నేను గుడువ. ఇటువంటి క్షత్రియపాంసనునియింటఁగుడుచుట మహాపాతకము." అని పండ్లు పెటపెటఁ గొఱుకుచుఁ బలుకఁడఁగా

నొకచోటc గూర్చుండక నిట్టటు నడుచుచు హుంకరించుచు "ఇదిగో యిప్పుడే వీని పనిబట్టెద. బ్రహ్మాండము తల్లడిల్లజేసెద. దిక్కున్న చో వీఁడు చెప్పుకొనుఁగాక! నాజేసిన ప్రయోగము నెవ్వఁడ నివారించునో చూచెదఁగాక! అబ్జభవుఁడు వచ్చినను వానియబ్బ దిగివచ్చినను నాదెబ్బ తప్పదు. మదోన్మత్తులై బ్రాహ్మణ తిరస్కారంబు గావించునట్టి రాజాధములకు నొక్కసారి బుద్ధిచెప్పెద. చూడుఁడు." అని తనజటాసమూహమునుండి యొక్కజట నూడఁబెఱికి దానినిసమంత్రకముగా నేలవైచె. వైచుట యునాజటలోనుండికృత్యయనునొకానొకశక్తియు హస్తమున శూలాయుధముఁదాల్చి కొలిమివలె మొగము జేవురింపపాదములతో నేల తటతట గొట్టుచు నోరు దెఱచుకొని యంబరీష మహారాజుపైc బడఁబోయెను. అప్పు డంబరీషమహారాజు భయవిహ్వలుఁడై యెద్దియుం దోఁచక యాపద్బాంధవుఁడును సాధుజనరక్షకుఁడును సర్వశక్తుఁడును సర్వసాక్షియు నయిన శ్రీమన్నారాయణుని మనంబున ధ్యానించెను. భక్తవత్సలుఁడగు పుండరీకాక్షుఁడు భక్తజనులపాలిటి పారిజాతముగదా! వెంటనే నారాయణుఁడు దురహంకారపూరితుఁడైన యాతాపసి సృష్టించిన కృత్య నడఁచి మునికి గర్వభంజనము సేయుటకు నవక్రవిక్రమ మగు తన చక్రము నంపెను. అదియు మహాప్రళయకాలాగ్నిచందమున వచ్చి దుర్వాసుఁడు నిర్మించిన కృత్యయను మహాశక్తిని నిర్మూలించి తపోగర్వితుఁడైన దూర్వాసునిపై బడఁబోయెను. దూర్వాసుఁడు హాహాయని యఱచుచుఁ బారిపోయెను. చక్రము వదలక వానివెంటఁ బోవఁజొచ్చెను. అతఁడు మేరుపర్వతగుహాంతరములలో దాఁగబోయెను. అదియు నచ్చోటి కరిగెను. ఆముని భూబిలములలో దాగిన నదియు భూబిలముఁ జొచ్చును. సముద్రము శరణుజొచ్చినను సముద్రముం బ్రవేశించును. ఆకాశమునకుఁ బోయిన

నాకాశముం జేరును. అతఁడు దిక్కులకుం బాఱిన నదియు దెసలం బాఱిపించు. అతఁడు నిలిచిన నిలచును. పాతాళంబున కేగిన పాతాళంబుసొచ్చును. దానికి భయపడి దూర్వాసుఁడు బ్రహ్మలోకము నకుఁబోయి సురజ్యేష్ఠుఁడైన పితామహుని పాదములపైఁబడి "హో పరమేష్ఠి! హో జలజాసనా! హో చతుర్ముఖా! హో విశ్వనిర్మాణదక్ష! దీనుని నన్ననుగ్రహించి చక్రంబువలని భయంబు మాన్పవే" యని ప్రార్థించెను. ప్రార్థించుటయు బంకజాసనుఁ డిట్లని యె. "వత్సా! దూర్వాసుఁడ! ఎంత వెఱ్ఱివాఁడవు? సకలలోకేశ్వరుఁడగు పరమపురుషుఁడు శ్రీమదాదినారాయణుఁడు నిర్వక్రపరాక్రమముగల తన చక్రము నీమీఁదఁ బ్రయోగింప వాని కడుపునం బుట్టిన యర్భకుఁడను నేనా నిన్ను రక్షించువాఁడను? అతని ప్రభావంబు ఆతని చక్రప్రభావంబు నీ వెఱుఁగవే? తపఃప్రభావమున గర్వించి మిట్టిపడిన మేటి రక్కసుల నెందఱిని నాతనిచక్రంబు తెగటార్పలేదు? చక్రానలజ్వాలలు దురహంకారుల గర్వాంధకారప్రదీపాయమానములు. దాని కెదు రెందుగలదు? మహేంద్రుని వజ్రాయుధముగాని శివుని శూలముగాని యముని కాలదండముగాని దాని ముందఱ నొకపూరికైన వచ్చునే? ఆతని యానతి సృష్టికర్తనగు నేనును లయకారుండయిన రుద్రుండును మహేంద్రాది దిక్పాలకులును నష్టవసువులు నేకాదశరుద్రులు ద్వాదశాదిత్యులు చతుర్దశ మనువులు శిరములఁ దాల్చుచుందుము. కావున సుదర్శనచక్రంబు బారినుండి నిన్ను రక్షింపఁజాల. పొమ్ము."

అచ్చోట నాశ నిరాశయగుటయు నమ్మహాముని యతిత్వరితముగఁ గైలాసంబున కరిగి మహేశ్వరుని చరణారవిందములపై బడి వెంబడించుచున్న చక్రంబునుంజూపి యిట్లు వేడుకొనెను. "మహాదేవా! దేవదేవా! విశ్వేశ్వరా! జగత్కారణ! నాగభూషణా!

రక్షింపుము రక్షింపుము. విష్ణుచక్రంబు నాప్రాణములఁ దీయఁగమ కించుచున్నది. విష్ణుదేవుండు నీభక్తుఁడు. నీ ఫాలనేత్రంబుదెఱచిన బ్రహ్మాండమంతయు భస్మపటల మగును. భక్తవత్సలుండవు. నిగ్రహా నుగ్రహ సమర్థుండవు. నీపై దాడివెడలి విజృంభించిన లోకైక సుందరుఁడగు మన్మథుని క్షణములో బిడికెడు బూడిదచేసితివి. హాలాహల విషంబు క్షీరసాగర మథనకాలమునఁ బొడమి బ్రహ్మాండ మంతయు నల్లకల్లోలముచేసిననాఁడు జగద్రక్షణార్థమై నల్లనేరేడు పండు మ్రింగిన చందమున నావిసంబు మ్రింగి కంఠమున నిడికొంటివి. నీ నిగ్రహానుగ్రహ సామర్థ్యమునకు నీ రెండును ప్రశస్తములైన యుదాహరణములు. అట్టి నీకు నన్నుఁ గాచుట యొక లెక్కగాదు." అత ని వేఁడుకోలు విని పరమేశ్వరుండు చిఱునగవునగి యల్లన నిట్లనియె. "ఎవ్వాని నాద్యంతంబు నెఱుంగలేక నేనును సరోజాసనుఁడును సన త్కుమారుఁడును వరుణవాయు వహ్ని వైశ్రవణులును పశుపతి పాక శాసన ప్రముఖులును ననేక దివ్యవత్సరంబులనుండి జిజ్ఞాస చేయుచు న్నారమో, యెవ్వని మాయాసముద్రమునంబడి విశ్వమంతయు భ్రాంతి నొందుచున్నదో, అట్టి పురాణపురుషుఁబురుషోత్తము పుండరీకాక్షు మహిమకు మేఱ యున్నదే? ఆతనిచక్రం బమోఘంబు. దుర్వారం బు. కావున నీవాతనికడకే పొమ్ము. దాని నతఁడే యుపసంహరింప వలయుఁగాని తదన్యుల కలవిగాదు. ఆతఁడు భక్తవత్సలుఁడు. భక్తు లయెడ నపరాధంబు చేసినవారిని తనయెడ నపరాధంబుజేసినవారిని గా భావించు. భక్తులఁ బూజించినవారిని దన్నుఁ బూజించినవారిఁగా నెంచు. భక్తుల ద్వేషించినవారు తన్ను ద్వేషించినవారే. అట్టి పర మేశ్వరునకు నిర్హేతుకముగా నాగ్రహాము దెప్పించినవాఁడ వగుటం జేసి నీవు దండ్యుఁడవైతివి. అతని చరణంబు శరణంబుగా వేఁడుము. పొమ్ము." అని హరుఁ డానతిచ్చుటయు దూర్వాసుఁడు చేయునదిలేక

తిన్నగా వైకుంఠనగరంబున కరిగెను. వృషభము వెంటఁ జను కాపరిచందమున చక్రింబు వాని వెనువెంటఁజనియెను. దుర్వాసుఁడును నారాయణ నిలయంబుజొచ్చి సనకసనందన సనత్కుమార విష్వక్సేనాదులగు వీరవైష్ణవులు బరిసేవింప నిండుకొలువున్న నారాయణునిఁ గనుఁగొని దవ్వులనుండి "ఓనిర్హేతుకజాయమానకరుణ! యోయాదిమధ్యాంతరహిత! ఓయపాకృతదివ్యమంగళవిగ్రహా! ఓక్షీరసాగరశయనా! ఓజగద్రక్షకా! ఓ వేదాంతవేద్యా! నాచేసిన యపరాధమును క్షమియించి చక్రానలభయంబు మాన్పి నన్నురక్షింపవే" యని చేతులు జోడించి యాకాశగంగకు జన్మస్థానంబులగు నడుగుదామరలకు మ్రొక్కి వెండియు నిట్లు వినుతించెను.

మహాసముద్రములకన్న నెక్కుడు గంభీరమగు నీమహామహిమంబు లోతు నెఱుఁగఁజాలక మూర్ఖుఁడనై యహంకారంబు సన్నావేశింపఁ బరవశుఁడనై నీకు పరమభక్తుఁడును సాధుజన శిరోమణియు రాజశేఖరుఁడునగు నంబరీషున కెగ్గుసేసితిని; పంచమహాపాతకములఁ జేసిపతితుఁడై మహానరకములకుఁ బోవనర్హుఁడైన యధమాధముఁడు నయితము నీ నామస్మరణము జేసినయంతమాత్రమున పులుగడిగిన ముత్యమట్లు నిర్మలుఁడై ముక్తికర్హుండగునుగదా! అట్టియెడ నేపాపముం జేయక జన్మమున నొక్క యపరాధమును మాత్రము చేసిన నేను నీ యనుగ్రహంబునకు బాత్రింబునుగానే?" అని చరణంబులు పట్టికొని వదలక పాదసన్నిధినుండి లేవకయున్న మునిపుంగవునిం గనుంగొని దేవదేవుఁడైన నారాయణుఁ డిట్లనియె :— "పరమభాగవతోత్తములైన పురుషులు నాహృదయంబు దొంగిలించుకొని పోవుచుందురు. భక్తియనెడు లతచేత నన్ను నాభక్తులు మదగజంబును బంధించిన చందమునఁ గట్టివైచి తమ యాధీనము చేసికొందురు. వారివెంట నేనును బోవుచుందును. నాభక్తులకు నేనే పరమగతిని. వా

రనన్యగతికులు. వారెందుఁబోయిన దూడ వెంటఁ గోవువలె నేనును వారి వెంటఁ బోవుచుందును. ఆలుబిడ్డలవిడచి యైశ్వర్యముల విడిచి చుట్టాలవిడిచి సుఖములు విడిచి నన్నే నమ్ముకొని యున్నవారి నెన్నఁడు నేవిడిచిపెట్టను. వారికేను దోడు నీడనై యుందును. అట్టిభక్తుల పాలిటికి నేను వజ్రకవచంబను. వారి నిలయంబులకు నేనుపెట్టనికోటను వారికి నేను అంగరక్షకుఁడను. వేయేల! వారికినేను జీతబత్తెములు లేని సేవకుఁడను. ఇంద్రియపంచకంబును జయించి మహనీయులైన భక్తులు పతివ్రతలు తమ పతిని మరగినచందమున మనస్సు నామీఁద నేయుంచి నన్ను మరచి వేరొండుకడకు బోనరు. వారు నన్ను గాదని మంత్రాంతర దేవతాంతర సాధనాంతరములపొంతబోవరు. సాధువులహృదయము నాది. నాహృదయము సాధులది. నేను సాధులపాలిటివాఁడను. సాధులునాపాలివారు. సాధులునన్నె ఱుంగుదురు. నేనుసాధులనెఱుంగుదును. బ్రాహ్మణోత్తములకుఁదపస్సు విద్యయను నీరెండును మోక్షకారణములై యుండును. దుర్వినీతుఁడవైన నీకీరెండునుగర్వకారణంబులయ్యెను. సాధుజనులలో నా తేజము మిక్కుటమై యుండును. వారిని హింసించు దుర్జనులకు నా తేజము వాఁడిగల కత్తియట్టుల భీతి నిగలిగించి మనంబున కాహ్లాదంబు గలుగనీయదు. బ్రాహ్మణుఁడా! నీ కభయప్రదానంబు చెప్పెద వినుము. నీకు శరణంబు నొసంగవలసిన వాఁడను నేనుగాను. నిరపరాధియు నీచేతనిందింపఁబడినవాఁడును నగు నంబరీషుఁడు నీకు శరణంబొసంగుగాక. అతఁడేమి మహాపరాధంబుగావించెనని నీవాతనిమీఁద మహోగ్రమగు కృత్యశక్తిం బ్రయోగించితివి? ద్వాదశి పుణ్యకాలంబు దాటిపోవుచున్నదని ధర్మభీతిచేత వ్రతభంగంబు గాకుండుటకై యతఁడు విద్వజ్జనుల యుపదేశంబున జలపారణంబు జేసెఁగాని నీకుఁ బెట్టకమున్న యతఁడు కుడువఁదలచి కాదు. అతఁడొక కబళమైన నారగించెనా? జలపారణంబున క్షుధా

నలంబు చల్లారునా? అతఁడు నీకుఁ బరమభక్తుఁడు. విద్యార్జన విధే యుఁడు. వేదవేదాంగవేత్త. పరోపకారతత్పరుఁడు. ధర్మశీలుఁడు. అట్టి రాజన్యుని—సజ్జనచూడామణిని—లోకైకవంద్యుని— నిరప రాధిని—నీవు నిష్కారణముగా హింసింపఁ జొచ్చితివి. నీదురహం కారము జెఱచుచున్నది. చెట్టున నగ్నిపుట్టి చెట్టుంగాల్చిన చందంబున నీదుర్వారకోపమే నిన్నింతవఱకు దెచ్చినది. ఏల నీవేదాధ్యయనము? ఏల నీవేదాంతపరిశీలనము? ఏల నీధర్మశాస్త్రవిజ్ఞానము? ఇవియన్నియు నీకోపముముందఱ నడఁగి పోవుచున్నవి. కోపంబునకు నీపేరు సామెతయైనది. చదువుకొన్నం దుకుఁ దపస్స్వాధ్యాయనిరతుఁడవైనందుకు,బ్రహ్మజ్ఞానవిదుఁడవైనం దుకు శాంతంబుగలిగి సర్వభూతదయాళుడవై మెలంగుటకుమాఱుగా కించిదపరాధంబునకుఁగూడ నాజ్యంబుబోసిననిప్పుచందంబున మండి పడియెదవు. ఈవిషయమున నీదురహంకారమే నీయాపదకుఁగారణము గాని వేరేమున్నది? నాభక్తునకు నాబహిఃప్రాణమునకు నీవాపదగలి గింప నేజూచుచునూరకుందునా? కావుననిప్పుడైన నీవుపశ్చాత్తాపము నొంది చేసినతప్పు నొప్పుకొని గుణవంతుఁడు కోపవిదుఁడు గురుభక్తి తత్పరుఁడునగు నంబరీషునిపాలికిఁజని యాతనిశరణంబు వేఁడుము. అతఁ డు నిన్నురక్షించుఁగాక!" అనిజగన్నాథుఁ డానతిచ్చుటయు దుర్వా సుఁడు కర్తవ్యముమఱియొకటిలేమి నరేయని ప్రాణభీతిచేత వచ్చిన తోోవనే విగతదోషుఁడైన యంబరీషునిపాలికిఁజని తనతొంటియహం కారమునుగరువమునువిడిచి యెవ్వనికిఁ దా నపకారము సేయఁదలఁ చెనో యాతనినే శరణముగోరవలసివచ్చినందుకు మనంబున ఖేదపడుచు నాతని పాదములపైఁబడి రక్షింపుమని వేఁడెను.

ఎంతవారికైనను బ్రాణములమీఁది తీపిపోదుగదా! ముల్లోక ములయందు గొప్పపేరువడసినమహాముని దుర్వాసుఁడు తనపాదము

లపైఁ బడుట యంబరీషునకు దుస్సహముగానుండుటం జేసి తనయడు గులు వెనుకకుఁలాగుకొని యాతని లేవనెత్తి తాను లేచి యామహామునికి నమస్కరించి, యభయ మొసఁగి శ్రీహరిచక్రింబు నిట్లుస్తుతియిం చెను. "ఓసుదర్శనచక్రమా! నీకునమస్కారము. నీవేయగ్నిహోత్రు డవు.నీ వేసూర్యుఁడవు. నీవేచంద్రుఁడవు. నీవేజలము. నీవేభూమి. నీవేయాకాశము. నీవే వాయువు. నీవేభూతకోటి. నీవే యింద్రియ సమూహము నీవేసత్యమవే నీవే యజ్ఞము నీవె యజ్ఞఫలము నీవేదిక్పాలకులు నీవెసర్వాత్మవు, సర్వాంతర్యామివి, సర్వసాక్షివి, నీవేవిశ్వము. నీవేకాలము నీవెయజ్ఞభోక్తవు, పద్మనాభుని హస్తా లంకారమవై యాతనిమన్ననంబడసినట్టి దివ్యాయుధరాజమా! మహా మునీంద్రునిరక్షింపుము. నీపేరుదానవగర్భనిర్భేదకము నీధారలు దైత్యేంద్రమస్తకములనుండి రక్తధారలు గురిపించుచుండు. నీధా రలు సజ్జనసంతాపంబులంబాపు వర్షధారలు. నీవుదానవనాయకులకు స్వప్నములలోఁ గనఁబడినను వారునిద్రలోఁ పెద్దనిద్దురపోవుదురు. నీ తేజమువలనఁ జీకటులుపోవును. వెలుఁగుదోఁచుచుండును. నీ తేజంబు స్మరియించిన నజ్ఞానతిమిరంబుపోవు. జ్ఞాన తేజంబు ప్రభవించు నిన్ను బ్రహ్మాదులైన వినుతింపఁజాలరు. నీవునారాయణుఁడు బంప దానవ కోటులఁ బలుసారులు దండింపనరిగితివి. ఇప్పుడు మహామునినిగూడ దండింపనే తెంచితివి. విపన్నుఁడై పశ్చాత్తప్తుడైన యీతాపసోత్తము ని రక్షించి నీప్రసాదగుణము నొక్కసారిజూపుము. శిక్షింపను రక్షిం పను నీక శక్తిగలదు." అనినన్నుతించి చేతులు శిరమున జోడించి "యోసుదర్శనమా! మహేంద్రాదిదేవగణమునకు సౌఖ్యప్రదాత వగు నీకునేనునమస్కరించెద. నీకునేను నమస్కరించెదను. దానవ గర్వాంధకారప్రదీపమగు నీరూపమునకు వందన మొనరించెదను. నే నెల్లప్పుడు ధర్మమార్గమున సంచరింతునేని హరిచరణారవిందభక్తుఁడ

నేని బ్రాహ్మణుండు దేవుండని నేనునమ్మితినేని నేను సత్యవాక్యప్రి యుండనేని శ్రీహరిప్రయుక్తచక్రము మునినాయకునిఁదప్పక రక్షిం చుఁగాక !" యని యుచ్చైస్స్వనముతోఁబలికెను. పలుకుటయు నా చక్రము, తత్క్షణమ జగద్భయంకరంబులగు తనయగ్నిజ్వాలల నుప సంహరించి వైకుంఠంబునకుఁజనియెను. అప్పుడు దుర్వాసోమునిపుంగ వుఁడు ప్రాణాపాయంబుదప్పుటంజేసి మనశ్శాంతిగలిగి యంబరీషుని దీవించి శాంతవచనంబు లుపన్యసించి యిట్లనియె.

"రాజోత్తమా! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు చేయఁజాలని మేలు నీవునాకుఁజేసితివి. ఆపన్నుఁడనై ప్రాణభీతిని వారియడుగులం బడి వేఁడినను వారు రక్షింపనొల్లరైరి. నీవ నాప్రాణములిచ్చితివి. నీ వంటిహరిభక్తుడు జగంబునలేడు. ఎండయనక వానయనక చలియనక యాకలములుదినుచు నడవులలోఁ గడునిడుములుబడి యనేకదివ్య వత్సరములు దపంబుఁజేసినను నాశాయణుఁడుమాయెడఁబ్రసన్నుఁడు గాఁడయ్యె. మహాతపశ్శాలురు నిర్జరులుఁ బడయరానివారియనుగ్ర హము నీవుబడసితివి. నీకన్నధన్యులులేరు. శ్రీహరి నీకు గారాబుచు ట్టమై తల్లియై తండ్రియై సోదరుఁడై మిత్రమై సేవకుఁడై నిన్నుగాచు చున్నాఁడు. ఇట్టిభాగ్య మెవ్వరికిఁగలుగు? రాజా! ఎవరినామంబొక్క సారి చెవుల సోఁకినను సమస్తకలుషంబులు బాయునో యట్టిసరసీ జాక్షుని యనుగ్రహముగలవారికి నేమికొఱంతలుండవు. వారికి సకల కల్యాణములు చేకూరుటయబ్బురమే నాతప్పుసైరించి నన్నుమన్నిం చి కాపాడితివి. నీవంటిదయాళుయు లుందురే? అపకారికినుపకారము చేసిన మహానుభావుడవు నీవొక్కఁడవు. నీయభయప్రదానము చేసు

ఉపఅకు నామేనంబ్రాణములులేవు. ఈప్రాణములు నీవేయొసంగితి వి. నీమేలుమఱువఁజాల" అని కొనియాడ రాజు మునికినమస్కరించి తగినవిధంబున సత్కరించి మృష్టాన్నంబు పెట్టించి సంతృప్తునింజేసె. దుర్వాసుఁడు సంతోషించి యంబరీషుని దీవించి యాకాశమార్గంబునఁ బ్రహ్మలోకంబునకుం జనియెను. అంబరీషుఁడు హరిభక్తితత్పరుఁడై సుఖంబుగ రాజ్యంబు ననేకసంవత్సరములుచేసి ప్రజానురంజకుఁడై పిమ్మట ధరణీభారము పుత్రులకప్పగించి భార్యాసమేతుఁడై తప మున కరిగెను.



# మత్స్యావతారము

వెనుకటికల్పాంతసమయమున ద్రవిడదేశమున సత్యవ్రతుఁడను రాజు పాలించుచుండెను. అతఁడు పరమభాగవతోత్తముఁడు. హరిభజనాతత్పరుఁడు. అతఁ డాహారముమాని వట్టినీరు ద్రావుచు నొకనదీతీరమున హరింగూర్చి తపము సేయుచుండెను. ఒకనాఁ డాధరణీకాంతుఁడు కృతమాలికయనునదిలో నారాయణార్పణముగా జలతర్పణము సేయుచుండ నతనిదోసిట నొకచిన్న చేఁపకనఁబడెను. అతఁడదిచూచి యులికిపడి యామీనశాబకమును మరలనదీజలములో విడిచెను. ఏటినీటంబడి యాచేఁపపిల్ల మహీవల్లభునితో నల్లననిట్లనియె.

"రాజా! మత్స్యజాతిన్యాయమునీవెఱుఁగనిదికాదు. మాజాతి వట్టిపాడుజాతి. పెనుచేఁపలు చిఱుచేఁపలందినుచుండు. ఆభయమొకవంకనుండఁగా నంతకన్న భయంకరమగునాపద మఱియొకటికలదు. జాలరులు వలల, నురుల, నుచ్చుల, నూతలచేతులంగొనివచ్చి మమ్ముం బట్టి చంపుదురు. ఆహా, మాబ్రతుకేమిబ్రతుకు? ఏనుఁగులో నైననుండుదమన్న మాజాతివలనభయము. వాటిబారిని దైవవశమున దప్పించుకొన్నపక్షమున నిర్దయులగు బెస్తవాండ్రవలన భయము. ఈరెండుభయములచేత నీశరణంబు జొరవలయునని నీదోసిటంబడితి కాని నీవువెంటనే నన్ను జలంబులం బాఱఁదోచితివి. నీకిదిపాడియగునా? నీవుభూపాలుఁడవు శరణాగతరక్షణంబునీకుఁ బరమధర్మము కావున దయామయుఁడవై నన్నురక్షింపుము." అనవుడు దానిదీనాలాపముల నాలకించి భూవరుఁడు దానింబట్టుకొని యింటికిఁ దీసికొనిపోయి తనకమండలజలంబులంబెట్టె. అదియానాఁటిరేయిపెరిగి యాకుండికకుం బెద్దదై యిమ్ముచాలక రాజన్యునింజూచి "దేవా! ఈక

మండలము నాకుంజాలకయున్నది. నన్ను వేఱొకచోటనిలుపుము" అని వేఁడెను. వేఁడుటయు నతఁడుదానిందీసి యొకవిశాలమైన జలకలశంబునంబెట్టె. అది ముహూర్తకాలములో మూఁడుచేతులనిడుపై యాకలశముగూడఁ దనకు జాలదని చెప్పినందునఁ గరుణామయుఁడగు నాధరణీధవుండు దానినొకచిన్నమడుగున విడిచిపెట్టెను. అదియు వెంటనే పెచ్చుపెరిగి యామడుగునకగ్గలంబగుటంజేసి రాజన్యుఁడు దానిని మహాసముద్రమునవిడిచెను. ఆహ్రదంబు సైతము చాలనంత మహాకృతి యామీనంబు దాల్చుటంజేసి కృపాలుఁడగునరపాలుఁడు దానిందోడ్కొని మహాసముద్రింబునవిడిచె. విడిచినపిదప నావారిచరంబు ధరణీనాయకునింజూచి "మహాప్రభూ! యీయంభోరాశిలోనున్న మొసళ్ళు గుంపులైవచ్చి నన్ను హింసింప గలవు. ఇంతకాలంబు నన్నుఁగాచి యిందువిడుచుట నీకుబాడియే" యని పలుకుటయు నేలఱేఁడుదానికిట్లనియె. "నీవొక్కదినమునకు నూఱుయోజనములు బెరుగుచున్నదానవు ప్రపంచమునందు ననేకమత్స్యములం జూచితిమిగాని యిట్టి వింతమేనుగలచేప నెన్నడుజూచి యెఱుంగము వినియు నెఱుంగము. చేపలకిట్టి మేనులుండునే? ఈతెఱంగున క్షణక్షణంబును మేనుబెంచి యవిబ్రతుకఁగలవే? నీచరిత్రముమిక్కిలి యాశ్చర్యముగొల్పుచున్నది. నిజముగా నీవొకచేపవుగావు. ఏదో మహాకార్యంబుకొఱకు మీనరూపంబుదాల్చిన శ్రీమన్నారాయణుఁడవో మఱియేదేవతాసార్వభౌముఁడవో నీవై యుందువు. హరిలీలలు మాయలు చిత్రచేష్టలునేనించుక యెఱింగినవాఁడగుటంజేసి నీవు నాపాలిటి భగవంతుండగు నారాయణుండవని తలంచెదను. ఇదివట్టి యూహకాదు. నిజమేయనితోఁచుచున్నది. ఓసృష్టిస్థితిలయకారణహేతుభూతా! ఓచరాచరాత్పరా! ఓయాదిమధ్యాంతరహితా! అనంతా! పారములేని నీమహిమను దెలిసికొనఁజాలని కించిజ్జ్ఞుని

నన్నురక్షింపుము. నీమీనావతారంబు సకలలోకకల్యాణకరంబగుఁ గాక! సనకసనందనాదినిత్యముక్తులు నిరంతరముఁ బరివేష్టింప వైకుంఠంబున నతిసుఖంబుననుండక నీవునీచమైన యీజలచరరూపంబు నేల దాల్చితివో యనుగ్రహించి మాకెఱిఁగింపుము." అని వినయపూర్వకముగా రాజు విన్నవించుటయు నమ్మహామత్స్యంబు రాజున కిట్లనియె.

నేఁటి కేడవనాఁడు బ్రహ్మదేవున కొక్కపగలు నిండును. అటమీఁద నతనికి నొక్కరాత్రియగు. అతనిపగలు మీమానవుల కొక్క కల్పంబగు. అతనిదినాంతమే మీకు కల్పాంతము సకలలోకములు ప్రళయసముద్రంబున మునిఁగిపోవును. కాఱుచీఁకటులు బ్రహ్మాండ మంతయునిండును. సూర్యచంద్రనక్షత్రాదుల కాంతులణఁగిపోవును. నాప్రభావంబున నాప్రళయసముద్రములో నొక్కనావసంచరించును. అందు సప్తమహర్షులుందురు. ఆనావలో నీవుకూడ నెక్కుము. అందు సమస్తౌషధులు సమస్తబీజములు సకలజంతువుల మిథున మొక్కటియు నుండును. ఆమహానౌక తిమితిమింగిలాది ఘోరజలచరంబులబాఱిబడకుండ దానికి ముందువెనుకప్రక్కలనేనుండి యానావనుసంరక్షించుచుందును. అప్పుడువీచునట్టి ఝంఝామారుతములవలన నాయోడ ప్రళయసముద్రతరంగములలో నల్లలనాడి తొట్రుపడకుండ నొక మహాసర్పమాయోడదగ్గఱనుండి యాగాలిఁబీల్చుచుండు. ఓడకుముప్పు వాటిల్లకుండ దానిని నాకొమ్మునధరియించువాఁడ. తన్నిమిత్తమున నేనీమీనావతారము ధరియించితి. ఈమహాసముద్రమునందు యథేచ్ఛగా నేనువిహరింతు. విశ్వంబునకు మహాపత్తు సంభవించినప్పుడు దానిని వెండియునిర్మాణము జేయుటయె నాకుఁ బరమకర్తవ్యంబు నామహిమంబును నటమీఁద నీవయెఱుంగగలవు" అనిపలికియమ్మహామత్స్యంబునిమిషార్థమున నంతర్ధాన మొందెను. అప్పలుకులు విని

సత్యవ్రతుఁడు మిక్కిలి యక్కజంపడి యాసముద్రపుటొడ్డునదర్భలు శయ్యగా బఱచుకొని తూర్పుతలగడగా బరుండి నారాయణస్మరణంబు జేయుచు నాప్రళయకాలంబుకొఱకు వేచియుండెను. అంతట హరిచెప్పినట్లు కల్పాంతంబువచ్చె.

పుష్కలావర్త మేఘములు సంకెళ్ళు విడిపించుకొని యాకాశమండలము నాచ్ఛాదించి సూర్యచంద్రమండలములు గనఁబడకుండఁ జేసి కుండలతో ద్రిమ్మరించినట్టు లెడ తెరపిలేక యహోరాత్రములు వర్షించెను. నదులు సముద్రములు పొంగి పొరలి చెలియలికట్టలు దాటి దేశంబులముంచెను. సకలభూతములు నశించెను. చరాచర పదార్థములన్నియు మహాజలమునమునిఁగిపోయెను. గాఢాంధకారంబు విశ్వమంతయు వ్యాపించెను. పగలు గడచి రేయివచ్చుటంజేసి బ్రహ్మదేవుఁడు సృష్టివ్యాపారమును విరమించి చేయితలగడఁగా బెట్టుకొని కన్నులుమూసికొని గుఱ్ఱుపెట్టి నిద్రపోవఁజొచ్చెను. అట్లునిద్రించుచున్న పరమేష్ఠి ముఖమునుండి వేదములుద్భవించెను. ఆనిగమంబులను హయగ్రీవుఁడను రాక్షసుఁడొక్కఁడు పరమేష్ఠి నిద్రించుట యెఱింగి దొంగిలించుకొనిపోయె. దొంగలెట్టికాలముననుందురు. వారికి సమయాసమయంబులుండవు. ప్రాఁజదువులు తనచేతఁజిక్కెనని యుబ్బుచు హయగ్రీవుఁడు బయలనుండక నెందేని దాగఁజొచ్చి సముద్రమధ్యంబుజొచ్చె. అట్లుప్రామినుకుల దొంగిలించిన దుష్టరాక్షసుని జలంబుల వెదకిపట్టి సంహరించుటకును బ్రళయపయోరాశిమధ్యంబున సంచరించుచున్న నావ మునిఁగిపోవకుండఁ గాచుటకును నారాయణుండు ఱెక్కలు పెద్దమీసములుఁ జిన్నతోఁక బంగారమువంటి పచ్చనివెన్ను మంగళప్రదములైన పొడలు పెద్దమొగము నొకకొమ్ము వింతచూపులుగల మత్స్యరూపముధరించెను. దానిపొడవు లక్షయోజనములు. ఇట్టిదేహముతో హరి జలరాశియందు విహరించుచుండెను

ఆమహామీనంబు మహాసముద్రమున గ్రీడించువేడుక నొకసారిజల జంతువులతో గలసి యాటలాడును. ఒకసారిహిమవన్నని తీరంబులవఱకును నడుకును ఒకసారియాకాశము మీఁదికెగురును. ఒకసారియట్టడుగునకు బోవును ఒకసారి బ్రహ్మాండమంతయు సంచరించి వచ్చును. ఒకతూరిచేఁపలన్నిటినిబట్టి భక్షించును. ఒకతూరి సముద్రపునీటి బుక్కిటబట్టి యుమియుచుండును. ఒకసారి ఱెక్కలు విదల్చును. ఒకపరి మీసముల గదల్చును. ఒకసారి మేను ఝుళిపించుచు. ఇట్లు యథేచ్ఛముగా నాహరి ప్రథమావతారంబు ప్రళయపయోధిలో విహరింపఁజొచ్చెను.

ఆవిలయకాలమున సముద్రములన్నియుఁ బొంగిపొరలి మేర మీరినప్పుడు హరియనుగ్రహమున సత్యవ్రతుఁడు మునిఁగిపోవక యెప్పుడు నావవచ్చు నెప్పుడు దానిం జేరుదునని తలపోయుచుండ సప్తర్షిసమేతంబును, నానాబీజసంయుతంబును నగునావ యెట్టయెదుటం గానఁబడియె. అందు సత్యవ్రతుండెక్కి దాని పార్శ్వంబులందు వర్తించుచు వేయిగన్నుల దానిని రక్షించుచున్న శ్రీమన్నారాయణుని ప్రథమావతారంబును గనుంగొని పులకితశరీరుఁడై చేతులు జోడించి యిత్తెఱంగున సన్నుతించెను. "పరమేష్ఠియు ఫాలనేత్రుఁడును నెవ్వాని మాయాసముద్రమునం బడి తుది గానలేకయుందురో బహుదివ్యవత్సరంబులు దపంబుగావించిన మేటిజడదారు లెవ్వానిం గనుంగొనలేక భగ్నప్రయత్నులగుచుందురో యెవ్వాని నాల్గువేదములుం బొగడనేరకయున్నవో యెవ్వని పాదారవిందములు నిగమవృక్షముయొక్క చిట్టచివరచిగుళ్ళో యట్టి యద్వితీయపరబ్రహ్మమునకు శ్రీమన్నారాయణునకు నమస్కారము. ప్రాకృతులైన గురువుల నాశ్రయించి నిన్ను జేరఁదలంచుట కన్నులులేనివాఁ డొకయంధునిఁచేయిబట్టుకొని పయనము సేయుట. కావున మేము ప్రాకృతగురు

వుల నాశ్రయింపఁజాలము. నీవే మాకు గురువవై సన్మార్గము జూపింపుము. నీవు చూపినదారి నిష్కంటకంబు. నిరపాయంబు. నిర్మలంబు. నీవ గురువవై యుపదేశింతువేని యగ్నిసంపర్కంబున బంగారము విశుద్ధమౌనట్లు మాలో మాలిన్యమెల్లఁ దొలఁగి మేము శుద్ధులమై ముక్తిం బ్రాపించుట కర్హులమగుదుము. నీయనుగ్రహంబున బదివేల వపాలునొందఁగలిగిన యధముఁడుసైతము క్షణములో దేవేంద్రుఁడగును. అట్టియెడ నిన్ను మెప్పించి నీసంపూర్ణానుగ్రహంబునకు బాత్రుడగువాని కెయ్యది దుర్లభంబగును? మిత్రుఁడవై, బాంధవుఁడవై, యాత్మవై, సర్వనియంతవై, రక్షకుఁడవై యున్న నిన్ను సేవింపనేరక మూర్ఖులు క్షుద్రదైవతముల నారాధించి యుత్తమోత్తమగతులం బడయలేక చెడుచున్నారు. అట్లుగాక నేను నిన్నే నమ్ముకొనియుండుటంజేసి నన్ననుగ్రహింపుము. దేవదేవా! యీవిశ్వమంతయు మహాజలధింబడి మునిగిపోయి నిద్రాణంబై యున్నయది. దానిని వెండియు మేల్కొనఁజేసి యుద్ధరింపవే. ఓపరమేశ్వరా! నా కుయ్యాలించి నాలోనున్న నజ్ఞానతిమిరం బడంచి నీలోనికి నన్నుఁగొనిపోయి పునర్జన్మరహితం బైనపదంబు ప్రాపింపఁజేయవే." అతని ప్రార్థనమున కలరి పయోరాశియందు విహరించుచున్న పరమపురుషుఁడు పురాణపురుషుడగుటచేత నతనికిఁ బురాణసంహిత నెఱిఁగించి ధన్యునిజేసె. అది సాంఖ్యయోగగర్భితం బగుతత్త్వంబగుటంజేసి సత్యవ్రతుండు దాని నాకర్ణించి బ్రహ్మస్వరూపంబు నెఱింగి కృతకృత్యుడయ్యెను. సప్తమహర్షులును ధన్యులైరి. ఆరాజు పిమ్మట నేడవమను వయ్యెను.

అనంతరము భగవంతుండగు నారాయణుఁడు పయోరాశిగర్భంబున వెదకివెదకి యొకచోట డాఁగియున్న హయగ్రీవదానవుం జూచి హుంకరించి రెక్కలు విదలించి వాలంబు ఝుళిపించి మేను

వెంచి చూడ్కులు నిగుడించి మీసములు గగుర్పాటునొంద యాత నిపై కుఱికి నొక్కవ్రేటున నవ్వేదచోరుని దుదముట్టించి వాని యధీనముననున్న వేదములందెచ్చెను. అంత బ్రిళయావసానసమయంబు ప్రాపించె. బ్రహ్మదేవుఁ డెప్పుడు మేలుకొనునని యాతని ప్రబోధంబున కెదురుసూచుచున్న మహర్షులకు మహానందముకలుగునట్లు, ప్రక్కను నిద్రించుచున్న భారతీదేవికిఁ గన్నులపండువగునట్లు నిద్రావశమున మలినమైన తేజంబు వెండియు యథాస్థితిని బొందునట్లు, బ్రహ్మదేవుఁడు తనయంగంబులు గదలించి యావులించి వ్రేళ్ళు మెటికలు విఱచి, యొడలు విఱుచుకొని కన్నులు నలుపుకొని నిద్రి మేల్కని కూర్చుండెను.

అతని మేలుకొలుపే సృష్టి. నిద్రియే ప్రళయంబు. అతఁ డెప్పటియట్ల సృష్టిగావింపదొడంగెను. విశ్వంబు వికాసమొందెను. సూర్యచంద్రులు వెలుఁగఁదొడగిరి. బ్రహ్మాండమంతట నవచైతన్యము నెలకొనెను. ఆసమయంబున నారాయణుఁడు హయగ్రీవుని జంపి తెచ్చిన వేదములను ధాతకు సమర్పించెను. అవి యందుకొని పితామహుఁడు కృతకృత్యుఁడై తన పితయు జగత్పితయునైన పద్మనాభునకు నభివాదనముచేసి నాలుగుమొగంబులతో నతనిని నుతియించెను.

క. హరిజలచరావతారముఁ
బరువడిఁ బ్రితిదినముఁ జదువఁ బరమపదంబు
న్నరుఁడొందు వాని కోర్కులు
ధరణీశ్వర సిద్ధిఁ బొందుఁ దథ్యముసుమ్మీ.

మ. ప్రళయాంభోనిధిలోన మేన్మఱచి నిద్రింజెందు వాణీశుమో
ముల వేదంబులుగొన్న దైత్యుని మృతింబొందించి సత్యవ్రతుం
డలరన్ బ్రహ్మముమాటఁ దాని లిపి సర్వాధారుఁడై మీనమై
జలధింగ్రుంకుచుఁ దేలుచున్మెలఁగు రాజన్మూర్తికిన్మ్రొక్కెదన్.

---

# కూర్మావతారము

బలిచక్రవర్తి రాక్షససార్వభౌముఁడై యుండఁగా దానవులు పెచ్చుపెఱిగి దేవతలను బలుతెఱఁగుల హింసించిరి. దుర్వాసమహా మునిశాపమున దేవేంద్రుఁడు పరాక్రమమెల్ల మందగింప శత్రువుల దాడి నాపలేకపోయెను. అప్పుడు దిక్పాలకులు, దేవతలలో ముఖ్యు లు దేవేంద్రసహితముగా మేరుపర్వతముమీఁదనున్న బ్రహ్మదేవుని కడకుఁ బోయి తమయిక్కట్టులు చెప్పుకొనిరి. పరమేష్ఠి వారి దీనా లాపముల నాలకించి తానేమియుం జేయఁజాలక యిట్లనియె. "నేనును శంకరుఁడును మీరును సిద్ధసాధ్యవిద్యాధరాదిదివిజులును జరాచర ములగు సమస్తపదార్థములును నెవ్వానికళలమై యున్నారమో యట్టి భగవంతుఁడు నారాయణుఁడే దీనికిం బ్రతిక్రియచేయవలయునుగాని మనమేమి చేయఁగలము? విష్ణుమాయాసముద్రింబునంబడి మునిఁగి యెందఱుదానవేంద్రులు నశియింపలేదు. కావున హరిచరణంబు శర ణంబుగాఁజేసికొనుట యుత్తమము. అచ్చటికిఁ బోవుదము రండు." అనవుడు వేల్పులు వల్లెయని యాతని ననుసరించిపోయిరి. అజుఁడు వైకుంఠమునకరిగి నారాయణుంగనలేక పురుషసూక్తంబుచేతనుఋక్కు లచేతను యజస్సులచేతను సామములచేతను భావగర్భితములగు తన వాక్కులచేతను నాదేవదేవుని నానాప్రకారముల నుతియించెను. వే దోక్తప్రకారము గావింపబడిన యానన్నుతులకు సమ్మోదమంది సరసి జాక్షుఁడు కోటిసూర్యమండలము లొక్కసారి యుదయించిన తెఱఁ గున దివ్యతేజోమూర్తియై కానఁబడ దివ్యులు వానిని జూడలేక నేత్ర ములు మిఱుమిట్లుగొల్ప యచ్చెరువడి కొంతవడికిఁ దెలిసి హర్షపుల కితగాత్రులైరి. చతుర్ముఖుఁడును హరుఁడును మాధవుని మహిమం

బుమతిమతి యిట్లు గొనియాడిరి. "మేఘములనుండి వర్షరూపమున బడిన జలమంతయు నెన్నియేఱులలోఁ బడి ప్రవహించినను నెట్టకేలకు సముద్రగామి యైనయట్లు సర్వదేవతలు చేసిన పూజా నమస్కారములు నీకే చేరును. నీవు సర్వదేవస్వరూపుఁడ వగుటం జేసి చెట్టుమొదటఁ బోసిననీరు క్రమక్రమంబుగఁ గొమ్మలకు నాకులకుఁ బూవులకుఁ గాయలకుఁ బ్రాఁకి వానిం జల్లగఁజేయునట్లు భక్తులు మా కొనర్చు నర్చలు నభివాదములు నిన్నుఁ జేరును. నీవణువులలో నణువువై మహాపదార్థములలో మహాపదార్థమవై యుందువు. ఘటమునకు మన్నే యాధారమగునట్లు సృష్టికర్తకు నీవె యాధారంబవు. ఈవిశ్వమంతయు నీ వికారమైనది. నీ పరిభావంబుననే సృష్టి యగుచున్నది. నీ పరిభావంబుననే విశ్వమునకు స్థితికలుగుచున్నది. నీ పరిభావంబుననే దానికి లయముగలుగుచున్నది. పృథివికి మేఱ యున్నది. ఆకాశమునకు మేఱయున్నది. సముద్రములకు మేఱయున్నది. నీ మహామహిమకు మాత్రము మేఱలేదు. నీమహిమ దెలిసికొనఁజాలని కించిజ్జ్ఞులమగు మమ్మనుగ్రహింపుము. నీ సందర్శనంబున మాకిఁక సకలశుభంబులగు" నని వినుతించిన వేల్పులకుఁ బ్రసన్నుఁడై మేఘగంభీరంబైన నాదంబున నిట్లనియె:— "ఓబ్రహ్మాది నిర్జరులారా! బలముచెడిన కాలమున మరల బలము చేకుఱుదాఁక మనము పగవారి కణఁగియుండవలయును. బలసంపన్నులమైన పిదప విజృంభింపవచ్చును. కావున మీ రిప్పుడు బలిచక్రవర్తికి విధేయులై సామమునఁ గాలము పుచ్చుడు. పిమ్మటమంచిదినములు వచ్చును. మీకుఁ గల్యాణమగు. క్షీరసాగరమును మీరును దానవులును గలిసి మథింపవలయు. అం దమృతము బుట్టు.ఆయమృతమును ద్రావుడ రేని మీకు జిరాయువగు. నిరామయంబగు. పాలసముద్రములో నెల్లమోషధులను బడవైచి మందరనగంబుఁ బెల్లగించి తెచ్చి కవ్వ.

ముచేసి సర్పనాయకుఁడైన వాసుకిని గవ్వపుఁ ద్రాడుగాఁజేసి పాల సముద్రమును దఱిచితిరేని దానియం దమృత ముద్భవించును. అందు విషముగూడ ప్రభవించును గాని దానినిగుఱించి మీరు విచారింపవద్దు. అది మథింపఁబడుట కుపాయంబు సెప్పెద. అమృతము సంపాదించు వఱకు మాత్రము దానవులతోఁ గలసి మెలసి యుండుడు." అని కేశవుఁడు పలికి యంతర్ధానము నొందెను. దివ్యులెల్లరుఁ దమతమ నెలవుల కరిగిరి. నాటంగోలె దేవతలు రాక్షసులతో వైరంబు బెంపక మైత్రి పాటింపఁజొచ్చిరి. అసురులు దేవతలను సహజవైరమున హింసింపజూచుచుండ బలిచక్రవర్తి వారిస్నేహభావమును దలంచి వారిని హింసింపకుండ రాక్షసుల వారించెను. దేవేంద్రుండు బలిచక్రవర్తి యడుగులకు మడుగులొగ్గుచు నతని యాజ్ఞ శిరంబునంబూని యతని ప్రియమంత్రియట్లు సర్వకార్యంబుల నెఱపుచు వాని సేనానాయకుల యనుగ్రహమునకుఁ గూడ బాత్రమగుచుండెను. నముచికి నమస్కారంబుచేసి శంబరునిచేత శహబాసని మెప్పువడసి విప్రజిత్తునకు వినయంబుచేసి శుంభనిశుంభులకు సూడిద లర్పించి కాలకేయులకుఁ గానుకలువెట్టి యతఁడు దినములు పుచ్చుచు నొక్కనాఁడు బలిం డాసి కొన్ని ప్రియవాక్యంబులు ముందు పలికి వెండియు నిట్లనియె:— "మన మక్కసెల్లెండ్ర సంతానము. మనలో మనకు వైరంబు వలదు. ఈసామ్రాజ్య మెవ్వరు గుడిచిన నేమి? చిరకాలము మే మనుభవించితిమి గాన యింక మీఁద మీర నుభవించుటపాడి. మేము నీ సేవకులమై నీపనుపులు చేసి మనియెదము. సముద్ర మథనముచేసి యమృతము సంపాదించితిమేని కడు సుఖంబున జీవింపవచ్చును. సముద్రమథనంబునకును తన్నిమిత్తమై మందరనగంబు దెచ్చుటకును ననుజ్ఞ నిచ్చి యసురులం బంపవేఁడెద." అనవుడు బలి యది మేలకాక యని పలికి దైత్యదానవ

రాక్షసులను మందరనగంబు దేఁ బొమ్మనెను. సురాసురు లన్నద మ్ములయట్ల కలసిమెలసి ప్రియవాక్యంబులు సెప్పికొనుచు మందర పర్వతముకడకుఁ బోయి కుద్దాలములతోడను, గునపములతోడను, బాఱలతోడను దవ్వి పెల్లగించి శిరములపైఁ బెట్టికొని కష్టపడి మోచి సముద్రంబు తెరువునఁ బోవుచుండ భార మధికమయ్యెను. పర్వతము నేలఁగూలెను. దేవతలు, రాక్షసులు దానిక్రిందఁబడి యనే కులు మరణించిరి. కొందఱు వికలాంగు లైరి. "ఏల బహ్మ కడకుఁ బోయితిమి? అతఁ డేల జనార్దనుని సన్నిధికి మమ్ముఁ గొనిపో యె? పాలమున్నీరు తఱచునదియని యతఁ డేల యుపదేశించె? వెడఁ గులమై యేల యీ యసాధ్యకార్యములకు దొరకొంటిమి." అని వేల్పులు విచారించిరి. రాక్షసులు నట్లె దుఃఖించిరి. ఆశ లడుగంటి వారెల్ల నచ్చటఁ గూలఁబడి విచారించుచుండ నారాయణుఁడు గరుడారూఢుఁడై యచ్చోటికిఁబోయి కుంఠితాశులై యున్న దేవా సురులకు వెండియు నుత్సాహంబు పురికొల్పి భయంపడవలదనిచెప్పి యాపర్వతము మోచి సముద్రంబుకడ నిలుపుమని గరుడుని కాన తిచ్చెను. గరుత్మంతుడు దానిం దన వీపుపై నిడుకొనిపోయి క్షీరసాగర తీరంబునందు దించె.

అంతట నారాయణుఁడు వాసుకిని బిలువనంపి సముద్రమథన వృత్తాంతం బెఱిఁగించి మేనుదువ్వి ప్రియంబులుసెప్పి కవ్వపుంద్రాడు గా నుండుమని కోర నతండును మధుసూధనుమాటల కలరి మెచ్చు కొనియె. అప్పుడు దేవదానవులు ఫణిరాజును శైలమునకుఁ జుట్టి నడుములుగట్టి శిఖలు ముడివైచి హుంకించి హుమ్మని పర్వతంబు నెత్తి సముద్రంబుపైఁ బెట్టి యారెండుతెగలవారు మథింపమొదలు పెట్టిరి. దేవతలు తోఁకపట్టుకొనిరి. రాక్షసులు పుచ్ఛముపట్టుకొన నిష్టములేక తలపట్టుకొని తఱవఁజొచ్చిరి. కొంత మథించునప్పటికి

మందరమహీధరంబు సముద్రింబునం బడిపోయెను. సురాసురులు దానినితమలావుపెంపునఁ బైకెత్తఁజాలకపోయిరి. ప్రియత్నంబు నడుమ భగ్నంబగుటంజేసి దేవతలు పూర్వదేవతలు విషణ్ణహృదయులైరి. దైవయోగంబు నెవ్వఁడు దప్పింపజాలు. మన కమృతంబు లభించు నదృష్టములేదు అని సురాసురులు గుంపులు.గూడి దుఃఖింప దొడంగిరి.

ఇట్లు సముద్రితీరంబున గూర్చుండి చింతాసముద్రిమున ము నింగిన వేలుపులకుం దొలివేలుపులకు మేలుసేయఁ దొడంగి యఘట నఘటనా సమర్థుఁడగు నచ్యుతుండు లక్షయోజనముల పొడుగు గలిగి దానికిందగిన వెడల్పుగలిగి కడుకఠోరమైన బొరుసు గలిగి బ్రిహ్మాండమంతయు లోపలి కొక్కసారి బ్రివేశపెట్టగల వెడదనోరు గలిగి, బ్రిహ్మాండమంతయు మోచినను గదలని పాదములుగలిగి, చరాచర భూతకోటి యెల్లనుండదగిననిమ్మ కడుపుగలిగి దుర్ని రీక్ష్యప్రిభావంతమైన తేజంబుగల్గియొప్పారు తాఁబేటిరూపుదాల్చి యాకొండక్రింద నిలిచెను.

కృతజ్ఞులై దేవేంద్రాది దివ్యులును రాక్షసులును జయజయ ధ్వనులుచేసి నారాయణుని పలుతెఱంగులఁ బొగడిరి. సముద్రిమును గలశముజేయుటయు, త్రాచుఁబాము తరితాడు జేయుటయు మేటి కొండ గవ్వముచేయుటయు సర్వశక్తుండగు హరికిఁదక్క నెవ్వరికి సాధ్యంబులని యెల్లవారు నచ్చెరుపాటు నొందఁజొచ్చిరి. అప్పుడు మందరాచలము కూర్మనాయకుని కర్పరంబునుదాఁకి సముద్రింబునం దిరుగుచుండ దశదిశలుమారుమ్రోయునట్లు ఘుమఘుమాయమాన శబ్దంబు పొడమెను. ఆమథనపీడ భరింపనోపక సముద్రిండు నెత్తురు పసరుగ్రిక్కుచున్నాఁడో యనఁగ రత్నరాసులు వెలికివచ్చెను. సము ద్రిని క్రొవ్వెల్ల వెలికివచ్చుచున్నదోయన్నట్లు క్రొన్నురుగు తెప్పలు

నలుదెసల వ్యాపించెను. సాగరంబుననున్న మొసళ్ళు చేపలు మొదలగు జలచరంబుల మహానాదంబు పిక్కటిల్లెను. ఈభయంకరకర్మంబు మాన్పుఁడని యఱచినట్లు తరంగఘోషంబు లెల్లయెడలనిండెను. తీరంబుననున్న మహీరుహంబు లెల్ల గుభాల్గుభాలున గూలెను. ఆఘుమఘుమధ్వనులకు బ్రహ్మాండంబు ప్రతిధ్వనులీయఁ దొడంగెను. వాసుకియలసి సొలసి నోట నురువులు గ్రక్కెను. దేవదానవులు కడుడస్సి వగర్చుచు నెడనెడ విశ్రమించుచు నింక నెంతసేపుతరువవలయు నింక నెప్పుడమృతంబుపుట్టునని హరినడుగుచుఁ బట్టినపట్టు వదలక బనిసేయఁజొచ్చిరి. నిరుత్సాహంబు గలుగకుండ హరియు వారికి నెడనెడ ధైర్యంబుజెప్పి యాశలుచెడకుండఁ జేసె. అంతసేపు మంధరనగంబు తనవీపుపై నొఱసికొని తిరిగినను గూర్మనాయకుని వీపుతీట మాత్రము మందగింపదయ్యె.

అట్లు మహాద్భుతముగా దేవదానవులు దుగ్ధవారాశి మథించుచుండ మహాభయంకరముగా నందు హాలాహలవిషముపుట్టెను. అది ప్రళయకాలరుద్రుని మూఁడవకంటి నిప్పునకు నూఱురెట్లు తీవ్రమై కల్పాంతవేళల నుదయించు ద్వాదశాదిత్యుల తేజమునకు వేయిమడుగులై కల్పాంతమందుఁ జగమునావరించు మహాగ్నికన్న భయంకరమై జగదవసానసమయమున బుష్కలావర్తమేఘములనుండి జాఱు పిడుగులకన్న నతిదారుణమై భగభగాయమానములగు పెనుమంటల తోడను ఛటచ్ఛటాయమానములగు ధ్వనులతోడను తళతళమని దెసల వ్యాపించు నెరసులతోడను లోకములన్నిటిం గ్రమ్మెడు పొగల తోడను లోకమంతయు నొక్కసారియంటుకొన్నచందమున నెల్లయెడల వ్యాపింపదొడఁగెను. దేవతలు పూర్వదేవతలు దిగ్భ్రమజెంది కొంతసేపూరకుండిరి. పిఱికివాండ్రు జడిసిపరుఁగెత్తిరి. పర్వతంబులు గాలి భస్మములయ్యెను. వృక్షములెల్ల బొగ్గులయ్యెను. జంతుజాలం

బులు మాడిపోయెను. నదీనద సముద్రంబుల జలంబులు మరగి యావిరిరూపంబున పైకెగసెను. విహంగకోటులుచచ్చెను. ఎవరికిందల దాచుకొనుట కెందునుచోటులేకపోయెను. గంధర్వవిమానంబులు కమలిపోయెను. సిద్ధసాధ్యులు చీకాకుపడిరి. విద్యాధరులు వెఱగుపడిరి కిన్నరులు కిమ్మనకయూరకుండిరి. యక్షులు పక్షులట్ల గగనవీథికిం బఱచిరి. గ్రహంబులు చిక్కుపడియెను. నక్షత్రములు డుల్లెను. బ్రహ్మాండములు తహతహంబడెను? పురంబులు పరశురామప్రీతియయ్యెను. దిక్కులు బీటలువారెను. అది యకాలప్రళయముపగిదిం దోచెను. దాని కడ్డముపోయివారించునట్టి దక్షుండులేమి దేవతలనక రాక్షసులనక మనుష్యులనక నెల్లభూతములు మ్రందఁజొచ్చెను.

విష్ణుదేవుఁడు విన్నపోయియుండెను. పరమేష్ఠి చేయునదిలేకసురగణప్రార్థితుఁడై యమ్మహాపదభక్తవశంకరుఁడగు శంకరుఁడొక్కఁడే నివారింపఁగలఁడని నమ్మి కైలాసమునకుజని "చంద్రశేఖరా! గంగాధరా! నాగభూషణా! నందివాహనా! పాహిపాహి" అనుచు నాతని యడుగులపైఁబడి యిట్లుపొగడెను.

సీ. భూతాత్మ భూతేశ భూతభావనరూప
దేవమహాదేవ దేవవంద్య
యీలోకములకెల్ల నీశ్వరుండవునీవ
బంధమోక్షములకుఁ బ్రభుఁడవీవ
యార్తశరణ్యుండవగు గురుండవునిన్నుఁ
గోరిభజింతురు కుశలమతులు
సకలసృష్టిస్థితిసంహారకర్తలై
బ్రహ్మవిష్ణుశివాఖ్యఁబరఁగుదీవు
గీ. పరమ గుహ్యమయిన బ్రహ్మంబుసదసత్త
మంబు నీనశక్తి మయుఁడవీవ

శబ్దయోనివీవ జగదంతరాత్మవు
నీవపాణ మరయ నిఖిలమునకు.

క. నీయంద సంభవించును
నీయందవసించియుండు నిఖిలజగంబుల్
నీయంద లయముఁబొందును
నీయుదరము సర్వభూతనిలయమురుదాా!

ఆ. మూఁడుమూర్తులకును మూఁడులోకములకు
మూఁడుకాలములకు మూలమగుచు
భేదమగుచుఁదుది నభేదమైయొప్పారు.
బ్రహ్మమనఁగ నీవ ఫాలనయన.

క. నీకంటె నొండెఱుంగము
నీకంటెం బరులుకావ నేరరు జగము
ల్నీకంటె నొడయఁ డెవ్వఁడు
లోకంబులకెల్ల నిఖిలలోకస్తుత్యా.

మహాదేవా! హరియనుమతమున దేవదానవులు మందరము కవ్వముఁజేసి వాసుకిందాిడుజేసి దుగ్ధవార్థికలశముజేసి యమృతము బడయుకొఱకు దరచుచున్నారు. అందుహాలాహాలంబను విషంబుబుట్టి జగంబుల గోలాహలంబు సేయుచున్నయది. విశ్వమంతయు విశేష సంక్షోభంబు చెందుచున్నయది. అదివీరువారనక యాలోకమాలోకమనక బ్రహ్మాండమంతయు నాక్రమించి దహించుచున్నది. ఈమహాపద నివారింప నీవుదక్క మఱెవ్వారులేరు. కావునరక్షింపవలయు."

అని పలువిధంబులఁ బ్రార్థింప నమ్మహాదేవుఁడు మనంబున కనికరంబు కరంబు మల్లడిగొన సన్నిధానవర్తినియైన కాత్యాయని దేవింజూచియిట్లనియె. "కల్యాణీ! వింటివా యీవార్త? చల్లనిపాల సముద్రమునందు ఘోరమైన హాలాహలవిషముపుట్టెనట! మంచివారి

కడుపున దుర్జనులిల్లైజనించుచుందురుగదా. అమృతముఁ గొఱకు దరచుటయేమి, అది లేదుసరికదా లోకంబులు భస్మపటలము సేయు హాలాహలము పొడమ నేమి? కాలవైపరీత్యమున నెట్టివైచిత్ర్యములు గలుగునో నెవఁడుచెప్పనోపు? ఇమ్మహాపదలోనున్న భూతజాలముల రక్షించుట పరమధర్మముగాదే!

క. పరహితము సేయు నెవ్వఁడు
పరమహితుండగును భూతపంచకమునకుం
బరహితమె పరమధర్మము
పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ!

కావున నేనిప్పుడు హాలాహలమును శిక్షించి తియ్యనిపండులో నిరసము దాఁవినట్లు దానిం దాఁచి లోకములయలజడి మాన్పెద" ననవుడు గౌరి "దేవా! యట్లచేసి లోకపరిత్రాణము సేయుఁడు. మీరు తలంచుకొన్న నది మీకొకలెక్కయగునే!" యని యప్పనికిం బురికొల్పెను.

ఆహా! కళత్రమన్న నామెయే కళత్రముగదా! హరికి బ్రహ్మకుఁ దక్కిన దేవతలకు సాధ్యముగాని యమ్మహాకార్యముఁ జేయుమని యనగా విషముమ్రింగుమని భర్తనుపంచుట కామెకుఁ దనమంగళసూత్రమునెంతనమ్మినదో? లోకోపకారార్థమై భర్తను సాహసకార్యములకుం బురికొల్పునట్టి యంగనలుండుట యరిదికదా!

తనచుట్టునుజేరి దేవరాక్షసులు జయజయధ్వనులు చేయుచు బొబ్బలిడుచుండఁగా మహేశ్వరుఁడు హాలాహలవిషముంజూచి "పోకు పోకు నీపనియైన" దని హుంకరించిదానింబట్టుకొని ముద్దజేసి నేరేడుపండుచందంబున చేతనిల్పి చిమ్మిలియుండ దిన్న చందంబున మ్రింగెను. అదిమ్రింగునప్పుడు శంభునిమొగమున వైవర్ణ్యముదోఁప లేదు. మేనంజెమ్మట పొడమలేదు. నోటవెలపరము గానఁబడలేదు.

ఆభరణములైన పాములుకదలలేదు. కనులెఱ్ఱబడలేదు. తన యుదరమున బ్రహ్మాండము లుండుటంజేసి వాటి కాపదగలుగు నేమోయని శంకించి యావిసము కడుపులోఁబడకుండ కంఠబిలమునందే నిలిపెను. సర్వశక్తున కసాధ్యమేముండును?

ఆ. హరుఁడుగళమునందు హాలాహలముపెట్ట
గప్పుగలిగి తొడవుకరణి నొప్పె
సాధురక్షణంబు సజ్జనులకు నెన్న
భూషణంబుగాదె భూవరేంద్ర!

ఆమహాసాహసకార్యముంజూచి హర్షంబు నద్భుతంబు మిక్కుటముగ బొంది పద్మనాభుఁడును హిరణ్యగర్భుఁడునుతక్కిన వేల్పులును మహేశ్వరుని బహువిధంబుల బ్రస్తుతించిరి. లోకముల శాంతినెలకొనెను.

ఆపాలసముద్రమును దరిచ్చునవసరమున మిక్కిలి తెల్లనిమేని తోడను దియ్యనిపాలు స్రవించు పెద్దపొదుగుతోడను జక్కనికొమ్ములతోడను కోరినకోరికలనిచ్చునట్టి కామధేనువుజనించెను. దేవతలు బ్రహ్మర్షులు దానిపాలు నెయ్యి మొదలగునవి యజ్ఞములయందు హోమముల కుపకరించుననిదానింజేకొనిరి. అనంతరమాసముద్రమునఁ జంద్రబింబమునవలె ధవళమై సకలకళ్యాణలక్షణలక్షితమై యుచ్చైశ్శ్రవమను గుఱ్ఱముపొడమెను. బలిచక్రవర్తికి దానిమీఁద నిచ్ఛలేకపోయెను. వెంటనేదానినింద్రుఁడు గ్రహించెను. పిమ్మట నాలుగు దంతములును దెల్లని మేనునుగలదై యైరావతమను నేనుఁగుపుట్టెను. అవ్వల నెల్ల ఋతువులయందును బువ్వులుపూచునట్టియు, యాచకుల కోర్కులఁ గోరినట్లు దీర్చునట్టియుఁ గల్పవృక్షముగూడ జనించెను. అనంతరమచ్చరలు ప్రభవించిరి. అటమీఁద సుధాకరుఁడైన చంద్రుఁడు జన్మించెను. తరువాత తొలుకారుమెఱుఁగుకైవడి తళతళమను దేహకాంతులు దెసలం గ్రమ్మకొన పాలమున్నీటికిఁ గారాబుకూఁతు

నై కలుములచెలియైన లక్ష్మీదేవిజనించెను. అఖిలలోకకళ్యాణప్రద మైన యామెరూపంబుఁజూచి దైత్యులు నాదిత్యులునక్కజఁపడిరి. మంగళస్నానంబు జేయింపఁదలంచి యామె కింద్రుండురతనాలపీటబెట్టెను. వేల్పు టువిదలు పుణ్యజలపూర్ణములయిన కలశములం దెచ్చియిచ్చిరి. పుడమి చివుళ్ళ నిచ్చె ఆవుఁలు పంచగవ్యంబులనిచ్చె వసంతుఁడు తేనె నిచ్చెను. మునులు కల్పముం జెప్పిరి. మేఘములు మంగళతూర్యా రావంబులు సలిపెను. గంధర్వులు పాడి యాడి యానంద మొనగూర్చిరి. దిగ్గజములు తొండములతో నీరముంచి యామెకు మంగళ స్నానము గావించెను. తండ్రియైన సముద్రుఁడు గారాబుకూఁతురు కట్టుకొనుటకై పచ్చని పట్టుకోకల రెంటినిచ్చెను. వైజయంతీపుష్ప మాలికను వరుణదేవుఁడు సమర్పించెను. గంటలయొడ్డాణమును, కంకణములను రత్నహారములను విశ్వకర్మ చేసియిచ్చెను. భారతీదేవి పరిశస్తమైన ముత్తియంపుసరము కానుకగా నిచ్చెను. తమ్మిచూలి తామరపూవు నిచ్చెను. శేషుఁడు మొదలగుపన్నగులు కుండలముల నూడిదగా నిచ్చిరి. శ్రుతులు స్తుతులు జేసెను. ఎల్లజగములకు నేలిక సానివై యుండుమని దిశలు దీవించెను. అక్కడ గుమిగూడిన సురాసురు లిట్లనుకొనిరి. "అమృతంబు చిలుకునట్టిపలుకుల నీమె యెవ్వనిం బలుకరించునో యాతఁడే పరబ్రహ్మము. ఈమె యెవ్వని పాణిగ్రహణంబు సేయునో యాతఁడే లోకవల్లభుఁడు. ఈమె యేయింట వసియించునో యది పరమకల్యాణనిలయము. నెలఁత వాలుచూపు లెందుపరిసరించు నది సిరుల కాటపట్టు. ఈమెలనాఁగ చిఱునవ్వువెన్నెలలు దారిద్ర్యాంధకారనివారకంబులై సకలసౌఖ్యప్రదంబులగు." ఆమె చక్కఁదనము నామె వాల్గంటిచూడ్కులు నామె ముఖలావణ్యము నామె యొయ్యారము నామె నడకలహొరంగుఁ జూచి వేల్పులుం దొలివేల్పులుఁ జీకాకుపడిరి. హరిమాత్రము నిశ్చలుఁడై యుం

డెను. ఆకాంతారత్నము తన కనుకూలుఁ డగునాథుని వరింపఁదలంచి దనలో నిట్లు వితర్కించెను. "కొందఱు తమోగుణప్రధానులు, కొందఱు రజోగుణప్రధానులు. కొందఱు కళత్రసమేతులై యుండుటం జేసి వారిని వరించిన సవతిపోరు సంభవించు. కొందఱి వరించుట నట్టేట యిల్లుగట్టుకొనుట. కొందఱికి దయాదాక్షిణ్యములు లేవు. కావున నిట్లు చేసెద.

సీ. అమరముత్తయిదువ నై యుండవచ్చును
వగుసను సవతులెవ్వరును లేదు
వెలయంగ నశ్రాంతవిభవ మీతనియిల్లు
శృంగారచందన శీతలుండు
గలఁగఁడెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి
విమలుండు గదిసి సేవింపవచ్చు
నెఱినాఁడితిరుగఁడు నిలుకడగలవాఁడు
సకలకార్యములందు జడత లేదు
గీ. సాధురక్షకుండు షడ్వర్గరహితుండు
నాథుఁడయ్యెనేని నడపనోపు
నితఁడె భర్తయనుచు నింతి సరోజాక్షుఁ
బుష్పదామకమునఁ బూజసేసె.

అట్లు లక్ష్మినారాయణుని వరింప సముద్రుఁడు తనకడనున్న కౌస్తుభమాణిక్యమును హరి కర్పణముచేసెను. హరియు దానిని మహాలక్ష్మిని తన వక్షస్థలంబున ధరియించెను. దివ్యులు పుష్పవర్షము గురిసిరి. గంధర్వులు మంగళతూర్యనాదములు జేసిరి. లోకములు ప్రసన్నములయ్యెను. ఆనంద మెల్లచోట్ల నెలకొనెను. ఆసముద్రమునందుఁ బొడమిన యుచ్చైశ్శ్రవమునే. గాక యైరావతమును గల్పవృక్షమును గొంద రచ్చరలనుగూడ దేవేంద్రుఁడు గ్రహించెను.

వేడిమైన హాలాహలవిషముపొంతను జల్లనిపదార్థ ముండవలయునని గాంబోలు మహేశ్వరుఁడు జటాజూటమునఁ జందమామను దాల్చెను. ఆసముద్రమున వారుణియను కన్యకకూడ బుట్టెను. దానిని రాక్షసులు స్వీకరించిరి. అన్నిటికన్నమున్న జ్యేష్ఠాదేవి యాసముద్రమున జన్మించెను. వికృతరూపధారిణియగుటంజేసి దానిని దేవదానవులలో నెవ్వరు స్వీకరింపరైరి. భూలోకమునందు మర్యాదహీనులు నసత్యసంభాషణులు కలహప్రియులు వంచకులు నగువారిగృహములయం దుండి వారిని లేములపాలుచేయుచుండుమని బ్రహ్మ యానతిచ్చెను. అది కలిసమేతమై యట్టివారియిండ్లే దన కునికిపట్టులుచేసికొని తిరుగుచుండును.

ఆసముద్రమును మథింపమథింప నెట్టకేలకు లేఁబ్రాయంబువాఁడు, నాజానుబాహుఁడు, పీతాంబరధరుఁడు, నీలమేఘశ్యాముఁడు, విశాలవక్షుఁడు, సింహబలుఁడు, నారాయణాంశసంభూతుఁడు నైనధన్వంతరి యను మహామహుఁడు తన ప్రశస్తహస్తమున నమృతఘటంబుబట్టుకొని బైటవచ్చెను. అతఁడే దేవతల వైద్యుఁడు అప్పు డసురులు వాని చుట్టును మూఁగి దేవతలను వంచించి వానిచేతనున్న యమృతకుంభము నపహరించిరి. మరణములేనిమందు తమచేతఁజిక్కెఁగదాయని దానవులు సంతోషించిరి. అమృతకుంభముపోయెఁ బోయె దాటిపోయెనని వగచుచు దేవతలు నారాయణుని కడకుఁబోయి మొఱలువెట్టుకొనిరి. వారి మొఱ లాలకించి జగన్నాథుండు కరుణించి "భయములేదు. దానవహస్తగతమైన పీయూషకుంభమును నే మరలదెచ్చి మీకిచ్చెద వగవకుండుఁడు" అని యభయమిచ్చెను. అప్పుడు రాక్షసులలోఁ గొందఱు "అమృతము మేము ముందు ద్రాగుదుము మేముముందుద్రాగుదు"మని కుండనిమిత్తము పెనఁగులాడఁజొచ్చిరి. అప్పుడు కలిపురుషుఁడు వారిలోఁ బ్రవేశించి

"మీరును దేవతలును గలిసి సముద్రంబు మథించితిరి గావున మీరిరువురుం గుడుచుట ధర్మంబుగదా" యని దైత్యదానవుల కుపదేశించెను. కలిమాయయు విష్ణుమాయయు వ్యాపించుటం జేసి కలిమాటలకు వారుసమ్మతింపక యొకరిచేతిలోనుండి బలిష్ఠుఁడైన మఱియొకఁడు లాగుకొని యమృతకుంభమును నెత్తుకొనిపోవఁజొచ్చిరి. అంతలో మహాద్భుతముగా లోకైకసుందరియగు నొకయంగన వారిదృష్టులనాకర్షించెను. శరత్కాలపూర్ణచంద్రమండలమువంటి నెమ్మొగముతోఁ జేరలంగొలువఁ దగినయాకర్ణాంత నేత్రములతో, లలాటభాగమున నెంతో ముద్దుగులుకుచున్న కస్తూరీతిలకంబుతో లక్కపూచినయట్లుమిక్కిలి యెఱ్ఱనగు మోవితో, మించుటద్దములనుమించు చెక్కిళ్ళతో, శ్రీకారములకు నాకారములను దిద్దుకర్ణములతో, తుమ్మెదకదుపులఁ ద్రోసిరాజనజాలు కురులతో, పదియారువన్నియ, బంగారమునకు వన్నెలువెట్టునట్టి మైచాయతో తామర తూడులనెక్కసక్కెములాడు బాహులతికలతో కలదోలేదో యనుసందియమునకు నవకాశము గలిగించునట్టి నెన్నడుముతో, పంచబాణుని బండిచక్రమనందగు కటిప్రదేశముతో, నరఁటికంబములను బరిహాసముచేయు నునుదొడలతో, చిగురుటాకులమెచ్చని మెత్తనియడుగులతో, చుట్టుప్రక్కలపండువెన్నెలలు గాయించునట్టి చిఱునవ్వులతో, వాలుచూపులతో, మన్మథుని సమ్మోహనాస్త్రమో త్రిలోకరాజ్యలక్ష్మియో మనుష్యాకృతి ధరించి వచ్చిన సౌందర్యదేవతయో యనునట్లు జగన్మోహనాకారయగు నా ముద్దుగుమ్మను గనుంగొని దానవులెల్ల తమతమసంరంభంబులు మాని విస్మితులై కొయ్యబొమ్మలవలె నుండిరి. అందఱు నామెవంక తెప్పవాల్పక చూడఁదొడంగిరి. అందఱు నామెపలుకులువిన సత్సహించిరి. అందఱునామెచూడ్కులు తమపైఁ బర్వనజాలునని కొనిరి. ఆమెంజూచుటయేతప్ప నందఱిమనస్సులలో దక్కినకోరికలడుగంటెను

ఆజవరాలి యొయ్యారము తారుణ్యము లావణ్యము విలాసముజూచి దానవులామెను సమీపించి యిట్లనిరి. ఆహాహా ! ఏమీ యీలావణ్యము! ఏమేయీసౌకుమార్యము! ఏమేనీవాగ్మాధుర్యము నీవెవ్వరిదానవు? ఎందుండివచ్చితివి? మన్మథరాజ్యలక్ష్మివా ? మఱియెవ్వతెవు? నీవంటి చక్కనిచుక్క నెన్నడు జూచియెఱుఁగము వాణికిఁగాని శర్వాణికిగాని దుగ్ధసాగరకన్యకకుఁగాని నీచక్కదనంబున నూఱవవంతులేదు. వారు నీయడుగులనొత్తుట కైనఁదగరు. మాకు నీవలన నొక్కపరియోజనంబు గలదు. మేమును దేవతలును నక్కచెల్లెండ్రబిడ్డలము. అమృతము పంచి కుడువనోపక యొండొరులతోఁగలహించుచున్నారము. తగినట్లు మాకు బంచియీయఁగలసమర్థులు లోకంబున లేరు. అట్టిమహాకార్యమునకు నీవతగుదువు. నీజాణతనము నీబుద్ధివిశేషముజూడ నీకన్నదగినవారు మరొకరు లేరని మాకుదోఁచుచున్నయది కావున మమ్మనుగ్రహించి యిదిపంచిపెట్టుము., మేమందఱము పంక్తులుదీర్చి వరుసగాగూర్చుండెదము నిష్పక్షపాతముతో నీవు మాయిరుదెగలవారికిరిం బంచిపెట్టవచ్చును." అనివేఁడుకొనిన దానవులపలుకుల నాలకించి జగన్మోహినీరూపంబు దాల్చిన నారాయణుండు దైత్యులు తనమాయంబడినవారని తెలిసికొని మొగమున జిఱునవ్వులు మొలకలెత్త వారింగనుఁగొని యిట్లనియె "దానవులారా ! జగత్త్రయవిజయులై నిరుపమానమేధావంతులై తృణీకృతపురందరులై పరిఖ్యాతిగాంచిన మీవంటి పురుషులకు సాధ్యముగాని యీపని యాఁడుదానికి నాకుశక్యమగునే? నేనబలను. లోకవ్యవహారములం దారితేరినదాననుగాను అంగనలనమ్మరాదని పురుషులు తరుచుగాఁ బలుకుచుందురు. అట్టియపనమ్మిక మీకు నాయందు లేకుండెనేని, నాయందు మీకు సంపూర్ణవిశ్వాసము గలదేని నానేర్చినతెఱఁగున మంచిచెడ్డలాలోచించి మీకిదిపంచియిచ్చెద." నని ప్రత్యుత్తరమిచ్చెను. అప్పలుకు లమృతధారలవలె వారిచెవులం

బడుటయు దైత్యులు తమయధీనముననున్న నమృతకుంభము నామె చేతికిచ్చిరి. ఆమందహాసములు నావిలాసములు నావాలుచూపులు నాయొయ్యారములు రాక్షసులను మాయాబద్ధులుజేసి వాగ్బంధన మొనరించెను. అందఱు భళీభళీయని మెచ్చి యొప్పుకొనిరి.

అంతట దేవదానవులు స్నానములుచేసి తెల్లనిబట్టలు గట్టుకొని గోభూదానాదులు చేసి చందనమాల్యాదులను ధరించి విశాలమైన నొక శాలం బ్రవేశించి దర్భాసనములమీఁదఁ దూర్పుముఖముగఁ బంక్తులుదీర్చి గూర్చుండిరి. అప్పు డమృతభాండము చేతఁ బట్టుకొని యందెల ఝుళఝుళలును కంకణనిక్వణనంబులును మనోహరములై చెవులకు విందులుగొలుపుచుండ దేవదానవు లెప్పు డమృతము ద్రాగుదు మెప్పుడు ద్రాగుదుమని యువ్విళ్ళూరుచు నామె వంక జూచుచుండిరి. ఆమెయు రాక్షసులు దుర్మార్గులు. వారి కమృతముబోయుట పాములకుఁ బాలుపోయుట వంటిది. కావున వారిని వంచింప మనంబున నెంచుకొని యంతకుము న్నొండొరులతోఁగలసి కూర్చుండిన సురాసురులను వేఱుపఱచి రాక్షస లోకపంక్తిగా దేవత లోకపంక్తిగాఁ గూర్చుండ నానతిచ్చెను. అట్లు వారుచేసిన పిదప, రాక్షసులతో బావ మఱఁదులు వరుసలుపెట్టి తన్నువారు వదినె మఱఁదలని పరిహాసములు చేయనెడమిచ్చి, తియ్యని పలుకులం బలికి భ్రమపెట్టుచు సమ్మోహనములగు మందహాసములుచేసి మాయలోఁ బడవైచుచు నోరెత్తకుండజేసి దేవతలు పెద్దవారగుటచే ముందుగా వారి కమృతముపోసి చిన్నవాండ్రగు మీకు పిదప పోయుదు నని నమ్మఁబలికి ముందు నిర్జరులకుఁ బోసి చప్పుచప్పున ద్రావుండని వారిని హెచ్చరించు చుండెను. అయ్యవసరమున దానవులు తమలోఁ దా రిట్లు వితర్కించుకొనిరి—"ఈమె ముందుగా నమృతము దేవతలకే పోయుచున్నది. మనకు వేల్పులకును మాటాటములు లేకయుండు

నట్లు సమానముగా బంచిపెట్టుదునని మాటయిచ్చినదిగదా. తనమాట తప్పి యక్రిమంబుగా వర్తించునా? అల్లేలచేయును? ఇటువంటి చక్కని పడఁతి పక్షపాతముసేయునా? మాకు వేగమే యమృతము పోయుమని యడుగుదుమా ? అడిగినచో నామె కోపించి మనతో మాటలాడుటమానునో, అమృతభాండము విడిచి వెడలిపోవునో. ఈమె కాగ్రహాము తెప్పించుట కర్తవ్యము గాదు. మన కేమిభయములేదు. ఆమె మనకడకు వచ్చునఱ కూరకుండుటయే మంచిది" యని యామెం బిలువక, తే తెమ్మని తొందరపెట్టక విష్ణుమాయాపాశములం దగిలి రక్కసు లూరకుండిరి.

దానవులలో నొకఁడైన రాహువు తొందరపడి దేవతలపంక్తిలోఁ గూర్చుండి తాను రాక్షసుఁడైనట్లు తెలియకుండ వర్తించి యమృతము నోటంబోసికొనెను. సూర్యచంద్రులు పైనుండి యది చూచి జగన్మోహినికి సన్నసేయ చక్రింబు బ్రయోగించి యా రాహువుతల తెగనేసెను. నోట నమృతముండుటంజేసి శిరస్సు మృతినొందక జీవముగలిగియుండెను. మిగిలిన మొండెము నేలఁబడెను. అంతట బ్రహ్మదేవుఁడు వానిశిరస్సును గ్రహములలోఁజేర్చియాకాశవీధిని నెలకొల్పెను. నాఁటనుండియు రాహువు చంద్రసూర్యులపైఁ బగబూని పర్వములయందు వారిం బట్టుచుండును. అదే సూర్యచంద్రగ్రహణములు. ఈవిధముగా నొకబొట్టయిన రక్కసులకుఁ జిక్కకుండ నక్కపటస్త్రీవేషధారియైన నారాయణుఁడు పీయూషమంతయు దేవతలకే పోసి యంతర్ధానమునొంది తన నిజరూపంబు ధరియించె. దైత్యులు జగన్మోహినిని గానక యమృతంబుగానక యాశాభంగంబునొంది "అయ్యో! మెఱుఁగకపోయి మాయలోఁబడితిమి. అమృతమంతయు దేవతలుత్రాగిరి. ఇరువురము కష్టపడిమథించినందుకు మన కొక్కచుక్కయైన దక్కదయ్యె" నని విషాదాయత్తచిత్తులై వగవఁదొడఁగిరి. భగవంతుని నమ్మనివా రెంతకష్టపడి పని

చేసినను వారి కాలాభముదక్కదని వివేకులగువారందఱు తలంచిరి.

ఒకనాఁడు కైలాసమున గౌరీసమేతుఁడై చంద్రశేఖరుఁడు ప్రమథగణములు, కొందఱు దేవతలు పరివేష్టింపఁ గొలువుండి, నారాయణుఁడు జగన్మోహనావతారము దాల్చి దైత్యదానవరాక్షసులను మాయాపాశములం గట్టివైచి యమృతము వారి కొక్కబిందువైన దక్కకుండ నంతయు వేల్పులకే యిచ్చి సురారాతులను వంచించెనని విని హరియొక్క స్త్రీవేషము జూడవలెనని కుతూహలముబుట్ట నద్రికన్యాసమేతుఁడై వృషభవాహనమెక్కి తక్షణము వైకుంఠనగరమునకుఁ జని లక్ష్మీసమేతుఁడైన నారాయణుంగని యిట్లనియె. "దేవా! నీలీల లనంతములు. నీమాయలకుఁ బారములేదు. అజుఁడు నేను మరీచిప్రముఖు లగుమహర్షులు నీమాయం దెలియఁజాలము. నిన్నొక్క కోరిక కోరఁదలంచి వచ్చితిని. నీ వనంతకోట్యవతారములనెత్తి మహీభారంబు వాపుచుందువు. వైకుంఠనగరంబునను మఱి యితరస్థలములను నీపురుషరూపమే చూచితిమి గాని నీయాఁడురూపు చూచియెఱుఁగము. నీవు జగన్మోహినివై రక్కసుల వంచించితివని విని నీయాఁడురూపు చూడవలయునని వచ్చితిని. చేయఁదలఁచిన పని చేసినతోడనే నీ వారూపు నుపసంహరించితివి. ఆరూపుజూడ నాకెంతయుఁ గుతూహలము పొడముచున్నదిగాన నానిమిత్తమై మరల నీ వాజగన్మోహనావతారముఁ దాల్పవలయునని నాప్రార్థనము ఇది నీకుం గష్టమైనపనిగాదు. నాయుబలాటము దీర్చుట నీకుఁ గర్తవ్యంబు. నేన కాదు. శైలరాజనందనయు నీసుందరీరూపము సందర్శింపఁ గుతూహలపడుచున్నది. కావున నాముద్దు చెల్లించి ముద్దుగుమ్మవై నాకన్నులకు విందుసేయుము" అనవుఁడు జలజాక్షుఁడు భావగర్భితమగు చిఱునవ్వు నవ్వి "దేవా! నీచిత్తరంజనముచేయుట నాకు మిక్కిలి యిష్టము. కాని,యేమఱకుండవలయు.

నాఁడు రక్కసులను డాఁగురించుటకునై నేనుదాల్చిన జగన్మోహన రూపమును మరలఁ దాల్చి నీమనంబురంజించెద కాని కొంతకాలము నీవు వైకుంఠనగరమున నుండుము. దాని యదనువచ్చినప్పుడు నీకో రిక దీర్చెద" అని యంతర్ధానమొందెను. ఏఁడినారాయణుఁ డేఁడినా రాయణుఁ డని శివుఁడుం బార్వతియు నలుగెలంకుల వెదకఁజొచ్చిరి. నారాయణుఁడు కానబడలేదు. అంతలో దూరమున లేఁబ్రాయమున నున్నయొక సొగసులాఁడికనంబడెను. ఆమెకందుకక్రీడాసక్తయైయుం డెను. శివునిదృష్టియు గౌరీచూడ్కులు నామెయందుఁదగుల్కొనెను. సభాసదులందఱు నామెసొగసునే జూచుచుండిరి. ఎలప్రాయము. సకుందగిన చక్కఁదనము చక్కఁదనమున కనువైన చాక చక్యము, చాకచక్యమునకు సరిపడిన శుభలక్షణములుగల యాయిం తి కన్నులపండువై కానఁబడినతోడనే మన్మథునిగెల్చిన మహేశ్వ రునిమనస్సు మెత్తపడి తత్తఱపాటునొందెను. ఆమోహనాకార కామునిచేతికటారివలె దనకభరీభారమూడి వీపుపైఁ బడ, గండభా గములయందు రత్నకుండలములు చిందులాడ, మదించిన తుమ్మెదల వలె చూపులు గంతులిడగ తారహార మల్లలనాడ మొగంబునఁ జిఱుచెమ్మటలబొట్లు బంగారుపళ్ళెరంబున ముత్తియములుపోసిన చం దంబున వింతముద్దుగొలుపుచుండ, కాలియందియలగజ్జెలు గలుఘల్లు మని మ్రోయ, హస్తకంకణఝుణాత్కారములు శ్రోతలచెవులకు విం దులుచేయ, సింహమధ్య మసియాడ, బంతినందుకొనునప్పుడు తప్పు టడుగులిడుచు వంగుచు లేచుచు బంతి నెగరవైచుచు బట్టుకొనుచు దూరమున విసరి దానిం గ్రమ్మఱఁ దెచ్చుచు విడిపోయిన వేణీభార ము ముడుచుచు జాఱిపోయిన పయ్యెద సవరించుచు గౌరీశంకరులు విస్మితులై చూచునట్లు బంతియాడుచుండెను.

ఆహా యలుచూచి యాముఖలావణ్యముజూచి శంకరుఁడు

పరవశుఁడై “ఆహా! యెవ్వ రీబాల? ఇది బ్రహ్మసృష్టిగాదని స్పష్ట ముగఁ దెలియుచున్నది. ముదిమిచే మదిదప్పి వేదాభ్యాసంబున జడుఁడైన పితామహుఁడేమి? ఈలేమను జేయుటేమి. ఇది మద నుని సృష్టియో, విశ్వకర్మనిర్మాణమో, వసంతునిచేతి నేర్పో, చం ద్రునిబుద్ధివిశేషమో యైయుండనోపు. దీనికేలు బట్టనియెడ నాబ్రి తుకేల? దీని నాలింగనము జేసికొననిచో నాశరీరమేల? ఏమైననుసరే. పార్వతి యేమనుకొనిననుసరే. యూసనకసనందనసనత్కుమారులు నన్నుగుఱించి యెట్లుతలంచుకొనిననుసరే. దీనిం జేకొనితీరవలయు. ఇది నన్నొల్లకపోవునా? త్రిపురాసురులను గెలిచిన మహావీరుఁడను. కామునిం గెలిచినమేటిని. గౌరిని వలపించిన రసికాగ్రేసరుఁడను. తప్పక యిది నా రసికత మెచ్చి నాకోర్కె దీర్పఁగలదు” అని విత ర్కించి మోహపయోధిలో మునిఁగి చివాలున లేచి యామెలనాఁగ యున్నచోటికింబోయి యామె కేలువట్టెను. అదియు సిగ్గునఁదలవంచి వానిచేయి విడిపించుకొని యవలకుం బోయెను. శంకరుఁడును దానివెంటఁజనియెను. ఆజవ్వనియు శంకరుని బేలతనంబునకు ముసి ముసి నగవులు నవ్వుకొనుచు విసవిస నడచుచు వాని చేతి కందినట్లే యంది దాఁటిపోవుచు వనంబులఁద్రిప్పి నదీనదంబులు దాఁటించి మేఁటి కొండ లెక్కించి పల్లంబులలోదింపి లేడి వేఁటకానిం ద్రిప్పినట్లు పలు తావులఁ ద్రిప్పెను. తిరిగితిరిగి విసికి వేసారి శంకరుఁ డాత్మగతమునఁ బ్రబోధముగలిగి యది విష్ణుమాయావిలాస మనియు విష్ణుదేవుఁడు తనకోరికందీర్ప మరల జగన్మోహనావతారమెత్తి తన్ను భ్రమింపఁ జేసెననియు నెఱింగి వెనుకకు మరలెను.

ఉమాకాంతుని ప్రబోధముఁ దెలిసి రమాకాంతుఁడు తననిజ రూపమునుదాల్చి మందహాససుందరముఖుఁడై చంద్రశేఖరుని నుతి యించి యెట్టయెదుట నిలిచెను. మహేశ్వరుఁడు మాధవుని పలు

తెఱంగుల నతిక్రమించి యతని మాయాసముద్రమున మునుంగనివా రెవ్వరు లేరని పల్కి యాతని వీడ్కొని మరలఁ గైలాసంబునకు శైలరాజతనయతోఁగూడ చనియెను.

ఆ. వె. కాముఁగెలువవచ్చుఁ గాలారిగావచ్చు
మృత్యుజయముగలిగి మెఱయవచ్చు
నాఁడువారిచూపుటంపఱ గెలువంగ
వశముగాదు త్రిపురవైరికైన.

మ. ఎలమిన్ దైత్యుల నాఁడురూపమున మోహింపించి పీయూషముం
జలితాపన్నులకు న్సురోత్తములకుం జక్క న్విభాగించి ని
ర్మలరేఖ న్విలసిల్లు శ్రీవిభునిఁ దన్మాయావధూరూపముం
దలఁతు న్మ్రొక్కుదునాత్మలోనదురితధ్వాంతార్కరూపంబుగన్.

శా. పారావారముద్రచ్చుచో గిరిసముద్యద్భారమై కచ్ఛపా
కారుండైన రమేశువర్తనము నాకర్ణింపఁ గీర్తింప సం
సారాంభోనిధిలో మునుంగు కుజను ల్సంశ్రేయముం బొంది వి
స్తారోదారసుఖంబుఁ జెందుదురు తథ్యం బెంతయున్భూవరా.



# వరాహావతారము



ప్రళయకాలమున భూమియంతయు సముద్రమునంబడి మునిఁగిపోయెను. బ్రహ్మ నిద్రనుండి మేల్కాంచి జలనిమగ్నమైన వసుంధరను మరలనిర్మించి దానిని సర్వభూతసమంచితముగా నెట్లు చేయవచ్చునని విచారించుచు శ్రీమన్నారాయణధ్యాన తత్పరుఁడై యుండ నంతలో నతని నాసికనుండి యంగుష్ఠమాత్ర శరీరముగల శ్వేతవరాహ ముద్భవించె. పుట్టినతోడనే యది యాకసంబున కెగిరి పెద్ద యేనుఁగంతటి మేనుగల దయ్యెను. మరీచిప్రముఖులైన మహర్షులును జలజాసనుఁడును మిక్కిలి యక్కజపడి యది శ్రీమన్నారాయణుని యవతారముగాఁ దెలిసికొని బహువిధములస్తుతియించి జలములో మునిఁగిన వసుమతి నుద్ధరింపుమని వేఁడికొనిరి. ఆయజ్ఞవరాహమూర్తియు నట్లకాక యని.—

సీ. తివిరిచతుర్దశభువనంబులను దొంతు
లౌరఁగఁ గొమ్ములఁజిమ్ము నొక్కమాటు
పుత్తడికొండమూఁపుర మనునొరగంట
నొరకురా రాపాడు నొక్కమాటు
ఖురముల సప్తసాగరముల రొంపిగా
నుక్కించి మట్టాడు నొక్కమాటు
ఆభీలవాలవాతాహతిచే మిన్ను
నొరసిబ్రద్దలుసేయు నొక్కమాటు
గీ. గన్నుఁగోనల విస్ఫులింగములు సెదర
నుగ్రభయంకరగతిఁదోఁచు నొక్కమాటు
పరమయోగీంద్రజన సేవ్య భవ్యవిభవ
యోగ్యమై కానఁగానగు నొక్కమాటు.

ఆతెఱంగున విహరించి విహరించి కమలాసనుని కోర్కెఁ దీర్పఁ దలఁచి మహాసముద్రింబున నడికి దాని యట్టడుగునం బడి యున్న భూమిని సమీపించి యచ్చటఁ దన ప్రయత్నమున కడ్డువచ్చిన దుష్టదానవుని ఖండించి యావసుంధరను తన కొమ్మునందాల్చి పైకెత్తె. అనంతరము పృథివి జంతుసంతానములతోడను, తరులతాదులతోడను నదీనదసరోవరాదులతోడను మహాశైలములతోడను విరాజిల్లెను.

శ్రీమహావిష్ణునకు మిగులఁ గూర్పబంటులై వైకుంఠధామ ద్వారపాలకులై జయవిజయులను నిరువురు దివ్యులుందురు. వారు నారాయణునకుఁ బరమవిధేయులు. సనకుఁడు సనందనుఁడు ననునిత్యముక్తు లిరువురు మహామునులు గలరు. వా రనేక యుగములవయసుగలవారయ్యు నయిదేండ్లప్రాయముగల బాలకుల తెఱంగున నిత్యానందస్వరూపులై కేశవభజనానువర్తులై మెలఁగుచుందురు. ఒకనాఁడువారు జనార్దనదర్శనముచేయఁగోరివైకుంఠనగరంబునకుఁబోయి నారాయణుని నగరుఁజొఱఁబోవుచుండ ద్వారపాలకులు జయ విజయులు వారిని నిరోధించిరి. అప్పుడువారు బిట్టలుకఁబూని యిట్లనిరి: "మూర్ఖులారా! మేము హరి కత్యంత ప్రియులము. అట్టి మమ్మ మీరేల నివారించుచున్నారు. సమయంబు గాదందురా? భగవంతునకు సమయం బక్కఱలేదు. అతఁడు సర్వకాల సర్వావస్థలయందుఁ బరమభాగవతులకు దర్శనం బిచ్చుటకు సిద్ధముగా నుండును. మేమా యనను దర్శింపఁ దగనివార మందువా మేము నిత్యముక్తులము. పుణ్యచిత్తులము. హరిచరణారవిందములే మా కాశ్రయములు. హరిభజనమే మాకు జీవనము. హరికీర్తనమే మాసంభాషణము. హరియందు మేము జీవింతుము. హరివిగ్రహము మాహృదయములందు జిత్రితమైయున్నది. మీకు నిరోధించుట కధికార మున్నదిగదా

యని మాపరిభావమెఱుఁగక గర్వాయత్తచిత్తులై మమ్మువారించితిరి గావున మీకిప్పుడు శాపం బిచ్చెదము. మీరు భూలోకంబున కామక్రోధలోభవశులయిన దురాత్ములై జన్మింతురుగాక. దురాత్ముల దండింపక విడిచితిమేని వారు శాంతులుగాక యంతకంతకు గర్వోన్మత్తులై తమ కెందునడ్డులేదని భావించి సాధుజనులకు మహాపకారంబులు సేయుచుందురు. అందుచేత మిమ్మిప్పుడు శిక్షింపవలసి వచ్చెను."

అని రోషభీషణంబులగు భాషణంబులువారినోటనుండి వెలువడుచుండ హృషీకేశుఁడు తద్వాక్యంబులనాలకించి నిజాంతఃపురము వెడలి రమాసమేతుఁడై వచ్చి వారిమ్రోల నిలిచి జరిగిన వృత్తాంతమంతయుసనకసనందనులవలన విని యిట్లనియె.—"ఈద్వారపాలకులు మీపరిభావంబు దెలియలేక మీయెడ మహాపరాధము గావించిరి. దానికిం దగినట్లు మీరు దండించితిరి. ఇందు మీదోషంబులేదు. దండ్యులను దండించుటయు ననుగ్రహింపఁ దగినవారి ననుగ్రహించుటయు మహాపురుష లక్షణంబు. కాని నే నొక్క విన్నపము సేయఁదలతు. ఈతప్పు నాయదిగాని వారిదిగాదు. శరీరమునఁబుట్టిన రోగము చర్మమును వివర్ణము సేయునట్లు సేవకులుగావించినతప్పులు యజమానుని పేరు పెంపుఁ జెఱుచు. వీరు నాసేవకులు గావున నీతప్పు నేనుగావించినట్లు దలంచెద. కావున నన్ను మన్నించి వారి ననుగ్రహింపుఁడు" అని సర్వశక్తుండును సర్వజ్ఞుఁడును సర్వవ్యాపకుఁడును సర్వేశ్వరుఁడును నగు పరమపురుషుఁడు మిక్కిలి యల్పుని చందంబున నతివినయంబుగాఁ బలుకుచుండ మహామునులు సనకసనందనులు కడు విస్మితులై జగన్నాథుని కిట్లనిరి. "దేవా మేము మిమ్ముం గనుగొనవలయునని యెంతో యాత్సుక్యము గలిగియుండ వీరు నిరోధించిన కారణమున నాగ్రహాస్తూలమై వారిని శాపోపహతులం జేసితిమి.

వారిపై మాకించుకేనియు నాగ్రహము లేదు. నీవు వారి ననుగ్రహింపఁ దలతువేని ననుగ్రహించి క్షమింపుము. మేము వలదనువారము కాము. నీయిచ్ఛయే మాయిచ్ఛ. నీవాజ్ఞాపించిన తెఱంగున సేము సేయఁగలవారము." అని చేతులు జోడించి పలికిన నమ్మహాముసుల కతఁ డిట్లనియె.—

మహాత్ములారా! వీరు భూలోకంబున రాక్షసగర్భంబుల మూఁడు జన్మంబులెత్తి నాకు విరోధులై నన్ను ద్వేషించి నాచేతం దెగటారి మరల సాన్నిధ్యముం బడయఁగలరు. ఆదనుజ జన్మంబున నాయందు ద్వేషముచేతనయినను నన్నుం దలంచుచుండుటచేత వీరు ముక్తిం బడయుదురు. ఇట్లు మీరనుగ్రహింపవలయు. శాపం బిచ్చినవారు మీరగుటం జేసియు మీశాపం బమోఘం బగుటం జేసియు మీకిష్టమగునేని నాచెప్పిన తెఱంగున జరుగున ట్లనుగ్రహింపుఁడు. అని పుండరీకాక్షుండు జయవిజయులను గటాక్షించుటయు సనకసనందనులు రమాకాంతుఁడు చెప్పినట్లు జరుగుఁగాకయని యొడంబడిరి. జయవిజయులు నారాయణచరణరాజీవములకుఁ గడు వినయంబున నమస్కరించి నారాయణసాన్నిధ్యంబును జగన్మాతయగు లక్ష్మీదేవిసాన్నిధ్యమును వైకుంఠనగరమును బాసిపోవలసి వచ్చినందుకు దుఃఖాక్రాంతమనస్కులై కన్నీరోడికగట్ట వగచుచు బోయిరి.

వారు మొదటిజన్మమున కశ్యపునకుం దితికి హిరణ్యాక్షహిరణ్యకశిపులై జనియించిరి. రెండవ జన్మమున దైత్యాంగనయగు కేకశిగర్భమున రావణకుంభకర్ణులై యుదయించిరి. మూఁడవపుట్టువున శ్రీకృష్ణునకు మేనత్తకొడుకులై శిశుపాలదంతవక్త్రులను పేళ్ళం జనియించిరి. ఈమూఁడుజన్మంబులయందును వారు నారాయణద్వేషులై హరిభక్తులను హింసించి దుండగులై యెట్టకేలకు హరిచేతం దెగటారిరి. తెగటారి మరల వైకుంఠనగరమున ద్వారపాలకులైరి.

కశ్యపప్రజాపతికి దితి ధర్మపత్నియై గర్భంబు ధరియించి యాచూలు నూఱేండ్లు దాల్చెను. శతసంవత్సరములు మోసిమోసి యామె యిరువురుకొడుకులం గనియెను. అప్పుడు దుశ్శకునములనేకములు పొడకట్టెను. ధరణి దిద్దిరందిరిగెను. మహాపర్వతములు వడఁకెను. చుక్కలునేలరాలెను. సముద్రములు పిండులువండులయ్యెను. దిగ్గజములు వంగిపోయెను. దిక్కులయందు మిడుఁగురులు వ్యాపించెను. వానలేకయే పిడుగులు నేలఁబడియెను. ఝంఝామారుతములువీచెను. హోమకుండములనుండి పొగవెడలెను. చెట్లడ్డదిడ్డముగా నేలఁగూలెను. గ్రహములకాంతి మందగించెను. మబ్బులలోనుండి నెత్తురువానగురిసెను. పర్వము గాని యప్పుడే రాహువు సూర్యునిం బట్టుకొనెను. కారుచీఁకటులు నలుదెసలగ్రమ్మెను. కుక్కలు మోఱలెత్తి యఱచెను. నక్కలు పట్టపగలె యూళ్ళజొచ్చి కూసెను. పక్షులు కిలకిలారావములు చేసెను. దేవాలయములలోని ప్రతిమల కన్నులనుండి నీరోడికకట్టెను. ఆప్రతిమ లొఱఁగెను. ఆవులుపొదుగులనుండి పాలకు మాఱుగా నెత్తురుఁ జీము గారెను. గాడిదలు భయంకరముగా నోండ్రపెట్టెను. గజములు గండస్థలముల మదము డిగిపోయెను. గుఱ్ఱముల తోఁకలనుండి నిప్పులు వెడలెను. సౌమ్యగ్రహములు పాపగ్రహములతోఁ గలసి వర్తించెను. ఆదుర్నిమిత్తముల గనుఁగొని దితికి దుండగులగు కొడుకులు పుట్టుటచేత నవి కలిగినవని యెఱుఁగక ప్రళయకాల మాసన్నమైనదని సకలప్రాణిసంఘము శంకించి భయపడెను. దివ్యజ్ఞానసంపన్నులైన సనకసనందనులు మాత్రము భీతిజెందరైరి.

ఆకుమారులిద్దఱుభయంకరాకారములుగలిగి తమపాదఘట్టనలచే భూమి యదరునట్లు నడచుచుఁ జన్ననాఁడే లోకకంటకు లట్లుండిరి. అట్లు కొంతకాలము జరిగిన పిదప కశ్యపుఁడు తనయులం జూడ

వచ్చి పెద్దకొడుకును హిరణ్యకశిపుఁ డనియు రెండవకుమారుని హిరణ్యాక్షుఁడనియు నామకరణములుచేసి సాధుశీలంబు గలిగియుం డుఁడని కొడుకులకు బుద్ధులుచెప్పి నిజాశ్రమంబునకుఁ జనియెను.

అనంతరమా యన్నదమ్ములు కాలక్రమమున బెరిగి యుక్త వయస్కులై తపంబునంగాని యసాధారణ బలతేజంబులు గలుగవని పరమేష్ఠింగూర్చి యనేక సంవత్సరములు ఘోర తపంబు చేసిరి. మండువేసవిని భయంకరపంచాగ్నిమధ్యమునను వర్షకాలమున మేఘములు నిరంతరధారలతో వర్షించునప్పుడు బట్ట బయలను శీతకాలంబున రాత్రులయందు మంచు గురియుచోటులను నిలిచి నిరాహారులై కొన్నిదినంబులును గందమూలఫలాదులందినికొ న్నినాళ్లును జీర్ణపర్ణములు భక్షించి కొన్నినాళ్లును యతిదారుణం బుగాఁ దపంబుచేసిరి. వారితపంబుజూచి లోకములు బెగ్గిలెను. సుర లు గడగడవడంకిరి. పరమేష్ఠిమెచ్చి వరములిచ్చెను. దేవవాత్రము చేతను సిద్ధసాధ్య విద్యాధరాదులచేతను గరుడపన్నగులచేతను కిన్నర కింపురుషులచేతను యక్షరాక్షసులచేతను మానవదానవులచేతను మ రణము లేకుండ వారు వరంబులు గోరిరి. కాదనక లేదనక చేయున దిలేక పితామహుఁడు వారుకోరినవన్నియు బ్రసాదించెను. ఆవరప్ర భావమున వారమోఘబలులయి ఖలులై మిన్నుమన్నుగానక కం డకావరమున గండుమిగిలి ఘనులనక మునులనక దివ్యులనక భవ్యు లనక నిర్జరులనక దుర్జనులనక కనఁబడినవా రందరిని హింసించుచు నెల్లలోకముల జయించిరి.

అందగ్రజుఁడు హిరణ్యకశిపుఁడు ముల్లోకముల జయించి యింద్రాదులను గెలిచి దిక్పాలుర ధిక్కరించి సిద్ధులను సిలుగులం బెట్టి సాధ్యులను సాధించి విద్యాధరుల విక్రమమడఁచి పన్నగులఁ బన్నమొందించి యక్షులను బక్షులట్లు దోలి గంధర్వులను గారించి

త్రిలోకసామ్రాజ్యాధిపత్యమువహించినిష్కంటకముగ నేలుచుండెను.

యువరాజగు హిరణ్యాక్షుఁడు తన యన్నచేయఁగా మిగిలిన పని సంపూర్తిచేయఁదలఁచి చచ్చిన పాములగొట్టినట్లు మున్నె బరాజితులయిన దివిజుల హింసించుచు నొక్కసారి వరుణలోకమునకరిగి యచ్చట డాగియున్న జలధినాయకుని౦గనుంగొనితనతోఁ గయ్యమున కియ్యకొనుమని యడిగెను. అనవుడువరుణుండాతనికిట్లనియె. "దానవేశ్వరా! నీవుమహాబలసంపన్నుఁడవు. దుస్సహతేజోరాశివి. పైఁగా జలజాసనునివలన వరములఁబడసినవాఁడవు. నిన్ను నేనెదిరింపఁగలనే? మీయన్నదమ్ముల మగంటిమి ముందఱ వేలుపులు నిలువఁజాలరయిరి. నీతోసమరంబు సేయఁగలవాఁడొక్కఁడుగలఁడు? అతఁడు వైకుంఠనగరాధీశ్వరుఁ డయిన శ్రీమన్నారాయణుండు అతఁడు దానవాంతకుఁడను పేరుదాల్చుట మీరెరుగుదురు. సంగ్రామంబున కాతనిబిలువుము. అతఁడు వెనుదీయువాఁడుకాఁడు. నీచేతులతీట యతనితోఁబోరాటమువలన దీరును. మావంటివారితోడి కయ్యమునఁ దీరదు" అని సామవాక్యంబులు పలుకుటయు రోషకషాయితాక్షుఁడై హిరణ్యాక్షుఁడు "సరే. నీపరాక్రమ మింతదైనదికదా. నారాయణుని వద్దకుబొమ్మని నీవుచెప్పవలసినదేల నామగంటిమి ముందఱ నారాయణుఁడు గీరాయణుడు నిలువనేర్చునె? నా తేజోదవానలంబునకతఁడు మిడుతగాడే? నారాయణుని ప్రతాపమంతయు హిరణ్యాక్షుఁడు పుట్టకమునుపు. ఇంకవానియాగడంబులు సాగిరావు. ఇదిగో నేనిప్పుడే పోయి వానిందునిమివేలుపుల యాసలడుగంటఁచేసెద. చూడునాదెబ్బ అని యచ్చోటు వాసిగదాదండమండితహస్తుఁడై వైకుంఠనగర ద్వారంబుపట్టిపోవుచుండెను. త్రోవలో నారదుఁడు వానికగపడి యెందుఁబోయెదవనియడిగి వానివలన రాకకుఁ గారణమడుగ నతడిట్లనియె "నారాయణుఁడు వైకుంఠనగరంబున లేడు. అతడు వరాహావతార

మును దాల్చి ప్రళయసముద్రనిమగ్నమైన వసుంధరను దనకోఱతో నెత్తి యదికూలిపోవకుండ కాపాడుచున్నవాఁడు. రసాతలముననున్న వాఁడు. నీవక్కడికరుగుదువేని నీమనోరథంబు సిద్ధించు. కావుననక్కడికిఁబొమ్మని యుపదేశించెను.

"ఆహా! యామూర్ఖుఁడు నారాకవిని పందియై గొందెలలో దాఁగున్నవాఁడుగాఁబోలు! రసాతలముజొచ్చినను వైకుంఠనగరంబున నున్నను, వానినివెదకి పట్టిగిట్టించెద" నని గదభుజంబున నిడుకొని హరిని వెదకుచుఁబోయెను. పోయిపోయి రసాతలముఁజొచ్చి యార్త రక్షణపరాయణుఁడైన నారాయణుఁడున్నచోటికరిగి నిజదంష్ట్రాగ్రమున వసుంధరనెత్తి భూదేవినుద్ధరించిన యాదేవునిగనుఁగొని దూషణపూర్వకంబుగా నిట్లనియె. "ఓరిపశువా! నీచమైనపందిరూపు దాల్చి మూలలదాఁగున్నమాత్రమున నీమానప్రాణములు దక్కునని తలంచితివి గాఁబోలును.అదివట్టిమాట. హిరణ్యాక్షుఁడుజీవించియుండగా నీయసురులుదక్కవు. ఇంతపిఱికిపందవని నేనెన్నడెఱుంగ రమ్ము యుద్ధమునకురమ్ము మగంటిమి లేనిబడుగురక్కసులఁగొందఱనుక్కడఁచిదనుజాంతకుఁడని గొప్పపేరువడసితివి. నేనిప్పుడు నిన్నడఁచి దివిజాంతకుఁడ నయ్యెద. రాక్షసకులంబున జనించినందుకు నాపెద్దల ఋణంబుదీర్చెద. జగము నిష్కేశవంబు జేసెదము. రమ్ము యుద్ధమునకురమ్ము." అనిబీరంబులుపలుకుచున్న పిశితాశనుసిపలుకులువిని చిఱునవ్వునవ్వి "దురాత్మా! పరమేష్ఠివలన గొన్నివరంబులు వడసితి నని తెగనీల్గుచుంటివి. నీపోతరమంతయు నేవినియు నింతకాలము సైరించి నిన్నుబ్రతుకనిచ్చుటయె నాతప్పు. నేను నీనిమిత్తమైవచ్చి శ్రమపడనక్కఱలేకుండ మేఁక మృగరాజ గుహాంతరముఁజొచ్చిన చందమున స్వయముగా నీవెమృత్యుగృహముజొచ్చితివి. ఇకచచ్చితివి చూడు." అని కోరకొననున్న పంటవలంతిని సముద్రముమీఁద

బెట్టి హిరణ్యాక్షునితోఁ గయ్యముసేయఁబూనెను. అయిరువురకును రసాతలమున ఘోరసంగ్రామమయ్యెను. రక్కసుఁడు మిక్కుటంబగు మగంటిమి గలిగి పోరితంబు సలిపెను. జగద్భారంబుడింపసవతరించిన శ్వేతవరాహమూర్తి యాధూర్తదానవుని ముట్టితోఁబొడిచి యలయించి కోఁరలతోఁజీల్చి నఖాగ్రంబుల గాయంబునఁ గాయంబులుచేసి వధియించెను.

వేల్పులు విరులవానలు గురిసిరి. గంధర్వులు నృత్యగీతముల వినోదించిరి. నారదుఁడు తనకుంచె ద్రిప్పుచు సంతోషమున నాడెను. బ్రహ్మర్షులు దేవర్షులు నారాయణుని వేదోక్తులం బ్రణుతించిరి. మహేంద్రాదుల మనంబులు వికాసమొందెను. దేవకాంతలభీతి సగమడఁగెను. భూమినుద్ధరించుటయు దురాచరణుఁడైన హిరణ్యాక్షుని గడతేర్చుటయునను రెండుపనులనిమిత్తమై శ్వేతవరాహరూపంబు ధరియించి యారెండుపనులందీర్చి హరికృతకృత్యుఁడయ్యెను.



# నరసింహావతారము

తనతమ్ముఁడైన హిరణ్యాక్షుని నారాయణుఁడు వరాహరూపము ధరించి తెగటార్చెనను వార్త వినినతోడనే హిరణ్యకశిపుఁడు విషాదకోపములచేత ఘూర్ణమానమనస్కుఁడై నయనములనుండి నిప్పులువెడలునట్లు జూచుచు హస్తంబున త్రిశూలంబు దాల్చి సభామంటపముఁబ్రవేశించి సదస్యులఁజూచి యిట్లనియె. "సభ్యులారా! యీవింతవింటిరే? బలపరాక్రమసంపన్నుఁడును, దానవకులశిరోభూషణుఁడును దిక్పాలకభయంకరుఁడును, నాకనుఁగుదమ్ముఁడును మీకుఁ గారాబునెచ్చెలియునైన దానవాధ్యక్షుని హిరణ్యాక్షుని మాధవుఁడు మాయావరాహరూపమునుదాల్చి దొంగపోటుగ సంహరించిపోయెనఁట. కటకటా! యెంతపనిబుట్టెను. నాప్రియసహోదరుఁడు తుచ్ఛుఁడైన కేశవునిచేతఁ బడియీల్గునని కలనైన నేనుదలపనైతి. ఇప్పుడే కాదు. నారాయణుఁడు మాయలమారి. ఏమూలనుండివచ్చునో యేరూపమునవచ్చునో యేమిసేయునో యెవ్వరికిం దెలియకుండనిట్టివచ్చి ఘాతుకకృత్యంబుల నెఱపుచుండును. ఇఁకనాదురాత్ముని మనమందఱము పట్టి పాలార్పవలయు, లేకున్న దానవకులంబునకు సేమంబు లేదు. వాఁడుమహాసముద్రంబునమునుఁగుగాక! కొండలక్రిందదాఁగును గాక పాతాళమునకుఁ బఱచుఁగాక పందయై పందియగుఁగాక మఱేమైన నగుఁగాక చతుర్దశభువనముల వెదకి వానియాయువు పట్టుగనుంగొని తుదముట్టించెద. వానిరక్తమున నాయగ్రజునకుఁ దర్పణము చేసినఁగాని నామనంబు సంతుష్టిజెందదు. వృక్షముయొక్క మూలమును ఛేదించినయంతనే కొమ్మలు క్రమక్రమముగ నెండిపోవునట్లు మాధవునిఁ గడతేర్చితిమేని దేవేంద్రాదులు తమంతటఁచావు నశింతురు. వీనియండజూచుకొని యాఖండలాదులు విజృంభించుచున్నారు. కావున నో దానవులారా! నాయాజ్ఞ వినుఁడు. నారాయణుఁడు వేదముల

యందును భూసురులయందును బుణ్యతీర్థములయందును, దపోవనము లయందును, యాగాదులయందును వసియించుచుండును. అవియే యాతని యునికిపట్లు. అక్కాలంబున మీరు భూలోకంబునకరిగి నిగమంబుల నిర్మూలింపుఁడు. బ్రాహ్మణులఁబట్టివధింపుఁడు. గోవులహింసింపుఁడు. పుణ్యతీర్థంబులు పాడుసేయుఁడు. తపోవనంబులు ధ్వంసము సేయుఁడు. యాగాదులకును బితృకర్మలకును నతఁడేయాధారము. అని యడఁచిన నతఁడు నామరూపములులేక నశించు." అని యానతిచ్చిన హిరణ్యకశిపునిమాట శిరమునదాల్చి మృక్కడిరక్కసులు తండోపతండములుగా బైలుదేరి భూలోకంబునకుఁబోయి తపోవనంబులు దగ్ధముచేసి జన్నములకుఁ బన్నములుగల్పించి, పుణ్యక్షేత్రములు నామమాత్రములుచేసి గ్రామములుగాల్చి పట్టణంబులు భస్మములు చేసి, యవనీసురుల నలజడిబెట్టి, నిరంకుశవృత్తిని జరియించి తమస్వామి యానతిచ్చిన దానికన్న వేయిమడుంగు లధికక్రూరులై జగమంతయుఁ బీనుఁగుపెంటలు చేసిరి. వారికిజడిసి వాయుదేవుఁ డొక్కమూలనడఁగె. ఈశానుండు బూడిదబూసికొని దిగంబరుఁడై సంచరించె. కుబేరుఁడు తనవిత్తమంతయు గుప్తముచేసికొనియె. అగ్ని మేరలేని తాపంబునొందె. వరుణుండు దుఃఖసాగరమున మునింగె. వేల్పులఱేఁడు వేయిగన్నులవిలపించె. దండధరుండు వేత్రదండంబు ధరియింపవలసినవాఁడయ్యె.

ఇట్లుదానవసైనంబుల నలుదెసలకుఁబనిచి మృతుఁడైన హిరణ్యాక్షునకు నుత్తరక్రియలుచేసి పితృవిహీనులైన యాతనికుమారులగు శకుని శంబర కాలనాభ మదోత్కచాదుల గావించి సమాశ్వాసించి యనంతరము హిరణ్యాక్షునిభార్యల నూరడించి పుత్రశోకజ్వరపీడితయైన దైత్యమాతను దితినిజూచి కొడుకుకొఱకై విలపించుచున్న యాయవ్వ నూరార్పఁదలంచి యిట్లనియె.

"తల్లీ! ఈతెఱంగున నీవు విచారింపఁదగదు. నీవు లోకవృత్త

మెఱిఁగినదానవు. పెద్దదానవు. సుఖమువచ్చినప్పుడు మహాసంతోష మునొంది కష్టముప్రాప్తించినప్పుడు కడువగఁగూడుట వివేకుల కెఱుంగుకాదు. సాయంకాలము నానాదిశలనుండి పక్షులు వచ్చి చెట్టునాశ్రయించి మఱునాఁడు ప్రాతఃకాలమున దేనిదారినదిపోవుచందమున చలిపందిరికిఁ బోవు బాటసారులవలెను జీవులు సంసారంబునం బ్రవేశించి తమపని దీర్చికొనిపోవుచుందురు. అట్టివానికై విచారింపఁదగదు. ఈప్రపంచము మహారంగస్థలంబు పాత్రధారులు రంగంబు ప్రవేశించి తమ కలాపంబులువినిపించి యదిముగిసినవెనుక వేసంబులుతీసివేయుచందమున జీవాత్మలుపాధుల నాశ్రయించి పిమ్మటవచ్చిన చోటికిం బోవుచుందురు. అమ్మా! దేవదేవుండగు శివుఁడు జగన్నాటకసూత్రధారియగుటంజేసి నాటకుఁడు తోలుబొమ్మలను గావించి యాడించి పనిముగిసినవెనుక వానిం దెరమీఁదినుండి తీసివేయుచందమున జంతువులను సృష్టించి బహుప్రకారములవానిం ద్రిప్పి పిమ్మట వాటిని రూపఱఁ జేయుచుండును. ఈశ్వరుఁడు తానుకర్మబద్ధుండుగాక చేయునదిలేదు. ఆయువు చెల్లిపోవువారిని రక్షింప మనశక్యముగాదు.

ఆ. వె. ధనమువీథిబడిన దైవవశంబున
నుండు బోవు మూలనున్ననైన
నడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునఁ జచ్చు.

చన్నవారికొఱకు విచారించుట యవివేకము అదియునుఁగాక నీకుమారుండు నీచపుచావు చావలేదు. సకలసంపదలననుభవించి యఖిలసౌఖ్యంబులనంది దిక్పాలురగడగడవడకించి పశులకదుపులఁ దోలినచందమున వేల్పుమూఁకలను దిగంతములకుఁ బాఱఁదోలి శత్రుకిరీటమాణిక్యములు తనయడుగుదామరలకు నీరాజనంబువెట్ట నిరుపమాన తేజోవిరాజితుఁడై శాత్రవులతో యుద్ధముచేసి శూరాగ్రేసరులందునట్టిపదవి

నంది వీరస్వర్గము జేరినాఁడు అట్టివానికై యశ్రుజలములవిడచుట యధర్మము. అతఁడు పోయినను వానిపగతునిపై దాడివెడలి కసి దీర్చుకొని నీశోకంబు కొంతవఱకు డిందువడునట్లుచేయుటకు నీ జ్యేష్ఠ పుత్రుఁడు హిరణ్యకశిపుఁడున్నాఁడు. పెద్దకొడుకే మృతినొందినాఁడ నియుఁ జిన్నకొడుకే జీవించియున్నాఁడనియు భావింపుము. ఆతనికు మారుల నాకుమారులుగా భావింతు. తండ్రిలేనివెలితి వారికెంత మాత్రము గలుగదు. నీవుఱడిల్లి నవవైధవ్యదుఃఖభారమున గ్రుంగి న కోడండ్రను సమాశ్వాసింపుము." అని తత్త్వోపదేశంబు జేసిన దితియు ధృతిగలిగి దుఃఖోపనోదకములైన కొడుకుమాటల దలంచి కోడండ్ర నూఱడించి శాంతభావంబుగలిగియుండెను.

హిరణ్యకశిపుఁడును నారాయణునిచేతను మఱియెవ్వనిచేతను మరణంబు లేకుండుటకై యతిఘోరంబుగఁ దపంబు సేయఁదలచి మంద రపర్వతమునకరిగెను. అరిగి నిష్ఠాగరిష్ఠుఁడై యొక్కకాలిబొటనవ్రేలి మీఁద నిలువంబడి యూర్ధ్వభాహుఁడై నాకసంబు వంకజూచుచు జడలుదాల్చి మధ్యాహ్నసూర్యుఁడట్లు నెవ్వరికిం దేఱిచూడరాని తేజంబుతోఁ బ్రకాశించుచు నుగ్రతపంబు సేయుచుండెను.

అతని తపోవహ్నినుండి పొడమినధూమరేఖలు నానాదిశలు వ్యాపించుటంజేసి నిర్జరులు తల్లడిల్లిరి. వేల్పుటువిదలగుండెలు కొట్టు కొనెను. పర్వతసమేతముగా నేలయదరెను. సప్తసాగరములుకలఁగెను. చుక్కలుచెదిరెను గ్రహసంచారములు దప్పెను. త్రిలోకభయంకరమైన యాతనిఘోరతపస్సుజూచి దివిజులుభయకంపితులై సత్యలోకము నకుఁబోయి పితామహునింగనుఁగొని యిట్లుమొఱవెట్టుకొనిరి. "దేవా! దితి పెద్దకొడుకు మేటితపంబు సేయుచున్నవాఁడు. వానితపోవహ్నిచేత పదునాల్గుజగములు భస్మంబులగునట్లుతోఁచెడును. వానిసంకల్పమేమొ తెలియరాదు. విశ్వంబునకాపదవాటిల్లకుండఁ బ్రతిసంస్కారంబు

సేయఁగల సమర్థుండవీవొక్కఁడవ. కావున దీనికిఁబ్రతిక్రియసమాలో చించి జగములనుద్ధరింపవే! నీవుసృష్టికర్తవై భాసిల్లినతెఱంగును దానునువిశ్వనిర్మాణాది మహాకార్యములుచేసి నిన్ను మించవలెనని వాఁడు తలంచుచుండఁబోలును."

అని వేల్పులు వేఁడుకొన సరసిజాసనుఁడు దయార్ద్రహృద యుఁడై భృగువు దక్షుఁడు మొదలగుప్రజాపతులంగలిసికొని మందర పర్వతమునకుఁబోయి యచ్చటనుగ్రతపోనిష్ఠుఁడైనదుష్టనిశాటునిజూచి వాని నియమంబునకు నిష్ఠకు నచ్చెరువడియిట్లనియె.

"వత్సా, దితినందనా! నీరక్తమాంసంబులను జీమలు నీగలు తినుచున్నవి. నీశరీరముమీఁద పుట్టలుపోసినవి. నీచుట్టును వెదురు పొదలుపెరిగినవి. ఇంతపరవశత్వమైన తపంబుచేసినవా రెందుగలరు? అదిగాక నూఱుసంవత్సరములు నిద్రాహారములులేక మహాతపంబు గావించితివి. తపంబులు చేసినవారు వరంబులుబడసినవారు మున్నెం దఱో యుండిరిగాని, నీచందమున లోకోత్తరవర్తనము గలిగినవారు లేరు. నీకోరినవరము లిచ్చుటకు నేనిదేవచ్చితి. నీయుగ్రతపంబునకు బదునాల్గుజగంబులు తల్లడిల్లుచున్నవి. చాలుచాలు నిఁకలెమ్ము." అని చల్లనితనకమండలుజలంబు వానిపై జల్లెను. చల్లుటయు మక్షికపి పీలికాదులు భక్షించుటచే నతిజీర్ణమైన యాతనిశరీరం బెప్పటియట్ల వికాసముపొంది తేజరిల్లెను. క్రొక్కాఱుమబ్బులు భేదించుకొని వెలు వడు గ్రీష్మకాలప్రభాకరునివిధమున నాదానవేంద్రుఁడు పుట్టలు వెదు రుపొదలు భేదించుకొని వెలువడి తనపైననుగ్రహంబుపెంపున విజ యంచేసిన మొదటివేల్పునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి యతనిపైఁ జూడ్కినిల్పి గద్గదస్వరమునని ట్లనియె. "దేవా! సృష్టి గావించునెడ రజోగుణప్రధానుఁడవై స్థితినెఱపునెడల సత్వగుణసంప న్నుండవై లయమాచరించునెడ తమోగుణావిష్టుఁడవై యుండు మూఁడు

మూర్తుల సారమునకు నీకు వందనములొనర్చెద. నీవింద్రియముల కధీశ్వరుఁడవు. సకలచరాచరపదార్థములకాధారభూతుఁడవు నీదేహం బుసకలవిద్యాస్వరూపంబు జ్ఞానమూర్తివి. తుదమొదలులేనివాఁడవు నేఁగోరినకోరిక లిచ్చెదనంటివిగాన, గోరుచున్నాఁడ. మాటతప్పక నిలువుము. పృథివ్యాపస్తేజోవాయురాకాశములచేతను, దిక్కులయం దును, రాత్రులయందును బట్టపగళ్లయందును, గ్రహములచేతను జల చర వనచర భూచర ఖేచరంబులగు జంతుసంతానములచేతను నానా విధశస్త్రములచేతను నస్త్రములచేతను నాకు మృత్యువులేకుండఁ జేయుము. రణంబులయందు నాకెవ్వఁడు నెదురుండఁ గూడదు. నామహిమది క్పాలుర నతిశయించునదియై యుండవలయు. నేను ము జ్జగంబులఁ గెలువవలయు. ఈయఁదలఁతువేని తూచా తప్ప కుండ నాకోరిన కోరికలన్నియు నొసంగుము. ఈయఁజాలవేని నీదారిం బొమ్ము." అని నుతియించి వరంబులువేఁడిన వేల్పు పెద్ద కాదనఁజాలక వాని తపంబునకు సంతసించి యడిగినవరంబు లన్నియు నిచ్చి "వత్సా! యీవరంబుల మున్నెవ్వరు నన్నుఁ గోరరు. వాత్స ల్యంబున నడిగినట్లు యిచ్చితి. వరగర్వంబున విజృంభించి లోకత్రా సంబుజేయక, సాధుహింస గావింపక, బృందారకుల బాధింపక బుద్ధిమంతుండవై బలంబునకు శాంతంబు నన్నెవెట్టుననుమాట జ్ఞప్తి లోనుంచుకొని మెలకువగలిగి వర్తింపుము." అని హితోపదేశంబు చేసి బృందారకబృంద మనుసరింప పరమేష్ఠి సత్యలోకంబున కరిగెను.

సరసిజాసనుఁడు బోధించిన సద్బుద్ధి నతనికే యప్పగించి దాన వేశ్వరుఁడు వరలాభంబున నుబ్బి దుర్వారగర్వోన్మత్తుండై

సీ. ఒకనాఁడు గంధర్వయూథంబుఁ బరిమార్చు
దివిజుల నొకనాఁడు దెరలఁదోలు

భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు
గ్రహముల నొకనాఁడు గట్టివైచు
నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు
నొకనాఁడు విహగుల నొడిసిపట్టు
నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు
మనుజుల నొకనాఁడు మదమడంచుఁ
తే. గీ. గడిమి నొకనాఁడు కిన్నరఖచరసాధ్య
చారణప్రేతభూతపిశాచవన్య
సత్త్వవిద్యాధరాదుల సంహరించు
దితితనూజుండు దుస్సహతేజుఁడగుచు.

అష్టదిక్పాలుర నదిమి, పట్టణంబులు ముట్టడించి వారలం బాఱఁదోలి యాక్రమించెను. లోకమంతయు వాని యధీనమయ్యెను. సూర్యచంద్రాదిగ్రహములుసైతము వాని గీచిన గీటు దాటఁజాలక పోయెను.

అనంతర మతఁడు మహేంద్రుని కొలువుకూటంబు సొచ్చి నవరత్నస్థగితంబై, దేదీప్యమానప్రభావిరాజితమై, యతిపవిత్రమై వెలయుచుండిన మహేంద్రసింహాసనము నధిష్టించి చండశాసనుఁడై యుండ నతనిదాడి కోడి యక్ష కిన్నర కింపురుషులును సిద్ధ సాధ్య విద్యాధరులును పాదాక్రాంతులై వెలలేని కానుకలు బెట్టి వాని యనుగ్రహంబునకుఁ బాత్రులైరి. పద్మనాభుఁడును బరమేష్ఠియు ఫాలలోచనుఁడు దక్క తక్కిన బృందారకు లందఱు నేఁ డెవ్వని మీఁద దాడివెట్టునో, యెల్లి నెవ్వరి బంధించునో, యెవ్వనిపైఁ గినుక బూనునో యని యడలుచు గుండియలు చేతఁబట్టుకొని సునాశీరప్రముఖదివ్యముఖ్యులు వంగివంగి యతనికి జోహారులుచేసి వినయవినమితగాత్రులై యుండిరి. చారు లీప్రకారంబున నుడువుచుందురు.

సీ. కోలాహలముమాని కొలువుఁడీ సురలార
తలఁగి దీవింపుఁడీ తపసులార
ఫణులెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార
ప్రణతులై సనుఁడి దిక్పాలులార
గానంబు సేయుఁడీ గంధర్వవరులార
సందడిఁబడకుఁడీ సాధ్యులార
యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార
చేరికఁ మ్రొక్కుఁడీ సిద్ధులార
తే. గీ. శుద్ధకర్పూరవాసిత సురభిమధుర
భవ్యనూతన మైరేయ పానజనిత
సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు
శాంతి లేదండ్రు నిచ్చలు జారులధిప.

ఆదానవుఁడు మదిరాపానముచేత మత్తిలి యుద్యానవనముల యందలి లతాకుంజములలో యథేచ్ఛముగా నంగనాసమేతుఁడై విహరించుచుండ వాని యాజ్ఞావశులై తుంబురనారదులు వీణియలు చేతఁబూని పాడి యాతని మెప్పించుచుందురు. భూలోకమున బ్రాహ్మణులు మొదలగు ద్విజులు చేయు యాగంబుల హవిర్భాగంబులు దేవతల కీయక యారాక్షసేశ్వరుఁడు యజ్ఞవాటంబులకుఁ బోయి తాన గ్రహించుచుండును. ఆతఁడు త్రైలోక్యసామ్రాజ్యంబు బూని పరిపాలనము సేయుచుండ నాతని చండతేజమునకు జడిసి నేల దున్నకయె సస్యములు పండెను. కావలసినప్పుడెల్ల మేఘములు పుష్కలంబుగ వానలు గురిసెను. సముద్రములును నదులును మితిలేని రత్నరాసుల నిచ్చెను. చెట్లు తీఁగలు నేకకాలముననె యాఱుఋతువుల ఫలపుష్పముల నిచ్చెను. అట్లు లోకకంటకుఁడై రాజ్యంబు సేయుచు నారాయణు నిర్జించి సంహరింపవలయునని కోరికతప్ప వేఱుకోరికలు

లేక నిర్జరారాతి పద్మసంభవదత్తవరప్రభావమున గడుంమిగిలి కండ కావరమున నొంపుదలంపక నెల్లవారిని సిలుగులంబెట్టుచుండెను.

అప్పుడు దివిజులు మనుజులు మహామునులు "మాకెన్నఁడు దిక్కుగల్గు? ఈదిక్కుమాలినబ్రతుకునుండి మమ్మెవ్వరు రక్షింతురు? ఎన్నఁడు వానవేందుని దుర్నయము లణఁగు? ఎన్నఁడు లోకమునకుఁ బ్రశాంతిగలుగు? అట్టి భాగ్యంబు మా కెన్నఁడేని గలుఁగునే" యని కడుంగడు విచారించి యనన్యశరణ్యులై నందఱు నొక్కచోటఁ జేరి "ఓజగన్నాథా! యెక్కడనున్నవాఁడవు? నీవు సర్వవ్యాపకుఁడ వందురు. మాకుం బ్రసన్నుఁడవుగమ్ము. దిక్కులేని వారికి దిక్కు నీవ. అట్లగుటం జేసి యగతికులగు మమ్ము కృపాతరంగితాంతరంగుండవై రక్షింపవే" యని సచ్చిదానందమయుఁడును సకలలోకారాధ్యుండును సర్వలోకాంతర్యామియు సనాతనుఁడును సాధుజనరక్షకుఁడును సకలనిగమాంతసారుఁడునునైన పరమేశ్వరునకు నమస్కరించి చిత్తంబులు పరాయత్తంబులు గాకుండ హరిని ధ్యానంబు చేసిరి. అత్తఱి నారాయణుఁడు కరుణాపరాయణుఁడై యదృశ్యుండయ్యు కాలమేఘగంభీరంబగు ఘోషంబుతో వారి కిట్లనియె:—

"బృందారకులారా! బ్రహ్మర్షులారా! వెఱువకుఁడు వెఱువకుఁడు. రాక్షసేశ్వరునకు మరణకాల మాసన్నమైనది. అట్టి కాలముకొఱకు నేను వేచియున్నవాఁడ. వాని పాపంబు పండినది. మీబాధ లచిరకాలంబున నడఁగు. సాధుహింసచేయువాఁడు చాలకాలము మనలేఁడు. మంటిలో రత్నము ప్రభవించినచందమున నీదురాత్మున కొక్క సత్పుత్రుఁడు జనియించు. వాఁడు పరమభాగవతోత్తముఁడగు. గెలవై చినపిదప ననఁటిచెట్టునకు నాశముగలుగునట్లు ప్రహ్లాదుఁడనుపుత్రునికతమున నతనికి నాశముగల్గు. ఇయ్యది తప్పదు. మీరింక నిర్భయంబుగా మీమీనెలవుల కరుగుఁడు. నలువవలన వాఁ

జెన్నియమోఘవరంబులం బడసినను వానిం జంప నా కుపాయము పొడకట్టుచున్నది. వాఁడు చచ్చెనని నిశ్చయముగా నమ్ముఁడు" అని హరి యభయప్రదానమొసంగిన త్రిదశులు దుర్దశలు దొలఁగినవని తమతమ దిశలకుం బోయిరి.

హిరణ్యకశిపునకు నలువురుకొడుకులు పొడమిరి. ప్రహ్లాదుఁడం దగ్రగణ్యుఁడు. అతఁడు చిన్ననాఁటనుండియు హరిభజనలోలుఁడై బుద్ధిమంతుఁడై యుండెను.

సీ. తనయందు నిఖిలభూతములందు నొకభంగి
సమహితత్వంబున జరగువాఁడు
పెద్దలఁబొడగన్న భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంతలడ్డంబైన
మాతృభావము సేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁగావఁ జింతించువాఁడు
తే. గీ. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప.
ఆ. సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి
యసురరాజతనయునందు నిలిచి
పాసిచనవు విష్ణుఁ బాయనివిధమున
నేఁడుఁ దగిలియుండు నిర్మలాత్మ.

చక్కఁదనము, సత్కులప్రసూనత, విద్యావిశేషము, ధనము కల్గియుండినను నతనికి లేశమైన గర్వములేదు. అనుభవించుటకు సక

లవిషయంబు లున్నను నించుకేనియు నింద్రియలోలుఁడు గాఁడు. వయస్సు దేహబలము గలవాఁడయ్యుఁ గామరోషంబులకుఁ జిక్కఁడు. మహారాజకుమారుఁడయ్యు వెలఁది, వేఁట, జూదము, సురాపానము మొదలగు వ్యసనములయందుఁ దగుల్కొనఁడు. ఏవస్తువు జూచినను నే మధురవాక్కుల వినినను వస్తుదృష్టిచేత దానిని జూడఁడు. హరి పదధ్యానపరాయణుఁడగుటచేత నతనికి రెండవచింత లేదు. ఆజన్మ శత్రువులైన మహేంద్రాదులుసైతము ప్రహ్లాదుని గుణవిశేషంబులు విని యిట్టిసజ్జనుఁడు లేఁడని కీర్తించుచుందురు. జనియించినది దుష్ట రాక్షసకులమైనను గుణము జాతి వయోలింగభేదములు లేక పూజా స్థానమగుటచేత నిష్పక్షపాతమనస్కులు గుణ మెచ్చట నున్నను దానిని గ్రహింతురు. తామరపూవు బురదలోఁ బుట్టినదని దానిని విసర్జింపరు. బంగారము, రత్నములు మంటిలో జన్మించినవని పరిత్య జింతురా? సువర్ణమునకు సువాసన యబ్బినట్లు ప్రహ్లాదునకు సద్గుణ ములకుఁదోడుగా సరసిజాక్షుని పాదభక్తియు వెన్నతోఁబెట్టిన విద్య వోలె నలవడెను.

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరినయట్లైనఁ
జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱచు
నసురారి దనమ్రోల నాడినయట్లైన
నసురబాలురతోడ నాడమఱచు
భక్తవత్సలుఁడు సంభాషించినట్లైనఁ
బరభాషలకు మాఱుపలుకమఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచినయట్లైనఁ
జొక్కి సమస్తంబుఁ జూడమఱచు
తే. గీ. హరిపదాంభోజయుగచింతనామృతమున
నంతరంగంబు నిండినయట్లైన నతఁడు

నిత్యపరిపూర్ణుఁడగుచు నన్నియునుమఱచి
జడతలేకయునుండును జడునిభంగి.

నెచ్చెలులతో నాడునప్పుడు పాడునప్పుడు, నీరు ద్రావునప్పుడు, నిద్రించునప్పుడు, చదువునప్పుడు, సంభాషించునప్పుడు నబ్బాలుఁడు నారాయణచింతాపరతంత్రుఁడై యుండునుగాని యాటల, పాటల, మనసు నిల్పఁడు. ఏకారణముచేతనైన శ్రీమన్నారాయణ చింత గలుగకపోయినపక్షమున మహాపత్తు వాటిల్లినయట్లు పెద్దపెట్టున నొక్కఁడు కూర్చుండి యేడ్చును. ఒకానొకసమయంబున హరిలీలా విశేషముల గానముసేయుచుండును. ఆనందస్వరూపుఁడైన మాధవుం దలఁచి యొకప్పుడు కిలకిల నవ్వుచుండును. విష్ణుందలఁచి యాతఁడు సాక్షాత్కరించినట్లు తోఁచినపక్షమున నుబ్బి పరవశుఁడై నాట్యముసేయును. కన్నులు మూసికొని ధ్యానలోలుఁడై నడచుచు నడచుచుఁ ద్రోవలో నడుమ నాఁగి యానందబాష్పసమేతుఁడగును. సజ్జనులతోడనేగాని సహవాసముచేయఁడు. ఎంతయాప్తులైనను దుర్జనులం దరికిఁ జేరనీయఁడు. తోడిబాలురు దుర్భాషలాడినప్పుడు వారిని సామవాక్యములతో ఖండలించును. ఎవ్వఁడైనం దనయెదుట నే చిన్నజంతువునైన హింసింపఁజూచిన ధర్మోపదేశంబు జేసి యాక్రూర కర్మంబునుండి వానిని మరల్చును. రాజపుత్రుఁడ నేనని గర్వింపక విపన్నులగువారికి సాయముచేసి యాపద్బాంధవుఁడగును. మృదువు దప్పినమాట నోట రానీయఁడు. పాపచింత మనంబునఁ జేరనీయఁడు. అట్టి వంశదీపకుని సుగుణరత్నాకరుని లోకైకపూజ్యుని నందనుని జూచి గర్వించి యానందమొందుటకు మాఱుగా రాక్షసేశ్వరుఁడు చిన్నతనమునందే పగవాఁడైన నారాయణుని స్మరియించి తనకుమారుఁడు చెడిపోవుచున్నాఁడని విచారించి యొక్కనాఁ డాతనిం జేరఁ బిలిచి

క. చదువనివాఁ డజ్ఞుండగుఁ
జదివిన సరసద్వివేకచతురత గలుగుం
జదువఁగవలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ!

అని పలికి శుక్రాచార్యనందనులును సకలవిద్యావిశారదులును, దనకుఁ గులాచార్యులును నైనచండామర్కుల రావించి దగినతెఱంగున గౌరవించి యిట్లనియె: "మహాత్ములారా! నాకుమారుఁడు ప్రహ్లాదుఁడు శాస్త్రజన్యవివేకంబులేక కన్నులుండియు గ్రుడ్డితెఱంగున నున్నవాఁడు. ముజ్జగంబును గెల్చి యేకచ్ఛత్రముగ నేలుచున్న నన్నును, సాటిలేని నాప్రతాపమును వీఁడు వినుతింపఁడు దుస్సహావాసంబులుచేసి మాకులవైరియైన నారాయణుని నిరంతరము స్మరించుచుండును. మీరు మాకులగురువులు. మహావిద్వాంసులు. పెద్దలు. మామేలు నిరంతరముఁ గోరుచుందురు. కావున వీనిం దోడ్కొనిపోయి చార్వాకాదిమతములు నేర్పి కుశలుంజేసి దానవలక్షణంబు లబ్బునట్లును, దానవారాతియెడ ద్వేషంబుగలుగునట్లును శిక్షించి మాకులగౌరవంబును గాపాడి మమ్మనుగ్రహింపవలయు. సింగంబుకడుపునఁ జిట్టెలుక పుట్టినట్లు వీఁడు నాకడుపునంబుట్టి నీచుఁడైన నారాయణునిఁ దలంచుచుండుటచేత సాటివారిలో నాకు నగుబాట్లగుచున్నవి. కావున నీతలవంపులు దొలంగునట్లు వీనిని బుద్ధిమంతునింజేయుభారము మీయది" యని వారి కప్పగించినఁ దక్షణమ చండామర్కులు దనుజరాజనందనుని దోడ్కొనిపోయి యీడుజోడుగల రక్కసిపిల్లలతోఁ జేర్చి చదివింపమొదలుపెట్టిరి. గురువులే శాస్త్రము జదివించిన నాశాస్త్రమే యతఁడు జదువునుగాని, యతఁడు చదువననఁడు. నాస్తికవాదములు వారు బోధించినను నతఁ డదియాస్తికవాదముగా గ్రహించును. హరిని వారు దూషించిన నతఁడు

మనంబున వానిని భూషించును. శాస్త్రంబులలోనున్న ప్రతిమాట యుఁ బ్రత్యక్షరమును హరిపరముగా నతఁడు దీసికొనుచు గురు బోధలు నిష్ప్రయోజనములనియు మిథ్యలనియు నతఁడు భావించు చుండును.

అట్లు కొంతకాలంబు విద్యాభ్యాసంబుచేసినపిదప నందనుఁ డెంతవఱకు నభివృద్ధినొందెనో విద్యాపరిశ్రమ మెంతవఱకు జరిగినదో గురువులు శాస్త్రములయందుఁ గుమారు నెట్టికుశలుం జేసిరో తెలిసి కొనవలయునని హిరణ్యకశిపునకుఁ గుతూహలంబుపొడమ సేవకులం బంచి ప్రహ్లాదునిం దోడ్కొనిరమ్మని యానతిచ్చెను. గురువులు వెం టఁబెట్టుకొనిరా శిష్యుఁడు జనకునిసన్నిధి కరిగెను. తాము చెప్పిన పాఠములు తూచాతప్పకుండ శిష్యుఁ డొప్పటికప్పు డప్పగించుటంజేసి తండ్రికడఁ దమనేర్పిన తెలంగున ప్రహ్లాదుఁడు భాషించునని గురువు లు వికసితముఖులై యుండిరి. వచ్చినకొడుకును జేతులు సాచి దగ్గఱ దీసి దానవేంద్రుండు ముద్దాడి యుత్సంగతలమునఁ గూర్చుండఁబె ట్టికొని "వత్సా" ఉత్సాహ ప్రభుమంత్రశక్తులను నేర్చితివే? సప్త రాజ్యాంగంబులెట్లుండ వలయునో గ్రహించితివే? శుక్రనీతిశాస్త్ర ము నామూలాగ్రముగఁ బఠించితివే? వేదందబునల్లించితివే? తర్కా దిశాస్త్రంబులలోఁ బ్రవేశంబు గలిగెనే? చార్వాకమతము నీకునచ్చిన దే? శాస్త్రములలో నీకెయ్యది యభిమానశాస్త్రము? చెప్పు" మని ప్రశ్నించెను. తండ్రి పలుకులు విని ప్రహ్లాదుఁడు భయమించుకయు లేక యిట్లనియె—"తండ్రీ! ఆచార్యులు సకలశా స్త్రంబులు జదివించిరి. శ్రద్ధాళువునై నేనుం జదివితి. విద్యలలోని సారమెల్ల నేఁగనిపెట్టితి. శరీరధారులందఱు సంసారమను చీఁకటినూ తిలోఁ బడియు నావాఁడు పెరవాఁడను భేదభావముగలిగియు, నశి యించుచున్నారు. అట్టి పాడునూతిలోఁ బడి నశింపకుండ భేదభావం

బులచేతఁ జెడిపోకుండ నొక్కటే మార్గముగలదు. అదియేదనిన శ్రీ మన్నారాయణచరణారవిందధ్యానమే. జగమంతయు నారాయణ మయము. బ్రహ్మ నారాయణుఁడు. శివుఁడు నారాయణుఁడు. ఇంద్రుఁడు నారాయణుఁడు, దిక్పాలకులు నారాయణస్వరూపులు, దేవతా కోటి నారాయణస్వరూపము. వెయ్యేల! సకలచరాచరవిశ్వము నారాయణుఁడు, కాలము నారాయణుఁడు, పంచభూతములు నారాయణ స్వరూపములు హరియేజగము. జగమేహరి. హరిభజనమే యుభయ లోకతారకము. దాని నెఱుఁగక జనులు వివేకులై హరిభజనము చేయ వలయు" అని నిశ్చలుఁడై బాలకుఁడు వలుక తండ్రి వానిధైర్యము నకును విపరీతలక్షణంబులకును విస్మితుఁడై వాని యజ్ఞతదలంచి చిఱు నవ్వునవ్వి యిట్లనియె:—"ఆహా, బాలకు లేమెఱుఁగుదురు. ఎవ్వ రేమిచెప్పిన నదియే పలుకునట్టి చిలుకలట్లు బాలకులుగూడ నెయ్యది విన్న దానినేమనంబున నిలిపి పఠింతురు. ఎవ్వరోయనుకొన్న పాడు మాటలువిని వీఁడిట్లు పలుకుచున్నవాఁడు. నాయనా, దానవులకు గర్భశత్రుఁడై మనకులంబునకు మహాపరాధంబుగావించిన దుర్నీతి పరాయణుని నారాయణుని, దలఁచుటకు నీకు నోరెట్లాడెను? బట్టు వలె వానిం బొగడుచుంటివి. నీచేష్టలుచూడ నాకు మిక్కిలి చోద్య మగుచున్నది. ఈబుద్ధి నీకేత్రోఁచెనో లేక మఱి యెవ్వరైన నాయందలి విరోధభావమున నాకు మనక్లేశంబు గల్గింప నీకు నేర్పిరో, లేక చండామర్కులు రహస్యంబున నారాయణస్మరణపరాయణులై యుండఁగా నీవు వింటివో నాకెఱుఁగఁ జెప్పుము. ఇంత నోంటలేని యీదురాచారంబు నీకెట్లలవడియె? మల్లెచెట్టున నుల్లిపూవుబుట్టినట్లు దానవద్వేషిగర్భమున దానవాంతకభక్తుఁడు జనియించుట జనవిరుద్ధ ముగ నున్నది. చక్కనివాఁడవు. సుగుణవంతుఁడవు బుద్ధిమంతుఁడవు నైతివిగదాయని సంతసించుచుంటినిగాని యిట్టిదుర్బుద్ధివగుదువని కల

నైనఁ దలంపనైతి. ఏమని నీవు హరిందలంచుచుంటివి? ఇది సురలను స్రుక్కించుటో, సిద్ధులరు శిక్షించుటో మునులను ముప్పాతిప్పలం బెట్టుటో, వియచ్చరసందోహమును వేధించుటో, ఏమి ఘనకార్యమని యీపని చేయుచుంటివి? ఈనీచకార్యము గావించి దానవకుమారుల లో నీవెట్లు తలయెత్తుకొని తిరుగఁగలవు? పరిశుద్ధమైన దేహమునుండి దుష్టవ్రణము బైలుదేరినతెఱంగున నాకడుపున విరోధిప్రియుఁడయిన నీవు జనించితివని సిగ్గుపడవలసివచ్చును. నారాయణుఁడు గీరాయణుఁ డు నాకుం బనికిరాడు. నేఁడుమొదలుకొని వానిని గలనైనఁ దలపెట్ట కుము." అనవుడు గురువుల మొగంబుచూచి యిట్లనియె:—"అయ్యా, మీరు బ్రహ్మవాదులయ్యు నామనస్సు పరబ్రహ్మమైన నారాయణుని మీఁద నిలుపకుండ నజ్ఞానకూపంబునఁబడినట్లు మిగులఁ బ్రయత్నిం చిరి. మీరెంతప్రయత్నించినను నాచిత్తముమాత్రి మయస్కాంత ముచేత నినుపముక్క యాకర్షింపఁబడినట్లు మాధవు పదారవిందముల మీఁదికే పోవుచున్నది. చెఱుకుగట్టు విడిచి చొప్పకట్టు నెవఁడునమలఁ జూచును? చల్లనినీరుండఁగా సముద్రపునుప్పుజల మెవ్వఁడు పానము చేయును? మఱియు వినుఁడు:—

సీ. మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబువోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁదూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరక
మరుఁగునే సాంద్రనీహారములకు

తే. నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుతిగుణశీలమాటలు వేయునేల.

అని విరుద్ధముగా భాషించుచున్న ప్రహ్లాదునింజూచి చండామర్కులు కోపారుణితలోచనులై యిట్లనిరి— "రాజకుమారా, నీవై దేండ్లవాఁడవు. ఇంకను ముక్కుపచ్చ లార లేదు. ఒకచెంపకొట్టిన క్షీరము నొకచెంపఁగొట్టిన నీరము వచ్చును. మాటలుచూడ గోటలు దాఁటుచున్నవి. తిన్నగా నొక్కమాటకైన నుత్తరముచెప్ప లేవుగాని, శాస్త్రవాదములు వాదింతువు. హరియందువు గిరియందువు. మేము చెప్పినపాఠ మొక్కటియైనఁ జెప్పవు. మేము నిన్ను బాగుచేయుదు మని నమ్మి పుట్టెడాశపెట్టుకొన్న నీతండ్రిముందట మేము తలలు వంచుకొనవలసివచ్చెను. నీవు తండ్రికి శత్రుఁడవుగాని బుత్రుఁడవు గావు. దానవవంశమనియెడు మంచిగంధపుతోటలో ముండ్లచెట్టువై నీవు పుట్టితివి. నిరంతరము నీనాలుక దానవకులాంతకునే ప్రస్తుతించుచుండును. తగినదండనముచేయక రాజపుత్రుఁడవని ముద్దుచేయుట చేత నీవింత మొండివైతివి." అని రాక్షసేంద్రు నుద్దేశించి "దేవా! యిఁకమీఁద మీకుమారుని మిక్కిలి జాగరూకతతోఁ జదివింతుము. రాజనందనుఁడని శంకింపక మీసెలవయ్యేనేని తగినతెరఁగున దండించి బుద్ధిమంతుని జేసెదము. మావెంట నంపుము. ఈసారిచూతుము." అని మనవిచేసి పురోహితులు ప్రహ్లాదునివంక గనువెట్టఁజేసి చూచి జంకించి, తల పంకించి యాతనిందోడ్కొని తమమందిరంబున కరిగి నయమునలాలించి, భయమునఁదూలించి సామదానభేదదండోపాయములం జెప్పి వానికిఁ బరిమోగంబుబోధించి శుక్రాచార్యప్రణీతంబైన నీతిశాస్త్రంబు జదివించి రాజనీతివిశారదుం జేసిరి. తమనేర్పిన

విద్యలయందు మిక్కిలి ప్రౌఢయయ్యెనని నమ్మికపొడమిన వెనుక నొకనాఁడు వానినిఁ దల్లికడకుఁగొనిపోయి తాముచెప్పినచొప్పున పాఠము లప్పగించుకొని, పిమ్మట హిరణ్యకశిపునికడకుఁ గొనిపోవఁదలఁచి "నాయనా, ప్రహ్లాదకుమారా! ఈసారియైన మామాట దక్కింపుము. నీతండ్రికడ మేముచెప్పినపాఠము లప్పగింపుము. నీనారాయణ స్మరణంబులు కట్టయక్కడవిప్పకుము. మీతండ్రి మాపై దీర్ఘకోపము వహించును. మాకూఁటిలో మట్టిపోయకుము. మాపై ననుగ్రహింపుము" అని బతిమలాడుకొని,

సీ. అడుగడుగునకు మాధవానుచింతన సుధా
మాధుర్యమున మేను మఱచువాని
నంభోజగర్భాదు లభ్యసింపఁగలేని
హరిభక్తిపుంభావమైనవాని
మాతృగర్భముసొచ్చి మన్నదిమొదలుగాఁ
జిత్తమచ్యుతుమీఁదఁ జేర్చువాని
నంకించి తనలోన నఖిలప్రపంచంబు
శ్రీవిష్ణుమయమని చెలఁగువాని
తే. వినయకారుణ్యబుద్ధి వివేకలక్ష్మ
ణాదిగుణముల కాటపట్టయినవాని
శిష్యు బుధలోకసంభావ్యుఁ జేరి గురుఁడు
ముంజటికి దోడ్తెచ్చి తండ్రికిమ్రొక్కుమనుచు.

పలికి దానవేంద్రునితో "అయ్యా! నీకుమారుని నానావిధముల శిక్షించి నీతిశాస్త్రకుశలునిం జేసితిమి. పరీక్షింపుము" అని విన్నవించిరి. అని యాచార్యులు మనవిసేయుటయు హిరణ్యకశిపుఁడు సంతసించి తనకు దండప్రణామంబుచేసి. యెట్టయెదుట నిలిచిన రూపనిర్జితమారునిఁ బ్రియకుమారుని భుజద్వయంబుసాచి దగ్గఱఁదీసి ముద్దు

లాడి తలపై జేయివైచి నిమిరి తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని యిట్ల నియె. "నాయనా, యిన్నాళ్ళనుండియు నీయొజ్జలు నీ కేమిబోధించిరో, నీవు వారికడ నేమియభ్యసించితివో తెలియవలతు. నీపఠించిన గ్రంథములలో దేనినుండియైన రమణీయమైన శ్లోకంబొక్కటి చదివి దాని యర్థతాత్పర్యంబులు వివరించి నీమధురాలాపములచే నావీనులకు విందు సేయుము. నీతోడి రక్కసిపిల్లలు శాస్త్రార్థములలో నీకన్నఁ బ్రోఢలై నిన్ను మెచ్చకయున్నవారు. ఎన్నఁడు నీవు నీతిశాస్త్రవిచారకోవిదుఁడవై నాకర్ణపర్వంబు సేయుదువోయని యూటలూరుచున్నవాఁడ. నామనోరథముదీర్చి నాకానందంబు గల్పింపుము. పుత్రాదిచ్ఛేత్పరాజయమ్మని పెద్దలుచెప్పుదురు. విద్యయందుఁ దండ్రికొడుకుచేతఁ బరాజయము నొందగోరును. కావున నీవు నాకన్న నెల్లశాస్త్రములలో మిన్నవైయుండు కాలమెప్పుడువచ్చునో యప్పుడు నాజన్మము తరించినదని నేఁదలంచెద. నీ నేర్చిన యర్థమేమో తెలియఁ జెప్పుము." అనవుడు జనకునకుఁ గుమారుఁ డిట్లనియె:—

క. చదివించిరి ననుగురువులు
చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవిగలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ.

సీ. కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకునిఁజూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికిమ్రొక్కు శిరముశిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁదవిలిన మనముమనము

భగవంతునివలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీఁది బుద్ధిబుద్ధి
తే. దేవదేవునిఁ జింతించు దినముదినము
చక్రిహస్తునిఁ బ్రకటించు చదువుచదువు
కుంభినీధవుఁజెప్పెడి గురుఁడుగురుఁడు
తండ్రి హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి.

సఖ్యమును, దాస్యమును, శ్రవణమును, వందనమును, నర్చనమును, సేవయు, జ్ఞానమును, కీర్తనమును, చింతనము నను నీతొమ్మిదిమార్గములచేత మనోవాక్కాయకర్మముల సిద్ధిగలిగి సజ్జనుఁడై హరి కైంకర్యము జేయుట ముక్తిమార్గప్రదమగును.

సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంఫితచర్మభస్త్రిగాక
వైకుంఠుఁబొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబుహస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుఁజూఁడని కన్నులుకన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక
ఆ. చక్రిచింతలేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువుగాక.

తండ్రీ! హరికైంకర్యమను వాయువుచేతగాక సంసారమేఘపటలంబు విచ్చిపోవునే? హరిసేవావృష్టిచేతఁగాక తాపత్రయంబను కారుచిచ్చు చల్లారునే? హరిచింతయను బడబానలముచేతఁగాక వపదో

షములనేడు సముద్రము లింకునా? హరిస్తుతియను సూర్యకాంతుల చేతఁగాక ఘోరవిపత్తులను కాఱుచీఁకటు లడఁగునే?" అని కర్ణకఠోరములైన యుపన్యాసములు నారాయణపరముగా ప్రహ్లాదుండు నుడివిన వానిపలుకులు చెవులకు ములుకులయట్లునాట హిరణ్యకశిపుఁడు కోపఘూర్ణితనయనుఁడై మొగము జేవురింప శుక్రనందనులం జూచి యిట్లనియె:—"బ్రాహ్మణులారా, మీరు పయోముఖవిష కుంభంబుల ట్లున్నారు. నీతులుచెప్పుదుమని బుద్ధిమంతునిఁ జేయుదుమని యజ్ఞానియగు నాకొడుకుం దీసికొనిపోయి విరోధిశాస్త్రములం జెప్పి వానిం భ్రష్టుని చేసిరి. మాకు వంశగురుండగు శుక్రాచార్య నందను లగుటం జేసి మీరు మాయెడ ద్రోహంబు గావింపరని నమ్మి బాలుని మీకప్పగించి చెడిపోయితి. గోముఖవ్యాఘ్రంబుచందంబున మీరు మాకు హితులట్లు నటించి మహాపకారము సేయుచున్నారు. ఇందు బాలకుఁడు దండ్యుఁడుగాఁడు మీరే దండ్యులగుచున్నారు. ఈపాపఫలంబు మీ రనుభవింపకమానరు." అనిన చండామార్కులు గడగడవడంకుచు రక్కసులరేని యెట్టయెదుట నిలువంబడి యిట్టులనిరి. "మహారాజా! మాపై నిష్కారణముగా నలుకబూనుట పాడిగాదు. మాయొనర్చిన దోస మిందు వీసమైనలేదు. విరోధి కీర్తనములు మీకు మాయనకు మేము నేర్పలేదు. దానవకులాచారములను, దైత్యదానవోచితములైన ధర్మములను మీకిష్టములైన శాస్త్రములను బోధించితిమిగాని విరోధిశాస్త్రములు మేము చెప్పలేదు. అది పూర్వజన్మసంస్కారమో, మఱియేమో మేమెఱుఁగముగాని, మీ కుమారునకు సహజముగానే యీబుద్ధులు పుట్టుచున్నవి. మేముగాని యితరులుగాని యివి యెన్నఁడు నితనికిఁ జెప్పలేదు. మీపాదములాన. ఇట్లు మేమొనర్చితిమేని పంచమహాపాతకంబులు చేసినవారి దుర్గతులకుం బోవుదుము విశేషించి మేము శుక్రనందనులము. భార్గ

వులము. మీకాశ్రితులము. మీహితాభిలాషులము. శతృవులము గాము. మీయనుగ్రహపాత్రులము. కావున మమ్ముఁ గృపాదృష్టిఁ జూడఁదగును" అని విన్నవింప గురువులపై నలుకమాని దానవేంద్రుఁడు తనూభవుంజూచి "వత్సా! ఈదుర్బుద్ధులు నీకాచార్యు లుపదేశింపలేదట. అట్లయిన నీకెవ్వరునేర్పిరి? ఎవ్వరు నీకీ యనుచితధర్మముల నుపదేశించిరో వారి నామధేయంబుల నాకెఱింగింపుము. తత్క్షణమే వారిని దగు శిక్షలపాలుచేసెద" నని తీవ్రముగాఁ బలుక జనకునకుఁ బ్రహ్లాదుఁడిట్లనియె. "అజ్ఞానమహాంధకారమునఁబడి సంసారపాశబద్ధులై భోగపరాయణులై మరణించుచు మరల జన్మించుచున్న మూర్ఖులకు నారాయణసేవాభాగ్యము పరు లుపదేశించినను రాదు. వనములకరిగి తపంబుచేసినను రాదు. తన్నుకచచ్చినను రాదు. ఒకరు చెప్పిరని నీవు తలపోయ వలదు. అక్రమముగా నితరుని హింసింపవలదు. ఇది యాచార్యదోషము గాదు, మఱి యెవ్వరితప్పునుం గాదు. నాపుణ్యవశమున నిర్హేతుకజాయమానకరుణాఖండగు నారాయణుని యనుగ్రహమువలన నాకే యీబుద్ధి పుట్టినది. గ్రుడ్డివాని చేయిబట్టుకొని గ్రుడ్డివాఁడు నడచి దారితెన్ను తెలియక సిలుగులం బడుకరణి నిష్ఫలములైన కర్మములం జేసి కర్మపాశబద్ధులై ముక్తి గానక చెడిపోవుదురు. అట్లుగాక విష్ణుభక్తుల పాదరజోలేశము లెవ్వరిమీఁద సోఁకునో యట్టివారు హరికైంకర్యముచేసి సత్పథంబుననడచి సంసారబంధవిముక్తులగుదురు. సకలశాస్త్రములు గురువులు నేర్పఁగాఁ జదివి శోధించితిని. ఏలతర్కములు? ఏల వేదాంతములు? ఏల మీమాంసలు? ఇవియన్నియుఁజదువుట వ్యర్థము. శాస్త్రములలోనెల్ల శాస్త్రము విష్ణుసేవాశాస్త్రము. తర్కములలోనెల్ల తర్కము విష్ణుపాదవితర్కము. వేదాంతములలోనెల్ల వేదాంతము బ్రహ్మవేదాంతము. దీనికన్న ముక్తికి మఱియొుండుదారిలేదు. హరి పతితపావనవ్రత

ము గలవాఁడు. ఎట్టి పండితులైన పశ్చాత్తప్తులై హరిని నమ్మిన వారలఁ దప్పక రక్షించు. దారపుత్త్రబంధువు లనియెడు మీనముల తోడను మొసళ్ళతోడను నిండిన సంసారమను మహాసముద్రమును దాఁటుటకు నారాయణపాదము లనియెడు రెండు తెప్పలు గలవు. వానిని విడిచిపెట్టినవాఁడు మునిఁగి నశించు. చేపట్టినవాఁడు పారముఁ జేరి సుఖించును."

ఆవాగ్జాలంబులు శూలంబులకరణి దానవేశ్వరుని శ్రవణంబుల నాఁటెను. నారాయణునిపేరు వినఁగానే యతని శరీర మాపాద మస్తకము మండిన ట్లతనికి మహాకోపము వచ్చెను. మనస్సు క్రోధాగ్నిపూరిత మయ్యెను. వెంటనే యతఁడు కుమారుని తొడమీఁదినుండి క్రిందికిఁ ద్రోసివైచి పండ్లుగొఱుకుచుఁ గన్నులు చంద్రనిప్పులట్లు మెఱయఁ గంఠమెత్తి సభాసదులకు భయంకరముగా సచివులం జూచి యిట్లనియె:—"అమాత్యులారా! వింటిరా వీని దుర్భాషలు. నారాయణుఁడు పందియై పినతండ్రిని హిరణ్యాక్షుని గడతేర్చెనను క్రోధ మించుకయు లేక —క్రోధ మటుండనిండు—సిగ్గయిన లేక, దానవకులాంతకుఁడును, నాకుటుంబమునకు మహాపరాధియు నైన యాదురాత్ముని బట్టునలెఁ బొగడుచున్నాఁడు. వానిం దలంచినఁగాని ముక్తియుండదఁట! వాఁడే రక్షకుఁడఁట. వానిపాదములే సంసారసముద్రతరణమునకు తెప్పలట. ఇటువంటి కులద్రోహి, యిటువంటి పితృద్రోహి, నెందైన మున్ను మీరు గనియుంటిరే? జగత్త్రయంబు నవలీల జయించి మహేంద్రాది దిక్పాలకుల రణంబున నోడించి భువనైకచక్రవర్తినైన నన్నుఁజూచియైన శంకింపక, కులాచారమునైన గణింపక విరోధిపక్షముఁ జేరిన యీ పాపాత్ముఁడు నాకొడు కగునే? అయిదేండ్ల డింభకుఁడు. వీని తెగనీల్గుచూడ నత్యధికమై యున్నది. వీని మద మణంచెదఁగాక. వీనికి మరణకాల మాసన్నమగుటచేతనే

యిట్టి దుర్బుద్ధులు పుట్టినవి” యని పరిక్కనున్న రాక్షసకింకరులం గనుంగొని, “ఓరీ! కింకరులారా, శరీరమందు వ్రణముపుట్టినచందమున వీఁడు నాకడుపున నుద్భవించినాఁడు. శస్త్రవైద్యుఁడు దేహంబునందు జాడ్యముచేతఁ జెడి కుళ్ళినయంగమును ఛేదించి తక్కిన యంగంబులం గాపాడునట్లు కులమునకు నాకు నపరిత్యష్టయుఁ దలవంపులు ఘటియించుచున్న యీదురాత్ముని దానవకులపాంసనుని— విరోధిపక్షపాతుని—జనకద్రోహిని—జంపిరండు. నాకొడుకని మీరు సందేహింపవలదు. రాజనందనుఁడని భయపడవలదు. నేను ముమ్మాటికి మీకు ముదల యిచ్చుచున్నవాఁడ. మునుముందు నయమున భయమునఁ జెప్పిచూడుఁడు. పట్టినపట్టువీడక యున్న వీనిని శస్త్రములచే నొప్పించి చంపుఁడు” అని యానతిచ్చి పుత్రస్నేహబంధముం దెగఁగోసికొని యక్కటికములేని యక్కటికిరక్కసులకు సాధుశీలుఁడును సుగుణాలవాలుఁడునునగు బాలు నప్పగించెను. భయంకరములైన కోఱలు, మంటలవలె నెఱ్ఱనైన వెండ్రుకలు, వికృతాకారములు గల యాపాలసుడిండులు బాలునింబట్టుకొని కఱ్ఱలతో మోఁదియు, శూలంబులం బొడిచియు, ముష్టిప్రహారములచేత నొప్పించియు నానావిధముల బాధింపఁదొడఁగిరి. ఆహా! రాజాజ్ఞయగుటచేతఁగదా బాలుఁడు మహారాజనందనుఁడని శంకింపక, యాగర్భశ్రీమంతుఁడైన సుకుమారుండని సందియంపడక, లేఁతప్రాయమువాఁడని జాలినొందక, సద్గుణసంపన్నుఁడని చింతింపక, మున్ను తాము మిక్కిలిగౌరవించి లాలించిన యాతనినే యతిహింసలపాలు చేయఁదొడఁగిరి. దానవేంద్రుఁడు సౌధముమీఁదనుండి యవియెల్లం జూచుచుండియు వలదని వారింపఁడయ్యె. ద్వేషము యుక్తాయుక్తజ్ఞానమును జంపివేయునుగదా!

అట్లు దానవులు పలుతెఱంగుల నొప్పించుచుండ బాలకుని దేహముకందదు, నలుగదు. ముఖకాంతి చెడదు. ఎముకలునలుగవు.

కన్నులనుండి బాష్పములు రావు. అబ్బాయయ్యో యని యనువఁడు మొఱపెట్టఁడు. భయమించుకయుఁ బొందఁడు. ఉక్కుతునుకవలెవారి యెట్టయెదుట నిలుచునుగాని చేతు లడ్డముపెట్టఁడు. వారిని బ్రతిమ లాడఁడు. మాటిమాటికి 'ఓక్షీరసాగరశయనా! ఓసచ్చిదానందస్వ రూప! ఓనానాంతర్యామి, ఓసర్వజగత్క్షేమంకర, యోకల్యాణగుణ రత్నాకర, యోకారుణ్యపయోనిధి, యోభక్తవత్సల,' యని హరిం దలంచి మ్రొక్కులిడునుగాని, తనజోలికి రావలదని రక్కసులకు మ్రొక్కఁడు. అటునిటు పరుగెత్తఁడు. తల్లిచాటున దాగొనబోడు. చుట్టములం బిలువఁడు. బాధించుచున్న రాక్షసులనుగాని, జనకుని గాని,యించుకేనియు నిందింపఁడు. అట్లు తన్ను చేయుచున్న దండనము లన్నియు నిరర్థకంబులగుటఁ జూచి హిరణ్యకశిపుఁడు స్వగతముగా నిట్లు వితర్కించెను. "నిశాచరులు శూలములం బొడిచినను మఱి యితరసాధనములచేత నొప్పించినను నైదేండ్లచిన్నవాఁడువీఁడు— మొఱ్ఱోయనఁడు—కుయ్యిడఁడు. తప్పుగావుమని నాపాలికి రాఁడు. తల్లిచాటునకుం బోవఁడు. శరణమ్మనఁడు. విశేషించి వీనికిం జీమకుట్టిన యట్లైన లేదు. ఏమి యీయక్కజము? వీనిది దేహముగాక లోహ మా? ఇట్టి హింసలకు మారినుసైతము చచ్చునే. మేము వానినెట్లు సహించెనో తెలియరాకున్నది. అయినను వీనినింకను హింసించి నూ చెవలెనని నిశ్చయించి—

సీ. ఒకవేళ నభిచారహోమంబు సేయించు
నొకవేళ నెండలనుండఁబంచు
నొకవేళ వానల నుపహతినొందించు
నొకవేళరంధ్రింబు లుక్కఁబట్టు
నొకవేళఁదనమాయ నొదవించిబెగడించు
నొకవేళ మంచున నొంటినిలుపు

నొకవేళఁ బెనుగాలి కున్ముఖుఁగావించు
నొకవేళఁబాతించు నుర్వియందు
తే. నీరునన్నంబు నిడనీక నిగ్రహించుఁ
గళలనడిపించు ఉవ్వించు గండశిలల
గదలవ్రేయించు నేయించు ఘనశరములఁ
గొడుకు నొకవేళ సమరారి క్రోధియగుచు.
సీ. ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి
కెరలి డింభకునిఁ ద్రొక్కింపఁబంపు
నొకమాటు విషభీకరోరగశ్రేణులఁ
గఱువడి నర్భకుఁ గఱవఁబంపు
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన
విసరి కుమారుని వ్రేయఁబంపు
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో
మొత్తించిశాబకు ముంపఁబంపు
ఆ. విషముఁబెట్టఁబంపు విదళింపఁగాఁబంపు
దొడ్డకొండచఱులఁ ద్రోయఁబంపుఁ
బట్టికట్టఁబంపు బాధింపఁగాఁ బంపు
బాలుఁగినిసి దనుజపాలుఁ డలుక.

అట్లు పాప మెట్టిదోయెఱుఁగని పసిపాపనిఁ జంపుట కెన్ని యుపాయములున్నవో యన్ని యుపాయములం బ్రయోగించి యవి యన్నియు వానియెడ వ్యర్థము లగుటచే నమిత చింతాక్రాంతుఁడై యసురనాయకుఁడు తనమనంబున నిట్లని వితర్కించెను. "ఏమి యీ యాశ్చర్యము! గదలతో మొత్తితిని. శూలములతోఁ బొడిపించితి. సముద్రములలో ముంచితిని. ఏనుఁగులచేఁ ద్రొక్కించితిని. కొండల మీఁదనుండి క్రిందఁ బడద్రొబ్బించితిని. విషము పెట్టించితిని.

పాములచేతఁ గఱపించితిని. నిప్పులలోఁ బడఁద్రోయించితిని. కాని వీఁడు చావఁడు. విషాదులనుండి బ్రతికించునట్టి యౌషధములు వీని కడలేవు. వీనిని బ్రతికించుటకు నాథులెవ్వరును లేరు. వీనిమే నించుక యు నొవ్వదు. లేశమైనభయము లేదు. శరీరసౌష్టవము,ముఖలావణ్యము మనోధైర్యము నెప్పటియట్లు నున్నవి. దైన్యమొక్కింతయుఁ బొందఁ డు. వీని పరిభావము మిక్కిలి యక్కజము గొల్పుచున్నది. ఇదివజ్ర శరీరమాయని సందియము దోఁచుచున్నది. ఇట్లు చెక్కుచెదరకయుం డుటకుఁ గతంబేమి? అదియునుఁగాక నేనెన్ని మహాపకారములు వీనికిఁ జేయుచున్నను నాపై నించుకేనియు నలుకబూనఁడు. నాపై నెంతో భక్తిగలవాఁడై యున్నవాఁడు. ఇట్టి చిన్నిపాపని కిట్టిధైర్య ము వైరాగ్యము నెట్లుకలిగినవో కదా! వీని పరిభావము వర్ణనాతీతమై యున్నయది. వీనిపైఁ బగబూనుటంజేసి నాకుఁ దప్పక మృత్యువు సంభవింపఁగలదు." అని విచారించుచుఁ దనమనోవ్యథ శుక్రి నందనుల కెఱింగించిన వారతని కిట్లనిరి. "దానవేంద్రా! నీవింత విషాదమొందనేల? నీపరితాపము జగత్త్రయప్రసిద్ధమైనది. నీవు బిట్టలుకచేఁ గనుబొమ్మలు ముడిచినంతటనే పాకశాస నాదిదిక్పాలకులు భ్రాంతులై విచ్చుమొగ్గయిరి. అట్టినీవు పసిపాప నొక్కనిగుఱించి యింతవంత నొందనేల? వక్రి మార్గంబునందిరుగునట్టి బాలుఁడు సజ్జనసేవచేత మంచిదారికివచ్చు. అదియునుఁగాక వయస్సుముదిరినపిదప లోకజ్ఞానముగలిగి వ్యవహార విదుఁడై రాజ్యపాలనాసక్తిగలిగి మాధవుని గీధవునిఁదలపెట్టఁడు. అ ప్పుడు మనము వీనికి నారాయణద్వేషంబు గలిగింపవచ్చును. ఇంత కును మాశుక్రాచార్యులవారిని రావించి తగినయుపాయ మాలో చింపవచ్చును." అని చండామర్కు లుపదేశించుటయు దైత్యనాయ కుఁడువల్లెయని గృహస్థుల కుచితములైన ధర్మార్థకామములగుఱించి

యుపన్యసించి వీనిమనంబు చక్కఁజేయుండని నెండియు డింభకుని గురువులకప్పగించె. వారును వానింగొనిపోయి త్రివర్గపాఠములుచెప్పిరి. అవి యొల్లక ప్రహ్లాదుఁడు కర్మబద్ధులగు గృహస్థులకుఁగాని తనకవి యక్కఱలేదనియు సర్వధర్మంబులం బరిత్యజించి నారాయణునే శరణుజొచ్చినవారికి వ్యవహారములతోఁ బనిలేదనియు గురూపదిష్టము లైన లౌకికకర్మములను ఖండించి, వారుకర్మానుష్ఠానములకొఱకు గృహంబులకుఁబోయినప్పుడు రాక్షసబాలకులు తన్నాడుకొనుటకుఁ బిలిచి నప్పుడు వారితోనిట్లుచెప్పెను. "మిత్రులారా! గురువులు మనకొక నాఁడైన సరిగాఁ జదువుచెప్పుటలేదు. చెప్పినదానిలో మంచిదొక టియులేదు. ఇహపరసాధనంబైన మంచిమాటయొకటి నేఁజెప్పెద నది యాలకింపుఁడు. మనయీడుపిల్లలు పెద్దలు ప్రతిదినము మృతినొందుట మీరుచూచుచున్నారుగ. దానింబట్టి శరీరములు నిత్యములు గావనియు, ఎన్నఁడో తెలియకుండమనకు మరణముతప్పకుండ సిద్ధించుననియు మనము తెలిసికొనవలయును. ఈసంసారచక్రమునందుఁ దిరుగుచు మనముపుట్టుచుఁ జచ్చుచు హేయములైన జన్మము లనేకము లెత్తుచుందుము. పునర్జన్మములేకుండునట్లు చేయునదియు శాశ్వతానందము గూర్చునట్టిదియు బంధములనుండి విముక్తి చేయునట్టిదియు నగు నిరపాయమైనయుపాయమును మనము వెదకికొనవలయు. మనదారి మనముచూచుకొనకపోయినపక్షమున మన మధోగతిపాలగుదుము. సకలజన్మములలోను మానవజన్మ ముత్తమము. తక్కినజంతువులకు జ్ఞానసంపదయుండదు. మానవుఁడు జ్ఞానవంతుఁడైన కతమున యుక్తాయుక్తవిచక్షణజ్ఞానముగల్గి తనయిహపరంబులంగూర్చి వితర్కించుకొనుటకు సామర్థ్యముగలిగియుండును. అట్టి మానవజన్మమున మగవాఁడై బుట్టుట యదృష్టఫలము. అట్టిభాగ్యముమనకుఁ గలిగినందుకు మనము పశువులట్లు పక్షులట్లు, క్రిములట్లు కీటకములట్లు సంచ

రించి చెడుటయుక్తముకాదు. మానవునిజీవితము నూఱేండ్లు వ్యవధి గలిగియుండును. అందఱు శతసంవత్సరములు జీవింపరు. జీవింతురను కొందము ఆనూఱేండ్లలో నేఁబదియేండ్లు రాత్రికాలమగుటచే నిద్ర క్రిందవినియోగింపఁబడును. మిగిలినయేఁబదియేండ్లలో నిరువదిసంవత్స రములు బాల్యకాలముగా నాటపాటలక్రిందఁగడచిపోవును. కడపటి నిరువదియేండ్లు వార్ధకముచే నంగవైకల్యము గలిగి మతిచెడి మాన వుఁడు భగవధ్ధ్యానాదుల చేయఁజాలఁడు. ఇంక మనకు నాయువున మిగిలినకాలము పదియేండ్లుమాత్రమే. ఈయల్పకాలముననే మనము విద్యాభ్యాసముచేయవలెను. ఈస్వల్పకాములోనే సత్ప్రవర్తనము గల్గియుండవలెను. ఈయల్పకాలముననే మనము మెలకువ గలిగి భగ వదారాధము చేసికొనవలెను. ఈకాలమును వ్యర్థముచేసితిమేని యది కూడిరాదు. పోయిననిముసము పోవుటయేగాని మరలఁజిక్కదు. ప్రతి నిముసము బంగారముకన్న మణులకన్న నుత్తమోత్తమపదార్థముల కన్న సకలైశ్వర్యములకన్న సామ్రాజ్యములకన్న మిక్కిలి ప్రశస్త మైనది. అదిభగవదారాధనముక్రింద నుపయోగింపక భోగములక్రింద దుష్కార్యములక్రింద వినియోగించినవాఁడిహపరంబులకుఁ జెడును. వానికుత్తమగతులులేవు. నరకమే వానికిసంప్రాప్తమగును. యౌవన ము నీటిబుగ్గవంటిది. జీవనము మెఱుపుతీఁగవంటిది. ఐశ్వర్యములు కొండకాలువలవలె నతివేగంబున నంతరించును. అవినమ్మికొని యుం డరాదు. రాజానుగ్రహమున్నదని గర్వింపఁగూడదు. భగవంతుఁడు రాజులకురాజు. చక్రవర్తులకు చక్రవర్తి అతనియనుగ్రహమే కావలయు నుగాని తక్కినవారి యనుగ్రహముపనికిరాదు. భగవంతుఁడగు నా రాయణుఁడే రక్షకుఁడు అతఁడే శిక్షకుఁడు. అతఁడేతండ్రి తల్లి. అత డేభ్రాత. అతఁడేచుట్టము. అతఁడేరాజు. సర్వమతఁడే సర్వమతనికి సమర్పణముచేసితిమేని మనము చరితార్థులమగుదుము. కాఁబట్టి చం

డామర్కులబోధనలుమీరు విశ్వసింపక పద్మనాభుని పాదపంకజ శరణంబు వేఁడుఁడు. అతఁడు భక్తవత్సలుఁడు పతితపావనుఁడు. ఆర్తత్రాణపరాయణుఁడు ఐహికాముష్మికసుఖప్రదాత. బ్రహ్మాండనిర్మాత నిగ్రహానుగ్రహసమర్థుఁడు. అఘటనఘటనాసమర్థుఁడు. అగతికులకు గతి. నాకుగతిమీకుగతి. కావున పాహిమాంపాహిమామమ్మని ప్రార్థింపుఁడు. ఆతఁడు పృథివియందు నాకాశమునందు నిప్పునందు నీరునందు గాలియందు నిండియున్నాఁడు. అంతియేగాక సముద్రములందు శైలములందు వృక్షములందు సకలజంతువులయందు మీయందు నాయందు నున్నవాఁడు. అతఁడు పరమాత్ముఁడు. మనము జీవాత్మలము. కించిజ్ఞులము. అధములము అతనిని సేవించితిమేని శాశ్వతసుఖంబులం బడయుదుము. ఒకవేళ మీరు హరిభక్తులైనను దానవనాయకుఁడు శిక్షించునని మీరు భయపడవలదు. బాధలు శరీరమునకేగాని యాత్మకు లేవు. మనశరీరమునే యతఁడు దండించి ఖండించి హింసింపఁగలఁడు కాని యాత్మజోలికిఁ బోజాలఁడు. దేహమునకు నాశమున్నది. ఆత్మకు లేదు. అదియే పరమాత్మసన్నిధికరుగునది. ఆత్మ దేహమునువిడిచి భగవత్సాన్నిధ్యమునకో నరకమునకో వానివాని పుణ్యపాపములంబట్టిపోవును. శరీరమును బంధువులు కాల్చివైతురు లేకమంటిలోఁ బూడ్చివైతురు. అట్లుకానియెడల కాకులు నక్కలు గ్రద్దలు పీకితినును. అదియెన్నటికైన మంటిపాలగును. ఆత్మనిత్యము. దానినాయుధములు నఱుకలేవు. అగ్ని కాల్పలేదు. నీరుతడుపలేదు. గాలి శోషింపజేయలేదు. అట్టినిత్యమైన యాత్మయొక్కసుఖమునుగోరక యనిత్యమైన దేహముమీఁద నభిమానముగలిగి వర్తించుట యవివేకము. చావెన్నటికైన నున్నదే. జ్వరాదిరోగములచేత బాధలుపడిపడి చచ్చుటకంటె నారాయణనామస్మరణంబు జేసినందుకు దానవేంద్రునిచేత దండింపఁబడిహరిస్మరణం

బు చేయుచు మృతినొందుటమేలు. మనబంధువులు కాలిబంధముల వంటివారు. తల్లి లేదు. తండ్రిలేఁడు చుట్టము లేదు. సహోదరులు లేరు. వీరందఱు మరణకాలమున మనతో వచ్చువారు కారు. మనహరిభక్తియే మనలవెంబడించునది. అదియేమనలంగాచునది. అదియేమనల సద్గతికి జేయిబట్టుకొని తీసికొనిపోవునది. దానికంటెమిత్రము లేదు. దానికన్న చుట్టము లేదు. ఆహాహా! హరినామస్మరణ మెంత తీయఁగానుండును. అదికలకండముకన్న ఖర్జూరముకన్న కదళీఫలముకన్న పంచదార కన్న పనసతొనలకన్న పానకముకన్న నిక్షుకన్న ద్రాక్షకన్న తీపి. దానిమాధుర్యమువంటిమాధుర్యము దేనికిని లేదు. మధురపదార్థములు నాలుకకే తీపిపుట్టించును. హరిభక్తిరసము నాలుకకేగాక మనస్సు నకు గూడ తీపిపుట్టించును. మిత్రులారా! నేనిది పరమభాగవతోత్త ముఁడైన నారదమహామునివలన మున్నొకసారి విన్నవాఁడ. మీరును నావలనవినియుంటిరి కావున దాని నాచరించి ధన్యులుగండు." అన వుడు దైత్యబాలకులు రాజకుమారు నుద్దేశించియిట్లనిరి. "అయ్యా! పోతుటీఁగకైన జొరరాని రాచనగరునందు నీయునికి సూర్యచంద్రు లనైనఁ దనయాన లేక లోనబ్రవేశింపనీనిచండశాసనుఁడు మీతండ్రి. నీవు నిరంతరము చంద్రశాలలో బెరిగినవాడవుగాని కోటదాటిబైటికి వచ్చి యొరులతో మాటలాడినవాఁడవుగావు. మేమెఱిఁగినతరువాత నారదమహాముని యెన్నడిక్కడికి రాలేదు. నీకునారదుఁ డుపదేశించుట యెట్లుగలిగె? అదిమాకు ముందెఱిఁగింపుము" అనవుడు ప్రహ్లాదుఁడు చిఱునవ్వునవ్వి నారదోపదేశప్రకారంబున వారికి వినిపించెను.

మనతండ్రి నారాయణుని జయించుటకై తపంబుచేసి వరం బులను బడయ మందరాచలమునకరిగి యుగ్రతపము సేయుచుండెను అతఁడు దేశములో లేఁడనివిని, పూర్వ మతనిచేత నెన్నిసారులో యుద్ధముననోడింపఁబడిన మహేంద్రుఁడు దేవసైన్యములగూర్చుకొని

భేరీభాంకరణములతో మనవీటిపై దండువెడలి మిడతలదండులుచేసులం బొదివినట్లు పురముచుట్టుఁజేరి ముట్టడించి కోలాహలము సేయఁగా రాజులేమి దైత్యదానవులుబెగ్గిలి పట్టణమువిడిచి వాఁజిపోయిరి. అమరులు నిర్జనమైన పట్టణమును దోచుకొని యిచ్ఛవచ్చిన తెఱంగున విహరించిరి. అమరేశ్వరుఁడు రాజునకునియంతఃపురముసొచ్చి నిండు చూలాలైనమాతల్లిం జెఱపట్టి తనవెంట నాకమునకుఁ గొనిపోవుచుండెను. మగపిట్టనుబాసిన లకుముకిపెంటియట్లు మాతల్లి యార్తయై విలపించి తన్నువిడువుమని యెంతవేఁడుకొన్నను నతఁడు విడువఁడయ్యె. అప్పుడామెయదృష్టవశమున సామవాక్యవిశారదుఁడగు నారదుఁడు వారికగపడి మహేంద్రునితోనిట్లనియె. "నిర్జరేశ్వరా! నీవు దేవలోకమున కధిపతివి. సిద్ధసాధ్యవిద్యాధరాదులందఱు నీసేవకులు. బ్రహ్మ విష్ణుమహేశ్వరుల తరువాతవేల్పులలో నీవెపెద్దవు. బలపరాక్రమంబున పాకాదిరాక్షసులం దెగటార్చినవాఁడవు. కొండలఱెక్కలు ముక్కలుచేసిన మేటివి. అట్టిపౌరుషశాలివి. దానవనాయకుఁడు పురమున లేనప్పుడంతఃపురముసొచ్చి యెండకన్నెఱుఁగని యంతఃపురాంగనను, మహాపతివ్రతను దానవేశ్వరుపట్టమహిషిని పూర్ణగర్భవతిని జెఱపట్ట నీతియే? నీతిమాట యటుండనిమ్ము. మున్ను దానవేంద్రునిచే నెన్నిసారులో యోడిపోయి దెబ్బలుతిని పాఱినవాఁడవునీవు తలుపు దీసినయింటఁగుక్కజొఱఁబడినట్లు వానియిల్లుసొచ్చి యాలింజెఱపట్టుట విక్రమమా? ఇది దేవదానవమానవు లెవ్వరువిన్నను నిన్నునగరా? ఈదుష్కార్యముచేసినందుకు నీవుసిగ్గుపడి తలవంచుకొనవలయు."నని బిట్టలిగి చీవాట్లుపెట్టుచున్న దివ్యమునితో వేల్పులదొర యిట్లు విన్నవించెను. "మహాత్మా! ఈమెయెడ నాకుఁ జెడ్డతలంపులేమియులేవు. ఈమెగర్భమున హిరణ్యకశిపునికన్న దుండగుఁడు చండశాసనుఁడు జనియింపలఁగఁడు. కావున నే నీమెంగొనిపోయి ప్రసవించువఱకు నా

యంతఃపురమునుండి కొడుకుఁబొడమిన వెనుక వానిని వజ్రాయుధ
ముచేఁ ద్రుంచి లోకము నిష్కంటకము జేసి యీపతివ్రతను మరల
భర్తకడకుం బంపుదును. ఈమెం జెఱఁగొనుట లోకసంగ్రహణార్థమైగాని
హిరణ్యకశిపునిపై నాకుఁగల ప్రాఁతపగదీర్చికొనుటకుఁగాదు." అని
పలికిన దేవనాయకునకు మునినాయకుండిట్లనియె.

"అయ్యా! యీమెగర్భమున నిశాటుఁడు లేఁడు. అనేకపూర్వజన్మా
ర్జితపుణ్యవిశేషమున హరిభక్తికి నెలవైన సజ్జనుఁ డీమెకుఁ బుత్రుంబుట్ట
గలఁడు. అతనికి వైరులుండరు. అతఁడు నీచేతఁజావఁడు. నారాయణుని
యనుగ్రహంబున నతఁడు వర్ధిల్లు. అతఁడు నిర్జరులకు మిత్రుఁడగును
గాని శత్రుఁడు గాఁడు. కావున నీదానవరాజపట్టమహిషిని విడువుము."
అనియానతిచ్చిన మునిమాటకు మాఱుపలుకలేక సునాసీరుఁడు సురా
రాతిరాణివాసమును విడిచిపెట్టెను. నారదుఁ డామెను బుత్రికగా
భావించి దుఃఖోపశమనవాక్యములు బలికి తనయాశ్రమమునకుం గొని
పోయి "అమ్మా! విబుధేంద్రుఁడు చేసినయవజ్ఞను దలఁచి నగవకుము.
మందరాచలమునుండి నీభర్త చెక్కుచెదరక వరములుబడసి వచ్చి
నిన్నుం గొనిపోవు. నీగర్భమున నుత్తమచరిత్రుఁడు పరమభాగవతో
త్తముఁడున్నవాఁడు. నీమగఁడువచ్చువఱకు నాయాశ్రమంబున నుండు
ము. నీవిదిపుట్టినయిల్లుగా భావించుకొనుము. నేను నీకన్యుఁడనుగాను.
జనకతుల్యుఁడను. నాయింటనుండుట తప్పుగాదు. నీమగఁడు నీపై
గోపింపఁడు." అనిపలికి యామెనొడంబఱచి తనయాశ్రమంబున నిలి
పెను. నాతల్లియు నతఁడే జనకుఁడనినమ్మి తనశీలంబు గాపాడుకొనుచు
మునికి శుశ్రూషలుచేయుచు, జగత్త్రయనాథుఁడగు నాథునిరాకలు
గోరుచుఁ గాలక్షేపంబు సేయుచుండెను. అప్పుడు నారదుఁ డామెకు
హరిభక్తియు నిర్మలజ్ఞానము నుపదేశించెను. గర్భస్థుఁడనైన నేను
కర్ణామృతముగానున్న యాతనియుపదేశంబుల నాలకించి జ్ఞప్తియుం

దుంచుకొంటిని. కావున నదినా ఋగ్గుపాలతోఁ బెట్టినవిద్యయమ్యె. మాతండ్రియు మందరపర్వతమునుండివచ్చి నారదాశ్రమముననున్న మాతల్లిం దోడ్కొని పురంబునకువచ్చెను. ఇదియు నాకు హరిభక్తి యలవడినప్రకారంబు. మఱియువినుండు. కర్మాసక్తుఁడగువాఁడు యాగాదికర్మంబులు చేసిచేసి స్వర్గసుఖ మనుభవించు, ఆపుణ్యంబు పరిక్షయంబైనతోడనే నరలలోకంబునఁబుట్టుచుండు. కర్మంబులకుహరి వశుఁడుగాఁడు.

క. చిక్కఁడు వ్రితములఁ గ్రితువులఁ
జిక్కఁడు దానముల శౌచశీలతపములం
జిక్కఁడు యుక్తిని భక్తిని
జిక్కినక్రియనచ్యుతుండు సిద్ధముసుండీ.

క. చాలదు భూదేవత్వము,
సాలదు దేవత్వ మధికశాంతత్వంబుల్
జాలదు హరిమెప్పింప వి,
శాలోద్యములార భక్తిసాలినభంగిన్.

ఈజాతివా రాజాతివారనక హరినామచింతనముచేసిన సమస్త జనులు మోక్షపదంబుగాంతురు. మనగురువులు మనకు నిరర్థకములైన శాస్త్రముల బోధించుచున్నారు గాని సార్థకమై పునర్జన్మరహితమై మోక్షప్రదమైన దైవభక్తియందు మనబుద్ధిని బ్రివేశపెట్టుట లేదు. ఈచదువులన్నియు బూడిదఁబోసినపన్నీరు. కావున

క. ఆడుదము మనముహరి రతిఁ
బాడుదమేప్రొద్దు విష్ణుభద్రియశంబుల్
వీడుదము దనుజసంగతిఁ
గూడుదము ముకుందభక్తకోటిఁ సూటిన్.

ఇంక మనకు బుస్తకములతోఁ బని లేదు మీపుస్తకములెల్ల నిటు దెండు. అవియెల్ల మనమాచార్యుల కప్పగింతము. నాతో నేకాంతస్థలమునకురండు. ఇంకను మీకు భక్తిరహస్యముల నెఱిఁగించెద. నా మాట నిష్టములేనివారు కర్మలపాలై చెడిపోవుదురు. పొండు. మీరు నాతో వత్తురేని కామక్రోధాది వైరుల జయింతము. మనచిత్తము హరి కిత్తము. పాపపటలము ఛేదింతము. మోక్షపథము చూరగొందము"

ఈ తెఱంగున రాక్షసబాలకులకు దైత్యరాజనందనుఁడు గురువులమీఁద ననిష్టము గలిగించి వారిని హరిభక్తిపరాయణులం జేయ శుక్రనందనులు వచ్చునప్పటికి వారందఱు వెనుకటి పాఠములు విడిచిపెట్టి "నారాయణ నారాయణ" యనుచు జప్పటలు గొట్టి భజనలుచేయుచు నిటునటు చిందులు ద్రొక్కుచుఁ బరవశులై యాడుచుండిరి. అదిచూచి యాచార్యులు వెఱగంది దానవేశ్వరునితో నిట్లు మొఱవెట్టుకొనిరి.

"దానవాగ్రణీ! తాఁ జెడ్డకోతి వనమెల్లఁ జెఱిచెననుమాట నిజమైనది. మేము గఱపిన చదువుల మీకొడుకు చదువకపోవుటయే గాక రాక్షసకుమారులనెల్లఁ జేరఁదీసి వారిమనస్సులు విఱిచి మతులుచెఱిచి విరుద్ధశాస్త్రములునేర్పి పాడుచేసినాఁడు. వారు మాచదువులు మాకప్పగించి మాపుస్తకములు మామొగముమీఁదఁ బాఱవైచి గోవిందపాదారవిందధ్యానపరాయణులై పాడుచు నాడుచు నున్నవారు. ఈ దుండగుఁ డెట్లు పుట్టెనోకాని వీనివలన నన్నియు నష్టములే కలుగుచున్నవి. ఈమహాపద నీవె నివారింపవలయు."

అని గురువులు విన్నవింప సురారాతి వారిమాటలు తనచెవులకుఁ గత్తిపోటులవలెనాట గాలితాకున నెగురు త్రాచుపాముపగిది పెద్ద గాలివలన మండు నిప్పుచందమున కఱ్ఱదెబ్బ దగిలిన సింగంబు

భంగి మహాకోపావిష్టుఁడై కన్నులు జ్యోతులవలె నెఱ్ఱవార, దంత సంఘట్టనంబున మిణుఁగురులు రాలఁ గుమారు నవలోకించి పిట్టపిడుగు లవంటి మాటలతో నిట్లనియె.—“నాయానతిఁ జేకొనిగాని సూర్యుఁ డాకాశమున వెలుఁగఁడు. వాయువు నా కన్నికాలములయందు ననుకూలుఁడై వీచును గాని ప్రచండముగ నొక్కనాఁడైన వీవవెఱచును. అగ్నిదేవుఁడు నాపరితాపము నుండఁబ మండ తేజుఁడై తనయిచ్చ వచ్చినట్లు మెలఁగ వెఱచును. యముఁడు చండశాసనుఁడనైన నా యాజ్ఞ శిరమునఁదాల్చి ప్రాణికోటులను దండింపవెఱచును. ఇంద్రుఁడు నానన్నిధిని దలయెత్తి చూడనెఱచును. యక్షరాక్షసకిన్నరకింపురుషాదులు నన్నుఁజూచి గడగడ నడఁకుదురు. అట్లుండ నోరితులువా! నీవేల వెఱువవురా? దిక్పాలకులు నాగీఁచిన గీటు దాటక నా యాజ్ఞ నౌదలదాల్చి నన్నుఁ జూచినమాత్రమున వారు మకుటమాణిక్యములు నాయడుగులకు నీరాజనము వెట్టునట్లు నమస్కరింతురు. నీ వెట్లు నాయాజ్ఞ మీరగల్గు చున్నాఁడవు? నీకెవఁడురా దిక్కు? నారాయణుఁడు గీరాయణుఁ డని తులువతనమున పలుమారు పలుకు చుందువు. వేల్పులను నేను పసులం దోలునట్లు దోలినప్పుడు స్వర్గపురంబుఁ గొల్లవెట్టినప్పుడు దిక్పాలుర ధిక్కరించినప్పుడు తనకు మిక్కిలి యిష్టమైన యావేల్పులను మీనారాయణుఁడు రక్షింపఁజాలకపోయె నేమి? వాఁ డప్పుడు చచ్చెనా? దేశాంతరములపాలై పోయెనా? ఏమైపోయెను? అది యట్లుండఁగా నీవు భ్రష్టుఁడ వైతివి. దానవ బాలకులం గూడ నేల స్వధర్మభ్రష్టులను జేసెదవు? ఇట్టి కులద్రోహిని నిన్ను వధించి నిర్మలమైన నావంశంబు నిర్దోషంబుగాఁ జేయుట కర్తవ్యంబు. ఇదేచూడు. నిన్ను వధించెద. నాకన్న బలాఢ్యుఁడు ముజ్జగంబుల లేఁడు. బలవంతులైన బలవైరిప్రముఖులకన్న నేన బలవంతుఁడ. జగములన్నియు నాబలము నాశ్రయించి బ్రతుకుచున్నవి.

నన్నుగాదని నీ వెవ్వరిబలమున బ్రతుకఁదలంచితివిరా మూర్ఖా!"
అనిన జనకునకుఁ దనయుఁడు వినయమున నిట్లనియె:—

క. బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వఁడు ప్రాణులకును
బలమవ్వం డట్టివిభుఁడు బల మసురేంద్రా!

క. దిక్కులు గాలముతో నే
దిక్కున లేకుండుఁ గలుగు దిక్కుల మొదలై
దిక్కుగల లేని వారికి
దిక్కెయ్యెడువాఁడు నాకు దిక్కు మహాత్మా!

కాలస్వరూపుఁడు విశ్వవ్యాప్తుఁడు నైన నారాయణుఁడు చిన్నబిడ్డలు వినోదార్థము బొమ్మరిండ్లు కట్టునట్లు విశ్వము నిర్మించుచుండును. వినోదముకొఱకై రక్షించును. వినోదముకొఱకే లయముచేయును. అతఁడు సర్వాంతర్యామి యగుటచే నెల్లవస్తువులయం దుండు. అట్టివాని నెఱుఁగుటకై చిత్తము చక్కఁజేసికొనవలయు "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని యుపనిషత్తు చెప్పుచున్నది. నీమనస్సే నిన్ను పాడుచేయుచున్నది. దానిం జక్కఁజేసికొంటివా హరి నీకుఁ బ్రసన్నుఁడగును, మనస్సుకంటె వైరిలేఁడు. మనస్సుకంటె మిత్రుఁడులేదు. దానిని వశముచేసికొని చక్కనిత్రోవ నరసితివా యది నీకు మేలుచేయును. రాక్షసభావము విడువుము. గర్వమును ఖర్వముచేయుము. నీకు జడిసి నీయెదుట సత్య మెవ్వరును జెప్పరు. నీవెల్లలోకములను జయించితినని జెప్పుచుంటివి. ఇంద్రియలోకమును జయింపఁజాలవైతివి. జగముననున్న వైరులనెల్ల నోడించితినని చెప్పుచుంటివి. నీలోపలనున్న యార్గురు వైరులను జయింపఁజాలకపోతివి. అరిషడ్వర్గమును జయించితివా? నీకు లోకమున శత్రు

వుఁడే యుండఁడు. కావున కామక్రోధాదుల నడఁచి సంసారముమీఁ ది వాంఛవిడిచి నీహృదయఫలకమున నారాయణునిప్రతిమ లిఖించి యతని నాశ్రయింపుము. ముక్తుఁడవయ్యెదవు." అనిసం సుమా రునకుఁ దండ్రి యిట్లనియె.—

"దురాత్మా! చావునకుఁ దెగించి మొండివై భయమించుక లేక నాతో వితండవాదములాడఁ జొచ్చితివి. నాకన్న నీలోకమునకు రాజెవ్వఁడు? నాథుఁ డెవ్వఁడు? నీనారాయణుఁ డెక్కడున్నాఁడురా? నాతమ్ముని వాఁడు చంపినప్పుడు వానింబట్టి వధింపవలయునని వాని కొఱకు నేను చతుర్దశభువనంబులు వెదకితిని. ఎక్కడను నాకగపడ లేదు. వాఁడెక్కడ నుండును? ఎట్లు వర్తించును? ఏజాడను వచ్చును. వానిం జూపుము. భట్టువలె, వానిని బొగడుచున్న నిన్నును వానిని గూడ నొక్కవేటున వధించెదను." అని గంభీరంబుగా దానవ నాయకుఁడు పలుకుటయు భక్తితత్పరుఁ డగు ప్రహ్లాదుఁడు మేనుపు లకరింప నానందపరవశుఁడై హరిందలంచి యిట్లుత్తరము చెప్పెను.

మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల నీయాయెడన్.

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే.

దేవా! యెందున్నాఁడని యడుగనేల? చెప్పెదవినుము.— అని ప్రహ్లాదుఁడు హరి సర్వాంతర్యామియై యున్నాఁడని కంఠోక్తి గ వచింప, లేఁడు లేఁడు లే డని దానవేశ్వరుఁడు దిక్కులు మాఱు

మోఁతియునట్లు మహాస్వరంబునం బలికి బాలుని ధిక్కరింపఁ దొడఁ గెను. అప్పుడు దేవదేవుఁడైన విష్ణుదేవుఁడు నరసింహరూపము ధరించి యీపదార్థమాపదార్థమనక విశ్వంబునంగలసమస్తవస్తువులయందును బ్రవేశించియుండెను. అప్పుడుదానవేశ్వరుఁడు కోపాగ్నిచేత దందహ్యమానమానసుఁడైన కుమారునుద్దేశించి "దురాత్మా! నీహరిజంగమస్థావరాత్మకమైనజగమందంతట నున్నవాఁడని చెప్పుచుంటివి. ఈ స్తంబంబునఁ జూపఁగలవా? ఈ స్తంభంబున జూపఁజాలవేని దంభంబులు పలుకు నీశిరము నాగదాదండంబున నుగ్గుచేసెద. అప్పుడు నీచక్రిగిఱ్ఱి వచ్చి నిన్నురక్షింపఁగలరేమో చూతము" అని పలికెను.

పలుకుటయు హరిభక్తుండు జనకున కిట్లనియె. "తండ్రీ! గడ్డిపోచ మొదలుకొని బ్రహ్మవఱకుఁగల సమస్తచరాచరపదార్థములయందు నున్న పరమాత్ముఁడు విశాలమైన యీసభాస్తంభంబున నుండుట యరుదే. అణువులయం దణువై మహాపదార్థములయందు మహాపదార్థమై యతఁడుండు నన్నమాట వినవో! నీవు చూడ గోరినయెడల నేదో యొకరూపంబున నతఁడు ప్రత్యక్షమై కనఁబడును.

అనవుడు విని నీర్ష్యయు రోషంబు క్రోధంబు డెందంబున ముప్పిరిగొన దానవేశ్వరుఁడు "అట్లయినఁ దప్పక పరీక్షింపవలసినదే" యని గద్దియనుండి దిగ్గున నేలకుఱికి కోపావేశంబున నొడలెఱుంగక సభాస్తంభంబు కడకరిగి నఱచేత దానిం జఱచి 'చూపు మిందు చూపు' మని గొంతెత్తి భయంకరముగాఁ బలికెను.

చఱచుటయు నామహాస్తంభంబు దశదిశలు ప్రతిధ్వనులిచ్చునట్లు పెటపెటశబ్దంబులు పొడమునట్లు పగిలెను. అందుండి చిటచిటయనివిస్ఫులింగములుబ్రహ్మాండమునిండ దిగ్గజంబులగుండెలుతల్లడిల్లునట్లు బొబ్బరింత వెడల పాదఘట్టనంబున మహీతలంబు రజోరూపంబునఁ బైకెగుర రూపదర్శనమాత్రమున దేవదానవాదులు భయభ్రాం

తులై నలుదెసలకుం బాఱఁ బ్రళయకాల సూర్యబింబంబులట్లు భాసిల్లు నరుణనేత్రయుగళముతోడను సూర్యకిరణ సమానములై కన్నులకు మిఱుమిట్లు గొల్పు నటాపటలముతోడను విలయాగ్నికీలవడువున భాసిల్లు భయంకర జిహ్వతోడను మహాపర్వత విశాలంబైన వక్షస్థలంబుతోడను మిక్కిలి సన్నమగు నెన్నడుముతోడను దిగ్గజంబులతుండంబులను ధిక్కరించు బాహువులతోడను నిసుప గునపంబుల యగ్రింబులట్లు పదునగు గోళ్ళతోడను మేరుపర్వతగుహాప్రతిమానంబగు మహావక్త్రింబుతోడను కేవలము సింహముగాక కేవలము నరుఁడుగాక, నరసింహాకృతి ధరించి నారాయణుఁడు స్తంభంబునం దావిర్భవించి దానవరాజసభామధ్యంబునఁ దోఁచెను.

మహోగ్రమైన యానరకేసరింజూచి దానవకుంజరుఁడు "ఆహా! బాలకుని పంతంబు నెగ్గించుటకును దన విశ్వమయత లోకమునకు వెల్లడించుటకును నీస్తంభమునం దావిర్భవించె. ఈతనిచేత జచ్చుటొండె, వీనిం గెలుచుటొండె, నాకుం గర్తవ్యంబు. 'యశోనా మృత్యుర్వా' యను నార్యోక్తింబట్టి వీని జయించి యశమైనను మరణించి వీరపురుషధర్మమైన గాంచువాఁడ." నని తలంచి యెప్పటికైనఁ బశ్చాత్తప్త మనస్కుఁడుగాక దానవాంతకుని దిరస్కరించుచు గదాదండంబునం బట్టి త్రిప్పుచు గార్చిచ్చు మీఁది కెగయు మిడుతవడువున సింగంబునుడాయు మదపుటేనుఁగు తేవను హరి కెదురుగఁ బోయి వానిం దిరస్కరించి వంకరించి గద వానిపై భయంకరముగా వైచెను. నరహరి గదాదండంబు బట్టుకొని యవలం బాఱవైచి విజృంభించి దానవేశ్వరుని డాసి వానిం బట్టుకొనిన, వాఁడును గింజుకొని మిట్టిపడి పట్టుదప్పించుకొని యాకసంబున కెగిరి భయంకరఖడ్గంబున నరసింహదేవుని వేయనుంకింప నాదేవుఁడు రౌద్రాకారంబున నారాక్షసరాజును మరలం బట్టుకొని తొడపై నిడుకొని

యతినిశితములగు నఖాగ్రములచేత వక్షస్థలంబునం జెకల్చి కొన్ని నెత్తురులు నలుదెసలం జిమ్ముచు వీరగంధంబు చందంబున మేననలందు కొనుచు మాంసపుం గండలు తుత్తునియలుగాం జేసి పాఱవైచుచు వసంతోత్సవము నెఱపినట్లు వినోదించుచు దైత్యనాయకునివధించెను.

హిరణ్యకశిపుండు తొల్లి పరమేష్ఠి ప్రత్యక్షమై వరములు వేండుమన్నప్పుడు దేవదానవమానవులచేతను జంతువులచేతను రేలం బవళ్లను భూమ్యాకాశంబులయందును, నాయుధంబులచేతను జావకుండ వరంబు వడసియుండుటచేత గేవలము నరరూపము జంతురూపముగాని మిశ్రమరూపంబు ధరియించి రాత్రియుం బవలుగాని సంధ్యాసమయంబున భూమియు నాకాశంబునుంగాని సభామంటప ద్వారపు గుమ్మమునం దొడలపై నిడుకొని యాయుధములుగాక జీవరహితములును జీవసహితములునైన క్రొవ్వాండి గోళ్లచేత వానిని సంహరించి నారాయణుండు లోకముల కానందంబు గూర్చెను.

దుర్వారములైన వరములను వడసి దురాత్ములు నరపరిభావమున మిట్టిపడి లోకకంటకులై యుండం జూతురుగాని భగవంతునకు వారిం జంపడముండక పోదని సందుదొరకకపోదని దీనింబట్టి తెలియవలయును.

అంత నారాక్షసేశ్వరుని యనుచరులు స్వామి మరణంబును సహింపలేక నానావిధశస్త్రధారులై నరహరిమీందికివచ్చిరి. అతండు చక్రాదిసాధనములచే వారిలోనొక్కండైనం దక్కకుండ నందఱవారి స్వామికడ కంపెను.

తమ్ముం జెఱపట్టి పలుసిలుగులపాలు నేసిన పాపకర్ముండు హతుండగుటం జేసి పట్టరాని యానందంబున నిర్జరాంగనలు మందారపారిజాతాది కల్పవృక్షంబులకుసుమంబులు హరిమీంద వర్షించిరి. దేవతల జయజయధ్వనులతో బ్రహ్మాండమంతయు నిండెను. శంకర

కమలాసన ప్రముఖులైన దేవతాశ్రేష్ఠులును మహేంద్రాది దిక్పాలకులును తక్కిన దివౌకసులును కరయుగములు ఫాలభాగమునఁ గీలించి నరకేసరికి నమస్కరించి యనేకవిధంబుల నుతియించిరి. కాని, యాభయంకరరూపంబును నాఁటి యుగ్రచేష్టలను జూచి వేల్పులలో నొక్కరైన నాతని డాయఁ సాహసింపక బెగడొంది జగన్మాతయగు లక్ష్మీదేవినిం బిలిచి యాతనిం బ్రసన్నుం జేయుమని ప్రార్థించిరి. ఆమెయు నట్లకాకయని ప్రాణనాథుని డాసి—

సీ. ప్రళయార్క బింబంబుపగిది నున్నదిగాని
నెమ్మోము పూర్ణేందునిభముగాదు.
నఖశిఖాసంఘంబు చెలువు సూపెడుగాని
చొక్కి ప్రసాదభాసురము గాదు
వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుగాని
భూరి కృపారసస్ఫూర్తిగాదు
భయద దంష్ట్రాంకురప్రభలు గప్పెడుగాని
దరహసితాంబుజాతంబు గాదు

తే. కఠినఖర నారసింహవిగ్రహముగాని
కామినీజన సులభవిగ్రహముగాదు
విన్నదియుగాదు తొల్లి నే విష్ణువలనఁ
గన్నదియుఁగాదు భీషణాకార మనుచు.

శంకించి తాను పలుకరించిన నతఁడు పలుకునో పలుకఁడో చనువున కది సమయమగునో కాదో యని వితర్కించుకొని సమీపింప వెఱచుచున్న రమాదేవి వైఖరిం జూచి పరమేష్ఠి బ్రహ్మమునిం బిలిచి యిట్లనియె.

“వత్సా! నీవు హరికిఁ బరమభక్తుఁడవు. అతఁడు భక్తవత్సలుఁడు. భగవంతునకు భార్యకన్న భక్తుఁ డతిప్రియుఁడు కావున

నీవు హరిసన్నిధికరిగి వానిం బ్రసన్నునిం జేసి యీయుగ్రమూర్తి నుపసంహరించునట్లు చేసి లోకంబులఁ గావవలయు" నని లాలించి పలికినఁ బ్రహ్లాదుఁడు మహాహ్లాదమునఁ దన కేలుదమ్ములు నెన్నొసట గీలించి పరమపురుషుని కెదురుగాఁబోయి చరణరాజీవములకు సాష్టాంగదండప్రణామంబుచేసి నిలిచెను. నిలిచిన నారాయణుండు భీకరంబు లగుచూడ్కుల నుపసంహరించి దయారసపరిపూర్ణంబులగు చూపుల నబ్బాలకుని వీక్షించి సాధుజనులకు నభయప్రదానం బొసంగు ప్రశస్తహస్తంబు నాతని మస్తకంబుపై నిడి చేరందీసెను.

పరమపురుషుని హస్తస్పర్శనంబున నతని నెమ్మేను పులకరించెను. కన్నులనుండి యానందబాష్పములు స్రవించెను. మనంబు హర్షపూరితమయ్యెను. మొగమునఁ గ్రొత్తవికాసము మొలకెత్తెను. అప్పు డతఁడు భక్తిపారవశ్యంబున నిట్లు వినుతించెను:— "దేవా! మహేంద్రాదిదివ్యులు మహర్షులు నిశ్చలచిత్తములతో నిన్ను ధ్యానించి వినుతింపఁజాలరు. అట్టియెడ రాక్షసకులజాతుఁడను, మదోద్రేకపీడితుఁడను మిక్కిలి పిన్నవాఁడను. నేను నిన్ను నుతియింపఁ బూనుట హాస్యాస్పదము. జపములు తపములు నియమములు హోమములు స్నానములు దానములు యాగములు భోగములు భక్తిమెప్పించినట్లు నిన్ను మెప్పింపఁజాలవు. వైదికకర్మతత్పరుఁడై నిష్ఠాపరుఁడై భక్తిశూన్యుడైనబ్రాహ్మణునికంటె భక్తిమాత్రమే గలచండాలుఁడునీకుఁ గడుంగూర్చువాఁ డగును. భూతదయాపరుఁడై భక్తితత్పరుఁడైన వాఁడు వర్ణభేదంబు జాతిభేదంబు లేక నీసాన్నిధ్యంబుబడయ సర్హుండు. భక్తి వర్ణభేదంబు పాటింపదు. నీకెల్లవారలు సమానులు. ఈవాక్యములకు నేనే ప్రథమోదాహరణంబనగుదును. బ్రహ్మాదులు నిన్ను జేరవడకుచుండ రాక్షసబాలుఁడనైన నేను నిన్ను భక్తిపెంపున డాయంగలిగితి. మహాత్మా! యెల్లవేలుపులపక్షంబున నే నొక్కవిన్న

పంబుచేసెద. దుర్నిరీక్ష్యప్రభాభాసమానమై నిరుపమానమైన నీమూర్తిం గనుంగొని నిర్జరులందఱు భయపడుచున్నారు. బ్రహ్మరుద్రులు సైతము నిన్నుం దేఱిచూడలేకయున్నారు. ఎందు కవతరించితివో యాపని దీర్చితివి. అసురుం గడ తేర్చితివి. సురలమనంబులు చల్లవడియె. కృతకృత్యుండవైతివి గావున నీయవతారంబు నుపసంహరించి లోకంబులకు యథాస్థితింగూర్పుము. అది యటుండనిమ్ము. జగద్భయంకరమై దానవేంద్రవిదారణసంరంభంబగు నీయుగ్రమూర్తికి నేనంతగా వెఱువనుగాని దుస్తరమగుసంసారజలధిం జూచి మిక్కిలిభయపడుచున్నవాఁడ. దీనిని నేను తరించి నీపాదాశ్రయుండ నగునట్లు జేయుము. ఇంక మీఁద జన్మంబులెత్తంజాల. ఐశ్వర్యంబులు వినశ్వరంబులగుట వాసినొల్ల. మాతండ్రి సకలైశ్వర్యసంపన్నుండై నిమేషమాత్రంబున నీచేత మడసె. మరణంబులేని జన్మంబును నాశనము లేని యైశ్వర్యమును బ్రసాదింప నీవ యర్హుఁడవు. సనకాదిదివ్యమునులంగలసి నీచరణంబులు శరణంబు చేసికొని సుఖించున ట్లనుగ్రహింపుము.

సీ. నీగృహాంగణభూమి నిటలంబు మోపంగ
మోదించి సత్యంబు మ్రొక్కఁడేని
నీమంగళస్తవ నికరవర్ణంబులు
పలుమాఱు నాలుక బలుకఁడేని
నీయధీనములుగా నిఖిలకృత్యంబులుఁ
బ్రియభావమున సమర్పింపఁడేని
నీపదాంబుజముల నిర్మలహృదయుఁడై
చింతించి మక్కువఁ జిక్కఁడేని

తే. నిన్నుఁ, జెవులార వినఁడేని నీకు సేవ
సేయరాఁడేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె

యోగిమైనఁ దపోవృత యోగిమైన
వేదిమైన మహాతత్త్వ వేదిమైన.

కావున నాకు నీచరణదాస్యం బవశ్యంబు చేకూరునట్లు చేసి రక్షింపుము."

అని ప్రార్థింప ప్రహ్లాదుని సన్నుతులకు సంతుష్టాంతరంగుఁడై నరహరి "వత్సా! నీభక్తికి మెచ్చితి. నీయిచ్చవచ్చిన వరంబులడుగు మిచ్చెద" నని యానతిచ్చుటయు దైత్యరాజనందనుఁడు వినయంబున "దేవా! వరంబులడుగుట కామంబులు ప్రకటించుట. నేను భోగంబు లొల్ల. నాకుం గోరికలు లేవు. ధనకనకవస్తువాహనంబుల మీఁద నాకపేక్షలేదు. రాజ్యంబు నాకు భోజ్యంబని తోఁచుటలేదు. వరములకెల్ల వరమైన దొక్కటికలదు. నీసన్నిధినుండ ననుగ్రహించుటయే నాకు వరము. అటులఁజేయుము" అని విన్నవించెను. పరమపురుషుఁడు. వానిపలుకులు విని పరమహర్షంబు నొంది యిట్లనియె. "వత్సా! నీహృదయంబున నన్ను నిలిపి ధ్యానించుచుందువు గావున నేనెప్పుడును నీసన్నిధినెయుందును. నీవెప్పుడు నాసన్నిధనేయుందువు నిరంతరము నాకథలె యాలకించుచు నన్నే గొలుచుచు సర్వము పరమేశ్వరార్పణమని భావింపుచు రాజ్యంబుసేయుము. నీతండ్రి కూర్ధ్వలోకక్రియలఁ గావింపుము. నీకు శుభంబగుఁగాక" యని దీవించి బుజ్జగించెను. ప్రహ్లాదుఁడును కరుణాసముద్రుఁ డగునయ్యాదిదేవుని నిర్హేతుకజాయమానకృపకు' మిక్కిలి యలరి "స్వామీ! నీభక్తుఁడ నగు నన్ను బలుబాములంబెట్టి నిన్ను దిట్టి నాతండ్రి నీయెడ మహాపచారంబు గావించె. వానితప్పులు సైరించి వాని కుత్తమగతులం గలుగఁజేయు" మని వేఁడుకొన హరియుఁ "గుమారా! నీజనకుఁడు సమరంబున నాచేత మడసెఁగావున వాని కుత్తమగతులె ప్రాప్తించు. భయంపడకు" మని యూరడించెను. ప్రహ్లాదుండు జనకుని కుత్తరక్రి

యలు గావించి జేజేలవలన వరములవడసి పైత్రుకమైన రాజ్యమున కభిషిక్తుఁడయ్యెను.

నారాయణుఁడు వేల్పులనెల్ల విడిదులకుం బొమ్మని యాన తిచ్చియంతర్హితుండయ్యెను. ప్రహ్లాదుఁడు నారాయణచరణసేవకుఁడై ప్రజారంజకుఁడై చిరకాలము ధరిత్రిఁ బరిపాలించి హరిసాన్నిధ్యంబు జేరి పరమభాగవతులలో నగ్రగణ్యుఁడై మృతజీవుఁడై శాశ్వతకీర్తి నార్జించెను.



# వామనావతారము

ప్రహ్లాదునకు విరోచనుఁడను కుమారుఁడు పుట్టెను. ఆతనినందనుఁడు బలిచక్రవర్తి. దేవరాక్షసులకు నిరంతరము వైరభావంబులు పెచ్చుపెరుగుటంజేసి రాక్షసరాజైన బలికిని, దేవనాయకుఁడైన యింద్రునకును యుద్ధంబులు పెక్కులు జరిగెను. అందు మొట్టమొదటికయ్యమున వేల్పుతేసిచేత రక్కసులదొరయగు బలి పరాజితుఁడై కులగురువులను భార్గవులనారాధించి వారికరుణచే విశ్వజిద్యాగము చేసెను. ఆయాగము నిరంతరాయముగ జరుగ నగ్నిహోత్రుడు మెచ్చి సువర్ణరథమును సూర్యాశ్వములఁబోలిన గుఱ్ఱములను సింహధ్వజమును, దివ్యమైనచాపమును సంపూర్ణములైన యంబులపొదులను, వజ్రకవచమును వాని కిచ్చెను. తాతయైన ప్రహ్లాదుఁడు వాడిపోవని తామరపూవులదండ నొసఁగెను. చంద్రునివంటి తెల్లని శంఖమును శుక్రాచార్యుఁ డిచ్చెను.

ఈతెఱంగున దేవదత్తములైన దివ్యాయుధములుగలిగి బహుదానములచేత విప్రులను సంతుష్టులను జేసి వారి దీవనలను బడసి, పెద్దలకు మ్రొక్కి కులదేవతల నారాధించి పితామహుఁడగు ప్రహ్లాదునకు నమస్కరించి సెలవుగైకొని దేవతల జయించుకొఱకు దేదీప్యప్రభావంతుఁడై బైలుదేరెను. ఆతనివెంటఁ జండశాసనులును, ఖండితశత్రుమండలులును నగుదండనాయకులు పగతుఱకు దైన్యంబు గొలుపు సైన్యంబు నడపించుకొని దేవరాజధానియగు నమరావతి పైఁ దండువిడియఁబోయిరి. అట్లు దీర్ఘప్రయాణంబుల నమరావతిం జేరి వేల్పులదొరకోట ముట్టడించి దారు లరికట్టి వెలుపలివారిని లోనికి లోనివారిని వెలుపలికి రానీక జాగరూకతతోనుండిరి. దానవసైన్యముల భేరీభాంకరణములు దేవకాంతల గుండియ లవియఁజేసెను.

సురేశ్వరుఁడును దానవభర్త తనవీటిపై దాడివెట్టుట జూచి ద్వారంబులకడను బురుజులమీఁదను మెఱుపులవంటి తన మేటి బంటులఁ గాపువెట్టి కార్యాలోచనమునకై వేల్పుటొజ్జయగు బృహస్పతిని రావించి యిట్లు లనియె. "మహాత్మా! ఇది యేమిచిత్రము? ఇంతకుమున్నె బలి మనచేనోడి దెబ్బలుతిని పాఱినాఁడు. వెంటనే రక్కసిమూఁకలఁ గూర్చుకొని మనతోఁ బెనఁగవచ్చినాఁడు. ఈతనికేడైన మహాబలము తపోబలంబునను వచ్చెనా? రానిచో నెట్లుమనపై వెండియు రాఁగలఁడు? కర్తవ్యమేమి?

అని యడుగుటయు నిర్జరాచార్యుఁడు "మహేంద్రా! బ్రహ్మవాదులైన భార్గవులు వీనికి గురువులు. వారిప్రభావము వర్ణనాతీతంబని నీవెఱుంగుదువు. బలివారినాశ్రయించివారియనుగ్రహంబువడసి దివ్యశస్త్రాస్త్రములను సాధనంబులను సంపాదించి మహాధైర్యంబున నీపై నెత్తివచ్చినాఁడు. వాని నిప్పుడు నీవు గెల్చుట యరిది. కావున సకళత్రముగ సపుత్రికముగ సభాంధవముగ సపరివారముగ నమరావతిని విడిచి మనకు మంచితరుణము వచ్చువఱకు నెందేని దాగియుండుట కర్తవ్యంబు. కార్యంబు సెడివచ్చినప్పు డెట్టిశూరుఁడైన నడఁగి తలవంచికొని యుండి యదనువచ్చినప్పుడు పగతుఱం జెఱచుట రాజనీతి." యని యుపదేశించెను. గురూపదేశంబు సముచితంబగుట మహేంద్రుఁడు దేవరాజధానిని విడిచి యెందేనిం జనియె. వేల్పులు కామరూపులైచ యథేచ్ఛం జనిరి. అమరవర్జితంబైనయమరావతిని సులభముగాఁ బ్రవేశించి బలిచక్రవర్తి ముజ్జగంబులు దన వశము చేసికొని సుఖముగా రాజ్యంబు సేయుచుండె. శిష్యవత్సలులగు భార్గవులు వానిచేత నూఱశ్వమేధములు చేయించిరి. ఇట్లు చిరకాలంబు గడచె. అతఁడు జగంబులు పరిపాలించు కాలమున యాచకులు లేరు. కృషిచేసినమాత్రమున నేల పుష్కలముగాఁ బండును.

నెలకు మూఁడు వానలు గురియును. పగతుఱెందును లేరు. అందఱు సంపన్నులు. భూమికి వసుంధర యను పేరు సార్థకమయ్యెను.

తన కుమారులైన వేల్పులు క్రోల్పులులవంటి దానవులచేత బరాజయమునొంది నాకంబువిడిచి యడవులపా లగుటఁ జూచి దేవమాతయైన యదితి బిట్టువగచుచుండ భర్తయైన కశ్యపప్రజాపతి యొకనాఁ డామెను జూడఁబోయి వనటచేత వాడి వత్తివలె నున్న యిల్లాలిమొగముఁ జూచి "యేల నీవిట్లు వందురుచున్నావు? బిడ్డలు నీకు విధేయులై యుందురా? కోడండ్రు నీమాన దాటక వినయంబున మెలఁగుచుందురా? ఇంత వగచుటకు నీకేమి యాపద వచ్చె?" నని యడిగెను. ఆమహాత్మునకు వేల్పులతల్లి మెల్లన నిట్లనియె. "దేవా! ఏమి చెప్పుదును? మీ జపమేమొ మీ తపమేమొ గాని నాదెస బిడ్డలదెస మీరు చూడరు. నాసవతియైన దితికొడుకులు బలిచక్రవర్తిం బురస్కరించుకొని యమరావతిమీఁద దండువిడిసి నాకొడుకులను దుడుకుతనమున గెలిచి యడవులకుం బాఱఁద్రోలిరి. దితి యాస్థితిఁజూచి సంతసించుచున్నదిగాని రవంతయైన వంతజెందదు. అట్లు చేయఁగూడదని కొడుకుల వారింపదు. ఇప్పు డమరావతి రాక్షసపరిపాలనమునందున్నది. దేవతలయవస్థ యెట్లున్నదో చిత్తగింపుఁడు.

సీ. ఎండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు
పలుపంచలను జాలిఁబడియె నేఁడు
త్రిభువనసామ్రాజ్య విభవంబుఁ గోల్పోయి
దేవేంద్రుఁ డడవులఁ దిరిగె నేఁడు
గలిమి గారాబుబిడ్డలు జయంతాదులు
శబరార్భకుల వెంటఁ జనిరి నేఁడు
సమరుల కాధారమగు నమరావతి
యసురుల కాటపట్టయ్యె నేఁడు

ఆ. బలి జగములనెల్ల బలియుచున్నాఁడు
వాని గెలువరాదు వాసవునకు
యాగభాగమెల్ల నతఁ డాహరించును
గడఁగి సురల కొక్క కడియునీఁడు

నీవు నిష్పక్షపాత మనస్కుఁడవు నిరుపమాన తపోగరిష్ఠుఁడవు. కార్యాకార్య విదుఁడవు. నాకొడుకులు దితికొడుకులు నీకుసమానులు. అట్టియెడ నెవరిరాజ్యంబు వారు గుడువక నిష్కారణకలహంబుబెంచి యన్యాయంబు సేయుచున్న దితి నందనులను మందలించి నీవు బుద్ధిసెప్పవలదే? కొడుకులు చెడుతెఱవుబట్టి పడదన్నగా నట్లూరకుండుట దండ్రి కుచితమే? ఎవరివలనం దప్పుగలదో వారిని దండించుట కర్తవ్యము గాదె! నీవు జగత్కళ్యాణసంధాయకుఁడవు. ప్రజాపతులలో నొకఁడవు. కాన నమరావతి వెండియు వేల్పులయధీనం బగునట్లును వారు సుఖించునట్లును వెఱవూహించి సత్వరమ దానిఁజేసి రక్షింపుము" అని ప్రాణవల్లభు పరిపరివిధముల బ్రతిమాలి ప్రార్థింప యిల్లాలి వేఁడుకోలు నాలకించి పౌర్వాపర్యములు విచారించి భావికాల పరిస్థితులఁ బరిగణించి కశ్యపప్రజాపతి యిట్టులనియె. "కల్యాణీ! రాక్షసులు గర్వప్రేరితులై సుపర్వవర్గమును స్వర్గమునుండి దుర్గమవనంబులకుఁ దోలిరి. అయినను విచారింపకుము. దీనికిం దగు నుపాయంబు సెప్పెద. ఇప్పు డున్న స్థితినిఁబట్టి దైత్యుల నిర్జింప నెవరికి శక్యముగాదు. మాయాబలంబున నారాయణుండే వారిని నిర్జింపవలయు. కావున నీవు బరాత్పరుని జగన్నాథు నారాయణుని సేవింపుము. దానంజేసి కార్యసాధనంబగు అతఁడేయాపద్బాంధవుఁడు. ఇదివఱకు దైత్యదానవాదులచే సిలుగులు బడసినప్పు డెల్ల త్రిదశులకు నాతఁడే సాయంబు సేసి వారి నభ్యుద్ధరించెను. ఇప్పుడును నతఁడే వారి నుద్ధరింపవలయును" అనిన నావేల్పుటవ్వ

ప్రజాపతియగు పతినుద్దేశించి "దేవా! నారాయణుని సేవించుటకు మంత్రమేది? ఆరాధన కాలమేది? విధానం బెద్ది?" యని ప్రశ్నించుటయు నాకశ్యపబ్రహ్మ తన్మంత్రంబును నారాధనకాలమును విధానమును నుపదేశించి వ్రతంబు నెఱపుదినముల, గేవలపయోభక్షణంబె చేయవలయునుగాని యాహారంబు భుజింపఁగూడదని నొక్కి చెప్పి యథేచ్ఛంజనియెను.

అదితియు మగఁ డుపదేశించిన విధానంబు మఱువక ఫాల్గున మాసంబున మొదటి పండ్రెండుదినములు నియతయై పయోభక్షణంబు సేయుచు హరి నారాధించిన నామె నియతికిని భక్తికిని మెచ్చి యచ్యుతుండు దయార్ద్రహృదయుఁడై చతుర్బాహువులతోడను బీతాంబరంబుతోడను శ్రీవత్సకౌస్తుభములతోడను శంఖచక్రాదిసాధనములతోడను సజలజలధరశ్యామ దేహముతోడను నామెకు సాక్షాత్కరించెను. ఆతనింగనుఁగొని యదితి కన్నులనుండి యానందబాష్పములు వక్షోభాగంబునఁ దొరఁగ మేనం బులకలుదోఁప వినయంబున నాతనికి నమస్కరించి కన్నుదోయితో నాతని రూపంబును జూచి తనివిసనక మఱియుమఱియుఁ జూచి మందమంద మృదుభాషణముల నాతని నిట్లు సన్నుతించెను.

సీ. యజ్ఞేశ విశ్వంభ రాచ్యుతశ్రవణమం
గళ నామధేయ లోకస్వరూప
యాపన్నభక్తజనార్తి విఖండన
దీనలోకాధార తీర్థపాద
విశ్వోద్భవస్థితి విలయకారణభూత
సంతతానంద శశ్వద్విలాస
యాయువు దేహంబు ననుపమలక్ష్మియు
వసుధయు దివముఁ ద్రివర్గములును

తే. వైదికజ్ఞానయుక్తియు వైరిజయము
నిన్నుఁ గొలువని సురులకు నెఱయఁ గలదె
వినుతమందార గుణహార వేదసార
ప్రణతవత్సల పద్మాక్ష పరమపురుష.

అసురనాయకులు సురలను దేవరాజధానినుండి పాఱఁదోలిననా టనుండియుఁ గన్నకడుపుగావున నామనస్సు మనస్సులో లేదు. నిమ సమైన విశ్రాంతి లేదు. నాకు దూరమై దేశాంతరముల కరిగినకొడు కుల నాకడఁ జేర్చి నన్ను రక్షింపుము" అనిన యాయవ్వపలుకులకు మందస్మితవదనుఁడై భక్తపారిజాతమగు పరమపురుషుఁ డిట్లులనియె:-

"తల్లీ! నీవును నీకుమారులును నీకోడండ్రును సంతసిల్లున ట్లును దానవాంగనలు శోకించునట్లును నీకు నందనుఁడనై పుట్టి దా నవుల వంచించి రాజ్య మిందురినకిచ్చెద. ఈవఱకు నేను నీచములై న జలచరవనచరరూపములదాల్చితినిగానిదివ్యాంగనాగర్భమునజన్మిం పనైతిని నీవు జగన్మాతవు. పతివ్రతవు. అట్టి నీకడుపునబుట్టి నీస్తన్యం బు పానముజేసి నీచేతనుగ్గుద్రావి ముద్దులొలుకు మాటలాడి నీకుఁ బ్రియంబుసేయ నాకెంతో ముచ్చటగుచున్నయది. బలిచక్రవర్తి ప్ర ముఖదానవులను బలిమిచేత గెల్చుట యసాధ్యము. వంచనోపాయ మున వానిని గెలువవలయు. కావున నీకొడుకనై గుజ్జురూపమునఁబుట్టి దానవేంద్రుని వంచించి వానిసంపదలుహరించి యన్నయైన యింద్రు నికిచ్చెద. నీకు గారాబుకొడుకనై యింద్రునకు ముద్దుల తమ్ముండ నై శచీదేవి మన్నించు మఱఁదినై కశ్యపప్రజాపతికిఁ గడగొట్టుబిడ్డ నై మీయాదరణంబువడయ నభిలషించుచున్నవాఁడ. నీవునన్ను ధ్యా నించుచుండుము. అచిరకాలంబున నీగర్భకోశంబునం జొచ్చెద." అని యాపరమపురుషుం డాసతిచ్చి యంతర్ధానము నొందెను.

అంతం గతిపయదినములకు నదితిదేవి గర్భవతియయ్యెను. అన్నెలంతకు నెలలు నిండినకొలంది దానవుల యాయుష్కాలములోని నెలలు తగ్గుచువచ్చెను. బ్రహ్మాండమంతయుం దనకడుపున నిముడ్చుకొనంజాలిన పరమేశ్వరుం డొకయంగన గర్భంబున నిమిడి యుండ వలసివచ్చె. ఆయవ్వ గర్భంబుననున్న యర్భకుండు సురక్షితంబుగ నుండవలయునని దేవకాంత లామెకు నానావిధములైన యంగరక్షలుచేసి కడుమెలకువతోం గాపాడిరి. అంతం బ్రొద్దులునిండ నావేల్పుటవ్వ ప్రసవించెను. గ్రహతారాచంద్రబలములు సంపూర్ణముగ నున్న పుణ్యదినమున శ్రవణ నక్షత్రమున మధ్యాహ్నమున వామన రూపుండై నారాయణుం డదితిగర్భమున బుట్టెను.

ఆబాలకుండు శంఖచక్రగదాధరుండై శ్రీవత్సలాంఛితుండై కౌస్తుభరత్నసమేతుండై హారకుండలకేయూరభూషితుండై నీలమేఘశ్యాముండై యవతరించిన సనకాది సన్మునులు సంతోషించిరి. సిద్ధసాధ్యులు చింతలుబాసిరి. కమలగర్భాదుల మొగములు కాంతిమంతము లయ్యెను. గంధర్వులు పరమానందమున గంతులువైచిరి. అప్పు డెన్నో శుభనిమిత్తములు గనంబడెను. పుష్పవర్షములు పుష్కలముగా గురిసెను. అంతం గశ్యపుం డబ్బాలకుని వేదోక్తంబులగు మంత్రంబుల నుతియించెను. “ఈమహానుభావుం డింతకాలము నాకడుపున నెట్లిమిడియుండెనో కదా” యని యదితి యక్కజం పడంజొచ్చెను. ఆయర్భకుం డప్పుడు దివ్యంబైన తన భవ్యరూపము ను విసర్జించి సామాన్య బాలకుని యాకృతిందాల్చి కావుకావున నేడ్వంజొచ్చెను. పురుడులేని యా వేల్పుటవ్వకు వేల్పుటువిదలు పురుడువోసిరి. అంతం గ్రమక్రమమున నాగుజ్జుబిడ్డండు బెరిగిబెరిగి తన నడకలచేతను ముద్దులు మూటగట్టు పలుకులచేతను దల్లికి సమితానందముం గూర్చెను. లోకత్రాణపరాయణుండైన నారాయణుండు

తనకుఁ గొడుకై నందులకును దన యార్తిఁ దీర్పవచ్చినందులకును నామె పట్టరాని హర్షంబునఁ బరవశయగుచు—

ఆ. నన్నుఁ గన్నతండ్రి నాపాలిదైవమ
నాతపఃఫలంబ నాకుమార!
నాదు చిన్నివడుగ! నాకులదీపక!
రాఁగదయ్య! భాగ్యరాశివగుచు.

అని పిలుచుచు నెత్తుకొనుచు ముద్దులాడుచు వేల్పు టువిదలం దెల్ల తాను ధన్యయైనట్లు తలంచుచుండును.

కాలక్రమంబున నాదంభడింభకుఁడు పెరిగి యుపనయన వయస్కుండగుటయు మహర్షులు కశ్యపప్రజాపతిని బిలుచుకొనివచ్చి వేదోక్తవిధానమున నుపనయనము జేసిరి. ఆబాలునకు భాస్కరుఁడు గాయత్రి నుపదేశించెను. దేవగురుఁడు జన్నిదము నొసఁగెను. తండ్రీ యగు కశ్యపుఁడు ముంజి యొసఁగెను. అదితి కౌపీనంబు నర్పించెను. భూదేవి కృష్ణాజినము సమర్పించెను. చంద్రుఁడు దండమిచ్చెను. కమలగర్భుఁడు కమండలము దయసేసెను. గగనదేవత గొడుగునొసఁగెను. సప్తమహర్షులు కుశపవిత్రంబు లిచ్చిరి. సరస్వతీదేవి జపమాలిక నిడెను. యక్షేశ్వరుఁడైన కుబేరుఁ డక్షయభిక్షాపాత్రిక నిచ్చెను. ఆదిభిక్షు నిల్లాలు పార్వతి పూర్ణభిక్ష నొసఁగెను. వటుఁడు బ్రహ్మాండనాయకుఁ డయ్యు దల్లిదండ్రులు వేల్పులు సంతసించుటకై వృద్ధాచారము నడుపఁ దలఁచి హోమాదులు చేసెను.

ఇట్లు వామనుఁడు వడుగై యిటు నటు దిరుగుచు నానా దేశములనుండి వచ్చు బ్రాహ్మణులఁ గనుంగొని ''యార్యులారా! మీరు సంభావనల కరుగుచుందురుగదా. లోకమున నెందైన మహాదాతలున్నారా? వారు కోరినయర్థము లీయఁగలరా? కల్పవృక్షమువలె నర్థులు కోరిన కోరికలనెల్ల నిచ్చుదాత యెవ్వాఁడు? అనుగ్రి

హించి నాకుఁ జెప్పుదురే” యని యడుగుచుండును. అడిగినవా రత ని కిట్లనుచుందురు. “బాలకా! లోకంబున దాతలెందఱో గలరు. వారును యాచకుల కర్థముల నిచ్చుచుందురు. భూసురోత్తములు పుచ్చుకొనుచుందురు. కాని వ్రేలుమడిచి దాతపేరు చెప్పవలసివచ్చి నప్పుడు బలిచక్రవర్తినే మునుముందు చెప్పవలయు. ఆతనింబోలు వదాన్యులు ముజ్జగములందు లేరు. కల్పవృక్షములు కామధేనువు చింతామణీరత్నము వానిముందఱ సిగ్గునం దలవంచుకొనవలయు. అతనిని వేఁడినయర్థులు కామితార్థములు బడయక యూరకపోరు. అతఁడు భార్గవుల యనుజ్ఞను నూఱు యజ్ఞములుచేసి తన దానముల చే భూసురులను మెప్పించెను” అని విప్రులుచెప్పిన వామనుఁడు దేవ హితార్థమై తల్లిదండ్రుల వీడ్కొని శుభముహూర్తంబునం బైలుదేఱి నిఱుపేద వడువున భిక్షాపాత్రము చేతఁగొని రాక్షసేశ్వరుఁడైన బలి చక్రవర్తిని యాచింప నాతని సన్నిధి కరిగెను.

కటకటా! ఎల్లసిరులకు నెలవైన రమాదేవిని నిజవక్షస్స్థల ముననిలిపిన నీరజాక్షుఁడు నిర్జరేంద్రునకు మేలుసేయుకొఱకు యా చకుఁడై బలికడకుఁ బోవుటఁజూచి, పరోపకారులకు యాచనము గూడ నొకయలంకారమేయగునని వేల్పులు తలంచిరి. అట్లువటుండు బలిని దర్శింపఁబోవుచు మార్గమధ్యంబుననున్న నర్మదానదినిదాఁటి యాతరంగిణి కుత్తరతటముననున్న బలియజ్ఞవాటముంగాంచెను. ఆస మయంబున నాస్థలంబు హోమధూమములచే నావృతమై వేదఘోష లతోనిండి లక్షోపలక్షలగు భూసురుల కంఠనాదములు విరాజిల్లు చుండెను. యజ్ఞవాటంబు ప్రవేశించుచున్న యావటుని తేజంబుఁగనుఁ గొని “ఆహాయితఁడు మహేశ్వరుఁడో, మహేంద్రుఁడో మాధవుఁడో, కమలగర్భుఁడో, చండకరుఁడో, శీతకరుఁడో కావలయుఁ గాని, సామాన్యమనుజున కిట్టి యలోకతేజం బెటుగలుగు?

బ్రహ్మవర్చస్సు వీని మొగమున నుట్టిపడుచున్నది. ఇతండు మాయామానవవిగ్రహుఁడు గాని కేవలనరుఁడు గాఁడుసుమీ. యని యచ్చటివారు గుసగుసలాడుచు నత్యంతసంభ్రమంబునఁ గలంగిరి. అప్పుడు మాయావటుఁడు బలిగూర్చుండిన సభామండపంబును జేరఁబోవుచు నుచ్చైస్స్వరంబునఁ బాడునుద్గాతలసామ గానంబు వినుచు మంత్రార్థంబులు వితర్కించుహోతలపజ్జనిలుచుచు హోమ గుండములం దగ్నులవెలిగించు యాజకులనుజూచుచు సకలశాస్త్రంబుల సాంప్రదాయంబులనరయుచున్న సభ్యులకడఁ జేరుచు గొంత సేపిటునటుదిరిగెను. ఒకమాఱు సభజూచి వెఱచినట్లునటించును. ఒకమాఱొదిగియొదిగినట్లుండును.ఒకమాఱుమూలలదాగునుఁగొందఱతోవాదములు సేయునుఁగొందఱతో స్వరముకలిపి జటలు ఘనలుచెప్పును. కొందఱం బరిహాసము సేయును. కొందరితో ముచ్చటలాడును. అడుగులు తడఁబడునట్లొకమాఱు నడచుచు వినయంబునవంగుచు నత డెట్టకేలకు రాజుసన్నిధికరిగెను. అరిగి మాయామాణవకుఁడు మఖదీక్షితుఁడైన రక్షోనాయకునింజూచి "ఆహా! యితఁడేగదా పాకారిపవనపావకపాలస్త్యప్రముఖులగు దిక్పతులను మేకలందోలిన తెఱఁగున నెలవుల నుండి తోలిన తేజోమూర్తి. ఇతఁడేగదా! కామధేనువును కల్పవృక్షపంచకంబును దేవతారత్నమును ధిక్కరించినదానస్ఫూర్తి.ఇతఁడేగదా జగత్త్రియదర్శనీయప్రసన్నసుందరమూర్తి. ఇతఁడేగదా! చతుర్దశభువనవిఖ్యాతమహాకీర్తి, బలిచక్రవర్తి" యని కైవారంబుచేసి దర్భలు నక్షతలుఁ గ్రహించి దక్షిణహస్తంబుసాచి యిట్లనియె.

ఉ. స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు హాసమాత్రవి
ధ్వస్తనిలింపభర్తకు నుదారపదవ్యవహర్తకున్ మునీం
ద్రస్తుతమంగళాధ్వర విధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్.

అని దీవించి తనువుఁబాల్చి ధరణీతలంబున దిరుగుచున్న వేదచతుష్టయమట్లు బిచ్చపుసంచిచంకనుబ్రవేలుచుండ కమండలువొక హస్తంబునను దండము రెండవహస్తంబునను వెలయుచుండ మొగము చిఱునవ్వు వెన్నెలలుగాయ సభామంటపంబును దన తేజంబున వెలయించుచున్న యవ్వటుపుంగవుంగనుగొనిబలిపురోహితులగుభృగువులు తేజోవిహీనులయ్యు లేచి వామనుంజూచి కుశలంబడిగి మధురాలాపముల సన్మానించిరి. దానవేంద్రుఁడును మాణవకునకు వందనం బొనరించి యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి తనధర్మపత్ని కనక కలశంబుతో నుదకంబుపోయ యతనిపాదంబులు పసిఁడిపళ్లెరంబునఁబెట్టి కడిగి తడియొత్తి తొల్లియేజలంబు మహేశ్వరుఁడు తనశిరమున ధరియించెనో, మహావిష్ణుని యాపాదజలంబు తనశిరమునఁ జల్లుకొని యిట్లనియె.—

"విప్రకుమారా! నీవెవ్వఁడవు? తల్లిదండ్రులెవ్వరు? నీనివాసస్థానమెక్కడ? నీవచ్చుటంజేసి నావంశముపావనమయ్యె. నాజన్మము జరితార్థమైనది. నేను ధన్యుఁడను నాజన్మముకూడవన్నెకెక్కినది. నా మనోరథము సిద్ధించినది. ఆహా! యిది కడుపుణ్యకాలముగదా! నీ కేమికావలయునోచెప్పుము. మేలైనవస్త్రములు కోరెదవా? ధనము కావయునా, గోవులనపేక్షింతువా, గజరథతురగములుఁ గోరెదవో, రత్నములమీఁద కోరికయున్నదా? కన్యలుకావలయునా, గృహదానమపేక్షించివచ్చితివా? అగ్రహారములు కావలయునా? లేక యేదేశమైన నీకుదానమిత్తునా? ఇవిగాకమఱి నీవేమడిగెదవో యడుగుము." అని బలిచక్రవర్తి మనస్ఫూర్తిగనడిగిన మాయావటుఁడు సంతోషించి యిట్లనియె.

"అయ్యా! నేనెవ్వరివాఁడనని చెప్పుదును? తల్లిదండ్రులులేరు. నా కాపురమెచ్చటయని విన్నవింతును ఇల్లువాకిలిలేనివాఁడ గావున

నిందునందుననక ప్రతిస్థలమందునుందును. నాకుఁ బెద్దదిక్కు లేదు. నాయంతవాఁడను నేనై తిరుగుచున్నాఁడను. నాకీ విద్యవచ్చు నావిద్య రాదని చెప్పవలను పడదు. నేనన్నివిద్యలు నేర్తును నాకెవ్వరుచుట్టము లులేరు. నాకుసాయముజేయువాఁడొకఁడునులేఁడు నేనెయొకరికిఁ దోడు పడుచుందును పూర్వము నాకు సిరియుండెడిదిగాని యిప్పుడదియు నులేదు నివాసస్థానములేనివాఁడను గనుక తఱచుగా సజ్జనులలోఁ జొచ్చియుందును. రాజేంద్రా! నీవుసత్యవాక్యవిశారదుఁడవువదాన్య లలోనెల్లనగ్రగణ్యుఁడవై ధన్యుఁడవైతివి. ఏమడిగిననిచ్చుట నీకసాధ్య మగునే? మీవంశమునందుమాటదప్పెడివారు యాచకులకిచ్చెదమని చెప్పి వెనుకదీయువారు కయ్యములయందుఁ బగతుఱకోడి మడమది రిగెడివారు జన్మింపనేజన్మింపరు. మీవంశస్థులందఱు దాతలు. మీ పూర్వు లందఱు విఖ్యాతులు. మీతాత లందఱు తేజోనిధులు. మీతాతయైన ప్రహ్లాదుఁడు భాగవతశేఖరుఁడై మీకులమునకువన్నె దెచ్చి జగద్విశాలింతకీర్తిని సంపాదించెను. అట్టియున్నతకులమునబుట్టి న మహాత్మునకు నీకౌదార్యగుణము సహజలక్షణము. మీముత్తాత లైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులుశూరశిఖామణులు అందుహిరణ్యా క్షుండు జగద్భయంకరపరితాపంబుగల్గివర్తింప నారాయణుఁడు వరా హారూపంబుదాల్చికడతేర్చె మీప్రపితామహుఁడైనహిరణ్యకశిపుఁడు తమ్మునిజంపిన నారాయణునిమీఁద నిరంతరవైరంబు బూని నాతని తెగటార్ప సమకట్టి నిరుపమానవిక్రమమున శూలపాణిచందంబున శూలాయుధహస్తుండై వైకుంఠంబునకరిగిననారాయణుఁడుప్రళయకా లరుద్రునిమాడ్కిం దేజరిల్లునద్దానవేంద్రుంజూచి తనలో "ఈతనినెదిరి గెలుచుట యసాధ్యము కావున నిప్పుడతనికిఁ గానబడకుండనదృశ్యుం డ నగుటకర్తవ్యము" అని నిశ్చయించిసూక్ష్మరూపంబుధరియించియా రక్కసునిహృదయాంతరాళమునఁ బ్రవేశించెను. అంతనారక్కసుఁడు

నైకుంఠంబంతయు వెదకివేసారి యెందును వెన్నునిగానక భూమియు నాకసమును మహాసముద్రములను బాతాళలోకమును బరీక్షించిగోవిందు నెందుఁ బొడగనక యాతండు చచ్చియుండునని నెమ్మనమ్మునవిశ్చయించి చచ్చినవారిపైఁ బగబూనుటయధర్మంబనియు వానికొఱకై వెదకుటనిష్ప్రయోజనమనియుఁ దలంచి యూరకుండె. జగన్నాథుని కైన వెఱపుగొలిపిన యక్కజపుమగటిమిగల మేటిమగని నీప్రపితామహుని దలంప నిప్పటికిని లోకములువడంకు. అదియటుండ మీతండ్రియైన విరోచనుండు భువనైకవంద్యుఁడు. దేవేంద్రాదులు బ్రాహ్మణవేషములతోవచ్చి వేఁడుకొన నతఁడు తనయాయువునిచ్చివేసెను. అట్టిదాతలు మున్నెన్నఁడైన నెందైనఁగలరె? ఈయాచార్యమునీకును నీవంశజులకుం జెల్లె. నీవు వేల్పులం దోలితివి. ముజ్జగముల నేలితివి. దానగుణమున పూర్వులంబోలితివి. దానవకులమును రక్షింపఁజాలితివి. ఐశ్వర్యంబుల ప్రయోజనంబేమి? తనకుఁగలసంపదలఁ బేదలకును విద్వజ్జనులకును బెట్టికుడువడేని నాతని సంపదలు నిరర్థకములు దాతల నెన్నెడుచో నిన్నె ముజ్జగంబులవారు మున్నెన్నుదురు. అందుచే నిన్ను యాచింపవచ్చితిని. ఈవఱకు నాపాట్లు నేబడుచుంటినిగాని నిన్నెన్నఁడు వేడరాలేదు. నేనాలుబిడ్డలు లేనివాఁడను కనుక నాకువిశేషమైన యాశలేదు. ఒకటి రెం డడుగులనేల నాకిచ్చితివేని నదియనాకుఁ జాలును. అదియే బ్రహ్మాండముగా నే నెంచి సంతోషింతును మూఁడడుగుల నేలకన్న నాకేల" అని పలుకుచున్న యుపేంద్రునకు దానవేంద్రు డిట్టులనియె.

"విప్రకుమారా! నీమాటలు ముద్దులమూటలు. నీవుచెప్పిన దంతయు నిజమె. కాని యింతస్వల్పమునడుగవచ్చునా? ఈవలనున్న దాతవైభవమైనం జూడక యడుగవచ్చునా? గజరథతురంగాదుల నడుగవు. అంగనాజనుల నపేక్షింపవు ధరణీరాజ్యము దలపెట్టవు.

అగ్రహారములనాశింపవు. ధనకనకవస్తువాహనంబుల దయసేయుమ నవు. పిన్నవాఁడవగుట నన్నడుగనేరకున్నాఁడవు ఇంకొకసారి నీలో నీవాలోచించుకొని మఱేదైన నడుగుము. అడుగుటకు నీమనసొప్పి నను మూఁడడుగులనేల మిక్కిలి చిన్నవాఁడవగుటచే నిచ్చుటకు నా మనసొప్పకున్నది." అనిన మందహాసంబు మొగమున నంకురింప మాయామాణవకుఁడు దనుజకులేంద్రున కిట్లనియె.

"రాజేంద్రా! నాకగ్రహారములేల? యంగనలేల? అందలము లేల? యశ్వములేల? మదగజములేల? మాణిక్యములేల? నేనొంటివాఁ డనని నాకెవ్వరులేరని మున్నవిన్నవించితి. నాకుగావలసినది యొంటి జందెపుపోఁచ ధర్భాసనము కృష్ణాజినము, కమండలము, దండము మొదలగునవి. అవి యీనాఁటికేయున్నవి. మూఁడడుగులనేల మాత్ర మేనాకుఁగావలయు. మూఁడడుగులిచ్చుట ముజ్జగములిచ్చుట. రాజా! "అసంతుష్టాద్విజానష్టాః". అనునార్యోక్తింబట్టి సంతుష్టిలేనిబ్రాహ్మ ణుఁడు చెడిపోవు. తృప్తిలేనివానికి సప్తద్వీపవిశాలమైన భూమండల మంతయు నిచ్చినను దనివియుండదు. తుష్టిగలవాఁడు తృణముమహా మేరువుగా భావించిసుఖించు. ఆశయనుత్రాడు కడుదీర్ఘమైనది. ప్ర పంచమున దేనికైన నంతమున్నదిగాని యాశాపాశమునకు మేఱ లేదు. ఆశాపాశబద్ధులగుటచేతనేగదా మహారాజులు తమకున్ననేల తోఁ దనివినొందక ప్రపంచమునందున్న దేశములనెల్ల జయించి సా ర్వభౌములై చక్రవర్తులై యుండఁగోరుదురు. ఆశాపిశాచపీడితులగు టచేతనే గదా దండయాత్రలపేరుబెట్టి గ్రామములు కొల్లబెట్టివేలకొ లఁదిలక్షలకొలఁది జనులంజంపి గృహారామక్షేత్రముల నాశనముచే యుట. దిగ్విజయములుచేసి పూర్వరాజులాశాంతములు జూచిరిగాని తమయాశలకంతముఁ జూడరైరి. సంతుష్టుఁ డెల్లదేశములఁ బూజ్యు డు. సంతోషి యెల్లప్పుడు సుఖించుచుండును. అసంతుష్టిదుఃఖహేతువు.

సంతుష్టుఁడుపుష్టిగలిగి నిరంతరము కళకళలాడు ముఖవిలాసముఁగలిగి యుండును. పరితోషంబులేకపోవుటచే నరుఁడు తెగులులేని వేదనం బొంది కృశించును. చెలుకుతీపియని మొదలంటఁ బెలుకవచ్చునా? ఇచ్చెడువాఁడవు నీవున్నవాఁడవని కావలసినదియు నక్కఱలేనిదియు నడుగవచ్చునా? నాస్థితికెంతదగునో యంతేయడిగితిని. లేదనక యీ మూఁడడుగులిచ్చినం దనివినొందెద." అనివామనుండుపలికిన దానవ చక్రవర్తి వానికి మూఁడడుగులు నేలయు ధారాపూర్వకముగా దానముసేయఁదలంచి జలకలశంబుచేఁబట్టుకొన వక్రబుద్ధియగు శుక్రుఁ డిట్లనియె.

"దానవేశ్వరా! నీవుభూసురునకు దానమిచ్చుచుండ వలదని చెప్పుట యుక్తముగాదు. అయినను నీకునేను పురోహితుండ నగుటం జేసి నీహితంబుఁగోరియొకమాట చెప్పెద. ఈతఁడు నిజముగా బ్రాహ్మణుఁడుగాఁడు. నీచేతఁ బరాజితులైన యింద్రాదిదేవతలకు మేలు సేయఁదలచి యదితికశ్యపులకు నాత్మజుఁడై కుజ్జురూపమునఁబుట్టినాఁడు. కపటోపాయంబున నిన్నడంచి నీసిరియు, నీరాజ్యము సుత్రాముసకిచ్చును. ఈగొడవ నీవెఱుగక యడిగినదెల్ల నిచ్చెదనంటివి. ఇతఁడు మూఁడడుగులతో విశ్వమెల్లనాక్రమించి నిన్నడఁగఁద్రొక్కును. దానవసంతతికుపద్రవము వాటిల్లును అంతయు విష్ణుదేవుని కర్పించి బడుగులాగున నీవెట్లుబ్రతుకుదువోయని విచారించుచున్నవాఁడ. పైకితఁడుగుజ్జులాగున నున్నాఁడుగాని యొకయడుగుననింగియు నొకయడుగున నేలయు నాక్రమించి విశ్వమంతయునిండిపోవును. అప్పుడు నీకేమిగతి? నీదెసఁజూచువారెవరు? నీమొఱ నాలకించువారెవరు? మొదట నిచ్చెదనని యాచకునకీయకుండుట నరకహేతువు అయినను దనకు నాశనకరమైనదానముచేసెదనని పిదపచేయకున్నను దోషంబు గాదని ధర్మవేత్తలు పలుకుదురు. దానము తపస్సు యజ్ఞము గర్మము

మొదలగునవి పౌర్వాపర్యములు విచారించి నానాగాములవితర్కించి సామర్థ్యమున్నవాఁడుచేయవలయు.తనకుమాలినధర్మంబును మొదలుచెడిన బేరమును లేదుగదా! కావున నీకువినాశనకరమైన యీదానమును జేయవలదు. మాటదప్పితినని మనస్సునవిచారింపకుము. మోసగానిని మోసముచేతనే వంచింపవలయు. వంచిపఁదలఁచినవానిని వంచించుట దోసంబుగాదు. ఇతఁడు జగద్వంచకుఁడై వచ్చెను. దేనివలనఁ దనకు గల సమస్తంబును బోవునో యట్టిదానివిషయమున ననృతమాడినను దోషములేదు. ఆత్మయను వృక్షమునకు ననృతమేమూలము. ఆమూలముండగా నాత్మచెడదు. ఆత్మవృక్షమునకు సత్యమే పువ్వుపండ్లునై యొప్పు. ఆమూలినునశించిన నాపువ్వులు పండ్లునశించును. పువ్వులు పండ్లు లేకపోయిననుదృఢమగు మూలంబుకతమున వృక్షము వర్థిల్లుచుండును. నోటమాట వెడలినదిగదాయని ముందువెనుకలు విచారింపకుండ నిచ్చితివేని నీవు చెడుట నిశ్చయంబు. ఇట్టియెడ ననృతంబువలన దోసంబులేదుచూడు.-

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణవిత్త మానభంగములను
జకితగోకులాగ్రజన్మరక్షణమందు
బొంకవచ్చు నఘమువొందఁడధిప.

కావున నామాటలువిని కులము రాజ్యము నశింపకుండ నిలుపుము. ఈకుబ్జుఁడు దేవదేవుఁడైన విష్ణుఁడు. సామాన్యయాచకుఁడు గాఁడు. ఊరక మూఁడడుగులుపుచ్చుకొనిపోవఁడు. ఆనెపంబున ముజ్జగంబుల నాక్రమించి నీకొంపదీయును. ఈయాపద నివారించు వాఁ డెవ్వఁడు లేఁడు. దానముగీనములేదని పొమ్మని యీబ్రహ్మచారిని వచ్చినదారినిఁ బంపుము." అని హితంబుపదేశముచేయుచున్న దానవకులా

చార్యునిపలుకుల నాలకించి కన్నులుమూసికొని క్షణమాత్రకాల మాలోచించి బలిచక్రవర్తి యిట్టులనియె.

"మహాత్మా! మీరు వక్కాణించినదంతయు నిక్కంబు. అయినను సంపన్నగృహస్థుఁడనై యర్థి యేదియాచించిన దాని నిచ్చెదనని ముందుమాటయిచ్చి పిదప లేదనుట యుక్తమగునే? ఆడినమాట దప్పుటకంటె మహాదోషమున్నదే? ఎట్టిదురాచారునినైన నేను భరియింపగలనుగాని, యనృతంబుపలికెడువాని భరింపనోపనని భూతధాత్రియైన భూదేవి తొల్లి పరమేష్ఠితోఁ బలుకలేదె? మానవునకు యశస్కరములైన కార్యములు రెండుగలవు. రణరంగమునుండి పాఱిపోవక చచ్చుటయు ఆడితప్పక యడిగినయర్థులకిచ్చుటయు కృషీవలునకు మంచినేలయు, విత్తనములు నొక్కసారిదొరకినట్లు, దాతకు దానపాత్రుఁడును దానము సేయవలెనను బుద్ధియు నొక్కసారి లభించుట యదృష్టము గదా? అదియునుంగాక—

శా. కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూటగట్టికొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనంగలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరో యిక్కాలమున్ భార్గవా.

వెండియు నొక్కమాట వినుము. క్రతువులచేతను, వ్రతములచేతను, దీర్ఘయాత్రలచేతను, దపములచేతను మహనీయులైన మహర్షులును బితామహాదిబృందారకశ్రేష్ఠులును నెవ్వనిసందర్శింపఁజాలరో యట్టి దేవదేవుఁడు పొట్టివడుగై నన్ను యాచింపవచ్చిన నడిగినది నేనియ్యఁగూడదా?

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ

ర్యాదంజెందుకరంబు గ్రిందగుట మీఁదై నాకరంబుంట మేల్
గాదే! రాజ్యముగీజ్యముస్ సతతమే కాయంబు నాపాయమే.
మ. నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నాఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్.
అదియటుండనిమ్ము. అనినయట్లు నేనిచ్చుచుండ విష్ణుండు కోపించి నన్నేలబాధించు? బాధించినను దయామయుఁడై విడుచును. విడువ కున్నను నేనుధన్యుఁడనే. ఆచార్యా!పలుమాటలేల!నాప్రతిజ్ఞవినుము. మేరుపర్వతము తలక్రిందైనను, ధరణీమండలము పరమాణురూపమై నను, సముద్రములెల్ల నింకిపోయినను, కులశైలములు క్రుంగినను, సూర్యచంద్రులు గతులుతప్పినను నేననినప్రకార మీవటువునకు దాన మిచ్చితీరెదను. మఱియు నితఁ డెవ్వఁడిని వేఁడఁబోఁడు. చూపు లకుఁ జిన్నవాఁడై యున్నవాఁడు. తల్లిదండ్రులు నాలుఁబిడ్డలులేరు. ఇట్టి పిన్నవాఁడు ముద్దుముద్దుగా మూఁడడుగులనేల నడిగినలేదనిత్రోసి పుచ్చుట కెంతకఠినాత్మునకైన మనసొప్పునే? ఇంకొక్కమాటకూడ గలదు. మీరాగ్రహింపకుండ వినవలయు. మీరు గురువులరు. ధర్మోప దేష్టలైయుండవలయు. అజ్ఞుఁడై శిష్యుఁడు సూనృతమార్గంబు దప్పి యనృతంబున కొడిగట్టిన వానితప్పులు దిద్ది మంచిదారినడపించుటకు మాఱు మీరేయపమార్గంబున వర్తింపుమని యనృతంబు వలుకు మని యఘంబుచేయుమని యుపదేశింపవచ్చునా? సత్యంబునిత్యంబు. అదియే బ్రహ్మము. అదియే లోకాధారము. "సత్యమేవ జయతే నానృతమ్" మ్మను వేదవాక్కులు వినలేదే? కావున నాకు మీరు హి తోపదేశంబు చేయవలదు" అని కఠినంబుగాఁబలికి యాచార్యవచన విముఖుఁడై దానవేంద్రుఁడు దానాభిముఖుఁడైయున్న భార్గవులు

వానికలిగి "పురోహితులమై మేము కావించిన ధర్మోపదేశంబు పెడ చెవింబెట్టి నిరాకరించితివిగావున నీవుతప్పక రాజ్యభ్రష్టుండ వగుదువు గాక!" యని శపించిరి. గురువులకోపముగాని, శాపముగాని, దనుజ నాయకుని ధర్మపథంబునుండి దప్పింపలేకపోయె.

ఆహా! సూనృతవ్రతానుష్ఠానముగల మహనీయులకు వెఱపు గలుగునే?

ఆ. బ్రదుకవచ్చుఁగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు.

అప్పుడు భర్తయగు దానవభర్తకనుసన్న సేయ ధర్మపత్ని వింధ్యావళి హేమకలశమ్ముతో నీరుదెచ్చెను. దానవనాయకుఁడు మాణవకుని కాళ్ళుఁ గడుగఁదలంచి "విప్రకుమారా! రమ్మురమ్ము. నీపాదము లిటుదెమ్ము. నీవడిగినదానము లేదన కిచ్చుటకై నీకాళ్ళు గడుగనిమ్ము." అనిపిలుచుటయు వామనుఁడు మందాకినీనదికి జన్మ స్థానమై, యోగీంద్రసమర్చితమై పరమపావనమైన తనపాదములను బలిక్షాళనార్థమిచ్చెను. అసురనాయకుఁడును జగదాలంకరణమై నిర్జర శ్రీకరణమైన యాచరణమును గడిగి యాజలంబు శిరంబునఁజల్లుకొని సంధ్యావందన మాచరించి దేశకాలపరిస్థితులం బరిగణించి "విప్రాయ ప్రకటవ్రతాయభవతే విష్ణుస్వరూపాయ, వేదప్రామాణ్యవిదే త్రిపాద ధరణిం దాస్యామి" యని బలిహస్తార్పణంబుగా మూఁడడుగుల నేల యు దానమిచ్చెను. దానమిచ్చునప్పుడు బలి వామనునిచేత నుదకము బోయుచుండ జాఱికొమ్మునుండివచ్చు నుదకధారకు శుక్రాచార్యులు కామరూపియై యడ్డమురాఁగ వామనుఁ డది తెలిసికొని దర్భతో జాఱికొమ్మును బొడిచెను. ఆదర్భపోటున శుక్రాచార్య నేత్రమును దగ్గి

లెను. అందువల్ల నతనికన్ను పోయెను. నాఁటనుండియు శుక్రాచార్యుఁడేక నేత్రుఁడయ్యెను.

రమావల్లభుఁడైన వామనుఁడు కాలవశమున దేవవైరియొసగు దానవారికిఁ జేయొగ్గి దానముపట్టెను. బలిచక్రవర్తి యెఱుకలేక యీదాన మొసంగలేదు. వచ్చినవాఁడు వనజాక్షుఁడని యెఱిఁగి దేశకాలపాత్రముల నెఱిఁగి కులాచార్యుఁడైన శుక్రునిమాటల సారమునెఱిఁగి తనకు మూడఁదలఁచిన కీడు నెఱిఁగి యెట్టులైనను సరేయని యతఁడాదానము చేసెను. బలివంటి దాత మఱియొకఁడు భూతలంబునం గలఁడా? ఆదానమునకు జగన్నాథుఁడగు నారాయణుఁడు సంతసించుటంజేసి దేవతలు సంతసించిరి. సకలభూతములు సంతసించెను. అప్పుడు పుష్పవర్షంబులు గురిసెను. గంధర్వులు గానముచేసి యాడిరి. దానము గ్రహించినంతటనే పొట్టివడుగు క్రమక్రమంబుగఁ బొడవై యంతయై యంతకంతయై యంతకుమించి మఱింతయై యింతయని యంతయని యెంతవారును వర్ణింపలేనంత వింత యాకారముఁగలిగి విశ్వవ్యాపకుఁడన్న పేరు సార్థకముజేసెను. అతఁడు క్రమక్రమముగఁ బెరుగునప్పుడు సూర్యబింబము మొట్టమొదట గొడుగై పిదప శిరోమణియై యవ్వల కర్ణాభరణమై పదపడి కంఠాలంకారమై యటుపిమ్మట బంగారు దండకడియమై యనంతరము హస్తకంకణమై యాదటనడుమునకుఁ దొడవై తరువాత కాలియందెయై యంతట పాదపీఠమై కానఁబడెను. అప్పుడా విశ్వరూపంబీ తెఱంగున భాసిల్లెనని యాంధ్రభాగవతమున వర్ణింపఁబడెను.

ఇట్లు విష్ణుండు గుణత్రయాత్మకంబగు విశ్వరూపంబు ధరియించిన భువియును నభంబును దివంబును దిశలును దిశాచ్ఛిద్రంబులును, సముద్రంబులును జలదఖిలభూతనివహంబులుం దానయై యేకీభవించి క్రమక్రమంబున భూలోకంబునకుం బొడవై భువర్లోకంబును డల

కడచి మహర్లోకంబుదాఁటి జనోలోకంబునకు మీఁదై తపంబునకు నుచ్ఛ్రితుండై సత్యలోకంబుకంటె నౌన్నత్యంబు వహించి మెడ లిఱుములు సందులు రంధ్రంబులు లేకుండ నిండి మహాదేహహి తుండై చరణతలంబున రసాతలంబును, బాదంబుల మహిమయును, జంఘల మహీధ్రంబులును జానువులఁ బతత్త్రిసముదయంబులును, నూరువుల నింద్రసేనమరుద్గణంబులును జఘనంబున దనుజులును నాభినిసభంబును నుదరంబున నుదధిసప్తకంబులును నురంబునఁ దారకానికరంబును హృదయంబున ధర్మంబును నురోజంబుల ఋతుసత్యంబులును, మనంబునఁ జంద్రుఁడును, వక్షంబునఁ గమలహస్త యగు లక్ష్మియుఁ గంఠంబున సామాదిసమస్తవేదంబులును భుజంబులఁ బురందరాదిదేవతలును, గర్ణంబుల దిశలును శిరంబున నాకంబును శిరోజంబుల మేఘంబులును, నాసాపుటంబున వాయువును, నయనంబుల సూర్యుండును, వదనంబున వహ్నియు, వాణి నఖిలచ్ఛందస్సముదయంబును, రసనంబున జలేశుండును, భ్రూయుగళంబున విధినిషేధంబులును, ఱెప్పల నహోరాత్రంబులును, లలాటంబునఁ గోపంబును, నధరంబున లోభంబును, స్పర్శంబున గామంబును బృష్ఠంబున నధర్మంబును, గ్రమణంబుల యజ్ఞంబులును, ఛాయల మృత్యువును, నగవున ననేక మాయావిశేషంబులును, రోమంబుల నోషధులును, నాడీప్రదేశంబుల నదులును, నఖంబుల శిలలును, బుద్ధి నజుండును, ప్రాణంబుల దేవర్షిగణంబులును, గాత్రంబున జంగమస్థావరజంతుసంఘంబులును, గలవాఁడయి జలధరనిభ శంఖశార్ఙ్గసుదర్శనగదాదండఖడ్గాక్షయబాణతూణీరవిభ్రాజితుండును, మకరకుండలకిరీటకేయూరహారకటక కంకణకౌస్తుభమణిమేఖలాంబరవనమాలికా విరాజితుండును, సునందనందజయవిజయప్రముఖపరిచరవాహినీసందోహపరివృతుండును, నసమానతేజోవిరాజితుండును, నై బ్రహ్మాం

డంబు దసమేనికప్పా తెఱంగున నుండ విజృంభించి” వామనుఁ డొక పాదమున భూమి నాక్రమించి దివము మఱియొకపాదంబున నాక్రమించి తనశరీరమంతయు బ్రహ్మాండమునిండి వేఱొకటి గానరాకుండునట్లు, నవాఙ్మానసగోచరుఁడై యుండె. ఆతనిపాదములు రెండును గొప్ప తామరపూవులంబోలియుండ భూమి యొక తమ్మిపూరేకున నంటిన మన్నువలె నొప్పె; ఆకాశము రెండవతమ్మిపూవుపై వ్రాలిన గండుతుమ్మెదయట్లు విలసిల్లెను. అప్పుడు సత్యలోకంబున వసియించు బ్రహ్మర్షులును వైకుంఠంబున నివసించు సనకసనందసనత్కుమారాదులు, రాజర్షి దేవర్షి గణములును మరియు నాయాలోకముల మూర్తిమంతములై విరాజిల్లువేదములును బురాణేతిహాసములును, మీమాంసాదిశాస్త్రములును, ధర్మశాస్త్రములును, వెండియు జ్ఞానాగ్నిచేత సకలకర్మలు దగ్ధంబుచేసిన బ్రహ్మవేత్తలును గుంపుగుంపులై వచ్చి యాదేవదేవుని పాదములకు నమస్కరించి “ధన్యులమైతిమి. మాసకలపాపంబులు నశించె” నని మేఱమీఱిన యానందమున నుప్పొంగిరి. ఆసమయంబున బ్రహ్మయు దేవేంద్రాదిదిక్పాలకులు పుష్పముల లాజల నక్షతల నతని నర్చించి కృతార్థులైరి. వనచరనాయకుఁడైన జాంబవంతుఁడు భేరితో విష్ణుదేవుని విజయమును చాటించెను. కంటికందక మనస్సునకందకయున్న యామహాత్ముని మహనీయులైన పురుషులందఱు సన్నుతించిరి.

అంతట నారాయణుఁడు బ్రహ్మాండమంతయు నిండిన తన విశ్వరూప ముపసంహరించి యెప్పటియట్ల వామనుఁడై యెల్లవారు నచ్చెరువడునట్లు యజ్ఞవేదికపైఁ గూర్చుండెను. అప్పుడు బలిచక్రవర్తి చుట్టములగు హేతి, ప్రహేతి, విప్రచిత్తి మొదలగు నసురనాయకులు నానావిధాయుధముల హస్తములఁబూని “వీఁడె మనచక్రవర్తినడంచి దానవసామ్రాజ్యమంతయు నక్కవంబున నపహరించిన పాపా

తుఁడు. మన దైత్యవల్లభునివలన నేర మెద్దియులేదు. అతఁడు మాయయు మర్మమునెఱుఁగని మహానుభావుఁడు. ఈపొట్టిటెంగణపొట్ట నిండ పుట్టెడు దుర్బుద్ధులుగలవు. వీనిపొట్ట పొడిచివెయ్య వీని నిర్మూలించుట కర్తవ్యము రండు రం" డని యొండొరుల బిలుచుకొనుచు నాతనిపైఁ గవియ సమకట్టిరి. అత్తఱి నారాయణానుచరులగు సునందుఁడు, నందుఁడు, జయుఁడు, విజయుఁడు మొదలగు నిత్యముక్తులు వారల నుక్కడంచి పరలోకంబున కనుప జతనంబులు సేయుచుండ బలిచక్రవర్తి వారల నుద్దేశించి యిట్లనియె.

"దానవులారా! మీసంరంభంబులు గట్టిపెట్టుఁడు. కయ్యము మన కిది కాలముగాదు. పరాత్పరుఁడే మనలం బరిభవింప నింక మనకు గతియేమి? ఇంతదనుక మనల గెలిపించి త్రైలోక్యసామ్రాజ్యంబు మనవశంబుఁ జేసిన జగదీశ్వరుఁడే మరల మనల నధోగతి పాలుచేసెను. ఇది మనయదృష్టలోపంబును దుర్దినముల బలమును గాక వేఱొండుగాదు. ఇదివఱకు మనచే నెన్నిసారులో పరాజితులైన వేల్పులు మనల నిప్పుడు గెలుచుట మన దినములపరిభావము గాని మఱియొకటిగాదు. మనకు మంచిదినములు మరల వచ్చినప్పుడు వారిని గెలువవచ్చు. అంతవఱకు నడఁగియుండుట కర్తవ్యము. మేటికోటలు బుద్ధిమంతులగు మంత్రులు మూలబలములు ధనములు మొదలగు నవెన్నియున్నను రాజు దేశకాలముల నెఱిఁగి పోరవలయు నుగాని, సాహసము చేయఁజనదు."

అప్పలుకులు విని రక్కసులు మిక్కిలి భయంపడి రసాతలమునకుఁ బోయిరి. అప్పుడు గరుత్మంతుని కొమారుఁడు నారాయణుని చిత్తవృత్తినెఱిఁగి వరుణపాశములతో బలిం గట్టివైచెను. తనచేతులు కాళ్లు బంధింపఁబడినను బలి యదియంతయు హరియనుగ్రహమేయని భావించి కాలగతి తప్పినప్పుడు చేయునదిలేదని యూరకుండెను. ఎల్ల

చోటుల హాహారవ మెసఁగెను. అట్టి దీనదశలోనుండియు బలి ధైర్యమును విడువక గంభీరభావుఁడై యుండుటఁజూచి వామనదేవుఁడిట్లనియె. "దానవేశ్వరా! మూఁడడుగులనేల నిత్తునని నాకు మాటయిచ్చితివి. భూమ్యాకాశ మధ్యస్థమైన ప్రదేశ మంతయు నాకొక్క యడుఁగయ్యె. స్వర్లోక మంతయు రెండవ చరణమయ్యె. మూఁడవయడుగునకుఁ దావు జూపుము. ఇచ్చెదనని వాగ్దానముచేసి యీయకుండినవాఁడు నరకమునకుఁ బోవఁదగును. కావున నాకు మూఁడవయడుగునకు నెలవు జూపిననుసరే, జూపక దుర్గతికిఁ బోయిననుసరే. ఇం దేది నీకిష్టమో యట్లుచేయుము." అని మాధవుఁడు పలుకుటయు బలి చెక్కుచెదరక భయంబు నొందక తన కనృతదోషంబు వాటిల్లునేమో యని శంకించుచు దానవవైరి కిట్లనియె. "సత్యమునేగాని నానాలుకపలుకదు. అనృత మెట్టిదియో నే నెఱుఁగను. నేనెన్నఁడు బొంకి యెఱుఁగ. మూఁడవ యడుగు నాశిరమునం బెట్టుము. అంతకన్న నేను నెలవుజూపఁజాల. దేవా! నేను బొంకునకు వెఱచినట్లు నరకమునకు వెఱువ. నీయాగ్రహమునకు వెఱువ. బంధనమునకు వెఱువ. మరణమునకు వెఱువ. అదియునుఁగాక పరమాప్తులైన తల్లిదండ్రులు సోదరులు చుట్టములు గురువులు దండింతురేని దానివలన నష్టమేమి? అది లాభంబె గలుగఁజేయు. నీవు జగత్పితవుగావున దోషులను దండింప సమర్థుఁడవు. మెండియు మదాంధులమైన దానవులకు మాకు నీవిధముగా గర్వం బడంచి జ్ఞానోపదేశంబు గావించితివి గావున నీవు పరమగురుఁడవు. నీవు బంధించుటచేత నాకు బాధలేదు. అవమానములేదు. నీతో విగ్రహించి నిన్నెదిరి పోరాడి దానవేంద్రు లనేకులు పరమయోగీంద్రులైనను బడయరాని, యుత్తమపదంబులు బడసిరని మే మెఱుఁగుదుము. నీయనుగ్రహము బడసినను

నిగ్రహము బడసినను మోక్షంబు సులభంబుగాఁ జేకూఱు. దార పుత్రాదులు ఋణస్థులు, చుట్టములు చోరులు. ధనము లస్థిరములు. అంగనాజనులు సంసారహేతువులు. శరీరము క్షణభంగురము. ఆయు రైశ్వర్యములు సెలయేళ్లవలె నతిశీఘ్రంబున సమాప్తమగు. ఇవి యన్నియు నెఱిఁగి మాతాతయైన ప్రహ్లాదుఁడు తన తండ్రిని ధిక్కరించి నీచరణసేవకుఁడయ్యె. మాపూర్వులలో ననేకులు నీతోడ వైరంబు పూనిరి. నీవు యాచకుఁడవై వచ్చి నన్ను దానమడిగి నన్ను ధన్యుని జేసితివి. ఇది నాభాగ్యము. ఇట్టియదృష్ట మెవ్వరికిఁగలుగు?

అట్లనుచుండ సంతలో నక్కడికి భక్తశేఖరుఁడైన ప్రహ్లాదుఁడరుదెంచెను. అట్లువచ్చిన పితామహునిం గనుంగొని బలి పాశబద్ధుఁడగుటం జేసి నమస్కరించుటకుఁ జేతులురామి సిగ్గుపడి బాష్పపూర్ణ నేత్రుఁడై తన వినయభావంబు దెలియఁజేయుటకు శిరము వంచెను. అంతటఁ బ్రహ్లాదుఁడు యజ్ఞవేదిపై సనకాదిదివ్యయోగులు బరివేష్టింపఁ గూరుచున్న త్రివిక్రమదేవునిసన్నిధి కరిగి పరమభక్తి నమస్కరించి యిత్తెఱంగున విన్నవించెను. “దేవదేవా! నీవు మున్నితనికి మహేంద్రపదవి నిచ్చి మరల నీవ దానిం దీసికొంటివి. అదియు నిదియు నీయనుగ్రహంబ. జ్ఞాని కింద్రాధిపత్యమెందుకు? సర్వలోక సామ్రాజ్యమెందుకు? నీయడుగులు గొల్చి నీయనుగ్రహమువలన లభ్యమైనసంపద గుడుచుచు సంతుష్టి గలిగి సుఖంబుననుండ రాదె? సంపదలు గర్వము హెచ్చుచేయును. దానివలనఁ గన్నులు గానరావు. చెవులు వినరావు. చిత్తవృత్తి చెడును. నీవు మాపిల్లవానిని రాజ్యపదభ్రష్టునిం జేసి మహోపకారంబుచేసితివి.”

అట్లు ప్రహ్లాదుఁడు విన్నవించు సమయమున బలి దానవుని ధర్మపత్ని వింధ్యావళీదేవి దీనవదనయై యచ్చోటి కేతెంచి నారాయణునకు నమస్కరించి యిట్లనియె. “దేవదేవా! నీకన్న లోకేశ్వ

రుఁడు లేఁడు. లోకములన్నియు నీక్రీడామందిరములు. నావల్లభుఁడు రమావల్లభుండవగు నీవు యాచింపవచ్చినప్పుడు నీకోరిక లేదనలేదు. కాదనలేదు. నీ వడిగినదంతయు తృణప్రాయముగ నిచ్చెను. త్రైలోక్యరాజ్యంబు నిస్సంశయముగా నీకుం ధారవోసె. అట్టి నాపతిని దయావిహీనుఁడవై కట్టనేల? ఇట్టిమహాదాత దండయోగ్యుఁడగునే! నీవు ధర్మస్వరూపుఁడవు. కావున నీతని బంధవిముక్తునిజేసి యనుగ్రహింపవలయు" నని యామె విన్నవింప బ్రహ్మదేవుఁడును బ్రహ్లాదుఁడును నట్ల యనిరి. అప్పుడు నారాయణుఁడు వారి కిట్లనియె. "ఈతఁడు మేటిదాత యనుమాట నిజము. ఐనను బలగర్వంబున విజృంభించి తనకుఁగల సంపద కుడిచి సంతుష్టుఁడుగాక నిరపరాధులగు నిర్జరులమీద దండయాత్రలుసలిపి దుర్నయంబున వారి యైశ్వర్య మపహరించి నెలవులనుండి వారిం దోలెను. ఎట్టి దాతయైనను నెట్టిసుజనుఁడైనను నపరాధులగు నితరులం జెఱచునేని వాఁడు తప్పక దండ్యుఁడు. అది కారణముగా వీని నిప్పుడు దండింపవలసె. లోభము సర్వపాపహేతువు. అట్టి లోభి నాకనిష్టుఁడు. ఇతఁడు రాజ్యలోభంబున జేసిన పాపంబునకు ఫలం బనుభవించె. ఇతని సూనృతవ్రతమునకు నేను గడుమెచ్చితి. హరిశ్చంద్రుని వెనుక నింతటి సత్యనిరతుండు లేఁడు. సావర్ణిమనువుకాలమున నితఁడు దేవేంద్రుండగు. అప్పు డితఁడు దేవతలచేత సంభావితుఁడగు. అప్పు డీతనిం గరుణించెద. ఇతఁడంతవఱకు సుతలమునకు రాజై యుండును. అక్కడ నితనికి వ్యాధులు బాధలు మొదలగుపీడ లుండవు. ఓబలిదైత్యేంద్రా! ఇట్లు చేసితినని నీవు వెఱువకు. నీవితరణంబు తెలుపుటకైనను లేదు. నీవు సుతలాధిపతివై యుండుము. సకలదానవులు నీకు విధేయులై భృత్యులై యుందురు. నీయాన మీఱిన దుష్టరాక్షసులను నాచక్రంబున ఖండించెద. నిన్ను దిక్పతులైనఁ దేరిచూడఁజాలరు. నేను ననవరతము

నిన్ను రక్షించుచుండెదను. నీకెల్ల శుభంబులగు. రాక్షసభావము నశించి నీమనమున దేవభావము నెలకొనును."

అనవుడు బలి యానందపులకితదేహుఁడై చేతులు జోడించి హరి నుద్దేశించి యిట్లనియె. "నీవు దిక్పాలురమీఁదనైన నింతయను గ్రహ మెన్నఁడు జూపియెఱుఁగవు. నన్ను సంపూర్ణముగాఁ జెఱుపక బుద్ధిచెప్పి మహైశ్వర్యమును నొసఁగితివి. నీయనుగ్రహముగలవారికి వెలితియుండునే?" అని కృతజ్ఞుఁడై హరి నుతియించి యచ్చటనున్న పద్మగర్భునకును, రాజశేఖరునకును దక్కిన దేవతలకును మ్రొక్కి వింధ్యావళీసమేతుఁడై దానవపరివారంబునుంగూడి సుతలలోకంబున కరిగె. వామనుఁ డట్లు బలినడంచి త్రైలోక్యసామ్రాజ్యంబు తన యన్నయగు నిందురునకు మరల నిచ్చి యదితికశ్యపులకును దేవతలకును మహానందంబుగూర్చెను.



# రంతిదేవుఁడు

పూర్వకాలమున రంతిదేవుఁడను రాజుండెను. అతఁడు మహాదాత. తనకుఁగల ద్రవ్యమంతయు నతఁడు దీనులకు నిఱుపేదలకు నిచ్చి యతిదీనుఁడై యన్నవస్త్రములు లేక సకుటుంబుఁడై నలుబది యెనిమిదిదినములు సంచరించెను. రాజ్యమును బుద్ధిపూర్వకముగ విడిచి ధనమంతయు దానముచేసి కావయునని పేదయైన యామహానుభావునకును నాలుబిడ్డలకును దేశమునఁ బట్టెడన్నము పెట్టి పురిసెడు నీరు వోయువారు లేకపోయిరి. కాలగతిని వచ్చినమార్పులకుఁ బ్రతిక్రియ సేయఁజాలినవాఁ డెవ్వఁడు లేఁడు. మానవుఁ డెంతయైశ్వర్యమనుభవించినను వానియం దెన్నిసుగుణములున్నను లోకులు వానితొంటివిభవము దలంపరు. వాని గుణగణముఁ బరిగణింపరు.

ఒకనాఁడు పెచ్చుపెరిగిన పేరాఁకలిచేత మిక్కిలి గాసిల్లుచు నతఁడు, నాలుబిడ్డలు నుండ రుచ్యమగు పాయసమును జల్లని నీరును నతనికి దొరకెను. దాహముచేత నాలుక యెండిపోవుచుండుటచేతను, క్షుధానలంబున బేరివులు మాడుచుండుటచేతను నతఁ డాపాయసమును దారపుత్త్రులకు బెట్టి తాను భుజించి నీట దాహముదీర్చుకొనసంకల్పించెను. బిడ్డలు మిక్కిలితమకముతోఁ బాయసమువంకఁ జూడఁజొచ్చిరి. వారి కందఱకు నోళ్లూరఁజొచ్చెను. అంతలో బ్రాహ్మణుఁడొకఁ డతిథియై వచ్చి యన్నముబెట్టుమని యడుగఁ దాను గుడువక, పసిపాపలకైనఁ బెట్టక హరిసమర్పణమని సగ మాభూసురునకిచ్చి యాతని సంతుష్టునింజేసి పంపెను. తక్కినపాయసాన్నమైన భుజియింపవలెనని వారు సమకట్టుచుండ నంతలో నొకశూద్రుఁ డన్నమన్నమని పేరాఁకలితో వచ్చిపడెను. అతనిం జూచి రంతిదేవుఁ

డు మిక్కిలి కటకటంబడి తన యవసరముకన్న వానియవసర మెక్కు డుదని భావించి మిగిలినదానిలో సగ మాతనికి బెట్టి వాని క్షుద్బాధ దీర్చిపంపెను. మిగిలిన యోగిరమైన వేగిరము దినవలెనని వారందఱుఁ బ్రియత్నించుచుండ నంతలోఁ గొన్నికుక్కల వెంటఁబెట్టుకొని యొక్కఁబోయఁ డాఁకలికి నకనకంబడుచు నన్నమును వేఁడెను. ఆయన్న శేషమును రంతిదేవుఁడు నిస్సంశయముగ నాయెఱుకవాని కిచ్చి లేశమైన విచారింపక యీనాఁడు మూఁడుజీవంబుల నిలుపఁగలిగితిఁగదా యని పరమానంద మొందుచుండెను. అంతలో నొక్కచండాలుఁడు వచ్చి ప్రక్కన నిలిచి "మహాత్మా! అతిదాహముచేత నాలుకయెండి పోయినది. మాటాడఁజాలకున్నాను. దగ్గఱ బావిగాని జలాశయము గాని లేదు. అడుగిడు నడవఁజాలకున్నాను. నీకమండలమునఁ జల్లని నీరున్నది. అదిబోసి నాప్రాణముల రక్షింపవలయు" నని ప్రార్థించెను. రాజు దయనీయములైన వాని పలుకులు విని విచారగ్రస్తుఁడై యిట్లనియె. "అన్నా! నిన్నాఁకలియు దాహమును వేధించుచున్నవి. పెట్టవలెనన్నఁ బట్టెడన్నమైన నాకడలేదు. నేనేమిచేయుదును. ఇదిగో! నీవడిగిన నీరు నాకడనున్నది. ఈచల్లనినీరు కడుపునిండఁ ద్రావి ప్రాణముల నిలుపుకొని యెందేనిఁబోయి యన్నముదెచ్చికొని తినుము. క్షుత్పిపాస లెల్ల దేహధారులకున్నది. అవి లభింపక బాధపడు వారికి వాని నిచ్చి ప్రాణరక్షణము సేయుటకన్నఁ బరమార్థముకలదె? నాకు నాబిడ్డలకు నారాయణుఁడే దిక్కు. నారుపెట్టినవాఁడు నీరు పోయకమానఁడు. గర్భములలోనుండు శిశువులకు ఱాతిలోనున్న కప్పలకు కలుగులలోనుండు చీమలకు నెగిరెడు పక్షులకు, ప్రాఁకెడి సరీసృపములకు నాహారమిచ్చి రక్షించునట్టి పరమేశ్వరుఁ డన్నము నాబిడ్డలకిచ్చి రక్షింపకపోఁడు" అని పలికి వాఁడు చండాలుండని సంశయింపక తన కమండలమునందున్న మధురాంబువులను వాని పా

త్రిం బునం బోసెను. వాఁడును తియ్యనిపానీయంబులఁ ద్రావి ప్రాణ రక్షణంబు చేసికొనియె.

అప్పుడు బ్రహ్మమొదలగు దేవతలు వానియెదుట సాక్షాత్కరించి యిట్లనిరి :—"రాజా! నీవు మహాదాతవని లోకంబునఁ బేరువడసితివి. నీదానగరిమ శోధింపఁదలఁచి మేము బ్రాహ్మణాది వేషములఁదాల్చి నీకడకు వచ్చి యాఁకలిగొన్నట్లు నటించి నీకులభించిన యన్నపానములు నీవనుభవింపకుండఁ జేసితిమి. పలుదినములనుండి యాలుబిడ్డలు నీవు నుపవసించుచుండియు నన్నాతురులైన దీనులు నిన్ను వేఁడినప్పుడు నీవాత్మలాభపరాయణుఁడవు గాక స్వార్థంబు విడిచి పరమార్థమే లోనఁ డలంచ యన్నమంతయు నతిథులకిచ్చితివి. నీరు చండాలునకుఁ బోసితివి. ఆఁకలికి దప్పికి నధమజాతులవారు బాధపడుచున్నప్పుడు వారి నంటరాదని చూడరాదని ద్విజులు వారికి సాయముచేయనొల్లరు. నీవుత్తమక్షత్రియజాతుఁడవయ్యు బహుతపశ్శాలివయ్యు ననేకయాగములుచేసిన కర్మిష్ఠివయ్యు వచ్చినవాఁడు మాలఁడని మనమున శంకింపక నీకడఁగలజలమంతయు వాని పాత్రమునఁబోసి వానిప్రాణముల రక్షించితివి. లోకమున మెఱమెచ్చులే దాతలుగాని నీవంటి నిజమైన దాతలులేరు" అని యాదివ్యు లంతర్ధానమొందిరి. రంతిదేవుఁడు పరమభాగవతుఁడై మహాతపశ్శాలియై వృత్తినొంది పరమేశ్వరైక్యంబు నొందెను.



# సగరచక్రవర్తి

భరతఖండమును బాలించిన షట్చక్రవర్తులలో నితఁడొకఁడు. హరిశ్చంద్రుఁడు నలుఁడు పురుకుత్సుఁడు పురూరవుఁడు సగరుఁడు కార్తవీర్యార్జునుఁడు ననువారె షట్చక్రవర్తులు. సగరుఁడు సూర్య వంశపురాజు. రఘురామునికంటె మిక్కిలిపూర్వుఁడు. అతనితండ్రి పేరు బాహుకుఁడు. ఆమహారాజు వృద్ధుఁడై దుర్బలుఁడైనకాలమున శత్రురాజు లాతనిపై దండువిడిసి యుద్ధమున నోడించి వానిని రాజ్య భ్రష్టునిఁ జేసిరి. పిదప నతఁడు సకుటుంబపరివారముగ మహారణ్యమున కరిగి ముసలియై కడునిడుమలఁబడసి మృతుఁడయ్యెను. ఆయన పట్ట మహిషి చిచ్చుఁజొచ్చి భర్తతో సహగమనముచేయవలెనని సంకల్పింప నౌర్వుఁడను మహాముని యామె గర్భవతియైయుండెనని తెలిసి యా ఘోరప్రయత్నమునుండి యామెను నివారించెను. ఆమెయు దనకడు పున వంశముద్ధరింపఁగల తనయుఁడు జనియింపవచ్చునను నాశచే నగ్నిపరివేశము చేయమానెను. సవతు లామెకడుపునఁ గొడుకు పొడ మెనేని యామె దమకన్న నున్నతపదవిలో నుండునని తలంచి య సూయచే నామె కన్నములో విసముబెట్టిరి. దైవానుకూల్యమున విషభోజనమున నామె చావలేదు. గర్భము విచ్చిపోవలేదు. ఆవిషము గర్భస్థుఁడైన యర్భకుని దేహముననుండెను. గరము అనుశబ్దమునకు విష మర్థము. సగరుఁడనగా గరముతోఁగూడుకొన్నవాఁడు. అందు వలన నతఁడు సగరుఁడనునామమున జగత్ప్రసిద్ధిజెందెను.

అతఁడు సవతుల యీర్ష్యవలనఁ జావక యనేకగండములు గడచి క్రమక్రమంబునంబెరిగి వేదంబును ధనుర్వేదంబును నభ్యసిం చి విలువిద్దియయందు నసమానప్రజ్ఞావంతుఁడై తండ్రిని రాజ్యభ్ర

ఘ్నునిం జేసిన దుష్టుల హైహయవంశస్థులను బర్బరదేశాధిపతులను సమరంబున జయించి వారికరులను హరులను సిరులను నపహరించి వారి తలలు గొరిగించి దిగంబరులం జేసి వనాంతరముల కంపి వసుమతీచక్రమంతయు వశముచేసికొని చక్రవర్తియై ధర్మంబు తలఁగకుండఁ బ్రజాపాలనంబు సేయుచుండెను.

ఔర్వమహాముని యుపదేశమున నా రాజచంద్రుఁ డనేకాశ్వమేధంబులు చేసెను. అశ్వమేధంబులు నూఱుచేసినవాఁడు దేవేంద్రుఁ డగునుగావున మునుపటి దేవేంద్రుఁడు భయపడి వానియజ్ఞములలో నొకదానియందు హయము నపహరించి పాతాళలోకంబునకుం గొనిపోయి యచ్చోట నిరంతరతపము చేయుచున్న కపిల మహామునిప్రక్కను దానిని గట్టివైచి యథేచ్ఛం జనియెను. యాగము నిమిత్త మర్పింపఁబడిన హయమును గానక సగరచక్రవర్తి విచారించి దానిని వెదకుటకై తనకుమారుల నఱువదివేలమందిని నానాదిశలకు నానాలోకములకుఁ బంపెను. కన్నుపొడుచుకొన్నను వారికి యజ్ఞాశ్వము కనఁబడలేదు. హయమును దొడ్కొనిపోక జనకునికడకుఁ బోవుట యవమానమని భావించి యాపుత్రనివహంబు పాతాళలోకంబుననున్నదని శంకించి పారలు గునుపములు మొదలగు సాధనములుదెచ్చి నేల త్రవ్వఁజొచ్చిరి. త్రవ్విత్రవ్వి వారు రసాతలముఁ జేరి పరమధ్యానపరవశుఁడై నియతుఁడై తపోనిష్ఠనున్న కపిలునిపొంత నా హయంబును గనుంగొని "ఆహా! దొరకె దొరకె. గుఱ్ఱపుదొంగ దొరకె. మనకష్టముగట్టెక్కె. జన్నపుఁగుఱ్ఱమును దొంగిలించి వీఁడు తానొకమేటితబసివలెఁ గన్నులు మూసికొని. కొంగజపము సేయుచు నిందుఁ గూరుచున్నవాఁడు. ఇట్టి మాయలమారిని మారణహోమము సేయుట యుక్తముగాని బ్రతుకనిచ్చుట మంచిదిగాదు. బ్రతుకనిచ్చితిమేని యిట్టిచౌర్యము లెన్నియో చేయును. వీనివలన మనమెంత కాల

మో కష్టపడితిమి. కావున చంపుఁడు చంపుఁడు" అని కంఠములెత్తి యఱచుచు ఖడ్గములు జళిపించి వానిం డాసిరి.

వారి కోలాహలమున నాకపిలమహామునికిఁ దపోవిఘ్నంబు గలిగెను. అతఁడు కన్నులుదెఱచి చూచెను. వారిప్రయత్నమంతయు దెలిసికొనెను. వారివంక నతఁడు చూచినతోడనే వారిశరీరములనుండి మంటలు బైలుదేరెను. అఱువదివేలమంది సగరపుత్రులు పెనుమంటలచే దగ్ధులై భస్మావశేషులైరి. పరమసాధువులను, మహామునీంద్రులను వారిప్రభావమెఱుఁగక నిష్కారణముగా హింసింపఁదలఁచునట్టి దురాత్ములకట్టిదుర్గతులు గలుగకమానునేయని నాగలోకవాసులు నాకలోకవాసులునుగూడఁదలంచి భయభ్రాంతులైరి.

సాగరునిపుత్రులుపాతాళలోకమునఁ గల భూమినంతయుఁ ద్రవ్వ నందునీరుపుట్టి యది సముద్రమయ్యెను. సగరనందనులు త్రవ్వుటచేత నది సాగరంబని పేరువడసెను. సాగరుని పెద్దభార్యయగు సుమతికొడుకు లఱువదివేలమందియు నశించిరి. రెండవభార్యయగు సుకేశిని కొక్క కుమారుఁడు గలఁడు. అసమంజసుఁడు వానిపేరు. సమంజసుఁ డనఁగా మంచివాఁడు. అసమంజసుఁ డనఁగా దుష్టుఁడు. ఇతఁడు పూర్వజన్మంబున నొకమహాయోగియై పొరబాటున దోసంబు చేసినకతమున యోగభ్రష్టుఁడై సగరునకు సుకేశినియందు నందనుఁడై జన్మించి యనేకదుష్కార్యముల జేయుచుండెను. అయోధ్యాపురమునఁగల బిడ్డలనందఱను బలవంతముగ దీసికొనిపోయి సరయూనదిలో బడవైచి యతఁడు చంపుచుండును. వారి తలిదండ్రులు మొఱలు వెట్ట మరల వారిని బ్రతికించుచుండును. అసమంజసుని కొక్క కొడుకు గలఁడు. అంశుమంతుఁ డతనిపేరు. ఆమనుమఁడు సుగుణవంతుఁడై పితామహుని యాజ్ఞానువర్తియై యుండుటంజేసి వానియం దతఁడు ప్రేమగలిగియుండెను. అశ్వంబును వెదుకఁబోయిన తనకొడు

కులజాడ యెంతకాలమునకుం దెలియకపోవుటం జేసి సగరుఁడు పౌత్రు నిం బిలిచి హయమును దన తనయులను వెదకి తెమ్మని పుత్తెంచెను.

అంశుమంతుఁడు నానాదిశల నరసి వారి నెందునుం గానక యెట్టకేలకుఁ దన పెదతండ్రులుత్రవ్విన గోతులదారిని రసాతలంబుఁ జేరి భస్మరాసులం జూచి, వానిపొంతనున్న హయముం జూచి గుఱ్ఱము పరిక్కనున్న కపిలుం జూచి వినయనయసంభ్రమంబులతో నాతనియెట్ట యెదుట నిలిచి నమస్కరించి యిట్లని వినుతించె:

సీ. మతి చిక్కఁబట్టి సమాధిగౌరవమున
వాలియుఁ దనకు నవ్వలవెలుంగు
నిను నొక్కనాఁడైన నెఱుఁగునే యా బ్రహ్మ
యజుని మనంబున నవయవములఁ
బుద్ధిజన్మించిన భూరిజంతువులందు
హీనులమైన మాకెఱుఁగవశమె
తమలోననీవుండఁ దామెఱుంగరు నిన్ను
గుణములఁజూతురు గుణములైన
గాన నొకచోటఁ జీఁకటిఁగందు రాత్మ
లందుఁదెలియరు వేలుపు లరయఁబొందు
లరయుదురు దేహధారు లత్యంధులగుచుఁ
గడిఁది నీమాయ నెన్నఁడుఁ గడవలేక.

అని సన్నుతించి హయంబు నిమ్మనియడుగక తండ్రిలమాట దల పెట్టక కదలక మెదలక నిలిచియున్న మతిమంతుని నంశుమంతుని నను గ్రహించి కృపావిపులుఁడు కపిలుఁడు మెల్లన నిట్లనియె: "వత్సా! నీతండ్రిలు రాచబిడ్డలనియు బలపరాక్రమసంపన్నులనియు గర్వించి బూడిదయైరి. అవే వారిభస్మరాసులు. బుద్ధిమంతుండవగుటచేత నీకు మేలయ్యె. యాగాశ్వమును గొనిపోయిన పితామహునిజన్నంబు సార్థ

కము జేయుము" ఈభస్మరాసులపై గంగాజలము ప్రవహింపఁజేసిన వారు పవిత్రులగుదురు. అని యానతిచ్చుటయు నంశుమంతుఁడు వేగ వంతుఁడై వాహవంబును గొని తెచ్చి పితామహుని కప్పగించెను.

సగరుఁడు కపిలకోపానలమున భస్మీభూతులైన తనూజాతుల శోకమున విలపించుచుఁ బ్రారంభించినమఖంబు సమాప్తము జేసి యంశుమంతునకు రాజ్యాభిషేకంబుచేసి తపోవనమున కరిగి యనంతర ముత్తమగతులం బడసెను.

తన పెదతండ్రులు చచ్చినచోట మందాకినీనదిని బ్రవహింపఁజేయ వలయునని యంశుమంతుఁడు చిరకాలంబు తపంబుచేసి కృతకృత్యుఁడు గాఁజాలక కాలధర్మమునొందెను. ఆతనికుమారుఁడగు దిలీపుఁడు మహీతలంబు పరిపాలించి యాకాశగంగను ధరణిపైఁ బ్రవహింపఁ జేయఁదలఁచి బహుప్రయత్నములు గావించి చరితార్థుఁడు గాలేక యెట్టకేలకు మేరుదారఁ గెను. అతని తనూజుఁడు భగీరథుఁడు తండ్రి తాతలమనోరథము సఫలంబు చేయఁదలఁచి మందాకినీ నదినిగూర్చి యనేకవత్సరము లుగ్రతపంబుచేసిన నాదేవనది యాతని భక్తికిమెచ్చి ప్రత్యక్షమై వరంబులు వేఁడుమనియె. అప్పుడు భగీరథుఁ డామె కిట్లనియె:—

క. మావారి భస్మరాసుల
నీవారిం గలపికొనుము నేఁటిమావారల్
నీవారిఁ గలియ నాకము
మావారికిఁ గలుగు నిది ప్రమాణము తల్లీ.

అని ప్రార్థించి బహుప్రకారముల వినుతించుచున్న భగీరథు నకు మందాకిని యిట్లనియె:—

"ఆకాశమునుండి మహావేగముతో నేను క్రిందఁ బడుచునేని నాయుద్ధతి సహింపఁగలవాఁ డెవ్వఁడు? పాతాళలోకమునకును నేఁ

H 30

చిల్లిబడును. అప్పుడు నేను భూలోకమునఁగాక పాతాళలోకమునఁ బ్రవహింపవలసివచ్చును. అదియునుఁగాక నేను భూమిమీఁదికి వచ్చితినేని మహాపాతకములుచేసిన మానవులు నానిర్మలజలముల స్నానముచేసి నన్నపవిత్రురాలిం జేయుదురు. అది నాకు భయమగుచున్నదని” అనిపలికి జగన్మాతయగు వియద్గంగకు భగీరథుఁడిట్లు ప్రత్యుత్తరము చెప్పెను. “తల్లీ! లోకపావనీ! పరమార్థవేత్తలు, తపఃపారీణులు, నిర్మలచిత్తులు, బహుకర్మిష్ఠులు నగు మహానుభావులు నీనీట స్నానంబుచేయుదురు. వారి మనములయందు జగన్నాథుఁడగు భగవంతుఁడు వసియించుచుండుఁగావున నీవందువలన నపవిత్రురాలవు గావు. ఒకవేళ పాపాత్ములు స్నానంబుచేసిన వారిపాపంబు లన్నియు నశించు. అవి నీకంటక మహాసముద్రంబునం గలియు. కావున నెల్ల విధంబుల నీవుకలుషచరిత్రవుగావు. ఇంక నిన్నుభరించు వారెవ్వరన్న నశేషలోకములు భరించుచున్నవాఁడు, హాలాహలవిషముఁ గుత్తుకను నిలిపినవాఁడు త్రిపురాసురులం జంపి లోకంబులఁ గాచినవాఁడు సముద్రంబులు పొదిగాఁ గలవాఁడు, మూఁడుకన్నులు గలవాఁడునైన మహాదేవుఁడు శంకరుఁడు పాపభయంకరుఁడు నిన్ను భరియించు. కావున నీవు మహీతలంబునకు వేంచేసి మత్పితామహులను బావనులుగాఁజేయుము” అని విన్నవించి భగీరథుఁడు సురనదిని వీడ్కొని కరుణాసముద్రుఁడగు రుద్రునిగూర్చి ఘోరతపంబు గావించెను. అతఁడు సాక్షాత్కరించి వానికోరిక నెఱిఁగి భక్తవత్సలుఁడై మందాకినీనదిని శిరంబున ధరింప నొడఁబడెను. అది యతని జటాజూటంబు మొదటిసోపానము జేసికొని యటనుండి మహీతలంబునకుఁ బ్రవహించి హిమాలయంబునంబడి యామహీధరమునుండి యనర్గళప్రవాహంబున వృక్షంబుల నేలఁగూల్చుచు శిలాతలంబుల భేదించుచు నిమ్నప్రదేశంబులనించుచు నడ్డమువచ్చిన గృహారామక్షేత్రంబుల

ముంచుచు, జంతుజాలములఁ దనకడుపునం బెట్టుకొనుచు, దనమహా ధ్వానంబున దెసలుమాఱుమోఁగ నురుగు తెట్టెలు మేనదాల్చిన మల్లెపూవులదండల ట్లుల్లసిల్ల, చేఁపలు తాఁబేళ్ళు మొసళ్ళు మొద లగు జలచరంబులు సంతసంబునఁ జెలఁగాడి బిడ్డలవడువున విహరింప, మహోత్తుంగతరంగములతోఁ గడుదూరంబు ప్రవహించి మహీజను లకు జీవనంబు లొసఁగి భగీరథుఁడు ముందునడువ నతనివెంటఁ దాను నరిగి రసాతలంబునకుంబోయి సగరనందనులభస్మరాసులపైఁ బాఱి వారిం బావనులఁజేసి మూఁడులోకంబులందానయై నాకంబున మం దాకిని యనుపేరను, భూమండలమున భాగీరథియనుపేరను, బాతాళ మున భోగవతియనుపేరం బరఁగి జగత్త్రయమును బావనముచేసెను.

భగీరథుఁడు తనకీర్తివలెనే మిక్కిలి తెల్లనైన యాగంగాజల ముతో సగరునకు, వాని నందనులకుఁ దన పితృపితామహులకుఁ దర్పణంబులు సమర్పణంబులుజేసి భూతలంబు జల్లఁగఁబాలించి జగ ద్విశ్రాంతయశోవిశాలుఁ డయ్యెను. కపిలుఁడు నారాయణాంశసంభూ తుఁడని కొందఱు చెప్పుదురు.



# పరశురాముఁడు

హైహయవంశమున మున్ను కృతవీర్యుఁడను రాజొకఁడుండెను. అతని కర్జునుఁడను నొకకొడుకు బుట్టెను. అతఁడు కృతవీర్యుని కుమారుఁడగుట కార్తవీర్యార్జునుఁడను నామధేయమున లోకముల విఖ్యాతుఁ డయ్యెను. అతఁడు పాండవమధ్యముఁడైన యర్జునుఁడు గాఁడు. ఆకార్తవీర్యార్జునుఁడు నారాయణాంశమునఁ బుట్టిన దత్తాత్రేయు నారాధించి యతని యనుగ్రహంబునడసి శత్రుదుర్జయప్రతాపమును, దానికి సాధనములుగా వేయి బాహువులును, నణిమాదులైన యష్టసిద్ధులను, మహాతేజమును, మహాబలమును, యోగీశ్వరత్వమును, నైశ్వర్యమును, గావలయునని వరములు గ్రహించి గాలివలెఁ దనకుఁ బోరానిచోటును రారానిచోటును లేక యెల్లయెడల వ్యాపించి జగదేకశాసకుఁడై యుండెను.

ఒకనాఁ డానరపాలుఁడు తనయంతఃపురకాంతలతో నర్మదానదిని జలక్రీడచేయఁబోయి మనోజ్ఞమైన యాతెలినీటం గాంతామతల్లులతోఁ జల్లుపోరాటమునలిపి, తనవేయిబాహువులతోడను నానదీప్రవాహంబు నరికట్టెను. లంకాధిపతియైన రావణుఁడు కార్తవీర్యార్జునుఁడు శత్రుదుస్సహతేజుఁడని విని వానింజయించి పేరుదెచ్చుకొనవలయునని వానిరాజధానియైన మాహిష్మతీపురమునకుఁ బోయి యం దతనిఁ గానక జలక్రీడావినోదియై యతఁడు రేవానది కరిగెనని విని యయ్యేటికడకేగి స్నానముచేసి యొక యిసుకతిన్నియమీఁదఁ గూర్చుండి మహేశ్వరారాధనము జేయుచుండెను. అంతలో నర్జునుఁడు సహస్రబాహువులతో నదిని బంధించుటం జేసి మొదట నీరులేని యిసుకతిప్ప క్రమక్రమంబుగ నీటమునిఁగెను. ఆప్రవాహము

తపోనిమగ్నుడైన దశకంఠునికంఠమువఱకు లేచెను. ఈశ్వరార్చనము నకుఁ దాను గూర్చున్నప్పుడు నీరులేని యాయిసుకతిన్నియ నీట ము నుఁగుటకుఁ గతమేమియని విచారించి కారణంబారయఁ గొంతదవ్వ రిగెను. అరిగి రేవానది కార్తవీర్యుని బాహుసహస్రంబుచే బంధింపఁ బడుటఁజూచి మిక్కిలి యక్కజంపడి వానిని సమరంబునకు రమ్మని పిలిచెను. ఆరక్కసుని తెగువఁజూచి యర్జునుఁడు నవ్వి రావణునిజుట్టు పట్టుకొని మెగాదిగగుంజి తల మోకాలు పగులునట్లు వంచి పిడిగుద్దు లు గుద్ది వానిం గారాగృహమున బంధింపుమని సేవకులకప్పగించెను.

అట్లు దిగ్విజయార్థమరిగిన రావణుఁడు పరాజయమునొందుట యెగాక చెఱసాలం బంధింపఁబడియెను. గర్వోన్మత్తుల కిట్టిపరాభవ ములు జరుగుచుండుట యుక్తమేగదా! తరువాత నాయర్జునుఁడు దుర్జనుఁడగు రావణుని బిలిచి "ఓరీ! యిఁకమీఁద బుద్ధిగలిగి బ్రతు కుము. ఇరువదిచేతులవాఁడవు నీవు, వేయిచేతులవాఁడను నేను. నా మగఁటిమియేమి, నీమగంటిమియేమి? నాకును నీకును హస్తిమశకాం తరమున్నదని యెఱుంగవా? నీకీపరాభవముచాలును. పులస్త్యబ్రహ్మ మనుమడవగుటచే నిన్ను గరుణించివిడిచితి పొమ్ము. బుద్ధితెచ్చుకొని యిటువంటి తెలివితక్కువ పనులు చేయక బ్రదుకుము" అని మంద లించి విడిచిపుచ్చెను.

జమదగ్నియను మహామునియొకఁడు గలఁడు. అతఁడు సప్తమ హర్షులలో నొకఁడు. మహాతపశ్శాలి. బ్రహ్మజ్ఞానసంపన్నుఁడు. అతని కనేకులు కొడుకులు గలరు. వారిలోఁ బరశురాముఁడు కనిష్ఠుఁడు. అతఁడు పావనమైన తపోవనంబునంబుట్టియు, శమదమసంపన్నుఁడైన జమదగ్ని కొడుకయ్యు, బాల్యమునుండియు వేదముకన్న ధనుర్వేద ము నెక్కువ తమకముతో నభ్యసించి శాస్త్రములయందుకన్న శస్త్ర ములయం దధికాదరముగలిగి, కోపమువచ్చినప్పుడు శాపముకన్న

చాపము మెండుగాఁ బ్రయోగించుచు నమ్ములే సొమ్ములుగా ధనువులే ధనములుగా భావించుచు కులక్రమాగతమైన శాంతవృత్తిని విడిచి యుద్ధదోహలియై యుండెను.

కార్తవీర్యార్జునుఁ డొక్కనాఁడు వేటకై వనాంతరములకరిగి జంతుసంతానముల వేటాడి చంపి చంపి మిక్కిలి యలసి సొలసి సమీపమునం దున్న జమదగ్ని మహామునియాశ్రమమున కరిగెను. రాజులు మునిరాజులపాలిఁటి కల్పవృక్షములై వారికాపదలు రాకుండఁ గాపాడుదురుగావున జమదగ్నిమహాముని కృతవీర్యనందనున కాతిథ్యమిచ్చి గౌరవించి తనకడనున్న కామధేనువుచేత సమస్తవిధములైన పిండివంటలు పక్వాన్నములు సిద్ధముచేయించి రాజునకు వాని పరివారమునకుం బెట్టించి సంతుష్టులం జేసెను. రాజు కామధేనువు ప్రభావమున వండకయే సిద్ధమైన పదార్థములన్నియుఁ గుడిచి కూర్చుండి తనలో "ఆహా! యిట్టియావొక్కటున్నఁ జాలదె? వీనిముందఱ రాజ్యమేల, వైభవములేల? అవిదిగఁదుడుపునకైనఁబనికిరావు. ఈ మునికిది యెట్లులబ్బె చెప్పుమా? ఎట్టులైనఁ దీనిం జేకొనవలెను. ఇది లేనిబ్రతుకుబ్రదుకా" యనితలపోసి, దానినెట్లయిన గ్రహింప నిశ్చయించి బట్టితెమ్మని తనభటులను నియోగించెను. నృపకింకరులు యమకింకరులట్లు దూడకొఱకై గోవంభాయని యఱచుచుండఁ దల్లిని బిడ్డ నెడబాపి దానిందోడ్కొనిపోయిరి. అట్లు కార్తవీర్యుఁడు తనకొమ్మొదవుచిక్కెనని సంతోషించి రాజధానిం బ్రవేశించెను.

వారుచనినపిదప పరశురాముఁ డాశ్రమమునకుఁబోయి నృపుఁడు ధేనువుం దోడ్కొనిపోయినవృత్తాంతమంతయువిని క్రోధావిష్టుఁడై "ఔరా! మాతండ్రి కతిథియై సత్కరింపఁబడి మాయింటఁ గుడిచి కృతఘ్నుఁడై తిన్నయింటివాసము లెన్నునట్లు మాహోమధేనువు నెత్తుకొనిపోయెనే! రాజులశిరంబులు కొట్టి రిపుచ్ఛలట్టు లూడ

సేయఁగల గండ్రగొడ్డలి చేతఁబూని రాముఁడిచ్చట నున్నాఁడని వాఁ డెఱుఁగడుగాఁబోలు! ఆయువుచెల్లబట్టి వానికిట్టిదుర్బుద్ధులుపుట్టె. ఇదె మొదవుందెచ్చెద. చూడుఁడు." అని పలికినబట్టి కవచంబు దొడిగి విల్లు నంబులపొదులు గండ్రగొడ్డలియు దాల్చి తలపై బొమిడికము వెట్టి నేలయదరునట్లు చూపులనుండి నిప్పులంగ్రుక్కుచుఁ జూపఱు మిక్కిలి వెఱగొంద నతివేగమున మాహిష్మతీపురమునకుంబోయెను భుజబలోద్దాముని రాముని జూచి యర్జునుఁడు గర్వంబున "పాప మితఁ డు బాలుఁడు తనబలము నెదిరిబలము నెఱుఁగక మనపైవచ్చినాఁడు విశేషించి బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుం దెగటార్చుటమహాపాతకము అయినను మునుముం దతఁడే కయ్యమునకుఁ గాలుద్రివ్వి మనపై వచ్చుటం జేసి వీనిసదండింపవచ్చు" నని తలపోసి దండనాయకులం బిలిచి భండనంబు సేయుఁడని యానతిచ్చిన వారును రాముఁడు విక్రమశాలియని మున్నెఱుంగుటఁ జేసి చతురంగబలములతో నాతనిం దాకిరి. భార్గవరాముఁడు రణరంగభీముఁడై తనగండ్రగొడ్డలిం జేతఁ బూని కార్తవీర్యుని సైనికులపై దుమికి తాటికాయలు దుంచినట్లు శిరములందుంచి, చెట్లకొమ్మలునఱికినట్లు బాహువులనఱికి, యనఁటి కంబములఁ గూల్చినట్లు కాళ్ళునఱికి, మేనులు తుత్తునియలు జేసి చిత్రవిహారంబు జేసెను. కార్తవీర్యుని సైనికులు పలువురు రణ రంగమునమడిసిరి. హతశేషులు పాఱిపోయిరి. యుద్ధభూమియందు నెత్తురువఱదలుప్రవహించెను. నేలయంతయుఁ బీనుఁగుపెంట యయ్యె ను. అప్పుడర్జునుఁడు మహాకోపమునఁ గదనమునకుఁ గదలివచ్చి యైదు వందలబాహువులతో విండ్లుబూని మిగిలినయైదువందల చేతులతో నమ్ములుపట్టుకొని విండ్ల బాణంబులు గూర్చి గొప్పవానగురిసినచంద మున భార్గవరామునిమీఁద శరపరంపర నేసెను. పరశురాముఁడువాని నెల్ల తనకోదండమున ఖండించి మహావర్షధారలకు జెక్కుచెదరక

యుండు పర్వతముమాఱ్ఱిభాసిల్లి కఠోరమగు కుఠారము జేదోయి బూని వృక్షశాఖలు నఱికినట్లు వానివేయిబాహువులను నఱికివైచెను. అప్పుడు కార్తవీర్యుఁడు బాహుశూన్యుఁడై శృంగముతోనున్న పర్వతముమాడ్కి శిరస్సుతోమాత్రి ముండఁ దనపరశువున రాముఁ డాశిరస్సుగూడ ఖండించెను. శత్రునిశ్శేషమైన వెనుక భార్గవరాముఁడు తనయావు దోడ్కొని నిజాశ్రమమునకరిగెను. మాహిష్మతీపురమున జరిగినవృత్తాంతమంతయువిని జమదగ్నిమహాముని కుమారునింజూచి "వత్సా! మనము మునులమగుటచే శాంతము మనకుచితము. మన యావును మనముదెచ్చుకొనవచ్చునుగాని రాజును వానిసైనికులఁ జంపఁదగునా ? రాజులు మహీపాలనముచేసి లోకోపకారు లగుచు న్నారు. నీవుచేసిన క్రూరకర్మమునకు నామనంబు మిక్కిలి ఖేదపడు చున్నయది.

క. క్షమగలిగిన సిరిగలుగును
 క్షమగలిగిన వాణిగలుగు సౌఖ్యములెల్లన్
 క్షమగలుగ ముక్తిగలుగును
 క్షమగలిగిన మెచ్చు శౌరి సదయుఁడుతండ్రీ!

పట్టపురాజుంజంపుట బ్రాహ్మణుని జంపుటకంటె మహాపాత కము. అట్టివానిని నీవుకడతేర్చితివి గావున నిన్ను పాపంబుబొరసె. పాపంబు బాపుకొనుటకు నీవు తీర్థయాత్రలుచేయు"మని యానతిచ్చె ను. తండ్రియాన శిరసావహించి రాముఁడు సకలదేశములుతిరిగి పుణ్య క్షేత్రములనెల్ల జూచి పావననదీనదంబుల స్నానమాడి యాయా ప్రదేశంబులనున్న మహనీయుల సాంగత్యముచేసి యొక్కసంవత్సర మునకు మరల నిజాశ్రమముం బ్రవేశించెను.

అంత నొకనాఁడు పరశురామునితల్లియైన రేణుకాదేవి కుండ చేతఁబూని నీరుదెచ్చుటకై గంగానదికరిగెను. ఆనదిలో గంధర్వుఁడు

చిత్రరథుఁడు తామరపూవులకండ మెడవైచికొని యచ్చరలతో గూడి జలక్రీడ చేయుచుండెను. అతిమనోహరాకారుఁడైన యాగంధర్వుని, మూర్తీభవించినసౌందర్యమట్లుండిన యప్సరాంగనలను జూచుచు రేణుక భర్తమాటమఱచిపోయి కొంతయాలస్యము చేసెను. కొంతసేపటి కామె కింటిమాటజ్ఞప్తికిరా జలభాండముతలపైఁ బెట్టుకొని "అయ్యయ్యో! యేలయింతతడవుచేసితిని! నాభర్తకు హోమమువేళ సమీపించినది. ఆయనకోపింతురో యేమిసేయుదురో? ఏల గంధర్వుని జలక్రీడజూచితిని." అని పశ్చాత్తాపముఁ బొందుచు నీటికడవ పర్ణశాలఁబెట్టి చేతులుజోడించి మగనికట్టెదుటనిల్చెను. ఆమె జాగుచేసిన కారణము తపోమహత్త్వమువలన జమదగ్ని తెలిసికొని రామునికంటె జ్యేష్ఠులగు కుమారులంబిలిచి మీతల్లిం జంపుఁడని యానతిచ్చెను. మాతృవధా మహాపాతకమునకు వెఱచి వారు పితృవాక్యపరిపాలనముచేయక యూరకుండిరి. అప్పుడు జమదగ్ని బిట్టలిగి పరశురాముని బిలిచి "కుమరా! మీతల్లిని నాయాజ్ఞనుల్లంఘించిన మీయన్నలను దెగటార్పు"మని శాసించెను. వెంటనేరాముఁడు కుఠారంబు చేఁబూని నిశ్శంకముగా మాతృదేవతను, నగ్రభ్రాతలను దెగనఱకెను. జమదగ్ని తనయాన శిరసావహించి యకార్యమని సంశయింపక మాతృభ్రాతృవధముచేసిన కనిష్ఠపుత్రుని మెచ్చి వరములిచ్చెద కోరుమని చెప్పెను. రాముఁడు వెంటనే "తండ్రీ! నాతల్లిని నాయన్నలను బ్రతికింపుము. ఇంతకన్న నాకు వేఱొకవరమక్కఱలేదు. నీయాజ్ఞనుల్లంఘింపఁజాలక ఘోరకృత్యము చేసితిని. అందుకు నేను పశ్చాత్తప్తుఁడనైతిని. వారిని వెండియు బ్రదికించి నామనస్తాపమును దోసమును బాపు" మనిప్రార్థించెను. అట్లయగుఁగాక యని యతఁడు వారందఱఁ బునర్జీవులఁ జేసెను.

ఆ. పడినవారిమరల బ్రదికింపనోపును
జనకుఁడనుచుఁజంపె జామదగ్న్యుఁ

డతఁడుసంపె ననుచు నన్నలఁదల్లిని
జనకునాజ్ఞయైన జంపఁదగదు.

పరశురాముఁడు మాహిష్మతీపురముపై దండువిడిసి తండ్రిని జంపి నప్పుడు పిక్కబలముచూపి తిరిగిచూడక యాతని కొడుకులు పాఱి పోయి శతురివుఁడు పట్టణమువిడిచివెళ్ళినతరువాత ధైర్యముదెచ్చుకొని మరల నగరముఁబ్రవేశించి చెదిరిపోయిన సేనలఁ గూర్చుకొని పరశు రాముఁడు లేనిసమయము జూచి జమదగ్నిమహాముని యాశ్రమము నకుఁ బోయిరి. జమదగ్నియు వారల సగౌరవముగ నాదరించి యా తిథ్యమిచ్చెను. పర్ణశాలలో హోమకుండముకడ నమ్మునియుండ వా రాతనిపైఁ బడి కాళ్ళుకొందఱు చేతులు కొందఱుఁ బట్టు కొని నొక్కిపట్టి రేణుకాదేవి వలదువలదని వారించి బ్రతిమా లుచున్నను నామెమాట సరకుసేయక యామెను దూరముగా గెంటి యామహాత్ముని శిరస్సుఖండించి తీసుకొనిపోయిరి. అనంతరము పరశు రాముఁ డాశ్రమమునకు రాఁగా రేణుకాదేవి రాజకుమారులు గావిం చినదుండగములనెల్లఁ జెప్పి యిరువదియొక్కసారులు పతిమీఁదఁబడి మొగము గుండెలు మోదుకొనుచు నేడ్చెను. రాముఁ డెన్నిసార్లా మెను వెనుకకు లాగినను నామె మరలమరల భర్తపైఁబడి విలపింపఁ జొచ్చెను. తక్కినకుమారులును జనకునికై మిక్కిలి దుఃఖించిరి. రాముఁడు వారలంజూచి "అమ్మా! అన్నలారా! ఏలమీ రిట్లు ఖేద పడుట? ఎంతకాలము దుఃఖించినను మృతినొందిన జనకుఁడు బ్రతికి రాఁడు. నేనిప్పుడ మాహిష్మతీపురమునకుఁబోయి పగదీర్చుకొనియెద" నని కుఠారము ఖడ్గము కోదండముఁ బూని బాణవేగమున మాహి ష్మతీపురికిఁజని కార్తవీర్యార్జునుని కొడుకులను, జుట్టములను నెచ్చెలుల ను, ససైన్యముగాసంహరించి నెత్తురుటేరులు పురవీథులంబ్రవహింపఁ జేసి మరలివచ్చెను. రాజుల నెత్తురుతోఁడ దొమ్మిదిమడుగులు గావిం

చి యందు యథావిధిగాఁ బితృతర్పణముచేసి తనతండ్రి శిరమును మొండెముతోఁ గూర్చి జగములెల్ల నక్కజముపొందునట్లు గొప్ప యాగమును జేసెను.

అనంతరము శత్రువులకుఁ దనకుయుద్ధముజరిగిన శమంతపంచక మను క్షేత్రమున భార్గవరాముఁడు తండ్రిమీఁదఁబడి తల్లి యిరువది యొక్కసార్లేడ్చినది గావున జామదగ్న్యుఁడు ప్రపంచమునంగల క్షత్రి యులందఱు దుర్మార్గులేయని తలంచి రాచపురుగు లోకంబున లేకుండ జేయనెంచి ప్రపంచమునంగల క్షత్రియులందఱ నిరువదియొక్కసారు లు వెదకి వెదకి సంహరించెను.

ఆయజ్ఞము ముగిసినపిదప హోతకు దూర్పును, బ్రహ్మకు దక్షిణభాగమును, ఋత్విజులకు దక్కిన దిక్కులను, నుపద్రష్టయైన కశ్యపమహర్షి కార్యావర్త దేశంబంతయు సభాసదులకు మిగిలినప్రదే శంబులను దానముచేసెను. యాగానంతరమున సరస్వతీనదియం దవ బృథస్నానము జేసి క్రొక్కారుమబ్బులోనుండి వెలువడిన ప్రభాక రునిచందమున సత్యతేజోమూర్తియై సమస్తకలుషరహితుఁడై భా ర్గవుఁడు విలసిల్లెను. పిమ్మటనతఁడు కశ్యపునకు దానముగానిచ్చిన యార్యావర్తదేశమునందుండనొల్లక మహేంద్రశైలమునకరిగి య చట దపము చేసికొనుచుండెను. కుమారునివలన మరల బ్రతికి జమ దగ్నిమహాముని సప్తర్షులలోనొకఁడై నేటికిని వెలుగుచున్నవాఁడు.

దుష్టరాజకులములచేత వసుంధర నిండిపోవుటంజేసి భూభార మడఁచుటకై నారాయణుఁడు భృగువంశంబున రాముఁడనుపేర జన్మించి వచ్చినపని దీర్చుటంజేసి యితఁడు హరియొక్క యావే యవతారమని ప్రసిద్ధికెక్కెను. పరశుశబ్దమునకు గండ్రగొడ్డలియర్థము పరశువుంధరించుటచేతఁ బరశురాముఁడని పేరువచ్చెను. తల్లిదండ్రులు పెట్టినపేరు రాముఁడు. ఈతఁడు జీవించియుండఁగనే శ్రీమహావిష్ణువు

రఘువంశమున రాముఁడను పేర దశరథునకు జన్మించి నారాయణుని యేడవయవతారమని కీర్తింపఁబడెను. రఘురాముఁడు విశ్వామిత్రుని యాగసంరక్షణముచేసి మిథిలాపురమునకుఁబోయి జనకమహారాజు నింట నున్న శివునివిల్లు విఱిచి సీతాదేవిని వివాహమాడెను. సీతచెల్లెలైన యూర్మిళను లక్ష్మణుఁడును, జనకునితమ్ముని కూఁతురైన మాండవిని భరతుఁడును నామెచెలియలైన శ్రుతకీర్తిని శత్రుఘ్నుఁడును బాణిగ్రహణముచేసిరి. వివాహానంతరమున దశరథుఁడు క్రొత్త పెండ్లికొడుకులైనకొడుకులతోడను, హస్తకంకణములతో వెలయుచున్న కోడండ్రతోడను, బంధుమిత్రపరివారములతోడను, మిథిలాపురమునుండి మహావైభవముతో నయోధ్యాపురమునకుఁబోవుచుండ మార్గమధ్యమున కోపోద్దీపితుఁడై భార్గవరాముఁడు వానికడ్డమువచ్చెను. భార్గవరామున కాగ్రహకారణము రఘురాముఁడు శివునివిల్లు విఱుచుట. భృగురాముఁడు చిన్ననాఁడు విలువిద్య పరమేశ్వరుఁడైన శివునికడఁ గుమారస్వామితోఁ గూడి నేర్చికొనెను. తనగురువైన మహేశ్వరునివిల్లు రాచకుఱ్ఱఁడైన రాముఁడు విఱుచుట వానికెంతో కష్టముగానుండెను. కావునఁ దనగురువునెడల రఘురాముఁడు చేసిన మహాపచారము తనకు దుస్సహముకాఁగా దానికిం బ్రతిక్రియచేయఁ దలఁచి జామదగ్న్యుఁడు దశరథరామునిబట్టి సంహరింపవచ్చెను. భార్గవరాముఁ డడ్డువచ్చెనని విన్నతోడనే దశరథుని మేనుచమటలతో నిండి గడగడవడఁకెను. సీతకు నోటమాటలేకపోయెను. సైనికులు నిశ్చేష్టులై కఱ్ఱబొమ్మలవలె నుండిరి. రఘురాముఁడు మాత్రము చెక్కుచెదరక విన్నవోవక నిర్భయముగఁ దనకొఱకై వెదకుచున్న భార్గవుని యెట్టయెదుటకుఁబోయి నిలిచెను. జామదగ్న్యుఁడు నదరుబెదరులేక యెదుటనిలిచిన రఘునందనునిఁజూచి యిట్లనియె. "ఓమహాత్మా! ఓరాజడింభకా! అనేకయుగములనుండి ప్రాతవడి చివికి యాఁగ

వాలినంతనే విఱిగిపోవుటకు సిద్ధముగానున్న శివునివిల్లు విఱిచితిననిగరువమున విఱ్ఱవీగుచుంటివి కాఁబోలు! ఏదీ నీపసచూచెద. ఏదీ నాచేతివిల్లు వంచి యెక్కుపెట్టి బాణముసంధింపుము. అప్పుడు నీ భుజసారముఁ బ్రశంసించెద. ఇరువదియొక్కసారులు నేను క్షత్రియవంశముల నాశనము చేసినప్పుడు నాకంటఁబడ నోడి గాజులు దొడిగించుకొని పనికిమాలిన యాఁడువాండ్రనడుమఁ గూర్చుండి తల దాచుకొన్న దశరథుని కొడుకవు నీ కింత మగంటిమి యెటనుండివచ్చె? రాచపుట్టువు బుట్టితివేని మగతనము గలదేని నిదిగో నావిల్లు పుచ్చుకొని వంచుము" అని భయముచే బతిమాలుచున్న దశరథుని యవ్వలకుఁదోఁచి రామునకుఁ దన చాపము నిచ్చెను.

రఘురాములు భయమించుకయు లేక భార్గవునిచేతినుండి విల్లందుకొని క్షణములో నారిగూర్చి వంచి బాణసంధానముచేసెను. భార్గవుఁడు తెల్లపోయెను. దశరథుని చిత్తము పరిశాంతమువహించెను సీతకంటినీఱు నానందబాష్పముగా మాఱెను. అప్పుడు కిమ్మనక భార్గవుఁడు దీనాననుఁడై నిలచియుండ రాఘవుఁ డిట్లనియె. "మహాత్మా! నీకోరికప్రకారము వింట బాణము సంధించితిని. సంధింపఁబడిన బాణము నేను వ్యర్థముసేయను. ఇది నీపైఁ బ్రయోగింపమందువా? నీపైఁబ్రయోగించి నీపాదములు ఖండించుమందువా! లేక నీయుత్తమగతుల ధ్వంసముచేయుమందువా? ఇందేదో యొకటి చేయకతప్పదు. నీయిచ్చవచ్చిన తెఱంగున చేయుమని చెప్పుము."

అనవుడు భార్గవుఁడు ఖిన్నుఁడై నాయుత్తమగతులనుధ్వంసము చేయుమని వేఁడెను. రాముఁడట్లుచేసెను. భార్గవుఁడు తనపరిభావమంతయు రామునకు విల్లిచ్చినప్పు డతఁడు లాగివైచెనని భావించి మాఱుమాటాడక మహేంద్రశైలమునకుఁ బోయెను.

జామదగ్న్యుఁడు త్రేతాయుగమునందె గాక ద్వాపరయుగంబునందుఁగూడ నుండెనని పురాణములు చెప్పుచున్నవి. భరతకులప్రదీపకుఁడైన భీష్మునకితఁడు గురువై యతని శస్త్రవిద్యాకుశలునిం జేసెను. పాండవ ధార్తరాష్ట్రులకు గురువగు ద్రోణాచార్యుఁడు పరశురాముని యాచించి యతనిచేత దివ్యాస్త్రములం బడసెనని చెప్పుదురు. కుంతీనందనుఁడై పుట్టి సూతగృహమున రాధేయుఁడను పేరఁబెరిగిన కర్ణుఁడు తాను క్షత్రియుఁడనని చెప్పి దొంగపేరుపెట్టుకొని పరశురామునియొద్ద విలువిద్య నేర్చుకొనెననియు గొంతకాలమైన తరువాతఁ గర్ణుఁడు క్షత్రియుఁడు గాఁడు శూద్రుఁడని తెలిసికొని భార్గవుఁడు వానివిద్య నిష్ఫలమగునట్లు శపించెననియు మహాభారతము నుడువుచున్నది.

ముసలితనమందు భార్గవునకు నొకానొక కారణమున శిష్యుఁడైన భీష్మునితో యుద్ధము సంభవింప నిందుపాలియమునను భీష్ముఁడు వార్ధకమున మనోబలము బుద్ధిబలము సడలిన జామదగ్న్యునోడింప మహామునులు వచ్చి వాని నవ్వులకుఁ దీసికొనిపోయెననియుఁగూడ భారతము చెప్పుచున్నది.



# గజేంద్రమోక్షము

పూర్వకాలమున ద్రవిడదేశ మింద్రద్యుమ్నుఁ డను రాజు పాలించుచుండెను. అతఁడు విష్ణుభక్తుఁడు. సాధుశీలుఁడు, విదేహరాజగు జనకుఁడట్లు నింద్రద్యుమ్నుఁడును సంసారియై రాజై ప్రజాపరిపాలనము సేయుచుండియు ధనముమీఁదను రాజ్యముమీఁదను విశేషకాంక్షనిలుపక మంటిలోఁ దిరుగుచుండియు మంటినంటని కుమ్మరిపురుగువలెఁ దిరుగుచు హృదయమున మహాయోగియై యుండెను. ఒకమా అతఁడు మౌనియై నియతుఁడై కన్నులు మూసికొని హృదయపీఠంబున హరిరూపంబు నిలిపి ధ్యానముచేయుచుండఁ బరమతపోనిరూఢుఁడైన యగస్త్యుఁ డచటికిఁ బోయెను. హరినిష్ఠితమనస్కుఁడగుటచే నింద్రద్యుమ్నుఁడు వచ్చిన కుంభసంభవుని గనుఁగొనలేదు. నమస్కరింపలేదు. ఆతిథ్య మొసంగలేదు. తనయట్టి మహామహుఁడు వచ్చినపుడు రాజు లేవక సపర్యలు సలుపక కదలకమెదలక కూర్చుండినందు కగస్త్యుండు మహాగ్రహావిష్టుఁడై "రాజా! మానిధిక్కారముచేసినందుకు నీ వేనుఁగవై పుట్టుము; మదోన్మత్తుఁడ వగుటచే నిరంతరము మదకలితమైన గజజన్మమే నీకుచితము" అని శాపంబిచ్చి యథేచ్ఛం జనియెను. ఆకారణమున నింద్రద్యుమ్నమహారాజు గజరాజై త్రికూటపర్వతమున జన్మించెను. అతని బంటులు పరిజనులు గూడ నతనితోఁబాటు గజములై యాపర్వతమున విహరించుచుండెను.

దేవతలలో గాయకులగు గంధర్వులలో హూహూ యనువాఁడొకఁ డుండెను. దేవలుఁడను మహాముని వానిపై నెందుకో యలిగి మొసలివై పుట్టుమని వానిని శపించెను. ఆకారణమున హూహూనామ గంధర్వుఁడు త్రికూటపర్వతప్రాంతమున నున్న యొకమడుగు

లో మకరమై జలచరపరికరము తన్నుఁ గొలువఁ గాలముఁ బుచ్చు చుండెను. త్రికూట పర్వతము సార్థకనామధేయమై మూఁడు శృంగములు గలిగియుండెను. అందొకటి బంగారు శిఖరము. రెండవది వెండిది. మూఁడవది యినుపది! ఆపర్వతముయొక్క యెత్తు వేయి యోజనములు. అంతియ వెడలుపు.

ఆకొండలోనున్న నవరత్నముల కాంతులచేత భూనభోభాగములు చిత్రితములైనట్లు వెలయుచుండును. దేవతలు విమానారూఢులై వచ్చి యా గిరీంద్రముం జూచుచుండుదురు. కిన్నరులుక్రీడించుచుందురు. విద్యాధరులు విహరించుచుందురు. కొండనుండి క్రిందికెన్నో సెలయేళ్ళు దిగఁబాఱుచుండును. ఆపర్వతముమీఁద సింహము బెబ్బులి భల్లూకము సివంగి తోఁడేలు మొదలగు క్రూరమృగములకు శరణ్యములైన యరణ్యములు గలవు. పనస మామిడి యనఁటి కొబ్బరి నేరేడు రేఁగు జామి మొదలగు ఫలవృక్షములును, మల్లె మొల్ల సంపగి గోరంట మొదలగు పూలచెట్లును, సింధువారకోవిదారప్రముఖములగు నితరభూరుహములును గలిగి యవ్వనము దర్శనీయమై యుండును. ఘాతుకమృగముల బొబ్బలతోడను పుష్పమకరంద మాఘ్రాణింపవచ్చు తుమ్మెదల రొదలతోడను ప్రవహించు సెలయేళ్ళ హోరుహోరులతోడను దిక్కులు ప్రతిధ్వనులిచ్చు చుండును. కొన్నిచెట్లు దట్టమైన యాకులు గలిగి సూర్యరశ్మి జొరనీయక వైకమత్యముండెనేని యెట్టి చండప్రతాపునినైన ధిక్కరింపవచ్చునను నీతి లోకమునకు వెల్లడించుచుండును. గొప్పజంతువులు చిన్న జంతువులఁ బట్టి హింసించి తినుటచే లోకమున బలవంతులు బలహీనుల నిట్లే హింసింతు రనుమాట విస్పష్టమగు చుండును. నానావిచిత్ర వర్ణములు గల శరీరములు గలిగి వీనులకు విందుసేయు కంఠధ్వనులు గలిగి పండు చిగురులు మొదలగు

నని మెక్కుచుఁ జెట్లమీఁద గూండ్లు కట్టుకొని బ్రతుకు పులుఁగుల జీవితము నెండకు వానకుఁ జలికి జంకక చెట్లనీడను నాకుటిండ్లను గాపురము సేయుచు నాకులు దుంపలు కాయలుదిని పొట్టబోసుకొను మహామునుల వృత్తములు జ్ఞప్తికిఁ దెచ్చుచుండును. నరుని జీవిత కాలమున బాల్యయౌవనకౌమారవార్ధక దశలు నాలుగుఁ జూచుచుండఁగ నిల్లే యతివేగంబుగ గతించిపోవునను నీతి ప్రపంచమునకుఁ జాటుచున్నవోయన సెలయేళ్లు కొండనుండి క్రిందికి మహావేగమున బ్రవహించుచుండును.

ఆమహాశైలమునందు గుహ లనేకములు గలవు. సూర్యతేజమునకు భయపడి యచ్చట దాఁగియున్నదో యనునట్లు కారుచీఁకటి యాగుహాంతరములు నిలయముచేసికొని యుండెను. మదించి దుర్నిరీక్ష్యములై దిగ్గజంబులను ధిక్కరించునట్టి యేనుఁగులు వేనవేలా గుహలలో వసియించుచుండును. అవియొకనాఁడు జలక్రీడ సలుపుటకును నీరుద్రావుటకును కొండకడుపులో నుండి బయలుదేరిన పిల్లకొండలో యనునట్లు గుహలు వెడలి యరణ్యమార్గముం బట్టెను. ఆయేనుఁగు గున్నలు నడచుచున్న కొండలట్లు సింగములకైనను వెఱువక వనంబునం బోవుచుండ వానిని జూచి పులులగుంపులు భయపడి పొదలలలో దూరెను. ఎలుఁగుగొడ్లు గుహలుసొచ్చెను. అడవిపందులు బొఱియల దూరెను. జింకలు నలువంకలఁ బాఱఁజొచ్చెను. దున్నపోతులు మడుగులలో దిగెను. కోఁతులు కొండలెక్కెను. నెమళ్లు లాకాశము మీఁది కెగిరెను. పాములు పుట్టలలో దూరెను. చమరీమృగములు తోఁకలు ముడుచుకొని దూరముగఁ దొలఁగెను. తుమ్మెదలు భద్రగజముల గండస్థలములనుండి స్రవించు మదజలము కడుపునిండఁ ద్రావి జుమ్మని రొదలుసేయుచుఁ దిరుగఁ జొచ్చెను. మత్తేభములు దారింబోవునెడ నీటిపట్టుల నాఘ్రాణించుచు మార్గములనొరసికొనుచుఁ జివుళ్ళ నాకుల మేయుచు నడ్డమువచ్చిన బెబ్బులులను కారెనుబోతులను నితరమృగములను దండించుచు సరోవరములను జొచ్చి కలంచుచు గిరులను దంతములకొనఁ గొట్టి చూచుచుఁ జెలరేఁగును.

అట్లు జలాశయంబున కనుగుచున్న దంతావళసంతతిలో నొక్క భద్రగజము తన యాడుగజములను గూడి పెద్దతండములతో విడివడి మఱియొకదారిం బట్టెను. అట్లు చనిచని యాగజేంద్రుఁడు తన యెట్టయెదుట వికసించిన యెఱ్ఱకలువలు నల్లకలువలు గలిగి ముకుళించిన తామరపూవులుగని కలువపూవులలోని తేనియ నానుచు పుప్పొళ్లలోఁ బొరలిపొరలి యొడలు తెలియని తుమ్మెదలు గలిగి చేఁపలు తాఁబేళ్లు మొసళ్ళు గలిగి తీరమున నానావృక్షసమూహము గలిగి స్వచ్ఛమైన తియ్యని నీరు గలిగి మిక్కిలి మనోహరమైన యొక్క సరోవరముం గాంచెను. కలువపూవుల నెత్తావుల సంపర్కమున మనోజ్ఞమైన చల్లని గాలివలన మేనులు హాయిజెందఁ దామరతూఁడులు మెక్కి కలకలనాదములు సేయు రాయంచలపలుకులు చెవులకు విందులుసేయ వికసించిన కలువలనుండి వెడలు సుగంధము ఘ్రాణేంద్రియములకుఁ దృప్తిగావింప, స్వాదుజలంబులు జిహ్వకుఁ బరితుష్టి యొనర్ప సౌభాగ్యలక్ష్మికి నాకరంబైన పద్మాకరంబు నేత్రపర్వంబుసేయఁ బంచేంద్రియంబులకును నానందజనకమైన యామడుఁగు నేనుఁగు మొత్తంబు సొచ్చెను. చొచ్చి కడుపునిండఁ దేటనీరు ద్రావి తొండములతో నీరుఁబీల్చి యాకసమువంకఁ జల్లుచు గండములమీఁదఁ జల్లుకొనుచు గళగళరవములు చేయుచుఁ గొంతతడవు యానందించెను.

సీ. కరిణీకరోజ్ఝిత కంకణచ్ఛటఁ దోఁగి
 సెలయేటి నీహాద్రి చెలువుఁ దెగడు
హస్తినీహస్తవిన్యస్త పద్మంబుల
 వేయుఁ గన్నులవాని వెరవు సూపుఁ
గలభీసముత్కీర్ణ కల్హారరజమునఁ
 గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చుఁ
గుంజరీ పరిచిత కుముదకాండంబుల
 ఫణిరాజమండనప్రభ వహించు

మదకరేణుల ముక్తమౌక్తిక శక్తుల
మెఱుఁగు మొగలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజమల్లంబు
వనజగేహ కేళి వాలునపుడు.

• అట్లు జలక్రీడ సేయుచున్న సమయంబున భుగభుగధ్వనులతో మహాతరంగములు మిన్నుముట్ట ఘూత్కారరవములు విని జలచర సమూహములు తల్లడిల్లతోఁక ఝాడించుటవలనఁ బొడమిన మహా వాయువులచే ఘుమఘుమ ధ్వనులతో సుడిగాలి వీవ పరివాహము గట్టుసైఁబడుటచే వృక్షములు కూలి క్రిందఁబడ దూరముననుండిచూచి యెగసి కుప్పించి హుంకరించి యొక్క మేటి మొసలి గజేంద్రుని నా డిసిపట్టుకొనెను. ఏనుఁగుల ఱేఁడు తొండమెత్తి ఘుభాలున నామకర మును వేరియ నది యణఁగి పడినట్లైపడి తోడనే ధైర్యముదెచ్చుకొని దంతినాయకుని ముందటికాళ్ళు రెండుం బట్టుకొనియెను. అగ్రాహం బు పాదయుగంబు బట్ట గజనాథుఁడు భయంపడక దంతముల కొనల లతో దాని నావలకుఁ జిమ్మెను. అదియు వెనుకప్రక్కకుం జని దానితోఁక జీటి గాయములు చేసెను. జంతువులకెల్ల స్థానబలిమి ప్రధానము గావున మొసలి యేనుఁగును నీటిలోనికి లాగఁ జూచును. కరి మకరిని నేలమీఁదికి లాగఁ జూచును. కరి మకరములు రెండును తమతమ కనుకూలములగు నెలవులకు శత్రువును లాగఁజూచుటచేఁ బెనకువ ఘోరంబయ్యెను. కప్పలు చిట్టు చేపలు మొదలగు చిన్నజంతువులు కరి మకరముల సందుసఁ బడి నలిగి చచ్చుచుండెను. ఆ రెండు జంతువుల శరీరములనుండి రక్తము గారుచుండెను. జలాశయమంతయు సంక్షోభము జెందెను. అహో రాత్రములు నిద్రాహారములు లేక ద్వంద్వంబును నక్రంబును జిరకాల ము పోరుసలిపెను. మకరినోటం జిక్కిన మగని గజనాథుని విడిచి పోనోపక యాఁడుయేనుఁగులు వగచుచు నొడ్డున నిలిచి యుండెను. నీరునకు నెలవగుటఁజేసి మొసలి స్థానబలిమిచేత నంతకంతకు బలము హెచ్చి విజృంభించెను. వనచరమైన మత్తేభము తన కనువుగాని

నెలవున నుండుటంజేసి వీలుదప్పి కరిమక్రమముగ డస్సెను. గజేంద్రు ని దౌర్బల్యము గుర్తెఱింగి మొసలి విజృంభించి యొకమాఱు కుం భస్థలమును జీల్చెను. ఒకసారి తొండము ఖండమగునట్లు గొట్టెను. వేఱొకసారి యెముకలు చూర్ణమగునట్లు గుభాలున మీఁదఁబడును. ఒండొకసారి దంతములు మొక్కవోవునట్లు తాఁకును. కరిరాజు వెను కకుఁ బోవఁదలఁచిన వెనుకటికాళ్ళు పట్టుకొనును. అది ముందఱికడు గిడఁ దలఁచిన పూర్వపదముల కడ్డువచ్చును.

అట్లు నక్రనాయకునకును గజేంద్రునకును గయ్యంబు నిరంత రాయముగ వేయివత్సరములు జరిగెను. అంతకాలమును దన యావ చ్ఛక్తిని వినియోగించి గజనాథుఁడు జలచరనాథునితోఁ బోరి తన లావు సన్నగిల్లుటయు నంతకంతకునెదిరిబలంబును చలంబును హెచ్చుట యుఁ గనిపెట్టి దానిం గెలుచుట యసాధ్యమని తెలిసికొని తనలో నిట్లు జింతించెను. "అయ్యో! యీమొసలి నేరీతి జయింతును? ఏదేవుని ధ్యానింతును? ఎవ్వారిం బిలుతును? నాకెవ్వ రడ్డుపడుదు? క్రూరమగు నీ నక్రమును నివారింపఁగల సమర్థుఁ డెవ్వఁడు? దీనరక్ష ణపరాయణులైన మహానుభావులు లేరా? మదగజము లనేకములు నన్ను సేవింప వేనవేలాఁడు యేనుఁగులకు భర్తనై మంచిగంధపు చెట్లనీడల హాయిగా సుఖియింపలేక జలక్రీడాభిరతుఁడనై యేలయిట కువచ్చితిని? 'అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభ'మ్మను నార్యోక్తి నిజట్టి చేసిన దోసంబు ఫలంబు కుడువక తప్పునే? ఇప్పుడు చేయువలసిన దేమున్నది? ఆర్తత్రాణపరాయణుఁడైన పరమేశ్వరుఁ డే నాకుదిక్కు. అతని నిట్లు ధ్యానించెద—

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.

క. ఒకపరి జగములు వెలినిడి
యొకపరి లోపలికిఁగొనుచు నుభయముఁగనుచున్

సకలార్థసాక్షియగు న
య్యకలంకుని నాత్మమయుని నర్థింతు మదిన్.

క. లోకంబులు, లోకేశులు,
లోకస్థులుఁ దెగినఁ దుది నలోకంబగు పెం
జీఁకటి నెవ్వఁడు వెలిఁగెడు
నేకాకృతితోడ నతని నే సేవింతున్.

క. న ర్తకునిభంగిఁ బెక్కగు
మూర్తులలో నెవ్వఁడాడు మునులును దివిజు
ల్గీర్తింప నేర రెవ్వని
వర్తన మొకఁ డెఱుఁగ రట్టివాని నుతింతున్.

ఆ. ముక్తసంగు లైనమునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యు లై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కునాకు.

జన్మము నామము రూపము దోషము కర్మము గుణములు లేక లోకములు సృష్టించుటకును భరించుటకును లయమొందించుటకును మూఁడుమూర్తుల నెవ్వఁడు దాల్చు, నట్టి నిర్గుణునకు నిర్మలునకు నిత్యునకు నిర్వికారునకు నిశ్చలునకు నిరహంకారునకు నిర్వికల్పునకు నచ్యుతున కనంతునకు నవ్యయునకు న మేయునకు వందనము లొనర్తు. ఎవ్వఁడు సత్కర్ములగు సాధులను మెచ్చు నెవ్వఁడు దురాచారుల కభిగమ్యుఁడు గాఁ డెవ్వఁడు జ్ఞానధనులగు సన్మునుల హృదయపీఠములం దధివసించు నట్టి సర్వసాక్షికి సర్వవ్యాపకునకు సర్వశక్తునకు సర్వజ్ఞునకు సర్వేశ్వరునకు సాష్టాంగ దండప్రణామంబు జేయుదు. ఎవనిం గన్నులు చూడఁ జాలవో యెవ్వనిశబ్దంబు చెవులు వినలేవో యెవ్వని మేను స్పృశింపఁజాలమో యెవ్వడు వాక్కునకు మనస్సునకు నందరాని మహిమతో వెలయునో యట్టి దేవదేవునకు దీనరక్షకునకు దివ్యప్రభావునకు నంజలి యొనర్తు.

క. కలఁ డందురు దీనులయెడఁ
గలఁ డందురు పరమయోగిగణములపాలం
గలఁడందు రన్నిదిశలను
గలఁడుకలండనెడువాఁడు కలఁడో లేఁడో.

సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ
గలిమిలేములు లేక గలుగువాఁడు
నాకడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ
బడినసాధుల కడ్డపడెడువాఁడు
చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ జూచువాఁడు
లీలతో నామొఱాలింపఁడే మొఱఁగుల
మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు
అఖిలరూపులు దనరూపమైనవాఁడు
పరిధమమధ్యాంతములఁ గానఁబడెడువాఁడు
భక్తజనముల దీనులపాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె వేగరాఁడె.

అని పరమేశ్వరునిఁ బలుతెఱంగుల వేఁడుకొని యా కరీంద్రుఁడు వెండియు నిట్లనియె:

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులా
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడి
న్నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా.

ఉ. ఓకమలాక్ష! యోవరద! యోప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో కవియోగివంద్య! సుగుణోత్తమ! యోశరణాగతామరా
నోకహ యోమునీశ్వరమనోహర! యోవిమలప్రభావ! రా
వే కరుణింపవే తలఁపవే శరణార్థిని నన్నుఁ గావవే.

అని ప్రార్థించి భక్తవత్సలుఁ డగుపరమపురుషుఁడు తనవేఁడు కోలును సకరుణముగ నాదరించి తన్ను రక్షించునను సంపూర్ణ విశ్వాసము గలిగి పరమేశ్వరు హృదయపీఠంబున నిలిపి ధ్యానయోగంబున నుండెను. విశ్వమయత లేకుండుటం జేసి బ్రహ్మాదులైన దేవతలు వానిమొఱలు వినియు నడ్డుపడక యూరకయుండిరి. విశ్వమయత యున్నకారణమున విశ్వేశ్వరుఁడైన నారాయణుఁడు,

మ. అలవైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంకరమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయిసంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

అట్లు గజేంద్రుని విజ్ఞాపనంబు నాలకించి సకలవ్యాపారంబులుమాని హఠాత్తుగా వైకుంఠంబువిడిచి పద్మలోచనుఁడు గగనమార్గంబున కెగసి వేంచేయుచుండ,

మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతము! దాని వె
న్కను బక్షీంద్రుఁడు, వానిపొంతను ధనుఃకౌమోదకీ శంఖచ
క్రనికాయంబును, నారదుండు ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

అప్పుడు లక్ష్మీదేవి ప్రాణేశ్వరుని సంరంభంబుఁ జూచి యాతని వెంట నరుగుచు నిట్లని వితర్కించెను: "ఈమహాత్ముఁ డెక్కడి కరుగుచున్నవాఁడో చెప్పఁడు. అనాథస్త్రీ లెవ్వరైన బెట్టు మొఱలు వినఁబడియెనో? వేదముల దొంగ లెవ్వరైనఁ నెత్తికొనిపోయిరో? రక్కసులు వేల్పుల వీటిపై దండు విడిసిరో, భక్తులకేదైన యాపదవాటిల్లెనో, కారణ మడుగుదునా? అడిగిన నీయన యేమని తలంచునో? ఇది యడుగవలసినవిషయ మగునో కాదో తెలియదు"

అని శంకించుచు నిందిర పతి ననుసరించి గగనంబునకు నూతనాలంకారంబుఁ గూర్చుచు మేఘముల ననుసరించు మెఱుపు తీఁగెలాగునఁబోవు చుండెను. అట్లు గజేంద్ర సంరక్షణార్థము కడు వేగంబునఁ బోవుచున్న నారాయణునిఁ గని వేల్పులు సంతసించి "నీలమేఘశ్యాముఁడైన యతఁడే నారాయణుఁడు, వానిపజ్జ నడుగుచున్న లతాంగియే లచ్చి. ఆచప్పుడు శంఖధ్వని. అదే కౌమోదకీగద. కుడిచేతిలో నున్నదే చక్రము. వెనుక నడుగుచున్నవాఁడు గరుత్మంతుఁడు" అని వ్రేళ్లుచాపి యొండొరులకుం జూపికొని చెప్పుకొనుచు "నమో నారాయణాయ" యని చేతులు జోడించి దూరమునుండి నమస్కరించిరి.

పద్మనాభుఁడు గజేంద్రుఁ డేమయ్యెనో వాని నతిత్వరితముగ రక్షింపవలయు నని జాలిపెంపునఁ బరవశుండై యుండుటంజేసి నాకవాసుల నమస్కారముల నందుకొనక మహావేగంబునఁబోయి నాగంబునకు నక్రంబునకు ఘోరసమరంబు జరుగుచున్న యామడుగుం గని దీనదశలోనున్న కరీంద్రుం జూచి జాగుసేయక ఖండితానేకదైత్య చక్రంబును నిర్వక్రవిక్రమంబును రక్షితశక్రంబును నగు చక్రంబును మకరిపైఁ బ్రయోగించెను. అదియు మహాగ్నిజ్వాలలతో బైలువెడలి నీటం జొఱఁబడి మొసలి శిరంబు ఖండించెను. పరమపురుషుఁడు దిగ్గజములచెవులు గింగురు మనునట్లు పాంచజన్యంబు పూరించెను. వేల్పులు విరులవాన గురిసిరి. నారాయణుని భక్తవాత్సల్యమునకు మహానందభరితులై గంధర్వులు గానము చేసిరి. అమరేంద్రుని కొలువులో నచ్చరలు నృత్యము సేసిరి. సంసారబంధము నుండి విడువఁబడిన ముక్తుఁ డట్లు మొసలిపట్టు విడిన పిదప గజేంద్రుఁడు పూర్వతేజముతో నతిశయంబుగఁ బ్రకాశించెను. తమవల్లభుఁడు దుష్టనక్రవిముక్తుం డగుటంజేసి మిక్కిలి సంతసించి యాఁడుయేనుఁగులెల్ల నుల్లములు పల్లవింపఁ దమ తొండములు గజేంద్రుని తొండముతోఁ గలిపి వానిం బరామర్శచేసెను. గజేంద్రుఁడును మొసలియు శాపవిముక్తులైరి.

సంపూర్ణము.




## శంఖలిఖితులు

బాహుదానదీతీరమున శంఖుఁడు లిఖితుఁడు ననునన్న దమ్ములిద్దఱు పుణ్యాశ్రమము కల్పించుకొని యందుఁజక్కని పర్ణశాలలు నిర్మించుకొని తపస్సు చేసుకొనుచుండిరి. ఆయాశ్రమమునఁ దియ్యని పండ్ల నొసఁగు వృక్షము లనేకములు గలవు. ఆయన్నదమ్ము లిద్దఱు సంతుష్టులై యాఁకలియగునప్పుడు చెట్లొసంగెడు పరిపక్వఫలంబులఁ దినుచు దాహ మైనప్పుడు నదీజలంబులం ద్రావుచుఁ బరమనిష్ఠాగరిష్ఠులై, యన్నగారెఱుఁగకుండఁ దమ్ముఁడు పండ్లు గోయఁగూడ దనియుఁ దమ్మునితోఁ జెప్పకుండ నన్న ఫలములు స్వీకరింపఁ గూడ దనియుఁ దమలోఁ దామొక నియమ మేర్పఱచుకొని కాలక్షేపము సేయుచుండిరి. అట్లు కొంత కాలము గడువ శంఖుఁ డాశ్రమమున లేనిసమయమున లిఖితుఁడు చెట్లనుండి కొన్ని ఫలములు కోసి భక్షించెను. శంఖుఁడింటికి వచ్చి చెట్లు చూచి "యాపం డ్లెవరు భక్షించి" రని తమ్ము నడిగెను. "నేనేభక్షించితి" నని లిఖితుఁ డుత్తర మిచ్చెను. అనవుడు శంఖుఁ డిట్లనియె. "అయ్యో తమ్ముఁడా! మన మేర్పఱచుకొన్న నియమము ప్రకారము నీవు నాకుఁ దెలియకుండఁ బండ్లు కోయఁగూడదుకదా! ఏల నాతోఁజెప్పక పండ్లు కోసి భక్షించితివి? ఇదిదొంగతన మగును. నీవు దొంగవై తివి. దొంగతన మనఁగా నన్యులసొత్తు నపహరించుటయే కాదు. అన్నదమ్ములకుఁగాని తండ్రికొడు

కులకుఁగాని మిత్రులకుఁగాని సామాన్యమైనసొత్తు నొకనికిఁ దెలియకుండ మఱియొకఁడు తీసికొని యనుభవించుట చౌర్యమగును. జనకుని ధనము కుమారుఁడు, తనయునిధనము తండ్రి చెప్పకుండ గ్రహింపఁ గూడదు. మననియమమునకు విరుద్ధముగ నీవునాకుఁ దెలియకుండ ఫలముల ననుభవించితివి కావున నీవు చోరుఁడవు. ఇందువలన నీకుఁ బాపముకలదు. పాపపరిహారమునకు రెండు మార్గములు కలవు. బ్రతికి యున్నకాలమున రాజదండన ననుభవించుట, మరణానంతరమున యమదండన ననుభవించుట. రాజదండన ననుభవించినవారికి యమదండనముండదు. కావున మన దేశమును బాలించుచున్న సుద్యుమ్న మహారాజునొద్దకు నీవు పోయి, నీవుచేసిన పాప మతనికివిన్నవించి నేరమునకుం దగినదండనము సేయుమని ప్రార్థించి యాతనిచే దండితుఁడవై రమ్ము. అప్పుడు నీవు నిష్కలుషుఁడవై యుందువు. అట్లుచేయవేని మరణానంతరము నీకు నరకంబె యగు. రాజదండన కోర్వవచ్చును; కాని యమదండన సహింపఁ జాలము. కావున సత్వరమ రాజుదగ్గఱ కరుగుము" అని శంఖుఁ డానతిచ్చుటయు లిఖితుఁడు తన చేసినకార్యమునకు విషాదమొంది సుద్యుమ్నమహారాజు పట్టణమున కరిగి యాతని యంతఃపురమున కావల నిలువంబడి తనరాక భూపాలునకుఁ దెలుపుమని ప్రతీహారులను వేఁడెను. వారట్లు చేసిరి. రాజు మంత్రులతోఁ గలిసి యర్ఘ్యము, పాద్యము బట్టుకొని బ్రాహ్మణునియొద్దకువచ్చి యేమి కావలయునని యడిగెను. లిఖితుఁడు తన చేసిన యకార్యంబును దనయన్నచేసిన యుపదేశంబును మహారాజునకు విన్నవించి దొంగను దండించిన విధమునఁ దన్ను దండింపవలసినదని యతనిం బ్రార్థించెను. సుద్యుమ్నుఁడు వానిమాటలు విని భయంపడి యిట్లనియె. "దేవా ! మీరుపరమతపోధనులరు. బ్రహ్మజ్ఞానసంపన్నులు. నిర్వికారమనస్కులు. ధర్మశాస్త్రకర్తలు. మీరు

చేసినది పాపముకాదు. మీరన్యులసొత్తు హరింపలేదు. ఆయాశ్రమములో మీకుభయులకు ఫలముల ననుభవించు స్వాతంత్ర్యము కలదు. కావున మీరు చేసినది నేరము కాదు. ఇంతచిన్నతప్పునకు మి మ్మెట్లు దండింతును? ఇది నిజముగ దోషమైనను బ్రాహ్మణుల దండింపరాదు. దండింతునేని నాకు నరకం బగునని తెలుపు కలుగు చున్నది. నన్నీదుష్కార్యమునందు నియోగింపవలదని ప్రార్థించు చున్నాఁడ" ననవుడు లిఖితుఁడు రాజున కిట్లనియె. "రాజా! తప్పునకుఁ జిన్న పెద్దలు లేవు. నేనుచేసినది తప్పక తప్పు. తప్పుకానియెడల ధర్మసూక్ష్మవేత్తయగు నాయన్న నన్ను నీకడకుఁ బంపఁడు. పంపిన నను వచ్చువాఁడను కాను. నేను తప్పక దండ్యుఁడను. తప్పుచేసినను బ్రాహ్మణులను దండింపఁ గూడదంటివి; అట్లనఁగూడదు. రాజుదృష్టికి బ్రాహ్మణుఁడు, చండాలుఁడు సమానముగ నుండవలయును. నేరము చేసినప్పుడు నేరస్థులను రాజు నిష్కరుణుఁడై దండింపనలయు. జాతిభేద మక్కడ నెంచఁ గూడదు. సకలశాస్త్రంబుల నెఱింగి సకల ధర్మరహస్యంబులఁ దెలిసి లోకులకు ధర్మోపదేశంబులు సేయు నావంటి విజ్ఞానులు నేరములం జేయరాదు. విద్యావిహీనులు నేరములు చేసినప్పుడు వారినిదండించుటయు విద్వాంసులు నేరములు చేసినప్పుడు వారిని విడుచుటయు, ధర్మము కాదు. క్షమింప వలసి వచ్చినప్పుడు యుక్తాయుక్తములనెఱుఁగక దోషములు చేసినమూఖులనే క్షమింపవలయును. తెలిసి చేసిన విద్వాంసులను దప్పక దండింప వలయును కావున దండింపుము. నీకిందు దోషములేదు. నీసద్గుణములకు భంగము కలుగదు." ఆమాటలు విని సుద్యుమ్నుఁడు మనసులో నిష్టము లేకపోయినను దప్పకపోవుటచే లిఖితుని రెండుచేతులు నఱికించెను. లిఖితుఁడు తనకుఁ బాపవిమోచనము కలిగిన దని పరమానందభరితుఁడై రాజును దీవించి పరుగు పరుగున శంఖునికడ కరిగి

రాజసన్నిధిని జరిగినవృత్తాంత మెఱిఁగించి తన మొండిచేతులను జూ పెను. శంఖుఁడు తనసోదరునియవస్థకు మనమునఁ గొంత విచారించి "తమ్ముఁడా! పరమపవిత్రమైన మనవంశ మిప్పుడు నిష్కళంకమైనది. నీచేతుల నెత్తుటితో దొంగతనపు మచ్చ కడిగివేసితివి. మనపితృ దేవతలు మన ధర్మనిరతికి మిగుల సంతసింతురు. ఇప్పుడే పోయి బాహుదానదిలో స్నానముచేసి పితృతర్పణంబుఁ జేయు" మని పలికెను. అట్లకాక యని లిఖితుఁడు బాహుద కఱిగి యందు ము నిఁగి లేచునప్పటికి చేతులెప్పటియట్ల వచ్చెను. లిఖితుఁ డాశ్చర్యము నొంది యన్నకడకరిగి యావృత్తాంతముం దెలిపెను. మరల మొలిచిన సోదరుని చేతులం జూచి శంఖుఁడుసంతసించి "తమ్ముఁడా! ఇది మ న తపఃప్రభావము. ఈశ్వరానుగ్రహము మనపైఁ గలదు. మనతపము లు ఫలించె. మనము నిష్కళంకచరిత్రుల మైతిమి" అని యతనిం గౌఁగిలించుకొని పర్ణశాలకుం గొనిపోయెను.

---

### మూఁడు చేఁపలు.

---

ఒకసరస్సున మూఁడుచేఁపలు వసియించి యుండెను. అం దొక దానిపేరు దీర్ఘదర్శి. రెండవదానిపేరు ప్రాప్తకాలజ్ఞుఁడు. మూఁడవదానిపేరు దీర్ఘసూత్రుఁడు. ఆమూఁడు మత్స్యంబులు మిక్కిలి పొందుగలిగి యాచెఱువునందు యథేచ్ఛంబుగ సంచరిం చుచుఁ గాలక్షేపముఁ జేయుచుండ వేసఁగి సమీపించెను. అప్పుడు దీర్ఘదర్శి తక్కిన రెండు మీనములం జూచి యిట్లనియె. "మిత్రు లారా! వేసంగి దాపగుచున్నది. ఎండలు మెండగుచున్నవి. మన సరోవరంబునంగల జలమంతయుఁ గ్రీష్మకాలంబున నింకిపోవును.

గొలను నిర్జలమైనవెనుక మనము చేయునది లేదు. ఏవేఁటకాండ్రో పట్టి భక్షింతురు. అట్టియాపద రాకమున్నె జలము సమృద్ధిగఁగల గొలను జేరి సుఖింతము. కావున రండు. కార్యము పాకము దప్ప నీయఁకుఁడు." అనవుడు నవ్వి ప్రాప్తకాలజ్ఞుం డిట్లనియె. "దీర్ఘదర్శీ! ఏమిరా యేడ్చుచున్నా" వని యడుగ నెల్లుండి మావాఁడు గొట్టునని యనినట్లు వేసఁగి వచ్చి నీ రెప్పుడో యెండిపోవు ననియు నెన్నఁడో వేఁటకాండ్రు వచ్చి చుట్టుముట్టి పట్టుకొందు రనియు నప్పుడు మనము తప్పించుకొని పారిపోవుట కనకాశ ముండదనియు బెంగపెట్టుకొని యిప్పుడు విచారించు చుంటివా? ఆపద వచ్చినప్పుడు దానికిఁ బ్రతీకారముఁ జేసికొనుట బుద్ధిమంతుల లక్షణముకాని ముందుగానే దిగులుగొని ప్రస్తుతము పడుచున్న సుఖమును వదలుకొని దేశాంతరంబులకుం బోవుట భావ్యము కాదు. నీమాటచొప్పున మఱియొక జలాశయంబునకుం బోవుద మనుకొనుము. అదియు నింకిపోఁగూడదా? అక్కడ మాత్రము మనము వేఁటకాండ్ర పాలు కాఁగూడదా. కావున మనమిచ్చటనె యుండి నిజముగ నట్టి యపాయము మనకు సంభవించినపక్షమున సమయోచితములగు నుపాయములచేత దానిం బాపుకొందము. అట్టిభయము పడక యూరకుండుము." ఆయుభయుల పలుకులు విని దీర్ఘసూత్రుఁ డీతెఱంగున పలికెను. "మిత్రులారా! మీయిరువురపలుకులు నాకు నంగీకారములే. అందు దీర్ఘదర్శిమాటలు నాకించుకేనియు సమ్మతములుకావు. అతఁడు తననీడఁజూచి తానే భయపడును. ఈజలాశయము మహాసముద్రమంతయున్నది. ఇదియేమి, ఇంకిపోవుట యేమి! ఇది యింకినపక్షమునఁ బ్రపంచమునఁగల నదులు సముద్రములుఁ గూడ నింకిపోవును. అట్టియాపద సంభవించినపక్షమున జగంబున జలాశయములె యుండవు. అదియునుఁగాక కాకున్నది కాకమానదు. మనము వేఁటకాం

ద్రచేతులఁబడి మృతినొందవలసినయోగ మున్నపక్షమున నేదేశాంతరమున కరిగి యేసరస్సులో నుండినను నక్కడ తప్పక చచ్చితీరుదుము. బ్రతుకవలసినయోగ మున్నపక్షమున నీళ్ళు లేనిచెఱువులో నుండినను బ్రతుకుదుము. అక్కడొకదైవ మిక్కడొకదైవ ముండునా? బ్రహ్మవ్రాఁత యెట్లుండునో యట్లు జరుగును. కావునఁ బుష్కలంబుగ జలంబుగల యీకొలను విడిచి మన మన్యప్రదేశములకుఁ బోవలదు." అని పలుక దీర్ఘదర్శి "మీవాక్యములు నాకు రుచింపవు. దీప మున్నపుడిల్లు చక్కఁబెట్టుకొనవలయు. ఆపదవచ్చునని తెలిసి సమయోచితము లగునుపాయముల వెదకవచ్చుననియు రానున్నది. రాక మానదనియు నపాయస్థలంబున నుండుట వివేకలక్షణము గాదు. మీయిష్టమైన మీరిట నుండుఁడు. నేనిదె పోవుచున్నాఁడ"నని జలసమృద్ధంబగు వేఱొక్క కాసారంబునకుం జనియెను. తక్కిన మీనంబులు రెండు దానిం బరిహాసించుచు నక్కడనె యుండెను. అంతట గ్రీష్మకాలము భయంకరమై ప్రారంభించెను. మడువులోనున్న నీరంతయు నింకిపోయెను. చెఱువులోఁ జేపలన్నియు బయలుపడెను. వేఁటకాండ్రు మిక్కిలి సంతోషముతో మడువుఁ జొచ్చి యూఁతలతో, గాలములతో, వలలతో యథేచ్ఛముగ మత్స్యంబుల నన్నిఁటిని బట్టుకొనిరి. అప్పుడు ప్రాప్తకాలజ్ఞుఁడు తనలో "హా! దైవమా! ఏమిగతి. దీర్ఘదర్శిమాటలు వినక చెడిపోతినే" యని యించుక యాలోచించి మనంబున నొక్కయుపాయంబు దోఁప దాని ననుసరించి నీటియొడ్డునఁ బల్లెవాఁడు వైచిన చేఁపలగుదిదాపునకుఁ బోయి యాగుదిత్రాటిని నోటితోఁ గఱచుకొని చచ్చినట్లు నటించెను. బెస్తవాఁడు గుదిలోని చేఁపల నన్నింటిని మఱియొక కొలంకులో బురదపోవుటకై యునుముచుండ నప్పుడు ప్రాప్తకాలజ్ఞుఁ డదియెఱింగి కఱచినత్రాఁడు వదలి లోఁతునీటంబడి ప్రాణములు దక్కించుకొనియె. దీర్ఘసూత్రుఁడు

వేఁటకాండ్రి బారింబడి మెట్టకేలకుఁ బశ్చాత్తాపమునొంది కార్యము మించుటచేఁ జేయునదిలేక దుఃఖించుచుఁ బ్రాణముల విడిచెను. ఈ విధంబుగనె భవిష్యత్కాలమున వచ్చెడు నాపదల ముందుగా నెఱింగి వానిం బరిహరించుకొను బుద్ధిమంతులు దీర్ఘదర్శివలె నిరంతరాయ సుఖంబులం బడుచుందురు. రాఁబోవు నాపదల నెఱుఁగలేనివారు సమయోచితంబులగు నుపాయంబులకొఱకు వెదకుచు నుపాయంబులు దొరకినప్పుడు బ్రతికి ప్రాప్తకాలజ్ఞునివలె సంశయజీవను లగుచుందురు. దీర్ఘదృష్టియు సమయోచితంబగు నుపాయంబును లేనివారు దీర్ఘసూత్రునివలె నిధనము నొందుచుందురు.

---

## పిల్లి—ఎలుక.

ఒకయడవిలో నొకమఱ్ఱిచెట్టుమీఁద రోమశుఁ డనుపిల్లి వాసముఁ జేయుచుండెను. ఆవృక్షముక్రింద నొక కలుఁగులో పలితుఁడను పేరుగల యెలుక యొకటి కాపురముండెను. ఒకమాలవాఁడు ప్రతిదినము సాయంకాలమునందు వేటకై యావనమునకుఁ బోయి యాచెట్టుచుట్టుప్రక్కల వలలు నురులుపన్ని పోయి యారాత్రి యయ్యురులం జిక్కిన జంతువులను సంహరించుటకై మరునాఁ డుదయమున నక్కడికి కేగుచుండును. ఒక్కనాఁటి రాత్రి యామాలఁ డెప్పటియట్ల యురులు పన్ని చన నర్ధరాత్రిమున మఱ్ఱిమీఁదనున్న పిల్లి యాహారమునిమిత్తము క్రిందికిదిగి యిటునటుఁ దిరుగుచు విధివశంబున నయ్యురులలోఁ దగుల్కొని విచారించుచుండెను. ఎలుక కలుఁగులోనుండి పైకి రాఁదలఁచి తలయెత్తి యిటునటు తొంగిచూచి తన సహజశత్రువైన మార్జాలము బంధమునఁ దగుల్కొనుటఁజూచి నిర్భయముగఁ దిరుగవచ్చునని పైకివచ్చెను. అంతలో దాని దురదృష్టవశమున

నొక గ్రుడ్లగూబయు ముంగియు నచ్చటికి వచ్చెను. మూషికము వానిం గాంచి భయమున గడగడ వడఁకి కొంం డొకవడికి ధైర్యముఁ దెచ్చికొని గూబబారినుండియు ముంగిబారినుండియుఁ దప్పించుకొనుటకు మహాపదలోనున్న మార్జాలము నాశ్రయించుటయే ముఖ్యకర్తవ్యమని నిశ్చయించి, దానిం జేరం జని యిట్లనియె. "పిల్లీ! నీవిప్పుడు గొప్ప విపత్తులో నున్నదానవు. నీకు నావలన సహాయము గావలసియున్నది. నాకును నొకయాపద సంభవించినది. ముంగియు గూబయు నన్నుఁగబళింపఁ జూచుచున్నవి. కావున నాకు నీవలన సహాయము కావలసియున్నది. ఈయురులఁదెగఁ గొఱికినిన్ను నేను రక్షించెద. ఆరెండుజంతువులబారినుండి నన్ను నీవు కాపాడుము. సహజవైరమును విడిచి వర్తింపుము. అందువలనఁ బరస్పరప్రాణరక్షణమగును." అనవుడు మూషికమునకు మార్జాల మిట్లనియె. "అయ్యో! యింతకంటెను మేలుకలదా? నీయంతట నీవువచ్చి నాకు మహోపకారము సేయుదునని చెప్పుచుండ నేను వలదందునా? నీవు నాయండ నుండుము. ముంగియు గూబయు నీవంక తేఱి చూడఁజాలవు. నాపేరు వాటికి సింహస్వప్నముగదా? భయంపడకుము." నావుడు మూషికము మిక్కిలి సంతసించి దానియండకుం జనియె. ముంగియు గూబయు నాశాభంగమునొంది పిల్లియండనున్న యెలుక నేమియుం జేయఁజాలక తొలఁగి పోయెను. పిమ్మట నెలుక యురులు గొఱుకక నిటునటు తారుచు జాగుసేయుచుండుట పిల్లిచూచి యిట్లనియె "మిత్రమా! ఉరులు వేగముగఁ గొఱుకుము. తెల్లవారవచ్చుచున్నది. వేఁటకాఁడు వేకువనె బయలుదేఱును. నేనురిలోఁ దగుల్కొనియుండ వాఁడు వచ్చిన కడుమోసమగును. కావున నాకుఁ బ్రత్యుపకారము కార్యము మించకుండఁ జేసి రక్షింపుము. కృతఘ్నత మహాపాతకము" అని రోమహర్షము పలుకఁ పలికినను "మిత్రమా! నేను కృతఘ్నుఁడను

గాను. కాలము మించకుండ నుపకారముఁ జేసెద. మాలవాఁడువచ్చు నప్పటికి నీకు బంధమోక్షముం జేసెద. ఇప్పటినుండి చేయ నేల? నీ వనుమానపడవలదు. నాకు మేలుచేసిన వానిని వేఁటకాని కొప్పగించి యూరకుండఁగలనా? భయముడక్కి వర్తింపుము., అని యూరడఁబలికెను. ఎలుక తనకుఁ బ్రత్యుపకారము సేయునో సేయదోయని సంశయాక్రాంతమై మార్జాలము వగచుచుండ నంతలో వేఁటకాఁ డరుదెంచెను. పిల్లి దీనవాక్యములతోఁ దనకు విడుదలచేయుమని ప్రార్థించెను. మూషికము మిక్కిలివేగమున నయ్యురులు గోటికి తనకలుఁగులోనికిఁ బాఱిపోయెను. మార్జాలము సత్వరమున మఱ్ఱిచెట్టెక్కి కూర్చుండెను. వేఁటకాఁ డక్కడకుఁబోయి తనప్రయత్నము నిష్ఫలమగుటకు, మీఁదుమిక్కిలి యురులు కొఱుకంబడి చెడిపోవుటకు మిక్కిలివగచి యుస్సురనుచుం బోయెను. అనంతరము మార్జాలము మూషికముం బిలిచి "ప్రియమిత్రమా! లేకలేక మన కిరువురకుం జెలిమి కలిగెను. వచ్చుచు బోవుచు నన్నప్పుడేగదా చుట్టఱికము. నూతనమైత్రివలనఁ గలిగెడు సుఖంబులననుభవింపవేమి? నాకడకు రావేమి? కష్టసుఖంబులు సెప్పవేమి? ఇష్టగోష్ఠి చెప్పికొందము రమ్ము. నావలన నీకు భయంబులేదు. మనవైరంబులు తుదముట్టినవి. పరస్పరోపకారంబున స్నేహబంధము దృఢమైనది. రమ్మా! రమ్మా!' అని పిలిచెను. అప్పలుకులకు మూషికము మెల్లన నిట్లనియె: "మిత్రమా! నీకు నే నాహారపదార్థమను. రాత్రి యంతయు. నీ యురులలోఁ దగుల్కొని యాహారము లేక మలమలమాడుచుండెడికతమున నన్నొక చల్దిముద్దగఁ జేసి గుటుక్కని మ్రింగఁదలఁచి నీవింత ప్రేమతోఁ బిల్చుచుంటివి. అంతేకాని నామీఁది ప్రేమచేఁగాదు. నామీఁదను నాజాతిమీఁదను నీకును నీజాతికిని నెంత ప్రేమయో నే నెఱుఁగనా? నీవొకవేళ నాచేసిన యుపకారముఁ

దలఁచి నాకుఁ గీడు దలఁపక యుండినను నీచుట్టంబులు నన్ను బ్రతు కనిత్తురా? సహజశత్రువులతోఁ గాలవశంబున నవసరము గలిగి యొకప్పుడు మైత్రి సమకూర్చుకొనవలసి వచ్చును. ఆమైత్రి శాశ్వత మని యెంచక బుద్ధిమంతులు మిక్కిలి మెలకువతో వర్తింపవలయు ను. పగవారి నెన్నఁడు నమ్మరాదు. నమ్మినట్లయుండి కార్యసాధన ముఁ జేసికొనుట ధీమంతుల లక్షణము. నాకొకమేలు నీవు చేసితివి. మనమైత్రి యింతతో సమాప్తమైనది. నన్ను నికఁ బిలువకుము. నాయంత నేనువచ్చి నీనోటఁబడుటకు నేనంత వెఱ్ఱివాననుగాను." ఆ మాటలు విని మార్జాల మిది నామాయలోఁ బడునదిగాదు. మిక్కి లి గడుసుది యని నిరాశఁజెంది యథేచ్ఛం బోయెను. ఎలుకయు భయంబులేక సుఖంబుండెను.

---

## విశ్వామిత్రుఁడు—మాలవాఁడు.

తొల్లి త్రేతాయుగ ద్వాపరయుగములసందునఁ బండ్రెండు సంవత్సరములు వానలేక గొప్పకఱవు సంభవించెను. ఆద్వాదశవర్ష క్షామములో నదులు చెఱువులు బావులు పూర్తిగ నిగిరిపోయెను. వ్యవసాయములు చెడెను. చెట్లెండిపోయెను. భూమినిస్సారమయ్యెను. నీరు మేఁత లేక పశువులు మందలుమందలుగఁ జచ్చెను. దొంగలు పెచ్చుపెరిగిరి. ప్రజలను రక్షింపవలసిన రాజులే దొంగలై ధనధా న్యంబులు దోఁపించిరి. అధర్మము హెచ్చెను. బలవంతుఁడు బలహీను ని నాశనముచేసెను. యజ్ఞములు దేవతాపూజలు నడుగంటెను. వర్ణాశ్రమధర్మము చెడిపోయెను. అన్నము లేక జనులు గుంపులుగుం పులుగఁ జచ్చిరి. పల్లెలు పట్టణములు శ్మశానప్రాంతము లయ్యెను. ప్రపం

దమంతయు నతిభయంకరమైయుండెను. ఆదుష్కాలమునందు విశ్వామిత్రమహాముని తన కాహార మెందును లభింపమి, పండ్లు దుంపలు కాయలు తనకిమ్మని జనుల నడిగి యడిగి బడయంజాలక యాఁకలికోర్వలేక మిక్కిలి బాధపడుచు బలహీనతచేఁ దూలిపడుచు నడచియెందేని పోయి యొక మాలపల్లెఁ జేరెను. అక్కడ నొకమూలఁ బశువుల ప్రేగుల ప్రోవులు మఱియొక మూలఁ బందిడొక్కలు, వేఱొకచోటఁ గుక్కపుర్రెలు నింకొకచోటఁ దోళ్ళగుట్టలు నిం కొకచెంత నెముకల తట్టలు వానికిఁ గనఁబడెను. దుస్సహమైనదుర్గంధ మందుండి వెడలుచుండెను. అచ్చట నేదేని యించుక మాంసము దొరకు నేమోయని యతఁ డాస పడి యచటవిశ్రమించెను. క్షుధానలముచ కోర్వఁజాలక మిక్కిలి బాధపడుచున్న యాతని కొకచోఁ గుక్కమాంసము కనఁబడెను. అది చూచినతోడనే యతఁడు బ్రహ్మానంద భరితుఁ డై దానిని సమీపించెను. మాలవాండ్రింతకు ముందె యొకకుక్కను జంపి త్రిత్తియొలిచి యారుటకై గాలిలోఁ బెట్టి పండుకొనిరి. మాలవాండ్రు పూర్వకాలమునందు శునకమాంసమే మిక్కిలి భక్షించెడువా రని పురాణములయం దున్నది. శ్వపాకుఁడనియు శ్వపచుఁడనియు మాలవానికి నామములు గలవు. కుక్కనుదినువాఁడని యాశబ్దముల కర్థము. అప్పు డర్ధరాత్రిమయ్యె. మాల లందఱు నిద్రించుచుండిరి. చండాలురు చూడకుండఁ గుక్కమాంసమును గడించి తిని యాఁకలి దీర్చికొని ప్రాణరక్షణముఁ జేసికొనవలెనని విశ్వామిత్రుఁడు కృతనిశ్చయుఁ డయ్యెను. వసిష్ఠుని ధిక్కరించి మహాతపంబు గావించి పరమేష్టిని మెప్పించి బ్రహ్మర్షియై మహేంద్రునితోఁ బ్రతిఘటించి త్రిశంకునకుఁ బ్రత్యేక స్వర్గము గల్పించి సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేయ సంకల్పించిన తపోధనచక్రవర్తి యగు విశ్వామిత్రుఁడు కాలవశమునఁ బేరాఁకలి కోర్వలేక కుక్క

మాంసమును దినఁదలంచి దానిని దొంగిలించి పుచ్చుకొనవలయునని సంకల్పించెఁగదా! పొట్టకూటికై మనుష్యుఁడుచేయదగినపని చేయరాని పని యనక స్థితి మారినపుడెల్ల యకార్యములం జేయును. అట్లు నిశ్చయించుకొని యా మహర్షి దానిం జేకొనునప్పటికి దాని ప్రక్కను బండుకొని నిద్రించుచున్న మాలవాఁడు మేల్కొని యెవఁడువాఁ డని కేకవేసెను. "నేను విశ్వామిత్రుఁడ"నని యతఁడుత్తరమిచ్చెను. చండాలుఁ డాపలుకులు విని విశ్వామిత్రునివంటి మహాత్ము లట్టిసమయమున వెలివాడకు వచ్చినందులకు మిక్కిలి విషాదపడి భయముగదుర గన్నుల నీరు పెట్టుకొని "స్వామీ! ఏల మీవంటి మహానుభావు లీచండాలవాటికకు రావలసె? దారి తప్పివచ్చితిరా? రావలయునని వచ్చితిరా? వచ్చిన కార్యమేమి?" అని చేతులు జోడించి ప్రార్థించె. అనవుడు విశ్వామిత్రుఁడు గద్గదస్వరముతో నిట్లనియె. "ఎన్నిదినములనుండి యోనాకాహారము లేదు. ఆఁకలిచేఁ బ్రేవులుమాడిపోవుచున్నవి. బలహీనమగుటచేత నంగములు స్వాధీనమగుటలేదు. కన్నులు తిరుగుచున్నవి. మేను తూలుచున్నది. ఎందరి నడిగినను బట్టెడన్నమైన నాకు దొరికినదికాదు. మీ రెల్లరు నిద్రించుచుండుటచే నీకుక్కమాంసమును దొంగిలించి ప్రాణరక్షణముఁ జేసికొనవలయునని తలఁచితిని" అనవుడు మాలవాఁ డిట్లనియె. "దేవా! కడజాతివాఁడను. మూర్ఖుఁడను; నేను మీకు ధర్మములుపదేశింపఁ జాలను. అయినను నావిన్నప మొక్కటాలకింపుఁడు. కుక్క యధమ జంతువు. దాని మాంస మధమాధమము. దొంగిలించుట మహాపాతకము. ఎల్లవిధములచేతను నింద్యమైన యాకర్మమును దేవరవారివంటి మహాత్ములు చేయఁదగునే! మీరు జాతిచేత క్షత్రియులు. మహిమచే బ్రహ్మర్షులు. ఇంద్రాదులను గడగడ వడఁకఁ జేసిన తపశ్శాలురు. మీరె యిట్లు చేయ మానవుఁ డెవ్వఁడిఁక నీతిమార్గమున మెలఁగును?" అన

వుఁడు విశ్వామిత్రుఁడు వాని కిట్లని ప్రత్యుత్తరమిచ్చె. "ఓరీ! ప్రాణములు పోవుచున్నవి. ఆపత్కాలమునందు మనుష్యుఁడీపరమార్థమాపరమార్థమనక యెల్లపదార్థములభుజింపఁదగు. ప్రాణముపోవుచున్నప్పుడు దాని నిల్పుకొనుటకై చేసిన దొంగతనము దొంగతనముగాదు. ఇదియే పరమధర్మసారము. ఇఁక నొక్కనిముసమైన నే నిలువఁజాల. నన్ను నీనడ్డగింపకుము. నన్ను నీవు కరుణింపుము" అని విశ్వామిత్రుఁడు పలుకుటయు మాలవాఁడు మారు పలుకలేక „ స్వామీ! మీచిత్తమువచ్చినట్లు చేయుఁ"డని యూరకుండెను. ఆమహాత్ముఁడు శునకమాంసమును దిని ప్రాణరక్షణముఁ జేసికొనెను. అనంతరము వానలు కురిసెను. పంటలు పండెను. జనులు సుఖించిరి.

---

## కపోతము-కిరాతుఁడు.

---

ఒక కిరాతుఁడు వేఁటకు వెడలి కొన్నిపక్షులఁ బట్టుకొని సంచిలోఁబెట్టుకొని యడవిలోఁ దిరుగుచుండఁగా గొప్ప గాలివాన వచ్చెను. అరణ్యమంతయు జలమయమయ్యెను. ఆబోయకు నిలుచుటకైన నించుక తావు దొరకదయ్యె. వాని కట్టుకొన్న బట్టలు తడిసిపోయెను. చలిచే వాఁడు గజగజ వడఁకుచు గుబురుగానున్న యొకచెట్టు క్రిందకరిగి యొక రాతిపై గూరుచుండి "నాప్రాణరక్షణార్థమై యీవృక్షము మీఁదనున్న సమస్తభూతములఁ గొలిచెద. కరుణించి రక్షింపుఁ"డని ప్రార్థించెను. ఆచెట్టుతొఱ్ఱలోనున్న మగపావురము తనపెంటి రాకపోవుటచేమిక్కిలివిషాదమునొందియిట్లువగవఁజొచ్చెను. „అయ్యో! నాప్రియురా లెక్కడ కరిగినది. ఇంత ప్రొద్దుపోవువఱకు నెక్కడ నుండువదికాదు. ననుఁబాసి క్షణమైన నుండనోపదు. వేఁటకాండ్రి

వలలోఁ జిక్కియుండునా! నాసదెబ్బకు చచ్చియుండునా ? అది లేనినాఁడు నా జన్మమేల? అనుకూలమైన భార్య పోయిన పిదప బ్రతుకుటకంటె బలవన్మరణము మేలు. హా! యెందు వెదుకుదు ? ఏమి సేయుదు? అదిలేకపోవుటచే నాతొఱ్ఱ పాడువారినది. ఎవరిచేత జిక్కెనో? ఏమి పాట్లు పడుచున్నదో? దైవమా ఏమి తెరువు ?" అని దుఃఖించుచుండ నాతని యాలాపములను వేఁటకాని సంచిలోనున్న యా పెంటిపావురము విని సంతోషించి యిట్లనుకొనియెను. "ఆహా! యిప్పుడుకదా నాజన్మము ధన్యమైనది. ఏయిల్లాలినిమిత్తమై మగఁడు శోకించునో యాయిల్లాలు మిక్కిలిధన్యురాలు. భార్యసమక్షమున లేనప్పు డామె గుణంబులఁ దలఁచి భర్త శోకించెనేని యామె పతిమనస్సున కెక్కిన భార్యయని చెప్పవచ్చును. నాజీవితముయొక్క పరమార్థము నేను పొందించితి" నని తలంచి యాసంచిలోనుండి పక్షిభాషణంబులతోఁ దనభర్త నుద్దేశించి యిట్లనియె. "నే నీవేఁటకాని వలలోఁ దగుల్కొంటి. నాకు మరణకాల మాసన్నమైనది. విధికృతంబునకు విచారించిన ఫలంబు లేదు. మరణ మెప్పుడో యొకప్పుడు రాక మానదు. దానికై వగవవలదు. జన్మమెత్తినందులకు లోకోపకారముఁ జేసి మృతినొందవలయును. పరోపకారము సేయనిజన్మము వ్యర్థము. కావున నీవు నాకొఱకై వగవక ధైర్యము చిక్కఁబట్టి నీయింటి కభ్యాగతుఁడై వచ్చియున్న యీబోయవాని కేదైన నీ యోపిన యుపకారము సేయుము. చలిచే నీతఁడు వడఁకుచున్నాఁడు. కాలుసేతులు వంకరపోవుచున్నవి. ఉపేక్ష జేసిన పక్షమున మృతి నొందవచ్చును. ఎట్లయినఁ బాప మీతని రక్షింపుము!" అని తనయిల్లాలు పలుకుటయు మగపావురము దానిమాటల కచ్చెరువడి విచారించినఁ గార్యంబు లేదని తెలిసికొని యది తన కుపదేశించిన పరమధర్మము ననుష్ఠింపఁ దలఁచి బోయ

నుద్దేశించి “అయ్యా! నీవు మాయింటి కతిథివై వచ్చితివి. నీవు మిక్కిలి డస్సినట్లు కనంబడుచున్నాఁడవు. నీకేమి కావలయునో చెప్పుము. నాయోపినకొలఁది సాయమొనర్చి నీయాపదఁ బాపఁ గడంగెద!” నని మనుష్యభాషణములఁ బలుక సంతసించి యాకిరాతుఁ “డతిసీతున బాధపడుచున్నాఁడను. చలిచే నాచేతులు కాళ్ళు స్వాధీనములవుట లేదు. మాటయు వచ్చుటలేదు. వెంటనే చలిబాధ మాన్ప” మని వేఁడుకొనెను. ఆపలుకులు విని యాపులుఁగు తొఱ్ఱ విడిచి చుట్టుపక్కలనున్న యెండుపుల్లలు ముక్కునఁ గఱచికొని తెచ్చి పోఁవుగాఁ బెట్టి దగ్గఱనున్న పల్లియకుం బోయి నిప్పున్నకఱ్ఱ యొకటి ముక్కునం దగిలించుకొని తెచ్చి యాపుల్లల ప్రోవునం బెట్టి మంటఁ జేసి చలి కాచుకొనుమని బోయతోఁ జెప్పెను. కిరాతుఁడు పరమానందభరితుఁడై చలిమంటకాఁగి సీతుబాధ బాపికొని సంతుష్టుఁడై పులుగుం జూచి “మిత్రమా! చలిబాధ తొలఁగినది. ఆఁకలి మిక్కుటముగ వేయుచున్నది. దీనిని భరింపఁజాల కున్నవాఁడ. సీతుబాధఁ దీర్చినట్లె యాఁకలిబాధ గూడ నీవే తీర్పవలయు” నని చెప్పెను. కపోత మాతనియార్తిఁజూచి కడు జాలినొంది యిట్లనియె. “అయ్యా! మాబ్రతుకొక బ్రతుకు గాదు. మావంటివార మున్నను లేకపోయినను ప్రపంచమునకు వెలితి లేదు. ఇప్పుడు నేను నీకాహారమయ్యెద. సందేహింపక భక్షింపుము. ‘పరోపకారార్థ మిదం శరీర’ మ్మను వాక్యము పెద్దలు చెప్పఁగా విని యది యాచరణమునం బెట్టుటకు సమయము నిరీక్షించుచుంటిని. ఇదె సమయము వచ్చినది. ఈకార్యముచేత శరీరము పావన మగు” నని మండుచున్న యాయగ్నికిఁ బ్రదక్షిణముఁ జేసి యామంటఁ బడి మృతినొందెను. ఆకపోతముయొక్క యౌదార్యమును సాహసమును జూచి బోయఁడు నిశ్చేష్టుఁడై తెల్లబోయి చూచెను. ఆఁకలిబాధ వానికి నుపశమించెను. ఆశ్చర్య మధిక

మయ్యెను. మనంబు పరిపరివిధంబులం బోయెను. తలఁపులు గుంపు లుగుంపులై మనస్సు నావరించెను. కిరాతభావ మడఁగెను. దాని స్థానంబున వైరాగ్య మంకురించెను. అపుడు వాఁడిట్లు తలపోసెను. “ఆహాహా! మూఁడులోకములయం దెక్కడనైన నిట్టిపౌరుషము గలదె? ఈపక్షికిఁ గలకారుణ్యము ప్రపంచకమున నేజంతువునకైనఁ గలదె? పులుఁగుల నెల్లఁ బట్టి చంపి తినునట్టి ,నావంటి కిరాతునకుఁ దనభార్యను సయితము బట్టుకొన్న దురాత్మునకుఁ దనశరీర మర్పించిన యీపక్షి దాతృత్వమున బలిచక్రవర్తికంటె, కర్ణునికంటె, దధీచికంటె మిన్న యని చెప్పిన నది పొగడితకాదు. పక్షి యేమి? కిరాతుల కేమి? శరీర మిచ్చుటయేమి? మహర్షులచరిత్రమైన నింత యద్భుతముగ నుండదు. ఈపక్షిముందర మనుష్యుఁ డెందుకు? మానవజన్మమెత్తి వర్తనముచేతనేఁ బశువునైతిని. పక్షిజన్మమెత్తి యిది జ్ఞానసంపత్తిని, లోకోపకారపరాయణతను, మనుష్యులతలఁ దన్నినది. ఇటువంటి నిరపరాధములైన పులుఁగులను జక్కని జంతువులను నిష్కారణముగఁ జంపి తినునట్టి మనుష్యునిజన్మ మెందుకు? ఈపాడుపొట్టకై యిన్నిజంతువుల నేలఁ జంపవలె? ఛీ! నాజన్మము కాల్పనా? ఇఁక ముందు నేను నాక్రూరచేష్టలు మాని భూతదయ గలిఁగి వర్తించెద. పక్షి పరమగురువై వట్టిమాటలతోఁ గాక క్రియారూపమున గొప్ప ధర్మంబుల బోధించెను. దీనిని నేను భక్షింపను. నాశరీరమును గూడ దీనివలె నగ్నిహోత్రమున కాహుతిఁ జేసెద. హా! పరమేశ్వరా! యీవఱకు చేసినమహాపాతకముల క్షమింపుము! అనుతాపప్రాయశ్చిత్తముఁ జేసికొనుచున్నాఁడ. ఇఁక ముందు పరమదయాళుఁడనై వర్తించెద!” నని విచారించి తనయధీనమందున్న పక్షులనన్నిఁటిని విడిచిపెట్టి వలసైత మవ్వలఁ బాఱవైచి జ్ఞానోదయసంపన్నుఁడై గమ్యస్థాన [illegible]వింబడి ముం[illegible]

గీచుకొనుటచే శరీరము నెత్తురు కాఱుచున్నను దెలియక చని చని యొక కార్చిచ్చునం బడి మృతినొందెను. తన పెనిమిటిచావుం జూచి దుఃఖపరవశయై యాఁడుపావురము "హా! ప్రాణేశ్వరా! నీవు లేని బ్రతుకు నాకెందుకు? మన మిరువురము కలిసి యాడినయాటలు, చేసినసంచారములు, ననుభవించిన సౌఖ్యములుఁ జెప్పుకొన్న ముచ్చటలు నేను మఱవఁజాలను! కాన నీతోడనే వచ్చెద" నని యామంటలోఁ బడి మేను వాసెను. పరోపకారార్థమై ప్రాణములువిడిచిన కపోతము, భార్యాసమేతముగఁ బరమపదము నొందెను. పశ్చాత్తాప మహాగ్నిచేఁ బరిశుద్ధుఁడైన కిరాతుఁడును ముక్తుఁడయ్యెను.

---

## గ్రద్ద—నక్క.

నైమిశమను నొకపట్టణము కలదు. అందొక బాలుఁడు మృతినొందెను. ఆశవమును దీసికొని చుట్టములు శ్మశానమునకుఁ బోయి చూచి చూచి చేతులారఁ బాఱవైవఁజాలక దాని నక్కడఁ బెట్టుకొని మహాదుఃఖపరవశులై విలపించుచుండిరి. అప్పు డొక్కగ్రద్ద యాకాశమునుండి క్రిందికి దిగి వచ్చి యేడ్చుచున్నయాజనులతో నిట్లనియె. "మీరు భయము విడిచి యీవిధంబున విచారింపఁదగదు. ప్రొద్దు క్రుంకుచున్నది. సూర్యుఁ డస్తమించినతరువాత నిచ్చోట మనుష్యులుండఁదగదు. భూతములు, పిశాచములు, రాక్షసులు చీఁకటి పడిన తోడనె శవంబులఁ బీకికొని తినుటకై యరుదెంచును. ఆసమయమున వానికంటికి బ్రతికియున్నమనుష్యులు కనపడిన నవి తప్పక చంపి తినును. బ్రతికియున్నవారు చచ్చినవారితోఁ బోవుదురె? ఇంతనెట్టి కలదా? మీరు విలపించినయెడ మృతిఁ జెందినబాలుఁడు మరల

బ్రతుకునా? లోకవృత్తము మీరు చూచుటలేదా? ఎంతదుఃఖమున్న నంత దుఃఖపడుదురా? దేనికైన మితి యుండవలెను. బాలుఁడు మీ వాఁడుకాఁడు. మీవాఁడైన బ్రతికియేయుండును. జననమరణములు సమస్తజంతువులకు సహజములైనవి. అందుచేత మీరు విచారింపక వైరాగ్యముగలిగి శవము నిచ్చటఁ బాఱవైచి గాఢాంధకారము గ్రమ్మకమునుపె యింటికిఁబోయి స్నానములుచేయుఁ" డని గ్రద్ద మంచియుపదేశము చేయుటయు బంధువులందఱు దానిమాటలు సత్యములగుటంజేసి శవము నక్కడ విడిచి బయలుదేఱి కొన్ని యడుగులదూర మరుగునప్పటికి నక్క యొకటి బొక్కలోనుండి విసవిస వచ్చి వారిం జూచి యిట్లనియె. "అయ్యయ్యో! మీరెంతబుద్ధిహీనులు. గ్రద్దమాట నమ్మి మోసపోయి బాలకుని విడిచి వచ్చుచున్నారా? బాలునిమొగముమీఁద కళ యైన మాఱలేదు. పున్నపుఁజందురునివలె నున్న యాబాలుని విడిచిపోవుటకు మీరు కాళ్ళెట్లాడుచున్నవి? పాఱవైచుటకు మీకుఁ జేతు లెట్లాడినవి! ముఖమునైఖరి చూడ నీతఁడు చచ్చినట్లు తోఁచదు. ప్రాణము కడఁబట్టి యుండవచ్చును. అందుచే మరల బ్రతుకవచ్చును; ఒకవేళ బ్రతుకకపోయినను శోకముపోవునట్లు మీరఁ నఁబడి నాలుగుగడియ లేడువనైనవద్దా? గట్టిగా నేడ్చినయెడల దుఃఖము కొంతశమించును. ఏమైనను మీరింత వేగముగాఁ బోఁగూడదు. ప్రొద్దుగ్రుంకినపక్షమున వచ్చినభయమేమి? మనుష్యుఁ డొక్కఁడే యున్నపక్షమున భూతపిశాచములు మీఁదికి వచ్చును; కాని పదిమందియున్నప్పుడు సాహసించి మీఁదికి రావు. ఒకవేళ వచ్చుననుకొనుఁడు! ముద్దులు మూటగట్టుచున్న చక్కని చుక్కపోఁగాలేనిది మీరు పోయిన నేమి? తక్కిన మాటటుండఁ గానవ్వుచుఁ బండుకొని నట్లున్నాఁడు గాని బాలుఁడు మృతినొందినట్లు లేఁడు. శరీరమింకను వెచ్చగానున్నది. కావున మరల జీవింప

వచ్చునని నాకింకను ధైర్యముకలదు. అందుచేత మీరు కొంతసే పిచ్చుట నిలువుఁ"డని చెప్పి నక్క వారలనెంతయు శవముకడకు రప్పించుటఁజూచి గ్రిద్ధ వారల నుద్దేశించి యిట్లు పలికెను. "ఏమిది? జిత్తులమారినక్క మాటలువిని మీరు మరలివచ్చితిరా! మీకన్న మూర్ఖులు లోకమందుండరు. బాలుని మొగమునఁ బ్రేతకళ యావహించినది. బ్రతికియున్నప్పు డేనుఁగుదంతమువలెనున్న వాని మేను నలుపెక్కినది కనుఁగొనుటలేదా? చేతులు కాళ్ళు బిఱ్ఱబిగిసినవి. యముఁడు నిర్దయుఁడై మీపిల్లవాని ప్రాణములు హరించె. ఇంక వెడవెడ యాసలు విడిచి గృహంబునకుం జని స్నానములుచేసి బాలునికి సద్గతులు గలుగుటకై బ్రాహ్మణులకు దానములు సేయుఁడు. చచ్చినవా రెచ్చటనయిన మరలఁ బ్రతుకుట మీరు వింటిరా? చాలుఁజాలు! లేనిపోనిభ్రమలుపడక సత్వర మింటికరుగుఁడు." అనవుడు గ్రిద్ధమాటల నధిక్షేపించి జంబుక మిట్లనియెను. "అన్నన్నా! ఈ మోసగాండ్రకే దినములుగాని మంచివారికి దినములు కావు. అల్లారుముద్దుగనున్న యీచిన్నబిడ్డ ముఖపద్మముఁ జూడ పీనుగులను బీకికొని తిను నావంటి దానికే కన్నులనీరు వచ్చుచున్నది. మీరింత జాతిగుండెవారలైనా రేమి? గ్రిద్ధ మాటలా మీకు పథ్యములు? నావంటిదానికి నయితము జాలిఁగొలుపుచున్న యీచిన్నిపాపనిఁగూర్చి మీరింత కఠినహృదయులు గానేల? కొంచెము ప్రయత్నముఁజేసి చూడరాదా? నామాట నిజము కాకపోయినపక్షమున నప్పుడే యొకయేడ్పేడ్చి పోవచ్చు. ఇంతలో నేమి వచ్చినది." అనుటయు గ్రద్దవారింజూచి "నేనుపుట్టి పంచెండువందల సంవత్సరములైనది. ఈనడుమ నెందఱో పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు మృతినొందిరి; కాని వారిలో నొక్కఁడైన బ్రతికివచ్చుట నేను గని వినియెఱుంగ. జంతువులు జన్మాంతరము నొంది మరలవచ్చునుగాని, యీశరీరంబున బ్రతికి మరలవచ్చుట యు

సంభవము. బాలునియందలి గాఢప్రేమచేత నక్క లోకవిరుద్ధము లైనమాటలు చెప్పినను మీరవి యసంభవములని యెంచక మోసపోవుచున్నారు. కావున జాగుసేయక వెడలుం"డని వచియింప వారు ప్రేతను విడిచి నడువసాగిరి. నక్క వారిమార్గమున కడ్డముపోయి "తనకుఁ దోఁచకున్న నొకరుచెప్పిన విను నేర్పైన నుండవలయు. రెండును లేనివారు మీవలెనే చెడుదురు. పూర్వకాలమున రఘురాముఁడు చచ్చినబ్రాహ్మణకుమారుని బ్రతికింపలేదే! సృంజయునికుమారుఁడు మృతినొంద వానిని నారదుండు బ్రతికించి పుణ్యముఁ గట్టుకొనలేదే! చచ్చిపోయినవారందఱు బ్రతికివత్తురని నేను చెప్పుటలేదు. చుట్టము లదృష్టవంతులైనయెడఁ గోటికొకరు బ్రదుకుచుందురు. ఆ యదృష్టము మీ కేలఁ బట్టఁగూడదు? రండు! రండు!" అనినొక్కిచెప్ప వారు మఱలివచ్చి పాపని శవంబుచుట్టును జేరి పెద్దపెట్టున నేడ్వఁ దొడఁగిరి. అపుడు సూర్యుఁ డస్తమించెను. చీఁకటులు నలుదెసలఁ గ్రమ్మెను. గ్రద్ద నిరాశఁ జెంది పోయెను. నక్క మిక్కిలి సంతోషముతో నిలిచి యుండెను. గ్రద్ద రాత్రివేళ సంచరించుటకు వీలులేదు; కావున ప్రొద్దుగ్రుంకకముందే శవమును బొడుచుకొని తినుటకై తనలాభమే చూచుకొని వారలసాగనంపఁ బ్రయత్నించెను. నక్కకు రాత్రి యెక్కువవీలుగానుండును; కావున ప్రొద్దుగ్రుంకి చీఁకటిపడునంతవఱకు ప్రేతబంధువుల నేదో యొకవంకచెప్పి యాపుటకై ప్రయత్నించెను. చిట్టచివఱకు తన ప్రయత్నములు నెఱవేఱ నిఁక వీరెప్పుడు పోవుదురా శవము నానోట నెప్పుడుపడునాయని నక్క నువ్విళ్ళూరుచుండెను. అప్పుడు శ్మశానసంచారియగు పరమేశ్వరుఁడు శంకరుఁడు పనవి పనవి యేడ్చుచున్న వారికడకుఁబోయి మీకు వరములిచ్చెద కోరుఁడని యనుగ్రహించెను. పుత్రశోకము లేకుండ రక్షించి బాలుని బ్రతికింపుమని వారు ప్రార్థించిరి. అట్లగుగాక యని భక్త

వత్సలుఁడు బాలునకుఁ బ్రాణదానముఁ జేసెను. పరమానంద భరితులై బంధువులు గృహంబునకుఁ జనిరి. ఆఁకలిబాధచేతఁగదా గ్రద్దయు నక్కయు దురాలోచనలుచేసి దుర్వ్యాపారంబునం బ్రవర్తిల్లెనని జాలినొంది మహేశ్వరుఁడు వాటికాఁకలియు దప్పియులేకుండ వర మిచ్చెను.

---

## గాలి, బూరుగుచెట్టు.

హిమవత్పర్వతమునందు గొప్ప శాల్మలీవృక్ష మొకటియుండెను. అది మిక్కిలి ముదుసుచెట్టు. కొమ్మలుపొడుగుపాటివి. మ్రాను గట్టిది. బలమైనది. వేళ్ళు నేలలోతుగా నాటుకొనియుండెను. కలహప్రియుఁడగు నారదమహాముని యొకనాఁ డాదారినిఁ బోవుచు నచ్చట నిలిచి యాబూరుగుచెట్టుంజూచి యిట్లుపలికెను. "ఓబూరుగ! నీవింత పొడవువెడలుపుగలిగి యెంతో నేల నావరించి యున్నదానవు. పక్షులెన్నో నీకొమ్మలలో గూండ్లుకట్టుకొని హాయిగా బ్రతుకుచున్నవి. మృగములు, మనుష్యులు నీనీడం జేరి యెండవేళ సుఖపడుచుందురు. ఇన్నివిధముల నీజన్మము లోకోపకారముగా నున్నది. కావున నిన్నొక్కప్రశ్న మడుగ వేడుక పొడముచున్నది. నాజోలి నీకెందు కనక దానికిం దగినయుత్తరము చెప్పుము. ఎన్నో గాలివానలు వచ్చివెళ్ళినవి. నీకన్నఁ బెద్దచెట్లు నీకన్న దృఢములైన వృక్షములు నేలంగూలినవి. నీవుకూలకపోవుటకుఁ గారణమేమి? వాయుదేవుఁడు నీకుదగ్గిఱ చుట్టమా; లేక ప్రాణమిత్రుఁడా! కానియెడలఁ బెదదానవగు నీజోలికి రానని జాలిచేత వాయుదేవుఁడు ప్రతిజ్ఞఁజేసెనా? నీవృత్తాంత మేమో నాకు సవిస్తరముగఁ దెల్పి నావేడుక దీర్పవలయునని కోరు

చున్నాఁడను" అనవుడు బూరుగచెట్టు గర్వమున నారదుని కిట్లనియె. "మునీంద్ర! వాయుదేవుఁడు నాకు బంధుఁడుగాఁడు. స్నేహితుఁడుగాఁడు. నామీఁద జాలిచేత నన్నతఁడు విడువలేదు. నన్ను విడువుమని చేతులుజోడించి యతనిని నేను వేఁడుకొనలేదు. నేనట్లు వేఁడుకొను దానను గాను. వాయువు నాశ్రయించి దానికాళ్లు పట్టుకొని దాని దయచేత బ్రతుకవలసిన యవసరము నాకు లేదు. నాకంటె వాయువు మిక్కిలి బలహీనుఁడు. నాలోఁ బదునెనిమిదవ యంశమునకైనను వాయుదేవుఁడు పోలఁడు. నాబలమెక్కడ? అనిలదేవునిబలమెక్కడ? అతని చేతనైనపక్షమున నన్నీనాటికే నేలఁగూల్చివేయును. చేతఁగాకయూర కున్నాఁడు" అని సగర్వముగఁ బలికిన బూరుగుమాటలు విని నారద ముని నవ్వి "ఓశాల్మలీవృక్షమ! ఏమిబింకపుమాట లాడుచున్నావు! వాయుదేవునిశక్తి నీవెఱుగవని తోఁచుచున్నది. మహాపర్వతములు సైతము పెద్దగాలిపెట్టునకు నిర్మూలింపఁబడఁగలవు. అట్టియెడ నీవంటి యొకచెట్టు లెక్కయేమి? కావున నీగర్వోక్తులు కట్టిపెట్టి వినయముగ బ్రతుకు" మని హితోపదేశముఁ జేసెను. నావుడు వానిపలుకు లాలకించి శాల్మలీతరు విట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నారద! ఎఱుఁగని వాఁడ వెఱుగనియట్లుండక యూరక యిట్లు వలుకనేల? గాలిదేవర నాజోలికి రాకపోవుటచేఁ దనపరువు దక్కించుకొనుచున్నాఁడు. ఒక్కసారి నామీఁదికి వచ్చెనా వాని గర్వభంజన మగును. వెనుకటిపేరు ప్రతిష్ఠలన్నియు నశించును. అందుచేతనే చూచిచూచి నాపైకి రాఁడు." అట్లుపలుకుచున్న భూరుహము గర్వోక్తులు విని నారదుఁడు మెండియు నిట్లనియె." ఈబిరుసుమాటలు మరచిపోకుము. నీబీరము లన్నియు వాయుదేవునికి దెలియకపోవు. అతఁడు నీ మీఁదికి రాక పోఁడు. వచ్చినప్పుడు ధైర్యము చిక్కఁబట్టి నిలువుము." అనియచ్చో టువాసి యామహర్షి తరలిపోయి తిన్నఁగా వాయుదేవునియొద్దకరిగి

తనకును శాల్మలీవృక్షమునకుం జరిగినవృత్తాంతమంతయుఁ బూసగుచ్చినట్లు చెప్పెను. అది విని వాయుదేవుఁడు మండిపడి కోపవశంబున నొడలెఱుఁగక తిన్నఁగాఁ జెట్టుకడకుఁ బోయి తిరస్కారభావముతో దానిం జూచి యిట్లనియె. "ఏమే బూరుగా! నీవు మహాధైర్యశాలివఁట! పర్వతముకంటె బలమైనదానవఁట! ఇంతదానవని యెన్నఁడెఱుఁగనైతిని. ఎప్పటినుండి నీకింత బలము వచ్చె? కల్పవృక్షముల కెల్లగొప్పదానివలెఁ గనపడుచున్నావు. నీతల బిరుసెక్కినది. చేటుకాలము వచ్చుటచేత నీవిట్లు ప్రేలుచుంటివి. నీలో నేను పదునెనిమిదవయంశమునకునైనఁ బోలనని నారదునితోఁ జెప్పితివఁట! ఒకనాఁడు బ్రహ్మదేవుఁ డీమార్గమునంబోవుచు డబ్బాటుగ నీనీడను నిలిచె. బ్రహ్మదేవుఁడు నిలుచుటచేత మిక్కిలి పావనమైనదానవని గౌరవముచే నీజోలికిరాక నిన్ను విడిచితినిగాని, నీ బలమున కోడి గాదు. నీశక్తికి జంకికాదు. దయఁ దలఁచి విడుచుటచేత నీవిట్లు తెగనీల్గుచుంటివి. రే పీపాటికి నీయవస్థ యెట్లుండునో చూచుకొమ్మ. కాచుకో. రేపటి యుదయమున వచ్చెద" నని కఠినోక్తులు పలుకు వాయువుం దప్పక చూచి బూరుగుచెట్టు మునుపటి కంటె నెక్కువ గర్వముతో నీ తెఱంగున భాషించెను. "ఓహోహో నీబెదరింపుల కిక్కడ బెదరువారు లేరు. అన్నిచెట్లవంటిదాన ననుకొని నన్ను జడిపించుచున్నావు కాఁబోలు. నీవెఱ్ఱియాగడము లిక్కడసాగవు. పాతాళలోకమునఱకు వేళ్ళు నాటుకొనియున్న శాల్మలీవృక్షము నేను, చూడు నాదెబ్బ. నీవుకాదు. నిన్నుఁ బుట్టించిన జేజేలు వచ్చినను భయపడుదాననుగాను. రేపు వచ్చినను భయపడుదాననుగాను. రేపువచ్చినను సరే, ఇప్పుడు వచ్చినను సరే. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అనునట్లు నీవుచెడిపోవుకాలము వచ్చినది" అట్లు పలికిన బూరుగు తేలిక మాటలకు మనంబున మిక్కిలికోపించి మరు

నాఁడు విజృంభించి దానిని నిర్మూలనముఁ జేయవచ్చునని తలంచి మారుతుఁ డరిగెను. అతఁడు పోయిన తరువాత వృక్షము పశ్చాత్తాపమునొంది తనలో నిట్లు విచారింపఁదొడఁగెను. "అయ్యయ్యో! నా యంతరమును మారుతునియంతరమును నెఱుఁగక మహాబలుఁడగు వాయుదేవునితోఁ బంతగించి యిచ్చవచ్చిన తెఱంగునఁ బ్రేలితిని. అతనిధాటికి నే నాఁగఁగలనె? గడ్డపాఱలు గ్రొట్టుకొని పోవుచున్నప్పుడు గడ్డిపఱకలు నిలుచునా? కులశైలములను గూల్పఁజాలిన గాలిదేవునెదుట నే నేమి, నిల్చుటేమి? నారదమునితో నేల బింకములు పలికితిని? వాయువన్నట్లు నాకు చేటుకాలమే వచ్చినది. అయిన నిప్పుడు విచారించి యేమి చేయుదును. చెడినకార్య మైట్లో కూడఁదీసికొనవలయును. వాయుదేవుఁడు వచ్చి నన్నేమిచేయును? కొమ్మల విఱుచును. ఆకులు రాల్చును. ఆపని నేనే చేసి వాయుదేవున కవకాశము లేకుండఁ జేసెద." అని యారాత్రి తన కొమ్మలు తానే విఱుచుకొని తనయాకులు తానే దుల్లగొట్టుకొని, తనకాయలు తానే రాల్చుకొని మోడై యుండెను. మఱునాఁ డుదయమున వాయుదేవుఁడు వచ్చి మోడువడియున్న యాచెట్టుం జూచి నవ్వి "యేమే! శాల్మలీ యీగతి నున్నదానవు. నేఁ జేయవలసిన పని నీవే చేసికొంటివి. ఇంక నేను వేరేనిన్ను శిక్షింపనేల? నాతో విరోధము సాధించినందుకు నాప్రయత్నమక్కఱలేకయే నీకుందగిన శిక్షయైనది. ఇక ముందు బుద్ధిగలిగి బ్రతుకుము. తనలావు నెదిరిలావు నెఱుఁగక బీరములు పలుకువాఁడు నీవలెనె చెడిపోవును. ఇఁకమీఁద నెన్నఁడిటువంటి తెలివిమాలిన పనులంజొరకుము. అని బుద్ధులుచెప్పి దాని మౌఢ్యమునకు క్షమించి నిర్మూలింపక చల్లగ నరిగెను. దుర్బలులైనవారు ప్రబలులైనవారితోఁ గయ్యమునకుఁ గాలుద్రివ్వి గిల్లి కలహంబులం దెచ్చుకొని తనసామర్థ్యముఁ బఱులసామర్థ్యము నెఱుఁగక యిట్లె భంగపడుదురు.

## నాడీజంఘుని కథ.

మధ్యదేశమున గౌతముం డను బ్రాహ్మణుండుగలఁడు. అతఁడు చిన్ననాఁట వేదాధ్యయనముఁ జేయక తల్లిదండ్రులు చెప్పినట్లు వినక దుస్సహవాసములు మరగి త్రాగుబోతయి మాంసముఁ దిని వర్ణభ్రష్టుఁడై బోయదాని నొకతె నుంచుకొని దానివలన సంతానముఁ గని నిరంతరము భోగపరాయణుఁడు గావునఁ దనకుఁ దనయుంపుడుకత్తెకు దానిబిడ్డలకు సుఖానుభవమునిమిత్తము ధనముకావలసి యున్నందున దాని సంపాదించుటకయి యెన్నో యుపాయము లాలోచించెను. వర్తకముచేయుటవలన ధనము సంపాదింపవచ్చునని నిశ్చయించుకొని యాదుష్ట బ్రాహ్మణుఁడు బేహారమునకై జను కొందఱుకోమట్లఁగలిసి యొక యడవిఁ బోవుచుండఁగా నొక మదపుటేనుఁగు వర్తకులమీఁది కుఱికి తొండముతోఁ గొట్టియుఁ గాళ్ళతో నేలరాచియుఁ గోఱలతోఁ బొడిచియు, ననేకుల సంహరించెను. "పాపీ చిరాయుః" అనునట్లు దుష్టబ్రాహ్మణుఁడు దాని బారినుండి తప్పించుకొని మఱియొకవైపు పరుగెత్తి ప్రాణములు దక్కించుకొని కొంత దవ్వరిగి యరిగి యెట్టకేలకు విశాల మగునొకమఱ్ఱిచెట్టుకడకుఁబోయి దాని నీడను విశ్రమించెను. ఆవటవృక్షముమీఁద నాడీజంఘుఁ డను పేరుగల యొకకొంగ చిరకాలమునుండి నివసించియుండెను. అది బ్రహ్మదేవునికి మిక్కిలి ప్రియమయినది. మఱ్ఱి నీడను విశ్రమించిన యాబ్రాహ్మణునిం జూచి కొక్కెర "అయ్యా మీదేయూరు? ఎందుండి యిటకు వచ్చుచున్నారు? ఇట్లు వచ్చుటకుఁ గారణ మేమి?" యని యడిగెను. అడుగుటయు నతఁ డాకొక్కెరతోఁ దాను బ్రాహ్మణుఁ డగుటయు దుస్సహవాసంబునం జెడిపోవుటయు ధన మార్జించు నిమిత్తము వెడలుటయు, వర్తకులను మదపుటేనుఁగు చంపుటయు

లోనుగాఁ గల తనవృత్తాంతము సమగ్రముగఁ జెప్పెను. అది విని యాకొక్కెర వానియెడ జాలిపడి యాకాశగంగలోనున్న రుచివంత ములగు చేపలం దెచ్చి పక్వముఁ జేసి యడవిలోఁ గల మంచిపండ్ల నేర్చి తెచ్చి తినుమని యాతని కిచ్చి మెత్తని చిగుళ్ళతోఁ బాన్పు రచియించి పండుకొమ్మని చెప్పి తాను నారాత్రి నిద్దురవోయి మఱునాఁటి యుదయమున మేల్కాంచి భూసురున కిట్లనియె. "అయ్యా! పేదతనము వాపుకొనుటకు మనుష్యునకు నాలుగు ముఖ్య కారణములు గలవు. మొదటిది బుద్ధి. రెండవది మిత్రము. మూఁడు నాలుగులు, వెండి బంగారములు. నేను నీకు మిత్రుఁడనైతిని గాన నావలన నీవు దారిద్ర్యముఁ బోఁగొట్టుకొనఁగలవు. పనికిమాలినపక్షి పేదతన మెట్లు పోఁగొట్టఁగల దని తలంపకుము. ఇక్కడికి మూఁడు యోజనములదూరమున మధువ్రిజ మనుపట్టణము గలదు. దానిని విరూపాక్షుఁడను రాజు పాలించుచుండును. అతఁడు జన్మముచేత రా క్షసుఁడు. కాని సద్గుణసంపన్నుఁడు. నాకు మిక్కిలి ప్రాణమిత్రుఁడు నీ వతనియొద్దకుఁ బోయి నాఁడీజంఘుని మిత్రుఁడ నని చెప్పి నీకుఁ గా వలసిన ద్రవ్య మడుగుము. సంశయింపక యతఁ డిచ్చును. నీ దారి ద్ర్యవిచ్ఛిన్న మగును. మహారాజువలె నీవు బ్రతుకవచ్చును." అని బకము పలుకుటయు విప్రుఁడు మిక్కిలి సంతోషించి బయలుదేఱి కొంగచెప్పిన దారిని మధువ్రిజపురమునకుఁ జని, రాక్షసరాజు దర్శ నముఁ జేసి కొక్కెర తన్ను పంపెనని చెప్పెను. అతఁడా నేలవేలు పును దేఱి చూచి "యితని వాలకమును జూడ నధమబ్రాహ్మ ణుఁడు వలెఁ గనఁబడుచున్నాఁ"డని తనలోఁ దలంచి బ్రాహ్మణుని పూర్వవృత్తాంత మడిగి తెలిసికొని తాననుకొన్న దంతయు నిజమ నిగ్రహించి దుష్టబ్రాహ్మణుఁ డైనను తన మిత్రునిపంపున వచ్చు టఁ జేసి యుతనిని సత్కరింప దగు నని నిశ్చయించుకొని వేదవేత్త

లైన బ్రాహ్మణులతోఁ గలిసి సంతర్పణము చేసి, ధనము, బంగారము, రత్నములు మొదలగునవి విశేషముగా నిచ్చి యతఁడు భోజనముఁ జేసిన బంగారముపళ్ళెముఁ గూడ నతనికిచ్చి విలువగల క్రొత్తబట్టలిచ్చి ప్రీతిపూర్వకముగ సత్కరించి పంపెను. బ్రాహ్మణుఁడాధనభారము మోయలేక మోయలేక మెడ, వీఁపు, మూపులు నొప్పులు పట్టునట్లుగ మోసి తెచ్చి యెట్టెటో తనమిత్రమగు కొక్కెరయున్నమఱ్ఱికడకుఁ బోయెను. అట్లు ధనము మోయుటచేతను, మార్గాయాసముచేతను మిక్కిలి డస్సి వచ్చిన యాబ్రాహ్మణునిం జూచి కొక్కెర మిక్కిలి జాలిపడి తన ఱెక్కలతో వాని యాయాసము బోవ విసరి చేఁపలు, పండ్లుఁ దెచ్చి యిచ్చి పానుపునమకూర్చి నిద్రపుచ్చి తానును నిద్రించెను. అది నిద్రించుటఁ గని యాపరమదుర్మార్గుఁడు తనలో "నేఁడు కడుపు నిండినది. రేపుదయమున బయలుదేఱి పోవునప్పుడు దారిలో నాకాహార మెక్కడ లభింపఁగలదు? ఈకొంగ క్రొవ్వినది. దీని శరీరమునందు మాంసము విశేషముగాఁ గలదు. దీనిని జంపి మాంసము ప్రయాణము నిమిత్తము సంగ్రహించెద" నని తలంచి పాపనిశ్చయుఁడై బట్ట బిగియఁగట్టుకొని దుడ్డుకఱ్ఱ చేతఁ బట్టుకొని చెట్టెక్కి మెడమీఁద వక్షము మీఁదఁ గొట్టి కొక్కెరం జంపి దిగివచ్చి యీఁకలఁ దీసి పొట్టచించి కోసి, మాంసము సంగ్రహించి తెల్లవారినతోడనే ప్రయాణమై పోయెను. అచ్చట విరూపాక్షుఁడు కొన్ని దుశ్శకునములం గని యేమి కీడుమూడునోయని విచారించుచు నిట్లనుకొనియెను. "నామిత్రుఁడగు నాడీజంఘుఁడు ప్రతిదిన మిచ్చటి కీపాటికి వచ్చుచుండును. ఇప్పటికి జాము ప్రొద్దెక్కినది. రాకపోవుటకుఁ గారణ మేమి చెపుమా? పాపకర్ముఁడైన యాబ్రాహ్మణుఁ డేమియుఁ జేసియుండఁడు కదా? వాఁ డట్టి వాఁడే. నా మనస్సు కీడు శంకించుచున్నది. ఏమి దైవమా"

యని విచారించి సేవకులం బిలిచి పక్షివార్త యేమయ్యెనో తెలిసి కొని రమ్మని పంపించెను. వారును జని పులుగుం గానక మాంస మొలిచినదానిఁడొక్కంగని రాజునకు సమర్పింప నంత నాచురా త్ముని పట్టుకొమ్మని యానతిచ్చెను. మెఱియలవంటి రక్క సులు పరుగు పరుగునం జని మార్గమధ్యమునఁ బరమనీచుఁ డగు నా బ్రాహ్మణునిం బట్టుకొని రెక్కలు విఱచికట్టి విరూపాక్షునికడకుఁ దెచ్చిరి. "ఈదురాత్మునిఁ జంపి మీరెల్ల భక్షింపుఁ" డని యారా క్షసులకు విరూపాక్షుఁ డాజ్ఞనిచ్చెను. అప్పుడు రాక్షసులు కన్నులు మూసికొని చేతులుజోడించి ,,స్వామీ! మేము నరమాంసము తిను నట్టి రాక్షసులమే కాని యెంతటిరాక్షసుల మైనను మేమీ దుర్మా ర్గునిమాంసము దినఁజాలము. తన కుపకారము జేసినవానిని జంపిన పరమనీచుని ముట్టఁగూడ" దని విన్నవించుకొనిరి. అనవుడు విరూ పాక్షుఁడు ,,మీరు తినుండు, తినకపొండు! ఈదుర్మార్గుని నాయెదు టకుఁ దీసికొని రావల" దని పలికి పెడమొగముఁ బెట్టుటయు దాన వులు వాని నూర్పుబైటకు గొంపోయి కొఱఁత వేసి మేను ముక్క ముక్కలుగఁ గోసి మాంసము కుక్కలకుం బాఱవైచిరి. కుక్క లా మాంసమును వాసన జూచి ముట్టక దూరముగాఁ దొలఁగి పోయెను. కృతఘ్నునిమాంసము శునకము లైన ముట్టవుగదా! అనంతరము విరూపాక్షుఁడు బ్రాహ్మణుండు మాంసముఁ దీసికొని పాఱవైచిన కొంగడొక్క తెప్పించి దాని కగ్నిసంస్కారముఁ జేయించెను. అపు డు దేవేంద్రుఁ డక్కడకువచ్చెను. విరూపాక్షుఁ డతనిం జూచి నా మిత్రుఁడగు నాడీజంఘుని నాకిమ్మని యడిగెను. అపు డింద్రుఁడిట్లని యె. ,,నీమిత్రుఁడు బ్రహ్మదేవునికి మిత్రుఁడు. ఇతని మరణంబున కతఁ డెంతో యుత్తలపడుచుండును. నీవు నీ మిత్రుని కగ్నిసంస్కా రముఁ జేయించితివి. ఇది మంచిపని. శ్మశానమునందు నీమిత్రుని

చితివద్ద కొక్కయావు వచ్చి దూడకు పాలిచ్చెను. పాలనురుగు దూడనోటిమీఁదినుండి గాలికిం జెదరి చితిపైఁబడెను. వెంటనే నాడీజంఘుఁడు బ్రతికి శరీరముతో మరలవచ్చెను. ఇది బ్రహ్మదేవుని మాహాత్మ్యము. అని యింద్రుఁడు చెప్పు చుండఁగానే నాడీజంఘుఁడు విరూపాక్షుని దగ్గఱకు వచ్చి దర్శించెను. విరూపాక్షుఁడు పరమానందభరితుఁడయ్యెను. నాడీజంఘుఁడు పరమదయాళుఁ డగుటచేఁ దనకారణమునఁ జచ్చి పాశబద్ధుఁడై నరకమునకుం గొనిపోఁబడుచున్న బ్రాహ్మణునిదుర్దశకు విచారించి వానిని బ్రతికింపు మని యింద్రుని ప్రార్థించెను. పక్షి యోగ్యతకు సంతోషించి యింద్రుఁ డట్లు బ్రాహ్మణుని బ్రతికించెను. విరూపాక్షుఁ డిచ్చినసొమ్ము మోసికొని బ్రాహ్మణుఁ డెప్పటియట్ల తనయింటికిం జనియెను. కృతఘ్నత మహాపాతక మనియు మిత్రద్రోహ మంతకంటె దారుణపాతక మనియు నీకథవలన మనము తెలిసికొనవలసిన ఫలితార్థము.

---

## —: చిరకారి :—

---

గౌతముఁడను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతని కొక్కఁడే కొడుకు. ఆకుమారుని పేరు చిరకారి. ఎవ్వ రేకార్యముఁ జేయుమని యతనితోఁ జెప్పిన నతఁడు చిరకాలము మిక్కిలివిచారించి పిమ్మట నాకార్యముఁ జేయును. అందుచేత నతనికి చిరకారి యనిపేరు గలిగెను. తండ్రి యొకనాఁడు చిరకారిం బిలిచి ,,కుమారా! నీతల్లినిఁ జంపివేయుము. నేను సాయంకాలము తిరిగి వచ్చునప్పటికీపనిఁ జేయవలయు" నని యాజ్ఞాపించి తన పనిమీఁదఁ బోయెను. చిరకాలమాలోచించి కాని యేకార్యమును జేయనివాఁ డగుటచే చిరకారి

దీర్ఘవిచారసముద్రమందు మునింగిపోయి యెటుఁ జేయఁజాలక చింతింపఁ జొచ్చెను. ఉయ్యేలలోఁ గూర్చున్నవానివలె వానిమనస్సు ముందునకు వెనుకకు నూఁగ సాగెను. ‹‹తండ్రి యాజ్ఞ మీఱఁదగదు గదా! కావున జనకుని పనుపు చేసెద›› నని యొకమాఱు తలంచెను. ఛీ! ఛీ! కోపావేశమున శరీరము మఱచి తండ్రి యేదో చేయఁగూడనిపని చెప్పినంతమాత్రమున మాతృదేవతం జంపఁ దగునా యని వేఱొకమాఱు తలంచెను. జనకుని యాజ్ఞ మీఱుట మహాపాతకము కాదా యని యింకొకసారి తలపోయును. అయ్యో! తల్లిని నఱకుట మాత్రము మహాపాతకము కాదా యని మఱియొక మాఱు తలపోయును. అయ్యో! కుమారుఁ డన్నివిధములచేత స్వాతంత్ర్యము లేనివాఁడుకదా యనియు నాబుద్ధి నేనుపయోగించి నాయిచ్చవచ్చినట్లు నేఁ జేయఁగూడదా యనియు నాతఁ డెడనెడఁ దలంచెను. ఈ జిజ్ఞాసలోఁబడి మరల నీవిధముగఁ జింతించెను. తండ్రిమాటజేసి తల్లిని వధింతునా, తల్లిని రక్షించుకొఱకుఁ దండ్రిని తిరస్కరింతునా! తల్లి జన్మకారణముగదా? ఎట్లు చంపుదు. తల్లి పెంచినదికదా? తండ్రి మాత్రము కని పెంచలేదా? "ఆత్మావై పుత్రనామాసి" యను వేదవాక్యప్రకారము తండ్రియే పుత్రరూపమున మరల జన్మించుచున్నాఁడు. నేను చేయుటయనఁగా నతఁడు చేయుట. తండ్రి యాజ్ఞజేసిన వానికి సమస్తపాపములు నశించు నని పెద్దలవలన వినియుంటి. తండ్రియే తపము. తండ్రియే ధర్మము. తండ్రియేవిద్య. తండ్రియే దైవము. తండ్రికిమించిన విద్యలు లేవు. అతనిని మించిన దేవతలు లేవు. కావున నీతనికిష్టమైన కార్యముఁ జేసిన దేవతలందఱు సంతోషింతురు. తండ్రివలె తల్లిమాత్రము దైవముకాదా? ‹‹న మాతుః పరదైవతో›› మ్మను మాట లబద్ధములా? కాలుసేతులు, ముక్కు, చెవులు, నోరు కనులు మొదలగు నవయవంబులతో నిండిన యీ స్థూలదేహమునకు

మాత్రగాక కారణ మెవ్వరు? అదియునుఁగాక దుర్భరమయిన గర్భ ఖేద మనుభవించి ప్రసవవేదనల పాలై పడరాని యిడుమలం బడి హేయములేని యుపచారములం జేసి పెంచినతల్లిని మఱచు టెట్లు? తండ్రి బిడ్డనవ్వుచున్నప్పు డెత్తుకొని ముద్దాడునే గాని మలమూత్రం బులలోన పొరలుచున్నప్పుడు దరికి రాఁడు. ధనము సంపాదించి యిచ్చునేగాని యన్నము స్వయముగా బెట్టఁడు. నీరు పోయఁడు. బిడ్డలతో పడు పాటులన్నియుఁ దల్లియేపడును. అందుచేతఁ దల్లి దండ్రు లిరువురిలోఁ దల్లియే నధికురాలని ధర్మశాస్త్రంబులు చెప్పు చున్నవి. చిన్నవాఁడైనను ప్రౌఢవయస్కుఁడైనను ముసలివానుఁడై కొడుకు తల్లికి సమానుఁడే. ప్రేమ మెప్పుడు నొక్కటియె. కొడుకు గ్రుడ్డియగుఁగాక! చేరడేసి నేత్రములు గలవాఁ డగుఁగాక! మూఁగ యగుఁగాక! మహావక్త యగుఁగాక! చెవిటియగుఁగాక! మంచిశ్రోత్ర ములుగలవాఁ డగుఁగాక! రూపసి యగుఁగాక, కురూపియగుఁగాక, ధనికుఁ డగుఁగాక, పేదయగుఁగాక, సుగుణుఁ డగుఁగాక, దుర్గుణుఁ డగుఁగాక! పండితుఁ డగుఁగాక పామరుఁ డగుఁగాక, తల్లికిఁ గుమా రునియందు ప్రేమ యొక్కవిధముగానే యుండును. ఆ కొడుకే తల్లి కానందహేతువు. అతఁడే స్వర్గము. అతఁడే మోక్షము. అతఁడు లేనిచో నామెకు లోకమేలేదు. బ్రతుకేలేదు. ఇది మనుష్యులయందే కాదు. పశువులు పక్షులు మొదలగు క్షుద్రజంతువులయందు సయి తము మాతృప్రేమ మిక్కిలి స్పష్టముగఁ గనఁబడు చుండును. ఎప్పు డుతల్లి మృతినొందునో యప్పుడే మనుష్యులకు సమస్తముపోవును. అప్పుడే బిడ్డఁ డసమర్థుఁడగును అప్పుడేదుఃఖితుఁ డగును. అప్పుడే జగము శూన్యమై తోఁచును. భాగ్యవంతునకుఁ బేదకుఁ దల్లివలన లాభముసమానమే. అట్టి తల్లిం జంపుట పాపసముద్రములో మునుఁగుట నరకమునకు మెట్లు పెట్టుకొనుట. కావున నీమె నే నెట్లు చంప నోపుదు

కటికవాఁడైన నిట్టిపని జేయునె?" యని విచారించుచు నెంతకుం దెం పులేక యేపని జేయక హేతువాదము సేయుచుండునంతలో సాయం కాల మయ్యె. తండ్రియు మిక్కిలి పశ్చాత్తాపము నొంది "అయ్యో! తల్లిని నిష్కారణముగఁ జంపుమని యాజ్ఞాపించి వచ్చితి. పితృవాక్య పరిపాలనమే పరమ ధర్మమని యీపాటి కతఁడు మాతృవధము జేసి యుండఁడుగదా? ఎఱుఁగకపోయి చెప్పితిని. పరిమాందో ధీమతా మపి" యనునూట నా యందు సార్థక మైనది." అని కన్నుల నీరు పెట్టుకొని మరల తన కుమారునిం దలంచి వాఁడు చిరకారి గదా! త్వరపడి యేకార్యముం జేయఁడు. కావున నేఁజెప్పినంతమాత్ర మున నీదుష్కార్యమునకు దొరకొనఁ డని ధైర్యము దెచ్చుకొని, విస విసనడచి పర్ణశాలకుం బోయెను. అతనింజూచినతోడనే చేతిలోను న్న యాయుధము దూరముగఁ బాఱవైచి, చిరకారి యెదురుగాఁజని తండ్రి పాదములపయిం బడి నీయాజ్ఞ నెఱవేర్ప నైతి. మహాపరాధ ముఁ జేసితి క్షమింపు మని వేఁడుకొనెను. భార్యయు నమస్కరించి ప్రక్క నిలువంబడెను. గౌతముఁడు కుమారుని లేవనెత్తి భార్య బ్రి తికియున్నందుకు సంతోషించి యిట్లనియె. "పుత్రక! నేను రోషావే శంబున నిచ్చినయాజ్ఞ పాటింపక యుంటివి. మేలయ్యె. నీవు చిరకారి వగుట నాకప్రతిష్ఠ కలుగకపోయె. నాతపంబు నిందలపాలు గాకపో యె. మునిజనంబులలో నాకపయశంబు రాకపోయె. పరమేశ్వరుఁడు మనపాలిట నున్నాఁడు. నాయాజ్ఞ నెఱవేర్పనందుకు నీవువిచారింపకు ము." అని మొదట తాను విడిచిన దుఃఖబాష్పము లానందబాష్పము లుగా నతఁడు దారపుత్రులంగలిసి సుఖంబుండెను. దుష్కార్యముఁ జేయుమని తండ్రి చెప్పినను, గురువు చెప్పినను జేయఁగూడదని యీ కథాఫలితార్థము.

యమూల్యవస్తువులన్నియు మీనిమిత్తము తెచ్చిన కానుకలే. చిత్త గింతురుగాక.

మంత్రి—అవి మధ్యాహ్నము చూడవచ్చును. మహారాజు గారినిసందర్శించితివా?

సుమం—కానుక లర్పించి యిప్పుడే రాజసన్నిధినుండి వచ్చినాఁడను.

సుమం—మంచిపనిఁ జేసితివి. కాని, సుమంతా! పులిందుఁడే పేటఁ గుంతలేశ్వరునకు సమర్పింపవలసిన కప్పమే సరిగ నీయజాల కుండువాఁడుగదా యిప్పుడాతని కీధనసంచయంబు లెట్లులభించినవి?

సుమం—(తనలో) అయ్యో! ఈతఁడు విషమప్రశ్నలనడుగ నారంభించినాఁడు మిత్రుఁడని చెప్పరాదు. శత్రుఁడని చెప్పకుండరాదు. అయిననిట్లుచెప్పెద. (ప్రకాశముగా) దేవా! కలరుగదా కుంతల రాజ్యలక్ష్మికిఁ బ్రిక్కలో బల్లెములట్లుమన యెల్లలలో వసించు నాటవికు లగుకిరాతపతులు. ఆదురాత్ములు నీటిలోని మొసళ్ల వడువున స్థానపుబలిమిచేతఁ గుంతలరాజ్యసైన్యంబుల కజేయులై యింతకాల మునుండిప్రాంతభూములకుఁ జాలసారు లుపద్రవకరు లగుట ప్రాఁతకథయే గదా. ఆపర్వతీయులీనడుమ విశృంఖలవృత్తిం జెలరేగి మనసీమలనున్నపల్లియల జనంబుల గోధనంబులహరియించి గృహములఁ బరశురామప్రీతిఁ గావించి లోకకంటకులైరి. అది కారణంబుగఁ బులిందరాజు నిజసైన్యంబులఁబంపి యాదుండగు కండలకానర మడంచి వారుప్రజలయొద్ద హరించిన రత్నకనకవస్తువాహనంబులఁ గైకొని స్వామి యగుకుంతలేశ్వరునకు, మీకునాధనంబులె కానుకలుగాబంచె.

మంత్రి—మేలు పులిందా! మేలు! నీకావించినసాహసకృత్యము నీకానుకలకంటె నెక్కుడువిలువగలది, నీజయము మాకుబ్రియము; మనయుభయులకులాభకరము; లోకోపకారము, సుమంతా! ఈ

ఘనకార్యమునుగుఱించి మీరాజును బహూకరించుటకు నేనొకసారి చందనావతికి రావలె ననయున్నది.

సుమం—(తనలో) ఈతని రాక మృత్యుదేవతా ప్రవేశముగదా. ఇదిసాగకపోవుఁగాక. (ప్రకాశముగా) దేవా! పుళిందుడనుగ్రహింపఁబడును.

మంత్రి—సుమంతా! ఎంతధనమార్జించిననేమి? ఎన్నివైభవములున్ననేమి? పాపము, పుళిందునకు సంతానము లేదుకదా!

సుమం—దేవరవారు వినియుండలేదు కాఁబోలును. మారాజునకుఁ గుమారుఁడుకలఁడు. ఈధనసంచయము లాకుమారుని బాహుబలార్జితము లే.

మంత్రి—(ఆశ్చర్యముతో) ఏమి? కుమారుఁడు కలఁడా? ఎంతవయసువాఁడు? నేనెన్నఁ డెఱుఁగనే.

సుమం—పదునెనిమిదేండ్ల ప్రాయము కలవాఁడు.

మంత్రి—పదునెనిమిదేండ్లవాఁడా?, పదునైదేండ్లక్రిందట నేనుచందనావతికిఁబోయినపుడు మీరాజు సంతానహీనతకు నాకడబిట్టువగచెను. ఇంతలో మీరాణిమేధావినీదేవి గొడ్డుఁబీగి యొక్కసారినాలుగేండ్లకొడుకునుఁ గనెనా యేమి?

సుమం—దేవా! అతఁడుకన్నకుమారుఁడు కాఁడు.

మంత్రి—ఔరసుఁడు, కానిచో దత్తుఁడా? మీరాజు జ్ఞాతులలో దత్తుఁడుకాఁదగిన కుఱ్ఱఁడులేఁడే?

సుమం—దత్తుఁడును గాఁడు.

మంత్రి—(నిందాగర్భముగా) అట్లయిన మీరాజకుమారరత్నమేవంశఖనిలో నుద్భవించెను? ఆకాశమునుండి యూడిపడెనా? భూమిలో మొలచెనా?

సుమం— అర్ధరాత్రమున నరణ్యములో దొరకెను.

మంత్రి—(సాక్షేపముగా) అర్ధరాత్రిమున, నరణ్యమున దొరకెనా? పాపము, మీకొఱ కాబాలుఁ డడవిలోఁ గనిపెట్టుకొనియుండెఁగాఁబోలు. ఇది నమ్మఁదగినదియే చెప్పుచుంటివా?

సుమం—దేవా! ఇదిసత్యము. మీసమక్షమున వేఱుమనవిఁ జేయగలనా?

మంత్రి—సత్యమే! సత్యమే! బాలకుఁడు దొరికి యెంతకాల మయినది?

సుమం—పదునాలుగేండ్లయినవి.

మంత్రి—(తనలో) వెనుక నేనాకుఱ్ఱనిఁ జంపబంపి యెంతకాలమయియుండునో! పదునాలుగేండ్లుకాలేదా? వాఁడువీడయియుండునా

ఆ. వె. నమ్మఁదగినబంట్లు నాపంచు ఘాతుకుల్
చెల్లియుండు నాఁటి చెనఁటికుఱ్ఱ
యైన నేమొకాని యనుమాన ముదయించె
నిర్మల మగునాదు నెమ్మనమున.

(ప్రకాశముగా) సుమంతా! దొరికినప్పుడు బాలుఁడెంతవయసువాడు?

సుమం—నాలుగైదేండ్లవాఁడు.

మంత్రి—(తనలో) అప్పటికి వాఁడుఁగూడ నంతవయసువాఁడే కాఁడా! మనసా! కలవరము నొందకుము. కథలఁ బోలినకథలులోకమున నుండకపోవు. (ప్రకాశముగా) సుమంతా! అప్పుడు బాలుఁడే స్థితిలో నుండెను? మీకెట్లు దొరకెను?

సుమం—(తనలో) మారాజునకుఁ గుమారుఁడు దొరకెననివిన్నది మొదలేమోకాని యితఁడుకళవళము నొందుచున్నట్లు కనఁబడుచున్నాడు మొగము వివర్ణమైనది. దీననేమగునోకదా! (అని ప్రకాశముగా) దేవా! మారాజువేఁట ముగించి యరణ్యమున సపరివారంబుగ గుడారముల విడిసియుండ నడిరేయి జాలిగొలిపునట్టిచిన్నబిడ్డని యేడు

పువినబడిమె. అదివినియాయసకాగడాలు వేయించుకొనికూయివచ్చు చున్నవై పునకుంజని కాగడాల వెలుగునకు వెలుగొసంగు దేదీప్యమా నప్రభలతో, నడిగినమాటల కుత్తరంబైన నొసగలేని లేతప్రాయము తో, తనమేని నెత్తుటంబొరలుచున్న బాలునిగాంచి యేమిఘాతజరు గునో యని పరీక్షింప, మతిలేని బ్రహ్మదేవుడు వాని యలోకసా మాన్యలావణ్యమునకు దగినట్లు చేసిన యెడమకాలి యాఱవవ్రేలు పీడాపరిహారార్థమ పోలె ఖండింపబడినట్లూహింపనయ్యె.

మంత్రి—నఱకబడినవ్రేలచ్చట నుండెనా?

సుమం—పరిజనులు వెదకిరి గాని కానబడలేదు.

మంత్రి—(తనలో) ఆదురాత్ములు నాకానవాలుగ జూపిన వ్రేలదియే కాబోలు. నాతలంచిన పనియైయుండదు. (ప్రకాశముగా) కథమిక్కిలిచిత్రముగనుండుటచే దరిచి యడుగుచున్నాడను. అనంత రమేమి జరిగినది?

సుమం—దేవా! చిత్తగింపుడు. మారాజు సంతానహీనుండ గుటంజేసి ముద్దులు మూటగట్టు నక్కుమారుఁగాంచి, పెన్నిధిఁగన్న పేదవడువున సంతసించి మఱునాడు చందనావతికింబోయి యాబాల కునిఁబెంచుకొనఁ దలచి జ్యౌతిషికులకుఁ జూప నాలక్ష్యమాణశుభలక్ష ణంబుల బరికించి వారిట్లనిరి.

ఉ. "అన్నియు రాజచిహ్నములె, యన్నియు మంగళ లక్షణంబులే
యన్నియు సుందరాంగములె, యన్నిటిమాటకు నేమికానియా
కన్నులకే వరించి సిరి కాపురముండును వీని యింట నీ
చిన్నికుమారు డీశుకృపచే ధరణీతలమెల్ల నేలెడుఁ."

మంత్రి—(తనలో) ఈశుకృపచే ధరణీతలమెల్ల నేలునా? ఆ కుట్టనిగూర్చియు దొల్లియావిధంబుననే జ్యౌతిషికులు నాకెఱిగించిరి

కదా—ఐననీసామ్యమెంతవఱకు వచ్చునో చూతము. (ప్రకాశముగా) సుమంతా! అనంతరమే మైనది?

సుమం—అనంతరము ఇంద్రదత్తభూపాలుడు వానికి జంద్రహాసుడని నామకరణము జేసి మేధావినీదేవి కిచ్చి పెంచు మనిచెప్పినాటంగోలె నాతడెతనయుండుగ నెవ్వగదక్కి, వానినెయువరాజుం జేసి యెల్లవిద్యల నేర్పించి పుత్రవిన్యస్తరాజ్యభారుడై సుఖంబున నున్నవాఁడు.

మంత్రి—యువరాజు పరిపాలనమున దేశమెట్లున్నది.

సుమం—ఇట్లున్నది—

ఆ. వె. నడుచు ధర్మమిపుడు నాల్గుపాదములను
గాటకములు పూర్వకాల కథలు
జారచోర భీతి శబ్దావశేషంబు
స్వప్నగతము లీతిబాధ లచట.

దేవా! వేయేల? చంద్రహాసుఁడు జనులచే నిట్లు పరిగణింప బడుచున్నాఁడు.

తే. గీ. ఆలమునయందు నభినవ శూలపాణి
సాధురక్షణ రెండవ చక్రపాణి
వైభవమ్మున మానవ వజ్రపాణి
ధర్మపరత మధ్యమలోక దండపాణి.

మంత్రి—(తనలో) అబ్బా! ఈస్తోత్రము వినఁజాలకున్నాఁడను. ఈతనిపలుకులు సూదులట్లునాకుఁగర్ణకఠోరములగు చున్నవి. ఇతని నింకఁ బంపివేయవలయు. (అని ప్రకాశముగా) సుమంతా! ఇంద్రదత్తునిదయను నేను మఱవఁజాల ననుము తనపుత్రుని ప్రజ్ఞావిశేషమునకు నేనును మహానందభరితుఁడ నైతి ననుము. అచిరకాలమునవ

చ్చితన యానందమున సగపాలు పంచుకొని యనుభవింతు ననుము. నీవింక జనుము.

సుమం.—మహాప్రసాదము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

మంత్రి—(తనలో) ఏమీ? ఆకుమారుఁ డర్ధరాత్రిమున నరణ్యమున లభించెనా? నాలుగైదేండ్లవయసా? ఆఱవవ్రేలు నఱకఁబడియుండెనా? కథలనుఁబోలినకథలులోకమునఁ నుండవచ్చును గానియిన్ని సామాన్యలక్షణములుండుట యరిది. నేనుతొల్లి ఘాతకులచేతికిచ్చి చంపఁబంపిన డింభకుఁడుగూడ నాలుగైదేండ్లయీడువాఁ డగుటచేతను నృశంసకులు వానినర్ధరాత్రిమున నరణ్యమునకుఁ గొంపోవుటచేతను, బాలకుందెగటార్చినందున కానవాలుగ ఘాతకులొకచిన్నవ్రేలు దెచ్చినాకుఁజూపుటచేతను ఖండితాంగుళి కానఁబడ లేదని సుమంతుఁడు పలుకుటచేతను, బుడుతని రూపరేఖావిలాసంబులం బరికించి నాజ్యోతిషికులెట్లుపలికిరో ఇంద్రదత్తుని కార్తాంతికులుగూడ నట్లే వచించుట చేతను, సర్వవిధముల వాఁడు వీఁడయి యుండవచ్చునని తోఁచుచున్నది. నీతిబాహ్యులగు హంతకులచేత నేను వచింపఁబడియుండవచ్చును.

తే. గీ. నాలుగు వరాల లంచంబు నాకఁడ దిని
రేయి పసిబిడ్డ కుత్తుకఁ గోయఁదలఁచు
హంతృకులమున నీతుల కాసపడుట
వేఁపకాయలలోఁ దీపు వెదకికొనుట.

మఱియు నొరులకై ఘాతఁజేయువాని చేయి, యది దాల్చుకత్తి,తుల్యగుణవంతములు. ఏమన,

క. ఎవరేమి ఘాతఁదలఁచిన
నవి పనిముల్లై యొనర్చు నాఘాత; నెఱుం
గవు గద యంతఃకరణ
ప్రవృత్తి, మొదలె యెఱుఁగవు కృపాక్రోధములన్.

యిననిప్పుడేమాయె. నాఁటిహంతలు కృపాళురై వానిని బ్రతికించిన బ్రతికింతురుగాక. జ్యోతిషికులు గ్రహచారంబులు గుణియించి, ఫలంబులు గుణియించి యఖండభూమండలాధిపత్యము వానికిఁ బ్రాపించునని ధ్రువముగ వక్కాణించిన వక్కాణింతురుగాక. వారువక్కాణించుటయే కాదు. బ్రహ్మదేవుండు వానిలలాటభాగమున విస్పష్టంబుగ నీతఁ డదృష్టవంతుఁడని మూఁడుబంతులఁ దీర్చి వ్రాసినవ్రాయుఁగాక! నిజముగనీచందహాసుండు నాఁటి బుడుతఁడే యైనపక్షమున విశ్వామిత్రుండునుం బోలె నఘటనాఘటనసమర్థుండై, రాజనీతినైపుణీకృతశుక్రుండైన యీకుంతలరాజమంత్రి హంతలకృపవ్యర్థమగునట్లు, జ్యౌతిషికుల మాటలునిష్ఫలము లగునట్లు, బ్రహ్మవ్రాత విపరీత మగునట్లు రహస్యోపాయంబున వానిందుదముట్టించి తీరును. ఆ కుఱ్ఱని మొగముఁజూచుటకు నాహృదయము తత్తరపడుచున్నది. ఇప్పుడె మహారాజువద్దకుఁ బోయి యేదోవంకఁ గల్పించుకొని చందనావతి కరిగెద.

(అప్పుడు కంచుకి ప్రవేశించుచున్నాఁడు.)

కంచు — దేవా! మహారాజుగారుమిమ్ముంజూడఁగోరుచున్నారు

మంత్రి — (తనలో) రాజాజ్ఞయు నాతలంపును సమకూడినవి. ఇది శుభనిమిత్తము. (పైకి) ఇదె వచ్చుచున్నాఁడను. (ఇద్దఱునిష్క్రమించుచున్నారు.)

(అపుడుమందిరమునఁ గుంతలరాజగు హేమవర్మయుఁ, గాశ్మీరరాజపురోహితుం డగు దేవశర్మయుఁ బీఠములమీఁదఁ గూర్చుండి ప్రవేశింతురు.)

హేమ — ఆర్యా! దేవశర్మా! కాశ్మీరరాజునకుఁగుమారులెందఱు

దేవ — హేమవర్మమహారాజా! సింహదేవుఁ డొక్కఁడే

(అప్పుడు కంచుకి ప్రవేశించి)

కంచు.—జయము జయము దేవా! మంత్రిగారు దర్శనమును వేఁడుచున్నారు.

హేమ.—సత్వరమ ప్రవేశపెట్టుము.

కంచు.—చిత్తము. (అనినిష్క్రమింప మంత్రిప్రవేశించును.)

మంత్రి.—జయము జయము మహారాజా! (అని పీఠముపయి గూర్చుండును.)

హేమ.—భాగురాయణా! ఆహితాగ్ని యగునీమహాత్ముఁడు కాశ్మీరరాజపురోహితుఁడు దేవశర్మ. ఆనృపునికుమారుఁ డగుసింహ దేవునకు మన చంపకమాలినిమ్మనియడుగ వచ్చె.

మంత్రి.—(తనలో)ఆహా! మరల నొకగడ్డుపని వచ్చినదిగదా. వచ్చిననేమి? ఈయంతరాయములెల్ల నాబుద్ధిసువర్ణము మేలిమిఁ జూప దగిన గీటురాళ్ళు. (ప్రకాశముగా) కుంతల కాశ్మీర కుటుంబములకల యిక నాకుఁ పరమసంతోషము. ఉభయజాతకములఁ జూచిముహూర్తమేర్పఱిచి వెనుకనుండి పంపవచ్చును.

హేమ.—అవును. బ్రాహ్మణోత్తమా! సింహదేవుని జాతకము వాని చిత్తరువు నాకిచ్చి మీరువిజయము చేయుఁడు.

దేవ.—చిత్తము. ఇదె చిత్తరువు. ఇంకనే నరిగెద. (అని నిష్క్రమించుచున్నాఁడు)

మంత్రి.—(తనలో) మంత్రశక్తిచేత మఱియొక పిచాచమును వెడల నడచితిని. (ప్రకాశముగా) దేవా! జాతకమునుఁ జూడనిండు.

హేమ.—జ్యౌతిషమునందు నీకువలె నాకుఁ బ్రవేశములేదు. ఇదినీవ చూడఁదగినది. (అనియిచ్చును.)

మంత్రి.—(చూచుట నభినయించి) మహారాజా! మనమీగడి

టయు వృషాదర్భి వారికఠినోక్తులకు మిక్కిలికోపించి రోషావిష్టహృద
యుఁడై గృహంబున కరిగి వారిని వంచింప నెంచి మాయాఫలములు
గొన్ని కల్పించి వానిని మంత్రులచేతికిచ్చి "వీనినిఁ గొనిపోయి మీ
రాసప్తమహర్షుల కిం" డని పంపెను. మంత్రులామాయాఫలముల
సంగ్రహించి యా మహామునులయొద్దకుఁ గొంపోయి యిచ్చిరి. మహా
మునులు వాని స్వరూపంబుఁ జూచియు, హస్తంబుల స్పృశియించి
యు నవి కృత్రిమఫలము లని తెలిసికొని యావలఁ బాఱవైచిరి.
మంత్రులు సిగ్గుపడి మఱలిపోయి యావార్త రాజున కెఱిం
గించిరి. రాజు కోప మినుమడింప మంత్రవేత్తలం బిలిపించి "ఆర్యు
లారా! మీరు హోమంబులుచేసి కృత్తి యనురాక్షసిం బుట్టించి దా
నిని సప్తమహర్షుల మీఁదికిం బంపుఁడు. అదివారిని జంపివచ్చునట్టులా
జ్ఞాపింపుఁ" డని యానతిచ్చెను. మంత్రిశాస్త్రజ్ఞులు రాజుమాట దా
టఁజాలక హోమంబులు చేసి కృత్తియను రాక్షసిం బుట్టించి దానిని
మహర్షులమీఁదికిఁబంపిరి. ఆసమయంబున మహర్షులు తినుటకు దుంప
లుకాయలు పండ్లుగలచోటులు వెదకికొనుచు నడవులం దిరుగుచుండి
రి. అప్పుడు శునస్సఖుండను సన్యాసి యొకఁడు వారిఁగలిసికొని మై
త్రినెఱపి వారెందుఁ బోవ నటు పోవుచుండెను. అట్లు వారందఱుఁగ
లిసి తామరతూండ్లు తిని కడుపులునింపుకొనవలయు నని తలంచియొ
కకొలనుకడకుఁ బోయిరి. ఆకొలనుగట్టు వారు చేరునప్పటికి వృషా
దర్భి పంపిన కృత్తియను రాక్షసియు నచ్చోటుచేరెను. చేరి కొలను
జొరఁబోవు మహర్షులకడ్డమువోయి యేదేనివంక పెట్టి వారిని తుదము
ట్టింప వలయునని వారినామధేయము లడిగెను. మహర్షులు సహజ
సౌజన్యముతోఁ దమపేళ్ళు వరుసగాఁ బేర్కొనిరి. శునస్సఖుఁడు త
నపేరు సరిగాఁజెప్పక రక్కసికి విసుఁగు పుట్టునట్లడ్డదిడ్డముగఁ జెప్పె
ను. అందుకతనిపై రక్కసి కోపించి పేరు సరిగఁ జెప్పవేమని తిర

స్కారముగ నడిగెను. చెప్పు చున్నను జెప్పలేదందువా? దురాత్ము రాలా! పడుము. భస్మము కమ్మని మహాకోపమున దండముతో దా నితలమీఁద వైచెను. ఆదెబ్బ కది నేలఁగూలి చచ్చి భస్మమయ్యెను అనంతరము మునులు సరోవరముఁ బ్రవేశించి తామరతూఁడులు గో సిగట్టున మోపుగా, బెట్టి స్నానమునకై జలమున దిగిరి. స్నానము లుచేసి మరలవారు గట్టునకు వచ్చునప్పటికి తామరతూడొక్కటియై నలేకపోయెను. మును లొండొరుల మొగములు జూచుకొని తెల్ల బోయిరి. ఒకరిపై నొకరికనుమానముఁ గలిగెను. కలుగుటయు వారం దఱుప్రమాణములు చేయసంకల్పించిరి. శునస్సఖుఁడు వారందఱికి మధ్యవర్తి యయ్యెను. అప్పుడత్రిమహాముని యిట్లుప్రమాణము నే సెను. "నేను తామరతూండ్లు దొంగిలించితినేని గోవును దన్నినవాఁడు సూర్యునకెదురుగా మూత్రపురీషములు విడుచువాఁడు, అనాధ్యాయ మున వేదముజదివినవాఁడు, నేదుర్గతికిఁబోదురో యాదుర్గతికిం బోవుదును." అనవుడు వసిష్ఠుఁ డిట్లని యొట్టుబెట్టుకొనియె. "నేనీ బిసంబులఁ గ్రుచ్చిలించితినేని, వేదాధ్యయనముఁ జేయనివాఁడు, సన్యాసియయ్యుండి కాముకుఁడైన వాఁడు కుక్కను వెంటఁబెట్టుకొని యసహ్యపడక నిరంతరముతిరుగువాఁడు, పోవునట్టిదుర్గతికి నేనుపోవుదు. మఱియుఁ గన్నకూఁతునమ్ముకొనుట, శరణుజొచ్చిన వానిని రక్షింపకదిరస్కరించుట, దానమిచ్చువాఁడు దరిద్రదశఁ బొందినప్పుడు సైతమువానిని యాచించిపీడించుట, యేమనుష్యుని కేదుర్గతులు గలుగఁజేయునో నాకాదుర్గతులు గలుగుఁగాక." అంతట కశ్యపుఁడిట్లు శపథముజేసె. "వ్యర్థముగా మాంసము భక్షించుట, సభలోఁ బక్షపాతము బల్కుట, దుర్దానములు పట్టుట, పట్టపగలు స్త్రీసంభోగమొనరించుట బ్రాహ్మణుఁడు సరకులంగొని వర్తకముచేయుట నేదోషము సంఘటిల్లునో బిసములు దొంగిలించినపక్షమున నాకాదోషము గల్గుఁగాక!

పదంపడి భరద్వాజుఁ డిట్లనియె. "ఈతూండ్లు నేను దోచుకొంటి నేని జ్ఞానులను, గోవులను, స్త్రీలను గ్రూరముగా హింసించుట, కార్యాతురులయిన బ్రాహ్మణుల నుపేక్షఁజేయుట, కట్టెపుల్లలతో మండుచున్నయగ్నియందు హోమముఁజేయుట, గురుధిక్కారము జేసి చదువుట మొదలగు పాతకములు జేసినవారిగతి నాకుఁ బ్రాపించుఁగాక!" "నేనీదొంగతనముఁ జేసితి నేని భార్యముట్టయినప్పుడు దానిని గవయుట, మూత్రపురీషములు జలములో విడుచుట. ద్వేషభావముగొనుట, యొఁడుదానిసొమ్ముఁ దినిజీవించుట, యసహాయుఁ డైనవైరిం జంపుట, చూడితోనున్న యావుంగొట్టుట మొదలగుపాతకములు జేసినవారివలె నేనును దుర్గతికిం బోవుదు" నని జమదగ్ని శపథముఁజేసెను. "ఈబిసములు నే నెఱింగియుండినపక్షమున వేదమువదలుకొనుట, యగ్నిహోత్రములు విడిచిపెట్టుట, శూద్రస్త్రీకి మగఁడౌట, సోమలత లమ్ముకొనుట, చెడ్డగ్రామములందు వాసము జేయుట, మున్నగుపాతకములు నేను చేసినట్లే" యని గౌతముఁడు ప్రమాణము జేసెను. "ఈకార్యమునావలన జరిగె నేని తగిన సేవకులను రక్షింపకపోవుట, తగనివారిని రక్షించుట, ధర్మాత్మునివలె కపటవేషము వేసికొని రాజుంగొల్చుట మొదలగు పాతకములు చేసినట్లే" యనివిశ్వామిత్రుఁడుప్రతిజ్ఞ సేసెను. అప్పు డరుంధతి యల్లన నిట్లనియె. "అత్తమామల నెల్లప్పుడు దిట్టినదానికి, పెనిమిటియెడ దురాలోచనములు చేసిన దానికి నొక్కతె కూర్చుండి పరమాన్నముఁ దినిన దానికి, నెట్టిదుర్గతికల్గునో నాకట్టిదుర్గతి కలుగును." అనవుడు జన్మమంతయు బానిసతనముతోనె గడుపు గడపుచుండినగండ యిట్లుప్రతిజ్ఞ జేసె "వంట జేసినయొఁడుది ముందుగా భుజించుట, సరిగాఁ బనిచేయకపోవుట, బొంకులు పలుకుట కూఁతురు నమ్ముకొనుట, సజ్జనుల కెగ్గుసేయుట మెట్టిదుర్గతిఁదెచ్చునో యొడూండ్లదొంగ

తనము గూడ నట్టి దుర్గతిఁ జెచ్చుఁగాక!" యిమ్మాట దానిమగఁ డగుప శునఖుఁడుమునులవంక తిరిగి, యీతూండ్లు ముచ్చిలించినవాఁడు సంతానము లేనివానివలెను, గర్భదాసునివలెను, దరిద్రపీడితునివలెను, సకలదుఃఖంబు లనుభవించుఁగాక యని యొట్టుపెట్టుకొనియె. అచ్చట నున్నవా రందఱుఁ దనవంక దిరిగి ఘోరప్రమాణంబులు చేసినసిద పశునస్సఖుఁడు తానును ప్రమాణము జేయఁ దలఁచి యిట్లనియె. "నే నీబిసములు దొంగిలించితి నేని వేదాధ్యయన సంపన్ను నకై నను యజ్ఞములచేసినవానికై నను దనకూఁతునిచ్చి యానందముగఁ బెండ్లి చేసిన ట్లే"యనిన మహర్షులందఱు విస్మితులై యిదియేమి నుంచివిషయము లంగీకార్చి శపథముఁ బట్టుదు రే! దీనింబట్టిచూడ నీవే తూండ్లు దొంగిలించితివని తెలియుచున్నది. ఆఁకలికి తాళఁజాల కున్నాము. బాధపెట్టక సత్వర మిమ్మని పల్కిరి. పలుకుటయు శునస్సఖుండు నవ్వి యిట్లనియె. "మీరన్నది సత్యము. మీ రొండొరుల నేమే మందురో వినుటకై యిట్లుచేసితిని. నేనే యీతూండ్లు ముచ్చిలించితి. వృషాదర్భియను రాజు మీపైఁ బగఁబూని మిమ్ముఁజంపుటకై కృత్తియను రాక్షసిం బంచె. అదిమిమ్ము కడతేర్చునను భయంబున సన్న్యాసివేషమును బూని వచ్చినవాఁడ. నేను దేవేంద్రుఁడ. అవిగో! మీతామర తూండ్లుగ్రహించి భక్షింపుఁడు. మీపుణ్యావర్తనములచేత మీకుత్తమపదప్రాప్తిగలిగె. ఎగసి యాకాశమునకు రండు. అక్కడచుక్కలై మెఱయు చుందురుగాక!" యని పల్కుటయు మహర్షులిందుృనితోఁ జని యాకాశంబున నక్షత్రరూపములు ధరించి దేదీప్యమాన పరిభావంతులై వెలయుచుండిరి. రాజువలన దానము గ్రహింపనివారి కిట్టి మహోన్నతదశ ప్రాప్తించె. ఎవరివలనను దానము గ్రహింపక స్వతంత్రజీవనము సేయుట సర్వోత్తమము.

క్షత్రబంధుఁ డనునొక రాజు కలఁడు. అతఁడొకనాఁ డొక్కడొకో

బోవుచుండ భయపడుచు నొదిగి వెళ్ళుచున్న యొకమాలవాఁడు వానికంటికగుపడెను. అతఁ డామాలనిం బిలిచి "ఓయీ! యిట్లునీవొదిగి తొలఁగి చనుటకుఁ గారణం బేమి?" యని యడిగెను. అనవుడు మాలవాఁ డిట్లనియె. "అయ్యా! అదియొక బ్రాహ్మణుని పొలము. బ్రాహ్మణుని పొలముమీఁదినుండి గాలి కెగిరివచ్చు మంటిరేణువులు నామీఁదఁ బడునేమో యనుభయమున నేనుదూరముగఁ దొలఁగి చను చుంటిని." అనవుడు రాజు "బ్రాహ్మణక్షేత్రమునుండి గాలికెగిరిన మంటిరేణువులు మీఁదపడిన నష్టమేమి" యనిమరల నడిగెను. చండాలుఁ డతని కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "మహాప్రభు! నేనుపూర్వ మొక బ్రాహ్మణకుమారుఁడను; మాధుకరవృత్తిం బ్రతుకుచు స్వాధ్యాయముఁ జెప్పుకొనుచుంటిని. ఒకనాఁడు బిచ్చమెత్తి తెచ్చుకొన్న యన్నము పుణ్యనదీతీరమునకుఁ బోయి తినదలఁచు చుండ గొప్పగాలి వీచెను. ఆ నదికిసమీపమందున్న యొకబ్రాహ్మణునిపొలము మీఁదనుండి మంటిరేణువులుదట్టముగా నెగిరివచ్చి యన్నము పైఁబడెను. ఆఁకలి కాగలేక నేనాయన్నముఁ దింటిని. బ్రాహ్మణుని భూమిసంబంధమయిన రేణువులు పడినందుచేత బ్రాహ్మణునిసొమ్ము కొంత నాకడుపులోఁ బడినది. బ్రాహ్మణధన మపహరించుట మహాపాతకము. అందుచేతనే నేనుమాలవాఁడనై పుట్టితిని. పూర్వజన్మజ్ఞానము నాకు గలదు. నీతోడనాకీవిషయమై సంవాదమిప్పుడయినది. కనుక నాశాపవిమోచనమైనది. ఇంక నేను బ్రాహ్మణజన్మ మెత్తుదును. నాకు సెలవిమ్ము." అని చెప్పి వెడలిపోయెను. బ్రాహ్మణులసొత్తు మంటిరేణు వయిననుసరే. గడ్డిపఱకయైనను సరే యపహరించుట మహాదోష మని దీని ఫలితార్థము.

## గౌతముఁడు—దేవేంద్రుఁడు.

గౌతమమహాముని వనములో సంచరించు చుండఁగా దల్లి లేని యేనుఁగుపిల్ల యొకటి యాయనకంటఁ బడెను. ఆమహర్షి జాలిచేత దానిని జేరఁదీసి పెంచఁదొడఁగెను. నానాటి కది మిక్కిలి పెద్ద దయ్యెను. ఆకాలమున ధృతరాష్ట్రుఁడను రాజు దేశమును పాలించు చుండెను. దేవేంద్రుఁ డారాజు రూపముఁ దాల్చి గౌతమమహాముని కడకుఁ బోయి "మహాత్మా నీవుపెంచుచున్న యేనుఁగు నా" కిమ్మని యడిగెను. అతనికి గౌతముఁ డిట్లనియె. "రాజా! యీయేనుఁగు నా యగ్నిహోత్రమునకు సమిథలు తెచ్చియిచ్చును. నే నాశ్రమమున లేనికాలమున జాగ్రత్తతో నాపర్ణశాల రక్షించును. దీనిని బిడ్డను బెంచినట్లు పెంచితిని. అదియు నన్ను దండ్రిని బ్రేమించినట్లు ప్రేమించుచున్నది. అందుచేత దీనిని నీకియ్యఁజాల." అనవుడు మాయారూపముం దాల్చిన దేవేంద్రుఁ డిట్లనియె. "ముక్కుమూసికొని తపము చేయు మునుల కేనుఁ గెందుకు? ఎక్కనా? సౌఖ్య మనుభవింపనా? సమిథలు తెచ్చునను కారణమున నేనుఁగులఁ బెంచువారుగలరే! అమూల్యములయిన గోవుల వేనవేలిచ్చెద. కావలసినంత బంగారమిచ్చెద." అన ముని చిన్ననాట దీనితల్లి చనిపోవుటచే మిక్కిలి యక్కటికముతోఁ బెంచినాఁడ. అందుచేత మక్కువ యెక్కువైనది కావున విడువఁజాల. లక్షగోవుల నిచ్చినను దీని నియ్యను. కోటివరహా లిచ్చినను దీని నియ్యను. నీరాజ్య మంతయు ధారవోసినను దీని నియ్యను. నేనీయను. మొత్తుకొనుచు చుండ నీవిన్ని సార్లడుగుట న్యాయమా? మారుమాటాడక పొమ్ము" ఆమునిపలుకులు విని కపటవేషధారి యయిన మహేంద్రుఁడు "వాహనము చేసికొనుటకై యేనుఁగును రాజు పుచ్చుకొనవచ్చు. నీవేమి సేయఁగలవు. సామమున

దీనినీయకున్న బలిమిని దీని గైకొనెద. కావున విడువు" మని రాజ సముసం బలుకుటయుం దపోధని యిట్లనియె. "పుణ్యాత్ములు సంతోష మెచ్చటం బొందుదురో పాపకర్ములు విచార మెక్క డనుభవింతురో యట్టి మహాజనసభకు నీవు రమ్ము. అచ్చట పెద్దమనుష్యుల యెదుట నీకేనుఁగు నిచ్చెద."

అనవుడు మహేంద్రగౌతము లీవిధమున సంభాషించిరి.

మహే—నాస్తికులును పాపాత్ములును నీచెప్పినచోటికి వత్తురు గాని నేనేలవత్తు?

గౌత—యముఁడు ధర్మాత్ముఁడుగదా! అతనియొద్దకు రాఁ గూడదా?

మహే—నేనచటికి రానొల్ల.

గౌత—అట్లయిన మందాకినీ నదీతీరమునకు రమ్ము. అచ్చట హస్తి నిచ్చెద.

మహే—అతిథులు తినఁగా మిగిలినయన్నముఁ దినువారును, దానములు గ్రహింపనివారును నక్కడికిఁ బోవుదురు. నేను రాఁ జాలను.

గౌత—అటులైన మేరువనమందు నీ కేనుఁగునిచ్చెద. రమ్ము

మహే—అక్కడ కేగువారు సత్యవంతులు; భూతదయాపరులు. అక్కడ నాకేమి పనియున్నది. మఱియొక చోటికి వచ్చెద చెప్పుము.

గౌత—నారదమహాముని విహారస్థలమునకురమ్ము. అదిమనోహరము. కిన్నరు లచ్చట సంచరించు చుందురు.

మహే—గానవిద్యావిశారదులు, నృత్యమునందు మిక్కిలి ప్రవీణులు నివసించుచోటది. అది నాకేల?

గౌత—ఉత్తరకురుభూములు మిక్కిలి కమనీయములు. అక్కడ దేవేంద్రుఁడు కోరినకోరిక లిచ్చును. అక్కడకు రమ్ము.

మహే.—కామము సహింప లేనివారి కాచోటులు చొరఁశక్యములు గాని నాకుఁగావు.

గౌత—చంద్రగృహమున గజము నిత్తురమ్ము?

మహే—దానశీలురు పరమశాంతులు మున్నగువా రాలోకమనుభవింతురు. నాకది చోటుగాదు.

గౌత—సూర్యుని సన్నిధానమున నీ కేనుఁగు నిచ్చెదరమ్ము.

మహే—తపస్స్వాధ్యాయనిరతులు బోఁదగినస్థానమద్ది; నేనేల వత్తును?

గౌత—వరుణునిపట్టణమునకు రమ్ము; అక్కడ దంతిని నీవు పుచ్చుకొనవచ్చును.

మహే—యజ్ఞములు సేయువారు అగ్నిహోత్రములు నిలుపువారు మాత్రమే వెళ్ళఁదగినిచోటది. అక్కడికి నేను రాను.

గౌత—అట్లయిన దేవేంద్రుని సమక్షమందు గౌరు నిచ్చెదరమ్ము.

మహే—శూరులు, యజ్ఞములు సేయువారు, నక్కడికి పోవలయుదు గాని నే నెందుకు.

గౌత—అది యొల్లవేని ప్రాజాపత్యలోకమునకురమ్ము.

మహే—అది యశ్వమేధులస్థానము.

గౌత—అక్కడకు రా నిష్టము లేదేని గోలోకమునకు రమ్ము. ద్విపము నందు గ్రహింపవచ్చును.

మహే—బ్రహ్మచర్యవ్రతులు, తీర్థయాత్రలు సేవించువారు, బహుగోదానములు గావించినవారు నచ్చటికి వెళ్ళఁదగుదురు గాని నే రాఁజాల.

గౌత—అయ్యా! బ్రహ్మలోకమునకు రమ్ము. అక్కడ చలి యుండదు. ఎండయుండదు. ఏదుఃఖము లుండవు.

మహే—సర్వసంగపరిత్యాగులు, కృతార్థులు, వేదాంత విద్యాపరిజ్ఞాకలు, మొదలగువారందఱుఁ బోదురు. నాకు రాశక్యము కాదు.

గౌత—అయ్యా! నేనెచ్చటికి రమ్మన్న నచ్చోటికి కేదో యొకవంక చెప్పి రాకున్నాఁడవు. నీ వాలకముఁ జూడ నీవు ధృతరాష్ట్రుఁ డను రాజువు కానట్టు తోఁచుచున్నది. నీవు మహేంద్రుఁడ వని నాబుద్ధికి పొడకట్టుచున్నది. మహేంద్రున కేలోకమందును, నేమియెగ్గులు గలుగవు.

మహే—మహాత్మా! సత్యముగ్రహించితివి. చేసిన యపరాధము క్షమింపుము. నీ వేమివనిచిన నట్లు చేసెద.

గౌత—దేవా! ఈయేనుఁగు నాకు పుత్రుఁడు వంటిది. బిడ్డను బెంచినట్లు దీనిఁ బెంచితిని. దీనిని నాకడ విడిచిపొమ్ము. అదె! నాకు వరప్రసాదము.

మహే—మహాత్మా! ఈయేనుఁగు తనతొండము సాచి నీ పాదములయొద్ద నిలిచి నీకు మ్రొక్కుచున్నది. నిన్ను ముద్దుపెట్టు కొను చున్నది. ఇంతప్రేమగలిగిన యీజంతువునకు నీకు నెడబాటు చేయుట కే నంతమూర్ఖుఁడనే? నీయేనుఁగును నీవె గైకొమ్ము! నేను మూలరూపమునఁ దాల్చినప్పుడు నన్ను సాధారణమహిమగలమును తెలియఁగఁజాలరు. నీవఖండప్రభావవంతుఁడవు. కావున నన్నెఱింగితివి. ప్రజ్ఞకు మెచ్చి నీకు వరమిచ్చుచుంటి నీవు నీప్రియపుత్రుఁ డయిన యేనుఁగుతోఁ గూడఁ గలిసి స్వర్గమునకు రమ్ము. అక్కడ సుఖము గా నుండవచ్చును. అని గౌతముని, గజమును మహేంద్రుఁడు స్వర్గమునకుఁ దీసికొని పోయెను.

---

## కుక్క.

ఒక మహాముని యాశ్రమములో జంతువు లనేకములు వాని దయావిశేషమున బిడ్డలవలెఁ బెరుగుచుండెను. అందొక కుక్క యుండెను. తక్కిన జంతువులతోఁబాటు ముని యాకుక్కనుసైతము మిక్కిలి ప్రేమతోఁ బెంచెను. అదియు నధికవిశ్వాసము గలిగి వర్తించుచుండెను. అట్లుండ నొకనాఁడు పులి యొక్కటి కుక్కను దఱుముకొని వచ్చెను. కుక్క భయంబున మహాముని శరణు జొచ్చెను. ముని దయఁబూని తన తపోమహిమచేత శునకమును వ్యాఘ్రముగఁ జేసెను. పులిరూపు దాల్చిన యాకుక్క మిక్కిలి రోసముతోఁ దఱుముకొనివచ్చిన పులిపైఁబడి దాని నోడించి పాఱఁదోలెను. పిమ్మట నొకనాఁడు కుక్కను మదపుటేనుఁగు తఱిమి తొండములోఁ గొట్టఁబోయెను. అప్పుడు మహాముని కుక్కను గొప్ప యేనుఁగును జేసెను. రెండు యేనుఁగులును బోరాడ కుక్క యేనుఁగును గెలిచెను. మఱియొకనాఁడు కుక్కను సింహము చంపఁబోగా ముని కుక్కను సింహముగాఁ జేసెను. మాయసింహము నిజమయిన సింహమును బాఱఁదోలెను. వేఱొకనాఁడు శరభ మొకటి కుక్కపై గవిసెను. ముని మహిమచేత కుక్క శరభమై విక్రమించెను. తాను పులియై, యేనుఁగై, సింగమై, శరభమై, విజృంభించుట యెల్లఁ దన ప్రజ్ఞయే యని లోకమునకుఁ దెలుప నెంచి యాముని యుండినయెడ దనపేరు ప్రతిష్ఠలు పైకి రావని తలపోసి యామునిని శరభరూపమున నున్నకాలమున యాముక్కిడి కుక్క చంప నిశ్చయించుకొనెను. ముని తన తపోమహిమచేత దాని దుష్టభావము గ్రహించి శరభరూపము నుండి యెప్పటి కుక్కఁగా మార్చి యావలకుఁ బాఱదోలెను. తమ కుపకారము జేసినవారికే హాని జేయఁదలఁచు దురాత్ములు చెడిపోక బాగుపడుదురా?

## పులి—నక్క



పురికయను పట్టణము కలదు. పౌరకుఁ డనురాజు దాని నేలు చు నిరంతరము పాపకార్యములు చేయుచుండెను. కొంతకాలమున కతఁడు మృతినొంది నక్కయై పుట్టెను. పూర్వజన్మమునఁ దానొక గొప్ప రాజైనట్లు మున్ను చేసిన మహాదోషములంబట్టి తనకాజన్మ ము కలిగినట్లు నక్క యెఱింగియుండి యాజన్మముననైన సాధువర్త నము కలిగి బ్రతుకవలయునని సంకల్పించుకొని జంతువులను జంపక మహోపాయములు పన్నక మాంసముఁ దినక వ్రతముఁ బూని క్రిందరాలిన యాకులు పండ్లు మాత్రమే తిని పొట్ట బోసికొనుచు నెట్టులో కాలక్షేపము సేయుచుండెను. దాని చుట్టము లగు నక్క లన్నియు విరుద్ధమైన యావ్రతముం జూచి సహింపక దానికడకుఁ బోయి "యిది యేమివిపిచ్చి! కడుపునిండ మాంసముఁ దినక యిట్లు కృశించెద వేమి? నీవు జంతువులను జంపి మాంసముఁ దెచ్చుకొనలేక పోయిన పక్షమున మేము మాంసముఁ దెచ్చి నీకిచ్చెద" మని వేఁడు కొనెను. ఆనక్క చుట్టములమాటలు సరకు సేయక యెప్పటినియమ మున నె యుండె. గొప్ప వ్రతమును బూనియున్న యానక్క వృత్తాం తము నచ్చటిమృగములలో నెల్ల ముఖ్యమయిన పులి విని దాని కడకుఁ బోయి యిట్లనియె. "నీవు మిక్కిలి సౌమ్యుఁడని విని నీకడ కు వచ్చితిని. నాతో మైత్రి చేసి నీవు నాయొద్ద నుండుము! నేను మిక్కిలి క్రూరుఁడ నని పేరుకలదు. సాధుచరిత్రముగల నీశిక్షలో నేను కొంతకాలము పెరిగితినేని నాక్రూరత్వము నన్ను విడిచిపెట్ట వచ్చును. కావున నాయింట నుండుము" అనవుడు నక్క యిట్లనియె. "మావంటివారికి నీవాశ్రయణీయుఁడవు కావు. నామనస్సు భోగ ముల ననుభవించుట కిష్టపడకున్నది. కావున నీమాటలు నాకు సరి

పడ కున్నవి" అని నక్క పల్కుటయు బెబ్బులి దాని కివ్విధమునఁ బ్రత్యుత్తర మిచ్చె. 'పోనీ! భోగముల ననుభవింపవద్దు. నాకు మంత్రివై చేయఁదగిన కార్యము చేయఁగూడని కార్యము నాకుపదేశించు చుండుము." అనవుడు "అట్లు నీకు మంత్రినై కార్యభారము నడుపుచుండు పక్షమున నీమూలభృత్యులకు నాపై నసూయ వొడముదు. పొడమినఁదోడనే వారు నీచెవి చెంతఁ జేరి కొండెములు తండోపతండములుగా నామీఁదఁ జెప్పుదురు. నీకవి ప్రియములగును. అప్పుడు నన్ను నీవు చెఱుపఁ జూతువు. ఇన్నికష్టము లెందుకు నన్ను నీకడ నుంచుకొనఁదలఁతువేని వారు నాపైఁ జెప్పు కొండెముల నాలకింప ననియు, వారిమాట పాటిచేయుట లేదనియుఁ బ్రమాణము సేయుము. అట్లు చేసితి వేని నీకడ నేనుండెద" ననిబదులుచెప్పెను. వ్యాఘ్రి మాపలుకుల కియ్యకొని నక్క కోరినఫక్కిని బ్రతినసేసె. నక్కయు శార్దూల మున్న నెలవునకుఁ బోయి దానికి మంత్రియయి బుద్ధులు చెప్పుచు వసియించెను. పులియు మిక్కిలి ప్రీతితో దాని నాదరించుచు వచ్చెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి వ్యాఘ్రముయొక్క మూలభృత్యులకు నక్కపై నసూయపుట్టెను. పుట్టుటయు వారంద ఱొక్కనాఁడొక్కచోట జేరి యిట్లు విచారించిరి. 'ఏమిది! ముందువచ్చిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాఁడి యన్నట్లు చిరకాలమునుండి కనిపెట్టుకొనియున్న మనలనందఱి దిగఁద్రొక్కి యీబక్కనక్క మన ప్రభువుకడ సర్వాధికారము వహించి మనపైఁ గూడఁ బెత్తనము చేయవలసిన దుష్కాలము వచ్చెఁగదా! మనప్రభువు కార్యనిర్ణయమందు దానినేగాని పిలునఁడు. దానితోనే గాని యాలోచింపఁడు. దానిమాటేగాని వినఁడు. దానిసన్నిధినే గాని కూర్చుండఁడు. దానిపై నెవ్వరేమి చెప్పిన వినఁడు. ప్రభువు చెవులలో నదేమివిషము పోసెనో తెలియదు. దాని

మాటలే తనకుఁ బథ్యములు. ఏమిచేయుదుము ? ఈనక్కను నాశన ము చేసినం గాని మనకు మేలులేదు. ఏయుపాయము చేతనైనను సరే దీనిని వెడలుపవలయును." అని యందఱు విచారించుచుండ నొక గుంటనక్క యిట్లనియె. "దీనికి నేనొక్క యుపాయము సెప్పెద. పులినిమిత్తమై దాచిన మాంసము మన మపహరించి నక్కబసలోఁ బెట్టి నక్క దొంగిలించుకొనిపోయె నని చెప్పుదము. అప్పుడు పులి దానిం జంపును. దానితో మన యదృష్టము పండును" అనవుడు నది లెస్సయైన మార్గమని యందఱు సంతసించి యట్లు చేసిరి. పులి యొక్క యాహారమును సంరక్షించు పని నక్కదే గావున నది యజ మానుని భోజనపువేళకు మాంసము తేఁబోయి కానక యెవరో సంజుడు దొంగిలించెనని శార్దూలమునకు విన్నవించెను. అది యా దొంగతనమును విచారింపఁబూన మూలభృత్యులేమియు నెఱుఁ గనియట్లు నలుదెసలు వెదకి నక్కయుండెడి గొందిలోనుండి మాంస మును బట్టితెచ్చి యప్పగించిరి. అది చూచి పులి నివ్వెఱపడి నక్కపై కొంత దురభిప్రాయమును బూనెను. ఆ వేఁడి చల్లారక మును పీ నాలుగుసమిధలు వేయవలయునని మూలభృత్యులు స్వామి కడకుఁ బోయి యిట్లు నక్కను దూలనాడిరి. "స్వామీ ! నక్కకేమి వ్రత మేమి ? ఇది యంతయు బూటకంబు; ధర్మకవచముఁ దొడుగు కొని లోకులను వంచించుచున్నది. ఇది మాంసముఁ దిననని వ్రతముఁ బూనినదికదా! అట్లయిన మాంస మేల యిది దొంగిలింపవలయు ? మాంసము దానిగదిలో దొరకుట మీకన్నులతో మీరే చూచితిరి గద! ఇదియేఁట మాంసము తినదఁట ! వ్రతములఁట ! జపములఁట! ఇంతకాలము మనకన్నులలో దుమ్ముకొట్టినది. పాప మెప్పటికైన బయిద్దలుకాకమానునా? ఇది మన యొద్ద నుండఁదగదు. మీఁద దేవ ర చిత్తము" ఆ పలుకులు విని పులి నక్కపై మిక్కిలికోపించి దానిం

బట్టుకొని చంపవలసిన దని యాజ్ఞాపించెను. పులితల్లి యావార్తవిని కొడుకుకడకుఁబోయి వాని నిట్లు మందలించెను. "ఎంతవెఱ్ఱివాఁడవు రా కొడుకా! ఇట్టి యకార్య మెపుడైనఁ జేయుదురా? నీమూఢ భృత్యులు నిన్ను మోసపుచ్చిరి. ప్రభువులయొద్ద నున్న భృత్యు లెన్నెన్నో కపటోపాయములు సేయుచుందురు. అవి తెలిసికొనవల దా? బుద్ధిహీనులకు బుద్ధిమంతులమీఁదను నీచులకు గొప్పవారి మీఁదను కురూపికి రూపవంతునిమీఁదను మనసులో నసూయలు పుట్టుట సహజము. అవి యెఱిఁగి ప్రభువు వర్తింపవలయును. అధ ర్మము ధర్మమువలెను, ధర్మ మధర్మమువలెను సాక్ష్య మిచ్చువారి నేర్పుంబట్టి కనఁబడుచుండును. రాజు నిర్మలమతితో ధర్మసూక్ష్మము గ్రహింపవలయుఁ గాని తొందర పడవలదు. ఈనక్క వచ్చినది మొదలుకొని మనకుఁ జేసిన యుపకారము లెన్నోగలవు. అవి యైనఁ దలఁపకుండ నిట్లుసేయుట ధర్మమా? కుటిలచిత్తులు కపటోపాయ ములఁ బన్నినంతమాత్రమున నవి నమ్మి మిత్రుఁడై మంత్రియై సు చరితుఁడై యెన్నికగన్నవాని నిట్లు సేయఁదగునా? చక్కఁగాఁ బరీ క్షించి కార్యము సేయవలదా? దున్నపోతీనెననఁగానె దూడనుగట్టి వేయుమందురా? కావున నిర్దోషియైన నక్కం బిలిచి గౌరవింపుము!" అని తల్లి హితోపదేశముజేయ శార్దూలము పశ్చాత్తాపము నొంది నక్కను రావించి కన్నీరుదొరఁగఁ గౌఁగిలించి తననేరంబుమన్నింపు మని వేఁడుకొనియెను. అనవుడు నక్క శార్దూలమున కిట్లనియె. "నాఁడు సకలమృగంబులయెదుట నన్ను గౌరవించినందుకు సంతసిం తునా? నేఁడు దొంగతనము నాయందు మోపి చంపఁబడినందుకు విచారింతునా? నీనైజ మెఱిఁగియుండియే నేనునీకడఁ గొలువుకుదుర నాఁడే నీభృత్యులమాటలు వినకుండునట్లును నాచెప్పినచొప్పున నీవు వర్తించునట్లును, నీవలన నొట్టుబెట్టించుకొంటి. అది నీకుజ్ఞాపకమున్న

దా? ఎట్టిగిమైన నెఱుఁగకయైన మొదల నొకని గట్టిగా నవమాన ముచేసి పిదప నీవు సజ్జనుఁడవు క్షమింపు మని వేఁడికొనిన నేమిఫల ము? ఆతఁడు దుఃఖమంతయు ననుభవించునుకదా! ఎవ్వాఁడు గాని మొదటనే గట్టిగ నఱసి చూడవలయు. కావున నీకడ నుండనోపను నేఁ డనుగ్రహము రేపు నిగ్రహము గలవారిని సేవించుట కష్టము" అని పలికి నక్క తనయిచ్ఛవచ్చినకడకుఁ బోయెను.

భృత్యుల కపటోపాయములు విని సాధుజనుల నవమానముల పాలుసేయు ప్రభువులకడ నున్నతచిత్తులగువాడు చిరకాలముకొలువు సేయనోపరు. అట్టిప్రభునిరాజ్యము దుర్మంత్రుల స్వాధీనమై యచిర కాలమున నశించును.

---

## సువర్ణష్ఠీవి.

నారదుఁడు, పర్వతుఁడు దగ్గఱచుట్టములు. నారదుఁడు పర్వతు నకు మేనమామ. అల్లుఁడు మామ లిద్దఱు కలిసి ప్రపంచమంతయు సంచరింపఁ దలఁచుకొని తమలోఁ దామిట్లు ప్రతిజ్ఞచేసికొనిరి. "ఏవిష యమైగాని మనలో నొకనిమనస్సులో నేమున్నదో దానిని రెండవ వానికిఁ దప్పక చెప్పవలయును. మనలో మనకు రహస్యము లుండఁ గూడదు. అట్లు చెప్పకొనకపోయినపక్షమున శాపముపాలు గావలసి నదె." ఆనియమముచొప్పున వర్తించుచు వారనేక దేశములు తిరిగి తిరిగి సృంజయుఁ డనురాజుకడకుఁ బోయిరి. ఆరాజు మహామునుల నిద్దఱను మిక్కిలి భక్తితోఁ బూజించి తనమందిరమున నుండుమని ప్రార్థించెను. అట్ల కాక యని మునులు సమ్మతించిరి. సృంజయుఁడు తనకూఁతురగు సుకుమారినిఁ బిలిచి బిడ్డా! యీమహామునులకు నీవు

పరమభక్తితో నుపచారములు సేయవలయు. కావలసిన భోజనపదార్థములు వేళకు సమకూర్పవలయు. ఇన్ని మాటలెందులకు? వారికే వెలితి రాకుండ చూచుభారమునీది." అని చెప్పి యప్పగించెను. సుకుమారియు నట్లేయని బద్ధకింపక మునులకు వేళదప్పకుండ నన్నపానాదులు సమకూర్చుచు దేవపూజలకు మంచిపుష్పంబుల సమర్పించుచు సకలోపచారములు చేయుచుండెను. మహామును లామె యుపచారములకు మిక్కిలి సంతసించిరి. ఆసుకుమారి మిక్కిలి చక్కనిది. ఆ ముద్దుగుమ్మ నడబెడంగులు నవ్వులు మేను మరపించుహాయలు సంపూర్ణ చంద్రమండలమునకు వన్నెలు దిద్దఁగల మొగము, కలువ తేకులను మీరిన కన్నులు, నిరుపమానమైన లావణ్యమును జూచి నారదమహాముని యామెమీఁద వలపునిలిపెను. అతఁడు తావళము మునుపటివలెఁ ద్రిప్పుచుండెనుగాని మనస్సు పద్మాక్షునిపై నిలుచుట మాని యామినాక్షిపై నిలువఁజొచ్చెను. అన్నముమీఁద నిష్టము దప్పెను. క్రమక్రమముగ మేను పాండించెను. బలహీనత హెచ్చెను ఆలక్షణములు కనిపెట్టి పర్వతుఁ డట్లుండుటకు కారణమే మని నారదుని బలుమారు గుచ్చిగుచ్చి యడిగెను. నారదుఁడు సిగ్గుపడి చెప్పక యూరకుండెను. పర్వతుఁడు తనదివ్యదృష్టిచేత నారదుని విచారకారణము తెలుసుకొని యిట్లనియె. "నారదా! నీవు చెప్పకపోయినను నీచింతకుఁ గారణము నేను దెలుసుకొంటిని. రాచకూతురును వలచితివి. నేడో రేపో యామెను వివాహము సేయుమని రాజును నీవడుగుదువు. రాజును నీమాట తీసివేయలేక నీకుదానినిచ్చి వివాహము సేయును. అదినాకు సంతోషమేకాని మనమిద్దఱము చేసుకొన్న ప్రతిజ్ఞకు విరుద్ధముగా నీవు నీమనస్సులోనున్న భావము నాకుఁజెప్పకుండ దాచితివి. కావున నీవిప్పుడు శాపము పాలుగాక తప్పదు. వివాహమైనవెంటనే నీవు కోఁతిమూపు దాల్తువుగాక!" యని శపించుటయు

నారదుఁడు "పర్వతా! నన్ను నీవు నిష్కారణముగా శపించినందుకు నీవు స్వర్గమునకు వెళ్ళకపోదువుగాక" యని ప్రతిశాపమిచ్చెను పర్వతుఁడు నారదునివదలి యథేచ్ఛముగా సంచరించుటకు వెళ్ళెను. సృంజయుఁడు నారదుఁడు తన కుమారికయగు సుకుమారిని వలచెననివిని యాకన్నియనిచ్చి యతనికి వివాహముచేసెను. పాణిగ్రహణము కాఁగానే నారదమహామునికి హేయమైన కోఁతిరూపు ప్రాప్తించెను. మగని మొగ మసహ్యముగా నుండినను సుకుమారి రోఁతపడక పరమ పతివ్రతమై యతనికి విధేయురాలై పరమభక్తితో నతనికి నుపచారములు సేయఁజొచ్చెను. అట్లుండ నారదుఁడొకనాఁడు దాపుననున్న యరణ్యమునకుం బోయెను. అతని కక్కడ పర్వతుఁడు కనఁబడెను. అన్యోన్యకుశలప్రశ్న లయినతరువాత నారదునిఁ జూచి పర్వతుఁడు "మామ! స్వర్గలోకమునకు పోకుండుటచే నాకేమియు తోఁచుటలేదు పిచ్చెత్తినట్లున్నది. కావున నాకిచ్చినశాపము మరలింపు" మని పలికెను. అనవుడు నారదుఁడిట్లనియె—"పర్వత! కారణములేకయే మొదట శాపమిచ్చినవాఁడవు నీవు కావున, మొదట నీవిచ్చిన శాపము మరల్పుము. తరువాత నేనిచ్చిన శాపము మరల్చెద. అనఁగానే పర్వతుఁడు తానిచ్చినశాపము మరల్చెను. నారదుఁ డట్లే చేసెను. ఇద్దఱు కలసి సృంజయుని మందిరమునకు వెళ్ళిరి. కోఁతిరూపు నారదునకు పోయెను. రూపుమారిన నారదుని చూచి సుకుమారి యతఁడు తన భర్త కాఁడనియు నెవరో పరపురుషుఁడనియు, భావించి పరపురుషుని జూడనొల్లనని యంతఃపురములోఁ గూర్చుండి రోదమయ్యెను. సృంజయుఁడు మున్నగువారు చేరిరి. అప్పుడు పర్వతుఁడు సుకుమారికిని సృంజయునకును గలిగిన సందేహము నివారణమగునట్లు తొంటినుండియు నడచిన యావద్వృత్తాంతము దెలిపి వారల సంతుష్టులఁ జేసెను. అంతట సుకుమారి సంతసించి భర్త నెప్పటివలె గారవించెను.

అనంతరము కొంతకాలము పర్వతనారదులు కలసి సృంజయునిమందిర మునసే వసియించి "రాజా! నీవుమాకు జేసిన మహోపకారమునకు నీకేదేని వరమియ్యఁదలఁచు కొన్నాము. ఇచ్చవచ్చినవరమును కోరు మని చెప్పిరి. సృంజయుఁడు సంతసించి మహాత్ములారా! పుత్రసంతా నము లేక చిరకాలము నుండి కుందుచున్నాఁడను. లోకోత్తర చరిత్ర గల కుమారుని బ్రసాదింపుఁడని ప్రార్థించెను. అట్టిపుత్రుఁడు కలుగుఁ గాక యని నారదుఁడు వరమిచ్చెను. కానియతఁ డల్పాయుష్కుఁడగు నని పర్వతుఁడు పలికెను. ఎందుచేతనని సృంజయుఁడడుగ "లోకో త్తరచరిత్రులైన వారు తన్ను మింతురేమో యని యింద్రుఁడు భ యపడు చుండును. అందుచేత నింద్రునివలన నతనికపాయము వాటి ల్లగలదు. కావున నతనిబారిఁ బడకుండ కుమారుని రక్షించుకొనుము. దైవవశమున నేదేని యపాయము వాటిల్లినఁ దక్షణమ నన్ను దలఁచు కొనుము. నేను వచ్చి నీకుమారుని రక్షించెద" నని పర్వతుఁడుకార ణముచెప్పి యభయప్రదాన మొసంగెను. రాజు పరమానందభరి తుఁడై మునులకు నమస్కరించి యంతిపురమునకుఁ బోయెను. సంవ త్సరమయిన తరువాత నతనికిఁ జక్కని కుమారుఁడు పుట్టెను. అతని యుమ్మి చొంగ మొదలగునవి బంగారమే. అందుచేత నతనికి సువర్ణ ష్ఠీవియని పేరుపెట్టిరి. అట్టియద్భుతచరిత్రగల కుమారుఁడు పూర్వ మే రాజ వంశమందును జనియింపక పోవుటచే జననీ జనకులకు బంధు వర్గమునకు ప్రకృతిజనులకు నతనిచరిత్రము మహాశ్చర్యముగా నుండె ను. అతనింగూర్చి జనులీవిధమున జెప్పుకొనంజొచ్చిరి. దేవతలయం శమున జనించిన మహాత్ములనేకులుగలరు. చక్కనివారు పెక్కు లు న్నారు. మహాబలవంతులు వేనవేలున్నారు. అసాధారణ ధీమం తులుగూడ ననేకులుగలరు. కాని బంగారమే యుమ్మివేయునట్టి బాలకుని భూలోకమందెన్నడు జూచియుండ లేదు. పుట్టినట్లు వినియుండ లేదు."

ఎల్లవారికి మిక్కిలి యాశ్చర్యము గలిగించుచున్న యాబాలునితల్లి దండ్రులు మిక్కిలి గారాబమున బెంచుచుండిరి. ఇందుఁ డేవేళ వచ్చి మచ్చరంబున వధించిపోవునేమోయని మనంబున నత్యంత భయంబునొందుచు సృంజయుఁడతనిని వేయికన్నులతోఁ గాపాడుచుండెను. మందిరముదాటి యతని నావలకుఁ బోనియ్యకుండెను. అనుక్షణమతనివెంట లెక్కకుమీరిన సేవకు లుండున ట్లాజ్ఞాపించెను.

ఆబాలకుఁ డట్లు సర్వజనంబులకు ముద్దుగాఁ బెరుగుచుండ ధనాశాపాతకులగు దొంగలు కొందఱు చేరి యిట్లుతలంచిరి. "ఈరాచబుడుతేఁడు చొంగఁ గార్చిన నది బంగారము, ఉమ్మి బంగారము చమట బంగారము, కన్నీరు బంగారము, మలమూత్రములు బంగారము, వీని పొట్టనిండ బంగార ముండఁబోలును. పొట్టయేగాదు శరీరమంతట బంగార మున్నది. మన మందఱము వీని నెట్లైన నెత్తుకొనిపోయి వీనిఁజంపి కడుపులోనున్న బంగారమంతయు నపహరింత" మని నిశ్చయించుకొని సమయంబునిరీక్షించి మాయ వేషంబులు వేసికొని యంతఃపురము ప్రవేశించి దాది నిద్రబోవునప్పుడు చోరులు బాలకుని దొంగిలించుకొని సమీపమున నున్న యరణ్యమునకుఁబోయి వానిని జంపి కడుపు నోరు చీల్చిరి. కాని, వారికి బంగార మించుకేనియుఁ జిక్కదయ్యె. "అయ్యో! రాచకొడుకును నిష్కారణముగఁ జంపితిమి. మన మెంతమూర్ఖులము! వీని కడుపులోను నోటిలోను బంగారము లేదు. ప్రతము చెడినను ఫలము దక్కలేదు." అని పశ్చాత్తాపము నొంది దొంగలు శవము నచట పాఱవైచి పోయిరి. ప్రక్కలో నిద్రించుచున్న రాజకుమారుఁడు ప్రక్కలోనే మాయమైపోవుట తెలిసినతోడనే యంతఃపురమునం దెల్లవారు మిక్కిలియాశ్చర్యము విషాదము మనంబునఁ బెనఁగొన పట్టణములు, పల్లెలు, నూతులు, గోతులు, చెఱువులు, నదులు, తోఁటలు,

దొడ్డు మహారణ్యములు వెదకిరి. అరణ్యములో నొకచోట శవము కనుపడెను. దానిం జూచి తలితండ్రులు హాహాకారము లెసగ నేడ్చిరి. సువర్ణష్ఠీవియయిన తనకొడుకును జూచి యోర్వలేక దేవేంద్రుడే చంపించె నని సృంజయుఁ డభిప్రాయపడెను. వెనుకటిమాటలు జ్ఞప్తికి దెచ్చుకొని పర్వతమహామునిని తలంచెను. తలఁచుటయు పర్వతుఁడు ప్రత్యక్షమై యేమికావలయునని రాజు నడిగెను. జరిగినవృత్తాంత మంతయు రాజు పర్వతున కెఱిఁగించెను. అప్పుడు పర్వతుఁడు రాజున కిట్లనియె "రాజా! నీయభిప్రాయము తప్పు. ఈదుష్కార్యము దేవేం ద్రుఁడు చేయలేదు. దురాశగల దొంగలు చేసినపని యిది. ఎవరు చేసిన నేమి? నీవు పుత్రశోకార్తుఁడ వైతివి. నీకిప్పుడు నీకొమారునిం దెచ్చియిచ్చెద వగవకుము" అని తన తపోమహిమచేత రాజకుమా రుని బ్రతికించెను. తలిదండ్రుల యానంద మేమని వర్ణింపఁగలము? చుట్టముల సంతోష మెంతని చెప్పఁగలము? అంత మహోపకారము చేసినందులకు సృంజయుఁడు పర్వతున కనేకవందనములుచేసి కృతజ్ఞతను దెలిపెను. పర్వతుఁడు తన యిచ్చవచ్చినట్లు పోయెను. రాజు కుమారుని మిక్కిలి శ్రద్ధతోఁ బెంచుచుండెను. అట్లు కొంతకాలము గడచెను. సువర్ణష్ఠీవియొక్క ప్రఖ్యాతి మూఁడు జగములందు వ్యాపించెను. అతనిబుద్ధి, అతని బాహుబలము, అతని సుగుణసంపద యెల్లవారు కొనియాడఁజొచ్చిరి. దేవత లతని పొగడిరి. మును లతనినే ప్రశంసిం చిరి. మానవు లతనినే కొనియాడిరి. అటువంటి బాలుఁడు పదునాలు గు జగముల లేడని యెల్లవారుఁ జెప్పుకొనిరి. అట్టి బాలునివలన తన కెన్నటికైన నపకారము కలుగక పోదని దేవేంద్రుఁడు బెంగ పెట్టు కొనెను. గురువైన బృహస్పతితో నాలోచించెను. భయము లేదని బృహస్పతి ధైర్యము చెప్పెను. ఎంతధైర్యము చెప్పినను దేవేంద్రుని మనస్సు కుదుట పడదయ్యె. మిక్కిలి ఛాందసుఁ డగు బృహస్పతితో

నాలోచించిన గార్యము కాదని స్వయముగా నాతఁడే కార్యాలోచనము చేసికొని వజ్రాయుధమును జూచి "ఓసీ! నీవు పెద్దపులిరూపము దాల్చి భూలోకమునకు వెళ్ళి సృంజయరాజుకుమారుని జంపిర"మ్మని యాజ్ఞాపించెను. చిత్తము! దేవా! యని వజ్రాయుధము భూలోకమునకు వెళ్లి శార్దూలరూపము ధరించి సమయముకొఱకు నిరీక్షించి యుండెను. అంతట నొకనాఁడు సృంజయమహారాజు సకుటుంబపరివారముగా వనవిహారము చేయఁదలఁచి గంగానదీతీరమునకుఁ బోయెను. కొందఱు జలక్రీడలు చేయఁదొడఁగిరి. కొంఱు పువ్వులు కోసిరి. కొందఱాటలాడిరి. కొందఱు ముచ్చటలతో కాలక్షేపము చేసిరి. కొందఱు కాళ్లు నొచ్చునట్లు పలుతావులు దిరిగిరి. కొందఱు వేఁటాడిరి. సువర్ణష్ఠీవి కొందఱు మిత్రులతోఁ గలిసి యిట్లు దిఱుగుచుండెను. అప్పు డొకపొదలోనుండి బెబ్బులియొకటి యదరుపాటున గాండ్రు గాండ్రు మనుచు వచ్చి బాలునిమీఁదఁ బడి పట్టుకొని గొంతుకొఱికి విసరివైచెను. వెంటనే బాలుఁడు మృతినొందెను. ఈపనియెల్ల నిమేషమాత్రములో జరిగెను. అడవి ప్రతిధ్వనియిచ్చునట్లు హాహాకారములు చెలఁగెను. వేఁటకాఱు కోలలు బల్లెము కత్తులు దీసికొని బెబ్బులిని జంపఁదలఁచిరి. కాని యదియెవ్వరికిం గనఁబడలేదు. బాలునిశవముమాత్రమే కనఁబడెను. తలిదండ్రులు దుఃఖము భరింపలేకపోయిరి. గంగానదిలో ప్రవేశించి వారు మృతినొందఁదలఁచిరి. బంధుమిత్రులు వారిని మిక్కిలి కష్టముతో నివారించిరి. దుఃఖముయొక్క మొదటిపాలి యడఁగిన తరువాత సృంజయుఁడు పూర్వవృత్తాంతము జ్ఞప్తికిఁ దెచ్చుకొని తనకు వరప్రసాదియైన పర్వతమహామునిని మనస్సులోఁ దలఁచుకొనెను. తలఁచుకొనినతోడనే పర్వతమువలె పర్వతుఁ డెదుర నిలిచెను. నిలుచుటయు రాజు వానిపాదములపైఁబడి పుత్రభిక్షముపెట్టుమని ప్రార్థించెను. పర్వతుఁడు తాను పూర్వము చేసిన యభయ

ప్రిదాసమునుబట్టి వానిం బ్రితికించి దేవేంద్రుఁడే మత్సరముచేత నట్టి దుష్కార్యము చేయించెనని సృంజయునితోఁజెప్పి యంతర్హితుఁ డయ్యెను. అనంతరము సృంజయుఁడు మహానందముతో బంధుమిత్ర వర్గములం గలిసి తనపట్టణమునకుఁ బోయి పుత్రసహితముగ సుఖము గ నుండెను. కుమారునకు యుక్తవయస్సు వచ్చిన తరువాత సృంజ యుఁ డాతనికి పట్టముగట్టి తాను తపోవనమున కరిగెను. సువర్ణష్ఠీవి పట్టాభిషిక్తుఁడై ప్రిజలందఱు తనబిడ్డలని భావించి ధర్మమార్గమునం బ్రివర్తించుచు ప్రిజాపరిపాలనము చేసెను.

---

## సక్తుప్రిస్థుని చరిత్రిము.

---

మహాభారతయుద్ధ మైనతరువాత ధర్మరాజు జ్ఞాతులను జంపిన పాపము పోవుటకై యశ్వమేధము చేసెను. యాగము ముగిసిన తరువాత బంధువులు మిత్రులు బ్రాహ్మణు లుకొలువ ధర్మరాజు సభ తీర్చియున్నప్పుడు కొందఱు భూలోకములో నిటువంటి యజ్ఞ మెవరు చేయలేదని ధర్మరాజును స్తోత్రిము చేసిరి. అప్పు డొకముంగి బిలములోనుండి వెలుపలికి వచ్చి సభవారి యెదుట నిలిచి యిట్లనియె. "మీరంద ఱీవిధముగా స్తోత్రము చేయు చున్నారుగాని యీ యజ్ఞము సక్తుప్రిస్థుని ధర్మముతో నెంత మాత్రిము పోలదు. వెఱ్ఱి వెఱ్ఱిపొగడ్తలు పొగడక యూరకుండుఁడు. అనవుడు సభాసదులయిన బ్రాహ్మణులు ముంగిని జూచి "యేమి! నీవిట్లనుచున్నావు? మంత్రిప్రియోగము, తంత్రిగరిమ, దానధర్మము లు నిరుపమానములుగా నున్నవి. లక్షలకొలఁది బ్రాహ్మణులు సంతు ష్టిగ భుజించిరి. మునులు దేవతలు బ్రాహ్మణులు సంతసించిరి. సకల

భూతతృప్తియయ్యె. ఈయజ్ఞమునఁ గల లోపమేమి? సక్తుప్రస్థుఁ డెవ్వఁడు? అతనియెడలగల విశేషధర్మమేమి?" యని పలికిరి. వారలకు ముంగిస యిట్లనియె.—"అయ్యా! వినుఁడు. ధర్మక్షేత్రమని చెప్పఁగల కురుక్షేత్రముకలదు. ఆపుణ్యభూమిలో సక్తుప్రస్థుఁడను నొక బ్రాహ్మణుఁడు భార్య కొడుకు కోడలు సేవింప తపస్సు చేసికొనుచు నుంఛవృత్తితో నుదరపోషణము చేసికొనుచు గాలక్షేపము సేయుచుండెను. అటులుండ ననావృష్టి పట్టెను. పంటలు లేకపోయెను. ఆకుటుంబమునకు జీవనము జరుగుట కష్టమయ్యెను కుటుంబములోఁ గల నలుగురు తెల్లవారుజామున లేచి యొకనాఁడు పొలమునకుఁబోయి నేలరాలినధాన్యపుగింజలేరి తెచ్చుకొని వేయించి పేలాలుచేసికొనిపిండి విసరుకొనిరి. ఆపేలాలుకుంచెడు పిండియయ్యెను. చెరిమానెడు చొప్పున పిండి నలువురుపంచుకొని. తినుటకు సిద్ధముగానుండిరి. అప్పుడొక బ్రాహ్మణుఁడు పేరాఁకలిగొని శోషిల్లి యన్న మన్న మని యడుగుచు వారింటికి వచ్చెను. బ్రాహ్మణుఁడు భార్య కొడుకు కోడలు మిక్కిలి భక్తిశ్రద్ధలతో నతిథి కెదురుపోయి యర్ఘ్యపాద్యములిచ్చి తోడ్తెచ్చిరి. సక్తుప్రస్థుఁడు తనవంతు వచ్చిన మానెడుపేలపిండియు నతిథి కిచ్చి భుజింపుమని ప్రార్థించెను. పేరాఁకలిచేఁ గటకటంబడుచున్న యాయతిథి మానెడుపేలపిండి నాలుగుండలుగాఁ జేసి మ్రింగివైచెను. కానియా తనియాకలితీరునట్లు గనపడలేదు. సక్తుప్రస్థుఁడు వాని యవస్థజూచి "అయ్యో! పాపమీ బ్రాహ్మణుని యాఁకలి దీరలేదు. ఏమిచేయుదు నెట్లు లీతనియాకలి దీర్తు? కటకటా! ఆఁకలిగొన్న యతిథులను సంతుష్టులనుజేయుటకై నాయొద్ద రవంతయేనియు ద్రవ్యము లేకపోయె గదా" యని విచారించుచుండ మహాపతివ్రత యయిన యాతని భార్య మగని యింగితమెఱిఁగి యాతనితో నిట్లనియె. "దేవా! యీ మహాత్మునకాఁకలి తీరునట్లు లేదు. నావంతుపిండి యీతని కిచ్చి

కుడువం బెట్టుఁడు సగమాఁకలి తీర్చు టుచితము కాదు" అనవుడు భార్యయౌదార్యమును మెచ్చి భర్త యిట్లనియె. "సాధ్వీ! నేనుసంపాదించి నీకుఁ బెట్టుటలేదు సరికదా తెల్లవారుజామున లేచి యెండలోఁబడి నీవేరి తెచ్చి వేయించి సిద్ధము చేసికొన్నపిండి నీనోటిముందర నుంచి యపహరించి నేనోరులకుఁ బెట్టఁగలనా? భార్యను బోషింపలేనివాఁ డీలోకమున నిందయుఁ బరలోకమున నరకము ననుభవించును. నీనోటిముందరి యన్నమును దీసికొనజాల" ననవుడు మగనితో నాయిల్లాలి త్తెఱంగున బలికెను. "స్వామీ! ఆఁడుదానికి మగఁడే చుట్టము, మగఁడే దైవము, మగఁడే తల్లి, మగఁడే తండ్రి, మగఁడే మిత్రము. మగనికంటె నాప్తులెవరును లేరు. మగని యభీష్టముఁబట్టి నడుచుటయే మగువకు ధర్మము అదియునుఁగాక మీయాహారము నతిథికిఁ బెట్టి మీ రాఁకలిచే బాధపడుచుండ నేనుతిని సుఖముగా నుందునా? భర్త యుపవాసము చేసిన భార్య యుపవాసముచేయవలయును. భర్త భుజించిన భార్యభుజింపవలయు. ఇదియే యుత్తమస్త్రీ ధర్మము. కావున నేనిది భుజింపనొల్ల. ఇదికూడ నతిథికి సమర్పింపుఁడు" అనిపలుకుటయు సక్తుప్రస్థుఁడామెపతిభక్తికి సంతసించి యామె వంతుపిండిగూడ గొనిపోయి భుజింపుమని యతిథికి సమర్పించెను. అతిథి దానింగూడ నాలుగుముద్దలుచేసి మ్రింగెను. అప్పటికి వాని యాఁకలి తీరలేదు. అతని యవస్థచూచి సక్తుప్రస్థుఁడు కటకటా! యీబ్రాహ్మణునియాఁకలి యింకను దీరలేదే. యేమిచేయుదు? నీతఁడెట్లు తృప్తుఁడగు నని విచారించుచుండఁ గుమారుఁడు . తండ్రి యభిమతం బెఱిఁగి యాతనితో నిట్లనియె. "తండ్రీ! యీయతిథి క్షుధానలంబు చల్లారలేదు. పేరాఁకలితో నింటికి వచ్చిన యతిథికి నర్ధాన్నము బెట్టిపంపుట ధర్మముకాదు. కావున నావంతుపిండి వీనికిచ్చి సంతుష్టినిం జేయుము. "అనిపలుకుఁ గొడుకుంజూచి తండ్రి కటకటంబడి

అయ్యో! కొడుకా నీవు బాలుఁడవు. రెండుమూఁడునాళ్ళనుండి యన్నములేక మాడిపోవుచుంటివి. కడుకష్టములమీఁద లభించినయాహారము తినవలదని యన్యునకెట్లు బెట్టుదు నని జాలిపడుచుండఁ దనయుండు తండ్రి నుద్దేశించి యిట్లనియె. "నాయనా! అతిథిపూజకంటెఁ బరమ ధర్మములేదు. వయస్సుచేతను దపముచేతను మిక్కిలి కృశించిన వాఁడవు నీవే. నోటిముందఁటియన్న మతిథుల కిచ్చునప్పుడు పడుచువాఁడను నేనియ్యలేకుందునా? కావున నామనవి విని నావంతుపిండిగూడ నతిథి కిమ్ము" అనవుడు సంతసించి బ్రాహ్మణుఁ డట్లుచేసె. అతిథి దానినిఁ గూడ భుజించి యప్పటికిని నిశ్శేషముగా నాఁకలి తీరనియట్లుండె. సక్తుప్రస్థుఁ డాతనివైఖరిచూచి మరల విషాదము నొందుచుండఁ గోడలు మామకడకుఁబోయి తనవంతు మానెడుపిండిగూడ నతిథి కర్పింప వలెనని ప్రార్థించెను. మొదటబ్రాహ్మణుఁ డాపని కిష్టపడక "అమ్మా నీవు చిన్నబిడ్డవు. అన్నవస్త్రములు కలిగి సుఖపడ మాయింటికి వచ్చితివి. ఆఁకలిచేత బాధపడుచు నీవు లేవలేక మాటలాడలేక యున్న దానవు. అట్టియవస్థలోనున్న నిన్ను భుజింపవలదని చెప్పి నీయాహార మితరులకెట్లు పెట్టింపఁగల"నని పలికెను. అనవుడు మామమాటలకుఁ గోడలిట్లనియె. "మహాత్మా! మహనీయులయినమీరును, మాయత్తగారును, నాపాలిటిపరమదైవమైననాభర్తయుఁ దమకడుపులు గట్టిపెట్టుకొని యెంతో స్వార్థత్యాగముచేసి యతిథిపూజలు సేయుచుండ నేను నాప్రాణమురక్షించుకొందునా? ఉన్నప్పుడు నలుగురము తిందము. లేనప్పుడు కడుపులో కాళ్ళుపెట్టుకొని నలుగురము పడుకొందము. ఆఁకలిగొన్న యతిథిని విడిచిపెట్టి కుడుచుట జంతువులధర్మము గాని మనుష్యులధర్మముగాదు. కావున నిది తప్పక వానికొసంగుఁడు" అనవుడు మామ కోడలి మాటకు సంతసించి యామెవంతు పిండికూడ నతిథికిచ్చెను.

కోడలివంతుపిండిఁగూడ భుజించి యాయతిథి సంతుష్టిఁ జెంది గబ్బుమని దేహనిచి ముఖమున సంతోష మచ్చుపడఁగ నక్తుపరిస్థునిఁ జూచి యిట్లు ప్రశంసించెను. "ఓబ్రాహ్మణుఁడా ! నే నెవరో యెఱుగుదువా? నేనుయమధర్మరాజును.నీనిష్ఠయెట్టిదో,నీశీలమెట్టిదోపరీక్షింపవలయునని వచ్చిన వాఁడను. నీగుణసంపత్తికి మెచ్చితిని. భక్తి, వినయము, శ్రద్ధ, శాంతము, కరుణ నీయందే సుస్థిరత్వము నొందెను. అతిథులకు నభ్యాగతులకు నీవు చేసినచందంబున నుపచారము మఱెవ్వరు చేయఁజాలరు. నీవేగాదు. నీభార్యయు నీయట్టిదే. సకలధర్మంబులు నేర్చి పురుషుఁడు పుణ్యశీలుఁడు కావచ్చును. కాని స్త్రీయు నట్టిదే యగుట మిక్కిలి ప్రశంసనీయము. దంపతులెట్టివారో కుమారు లట్టివారగుట యఱుదు. అతిథులయెడ జనకునికంటె నెక్కువ వినయము నెక్కువదయ గలకుమారునిఁ జూచి నీ వెక్కువగర్వపడవచ్చును. నీకొమారుఁడు మిక్కిలి యోగ్యుఁడు. తండ్రిగుణములు యీతనియందుఁ బ్రవేశించినవి. కొడుకునకుం దగినకోడలు లభించుట కూడ మీపూర్వపుణ్యము. గయ్యాళిగాక కలహప్రియగాక స్వార్థపరురాలుగాక పతివ్రతయై కరుణాసమేతయై వివేకియైనకోడలు భూలోకమందలి కోడండ్రకు మార్గప్రదర్శకురాలై యుండుఁగాక ! నీయిల్లాలు నీకొడుకు నీవలెనే ధర్మమనుష్ఠించుట గొప్పకాదు. పెఱచోటఁబుట్టి పెఱచోటఁ బెరిగి చెట్టఁ బట్టినపురుషునితో సుఖ మనుభవింపఁదలఁచి వచ్చినకోడలు ధర్మానుష్ఠానతత్పరయై మామగారిని మగనిని మెప్పింపఁ దలఁచుట గొప్పయాశ్చర్యము. నీకుటుంబమువంటి కుటుంబము నే నెందుఁజూడలేదు. అంద ఱొక్కధర్మపథమున నడచువారుండుటయఱిది. నీదానంబు నీస్వార్థత్యాగముఁ జూచి దేవతలు మహాశ్చర్యరసమున మునిఁగి బహువిధముల నిన్ను మెచ్చుచున్నారు."

అని యతిథివేషము దాల్చిన ధర్ముఁడు వానిం బ్రశంస చేయు చుండ నంతలో దేవేంద్రుఁడు పుష్పవర్షము గురిపించెను. ఆకాశముమీఁద దేవదుందుభులు మ్రోగెను. "నిన్నును నీ కుటుంబమును జూచుటకు సప్త మహర్షులమనస్సులు కుతూహల పడుచున్నవి. కావున కొడుకుఁగోడలుఁభార్య వెంట రా నీవు స్వర్గమునకు రమ్ము! స్వర్గము నీవంటివాని నిమిత్త మేర్పడినదే. ఈ విధముగా నీవతిథిపూజ చేసినందుకు నీకు రెండు వరము లిచ్చెద. సమస్త ప్రజల నడుగుటఁ జేయునదియు, సకల నీచకర్మములకు నొడఁబడఁ జేయునదియు సమస్తపాపములఁ జేయించునదియు నైనయాఁకలి నీకు గలుగదు. ఆఁకలియే కాదు దప్పికయుఁగూడఁ గలుగదు. నీవంటి మహనీయుఁ డూర్ధ్వలోకములకు వచ్చుచున్నాఁడని విని బ్రహ్మ నీ నిమిత్త మొకవిమాన మంపును. ఆవిమానమెక్కి నీవు బ్రహ్మలోకమున కరిగి పరమేష్ఠిని సందర్శించి ధన్యుఁడవుకమ్ము! భూదానములు గోదానములు హిరణ్యదానములు తపంబులు యజ్ఞములు మొదలగునవి నిజముగా నాఁకలి గొన్నవారికి వేళ మెఱిఁగి యన్నదానము సేయుట వంటివికావు. కష్టపడి సంపాదించినపదార్థము కొంచెముగానో గొప్పగానో పాత్రమెఱిఁగి కాల మెఱిఁగి యతిథులకు నభ్యాగతులకు సమర్పణము సేయుట పరమధర్మములలోనెల్ల పరమధర్మము." అని పలికి ధర్ముఁడు తన నిజరూపముఁ జూపెను. అంతలో బ్రహ్మదేవుఁడు పంపిన సువర్ణవిమానము గగనవీథిం గనఁబడెను. అంతట సక్తుప్రస్థుఁడు భార్యయుఁ గొడుకును గోడలు ధర్మునకు నమస్కరించిరి. అతఁడంతటనిట్లనియె—"నీవు సకుటుంబముగా బ్రహ్మవిమాన మెక్కి యీక్షణమె పొమ్ము. బ్రహ్మర్షులు దేవతలు నిన్నుఁజూడ నెంతో కుతూహలపడుచున్నారు." అనవుడు సక్తుప్రస్థుఁడు ధర్ముఁడుచెప్పినట్లు విమాన మెక్కిపోయెను.

అని ముంగి సక్తుప్రస్థుని వృత్తాంతమంతయు సభవారికిఁజెప్పి వెండియు నిట్లనియె. "అయ్యా! నేను ముంగినైనను మహానుభావుఁడైనసక్తుప్రస్థుఁడు బంగారువిమానమెక్కి బ్రహ్మలోకమునకుఁ బోవుట నాబిలములోనుండి యెంతయు సంతోషముతోఁ జూచి యానందము పట్టఁజాలక కలుగులోనుండి యావలకుఁబోయి యతిథి కాళ్ళు కడుగుకొనినచోట సంచరించితిని. ఆబురద నామేన నంటుకొనియె. అంతట నాతలయు శరీరమందుసగముభాగము సువర్ణమయమయ్యెను ఇది సక్తుప్రస్థుని మహిమచేత నయ్యెనుగాని, యాబురదవల్లగాదు వట్టిబురదలో నెంతదొర్లిన నిట్లగునా? నాఁడుమొదలుకొని నాశరీరముయొక్క రెండవభాగముకూడ సువర్ణమయము చేసికోవలెనని మహనీయులైన తపోధనుల యాశ్రమముల కరిగితిని. ఎన్నో యజ్ఞవాటికలకుఁ బోయితిని. అన్నదానము జరుగు దేశము లెన్నో చేరి చూచితిని. సిద్ధవనములెన్నో ప్రవేశించితిని. నాకోరిక యెక్కడను నెఱవేరలేదు. పాండురాజకుమారుఁడైన యుధిష్ఠిరునిపేరు జగత్ప్రసిద్ధమైయున్నది. ధర్మరాజను నామధేయ మితనియందు సార్థకమయినది. కురువంశ మితనివల్ల పావనమైనది. అందుచేత నితఁడు సేయు యశ్వమేధము లోకోత్తరమైనదిగా నుండునని తలంచి నాశరీరముయొక్క రెండవభాగ మిక్కడ తప్పక సువర్ణమయ మగునని నిశ్చయించుకొని ఈజన్నమునకు వచ్చితిని. బ్రాహ్మణులు భోజనము చేసినచోట్ల చేతులు కడుగుకొన్నచోట్ల పాదప్రక్షాళనము చేసినచోట్ల సంధ్యలు వార్చినచోట్ల స్నానములు చేసినచోట్ల నెంతోసేపు దొర్లి దొర్లి విసిగితిని. మేను బాడియగుటయే కాని, బంగారము కాలేదు. అందుచేత సక్తుప్రస్థుని దానముకంటె ధర్మరాజుగారి యశ్వమేధము తక్కువదని పలుకుటకు నేనుసాహసించితిని. మాయమర్మము లెఱుఁగని జంతువను గనుక మనసునందుఁ దోఁచిన యభిప్రాయము సభా

మధ్యమున నిర్భయముగా వెల్లడిపుచ్చితి. నావల్ల నేరమున్న క్షమింపుఁడు. ఇట్లు వెల్లడింపవలసిన యవసర మేమని మీరందు రేమో వినుండు. అశ్వమేధము చేసినందుకు ధర్మరాజును మీరు వేయివిధములఁ బొగడుచున్నారు. అతఁడు పొగడ్తకు దగినవాఁడె కాని మీరు చేసినంత పొగడ్తకుం దగఁడు. గుణమున్నంతవరకే పొగడవలయును కాని లేనిగుణము లారోపించి పొగడరాదు. అట్లు పొగడుటవలన మనుష్యులు తమంతవారు లేరని గర్వింతురు. గర్వము మనుష్యునికి నాశనము తెచ్చును. తగనిపొగడ్త యెంతవానికైన ననర్థదాయకము. పొగడ్త చేసినవారు చేయించుకొన్నవారు కూడ నల్పులగుదురు. అందుచేత ధర్మరాజు గర్వోన్మత్తుఁడు గాకుండుటకును మీ రికమీఁద యథార్థమునే జెప్పి పొగడుటకును నేనిట్లు సక్తుప్రస్థుని చరిత్రము చెప్పవలసె. కాకున్న నా కేమిపని? మీరు వేదవేదాంగవేత్తలు. సకలజన్మ పరిజ్ఞాతలు. కావున నిఁకమీఁద మీ రెన్నఁడు వట్టి పొగడ్తలు పొగడవలదు." అని పలికి యాముంగి యెవ్వరికిం గనఁబడకుండ నేదో కలుగులో దూరిపోయెను. ధర్మరాజు విస్మితుఁడయ్యెను సభాసదు లచ్చెరువడిరి. తగని పొగడ్త సర్వానర్థములు దెచ్చుననియు, సక్తుప్రస్థునివంటి లోకోత్తరచరిత్రుఁడు భూమి కలంకారమనియు నెల్లవార లభిప్రాయపడిరి.

---

## కౌశికుఁడు.

---

కౌశికుఁడను బ్రాహ్మణుఁడు వేదాధ్యయనము చేసికొనుచు నొక గ్రామసమీపమున నొకచెట్టుక్రింద వసియించుచుండెను. ఆతని యొద్ద దుర్గుణము లేమియు లేవుగాని యతని స్వభావము కొంచెము కోపస్వభావము. ఒకనాఁడతఁడు వేదములు గుణించుకొనుచుండఁగా

వృక్షశాఖమీఁదఁ గూర్చుండిన యొకకొంగ వానిపై రెట్టవైచెను. అందుకు మిక్కిలి కోపించి కౌశికుఁడు కన్ను లెఱ్ఱజేసి కొక్కెరవంక జూచెను. తక్షణమే యది నేలఁబడి చచ్చెను. కౌశికుఁడు దానిఁ జూచి మిక్కిలి జాలినొంది "అయ్యో! నాతపమేల కాల్పనా? తగినంత కారణములేక యీపిట్టఁజంపితి. ఈపాపము నాకెత్తెఱంగునఁబోవు"నని పలుతెఱంగుల విచారింపఁ దొడఁగెను. అంతలో మిట్టమధ్యాహ్నమయ్యెను. బ్రాహ్మణున కాఁకలి విశేషముగా నయ్యెను. అతఁడు మొదటినుండియు మాధుకరవృత్తిచేత జీవించుచుండినవాఁడగుటచేత భిక్షాన్నము దెచ్చికొనుటకై గ్రామమున కరిగి యందొక్క గృహంబునకుంజని "భిక్షాందేహి"యని యడిగెను. ఆయిల్లాలు బ్రాహ్మణునకు భిక్షముపెట్టుటకై పాత్రనిఁబుత్తము వెదకుచుండ నంతలో నామెభర్త యెండఁబడివచ్చెను. అతని కాఁకలిబాధ మెండుగా నుండెను. శరీరమంతట చమట గారుచుండెను. మహాపతివ్రతయైన యాయిల్లాలు వెంటనే పీఠమువేసి భర్తను గూర్చుండఁబెట్టి చమట బోవునట్లు విసరి చన్నీట స్నానము చేయించి మేను దుడిచి పరిశుద్ధ వస్త్రములు కట్టనిచ్చి వంటశాలకుఁ గొనిపోయి సుఖాసీనుఁజేసిచక్కగా నతనికి భోజనముపెట్టెను. భుజించిన తరువాతఁ దాంబూలమిచ్చి పాన్పుమీఁదఁ బండుకొనఁబెట్టి నిద్రపట్టువరకు విసరి బైటకువచ్చెను. కౌశికుఁ డంతవరకు గుమ్మముముందరనే నిలిచియుండెను. మగఁడాఁకలిచే బడలివచ్చినందున నతనిం జూడఁగనే యాపడఁతి కౌశికునిమాట మఱచి మనస్సంతయు పెనిమిటిమీఁదనే నిలిపి యతని కుపచారములు సేయుటలోనే కాలమంతయుఁ గడపెను. మగఁడునిద్రించినవెనుక నామెకు బ్రాహ్మణునిమాట జ్ఞప్తికివచ్చెను. వచ్చినతోడనే యొకపాత్రమునం దన్నము కూరలు బెట్టుకొని యామె కౌశికునకుఁ బెట్టవచ్చెను. వాఁకిలిముందర తన్నంతసేపు నిలువంబెట్టినందుకు బ్రాహ్మ

ణుఁడాయిల్లాలిపై మిక్కిలి కోపించి యిట్లనియె. "అమ్మా! నేను వచ్చినతోడనే నన్ను బొమ్మన్నచో మఱియొకయింటికిఁ బోయి యుందును. నీగుమ్మముముందర నన్ను జాము సేపు నిలువవేసితివి. ఇంత నిర్లక్ష్యమా? యాచకులము కాఁగానే నీకులోకువైతిమికాఁబోలు! నీయిల్లు కాకపోయిన మఱియొకయిల్లాయె. పట్టెడన్నము పెట్టుదువో లేదో యొకపూట నిలువఁబెట్టితివి. నీవెంత, నీయన్నమెంత" యను చుండ నాయిల్లాలు వినయమున "బ్రాహ్మణుఁడా! నీయెడ నాకునిర్ల క్ష్యములేదు. నీకుభిక్షపెట్టుటకు నేను ప్రయత్నించుచుండ నంతలో నాభర్త-కడుడస్సివచ్చె. అతని నేదదేర్చి యన్నమిడి వచ్చునంతలో నింత యాలస్యమయ్యెఁ గావున క్షమియింపవలయు" నని చెప్పెను. అదివిని బ్రాహ్మణుఁడు మఱింత మండిపడి "నీమగఁ డంతయెక్కువ. వేదాధ్యయనసంపన్నులమైన మేమింతతక్కువా? భర్త కుపచారమని పేరుపెట్టి యింటికివచ్చిన బ్రాహ్మణులనవమానింపఁ దలంచుచున్నావు కాఁబోలు? బ్రాహ్మణుల మహత్వమెఱుగవా? బ్రాహ్మణుఁడలిగెనా పర్వతములు భస్మపటలంబు లగును. పట్టణంబులు మహారణ్యంబు లగును. మహాసముద్రములు నామావశిష్టములగును. బ్రహ్మాండము లుఱ్ఱుతలూగును అట్టిబ్రాహ్మణులబుద్ధిపూర్వకముగానవమానించిన వారిగతి యేమగునో తెలిసికొనుము బ్రాహ్మణుల కోపమును నీమగనిని పుట్టించిన జేజేలుగాని నివారింపజాలరు. పతివ్రతవైనందుకు నీవు బ్రా హ్మణపరాభవమా చేయుచున్నావు?" అని కఠినముగాఁ బలికెను. అన వుడు నాపరమసాధ్వి యిట్లనియె "అయ్యా! బ్రాహ్మణుల మహిమ నేనెఱుఁగక పోదునా? అంతమూర్ఖురాలనుగాను. ఒకబ్రాహ్మణుఁడు సముద్రమాపోశనముగఁబట్టి జలమంతయు నాపోశనముగఁ ద్రాగెను. ఒకఁడిందద్యుమ్నమహారాజు నూసరవెల్లిఁ గమ్మని శపించె. ఒక మహాముని త్రిశంకుని స్వర్గభ్రష్టునిఁజేసె. ఇంతమాత్ర మెఱుఁగక

పోలేదు. నా తెలుఁగు జెప్పెదవినుము. పతియే నాకుదైవము. పతియే నాకుబంధువు. పతియే నాకుప్రాణము. పతియే నాకుధనము. పతియే నాకుసర్వము. అట్టిపతి కుపచారము సేయుటకంటె నాకుముఖ్యకర్తవ్యము లేదు. ఆతనికి తనువాతనే బ్రాహ్మణులు. ఆతనికి తర్వాతనే తలిదండ్రులు. ఆతని పూజ చేసినతర్వాతనే దేవతాపూజ. కావున నేను భర్తకుపచారము సేయుచు నీమాట మఱచియుంటిని. అయినను నేను విద్యాగంధములేని యాఁడుదానను గదా! ప్రపంచజ్ఞానము లేని దానను గదా! మీరు మగవారు. చదువుకొన్నవారు. అనుభవజ్ఞానసిద్ధులు. మీరు మావంటి యబలలుచేసిన తెలివిమాలిన పనులను సహించి మమ్మనుగ్రహింప వలయును. నాపై నలుగకయుందువేని నీకుహితోపదేశము చేసెద. నీవు కోపస్వభావము గలవాఁడవు. శాంతమే బ్రాహ్మణుని సొమ్ముగా నుండవలయు. కోపముగలవాఁడు నశించును. కోపము విషముకంటె నగ్నికంటె దారుణమైనది. బ్రాహ్మణున కెంతమాత్రము కోపముండఁగూడదు. కోపమును బరమశత్రువుగ నెంచి దానిం దూరముగఁ దోలవలయు. అట్లుపారదోలకపోవుట చేతనే నీవు నేటియుదయమున నీపై రెట్టవైచిన దనుకారణమున నొకకొక్కెరను జంపితివి. ఇది నేఁజూడక పోయినను నాపతివ్రతామాహాత్మ్యమువలనఁ దెలిసికొంటి. కోపస్వభావముగల వానికి భూతదయకూడ నుండదనుమాట కీచరిత్రమే యుదాహరణము. ఈకోపమును నీవు పరిత్యజింపవలయును. ఇట్టినీతులు సెప్పుటకు నేనెవ్వర్తను? నేనువిద్యయెఱుంగని యాఁడుదాన నని యిదివఱకే మనవిచేసి యుంటిని. నీ కోపము పోవునట్లు, నీకు సకలసద్గుణము లలవడునట్లు ధర్మోపదేశము చేయఁగల మహానుభావుఁ డొకఁడుగలఁడు. అతఁడు మిథిలానగరములో నున్నాఁడు. కులమున నతఁడు కటికవాఁడు. అతనిపేరు ధర్మవ్యాధుఁడు. అతనికడకు నీవు పొమ్ము. సకల ధర్మాధర్మములు నీవత

నియొద్ద నెఱుఁగుదువు. ఆమాటలు విని కౌశికుఁడు మిక్కలి యక్క జపడి చేతులు జోడించి నమస్కరించి యిట్లనియె. "అమ్మా! నీవుమహాపతివ్రతవు, నేను పరమమూర్ఖుఁడనై నీమహత్వ మెఱుఁగక నిన్ను నిందించితిని. నాదుండగము నీవుసైరింపవలయు. నీవన్నట్టు నిజముగా నేనుకోపస్వభావుఁడనె. నానిమిత్తమున నొక్కకొక్కెర చచ్చిన మాట నిజము. కానికిరాతుఁడు నాకుపదేశము చేయునంటివి; బ్రాహ్మణుఁడను. శ్రోత్రియుఁడను, కులీనుఁడను, వేదాధ్యయన సంపన్నుఁడను. పరమ నైష్ఠికుఁడను. మాంసవిక్రియముచేత జీవించు కిరాతుని కడకుఁబోయి నేనుధర్మములు నేర్చుకొనవలసినదా? ఇది నాకు మిక్కలికష్టముగా నున్నది. కాదు కూడదు నీవు నెళ్ళుమందువా తప్పక వెళ్ళెదను. ఉపదేశము నిమిత్తము మఱియొకని కడకుఁ బంపుదువా మిక్కలి సంతోషింతును." అనవుడు బ్రాహ్మణునియిల్లాలు కౌశికునితో నిట్లనియె.అయ్యా! నీవు బ్రాహ్మణుఁడవనియు, శ్రోత్రియుఁడవనియు నే నెఱుఁగుదును. ధర్మవ్యాధుఁడు కులముచేతఁ గిరాతుఁడైనను, విద్యావినయసంపత్తిచేత బ్రాహ్మణుఁడే. అతఁ డనేక వేదవేత్తల కుపదేశము చేయ సమర్థుఁడు. అతనియొద్ద కే శీఘ్రముగఁబొమ్ము. సందేహింపకుము. గుణముప్రధానముగాని కులముప్రధానముకాదు" ఆమాటలు విని కౌశికుఁడు పరమానందభరితుఁడై సందేహము విడిచి తత్క్షణమే బయలుదేరి యడవులు గడచి నదు లుత్తరించి, పట్టణంబులు పల్లియలు దాటి విదేహదేశమున కరిగి దానికి రాజధానియైన మిథిలానగరముంజొచ్చెను.

అట్లు మిథిలఁజేరి ధర్మవ్యాధుని యిల్లెక్కడ నని విచారించి యాబ్రాహ్మణుఁడు పౌరులవలన వానియున్నచో టెఱిఁగి యాతావునకుఁ జని చూచునప్పటికి ధర్మవ్యాధుఁడు మాంస మమ్ముచుండెను. ఆతని ముందట నల్పమృగముల మాంసముండెను. మాంసము

కొనుటకై వచ్చువారు, వచ్చి బేరమాడువారు, బేరంబు దొరకక వెళ్ళిపోవువారు, బేరము కుదుర్చుకొనికొనువారు, విశేషముగ నుండిరి. మాంసప్రియులు చూడఁగానే బ్రాహ్మణుఁ డేవగించుకొని ధర్మ వ్యాధునికడకుఁ బోఁజాలక దూరముగ నొకచెట్టుక్రింద నిలువంబడి చూచుచుండెను. బుద్ధిమంతుఁడైన ధర్మవ్యాధుఁ డతనివృత్తాంతము నెఱింగి యంగడి విడచి యతనికడకుఁబోయి "బ్రాహ్మణుఁడా! కుశలమా నీకు? ప్రయాణము సుఖముగాఁ జేసితివా? ధర్మంబులు నేర్చుకొనునాసక్తి నీకు మెండుగఁ గలదు. పతివ్రతాతిలకమైన యాబ్రాహ్మణస్త్రీ నాకడకు నిన్నుంబంపఁ బరమభక్తుఁడవై నీవును వచ్చితివి. ఇంకనాలస్యమేల? మాయింటికిఁ బోదమురమ్ము." అనిపలికి వానిని దనగృహంబునకుం దోడ్కొనిపోయెను. కౌశికుఁడు వాని విజ్ఞానమున కచ్చెరువడి తనలో నిట్లు తలంచెను. "నే నక్కజముమీఁద నక్కజము కనుఁగొనుచున్నాఁడను. నేను కొక్కెరం జంపినట్లు తనంతటఁ దానే యాబ్రాహ్మణస్త్రీ తెలిసికొనియె. ఇదిమొదటి యక్కజము. ఆమె నన్నిక్కడికిఁబంపె నని యీకిరాతుఁడు దనంతట తానే దెలిసికొనియె. ఇదిరెండవయక్కజము. పరమపతివ్రత యగుటచే నామెకు శక్తి గలిగియుండ వచ్చును. విజ్ఞానవంతుఁ డగుటచే నితని కిట్టిశక్తి గలిగియుండవచ్చును. ఈతఁడు పూజనీయుఁడు. ఈతనివలన ధర్మరహస్యంబు లెఱిఁగి కృతార్థుఁడనయ్యెద" నని నిశ్చయించి యాతనిగృహంబునకుం జని యతనిచేఁ బూజితుండై యిట్లనియె. "అయ్యా! నీవు సకలధర్మంబుల నెఱుఁగుదువు. జంతువులను జంపి మాంసమమ్మట నీకు ధర్మమే? అహింస పరమధర్మం బని యార్యులు చెప్ప వినియుంటి. ఇంతటి జ్ఞానసంపన్నుఁడవు నీవిట్టి దుష్కర్మమునందుఁ దగులొని యుంటఁజూచి నామనంబు మిక్కిలి చింతనొందుచున్నది. ఇంతనీచవృత్తి నీవేల చేయవలయు?" అనవుడు ధర్మవ్యాధుఁ డతని

కిట్లనియె. "బ్రాహ్మణుఁడా! విప్రులకు వేదాధ్యయన మెట్టిదో, రాజులకు దండనీతి యెట్టిదో, వైశ్యులకుఁ గృషి, వాణిజ్య, గోరక్షణంబు లెట్టివో, శూద్రులకు బ్రాహ్మణశుశ్రూష లెట్టివో, కిరాతులమైన మాకు వేఁటయు, జంతుహింసయు నట్టిపరమధర్మంబులు. అదియునుఁగాక యిదినాకు వంశక్రమాగతమైనవృత్తి. నాతండ్రితాతలు వారిపూర్వులుఁగూడ నిట్టివృత్తియందే జీవయాత్రఁ జేసిరి. ఈదేశమునకు జనకుఁడు రాజు. అతఁడువర్ణాశ్రమ,ధర్మముల మిగులజాగరూకతతోఁబరిపాలించుచుండును. కులవృత్తి నతిక్రమించినవాఁడు తనపుత్రుఁడైనను వానిని నిష్కరుణముగాఁ బట్టి దండించును. అందుచేత విదేహదేశంబున జన్మించినవా రందఱును దమ కుచితములయిన వృత్తులయందే ప్రవేశింతురు. కావున నేను బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడనయ్యు నా పితృ పితామహులు చేసిన కులవృత్తియందే జీవితకాలముగడుపు చుంటిని. ఈ వృత్తియందున్నప్పటికి నాచేతితో నేనొక్కజంతువునైనఁ జంపియెఱుఁగ. చంపుచుండఁగా నేనుచూడ లేదు. ఇతరులు దూరమునఁ జంపి తెచ్చినజంతువుల మాంసములు వారలదగ్గఱ వెలకుఁగొని తిరిగి వానిని విక్రయించి పొట్టపోసికొనుచుంటిని. దురాశచేత వస్తువులను ప్రియముగా విక్రయింపను. అబద్ధమాడను. పని కిమాలినసరుకుల నంటగట్టను. కుళ్ళిపోయినమాంస మెవ్వరికియ్యను. న్యాయముగా వచ్చిన ధనమునే యనుభవింతును. అతిథుల భుజింపఁ జేతును. అభ్యాగతుల నాదరింతును. శిష్టబ్రాహ్మణుల సేవింతును. పండితుల బహూకరింతును సజ్జనులసన్మానింతును. పెద్దలగౌరవింతును, దేవతల నర్చింతును. సత్యశౌచములను విడువను. పరదూషణ నేను చేయను. ఒరులు చేయుచుండఁగా నేను విసను. నన్ను స్తుతించినవారియందు నిందించినవారియందు సమానభావము వహింతును. ఏకపత్నీవ్రతుఁడను. ఇట్లుచేయుటంజేసి హీన

కులంబున జన్మించినవాఁడనయ్యు బ్రహ్మజ్ఞాన సంపన్నుఁడనై గౌర వాస్పదుఁడనై యుంటి. నీవునాకడకు ధర్మంబులు నేర్చుకొనుటకై వచ్చితివి గావున నాకుదోఁచిన ధర్మంబులఁ గొన్నిటి నెఱింగించెద. సావధానుఁడవై వినుము. తనకులధర్మమందుఁ బ్రవర్తిల్లుటయుత్త మోత్తమము. శాంతమన్నిటియందుఁ బ్రధానము. ఓరిమివంటి నెమ్మది యొకటి లేదు. విషయములయందువాంఛ విడువవలయును. వాంఛా పరిత్యాగమువంటి ధర్మము మఱియొకటి లేదని మహర్షులు పలుకు దురు. స్వార్థత్యాగుల కసాధ్యమైనదిలేదు. క్రోధలోభములు ముఖ్య ముగా విడువవలయును ఏకారణంబుననైన నేరిమీఁదనైనఁ గ్రో ధంబు గలిగినయెడల దాని నన్ని విషయములందుఁ బ్రసరింపఁజేయు ట న్యాయముగాదు. క్రోధము మనంబునం బెట్టుకొని ధర్మము తప్ప గూడదు. అపకారము చేసినవారి కుపకారముసేయుట లెస్స. ఇతరుల కపకారముజేయువాఁడు తనదోషంబునఁ దానె నశించిపోవును. వానికి వేఱు కీడు జేయనక్కరలేదు. ధర్మాత్ములు చేయుసత్కార్యముల యందసూయగలిగి కొందఱు దురాత్ములు వానిం జెఱుప గోరుదురు అట్టిదురాత్ములకు జడిసి యాధర్మంబులపైఁ బ్రీతి విడువరాదు. ధర్మమె జయమునొందును. అధర్మముజయించునట్లు కొంతకాలముపై కగపడినను దుట్టతుద కది జయింపలేదు. మనుష్యులు పాపముచేయక మానరు. చేసినపాపములకుఁ దగిన ప్రాయశ్చిత్తము జేసికొనవలయు ను. అట్టి యుత్తమ ప్రాయశ్చిత్తమునకు విధానమిది. అయ్యో! యీపాపమేల చేసితినని వగచినందున సగముపాపము పోవును. ఇఁక ముందెన్నఁడు నిట్టిపాపము చేయనని ప్రతినచేయుటచేతఁ దక్కిన పాపమునశించును. ఈప్రాయశ్చిత్తముపేరు పశ్చాత్తాపము. పశ్చాత్తా పమునకు మించిన ప్రాయశ్చిత్తము లేదు. పాపములన్నిటిలోఁ గ్రోధ లోభములధికములు. వాని జయించినవాఁడె ధర్మశీలుండనం బరగు.

నేను జేయునది హింస యని నీవు మొట్టమొదటఁ బల్కితివి. హింస తెఱఁగు గొంత జెప్పెదవినుము. హింసచేయక మనుష్యుఁడు జీవింప లేఁడు. మనుష్యుఁడే యన నేల ? హింస జేయక యే జంతువులును బ్రదుక లేవు. కొన్నిటికిఁ జెట్లు మొక్కలా హారమై యున్నవి. కొన్ని జంతువులకు జంతువు లాహారమైయున్నవి మఱికొన్ని జంతువుల కాకులలము లాహారములై యున్నవి. పులియు సింగము మాంసమే గాని భక్షింపవు. ఏనుఁగులు మేఁకలు శాకములే గాని యారగింపవు. మనుష్యుఁడు మాంసముల శాకములఁ గూడ నారగించును. ఆహారనిమిత్త ముద్భిజ్జములను జంతువులను హింసింపక వలనుపడదు. హింస చేయక పోయినపక్షమున క్షణమాత్రమైన జీవింపలేఁడు. అందుచేత హింస యావశ్యకము. హింస లేకపోయిన పక్షమున పులి యెట్లు జీవించును? మనుష్యుఁడు మాంసము వర్జించినను శాకములనిమిత్తమై వృక్షంబుల హింసింపవలయు. ఒక్కభోజన మునిమిత్తమే గాక తెలిసియుం దెలియక మనుష్యుఁడు సదా హింస చేయుచుండు. మనము నడచునప్పుడు కాలిక్రిందఁబడి దున్నునప్పుడు నాగలిక్రిందబడి యనేకజంతువులు చచ్చుచున్నవి. నీటిలో జంతువులున్నవి. వాయువులో జంతువు లున్నవి. నీరుద్రాగునప్పుడు గాలి పీల్చునప్పుడు మన యిచ్ఛలేకయే యనేక జంతువులు నశించును. అది నివారింతుమన్నను మనవశముకాదు. ఇది ప్రపంచప్రకృతి. ఐనను మాంసము మొదలగునవి వర్జించుట పరమధర్మము. శాకముల హింసించుట తప్పకపోయినను జంతుహింస లేకపోవుటవలన గొంత మేలు. ఇట్టిధర్మంబు లనేకములుగలవు. ధర్మసూక్ష్మంబు దెలిసికొనుట మహర్షులకైనఁ దరముగాదు. ముఖ్యముగాఁ గామక్రోధలోభముల వర్జించి ప్రతిదినము దేవతాప్రార్థన చేసికొనుచు సజ్జనులతోడ మైత్రి నెరపి యాపత్కాలంబున సైతము ధర్మమార్గము దప్పక జీవించు

చుండుము. అందువలన నీకు నిహపరంబులు గలుగు" నని చెప్పిన విని కౌశికుండు మిక్కిలి సంతసించి యాతనికి నమస్కరించి తన గృహంబునకుం జనియెను.

---

## హంస—కాకి.

ఒకపట్టణమున ధనవంతుఁడగు వైశ్యుఁడొకఁడుండెను. అతని బిడ్డలొక్కచోఁజేరి యాడుకొనుచుండఁగా నొక కాకిపిల్ల వారిసమీపమున బడెను. దానిని సంతోషమునఁ దీసికొని యాబిడ్డలు దినదినము తమయెంగిళ్ళుపెట్టి దానిం బెంచిరి. అదియు మిక్కిలి క్రొవ్వి గర్వించి ప్రపంచమునఁ దనసాటిపక్షులు లేవనియు, బ్రహ్మదేవుఁడు సృష్టించిన సమస్తపక్షిజాతములకుఁ దాను సార్వభౌముండననియు భావించి యెవ్వరిని సరకుసేయక యుండెను. అటులుండ నొకనాఁడు గరుత్మంతునకు సాటి యని చెప్పఁదగిన హంసలుకొన్ని సముద్రతీరమున వ్రాలియుండ వైశ్యపుత్రులు కాకికి హంసలంజూపి యిట్లనిరి. "ఓపక్షిరాజ! నీవు పక్షులకన్నిటికిఁ జక్రవర్తివి. నీవలె శ్రావ్యముగాఁ గూయఁ గలపక్షి లేదు; నీవంటి యందమైన పులుగు లేదు. నీలాగున నెగిరి పరువెత్తఁ గలవిహంగము లేదు. ఈహంసలం జూచుము లోకులు మూర్ఖులై హంసలే పక్షులలో శ్రేష్ఠములని భావించుచున్నారు. నీగుణములు జనులెఱుఁగ కిట్లు భావించుచున్నారు. ఇప్పుడీహంసలతోఁ బందెమువైచి పరుగున వానిం గెలిచి లోకమునకు నీయమేయసామర్థ్యముం దెలుపుము. పెంచి పెద్దదానిని జేసినందుకు మాకు గొప్పకీర్తిఁదెమ్ము" అనవుడు వాయసము నిజముగాఁ దాను పక్షులకెల్లఁ జక్రవర్తియని స్తోత్రముచేత నుబ్బిపోయి తనశక్తినెదుటి

వారిశ_క్తినరయఁజాలక యాహంసల సమీపమునకుఁ జని యందు బల మైనహంస నొకదానిఁ బిలిచి యిట్లనియె. "హంసలు గగనమార్గమున మిక్కిలి నేర్పుతోఁ బరువెత్తఁగలనని వినుచుందును. ఏదీ మీచమత్కార మొక్కసారి జూపుఁడు? నాతోఁబరువెత్తి నన్ను గెల్చినపక్షమున మీరట్టిపేరునకుఁ దగినవారు. లేనియెడ మీకాపేరుతగదు. మాకాకి జాతిని లోకు లధర్మపరులై నిందించుచున్నారు. ఆనింద నేఁడు బాపెద. ధైర్యమున్నపక్షమున నీవు నాతోఁ బరుగెత్తుము. నీవు జాలకపోయినపక్షమున మీలో బలమైనదానిని రానిమ్ము. ఎవరువచ్చిననుసరె? హంసలపేరు నేఁటితో సరి. మీజాతిలో నొకటి బ్రహ్మదేవునకు వాహన మైనదని మీరు గర్వోన్మత్తులై మిన్నుమన్ను గానకయున్నారు. ఆగర్వమంతయు నడగించెద. బలమున్నచో నాతోఁ బరుగెత్తుఁడు! లేదా నాకుఁ బ్రదక్షిణముజేసి నమస్కరించి లేచిపొండు!" అని పలుక దాని కోఁతలు విని హంసలు నవ్వి యిట్లనియె. "మేముమానససరస్సున నుందుము. బ్రహ్మదేవునకు మాజాతిలో నొకటివాహన మైనమాట నిజము. గరుత్మంతుని తరువాత జవసత్వంబులుగల పక్షులము మేమనుట నిజము. ఈమూఁడుకారణముల చేత గర్వించుటలేదు. ఐననునీతోఁబరువెత్తుటకుభయములేదు. మాలో మిక్కిలి బలహీనమైనదానితోఁగూడ నీవు బరుగెత్తఁ జాలవు. అట్లుండియు మిక్కిలి బలముగలదాననే యని యనుకొంటివి. ప్రపంచము పుట్టినదిమొదలు నేఁటివఱకు ననేకపక్షుల వృత్తాంతము మేము విని కనియుంటిమి కాని హంసలతోఁ బందెము వైచిన వాయసముల మే మెఱుఁగము. నీసాహసము మాకు మిక్కిలి యాశ్చర్యము గలిగించుచున్నది. రూపమునందా మసిబొగ్గువలె నుందువు. మేము శుభ్రమైన జంతువులము నీకంఠధ్వని కర్ణకఠోరము మాధ్వని శ్రావ్యము నీవు విశేషజవములేనిదానవు. మేము మహాజవసంపన్నులము ఇట్టిమా

తోడ నీవు పంతగించి పరుగెత్తఁదలఁచుట మహాశ్చర్యకరము" అని హంసలు పలుక నక్కాకి వాని కిట్లనియె. "హంసలారా! ఈలోకమున గొప్పతనము సాధారణముగాఁ బ్రజ్ఞనుబట్టి రాదు. పదుగురు జేరి యభిమానముచేత గోరంతలైన యొకని గుణంబులు కొండంతలు చేసి సమయమగునప్పుడు కానప్పుడు పొగడి వానిని గొప్పవానిం జేయుదురు. కొందఱు ప్రజ్ఞ లేకపోయినను నదృష్టవశమున గొప్పవారగుదురు. అదృష్టము లేనప్పుడు, ప్రజ్ఞాధురంధరులయ్యు గొప్పవారు కాఁజాలరు. హంసలు రూపముచేతను శబ్దమాధుర్యముచేతను, బలముచేతను, గొప్పవి కాకపోయినను, దేవతాపక్షపాతముచేత గొప్పతనము వహించినవి. ఆపక్షపాతము లేకపోవుటచే మేమధములమైతిమి. దానికేమి? అది యటుండనిండు! నేను నూఱువిధములుగాఁ బరుగెత్తగలను. అడ్డముగాను నిలువుగాను గుండ్రముగాను వంకరగాను మూలగాను పక్కగాను నధోముఖముగను నూర్ధ్వముఖముగను నే బరువెత్తినట్లు వేయేండ్లు మీరు తపస్సుచేసినను మీరు బరుగెత్తఁజాలరు. ఇంక నెన్నో చిత్రవిచిత్రగతులు నాకడగలవు. అవి చెప్పటకంటె చేసి చూపుట మంచిది కావున గమనకాలమున మీకవి జూపెద! నాపరుగు జూచి మీహంసములెల్ల మొదట భయంపడును. పిమ్మట సిగ్గు జెందును. కాకి కులము మహానందము నొందును" అనమున్న కాకియేరుకొన్న హంసము ముందుకువచ్చి "వాయసమా! ఇన్నిగతులతోఁ బనిలేదు. పక్షులన్నియు సామాన్యముగా నెగురునట్టి విధమున మన మెగురుదము రమ్ము!" అని పిలిచెను. అప్పుడు కాకి చుట్టములన్నియు దానిచుట్టునుం జేరి హంసంజూచి "హంసమా! నీకుపిచ్చియెత్తినదా. నూరుగతుల నెఱిఁగిన నీకాకితో నొక్కగతిమాత్రమే యెఱిఁగిన నీవేమి? పరుగెత్తుటేమి? మార్గమధ్యంబునంబడి చచ్చెదవు. ఇంతకు నీపా

పముపండినది. పోపొ"మ్మని పరిహసించెను. అంతట కాకియు హంసము నాకసంబున కెగిరి సముద్రముపైఁ పరువెత్తఁజొచ్చెను. రాజహంస మునుముందు మందగతిం బరువెత్తెను. కాకి తన ప్రజ్ఞయంతయు నొక్కమాఱుగఁ జూపవలయునని మిక్కిలి శ్రమపడి కడువేగంబున బరువెత్తి హంసంగడచి చని హంసవచ్చువఱకు నచ్చటనాగి దానిని వెక్కిరించుచు మిక్కిలి యాయాసపడెను అట్లు కొంతదూరము పరుగెత్తునప్పటికి వాయస మలసిపోయెను. అదికనిపెట్టి హంస తనబలమంతయు జూపి మహావేగమున బరుగెత్తసాగెను. కాకి పరుగెత్తలేక వెనుక మెల్లమెల్లన రాఁజొచ్చెను. "అయ్యో! నూరుగతులు నేర్చినదానవు. ఇప్పు డొకగతిమైనది. మఱియేగతిలోఁ బరుగెత్తుదమని హంస కాకి నడుగుచుండ నావాయసము ఱెక్కలపటుత్వముదప్పి సముద్రమునంబడి హంసనుజూచి "హంసరాజమా! నన్ను రక్షింపుము! బుద్ధినేరక నేనిట్టిసాహసమునకుం దొణంగితిని నా కాకులతో నన్ను గలుపుము; నీకెంతో పుణ్యముగలదు" అని దీనముగాఁ బ్రార్థించెను ఆవేడుకోలు విని హంస జాలినొంది యిట్టి చేతగాని పనులెన్నండు చేయకుమని బుద్ధిచెప్పి దానిని తోడికాకులయొద్దకుఁ దీసికొనిపోయి యొప్పగించెను.

## అంబ.

కాశీరాజునకు ముప్వురు కూఁతులు కలరు. అంబయనునది పెద్దకూఁతురు. అంబికయనునది రెండవకూఁతురు. అంబాలికయనునది తృతీయపుత్రిక. ఈముప్వురు పుత్రికలు యుక్తవయస్కలై వివాహయోగ్యలై యుండుటంగని తండ్రివారికి స్వయంవరము సాటించెను. ఆనాఁటి రాజకుమారులందఱు కాశీరాజపుత్రికల వరింప నిండువేడుకతో నచ్చోటికి వెళ్ళిరి. శంతనుమహారాజపుత్రుఁడును గాంగేయుఁడు

నైన భీష్ముఁడు తండ్రిచనిపోయినప్పటికి తనతమ్ములగు చిత్రాంగదుఁడు విచిత్రవీర్యుఁడు బాలకులైనందున వారిపక్షమున తాను భూభారము వహించి న్యాయముగా నేల యేలుచుండెను. చిత్రాంగదుఁడు చిత్రాంగదుఁడను గంధర్వునితో యుద్ధముచేసి మృతినొందెను. భీష్ముఁడు విచిత్రవీర్యునకుఁ బట్టముగట్టి యతనికివివాహముచేయవలెనని సంకల్పించి కాశీరాజకుమారికా స్వయంవరమునకుఁ దమ్ముని వెంటఁబెట్టుకొనిపోయెను. అక్కడ రాజు లనేకులుచేరిరి. భీష్ముఁడు వారినందఱ సంగ్రామమున జయించి కాశీరాజపుత్రికల ముగ్వురను తన రథముమీఁద గూర్చుండబెట్టుకొని జయజయధ్వనులతో హస్తిపురమునకుఁ బోయి కన్యకల ముగ్గురను సత్యవతీదేవికిఁ జూపి యామె యాజ్ఞప్రకారముగా వారిని విచిత్రవీర్యునకిచ్చి వివాహము చేయ నిశ్చయించెను. అప్పుడు వారిలో నంబ భీష్మునితో నిట్లనియె. "రాజకుమారా! నిరంతర ధర్మాచరణమునకుఁ బ్రసిద్ధికెక్కిన చంద్రవంశమున జనించినవాఁడవు. సజ్జన గరిష్ఠుండగు శంతనుని పుత్రుండవు. తండ్రిసుఖము నిమిత్తమై రాజ్యాధికారము వదలుకొని వివాహము సైతముమానుకొని బ్రహ్మచర్య దీక్షాపరతంత్రుఁడవై మహాఋషులయొక్కయు దేవతలయొక్కయు మెప్పునకు పాత్రమైన వాఁడవు. ధర్మపరాయణుఁడైన నీయట్టి మహనీయులతో నామనోగతమైన యభిప్రాయము చెప్పుట సమంజస మని నేను మనసిచ్చి మాటాడుచుంటిని. నేనుయుక్తవయస్సు రాలనైనది మొదలుకొని సాళ్వునియందు మనసు నిలిపియుంటిని. అతని చక్కఁదనము నామనసునకునచ్చినది. ఆతనిరూపము నాకనుల పండువొనర్చినది. అతని గుణసంపద నావీనులవిందొనర్చినది అతని సౌజన్యత నాహృదయము నాకర్షించినది. అతఁడే నామన్మథుఁడు; అతఁడే నాప్రాణనాయకుఁడు అతఁడే నావలపులరాశి. అతనిమీఁద నాచిత్తము లగ్నమై యున్నది. మీ

తమ్ముఁడు చక్కనివాఁడే సత్కులప్రసూతుఁడే. గుణసంపన్నుఁడే. విశాలహృదయుఁడే; దయామయుఁడే; రాజవంశాలంకారుఁడే. ఐనను నామనస్సు విచిత్రవీర్యునియందుఁ దగులలేదు సాళ్వు నిమీఁదనుండి మరలలేదు. కావున నాయందనుగ్రహించి నన్ను సాళ్వు సయొద్దకుం బంపుము. మాయిరువుర మనంబులలో నూతనముగఁ బొడమిన యనురాగాంకూరముసు నశింపఁజేయుట నీవంటివానికిభా వ్యము కాదు. దంపతుల మనస్సులు కలసినప్పుడేకాని దాంపత్యమను కూలము కాదు. దంపతుల కొండొరులపై ననురాగము కుది రినగాని సంసారచక్రము సరిగా నడువదు. నాకు విచిత్రవీర్యునిపై న నురాగము లేదు. అట్టియెడల నేనాయన కిల్లాలినై యుంటినా నాకు సుఖము లేదు. ఆయనకు సుఖము లేదు. మాయిరువుర జీవనము దుఃఖ భాజనమగును. వివాహమాడఁ దలచితినా సాళ్వునే వివాహమాడె దను. లేదా నీవలె జన్మాంతరము వఱకు బ్రహ్మచర్య దీక్షనే బూనె దను. ఎన్నఁడు సాళ్వనృపాలు ముఖారవిందదర్శన మగునో, ఎన్నడా తని చరణారవింద సేవ లభించునో, ఎన్నఁడాతని గాఢాలింగన భా గ్యముపట్టునో, ఎన్నడాతని పట్టపుదేవి ననిపించుకొను పుణ్యము సంప్రాప్తించునో, ఎన్నఁ డాతని శిరోభాగంబున ముత్యాల తలంబ్రాలుపోసి నాహస్తములు ధన్యములు చేసికొందునో యని యువ్విళ్ళూరుచుంటిని. అందుచేత నామనోరథము భగ్నము చేయ వలదు. పాకుచున్న నాకోరికతీఁగలను ద్రెంపివేయవలదు." అని చేతు లు రెండును శిరస్సునజేర్చి మొ్రొక్కెను. ఆమాటలు విని విచిత్రవీర్యు నితల్లియైన సత్యవతీదేవి కరుణార్ద్రహృదయయై భీష్మునికిట్లనియె. "కుమారా! ఈబాలికపలుకులు మన కాదరణీయములు. ఒకని యందు లగ్నచిత్తయైనయువతిని మఱియొకనికిచ్చివివాహము సేయుట యధర్మము. ఈమె మనసులో నెన్నోకోరికలున్నవి. హృదయమున

నెన్నో ముచ్చట లున్నవి. సాళ్వుని చెట్టబట్టినంగాని యవియెల్ల సఫలము కావని యామెయభిప్రాయము. అందుచేత నీమెను విడిచి పుచ్చుట పరమధర్మము” అనవుడు భీష్ముఁడు సవతితల్లినుద్దేశించియిట్లనియె. “అమ్మా! నవయౌవ్వన ప్రాదుర్భావకాలంబున యువతీజనంబుల మనంబు లలరించు కోరికల తెఱంగు నే నెఱుంగనిది కాదు. అన్యోన్యానురాగము లేనిపెండ్లి బొమ్మలపెండ్లి. మనంబుల హత్తని దంపతులు చిత్తరువులందు లిఖింపఁబడిన దంపతులు. అందుచేత నీమెను విచిత్రవీర్యున కిచ్చి పెండ్లిచేయుట యధర్మము. అధర్మమే కాక హానికరము అందుచేత నే నీమెను విడిచిపుచ్చెద. పురూరవచక్రవర్తి మొదలగు లోకోత్తరచరిత్రులు ప్రభవించిన చంద్రవంశమున జన్మించిన శంతనమహారాజ పుత్రుఁడనై నేనధర్మము సేయుదునా? నీయాజ్ఞాప్రకార మామెను సాళ్వునియొద్దకే పంపెద” నని యంబికను నంబాలికను జూచి కన్యలారా! మీయభీష్ట మెట్లున్నదని యడిగెను. ఆబాలికలిద్దఱు సిగ్గునందలవంచి మేము విచిత్రవీర్యునే వివాహమాడెద మని మృదుమధురస్వరంబునం బలికిరి. పలుకుటయు భీష్ముఁడు తత్క్షణంబ యంబను రథమెక్కించి సగౌరవముగ సపరివారముగ, సబహుమానముగ నామెను సాళ్వునియొద్దకుఁ బంపెను.

అనంతరము మంచిముహూర్తము నిశ్చయించి యంబికను నంబాలికను విచిత్రవీర్యునకు మహావైభవముతో వివాహముచేసెను. కురువంశము మహోన్నత దశనందునని భీష్మాదులందఱు సంతసించిరి. అంబ హస్తిపురము విడిచి సాళ్వునియొద్దకుఁ జని యాతనిదర్శనముచేసి తన్ను వివాహమాడుమని కోరెను. అనవుడు సాళ్వుఁ డిట్లనియె “కళ్యాణీ! నిన్ను వలచినమాట నిజము. నీవు నాపైఁ గూర్మి నిలిపినమాట యదార్థము కాని నానారాజకుమారులు జూచుచుండ భీష్ముఁడు నిన్ను విచిత్రవీర్యున కిచ్చి వివాహము చేయవలెనని రథ

ముపైఁ గూర్చుండఁబెట్టుకొని తీసికొనిపోయెను. ఆతనియింట గొన్ని నాళ్ళుంటివి. అచ్చటనుండి యేలవచ్చితివో నే నెఱుంగను పరునే వివాహమాడఁబోయి పరగృహవాసము చేసివచ్చిన పడఁతిని వివాహమాడ నేనంత వెంగలినా? నిన్ను నేను వివాహమాడను. అట్లుచేయుట నాకు రాజకులములో నపకీర్తి కావునఁ బొమ్ము.

అట్లు సాళ్వుఁడు తన్ను వివాహమాడుట కిష్టము లేక నిరాకరించుటయు విషాద సముద్రమగ్నమానసయై యంబ యాతని నుద్దేశించి యిట్లనియె. "రాజకుమారా! జ్ఞానమువచ్చినది మొదలు మనంబున నిన్నే వరించుకొంటిని. నీహస్తమేకాని మఱియొకని హస్తము పట్టఁదలఁచుకొనలేదు. ఈయౌవనము నీపాలుగావలసినదే కాని యన్యులపాలు కాఁగూడదని నాసంకల్పము. ఇట్టిదానిని నన్ను నీయందే బద్ధచేతస్కురాల నైన నన్ను గతిలేనినన్ను ద్రోసిపుచ్చుట న్యాయముకాదు. నాయంతట నేనువచ్చి ముగ్ధభావము విడిచి నోరు తెఱచి యిట్లు యాచించినందుకే నన్ను స్వీకరింపవచ్చును. పీటలమీఁది పెండ్లి జెడగొట్టుకొని వచ్చితిని. భీష్ముఁడు కురుకులప్రదీపకుఁడును తనతమ్ముఁడు నగు విచిత్రవీర్యున కిచ్చి నన్ను పెండ్లిచేయ సిద్ధముగానుండఁగా నేను సాళ్వునిఁ దక్క మఱొక్కని వివాహమాడనని యాతనిమాట కెదురాడి పట్టుపట్టి వానిచేత సగౌరవముగా విముక్తురాలనై పుట్టెడాసతో నీతావునకు వచ్చితిని. తోఁబుట్టువులలో నేనే జ్యేష్ఠురాల నగుటంజేసి విచిత్రవీర్యుని పట్టపుదేవినై కురురాజగృహలక్ష్మినై సత్యవతీదేవికి ముద్దులకోడలనై సామంత రాజపత్నులు పరిచర్యలు సేయుచుండ నిందాణిని మించిన వైభవముతో నుండియుందును. నీనిమిత్తమవియెల్ల జెడఁగొట్టుకొని వచ్చితిని. వచ్చినందుకు నామనోరథము భగ్నము చేసితివి. నాయాస లడుగంటఁ జేసితివి, నాకోరికలతీఁగలు కోసివేసితివి. కౌరవులగృహంబున

నేనొక్క రాత్రియైన నిద్రపోలేదు. పట్టెడన్నమైనదిన లేదు. పుడిసెడు నీరైనఁ ద్రాగ లేదు. భీష్మునియింట నేనుంటినని యనుమానించితి వేమో ? భీష్ముఁడు నాకు తండ్రివంటివాఁడు. నాశరీర మపవిత్రము కాలేదు నాచరిత్ర కళంకితముకాలేదు. నామనస్సు మలినముకాలేదు ఇందుకు భీష్ముఁడు సాక్షి. సత్యవతీదేవిసాక్షి; కావున నన్ను స్వీకరింపుము" అని వేఁడుకొన సాళ్వుఁడిట్లనియె; "సుందరీ ! నీవేలనన్ను బాధించెదవు! నీవు నన్నుఁ గామించినట్లే నిన్నుఁ నే గామించితిని. కాని దైవ మన్యథా తలంచెను; నీవు చెప్పినయుక్తులు నామనంబునకు నచ్చలేదు; నీవు పవిత్రచరిత్రవే కావచ్చును; నీవు యోగ్యురాలవేయై యుండవచ్చును; కాని రాజకుమారు లందఱు జూచుచుండ నిన్నును నీచెల్లెండ్రను బట్టుకొని భీష్ముడు రథముపైఁగూర్చుండబెట్టుకొని తీసికొని పోయినదానిని పరపురుషునిచేతఁ జిక్కినదానిని పరపురుషునియింటఁ గొంతకాలమైన నున్నదానిని నేనెట్లు వివాహమాఁడగలను; నేనునునలుగురు రాజులలోఁదలయెత్తికొనితిరుగుచున్నవాఁడను; నాగౌరవముఁ నావంశగౌరవముబాటింప వలదా ? నేను నిన్నుఁ బాణిగ్రహణము చేసికొనినను ఇదియంతఃకరణ శుద్ధితోఁ జెప్పినమాట వేడుకొనుట విలపించుట నిష్ప్రయోజనము ఇంక నీయిచ్చవచ్చిన తెఱంగునఁ బొమ్ము ! నాసన్నిధిని క్షణకాలమైన నిలువవలదు" ఆకఠినోక్తులు వినఁగానే యంబ కొంతసేపు కదలఁజాలక యెట్టకేలకు రాజసన్నిధినిబాసి యావలకుఁబోయి తన్ను మున్ను తెచ్చిన రథమెక్కి మరల భీష్మునిపాలికిఁజనియెను. భీష్ముఁడామెను సగౌరవముగ నాదరించి మరల వచ్చినపని యేమియని యడిగెను. అనవుడు నామె యిట్లనియె. "రాజకుమారా! నీవద్దశలవుపుచ్చుకొని నేనుసాళ్వుని సన్నిధికరిగి నన్నేలింగించుకొని చిరకాలప్రేమబంధముఁదెలిపి వివాహమాడుమని కోరితిని. నీవు నన్నుఁబట్టుకొని హస్తిపురమునకు గొనిపోవుటచేతను నీయింట

నేను గొన్నిగడియల నేప్పుండుటచేతను నన్నతఁడు పాణిగ్రహణము చేసి కొనుటకు సమ్మతింపలేదు. నీవలన నాకీయపకారము జరిగినది. చిర సంకల్పము భగ్నమైనది. కావున నన్ను నీతమ్మునకుఁ బెండ్లిసేయుము. అప్పుడు నామనస్సూరటఁ బొందును." అనవుఁడు భీష్ముఁడు మొగమున చిఱునగ వంకురింప నామెతో నిట్లనియె. "కళ్యాణీ! నీవుచెప్పినదెన్న టికిం బొసఁగనేరదు. నిన్ను నేనుదెచ్చినప్పుడు సాళ్వుఁడే నీప్రాణనా యకుఁ డని సాళ్వుఁడే నీ మన్మథుఁడని యతనినే కాని వరింపఁదలచు కొనలేదని విస్పష్టముగాఁ జెప్పితివి. పరపురుషునిమీఁద మనసుదగు లొకనిన దానిని నాతమ్మునకిచ్చి యెట్లు వివాహము చేయఁగలుగుదు ను? అంతకంటె నవివేకమెుండుగలదె! అట్టియిల్లాలున్న సంసార మె న్నటికైన బాగుపడఁగలదె? భర్తకు సుఖముండునె? చిత్తము సాళ్వుని వద్ద శరీరమువిచిత్రవీర్యునియొద్ద నున్నదానితోఁ గాపురము సేయుటెట్లు? ఇది హాస్యాస్పదము కాదా? నేనెంతో గౌరవముతో సత్యవతీదేవి సమక్షంబున విచిత్రవీర్యునకు నిన్నును నీ చెల్లెండ్రనిచ్చి వివాహము చేయుదునని సంకల్పింప నామాటఁద్రోసిపుచ్చి సాళ్వుని సన్నిధి కరి గితివి. అట్టిదానిని నిన్ను నేనెట్లు మాతమ్మునికి వివాహము చేయుదు ను? కురుకులమును నగుబాట్లపాలు సేయుట నాకిష్టము లేదు. కావుననీవు మాతమ్ముని వివాహమాడవలయు ననునాశవిడిచి యథేచ్ఛముగఁ బొ మ్ము. ఇది నీస్వయంకృతాపరాధము గాని మాదోసముగాదు. ఇందు నిన్ను నీవే నిందించుకొన వలయును. లేదా నీకర్మమును దూ రుము. ఇఁకఁబొమ్ము!" అని భీష్ముఁడుబలుక నంబ తనమనోరథములెల్ల విధముల భగ్నమైనందుకు బిట్టువగచి వివాహములేక యల్లరిపాలైన బ్రతుకు ప్రపంచంబున బ్రతుకుటకంటె యరణ్యంబునకేగి తపోనిష్ఠ మయి కాలక్షేపముచేయుట సముచితమని విచారించి యడవికరిగెను.

నారచీరలుకట్టి జడలుదాల్చి యాభరణములు ద్రోసిపుచ్చి

యంబ యడవికరిగి యచ్చట నొక యాశ్రమమునకుఁబోయి తపంబు జేయుట కుద్యమించుచుండ నచ్చట నదివఱకే తపము చేయుచున్న వానప్రస్థుఁడొకఁడు కడువృద్ధుఁడు దానింజూచి "బిడ్డా! నీవృత్తాంతమేమి? రూపముజూడ రాజకన్యవలె కనబడుచున్నదానవు. సకలభోగములకు నాశ్రయమైన యౌవనంబుననుండియు నీ విధంబున తపంబు సేయ దలంపేల? నీకు సంభవించిన యాపదయేమి" యని యడిగెను. అంబ యతనికి నమస్కరించి తనవృత్తాంతము సవిస్తరముగఁ జెప్పెను. అతఁడా బాలిక యుదంతమువిని యానందబాష్పములు కన్నుల నుండి స్రవింపఁగాఁ గలించి "అమ్మా! కాశీరాజపుత్రికవా నీవు అంబవా? నీతల్లి నాకూఁతురుఁ నీతండ్రినాయల్లుఁడు నీవు నామనుమరాలవు. నీవు పుట్టకము నుపే నేను తపోవనంబునకు వచ్చియుంటిని. నాటనుండియు గాశీరాజ కుటుంబ వృత్తాంతములు నాకుఁ దెలియుటలేదు. నాయాశ్రమమే నా ప్రపంచము. నాపర్ణశాలయే నాస్వర్గము. నాయాశ్రమజంతువులే నా కుటుంబము. నావృక్షములే నామిత్రులు. అమ్మా! భీష్ముని కతమున నీకింత యిక్కట్టు సంభవించినది. అతని నెట్లయిన నొడంబరచి నిన్ను విచిత్రవీర్యునకిచ్చి వివాహముచేయించెద. ఎట్లుచేయించెదవందువో వినుము. భీష్ముఁడు పరశురాముని శిష్యుఁడు. భార్గవుఁ డతనికి ధనుర్విద్యాగురువు. పరశురాముఁడు నాకు ప్రాణమిత్రుఁడు. క్షత్రియులలో నెల్ల నేనే యతనికి నిజమైన మిత్రమను; అతఁడు నామాట దలదాల్చును. నేను స్వయముగ నిన్నతనికడకుఁ దీసికొనిపోయి చెప్పవలసిన మాటలు చెప్పి యతనిచేత భీష్మునకుఁజెప్పించి నీమనోరథసిద్ధి జేయించెద. సాళ్వుఁడు మనకు సాధ్యుఁడుగాఁడు. అతనిమీఁది మక్కువ విడువు" మని మనోవికాశము గలుగునట్లు పలికెను. అంబ వానిమాటల కియ్యకొని యాసలు పెంచుకొని మరల తనకు భర్తృవియోగ

మున్నదనినమ్మి విచిత్రవీర్యసమాగమమున కువ్విళులూరుచుండెను. ఆవానప్రస్థుఁడు మఱునాఁడు తనముద్దు మనుమరాలును వెంటబెట్టుకొని క్షత్రియాంతకుఁడని బిరుదందిన పరశురాముని సన్నిధికిఁబోయి యతనిచేత పూజితుఁడై నీవేలవచ్చితివని యతఁ డడుగ నిట్లనియె. "దేవా! ఇది నాదౌహిత్రి కాశీరాజపుత్రిక. భీష్మునికతమున నిదివివాహములేక బ్రహ్మచారిణి కావలసివచ్చె" నని కడచిన యావద్వృత్తాంతము వినిపించి యిట్లు వేడుకొనియెను. "మహాత్మా! భీష్ముఁడు నీకు శిష్యుఁడు ఆకారణమున విధేయుఁడు. ప్రాణంబులైన విడుచునుగాని నీయాజ్ఞమీరఁడు. అతనికి శస్త్రవిద్యాభిక్షముబెట్టిన మహాత్ముఁడవు నీవేకావా. నీయాజ్ఞమీరి యతఁడు జీవింపలేఁడు. కావున నాతనికడకు నామనుమరాలిని దోడ్కొనిపోయి దీనిని విచిత్రవీర్యునకిచ్చి వివాహముచేయునట్లు భీష్మునితోఁ జెప్పవలయును. భర్తృభిక్షము బెట్టి దీని నొకయింటిదానిని జేయవలయును. చక్కఁదనమెల్ల స్త్రీరూపము దాల్చినదో యన్నట్లు యీసుందరాంగి యౌవనము వనముపాలుగాకుండ జేయుము. ఈపూబోఁడి తపోనిష్ఠయై నెండ కెండి వానకుఁ దడిసి చలికి మోటబారి మేనివికాసము బాయకుండఁ జేయుము. ఈమెకు సంసారసుఖము గల్పింపుము. ఈమె దురవస్థ జూడ నామనంబు దుఃఖభాజనమై తపోనిష్ఠకుఁ జొరకున్నది. అన్యశరణంబులేని దీనికి నీచరణంబె శరణంబు. కావున రక్షింపుము"

అని యావృద్ధుఁడు వేఁడికొనుటయు భార్గవరాముఁడు కృపాధీనమనస్కుఁడై యిట్లనియె. "అయ్యా! ఇది యెంత పని! యిది నాచేతిలోనిదే. నాశిష్యులలోనెల్ల భార్గవుఁడే పరమప్రియుఁడు. ఈపాటి చిన్నకార్య మతనిచేతఁ జేయింపజాలనా? అతఁ డొప్పుకొన్నను శిక్షించియైన నీపని యతనిచేతఁ జేయింతును. అని యభయమిచ్చి వారిరువురను వెంటఁబెట్టుకొని పరశురాముఁడు భీష్మునిపాలికిఁ బో

మెను. ధనుర్విద్యాగురువైన పరశురాముని రాక వినగానె భీష్ముఁడు భయభక్తులతో నెదురుగాఁబోయి యర్ఘ్యపాద్యము లిచ్చి పూజించి రాకకుంగారణ మడిగెను. పరశురాముఁడు తనవచ్చినపని యామూలాగ్రముగఁ జెప్పి యంబను విచిత్రవీర్యునకు వివాహము జేయు మని యాజ్ఞాపించెను. అనవుడు గురువునకు శిష్యుఁడు చేతులుజోడించి యిట్లనియె. "దేవా! నేను మీశిష్యుఁడను. గురువునాజ్ఞ శిష్యుం డెల్లవిషయములలో శిరసావహింపవలసియుండును. కాని యీవిషయములో మీయాజ్ఞ నేనుల్లంఘింపవలసివచ్చినందుకు నేనుమిక్కిలిచింతించుచున్నాఁడను.నన్ను మీరు క్షమింపవలయు. కావలసినపక్షమున నా శరీరము గోసి యిచ్చెద. నాశిరము ఖండించి నీపాదముల బూజించెద. నిర్విచారముగఁ బ్రాణములర్పించెద. అంతెకాని పరపురుషునిపైఁదనమనంబునిల్చియున్నదని బహిరంగముగ నాతోఁ జెప్పిన యీబాలికను నాతమ్మునకిచ్చి నేను వివాహము జేయను. మీద మీయిష్టము" అనవుడు భార్గవరాముఁడు "నీవు నాయాజ్ఞాప్రకారము వర్తింప వేని యుద్ధమునకు సిద్ధముకమ్మ"ని పలికెను. క్షత్రియవంశమునఁబుట్టి యుద్ధమునకు వెరతునా యని భీష్ముఁడు పలికి యుద్ధసన్నద్ధుఁడయ్యెను. అప్పుడు భీష్మపరశురాముల కిరువది యొక్కదినములు మహాయుద్ధమయ్యెను. భీష్ముఁడు ప్రాయమున నుండుటచేతను పరశురాముఁడు వృద్ధుఁడగుటచేతను భీష్ముఁడే గెలిచెను. పరశురాముఁడు దెబ్బలుతినిచావునకు సిద్ధమయ్యెను. అప్పుడు కొందఱుమహర్షులుమధ్యవర్తులై వచ్చి గురువధము జేయగూడదని భీష్మునకు బోధించి పరశురాముని గాచి యాతనినావలకుఁ దోడ్కొనిపోయిరి. పరశురామునంతవాఁడు తనపక్షము వహించినను దనమనోరథము నెఱవేర లేదని యంబ చింతిల్లి తపోనిష్ఠదాల్చి యగ్ని కల్పించుకొని మఱియొకజన్మమెత్తి భీష్ముని వధింపవలయునని మనంబున సంకల్పించుకొని యాయ

గ్నిలోఁబడి మృతినొందెను. మృతినొంది రెండవజన్మమున దుపద రాజునకు మొదటికూతురై పుట్టి పిమ్మట మగతనముదాల్చెను. మొదట యాఁడుదైన కారణమున పేడిమొగముగలవాఁడై యుండెను. అతనిపేరు శిఖండి. పేడివారిం జూడనని భీష్ముఁడు ప్రతిజ్ఞపట్టెను. కాఁబట్టిపాండవులు శిఖండి నెదురఁబెట్టుకొని భారతయుద్ధమున భీష్ముని మీఁదికిఁ బోయిరి. భీష్ముఁడు శిఖండిమొగముజూడక వెనుకకుఁ దిరిగెను. అప్పు డర్జునుఁడు భీష్ముని బాణములతోఁగొట్టి నేలం బడవైచె. అంబ రెండవజన్మమున శిఖండియై భీష్మునిజంపి ప్రతిజ్ఞనెఱవేర్చుకొనెను.



# వి నో ద ము లు

## ప్ర థ మ భా గ ము.

1. అడిదము సూరకవి యొకనాఁడు తాఁటియాకులమీఁద వ్రాయఁబడిన మహాభాగతమును జేతఁబట్టుకొని నడచిపోవుచుండఁగ నొక వెలమదొర వానింజూచి, ‹అయ్యా! ఈవేళ వర్జ మెప్పు" డని యడిగెను. నేను కవిత్వముఁ జెప్పెదనుగాని పంచాంగముఁ జెప్పను అందుచేత నాకుఁ దెలియదని సూరకవి ప్రత్యుత్తరమిచ్చెను. "అంత పెద్దపుస్తకముఁ జదువుకొన్న వాఁడవు; నీకు పంచాగముఁ జెప్పుట తెలియదా?" యని యావెలమదొర కవినిఁ బరిహసించి తనదారిని బోయెను. మఱునాఁ డావెలమదొర చేతఁ బెద్ద కత్తిఁ బట్టుకొని పోవుచుండఁగ, సూరకవి వానిని సమీపించి, "అయ్యా! నాకు క్షురకర్మఁ జేయగలవా?" యని యడిగెను. వెలమదొర యామాటలు విని యాశ్చర్యపడి కోపముతో, ‹నేను మంగలి ననుకొంటివా?' యనిపలికెను. సూరకవి యామాటలువిని, ‹కత్తి యింత పొడవుగా నున్నది. క్షురకర్మఁ జేయుటకే బనికిరాని దీని ప్రయోజన మే' మని పరిహసించి పోయెను.

---

2. అడిదము సూరకవి యొకనాఁడు కుక్కయొకటితఱుముకొనిరాఁగా వడివడిఁ బరుగెత్తుకొని తనస్నేహితులు కూర్చున్నయొక తావునకు వగర్చుకొనుచు వచ్చెను అప్పుడు స్నేహితులు వానిం జూచి, "యేమోయి! గాడిదవలె నిట్లు పరుగెత్తుకొని వచ్చితి" వని యడిగిరి. "కుక్కకు భయపడి వచ్చితిని గాని యిప్పటికి మందలోఁ గలిసితినిగనుక భయము తీఱిన" దని ప్రత్యుత్తర మిచ్చెను.

3. కాకతీయప్రతాపరుద్రుఁ డోరుగల్లు నేలుచుండగ నొక మారు బ్రాహ్మణులకును, విశ్వకర్మలకు వివాదము వచ్చెనఁట. విశ్వకర్మలు తాము విశ్వబ్రాహ్మణులమనియుఁ దమసాహాయ్యము లేకయే వర్ణమువారును జీవింపలేరనియు నన్నివస్తువులఁ దామే చేయవలయుననియు కావున తమ రే బ్రాహ్మణులకంటె నెక్కువవారమనియు వాదించిరఁట; అప్పుడొక నియోగిబ్రాహ్మణుఁడు లేచి చేత నొక గ్రుడ్డిగవ్వఁ బుచ్చుకొని విశ్వబ్రాహ్మణులలోఁ బెద్దకునది చూపి, "అన్నివస్తువులు నీవు చేయఁగలనంటివి ఇది నీవు చేసితివా" అని యడిగెను. విశ్వబ్రాహ్మణుఁ డామాట విని కోపించి, "చీ! దీనిని నేను జేయలేదు ఇట్టిమాట లింకఁ బలుకకు" మని కఠినముగ నుత్తరము చెప్పెను. అప్పుడా నియోగి వానితో "ఓయీ! గుడ్డిగవ్వఁ జేయనివాఁడవు నీవు మాకంటె నేవిధముగా నెక్కువాడు"వని పరిహసించెను. అప్పుడు సభవారందఱు నియోగి యుక్తికి మెచ్చి సంతోషించిరి.



4. విద్యాగర్వముచేత విఱ్ఱవీఁగుచు, నొకపండితుఁడు తానుప్రతివాదిభయంకరుఁడ నని బిరుదు పెట్టుకొని తన పాండిత్యప్రభావముచేత నెవ్వ రేమన్న నది కాదనిపించెదనని ప్రతిజ్ఞఁ జేసి యొక రాజునొద్దకు వచ్చి యతని యాస్థానపండితులను దనతో వాదమునకు రమ్మని పిలిచెను. అతి చతురుండగు నొక పండితుఁడు వాదమునకంగీకరించి క్రొత్త పండితునితో నీప్రతిన యేమని యడిగెను. నూతనపండితుఁడు నీ వేమాట లాడిన నామాట లబద్ధములని నేను ఋజువు జేయఁగలను. ఇదియే నాప్రతిన" యని యనెను. అప్పుడు సంస్థానపండితుఁడు ,సరే ఈ రెండుమాట లబద్ధములని స్థాపింపుము. రాజుగారితల్లి గొడ్రాలుకాదు. రాజుగారిభార్య పతివ్రత" యనిపలికెను. ఆమాటలు విని క్రొత్త పండితుఁడు పచ్చి వెలగకాయ గొంతుఁ బడినట్లు తోఁచక మఱునాఁ

డుత్తరము జెప్పెదనని చెప్పి యప్పటికి తప్పించుకొని రాత్రి పారి పోయెను.

---

5. ఒక బ్రాహ్మణుఁడు ప్రతిదినము తనకొడుకును బిలిచి 'యీ వేళ సంధ్యవార్చితివా లేదా' యని యడుగుచుండును. కుమారుఁడు భోజనముమీఁదనున్న శ్రద్ధ సంధ్యావందనముమీఁద లేనివాఁడగుటచే వార్చినప్పుడు వార్చితిననియు లేనప్పుడు లేదనియుఁ జెప్పక యబద్ధము లాడుచుండును. ఒకసాయంకాలము తండ్రి కొడుకును జూచి "నాయనా! ఈపూట సంధ్యవార్చితివా" యని యడుగ నాతఁడు వార్చితిననెను. ఎక్కడవార్చితివని తండ్రి మరల బ్రశ్నచేయఁ దూరుపుచెఱువులో నని కొడుకుత్తరము జెప్పెను. అప్పుడు తండ్రి "తూరుపు చెఱువులో నీళ్ళెండిపోయినవి. అక్కడనెట్లువార్చితివిరా'యని యడుగ అయ్యో! మనచాకలివాఁడు దానిలో నీళ్ళున్నవనినాతోఁ జెప్పుటచే నేను కాఁబోలు ననుకొని యక్కడవార్చితినని కొడుకు బదులు చెప్పెను.

---

6. సంధ్యావందనము మఱచిపోయిన యొకపిల్లవాఁడు మరల దానిని నేర్చుకొనవలయునని శ్రద్ధాభక్తులతోఁ దండ్రియొద్దకుఁబోయి "నాయనా! నాకు సంధ్యనేర్పు' మని యడిగెను. ఆ మాటలు విని తండ్రి కోపముచే మండిపడి కొడుకుంజూచి యిట్లనియెను. ఓరీ! పశువా! అయిదేండ్లక్రిందట నేర్చుకొన్న నీకే జ్ఞాపకము లేనప్పు డఱువది వత్సరములక్రిందట నేర్చియున్న నాకా జ్ఞాపకముండుట. ఇట్టిమాట లిఁకముం దెప్పుడు ననఁబోకు' మని గట్టిగా మందలించెను.

---

7. ఒకబ్రాహ్మణుఁ డొకయూరికిఁబోఁదలంచి యెన్నిమారులు వీధిగుమ్మమునకువచ్చి చూచినను దుశ్శకునమే యగుచుండెను. ఒక

మాట తెలిసినవాఁడు రెండవమాట వితంతువు మూఁడవమాటయింటి బ్రాహ్మణుఁడు నెదురుగా వచ్చుటచే నాతఁడు రెండుమూఁడుదినములు పయనముమాని రాత్రి యందఱు నిద్రపోయిన వెనుక బోవుట మంచిదని నిశ్చయించి యట్లుఁ బయనమై చీఁకటిలో రెండుజాముల వేళ వీథిలోనికి వచ్చెను. ఆయూరి నంబియింట చాలకాలమునుండి రెండు పిల్లులుండి వానికి మిక్కిలి బాధగలిగించుటచే నతండామార్జాలముల నూరుబైట వదిలిపెట్టఁ దలఁచి పగలైనచో నవి యానవాలు పట్టి మరల వచ్చునని చీఁకటిలో నర్ధరాత్రమునఁ దీసికొనిపోయి పారవేయుట మంచిదని నిశ్చయించి రెండుపిల్లులఁ జెరియొకచంకనిడుకొని పై బ్రాహ్మణుఁడు వీథిలోనికి వచ్చునప్పటి కెదురుగావచ్చుచు నాయనను బలుకరించెను. శకునభయముగల యాబ్రాహ్మణుఁడుమాటలవలన నతనిని నంబిగా గ్రహించి "నీవెక్కడికిఁ బోవుచున్నా' వని యడిగెను. నంబియుఁ దనుఁబోవుచున్నపని నెఱిఁగింప బ్రాహ్మణుఁడుదుశ్శకునమయ్యెనను దుఃఖముతో "నాయనా! నాపనిఁ జెఱచుటకు నీవు చాలక రెండు పిల్లులుగూడ కావలెనా?" యని పలికి విసుగుకొనుచు నింటికిఁ బోయెను.

---

8. ఒక పల్లెటూరిలో వేదముఁ జదువుకొన్నవారి కందఱకు నన్నదానముఁ జేయుదుననియుఁ దదితరులకు నన్నము పెట్టననియు నొకబ్రాహ్మణుఁడు ప్రతినజేసి చాలకాలము తనమాట నిలుపుకొని ప్రసిద్ధికెక్కెను. వేసవికాలమున నొకనాఁడు వేదముఁ జదువుకొనని యొక బీదబ్రాహ్మణుఁడు నడచి నడచి వడదగిలి రెండుజాముల వేళ యాతనియింటి కన్న మన్నమని వచ్చెను. అన్నదాత వాని యవస్థకు జాలినొందక "నీకు వేదమువచ్చునా!"యని యడిగెను. రాదనినచో ప్రాణభయమగునని యెంచి యాబ్రాహ్మణుఁడు వచ్చునని యబద్ధ

మాడి, భోజనానంతరమున పరీక్ష నిత్తునని యనెను. అప్పుడు గృహస్థుఁడతిథిని జన్నీట స్నానము జేయించి, విసనకఱ్ఱతో విసరి షడ్రసోపేతముగ భోజనముఁబెట్టి లేచిన వెనుక వేదముఁ జదువుమనెను. అతిథియు విశ్రమించిన వెనుక చదువుదునని చెప్పి జాము నేపునిదురించి లేచిన తోడనే యజమానుఁడు, వానిని జూచి వేదపరీక్షనిమ్మని ముందు క్రమము, తరువాత పదముఁజెప్పుమనియెను. అతిథియజమానునిఁ జూచి, అయ్యా! క్రమముఁ జెప్పెదవినుడు, "మీరు బ్రతికియుండఁగా మీకుమారుఁడు చనిపోవుట యక్రమము. మీకుమారునిచేతిలో మీరుపోవుటక్రమము" అని దుష్ప్రలాపములాడెను. అప్పుడు యజమానుఁడు కోపించి వానిని గొట్టఁబోవ నారంభముఁ జేరి కలహమువారించి, బ్రాహ్మణుని యుక్తికిమెచ్చుకొని యాఁకలి గొన్న వారికందఱకు నన్నదానముఁ జేయుట మంచిదిగాని యిట్లసంబద్ధదానములు చేయుట మంచిదిగాదనిరి.

---

9. ఒకబ్రాహ్మణుఁడు సంభావనకుఁబోయి యజమానునిజూచి, "అయ్యో! చదువురాని నీచపు ముండకొడుకులకు వరహాయిచ్చి యాత్మస్తుతి పరనింద చేయనిమహానుభావునకు నాకును వరహాయిచ్చి పంపెదరా! ఇదియేమి న్యాయ" మని యడిగెను.

---

10. ఒకబైరాగి యెండలో మట్టమధ్యాహ్నమున నొకబ్రాహ్మణుని యింటికిబోయి, "నాకాఁకలిచేతఁ బ్రాణములు పోవుచున్నయవి. కొంచెముగంజియు నన్నము నాకుఁ బెట్టితిరేని మీ కాఁకలియు దప్పియు లేకుండగ నొకసిద్ధౌషధ మిచ్చెద" నని చెప్పెను. బ్రాహ్మణుఁడామాటవిని, మా కాఁకలి లేకుండ మందియ్యఁ గలవాఁడవు నీవేల యామందుపుచ్చుకొనవని పరిహాసించి పంపెను.

---

11. ఆపస్తంబుఁడు, ఆశ్వలాయనుఁడు నను నిద్దఱు మహాము నులు బ్రాహ్మణధర్మములను సూత్రములుగా వ్రాసిరి. మొదటివాని సూత్రముల నవలంబించినవా రాపస్తంబసూత్రులనియు, రెండవ వానిసూత్రముల నవలంబించినవారి నాశ్వలాయన సూత్రులనియుఁ జెప్పుదురు. నూజివీటి యప్పారావువారియొద్ద నుద్యోగముచేయునొక బ్రాహ్మణుఁ డొకయగ్రహారమునకుఁ బోయియుండ నచ్చటి వైదికు లతనితో మీరాపస్తంబులా, యాశ్వలాయనులా యనిరి. జన్మమధ్య మం దామాట లెన్నఁడు విననివాఁడగుటచే నతఁడు మేమాపస్తంబు లము, నశ్వలాయనులముఁ గాము. అప్పారావువారి హర్కారాలమని చెప్పిపోయెను.

---

12. అవ్యక్తుఁడయిన యొకరాజువద్దకు నొక మనుష్యుఁడు వచ్చి. "దేవా! నాపినతండ్రికొడుకు దేశాంతరములో మృతినొందెను. అతనిభూములు నాకురావలసియుండఁగా వానిరహితులు నాకు స్వా ధీనముచేయుటలేదు. కావున నాకు వాటిని స్వాధీనము చేయింపఁగలం దులకుఁ బ్రార్థించుచున్నా"నని ఫిరియాదుచేసి నలువురుసాక్షులచేతఁ దనజ్ఞాతి మృతినొందినట్లు ఋజువు పలికించెను. రాజాసాక్ష్యమునమ్మి భూముల నతనిస్వాధీనము చేయించెను. పిమ్మట కొన్నినాళ్ళకు ఫిరి యాదియొక్క పినతండ్రికొడుకు వచ్చి రాజును జూచి నేనుబ్రతికియు న్నాను. నాభూములు నాకిప్పింపుఁడని ప్రార్థించెను. రాజువానినికసిరి కొట్టి నీకన్న మిక్కిలి ఘనానామనుష్యులు నీవు చనిపోయితివనిచెప్పిరి నీవబద్ధమాడుచున్నావు. నీమాటలు మేము నమ్మఁజాలమని వానిని వెడలనడపించెను.

---

13. ఒక బ్రాహ్మణునియింటి కొక బంధువుఁడు వచ్చి యజ మానునిజూచి, నాయనా మీయింటనున్న యీతలవెండ్రుకల విధవ

నీభార్యా, మీయన్నభార్యా? అనియడిగెను. యజమానుఁడు వాని తో నాకు మాయన్నకు నంతమాత్రపు భాగ్యముకూడనా? మాబావ మఱఁది భార్య. అతఁడు తనయూరికిఁ బోవుచు దాని నిక్కడ విడచి పెట్టెనని ప్రత్యుత్తరమిచ్చెను.

---

14. మందబుద్ధిగల యొకఁ డొక మనుష్య కపాలమునుదెచ్చి యొకయూరికిఁ బోయి నాకు రావణాసురుని తలకాయలలో నొకటి దొరకినదని దానినందఱికిఁ జూపనారంభించెను. జనులుగుంపులుగుం పులుగ వచ్చి చూచి పోవుచుండిరి. అం దొకవృద్ధుఁడు వానితో "ఓయీ! రావణాసురునితల యింత చిన్నదిగా నున్న దేమి? నీమాట నాకు నమ్మకము లేదు." అని యన వాడు "అయ్యా! ఇది రావ ణాసురుని చిన్ననాఁటి తలకాయ. అందుచేఁ జిన్నదిగా నున్నది"అన నామాటలువిని వానిమూర్ఖత కందఱు నవ్విరి.

---

15. పెండ్లియయిన తరువాత నొకకాఁపువానిని బురోహితుఁ డరుంధతీనక్షత్రముఁ జూపుటకు నవతలకుఁ దీసికొనిపోయి "అదిగో నక్షత్ర మిదిగో నక్షత్ర" మనియాకాశమునఁ గొన్నిస్థలములఁ జూ పెను. కాఁపువాని కెంత సేపటికి నక్షత్రము గనఁబడక పోవుటచే ప్రాణ ము విసిగి వాఁడు అరుంధతీ నక్షత్రముగనఁబడుట లేదుగానియఱవది వరాలయప్పుగనఁబడుచున్నది. ఈపాటి కివతలకురా"అని యవతలకుఁ బోయెను.

---

16. ఒకగృహస్థుఁడు క్రొత్తయిల్లు గట్టుకొని గృహప్రవేశముఁ జేసి, భార్యతోఁ బీటలమీఁదఁ గూర్చున్నప్పుడు పురోహితునిశిష్యుఁ డు, యజమానునిభార్య మిక్కిలి లావుగానుండుట జూచి పీటలమీద నుండి లేచినవెనుక యజమానునిబిలిచి "అయ్యా! మీరింత చిన్నగు

మ్మ మెత్తించినారే? మీభార్య మిక్కిలి లావుగ నున్నది. ఒకవేళ యామె చనిపోయినయెడల శవ మీదారిని బట్టదు. కావున గుమ్మము కొంచెము పెద్దదిగాఁ జేయింపు"మని హితోపదేశముఁ జేసెను. యజమానుఁ డాపలుకులు విని కడునొచ్చుకొని, శిష్యుని మందలింపుమని పురోహితునితోఁ జెప్పఁగా, పురోహితుఁడు శిష్యుని బిలిచి "ఓరీ! మూర్ఖుఁడా! ఇట్టి తెలివిమాలిన పనిసంగము లేలచేసెదవు? ఏగోడ తీసియో, లేక ముక్కలక్రింద నఱికియో, శవము నేదోవిధముగ నవతల పారవేయుదురుగాని యింటిలో నుంచుకొందురఁటరా? ఇంతవెఱ్ఱి పాడకట్టవేమిరా? యని మందలించెను. పరమఛాందసులగు గురుశిష్యుల తెలివి తేటలు సమానముగానే యున్నవని వచ్చినవారందఱు సంతసించిరి.

---

17. ఒకయూరిలో నొకబీదబ్రాహ్మణునికుమారుఁ డాకస్మికముగ మృతినొందెను. శవవాహకులు వచ్చి నాల్గువరాలైదువరాలని బేరముపెట్టి పీడింప బ్రాహ్మణుఁడు తన పేదరికము వారికిం దెలిపెను. వారామాటలుపెడచెవిఁబెట్టి, యీపర్యాయము నీవిధముగాఁబోనిండు. ఇంకొకసారియింతకంటె చవుకచేయుదుమనిరి. అప్పుడుపొరుగుననున్న తెగుమనుష్యుఁడు వాహకులయొద్దకువచ్చి బ్రాహ్మణుని కనికరింపుఁడని నొక్కిచెప్పవారు "అయ్యా! యిది తమయింటఁ గాదుగదా! తమయింటనైనచో మాకు విధాయకమే. కనుక చేతులుగట్టుకొనిపనిచేయుదుము. మఱియొకచోట మాకు దొరకునదియేలచెడగొట్టెదరు అనిపలికిరి.

---

18. దరిద్రుఁడొకఁ డన్నములేక చిక్కి కడుపార దనకు భోజనముదొరకు నుపాయమొకటియాలోచించిపాలకొల్లునకుఁబోయి, యక్కడి గోపురము పీఁపుమీఁదఁబెట్టుకొని మోసెదనని పాడుక వేసెను

ఊరివారందఱు నింతపెద్దగోపురము వీఁడెట్లు మోయునోయనివింతబడి గుంపులుగూడి వానియొద్దకువచ్చి మోయుమనఁగానాతఁడు నేనీనడుమ రోగపీడితుఁడనై చిక్కియున్నాను. నాకాఱుమాసములుశుభ్రముగా భోజనము పెట్టిన నీపనిఁజేయుదునని చెప్ప నూఱందఱు చందాలువేసి కొని యాఱుమాసములు వాని నాఁబోతును మేపినట్లు మేపి యవలనొ కనాఁడు గోపురమును మోయుమని బలవంతపెట్టిరి. వాఁడు సరేయని గోపురము దగ్గరకువచ్చి నడుమువంచి యెవరైనను గోపురమెత్తినావీఁ పుమీఁదఁ బెట్టుఁడని పలికెను ఆపనిఁజేయుట కెవ్వరును బూనుకొ నలేనందున, వాఁడు వారితో మీరు నావీఁపుపైకి దీనినెత్తుట కేచాల నప్పుడు నేను మోయుట యెట్లు సంభవించును. ఇప్పటికైనను మోయు సామర్థ్యము నాకుఁ గలదు. అనిపలికెను. ఊరివారందఱు వాని గడు సుదనమునకు మెచ్చిరి.

---

19. రత్నాలవర్తకుఁడగు నొకకోమటి యొకమాఱు మాణిక్య ము నొకదానిని నెక్కడనో పోఁగొట్టుకొని తనయింటి కప్పుడప్పుడు వ చ్చుచున్న యొక బీదబ్రాహ్మణునిపై నాదొంగతనము మోపి చు ట్టుపక్కలనున్న కాపులనలువుర సాక్ష్యము కుదిర్చి రాజుతో ఫిరి యాదుచేసెను. రాజు బ్రాహ్మణుని బిలిపించి యడుగఁగా బ్రాహ్మ ణుఁడు దొంగిలింపలేదని యేడ్చెను. అంతట రాజు సాక్షులలోనొకనిని జాటునకుఁ బిలిచి యీవిషయమున నేమియెఱుఁగుదువని యడుగవాఁ డు కోమటిచెప్పిన పాఠము ప్రకారము బ్రాహ్మణుఁడుదొంగిలించెనని చెప్పెను. సరే! మాణిక్య మేలాగున నున్నదని రాజు మరల నడుగఁ గా కాఁపు తనచేతిలోనున్న ములకాలకఱ్ఱను జూపి యీవిధముగా నుండుననని చెప్పెను. ఆమాటలు విని రాజు పక్కుననవ్వి "ఓయీ! మా ణిక్య మట్లుండునని నీ కెట్లు తెలిసెౕ" నని యడుగఁగాఁపువాఁ డిట్లనియె

"చిన్నప్పుడు నేను మాతండ్రి వాడుకొను ములకాలకఱ్ఱను పొలమున కుఁ దీసికొనిపోయి పారవేయఁగా మాతండ్రి "మాణిక్యమునంటిముల కాలకఱ్ఱను బారవేసితివిరా దుర్మార్గుఁడా! యని నన్ను శిక్షించెను. అప్పటినుండియు మాణిక్యము ములకాలకఱ్ఱవలెనే యందునను కొంటి" నని బదులుచెప్పెను. రాజు కోమటియొక్క దౌర్జన్యము కాఁపువాని యమాయకత్వమును దెలిసికొని యది కూటసాక్ష్యమని బ్రాహ్మణుని విడిచి యెదుటి కోమటినే శిక్షించెను.

---

20. శకునములయందు నమ్మకముగల యొక కాఁపువాఁ డొక బ్రాహ్మణునియొద్దకుఁబోయి "అయ్యా! కుక్క కుడినుండి యెడమకుఁ బోయిన మంచిదా, యెడమనుండి కుడికిఁ బోయిన మంచిదా" యని యడిగెను. బ్రాహ్మణుఁడు వానిమూర్ఖతకు నవ్వి మీఁదఁబడి కఱవకపోయిన మంచిదని చెప్పెను.

---

21. వనమూలికావైద్యమున దిట్టరిసని చెప్పుకొనుచు నొకసిద్ధుఁ డొకపట్టణముఁజేరి మనుష్యులకు మరణము లేకుండ మందొకటిచేయుదునని పౌరులతోఁజెప్పి వారివద్దనొంచెము ధనముస్వీకరించెను. ఎంతకాలమునకు మందులు చేయవేమని యూరివారు తొందరచేయ వైద్యుఁడు వారితో నిట్లనియె. "కావలసిన వనమూలికలన్నియు నా యొద్దనున్నవి. మీరు మూడునాలుగు వస్తువులు తెచ్చినాకిండు. నల్లి నెత్తురు ఛానెడు దోమమూత్రము తవ్వెడు. తలుపుకిరకిర వీసెడు దెచ్చినమఱునాఁడే మందు సిద్ధమగు" నని యతఁడు చెప్పఁ బౌరులందఱొకరిమొగ మొకరుచూచుకొని సిగ్గుపడి యింటికిఁ జనిరి.

---

22. ఒకరాజు తనశరీరము కడులావుగనుండుటచేత దాని బొధఁబడలేక రాజ్యమునందుండు వైద్యులనందఱఁబిలువనంపితన దేహము

చిక్కుటకు మందిమ్మని వారి నడిగెను. ఎందఱువైద్యు లెన్నిమందు లిచ్చినను దేహము మఱింత పెరుఁగుటయే కాని కృశింపకపోవుటచేత రాజువైద్యులపైఁ గోపించి వారిని శిక్షింపసాగెను. చిట్టచివరకొక గడుసువైద్యుఁడు రాజువద్దకు వచ్చి వాని దేహముఁ బరీక్షించి "రాజా! ఈ రోగముకుదురునది కాదు. మీరాఱుమాసములలో మృతినొందుదురని చెప్ప రాజువానిపైఁ గడునల్గి నీవుపెట్టిన గడువులోనేనుమృతినొందనిపక్షమున నీశిరచ్ఛేదము చేయించెదను. అంతదనుక చెఱసాలలో నుండుమని వానిని భటులవశముచేసెను. ఆనాఁడు మొదలునిరపరాధులనేకులఁజంపిన యారాజు తాను చనిపోవుదునని భయపడి బెంగపెట్టుకొని క్రమక్రమముగ మునుపటిలా వంతయుఁ గోలుపోయిగడవుకాల మాఱుమాసములనాఁటికి చిక్కిశల్యమై మితి గడచినవెనుకబ్రిదికితినని సంతోషించి వైద్యునిరప్పించి నీశిరచ్ఛేద మెందుకు చేయఁగూడదని యడుగ రాజునకిట్లనియె. "మీశరీరవిషయమయి యేమందును జేయనిపని నామాట చేసినది. మీరుమృతినొందుదురని నేనుజెప్పకపోయినయెడల మీదేహమెప్పటికిని గృశింపకపోవును. నేను మీరోగమును కుదిర్చిన యుపకారిని గనుక శిక్షాపాత్రుఁడనుగాను" ఆమాటలు విని రాజు వైద్యునిచమత్కృతికి సంతసించి వానికిబహుమానముఁ జేసెను.

---

23. వ్రణవైద్యుఁ డొకఁ డనేకుల కంతులు కురుపులుఁ గోసి బాగుచేయుచు రోగులు నొప్పినొప్పియని బాధపడునప్పుడువారిని నొప్పిలేనిదే యూరక యల్లరిచేసెద రేమని పరిహసించుచుండెను. కాలవశమున నీతనికే యొక్కకంతి బయలుదేరగా మఱియొక వైద్యుఁడుదానిని బాగుచేయునప్పుడు, "ఇన్నికంతులు గోసితినిగాని నాకంతి యంత నొప్పి యేదియు లే"దని బాధపడి యేడ్చెను.

---

24. ఒకబ్రాహ్మణుఁడు చిన్నతనమునఁ జదువుకొనక చెడిపో యినీళ్ళుమోసి వంటలుచేసిచిట్టచివరకు వైద్యమునేర్చుకొని "దశమా తాహరీతకి" యనువాక్యము నమ్మి తనవద్ద కౌషధమునకువచ్చినవారి కందరకు గరక్కాయపొడుముతో మందియ్యసాగెను. ఆమందుతిన్న వారందఱు నతిసారముచేత మృతినొందుచు వచ్చిరి. రోగిమృతినొంద గనే వైద్యుఁడును వానిశిష్యుఁడును నాశవమును మోయసాగిరి. ఒక నాఁడు మఱియొకరోగి వైద్యునివద్దకు మందునకు రాఁగాశిష్యుఁడు ముందుగ గురువుతో, "అయ్యా! ఈపర్యాయము నేను కాళ్ళదగ్గఱప ట్టను. తలదగ్గఱనే పట్టెదను. మీరు కాళ్లదగ్గఱ పట్టుట కొప్పుకొ న్నపక్షమున మందిచ్చుటకు నారంభింపుఁడు. లేనిచో నూరకుండుఁ" డ నిపలికెను. రోగి యీమాటలు విని వానిచేతిమాత్రి వైకుంఠయాత్ర యేయని నిశ్చయించి మందుపుచ్చుకొనుట మానెను.

---

25. ఒకరియింట వివాహ మైదుదినములు వైభవముతో జరిగి నపిమ్మట బుక్కావసంతములు పెండ్లివారొకరిమీఁదనొకరు చల్లు కొన నారంభించిరి. అందొకమూఢుఁడు తన యప్పగారిపై, చిమ్మన గ్రోవితో వసంతముఁ గొట్టఁగా నామె వానినిజూచి యిదియేమిరా త మ్ముఁడా! నామీఁద వసంతముఁ జల్లుచున్నావని యడిగెను. ఆపిల్లవాఁ డామెతో నిట్లనియె. "అయ్యో! అక్కయ్యా నీవఁటే! అమ్మయేమో యనుకొని నీపైఁ జల్లినాను. అని యుత్తరముఁ జెప్పెను.

---

26 ఒకకాఁపువానియింటికి బంధు వొకఁడువచ్చి మీకు పశువు లున్నవాయని యడిగెను. కాఁపువాఁడు మావి రామచంద్రిరెడ్డిగారి వి కలిసి వేయిపశువులని బదులుచెప్పెను. వారి వెన్ని మీవెన్నియని యాబంధువుఁడు తఱచి తఱచి యడుగఁ గాఁపువాఁ డిట్లనియె. రెడ్డిగా రివి తొమ్మిదివందల తొంబదితొమ్మిది; మాది యొకక్షుంటియావు.

27. ఒక రాజు తాను పాలించుగ్రామమును జూచుచు నొక యూరికి రాఁగా యూరిపెద్ద లందఱు వానిఁగలసి మాటాడిరి. సామాన్యులకు దర్శనము గాదయ్యెను. నిఱుపేదయగు నొక మొండివాఁ డూరివా రందఱియొద్దకు వచ్చి మీకందఱకుఁ గలుగని భాగ్యము నాకుఁ గలిగినది. రాజుగారు స్వయముగ నాతో మాటాడిరని చెప్పెను. అంతపరమనిర్భాగ్యునితోఁ బ్రభు వెట్లుమాటలాడెనాయని వా రాలోచించుచుండ నందులోనొకఁడు నీతో రా జేమిమాటలాడెననియడిగెను. మొండివాఁడప్పు డిట్లనియె. “రాజుగా రొక్కరు గుఱ్ఱమెక్కి షికారుపోవుచుండ దారిలో నేనడ్డముగా నిలుచుంటిని. అప్పుడాయన నన్నుఁ జూచి, ఓరీ! బుద్ధిలేనిగాడిద! దారిలోనుండి లేచెదవా? లేదా? యని కోపించి యడుగ నేను చిత్తమని తొలఁగితిని. ఇదియే వారు నాతో మాటాడినమాట.

---

28. ఒకపల్లెటూరిలో నొక ముసలిదానియొద్ద నొకకోడియు నొకకుంపటియునుండెను. ఆయూరివారంద ఱామునలిదానికుంపటిలో నిప్పుదీసికొనిపోయి వంట చేసికొనుచు కోడికూతవలన పొద్దు తెలిసికొనుచు నుండిరి. ఆముసలమ్మకు నొకమా టూరివారిపైఁ గోపము రాఁగాఁ దనకోడియుఁ గుంపటిని దీసికొని యెవరికిం జెప్పక చేరువనున్న యడవిలోనికిఁ బోయి యక్కడ నొక చెట్టుక్రిందఁ గూర్చుని దారిం బోవు వారిని బిలిచి నాయనా! ఆయూరిలోఁ దెల్లవారినదా యని యడుగసాగెను. అందఱుఁ దెల్లవారినదని చెప్పఁగావిని తనకోడిఁయుఁగుంపటియు లేక యక్కడ నెట్లు తెల్లవారెనని యాశ్చర్యపడఁ జొచ్చెను.

---

29. ఒక రాజుగారి యన్నసత్రమున కన్నములేక యాఁకలిచే బాధపడువారం డ్రనేకులు వచ్చి యన్నమన్నమని కేకలు వేయసాగిరి. కొందఱు మూఁడుదినములనుండి యన్నములేక బాధపడుచుంటిమనిరి.

కొందఱా వేళ ప్రొద్దుటనుండియుఁదిన లేదనిరి. అవ్యక్తుఁడయినయారాజు వారి మొఱలు విని మూఁడునాళ్ళనుండి భోజనము చేయనివారింకొకనాఁడైన నుండఁగలరు. ప్రొద్దుటినుండి యన్నము తిననివారికి ముందుగఁ బెట్టుఁడని యానతిచ్చెను.

---

30. తెలివిమాలిన యొక కుఱ్ఱవాఁడు తనకుఁ బొట్టగడవకపోవుటచే నొక యుద్యోగస్థునివద్ద వంటఁ జేయుటకయి కుదిరెను. ఉద్యోగస్థుఁడు వానిని దనయొద్ద నుంచుకొని యొకనాఁడు వానినిబిలిచి రెండర్ధణా కానులనిచ్చి యొకదానికి పెరుఁగును నొకదానికి నేయియుఁగొని తెమ్మని పంపెను. వాఁడు సరెయని రెండింటికి రెండుగిన్నెలఁదీసికొనక యొకగిన్నె నే తీసికొని కొంతదూరముపోయి యేదియో సందియము మనసునకుఁ దగులఁగా వెనుకకు మరలిపోయి యజమానునితో నిట్లనియె. "అయ్యా! యేయర్ధణాకు నేయి తేవలెనో యేయర్ధణాకు పెరుగు తేవలెనో నాకు స్పష్టముగాఁ దెలియలేదు. అదినాకుసరిగాఁజెప్పుఁడు" అని యడుగ నామాటలువిని తన సేవకుని తెలివిఁ దెలిసికొని యజమానుఁడు నవ్వి కుడిచేతిలో నొక యర్ధణాయు, నెడమచేతిలోనొక యర్ధణాయుఁబెట్టి మొదటిదానికి పెరుగు రెండవదానికినేయియుఁదెమ్మనెను. ఆవిధముగానే యట్లు చేతులుకదపకుండ నతఁడాగిన్నెను దీసికొని బజారునకుఁబోయి గొల్లదానివద్ద నొక యర్ధణా పెరుగు పోయించుకొని యొక కోమటియంగడికిఁ బోయి యొకయర్ధణానేయియిమ్మని యడిగెను. నేయి యెక్కఁడ వేయుమన్నావని వర్తకుఁడడుగని దిగో యిక్కఁడవేయుమని వంటవాఁడు గిన్నె తిరుగవేసి యడుగుమట్టుఁ జూపెను: కోమటియాయర్ధణా తీసికొని యందు నేయివేసి పంపెను. వాఁడింటికి వచ్చి యజమానునకు నేయిఁ జూపఁగా నతఁడు పెరుగేదని యడిగెను. ఇదిగో పెరుగని గిన్నె తిరుగవేసి మరల నతఁడు చూపె

ను. అప్పుడు సేవకుని జ్ఞానముఁ గనిపెట్టి యజమానుఁడు నవ్వుచు ఓ రీ! నీవంటి తెలివిగలవాఁడు నాకెప్పుడును దొరకలేదురా!" అని చెప్పెను. వెంటనేవాఁడు యజమానునితో, "అయ్యా! నీవు తెలివిగల వాఁడవని నీయజమానుఁడు మెచ్చుకొన్నప్పుడు జీతము వృద్ధికయియ డుగుమని మావాండ్రు నేవచ్చునప్పుడు చెప్పిరి. ఇప్పుడు నా తెలివికి మీరు సంతోషించితిరిగనుక నాకేదైనను జీతము వృద్ధిచేయుఁ" డని యడిగెను.

---

౩౧. వేదపండితుఁడగు నొకవిప్రుఁడు పరమలుబ్ధుగు నొకలౌక్యుని తనకేమైన నిమ్మని యాచించె. ఆలోభి యాబ్రాహ్మణపిశాచము నెట్లయిన వదలించుకొనవలెనని, "అయ్యా! ఇదివఱకు మేమిచ్చునట్టివారి కేకాని తదితరులకు మేమియ్యము. క్రొత్తమామూళ్ళు పెట్టుటకుమా కిష్టములేదు" అని చెప్పెను. వైదికుఁడు లోభితో, "అయ్యా! నాకు నిరుడు మీరిచ్చినారు. ఇది క్రొత్తమామూలుకా" దని పలుక సమయోచిత బుద్ధిగల యాపిసినిగొట్టు "నిరుడిచ్చినవారి కీయేడియ్యము. క్రొత్తవారి కియ్యవలయుఁగాని యెప్పుడు ప్రాఁతవారి కిచ్చుట మంచిది గాదు పోపొ"మ్మని పలికెను.

---

౩౨. ఇద్దఱన్నదమ్ములు మృతినొందిన తమతల్లికి నుత్తరక్రియలు చేయుచుండఁగా పురోహితుఁడు గోదాన మిమ్మని వేఁడెను. అప్పుడు తమ్ముఁ డన్నగారిచెవులో మెల్లగా నిట్లనియె. "అన్నయ్యా! నిరుడు మందలోనుండి తప్పిపోయిన యావును వీనికి ధారవోయుదమా?" అన విని యన్నగారు తమ్మునిపైఁ గోపపడి ఓరీపిచ్చివాడా! తప్పిపోయిన యావును మఱలవెదకి యీబ్రాహ్మణుఁడు తెచ్చుకొనఁగలఁడు. కాఁబట్టి నిరుడు దొమ్మతగిలి చచ్చిపోయిన యావును ధారవోయుదమని పలికెను.

---

33. ఒక బ్రాహ్మణుఁడు కుటుంబరక్షణముఁ జేసికొను నుపాయ మేదియుఁదోఁచక చాలకాలము యోచించి చివరకు పదియంతస్తుల గోపుర మొకటి కట్టించెదనని చందాలకు బయలు దేఱి తనపాలమునఁ బొట్టపోసికొనుచుండెను. అతఁడొకనాఁడొక కోమటియొద్దకుఁబోయి తనసత్కార్యమంతయు నాతని కెఱిఁగించి చందాయిమ్మని యడుగఁగా గడుసుదనమునకుఁ బుట్టినిల్లగు నాకోమటి వానిటక్కరితనముఁ దెలిసి కొని చమత్కారముగా నిట్లనియె. "అయ్యా! ఇటువంటి మహాత్కా ర్యములకుఁ జాలికపూపాయలు నేఁబదిరూపాయలు నిచ్చిన నేమికా ర్యము? పేరు చిరకాలము భూమిలోనిల్చునట్లు దానముచేయవలయు ను. తొమ్మిదియంతస్తులు మీరు గట్టించి నాయొద్దకురండు పదవ యంతస్తు నేనే కట్టించెదను.'' అని పలికెను. బ్రాహ్మణుఁడు నోరెత్తు టకు వీలులేక వచ్చినదారిని బోయెను.

---

34. ఒకనగరము పాలించు రాజుగారికి లేకలేక యొకకొడుకు పుట్టెను. బ్రాహ్మణులకుఁ బలుపిండివంటలతోను క్షీరాన్నముతోను సంతర్పణముఁ జేయవలయునని రాజు నిశ్చయించి "యూరనున్నప్రతి కోమటి సేరుపాలు తేవలయు"నని యుత్తరవుచేసి యొకబానవొకగది లోఁ బెట్టించెను. ఊరిలోనున్న వైశ్యులందఱుఁ జిక్కనిపాలఁదెచ్చిబా నలోఁ బోయుదురుగదా? నే నొక్కఁడను మాత్రము పాలుపోయక సేరు నీళ్ళను మాత్రము పోసెదను. అన్నిపాలలో నానీళ్ళెట్లానవాలు తెలియును?" అని ప్రతికోమటి తనలోఁ దానాలోచించుకొని సేరు సేరు నీళ్ళు దెచ్చి బానలో పోసెను. మధ్యాహ్నము రాజుగారు బానచూ చునప్పటికి దానినిండ నీరము లేకాని క్షీరములు లేవయ్యెను. రాజువై శ్యుల నందఱ నడుగఁగా ప్రతివాఁడుఁ దాను మంచిపాలు తెచ్చి బానలోఁ బోసితినని చెప్పి యొట్టు పెట్టుకొనఁ జొచ్చెను. చిట్టచివరకు

రాజు శిక్ష విధింతునని భయముపెట్టగా నందఱు దమనేరము నొప్పు కొనిరి.

---

35. పూర్వకాలమున నాటున బ్రయాణము చేయవలసిన దినములలోఁ బిల్లికి బిచ్చముఁబెట్టని పిసినిగొట్టు కోమటియొకఁడు కొడుకును వెంటఁబెట్టుకొనికోనసీమనుంచికొబ్బరికాయలు పట్టించుకొనివానిని విక్రయించుటకు గోలకొండకు బోవుచుండెను. మార్గమునఁగుమారుఁడు,దాహముచేత బాధపడి చుట్టుప్రక్కలనెక్కడనీళ్ళుదొరకకపోవుటచే నొక లేతకొబ్బరికాయ కొట్టుకొని నీళ్లుత్రాగనిమ్మని తండ్రినడిగెను ఒకకాయపోయినచో నొకయణా లాభముపోవునని తండ్రివానినాలాగునఁ జేయనీయక యదిగో యూరు. ఇదిగోచెరువు తొందరపడకుమని ధైర్యము జెప్పి కాలముఁబుచ్చెను. కొంత సేపటికిఁగొడుకు వడదగిలి నోరెండిపడి చచ్చెను. అప్పుడు వైశ్యుఁడు కొడుకుపైబడి యన్ని కొబ్బరికాయల నీళ్ళు నీవే తాగరా ! అయ్యల్లో ! అని యేడ్చెను.

---

36. పదిమందికోమట్లొకపుణ్యక్షేత్రమునకుఁబోయియచ్చటియాలయములన్నియుఁజూచి తుదకొక పాడుగుడిలోనికిబోయి యక్కడతిరుగుచుండఁగా వారిలో నొకఁడు విఘ్నేశ్వర విగ్రహముయొక్క బొడ్డులో వ్రేలుపెట్ట వెంటనే వాని నొక తేలు పోటుక్కునఁ బొడిచెను. కొంటిపని జేయుటవలనఁ దనకుఁ దేలుకుట్టినదనిచెప్పుకొనుటకభిమానపడి యాయుపాయశాలి యొకపన్నుగడపన్నెను. ఆహాహా! ఈబొడ్డులో వ్రేలుపెట్టినతోడనే నావ్రేలి కేదోసువాసన యంటుకొన్నది అని మాటిమాటికిఁ జేయి జాడించి ముక్కుదగ్గఱ పెట్టుకొనుచు నందఱినూరింపసాగెను. ఆసువాసన దమ వ్రేళ్ళకుఁగూడ నంటించుకొనఁదలఁచి యొక్కొక్క కోమటి యాబొడ్డులోఁ జేయిపెట్టి తేలుకుట్టగానే వెనుకటి వానివలెనే కుట్టినట్లు చెప్పక సువాసన మఱియు నెక్కువగాఁ

బరిమళించుచున్నదని ప్రిజ్ఞలుచెప్పసాగిరి. చిట్టచివరవాఁడు బాలుఁడగు టచేఁ దేలుకుట్టగానే మొఱ్ఱోయని యేడ్చి యల్లరిచేసెను. అప్పుడందఱు నాకు తేలుకుట్టినది నాకు తేలుకుట్టినదని చెప్పుకొని యొకరినొకరు గౌఁగిలించుకొని యేడ్చిరి.

---

37. ఒక కోమటి తురకభాష నేర్చుకొనవలయునని యుత్సాహపడి తనకది నేర్పునని యొకమహమ్మదీయుని బ్రతిమాలెను. మాటకొక యణాయిచ్చినచో నట్లు చేసెదనని తురకచెప్ప కోమటి దాని కంగీకరించి నేర్చుకొనుచు ననవసరముగ గురువున కణానియ్యనక్కర లేకుండ నతఁడొకమాట చెప్పగానే దానిసంబంధము గలమాటలు తానే బుద్ధికుశలతచేత గ్రహించుచుండెను. ఒకనాఁడు తురకవాఁడు గుఱ్ఱమునకు ఘోడా యందురు. అని చెప్పగానే కోమటి సరే! ఇక మీరు జీనుకుఁ జెప్పనక్కర లేదు. అనితనలో గ్రహించుకొని మఱునాఁడు మహమ్మదీయుఁడు "తేల్" అనగా,నూనెయని చెప్పగానే వైశ్యుఁడు సరేచాలును. తేలు నూనైనప్పుడు పాము నేయి యగునని తనలో గ్రహించుకొని యీవిధముగఁ గొంతభాష నేర్చుకొనియెను. ఒకనాఁడు మఱియొకతుఱక నేయితూచియిమ్మని కోమటి నడుగ నతఁడు తూచి తనహిందూస్థానీ పాండిత్యము జూపవలెనని నేయిపుచ్చుకొనుడని తెనుఁగుతో ననుటకుమారు పాంపకడోజీ యనితురకభాషతోఁ బలికెను. కోమటి యభిప్రాయ ప్రకారము పా మనగా నేయియైనను తురకభాషలో పామన పాదమున కర్థమగుచే నన్ను గాళ్లుపట్టుకొమ్మందువాయని తురక మండిపడి కోమటిని దవడ వాచునట్లు రెండులెంపకాయలు కొట్టెను. అప్పుడు సగముసగము జ్ఞానమపాయకరమని కోమటి తెలిసికొని తురకభాష మాటలాడుట మానెను.

---

38. అత్తరువెట్టులుండునో యెన్నఁడుఁజూచి యెఱుఁగక పేరు మాత్రమువిన్న యొకపిన్నవాఁడు తనకత్తరువుగొనిపెట్టుమని ముసలి దగుతనతల్లినడిగి మారముపెట్టెను. ఆముసలమ్మ యొకయత్తరుసాహేబును బిలిలి ‘నాయనా! మాకుఱ్ఱవాఁడత్తరు తెమ్మని నన్ను వేధించుచున్నాఁడు ఒకడబ్బత్తరిందులో వేయు’మని పెద్దరాచిప్ప తెచ్చి వానియెదుట బెట్టెను. అత్తరువర్తకుఁ డామె యమాయకత్వమునకుఁ గడుపు పగులునట్లు నవ్వి లేచిపోయెను.

---

39. ఒకయూరిలో నొకబీద బ్రాహ్మణునిపై సభాపతులందఱుఁ గట్టుకట్టి యతఁడు శూద్రునియింట మంచినీళ్లు త్రాగినాఁడని యపవాదము మోపి వెలివేసి వానినిమరలకులములోఁ జేర్చుకొనుట కేఁబదిరూపాయలు వానివలన దండుగ పుచ్చుకొని యదిచాలక వానిచేత నొకసంతర్పణము చేయించి వారందఱు భోజనమునకువచ్చిరి. ఆపేద బ్రాహ్మణుఁడు తనకు సభాపతులు చేసిన యన్యాయమునకు మనసులో దుఃఖపడి బ్రాహ్మణుల కాపోశనమువడ్డించునపుడుశూద్రులయింట నీళ్లుత్రాగినదండుగ ‘దేవతాస్వరూపాబ్రాహ్మణాః అమృతమస్తు అని వడ్డించెను. సభాపతులందఱు తెల్లఁబోయి యిదియేమియని యడుగ నతఁ డిట్లనియె. అయ్యా! ఆపోశన నే దేవునిపేరు చెప్పి వడ్డింపను? ఇది కాశీసంతర్పణముగాదు. రామేశ్వరసంతర్పణముగాదు వేంకటేశ్వరదీపారాధనము గాదు సత్యనారాయణవ్రతముగాదు, ఎందుచేత మీరీకార్యమునాచేతఁ జేయించిరోయదియేయిందుదాహరించితిని. అని పలుక నామాటలు విని సభాపతులు సిగ్గుపడిరి.

---

40. ఒకనాఁడు కైలాసపర్వతముమీఁద శివుఁడు పార్వతీసమేతుఁడై దేవగణమధ్యమునఁ గూర్చుండఁగా శనియక్కడకువచ్చి తనయనుగ్రహమును దప్పినవారందఱను దానన్నివిధముల బాధించెదనని ప్రజ్ఞ

లు పలికేను. శివుఁడు వానిఁజూచి "ఓరీ నన్నుఁగూడ నీవు బాధపెట్ట గలవా? అట్లయిన నొక నెలదినములలోపల నన్ను బాధపెట్టు? నీవ్రిజ్ఞ జూతము." అనిపలికెను. శని సరేయని వెడలిపోయెను. శివుఁడు వీఁడునన్నెట్లుబాధించునో వీనికిఁ గనఁబడకుండ దాగొనియెదనని కైలాసపర్వతము విడిచి యొకయరణ్యములో మాఱుమూల నొక గోతిలో నెలదినములు దాఁగి గడవు గడచిన వెనుక మఱల తన విడిదికి వచ్చి శనిని బిలిపించి ;యోరీ నన్ను నీవు బీడింపలేకపోయితివేమిరా! అని యడిగెను. శని పక్కున నవ్వి, ,అయ్యా! ముప్పదిమూఁడుకోట్ల దేవతలు సేవింప నఖండ వైభవముతో వెండికొండపైఁ గూర్చుండు నీవు కాఱడవిలో నొకపాడు గోతిలో దాఁగొనుట నీకు శని పీడగాక మఱేమి? శని మహిమ యింతకంటెఁ బ్రకటిత మగుట యెట్లని పలికి పోయెను.

---

41. సంగీతమున మిక్కిలిప్రజ్ఞగల దక్షిణదేశస్థుఁ డొకఁడు వేదము నేర్చుకొనవలయునని యుత్తరదేశమునకుఁ బోవుచుండెను. వేద మెనుబది రెండు పన్నములు గట్టిగా వల్లించిన యొకయుత్తర దేశ బ్రాహ్మణుఁడు సంగీతము నేర్చుకొనుటకు దక్షిణదేశమునకుఁ బోవుచుండెను. వారిరువురు నడుమ నొకసత్రములోఁ గలిసికొని యొండొరుల యభిప్రాయమెఱిఁగి యొకనివద్దనున్న విద్య రెండవవానికి నేర్పునట్లొ బంబడిక చేసికొనిరి. ముందుగా వేదపండితుఁడు సంగీతపండితునకుఁ వేదము జెప్పనారంభించి 'నవోనవోభవతి' యను పనస చెప్పెను. పాటకుఁడు వేదస్వరమును గ్రహింపలేక యాపనసకు సరిగమపద యను స్వరకల్పనఁ జేసి గురువులఘువు చేసి లఘువుగురువు చేసిపాడనారంభించెను. అనంతరముగాయకుఁడు వేదవేత్తకు సంగీతము నేర్పఁదలఁచి ఎరీతిబొంకేవురా నాస్వామి; యనుజావళి నారంభింప వైదికుండు సంగీతస్వరములు నుచ్చరించుటకు కంఠము త్రిప్పుకొనలేక ,ఎరీతి, ఎరీతి,

ఏరీతియని వేదము చదివినట్లు చదువనారంభించెను. గాయకుఁడు నీకు సంగీతము రాదు. పోయని తిరస్కరింప, వైదికుఁడు నీకు వేదము రాదుపోయని మఱలఁ దిరస్కరించెను.

---

42. కూలిపనివల్ల జీవనముచేయు నొకమనుష్యుఁడు వేసవికాలమందు మధ్యాహ్నమున నెత్తిమండునట్లుగ నిల్లు నేయుచుండెను. వృద్ధుఁడగు వానితండ్రివచ్చి నాయనా! యింత యెండలో పనిచేయవద్దు. నీకు రోగము రాఁగలదు. అని బ్రతిమాలుకొనెను. ఆపడుచువాఁడు తండ్రిమీఁదఁ గోపపడి "నే నెండలోమాడిన నీకేమి? రోగము నాకువచ్చునుగాని నీకు రాదుగద" అని బదులుచెప్పెను. అప్పుడు వృద్ధుఁడు మిక్కిలిచింతించి యింటిమీఁదనుండి కొడుకును దింపు నుపాయమువెదకి చంటిపిల్లవాఁడగు తనకుమారునికుమారునిఁదీసికొనివచ్చి యెండలోనొకగుడ్డమీఁదఁబండుకొనఁబెట్టెను. తనచిన్నకుమారుఁ డెండలో మలమల మాడుచుండుటం జూచి తండ్రినిఁ బిలిచి కోపముతో నీవు మనుష్యుఁడవుకావా! ఎండలోమాడ్చి, పిల్లవానిని జంపివేయుదువా? యని యడిగెను. అప్పుడు వానితండ్రి వాని కిట్లనియె. పిల్లవాఁడు మాడిన నీకేమి! నీవు మాడుటలేదు గద. ఓరీమూర్ఖుఁడా! నీకుమారుఁడు బాధపడినప్పుడు నీ కెంతకష్టముగ నున్నదో నాకుమారుఁడు బాధపడినప్పుడు నాకు నంతె కష్టముగ నున్నది. నీవింటిమీఁద నుండి దిగితివా నీకుమారు నిక్కడనుండి తీసెదను. ఆమాటలు విని కూలివాఁడింటిమీఁదనుండి దిగెను.

---

43. ఇద్దఱన్నదమ్ములు పితార్జితమైన యాస్తినంతయుఁ బంచుకొనుచు ముసలి మేనత్తనుగూర్చి తగవులాడిరి. ఇద్దఱును మేనత్తను దమతమవద్ద నుంచుకొనుటకయి ప్రయత్నించిరి. తుదకు వారికివంతు తెగనందున మూర్ఖుఁడగు జ్యేష్ఠుఁడు తమ్మునితో మనకీతగవులాటయెందుకు? నాకొక దివ్యమైన యుపాయము దొరకినది. మనమేనత్తను రెండుభాగములుచేసి చెరియొక సగము, బుచ్చుకొందము; అని

 

చెప్పెను. ఆమాటలువిని రెండవవాఁడు విస్మయపడి, "అన్నయ్యా! మనపంపకముమాట దేవుఁ డెఱుఁగును; కాని నిష్కారణముగా మున లిదానిని జంపఁబోకుము. కావలసినయెడల నా మేను నీవద్దనే యుంచు కొమ్మని చెప్పెను.

---

44. ఒక కాఁపువాఁడు తనకొడవలి యెండలోనుండి కాలుట చే దానిని జల్లార్చుటకుఁ జెఱువులో ముంచెను. మూర్ఖుఁడగుమఱియొ కఁ డదిచూచి వేడియెక్కిన పదార్థములను జల్లగాఁ జేయుట కదియే యుపాయమని నమ్మి జ్వరముచే బాధపడుచున్న తనతల్లిని రెం డుచెక్కలకుఁ ద్రాడుగట్టి నూతిలో ముంచెను. తల్లి జ్వరము చప్పగా వదలి కొయ్యయై పోయెను.

---

45. ఎంతకాలమునకుఁ బెండ్లి కాకపోవుటచే నొక బ్రాహ్మణుఁడు కొన్నాళ్ళునీళ్ళు మోసి కొన్నాళ్లు వంటచేసి కొన్నాళ్లు పీనుఁగులమో సి శరీరమునందు జవసత్వము లుడిగిన వెనుక, పనిచేయుట కోపిక లేమి పొట్ట గడియనందున సన్యసించినచో నందఱు గౌరవించి పిండివంటల తో మెక్కబెట్టుదురని శిఖాయజ్ఞోపవీతములు పరిత్యజించి కాషాయ వస్త్రములఁ గట్టుకొని భిక్షుల నారగింపఁ జొచ్చెను. ఒకనాఁడొక బ్రా హ్మణునియింటఁ బంచభక్ష్యపరమాన్నముతో భిక్షనారగించిస్వాము లవారు సుఖముగాఁ గూర్చుండఁగా యజమానుఁడువచ్చి 'స్వామీ! భగవద్గీతల నొకసారి పుచ్చుకొని మమ్ము ధన్యులఁ జేయుదురా? యని యడిగెను. స్వాములవారు భగవద్గీత లనుశబ్దము జన్మమధ్య మం దెన్నడును వినియుండక పోవుటచే నదియేదో క్రొత్తపిండివంట యనుకొని 'అబ్బా యిదివఱకే యుదాత్తముగా నున్నది. ఇప్పుడు పుచ్చుకొనను. సాయంకాలమునందు భుజించెద' నని పలికెను.

---

56. ఒక ఛాందసబ్రాహ్మణుఁడు తనవద్దనదివఱకున్న పాలేరులను మాన్పించి క్రొత్తగా నూకఁడు చిననూకఁడను పేర్లుగల యిద్దఱు మాలవాండ్రను పనికై యేర్పఱచి రాత్రులు కుప్పఁగాయుచుపొలములోఁ బండుకొమ్మని వాండ్ర కాజ్ఞాపించెను. వాండ్రుసరిగాఁబనిచేయుచున్నారో లేదో పరీక్షించుటకై యతఁడర్ధరాత్రమునఁ బొలమునకు బోయి చూచునప్పటికి దొంగలు కుప్పనొల్లుకొని పోవుచుండిరి. పాలేరులిద్దఱు నిద్రించుచుండిరి. బ్రాహ్మణుఁడు వాండ్ర నిద్దఱ లేపఁదలఁచి యామాలలపేర్లుచ్చరించుట కిష్టములేక సంస్కృతముతోఁబిలువనిశ్చయించి తండులర్ధంగో తగర్ధంగో యని కేకలువేయ నారంభించెను. బ్రాహ్మణుఁ డేదియో చదువుకొనుచున్నాఁడు కాఁబోలు మనకెందుకని మెలకువ వచ్చియుఁ బాలేరులు పలుకరైరి. దొంగలు కుప్పదోఁచుకొనిపోయిరి. మఱునాఁడుదయమున బ్రాహ్మణుఁడామాలలను బిలిచి రాత్రి బిలిచినను బలుకనందుకు దండింపఁగా వాండ్రిద్దఱు మమ్ముమీరు పిలువనేలేదని మొఱపెట్టిరి. శుద్ధసంస్కృతముతోఁ బిలుచుట తన తప్పే యని బ్రాహ్మణుఁడు నోరుమూసికొని యూరకుండెను.

---

47. ఒక యిల్లాలు విస్తరిముందఱనెంతోసేపుకూర్చునిభోజనముచేసెడి యలవాటు గలిగియుండెను. ఒకనాటిరాత్రి మగవారిభోజనము లయినవెనుక నామె భుజియింప నారంభించి యెంతసేపటికి లేవదయ్యె. కొంతసేపటికిపాలేరులువచ్చి 'పశువులను విప్పివేయండమ్మా' యని కేకలువేసిరి. అంతలోఁ గాకులు గూసెను. ఆయిల్లాలికిఁ బాలేరుల కేకలకును కాకుల కూతలకును గోపమువచ్చినందున మండిపడి 'విచిత్రపుకాకులు విడ్డూరపుపాలేళ్ళు. రెండుజాములైనను గాకమునుపే 'పశువులను దోలుకొనిపోదురా? యని చేయికడుగుకొని వాకిటకు వచ్చునప్పటికిఁ దెల్లవారుచుండెను.

---

48. పల్లెటూరికి భాగవతులువచ్చి జలక్రీడలాడుచుండఁగా గన్నులు చెవులు లేని యొకముసలి దాయాటచూడఁగోరితన్నచ్చటకు దీసికొని పొమ్మని యొక పడుచుదానిని వేఁడుకొనెను. ఆపడుచుది ముసలిదానితో నీకక్కడ నేమి కనఁబడును. ఏమివినఁబడును. అక్కడకువచ్చి నీవేమి చేయుదువు? అని యడిగెను. ముసలిది దానితో నినిట్లనియె. నాకు కన్ను, చెవి లేనిమాట నిజమేకాని యందఱితో పాటు వచ్చి కూర్చుండవలెనని యున్నది. అందఱు నవ్వినప్పుడు నన్ను నీవు గిల్లుచుండుము. అప్పుడు నేనును నవ్వుచుందును. ఈసదుపాయము నీవునాకుఁ జేయుము. ఆమాటలు విని పడుచుది తాను హాయిగనాటకముఁ జూడకుండ ముసలి దెక్కడ దాపురించెనని విచారించి తీసికొనిపోయినచో తన్ను జలక్రీడలు చూడనీయక బాధపట్టునని తలఁచి దానిని దీసికొనిపోయి యొక రేఁగుచెట్టు మొనట గూలనైచి యిక్కడనే యాటయని చెప్పెను. గాలికి రేఁగుకొమ్మ లల్లలాడినప్పుడెల్ల ముసలిదానికి ముండ్లు గుచ్చుకొనసాగెను. ముసలి దవిముండ్లని యెఱుఁగక నవ్వఁదగిన యంశము వచ్చుటచే పడుచుది తన్ను గిల్లుచున్నదనుకొని 'ఇహిహీ' యని యికిలింప నారంభించెను తెల్లవారిన వెనుక రెండుగడియల పొద్దెక్కినను ముసలి దట్లే యికిలించుచుండెను. త్రోవనుబోవువారందరామెను జూచి నవ్వి యిదియేమని యడుగఁగా, 'అయ్యా! భాగవతము జూచుచున్నాను. ఎంతో బాగానుండుటచే నవ్వుచున్నా' నని బదులుచెప్పెను.

---

49. ఒకయూర నొకబ్రహ్మచారి యాయవారముచేసిజీవనము చేయుచుండెను. వానియింటిప్రక్కనున్న కంసాలి యొకఁడు బ్రాహ్మణునితో మైత్రిచేసి వానికెట్లయినాఁ బెండ్లిచేయవలెనని నిశ్చయించుకొని వానియొద్దనున్న రాగిచెంబు తెప్పించి కరగించికొన్నికణికలుగా జేసి వాటికిబంగారుమలామాచేసి మఱల బ్రాహ్మణునిచేతికిచ్చి యా

తనివద్ద కణిక లున్నవని వాడుకచేసెను. పుట్టినయాఁడుపిల్లల నందఱి నమ్ముకొని జీవనముచేయు నొకబీదబ్రాహ్మణుఁడావాడుక విని యది నిజమని నమ్మి కంసాలివద్దకువచ్చి యాయవారపుబ్రాహ్మణునకు నా కూఁతు నిచ్చి వివాహముచేసెదను. నాకు రెండు బంగారపుకణికె లిప్పించెదవా? యని యడిగెను. ఆలాగే యిప్పించెద ననిచెప్పి కంసాలి బ్రహ్మచారి నొప్పించి రెండుకణికలు తెచ్చి కన్యాప్రదాతకిచ్చెను. అంతట నొకసుముహూర్తమున వివాహముజరిగెను. నాగవల్లినాఁడు పేరఁటాండ్రు వప్పగింతపాటలు పాడుచుండఁగాఁ బెండ్లికూఁతురు వారి పక్షమున వచ్చినయొక ముత్తయిదువ వేళాకోళముగా 'కణికెలే మా సొమ్ము కాంత మీసొమ్ము' అని పాడెను. పెండ్లికొడుకువారిపక్షము న నక్కడనున్నకంసాలి మఱల వేళాకోళముగా 'లబలబలు మీసొమ్ము లక్ష్మి మాసొమ్ము' అని పాడెను. ఆమాటలు వినగానే కన్యాప్రదాత కు గుండెలు జల్లుమనగా నప్పుడూరకొని మఱునాఁడు మఱియొకకం సాలియొద్దకుఁబోయి కణికెలు పగులఁగొట్టించి చూచి పంచపాత్రలు చేసికొనుటకుఁ బనికివచ్చు మంచినాగియేకాని బంగారము లేదనిచెప్ప దురాశ దుఃఖమునకు చేటని విలపించెను.



50. బెల్లము తన్నందరుఁ దినుచున్నవారని విచారించి తన కష్టి కష్టము గలుగకుండఁ జేయుమని బ్రహ్మదేవుని బ్రార్థించుటకు బ్రహ్మ లోకమునకుఁ బోయెనఁట. బ్రహ్మదేవుఁడు దాని విజ్ఞాపనమువిని బెల్ల ముతో నిట్లనియె. ఓసీ! నీవు చాటుననుండి మాటలాడుము. ఎదుట నుంటివా నాకును నిన్ను దినుబుద్ధిపుట్టఁగలదు. అని చెప్పి యవ్వల కుఁబంపెను.



51. దుష్టబుద్ధిగలయొక నీచుఁడు గొప్పయుద్యోగముచేయుచు భార్యమాటలు విని తల్లిదండ్రుల నింటనుండి లేవగొట్టి గుఱ్ఱాలసాల లోనుంచి ప్రతిదినము తండ్రియొక మూఁకుడుపట్టుకొని తనయింటికి

వచ్చి యందన్నము వేయించుకొని మఱల సాలలోనికిఁ దీసికొనిపోయి యక్కడ భార్యతోఁగలిసి తినునట్లాజ్ఞాపించెను. ఉద్యోగస్తుని కొడుకు పిన్నవాఁడయ్యుఁ దనతాతయవస్థకుఁ జింతించి యేమియుఁ జేయలేక యూరకుండెను. ఒకనాఁడు వృద్ధుఁడు మూకుడు పట్టుకొని యన్నము నకువచ్చుచుఁ గుమారుని యింటిగుమ్మపు గచ్చుమెట్ల మీఁదఁ బడి మూకుడు పగులఁగొట్టుకొనెను." అప్పుడు మనుమఁడు మహాకోపము తోఁ గఱ్ఱ దీసికొనివచ్చి తన తాతతో, ఓబుద్ధిమాలినవాఁడా! యీ మూకుడుపగులఁగొట్టితివిగదా. నేనేమిచేయుదును. మాతండ్రిని గు ఱ్ఱాలసాలలోనుంచి గంజి పోయుటకు నేను మరల డబ్బు ఖర్చుచేసి యొకమూకుడుకొందునా? తాతకుఁబోసిన బోలెఁ దరలెనము నుండవ ద్దా; కనుక యీపెంకులన్నియు మూకుడుగ నతుకుము. లేనిచో జాగ్రత్త' యనిబెదరించెను. ఉద్యోగస్తుఁడు కొడుకును బిలిచి నాయ నా! నన్ను గుఱ్ఱాలసాలలో నుంచి గంజిపోయుదువఁటరా యని యడి గెను. కొడు కామాట విని, నాయనా నీకునీతండ్రి యెంతో నాకు నాతండ్రియు నంతే. 'ఆవశ్యం పితాచార'మ్మనుమాట నెఱుఁగవా? యని బదులుచెప్పెను. ఉద్యోగస్తుడు కొడుకుమాటలువిని సిగ్గుపడిబు ద్ధితెచ్చుకొని తల్లిదండ్రుల నింటనుంచి సంరక్షించెను.

---

52. ఒకగురువునొద్ద తెలివిమాలినశిష్యులిద్దఱుండిరి. గురువువారి నిద్దఱి నొకనాఁడు సమిధలు తెమ్మని దగ్గఱయడవికిఁ బంపెను. అడివి కిఁ బోయినతోడనే వారికొకజింక కనఁబడెను అదివఱకెన్నడును జిం కను జూడని పరమవైదికులగుటచే వారుదానినిజూచి విస్మయపడి వ చ్చినపని మఱచి యది యేజంతువగుననిచర్చింపఁదొడఁగిరి. ఒకడేనుఁ గుపిల్లయనెను. ఇంకొకఁడేనుఁగైనచో తొండ మేదిరాయని యాక్షేపిం చి యది సింగపుఁబిల్ల యనెను. సింహమైనచో జూలుండవలదా య ని మొదటివాఁడు వానిమాట పూర్వపక్షము చేసెను. ఇట్లుతమలోఁ

దారు వివాదపడి వాదము తెగనందున సందేహనివృత్తిచేసికొనఁదలంచి వెనుకపాటున దానిని బట్టుకొని యంగవస్త్రముతోఁగట్టి మోసికొని పోయి తమరాక కెదురుచూచుచున్న గురువుముందర బడవైచి యది యేజంతువో చెప్పుమనిరి. గురువు దానికట్లు విప్పించి చక్కఁగాఁ బరీక్షించిచూచి శిష్యులతో నిట్లనియె "ఓరీ నిర్భాగ్యులారా! మీకుఁ బ్రపంచజ్ఞానమే లేదేమి? ఇది సింహముగాదు. ఏనుఁగుఁదాదు. మనయూరి చెరువులోఁ బారవేయుఁడు. ఎగిరితే కప్ప మునిఁగితే కాకి.

---

53. ఒకసంపన్నునియింట ననేకులు కూలివాండ్రు పనిచేయు చుండిరి. మూర్ఖుఁడగు నొకకూలివాఁడొకదినమున పని కాలస్యముగ వచ్చెను. యజమానుఁడు వానిని బిలిచి "ఓరీ! నీ వింతయాలస్యముగ నేలవచ్చితివి? నీతోడికూలివాండ్రందఱు నీకన్న నొకగంట ముందువచ్చిరి. ఈలాగున పొద్దుపోయి వచ్చినచో పనియెట్లగు ననికోపపడి మందలించెను. ఆకూలివాఁడు రోషముదెచ్చుకొని "బాబూ! నేను పనిదొంగనుగాను; వాండ్రందఱు ముందువచ్చిరని నన్ను గసరనక్కరలేదు. నాయాలస్యము కూడివచ్చునట్లు నేనీవేళ నొకగంట వాండ్రకన్న ముందుగా వెళ్ళెదనులెండి" యని బదులుచెప్పెను.

---

54. ఒకపల్లెటూరికాఁపువాఁ డొకపట్టణమునకుఁబోయియెఱిఁగిన బ్రాహ్మణుని యింటబసచేసి నాగరకతగా మాటలాడవలయునని "అయ్యా! ఒక మంచమీలాగున వడ్డించండి. ఒకతలగడా వడ్డించండి. ఒకచెంబు వడ్డించండి" అని తనకుఁగావలసిన వస్తువులన్నియు వడ్డించుమని యడుగుచుండెను. ఆబ్రాహ్మణుఁడు వాని మూర్ఖతకు విస్మయపడి నీవు మహిషములాగున నున్నావు సుమీ యనెను. అప్పుడు కాఁపువాఁడు తన్నాబ్రాహ్మణుఁ డెంతో స్తోత్రముచేసినాఁ డనుకొని వినయముతో నిట్లనియె. చిత్తంచిత్తం. తమయనుగ్రహంచేత చిన్నప్పటినుం

డియు నేను పదిమంది పెద్దమనుష్యులచేత నాలాగే యనిపించుకొను చున్నాను. ఇంతకు నాతలిదండ్రులు చేసిన పూర్వపుణ్యము గాని మీరింతగా స్తోత్రముచేయుటకు నావద్ద నేమిసుగుణములున్నవి!

---

55. దిక్కులేని యొక బ్రాహ్మణవితంతువు క్షురకర్మ చేయించుకొనుటకు మంగలివాఁ డెక్కడను గనఁబడక పోవుటచే విసుగుకొని మరియొక స్త్రీతో నిట్లనియె. "అబ్బా! మగఁడు లేనిబ్రతుకుదిక్కుమాలిన బ్రతుకుగదా. మంగలిని బిలిచిపెట్టుటకు నాకు దిక్కయిన లేదుగదా. ఏపనిచేయకున్నను మావారున్న పక్షమున మంగలినైనఁ బిలిచిపెట్టునుగదా!" ఆమాటలువిని రెండవస్త్రీ 'ఓసీ! వెఱ్ఱిముండా! మీవారున్నపక్షమున నీకు మంగలితోఁ బనియేమున్న' దే'యనియడిగెను.

---

56. గడుసుదన మెఱుఁగనియొక బ్రాహ్మణుని బిలిచి కొంటెపిల్లవాఁడొకఁడు "ఓయీ! నీభార్యముండమోసినచో నీకన్న మెవరునండి పెట్టుదు"రని యడిగెను. ముండమోయుటయనుమాటకు నర్థముపూర్తిగా నెఱుఁగక యాబ్రాహ్మణుఁడు నాయనా! నాభార్యముండమోసినయెడల మాయప్పయో చెల్లెలో నాకింతగంజి కాచి పోయుదురు. దైవమెప్పటికప్పుడెవరినో యొకరిని నాలుగురోజులు గతి చూపింపకపోవునా? కష్ట కాలము వచ్చినప్పుడు నాలుగుపూట లేలాగోయొక లాగు కాలక్షేపము చేయలేక పోదునాయని యుత్తరము చెప్పెను.

---

57 ఒక వెఱ్ఱిబాగులబ్రాహ్మణునిఁ జూచి యొకగడుసువాఁడు "ఓరీ! నీభార్య ముండమోసినదఁట" యని కౌఁగిలించుకొనియేడ్చెను. ఆమూర్ఖుఁ డామాటనిజమనినమ్మి పెద్దపెట్టున నేడ్చుచు నింటికిఁబోవుచుండెను. త్రోవలో నొకఁడువానిని బిలిచి దుఃఖకారణముఁ దెలిసికొని వెఱ్ఱివాఁడా! నీవుండగ నీభార్య యెట్లుముండమోయునురా" యని యడిగెను. ఆవెఱ్ఱిబాగులవాఁడప్పుడుఓరి తెలివితక్కువవాఁడా! నేనుం

డగా లోకమున నెండఱు నాకళ్లముండర ముండమోయుటలేదు. నా భార్య మాత్రమేల ముండమోయఁగూడదు.

---

58. ఒక బ్రాహ్మణుఁడు భార్యాసమేతుఁడై కాశికిఁబోయెను. అక్కడ ప్రతిమనుష్యుఁడుదనకు మిక్కిలి యిష్టమైన దొకదానినివిడిచి పెట్టవలయునను నాచారముండుటచే నచ్చటివారు దంపతులను బిలిచి మీరేమి వదలివేయుదురని యడిగిరి. బ్రాహ్మణుఁడు కొంచెమాలోచించి యిదివఱకెన్నడువదిలిపెట్టనివి నేను వదలిపెట్టెదను. చిన్నప్పటి నుండి నన్నాశ్రయించిన సిగ్గుబిడియముల నిచ్చట విడిచి పెట్టుచున్నానని పలికెను. అచ్చటివా రాయన తెలివికి సంతోషించిరి. మగఁడట్లు చెప్పినపిదప భార్యయిట్లనియె. నేననామగనిని వదలివేయుచున్నాను అన్నిటిలో నెక్కువ యిష్టమైన పదార్థము వదలివేయుట భావ్యము గనుక మగనికంటె నెక్కువ పదార్థము లోకములో లేదు గనుకను సిగ్గుబిడియములు వదలివేసిన మగనినే వదలివేయుట మంచిదని యిట్లు చేసితినని చెప్పెను. భార్యమాటలు విని తన గడుసుదనము గట్టిపెట్టి మగఁడు బుద్ధి తెచ్చుకొనెను.

---

59. ఒక నియోగియు నొక వైదికుఁడు నొక రాజువద్ద నుద్యోగములు చేయుచుండిరి. ఆరాజొకనాఁడు వారినిద్దఱిం బిలిచి తనపట్టపుటేనుఁ గెంతబరు వున్నదో తెలిసికొనవలయు నని కోరి యది యెట్లు తెలిసికొనుటకు సాధ్యమగునని వారినడిగెను. వైదికుఁడు వెంటనే లేచి 'దేవా! దాని యందు కష్టమేమున్నది. ఏనుంగునుఁజంపి ముక్కలుముక్కలుగానఱికి కాటాలోవేసి తూచినపక్షమున తూనిక దెలియునని పలికెను. రాజు వాని మూర్ఖత కాశ్చర్యమును కోపమును జెంది నియోగి నడుగ నతఁడిట్లనియె-ఏనుఁగుతూనిక తెలిసికొనుటకు నాకొక చిన్నయుపాయము తోఁచుచున్నది. మనయూరి కాలువలో రేవు

బల్లకట్టొకటి యున్నదికదా. దానిమీఁద నేనుఁగు నెక్కించి యా జంతు వెక్కినప్పు డాబల్లకట్టు నీటిలో నెంతవరకు మునిగినదోచూచి యానవాలువేసి తరువాత నేనుఁగునుదింపి బల్లకట్టు మొదటియానవాలు దాక మునుఁగునట్లు దానికరాళ్ళు వేసినపక్షమున నేనుఁగుఁబరువు చులకనగఁ దెలియును. రాజు నియోగియుక్తికి మెచ్చి, వైదికుని మూర్ఖతకు నవ్వెను.

---

60. దిక్కులేని యొకయాఁడుదానికి నేత్రరోగము బయలుదేరగన్ను లగపడవయ్యెను. ఆమె యొకనేత్రవైద్యునిఁ బిలిపించి తన కన్నులకు వైద్యము చేయుమని యడిగి కుదిర్చినపక్షమున ముప్పది రూపాయ లిచ్చెదనని యొప్పుకొనెను. వైద్యుఁ డనుదినము మందు వేయుట కామె యింటికి వచ్చినపుడెల్ల నామెయింటి సామానులలో నొక్కొక్కదానిని నెత్తికొని పోవుచుండెను. వైద్యునిగుణమామె యెఱిఁగియు నేమైన నన్నచో కన్నులు మొదలంటఁ బోగొట్టునేమోయను భయమున నూరకుండెను. నేత్రరోగము కుదిరిన వెనుక వైద్యుఁడు సొమ్మిమ్మని యామె నడిగెను. "నాకన్నులు కుదురలేదు. నేనేమియు నియ్య" నని బదులుచెప్పెను. వైద్యుఁడు రాజుగారితో ఫిర్యాదుచేయఁగా రాజామెను బిలిపించి కన్నులుకుదిరినప్పుడుసొమ్మెందు కియ్యగూడదని యడిగెను. అప్పుడామె రాజుగారితో నిట్లని మనవి చేసికొనియె. "స్వామీ! నాకన్ను లేమికుదిరినవో నాకుఁ దెలియదు. ఈయన వైద్యము చేయకమునుపు మాయింట్లోనున్న వస్తువులన్నియు నాకుఁ గనబడుచుండునవి. ఇప్పుడు నాకొక వస్తువును గనఁబడదు." ఆ మాటలు విని రాజు జరిగిన వృత్తాంత మంతయు నడిగి తెలిసికొని వైద్యుని మందలించి పంపెను.

---

61. ఒక బ్రాహ్మణుఁడు కాశీయాత్రకుఁ బోయి మఱలఁ దన స్వగ్రామమునకుఁ బోవుచుఁద్రోవలో నొకయూరుచేరి చెఱువుగట్టు మీఁదఁ గూర్చుండి యెవని యింట బస చేయుదునా యని యాలోచింపఁ దొడఁగె. ఆయూరిలో నొక వైదికబ్రాహ్మణుఁడు తనకూఁతు రాఱుమాసములు ప్రాయము గలదైనప్పుడాఱువందలు రూపాయలు కన్యాశుల్కము పుచ్చుకొని దాని నిరువది యేండ్లవానికిచ్చి వివాహము చేసెను. ఆయల్లుఁడు పెండ్లి కాఁగానే కాశీయాత్రకుఁ బోయి యాబాలిక పెద్దదై పదునైదేండ్ల వయసుగలదైనను మఱల రాఁడయ్యె. ఆబాలిక పేరు సుబ్బక్క. ఈబ్రాహ్మణుఁడు చెఱువుగట్టుమీఁద గూర్చున్నప్పుడు కొందఱు స్త్రీలు పురుషులు వానినిగొన్నిప్రశ్నలడిగి కాశీనుండివచ్చుచున్నానని చెప్పఁగానే వానియింటిపేరు, పేరు దెలిసికొనకయే మనసుబ్బక్కమగఁడు వచ్చినాఁడు మనసుబ్బక్కమగఁడు వచ్చినాఁడని చెప్పుకొనసాగిరి. ఆమాటలువిని యత్తమామలుపదిమందిచుట్టములను బిలిపించి బాజాభజంత్రీలతో నెదురుగా వచ్చి తమ యల్లుఁడే యనుకొని యింటికిఁదీసికొనిపోయిరి. పెండ్లిలోనే తప్ప యల్లుని మఱియెన్నఁడును జూడకపోవుటచే నత్తమామలు తమయల్లునకు నీక్రొత్తమనుష్యునకు నానవాలు బట్టలేక తమయల్లుడే యనినిశ్చయించి సుముహూర్తముచూచి కూఁతునకు పునస్సంధానముఁ జేసిరి. సకల సౌఖ్యములనుభవించుచు నతఁడు క్రొత్తయత్తవారియింటఁగొంతకాల ముండఁగా నితఁడల్లుఁడు కాఁడని యెందుచేతనో యూరిలో నొక ప్రవాదము పుట్టెను. అత్తవారు బంధువులు వానిని నిరోధించి యడుగఁగా నతఁడిట్లనియెను. "అందఱు సుబ్బక్క మగఁడనుకొనుటచే నేనును గాఁబోలు ననుకొంటిని. కానని తోఁచినపక్షమున నాదర్భాసనము నాజారీ యివతలఁబారవేయుఁడు. నాదారిని నేను బోయెద" ననిపలికెను. అప్పు డత్తవారు మోసముజరిగినదని గ్రహించి చింతించినకార్యము లేదని యాపిల్లను వానికే కట్టిపెట్టి వానియూరికి బంపిరి.

---

62. ఒకపల్లెటూరులో సంవత్సరాదిపండుగరోజున గ్రామములో పెద్దలందఱు భాగవతమాడించిరి. కృష్ణవేషము వేయువాని కప్పటి కప్పుడొకరూపాయయిచ్చి తీసికొనివచ్చుటవాడుకయగుటచేనారాత్రి యుఁ గానూరగ్రహారపు నివాసియగు నొకబ్రాహ్మణున కొకరూపాయ యిచ్చి కృష్ణవేషముకొఱకుఁ దీసికొనివచ్చిరి. ఈకృష్ణవేషగానికిఁ జెప్పవలసినముక్క యొకటియు రాకపోవుటచే వేషము వేసికొని మొద్దులాగనఁ గూరుచుండెను. నడుమ హాస్యగాఁడొకమాఱు వచ్చి స్వామీ మన దేశమూరని యడిగెను. వేషములో నుండుటచే నతఁడు ద్వారకయని ప్రత్యుత్తరము చెప్పుటకు మాఱుగా తన నిజవాసమునే యడిగినాఁ డనుకొని 'ఓరీ! నాది కానూరగ్రహారము కాదఁటరా! తెలియనట్లే యడిగెద వేమని బదులుచెప్పెను. సభవారందఱప్పుడు కృష్ణవేషగాని తెలివికి సంతోషించిరి.

---

63. ఒక కాఁపువానికిఁ దెలివిమాలిన కొడుకుండెను. అతఁడొకనాఁడు కొన్నిమామిడిపండ్లు వానిచేతికిచ్చి వానిని బజారులో నమ్మికొని రమ్మని వంద రూపాయ కియ్యవలసినదని చెప్పి పంపెను. ఒక బ్రాహ్మణుఁ డాపిల్లవాని వద్దనున్న మామిడిపండ్లు మిక్కిలి మంచివని తెలిసికొని యవి యెక్కువఖరీదుండక మానవనినమ్మి వర్తకుఁడు బేరము చెప్పకముందే వంద రెండురూపాయల కిచ్చెదవా యని యడిగెను. వెంటనే యాబాలుఁడు నేనిచ్చుటకువీలులేదు. మాతండ్రి సరిగా రూపాయకిమ్మని చెప్పెను. అతఁడు చెప్పినట్లమ్మకపోయినచో నాకిబ్బంది వచ్చునని చెప్పి రూపాయకిచ్చెను. ఇంటికి వచ్చినతరువాత వాని తెలివితక్కువకు తండ్రి వానిని గట్టిగా మందలించి మఱికొన్ని నాళ్ళకు కోడిగుడ్లు కొని తెమ్మని దగ్గరపల్లెకుఁ బంపుచు వందర్థరూపాయ

కిచ్చినచో పట్టుకొనిరా లేకపోయినచో వద్దని చెప్పి పంపెను. ఆపల్లె కుంబోయి యతఁడు కోడిగుడ్లను బేరమాడఁగా నక్కడివారు తమలోఁ దారు పోటీలు పెట్టుకొని వందాఱణాలకిత్తుమని చెప్పిరి. ఆమాటలు విని యతఁడు వందర్ధరూపాయకిచ్చినచో మాతండ్రి పట్టుకురమ్మని చెప్పెను. లేనిచో వద్దనెను. కావున నేనిప్పుడు పట్టుకుపోనని కొనుటమాని యింటికిఁ బోయెను.

---

64.. ఒక బ్రాహ్మణున కిద్దఱుభార్యలుండిరి. అతఁడు మొదట నద్వైతిగానుండి కొన్నినాళ్ళకు వైష్ణవమతమును స్వీకరించి యారామానుజమతము నవలంబింపుమని భార్యలనిద్దఱఁ బలవంతపెట్టె. పెద్దభార్య భర్తచెప్పినట్లుచేసెను. రెండవభార్య తనమతమునుస్వీకరింపనందున బ్రాహ్మణుఁ డామెపైఁ గోపముఁబూని యామెచేతివంటదినక పెద్దభార్య చేతియన్నమే తినుచు నామె వండుటకు వీలులేనప్పుడు తాను స్వయముగ వంట చేసికొనుచువచ్చెను. ఇట్లుండఁ గొన్నినాళ్ళకు పెద్దభార్య పురుడునిమిత్తము పుట్టింటికిఁబోయెను. బ్రాహ్మణునకు శరీరమునందనారోగ్యముకలుగుటచే వండుకొనుట కోపికలేకపోయెను. అందుచే రెండవభార్య వంటచేయవలసివచ్చెను. చక్రాంకితముగాని స్త్రీచేతియన్నము దినుట మహాపాతకమని నమ్మి యానవీనవైష్ణవుఁ డాదోషము పరిహరించుకొనునుపాయ మాలోచించి చిన్నభార్య విస్తరిలో నన్నము వడ్డించిన తరువాత నొక సాతానివానిఁ బిలిచి తన విస్తరిలోనున్న యన్నము పప్పుకూరలు మొదలగు నన్నివస్తువులమీఁద నొకమారు చేయివేసి వెళ్ళుమని ప్రార్థించెను. వాని ప్రార్థన మంగీకరించి యాసాతాని చేయివేసినతరువాత నాబ్రాహ్మణుఁడు సంతుష్టుఁడై యారగించెను.

---

65. ఒక బ్రాహ్మణస్త్రీ యంతర్వేదితీర్థమునకుఁబోవలయునని ముచ్చటపడి తన్నుఁ దీసికొనిపొమ్మని మగనినడిగెను. మగఁడుతనకుఁ బనితొందరవలనఁ దీరుబడి లేదని యిరుగుపొరుగువారు తీర్థమునకుఁ బోవుచుండవారితో తనభార్య నంపెను. ఆమెసాగరసంగమమున స్నానముచేసి తనబసకువచ్చి యచ్చటికి సమీపమున నొకచోట పట్టుచీర నారవేసి యెవరెత్తుకొనిపోకుండ దానినిజూచుచుండుమని యాచుట్టుపట్లవారితోఁ జెప్పి తానువచ్చి గదిలోవంటచేసికొనుచుండెను. ఒకదొంగవాఁడు సంగతిఁగనిపెట్టి బ్రాహ్మణవేషము వేసికొనివచ్చియచ్చటివారందఱు వినునట్లు 'దౌర్భాగ్యపుముండ తనబసకింతదూరముగా బట్టుచీరనారగట్టినది. ఇదెవ్వరైననెత్తుకొనిపోరా! దీనికిబొత్తుగ బుద్ధిలేకున్నది.' అనితిట్టి యాచీరెవిప్పుకొని పారిపోయెను. చుట్టుపక్కవారందఱదిచూచి యతఁడామెమగఁడేయని నమ్మి యూరకొనిరి. కొంతసేపటికి బ్రాహ్మణస్త్రీవచ్చి యచ్చటివారిని 'నాయనా! నా పట్టుచీరయేది' యనియడిగెను. అమ్మా నీమగడువచ్చి యిచ్చట చీరనారవేసినందుకు నిన్నుదిట్టి దానినిదీసికొని పోయెనని చెప్పిరి. అప్పుడాస్త్రీ దుఃఖపడి "అయ్యో! మావారీతీర్థమునకు రానేలేదు చీరెపోతేపోయినదిగాని యాదొంగముండకొడుకు నామగఁడని మీరనఁవద్దు." అని మఱలిపోయెను.

---

66. ఒకబాపనముత్తయిదువు కోటిపల్లితీర్థమునకుఁబోయిమూసివాయనములుపట్టి కొన్నిచీరలు రూపాయలు సంపాదించుకొనెను సాయంకాలమప్పు డామె యంగళ్ళ వెంబడి నిట్టట్టుఁ దిరుగుచుండఁ జూచి యొకబుద్ధిమంతుఁ డామెవద్దకుఁబోయి "అమ్మా! మీదేయూ" రని యడిగి కన్నుల నీరుగార నేడ్వ నారంభించెను. ఆముత్తయిదువాశ్చర్యపడి నాయనా! నన్నుఁజూచి యేలయేడ్చెదవని యడిగెను. ఆ బుద్ధిమంతుఁడు "అక్కయ్యా! మాయప్పగారు సరిగా నీవలెనేయుం

డునది. ఆమెపోయి పదేండ్లయినది. అప్పటినుండియు నాకటువంటి యాఁడుదికనఁబడనేలేదు. ఆమెనుజూచి నిన్నుఁజూడనక్కరలేదు. అందుచే నిన్నుఁజూడఁగానే యామె జ్ఞప్తికిరాఁగా నిన్నుజూచి యేడ్చుచున్నాను. ఆమె పేరుచెప్పి నీకొక పట్టుచీర నియ్యవలెనని యున్నది. ఆ దుకాణము వద్దకువచ్చి యాచీరపుచ్చుకొని నన్ను ధన్యునిఁజేయు"మని వేఁడుకొనెను. ఆశాపిశాచముయొక్క యధికారమునకు లోఁబడిన యాముత్తయిదున వానివెనువెంట దుకాణమువద్దకుఁ బోయెను. ఆబుద్ధిమంతుఁడు దుకాణములోనున్న బట్టలలో మేలైన వేరితీసి యిందు నీకేచీర బాగుండునమ్మాయని యడిగియామె మెచ్చిన చీరనుదీసియిది పుచ్చుకొందునని వర్తకునితోఁ జెప్పి యాముత్తయిదువుతోనిట్లనియె-వర్తకునకియ్యవలసినసొమ్ము తెచ్చెదను అంతవఱకునీవిక్కడగూర్చుండుమని యామె నొప్పించి వర్తకునిసమ్మించిపోయె. ఎంతసేపామె యచ్చటగూర్చున్నను శ్రోత్తయన్నగారు రాఁడయ్యె. వర్తకుఁడు జాము రాత్రివఱకుఁజూచి వాఁడు దొంగవాఁడని గ్రహించి యాచీరవెల యాముత్తయిదువయొద్దకట్టిపుచ్చుకొనెను. ముత్తయిదువమూసివాయినములవలన తీర్థములో సంపాదించిన సొమ్మంతయు నీదండుగకిరింద నిచ్చుకొని వట్టిచేతులతో నింటికిఁబోయెను.

---

67. ఒకఛాందసబ్రాహ్మణునకు దొడ్డిలో నొకకొబ్బరిచెట్టుండెను. ఆచెట్టుకాయలు ప్రతిరాత్రియు దొంగ లెత్తుకొనిపోవుచుండుటచే దానికేదియుఁ బ్రతిక్రియఁ జేయలేక తనమనసులో నొకయుపాయము నూహించుకొనెను. బ్రాహ్మణుని భార్య దొంగలను బట్టుకొనుటకై రాత్రి మేలుకొందమని మగనితోఁ జెప్పఁగా నతఁ డామెను మందలించి "ఓసీ మూర్ఖురాలా! నీకెప్పటికిఁ దెలివిరాదేమి? మనము మేలుకొని కష్టపడుటయెందుకు? నే మంచియుపాయ మూహించితిని నామడిబట్ట యాకొబ్బరిచెట్టునకుఁ గట్టెదను. దొంగముండకొడుకు

శూద్రుఁడగుటచే మడిబట్టల ముట్టుకొనఁడు. ఇఁక మనకొబ్బరికాయలు పోవనిచెప్పి మడిబట్ట దానికిఁ గట్టెను. మగని తెలివిమాలినతనమున కు భార్య నవ్వుకొని మగనితోఁగలిసి నిద్రపోయెను. దొంగవాఁడెప్పటి యట్లవచ్చి కాయలుతీసి మడిబట్టలో మూఁట గట్టుకొని పోయెను.

---

68. ఒకయూరిలో దొంగలభయ మెక్కువగుటచే గ్రామవాసులందఱుఁ దమతమసొత్తుల ననేకవిధములఁ గాపాడుకొనుచుండిరి. గ్రామవాసులలోఁగొందఱొకఛాందసబ్రాహ్మణునియొద్దకువచ్చి "అయ్యా మీసొత్తును మీరెట్లు సంరక్షించుకొనియెద"రని యడిగిరి. ఆమాటలు విని బ్రాహ్మణుఁ డిట్లనియె. నేను మీయందఱికంటె మంచియుపాయ మాలోచించియున్నాను. ఇంటిలోనున్న సరకులన్నియు నేనంటుచేయుచున్నాను. దొంగవాఁడైనను అంట్లుముట్టుకొనఁడుగదా! ఒకవేళ ముట్టుకొన్నను చేయి కడుగుకొనుట కొకచుక్క నీరైనను లేకుండ సాయంకాలము బిందెలలో నీళ్ళన్నియు వంచివేసెదను. అంటు సందేహముచేత దొంగవాఁడేమియు ముట్టుకొనఁడు. నేను తలుపులు తీసి పండుకొన్నను మాయాస్తికేమియు భయము లేదనిపలికెను. ఆ మాటలు విన్నవారందఱు దమలోఁ దాము నవ్వుకొని పోయిరి. దొంగలారాత్రి వారియింటికివచ్చి యంటువస్తువులన్నియుఁ దరలించుకొనిపోయిరి.

---

69. ఒకభోగముది శరీరమునిండ నగలుపెట్టుకొనిభాగవతముఁ జూడఁబోయి సిగ్గువిడచి మగవారుకూర్చున్న తావున కూర్చుండెను. ఒకగజదొంగ యామెనగలలో నేదైన సంగ్రహింపవలెనననిశ్చయించుకొనియామెకుఁజోటిచ్చి కూర్చుండఁబెట్టితానామెమీఁదఁ జేయివేసి కూర్చుండి యామె భాగవతముఁజూచి సంతోషపరవశురాలై యున్న సమయమున మెల్లగఁ జేతిబంగారపుఁ గంకణమును సంగ్రహించెను. నాటకముఁజూచుచున్న సంతోషమున వేశ్య కంకణముపోయినజాడయే

మెఱుఁగదయ్యె. అనంతర మామెయింటికిఁబోయి నగ పోవుట మె ఱిఁగి కొత్వాలుతోఁ జెప్పగా నతఁడు రాజభటులను బంపి దొంగను వెదకించుచుండెను.ఇట్లుండఁగా నొకనాఁడు రాజభటుఁడు పోయినకంక ణమును దీసికొనివచ్చి వేశ్యకుఁజూపి యిదిగో కంకణముదొరకినది. ఇ దినీదగునో కాదో సరిగాఁ దెలిసికొనుటకుఁ గొత్వాలుగారు దీనిజత కంకణముఁ దెమ్మన్నారని పలికెను. వేశ్య యాతఁడు తెచ్చినకంకణ మునుజూచి యదితనదేయని యానవాలుపట్టి సంతోషించి రెండవచేతి కంకణమును దీసి రాజభటుని చేతికిచ్చి పంపెను. తనకంకణ మెంతకా లమునకుఁ గొత్వాలుగారియొద్దనుండి తనకు రాకపోవుటచే విసిగి యా వెలయాలు కొత్వాలుయొద్దకుఁబోయి జరిగినవృత్తాంతముఁజెప్పి తన కంకణమిమ్మని యడిగెను. కొత్వా లామాటలువిని యాశ్చర్యపడి ‹ఓసీ! మొదట నీకంకణము దొరకనులేదు. రెండవకంకణము తెమ్మని రాజభటుని మేము నీవద్దకుఁ బంపనులేదు. మొదట కంకణము నపహ రించినగజదొంగయే రెండవదానిని హరింపవలయునని రాజభటునివే షము వేసికొనివచ్చి నీకొంపఁదీసినాఁ'డని చెప్పెను. ఆపలుకులువినిదుః ఖముచే గుండెలు బాదుకొనుచు వేశ్యయింటికిఁబోయెను.

---

70. తెనుఁగుదేశస్థుఁడగు నొకవైదికబ్రాహ్మణుఁడు కన్నడదే శమునకుఁబోయి యొకగృహస్థునియింట భోజనమునకు వెళ్ళెను అక్కడ భోజనమునకువచ్చిన వారందఱుఁ గన్నడభాషనే మాటలాడి రి. ఆభాషలో సాకు అనఁగా చాలుననియు బేకు అనఁగా వేయుమని యు నర్థము. తెలుఁగు బ్రాహ్మణునకు కన్నడము రాకపోవుటచే నే మాటకేయర్థమో తిన్నగఁదెలియక సాకు అనఁగా వడ్డించుమె యర్థ మనుకొని వడ్డనబ్రాహ్మణుఁడు వచ్చినప్పుడు సాకుసాకు అననారంభిం చెను. వడ్డనచేయువారు వానికేవస్తువు లక్కఱలేదు కాఁబోలు నను

 

కొని వడ్డింపకయె పోయిరి. కడుపులో నాకలి మిక్కుటముగా నగుటయు విస్తరిలో నేవస్తువు లేకపోవుటయుఁ గనిపెట్టి యాబ్రాహ్మణుఁడు ప్రాణము విసుగుటచే వడ్డన బ్రాహ్మణుని జూచి "ఓరి! నీసాకు చట్టుబండలుగాను రెండుబేకులు బేకరా? కడుపు మండుచున్నది." అని పలికెను. ఇంటియజమానుఁడు వానియమాయకత్వము నెఱిఁగి కడుపునిండ వానికిభోజనము పెట్టించెను.

---

71. తండ్రి కొడుకునగు నిద్దఱు శూద్రు లన్నము లేక బ్రాహ్మణవేషము వేసికొని సత్రములలోను సంతర్పణములలోను యథేచ్ఛముగా భోజనముచేయుచుండిరి. ఒకనాఁడొకసంతర్పణకు వారిరువురుఁబోయియుండఁ దండ్రి గంధముదెమ్మని కొడుకునుబంపెను. శూద్రుఁడగుటచే మొగమునఁబెట్టుకొను గంధ మెప్పుడు కుడిచేతితోనే యందుకొనవలయుననుమాట నతఁడెఱుఁగఁడు. గంధము దీయుబ్రాహ్మణుఁడాకుఱ్ఱవానినిజూచి ఓయీ!నీవుశూద్రివాఁడవాయేమి? గంధమునకెడమచేయిబట్టుచున్నా'వని మాటవరుస కనెను. తనగుట్టు బ్రాహ్మణుఁడు తెలిసికొన్నాఁడు కాఁబోలు ననుకొని యక్కడనుండి గట్టిగా కేకవేసి యోరినాయనా! ఈబాపనాఁడు మనగుట్టు కనుకొన్నాఁడురోయనితండ్రితోఁజెప్పెను. ఆపలుకులువిని యచ్చటి బ్రాహ్మణులందఱుమీగుట్టేమిటని వారిని దఱచితఱచి యడిగి వారుశూద్రులని యెఱిఁగి చావఁగొట్టి యావలకుఁబంపిరి.

---

72. ఒకమాలవానికొడుకు తండ్రిచెప్పిన మాటవినక తనకులవిద్యలగు చెప్పులుకుట్టుట డప్పు కొట్టుట మొదలగు పనులు మానియల్లరిపిల్లవాఁడై తిరుగుచుండెను. తండ్రి వానిపైఁగోపపడి యిట్లనియె. ఓరీ చెప్పుకుట్టక, డప్పుకొట్టక బోడిబాపనవానివలె బిచ్చమెత్తుకొని బ్రతికెదవా యని యడిగెనఁట.

---

73. ఒకసాలెవాఁడు ప్రతిదినము కోడిపందెములు గట్టుచు నా పనినిమిత్తము పెక్కుకోళ్లను బెంచుచుండెను. ఒకమారు వానియింట నున్న కోళ్ళన్నియుఁ బందెములో జచ్చిపోవుట సంభవించెను.అప్పుడా డాపందెగాఁడు కోళ్ళులేక తనయిల్లుచిన్నబోయి కళాహీనమై వెలవెల బారుటకెంతయుఁ జింతిచి"అయ్యో!నాయిల్లుకోడికూఁతయన్నమాట లేక బోడిబాపన కొంపలాగ పాడుపడియున్నదోయి నాయనా"యని మిత్రులతోఁజెప్పుకొని పెద్దపెట్టున నేడ్చెను.

---

74. ఒకవైష్ణవునకు గ్రామములోనే యత్తవారి యిల్లుండెను. అందుచేనతఁడు ప్రతిదినము భోజనానంతరమున నచ్చటికిఁబోయి సాయంకాలమువఱకుఁగూరుచుండును. వైష్ణవు లుదయమునందు సాపాటుచేయకమునుపే తిరుమణి తిరుచూర్ణములు పెట్టుకొనువాడుక గల వారగుటచే నావైష్ణవుఁడొకనాఁడు నామము దిద్దుకొని భోజనముచేయ కయేయత్తవారింటికివెళ్ళెను. అల్లుఁడు భోజనముచేసియేవచ్చెననుకొని యత్తమామలు వానినిఁ దిండికిఁబిలువరైరి. అత్తవారుబిలువకతనంతటఁ దాను భోజనమునకుఁ బోవుట లాఘవమని యల్లుఁడు భోజమునకు లేవడయ్యె. తనయింటికి మఱలభోజనమునకుఁ బోవుదమన్న వేళమించినదని సందేహము గలిగె. అందుచేత నాయల్లుఁడు దినమంతయు మలమల మాడి దీపాలవేళ నత్తవారియింటివాకిటిలో మంచము వేసికొని భూపాలరాగము మీఁద మేలుకొలుపులు పాడనారంభించెను. అప్పుడు వాని మఱఁదివచ్చి యేమోయి! బావా తెల్లవారగట్ల పాడవలసిన భూపాలరాగము సాయంకాలము పాడుచున్నావేమని యడిగెను. పరగడుపున నెప్పుడుపాడిన నేమని మఱఁదికి బావ ప్రత్యుత్తరముచెప్పెను. అయ్యో! ప్రొద్దుటినుండియు నీవన్నమే తినలేదా యని యాశ్చర్యపడి మఱఁది యడుగ నాయనా! నాఁమము నాకొంప

దీసినదో యని బావ బదులు చెప్పెను. అప్పుడు మఱంది తల్లిదండ్రులకామాట చెప్పి త్వరగా వంటచేయించి శోషరాకుండ బావను గాపాడెను.

---

75. తుంగభద్రాతీరమునందలి విజయనగరమును పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయలు మిక్కిలిబలవంతుఁడు సద్గుణవంతుఁడు పండితపక్షపాతి యగుటచే ననేకు లాయనను గృష్ణుని యవతారమని కొనియాడుచువచ్చిరి. ఒకనాఁడు కృష్ణదేవరాయలు నిండుకొలువుండి పండితులతోఁ బరిసంగించుచుఁ ధర్మరాజునితమ్ములు మంచివారా, శ్రీరాముని తమ్ములు మంచివారాయని యడిగెను. సభలోనున్నవారిలోఁ గొందఱు రామునితమ్ములు మంచివారనియుఁ గొందఱు ధర్మరాజుతమ్ములు మంచివారనియుఁ బరిపరివిధములఁ జెప్పిరి. వారు చెప్పినమాటలు సహేతుకములుగ లేకపోవుటచే ధర్మసందేహము తానే నిర్ణయింపఁదలంచి కృష్ణరాయలిట్లనియె. “రామునికంటె రామునితమ్ములు బలహీనులు. అందుచేత వారు తమ యన్నగారిమాటవిని తీరవలయును. బలహీనులై బలవంతునిమాట వినుటలో నేమిగొప్పయున్నది? ఇఁకధర్మరాజు తమ్ములమాట యన్ననో ధర్మరాజుకంటె నతని తమ్ములు బలవంతులు ప్రయోజకులు. విశేషించి పాండవుల కన్నికష్టములు ధర్మరాజుమూలముననే వచ్చినవి. అన్నగారికంటె తాము బలవంతులయ్యు నతనిమూలమున నన్ని నీచదశలు ననుభవించియు భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజుమాట జవదాటక నిలిచిరి. ప్రయోజకులగువా రప్రయోజకునిమాట శిరసావహించుట గొప్పకాదా? అందుచేత ధర్మరాజుతమ్ములే మంచివారని నాయభిప్రాయము. అనిరాయలుపలుక సభలో నొక పండితుఁడులేచి “అయ్యా! మీకా యవతారమునందె గాక యీయవతారమునందుఁ గూడ పాండవపక్షపాతమే యున్నదిగదా” యని పలికి రాజును సంతోషపఱచెను.

---

76. పూర్వకాలమునం దొకరాజు నాశ్రయించి నిఱుపేదయగు నొక క్షత్రియుఁడు బ్రతుకుచుండెను. ఆక్షత్రియుఁడు మహాశూరుఁడు, బలశాలియగుటచే వానినందఱు మన్నించుచు మిక్కిలి కోపిష్ఠియగుట చే వానిజోలి కెవరును బోవుటకు వెఱచుచు వచ్చిరి. అతఁడొకనాఁడు రాజుగారి బావమఱఁదితో చదరంగమాడి యాటతో నిద్దఱకువివాద ముఁ గలిగినందున రాజుగారి మఱఁదిని నఱికివేసెను. ఆమాటవినినతో డనే రాజుకోపోద్దీపితుఁడై వానిని తత్క్షణము జంపివేయ వలసినదనియా నతిచ్చెను. బుద్ధిమంతుఁడగు నారాజుమంత్రి యాబీదక్షత్రియునిదనవ ద్దకుఁ బిలిపించి రాజు సెలవుప్రకారము వానినిఁ జంపక దూరముననొ కకోటలో నుంచి పలువిధముల నతనిని గాపాడుచు వచ్చెను.ఆమాట విని రాజు వాని నెందుకు జంపింపలేదని యడుగ మంత్రి" అతనివలన మనకెంతైన నుపయోగమున్నది. అతఁడు మన రాజ్యమునకు మ హోపకారము చేయఁగలఁడు. ఇంతకోపిష్ఠి యెవఁడైన దొరకునా యని నేను వెదకుచున్నా"నని బదులు చెప్పెను. మంత్రిమాట యెం తవఱకునిజమో చూడవలయునని రాజూరకొనెను. అంతలో నీరాజుగా రిని లోఁబఱచుకొనినసవాబప్పటివఱకుకప్పముచెల్లించవలసినదనియడి గెను. దగ్గఱపైకముండియు మంత్రి రేపుబంపెద మాపుబంపెద మని జరపుచు వచ్చెను. నవాబు మహాకోపముచేత మండిపడుచు పైకముపు చ్చుకొని యాలస్యమునకు వారిని శిక్షింపవలయుననితలంచుచుండెను. అట్లుండగా నాళ్లుజరిపిమంత్రి యెట్టకేలకు వెనుకటి పేదక్షత్రియునిఁబిలి చి నవాబున కీయవలసిన రొక్కము కావళ్ళు గట్టించియాపైకము తీసి కొనిపోయి తురక కిచ్చిరమ్మని వానినిబంపెను. అతఁడు సరేయనిక త్తి చేతఁబూని గుఱ్ఱముపై నెక్కి సొమ్ముపట్టించుకొని నవాబువద్దకుఁబోయి నిలిచి సలాముచేసి రాజుగారు పయికము బంపినారని విన్నవించెను. న వాబు హుకా త్రాగుచు వానిని గూర్చుండుమనక యే యంతయా

స్యముచేసినందుకు మహాకోపముతో సామ్ముఁబంపిన రాజును, తెచ్చిన క్షత్రియుని బూతులు తిట్టెను. ఆటలోనైన మాటబడనోల్లక రాజుగారి మఱిదియంతవాని నవలీలగా నరకిన యాశూరశిఖామణితురకవాఁడు బూతులు తిట్టినతోడనే చేతిలోనికత్తిఁ దీసికొని వానితల కొబ్బరిపుచ్చెవలె నెగురునట్లు నరికెను .తోడనే నవాబుబంట్లువచ్చి క్షత్రియుని ముక్కలుముక్కలుకింద నఱికి తమదొర మృతినొందుటచే నక్కడనుండలేమని చెల్లాచెదరై పోయిరి. మంత్రియుక్తివలన నిదివఱకేలినాటిశనివలెఁదమ్ము బీడించుచున్న నవాబును తనమఱఁదిం జంపిన క్షత్రియుఁడును గూడ నేక కాలములోనే హతులైరని వినిరాజు మిక్కిలిసంతసించి మంత్రికి బహుమానము చేసెను.

---

77. ఒక యూరిలో నిద్ద ఱాయవారపు బ్రాహ్మణులుండిరి. ఒకఁడు దైవాధీనమని బిచ్చమెత్తుకొనుచుండెను. ఒకఁడు రాజాధీనమని యాయవారము చేసికొనుచుండెను. ఆయూరిరాజు రాజాధీనమ్మనుబ్రాహ్మణుఁడుతనను మిక్కిలిగౌరవించుచున్నాఁడని వానియందు మిక్కిలి దయగలిగి యొక్క గుమ్మడికాయ తెప్పించి తొలఁగొట్టించి లోపలిగుంజును చమత్కారముగఁ దీయించి యందులో నూరవరహాలుపోయించి యానవాలైనఁ దెలియకుండ మఱల పయిముక్క నదికించి యాబ్రాహ్మణుని బిలిచి యందు ధనమున్నమాట చెప్పక యేయాగుమ్మడికాయ దానమిచ్చెను. ఆబ్రాహ్మణుఁడు దానముగ్రహించి పోవుచుఁ దనలో మాయింటినిండగుమ్మడికాయలున్నవి. ఇప్పుడీకాయనేనేమిచేసికొనను. ఇదియమ్మకొన్నచో రెండణాలడబ్బులైనవచ్చునని యొక కోమటి కాగుమ్మడికాయను రెండణాలకు విక్రయించెను. ఆకోమటియాగుమ్మడికాయను మంచిబ్రాహ్మణునకెవ్వరికైనదానము చేసికొనవలయుననితలఁచి దైవాధీనమ్మనుబ్రాహ్మణునిఁబిలిచియిచ్చెను.

ఆబ్రాహ్మణుఁడా కాయనింటికి దీసికొనిపోయి పగులఁగొట్టియందువరహాలఁజూచి దైవము తనయందలికరుణచే నట్లిప్పించెనని సంతసించెను. రాజు రాజాధీనమ్మను బ్రాహ్మణుని మఱునాఁడుబిలిచి గుమ్మడికాయ యట్లున్నదని యడుగ విక్రయించినట్లు చెప్పినచో నేమికీడుమూడునో యని భయపడి కాయ పెద్దతి ముక్క తియ్యగా బెల్లములాగున్నది. గింజలెన్నో యున్నవని యబద్ధమాడెను. కాయలో వరహాలున్న సంగతి బ్రాహ్మణుఁడు చెప్పనందున నతఁడా కాయ పగలుగొట్టి తినలేదనియనుమానించి రాజుగట్టిగా నిరోధించియడుగ బ్రాహ్మణుఁడు నిజమొప్పుకొనెను. రాజు కోమటినిబిలిపించి కాయ యేమి చేసితివని యడుగ నతఁడు దైవాధీనమనుబ్రాహ్మణునకు దానమిచ్చితినని పలికెను. అప్పుడు రాజు బుద్ధి తెచ్చుకొని దైవమును నమ్మినవాఁడే బాగుపడునుగాని మనుష్యునినమ్మినవాఁడు బాగుపడఁడని తెలిసికొనెను.

---

78. కృష్ణరాయ లొకనాడు సభలో దానములలోనెల్ల గొప్ప దానమేదనియడగెను. అన్నముఁ దినకపోయినచో మనుష్యుఁడు జీవించుటకే వీలులేదు గనుక కొంద ఱన్నదానము గొప్పదనిరి. ఇల్లులేకపోయినచో మనుష్యుఁడు తలదాఁచుకొనుటకే వీలులేదు గనుక కొందఱు గృహదానము గొప్పదనిరి. విద్యనేర్చుటవలన మనుష్యుఁడు తాను బ్రతుకుటయే గాక యనేకుల బోషింపవచ్చును గనుక విద్యాదానము గొప్పదని మఱికొందఱనిరి. అందఱన్నివిధములఁ జెప్పుచుండ రాయలవారి మంత్రియగు తిమ్మరసు లేచి "స్వామీ! అన్ని దానములలో నిదానమువంటి దింకొకటి లే" దని పలికెను. రాజును సభాసదులును వారి యుక్తికి మెచ్చి సంతసించిరి.

---

79. ఒకబ్రాహ్మణుఁడు సంస్కృతముఁ జదువుకొని చుట్టుప్రక్కలజనులను పోగుచేసి యనుదినము పురాణము జెప్పుచుండెను.

అట్లు చెప్పుటలో నతఁడొకనాఁడు సొరకాయ (అనగా ఆనపకాయ) దినుట మహాపాతకమని చెప్పెను. అప్పుడాస్థలమున నతనిభార్యయుండుటచే నామె యామాటలు విని యారాత్రి యేకూరయు వండక పట్టి యన్నమువంటి పెనిమిటికిఁ బెట్టెను. ఆపండితుండు కూరవండనందుకు భార్యపై మిక్కిలికోపపడ వంటకేమియుఁ గూరలేదని యామె బదులుచెప్పెను. అప్పుడాపండితుఁడు మన దొడ్డిలోని యానపపాదునిండ కావలసినన్ని కాయలుండగ గూరలేదనియెద వేమనియడిగెను. అందు కామె "సొరకాయతినఁగూడదని మీరుపురాణము చెప్పినప్పుడునిషేధించుటచే నేనాకూర వండుట తప్పనుకొని మానితి" ననియామె చెప్పెను. అంతట మగఁడు భార్యతో నిట్లనియె. "నేనుపుస్తకములోనున్న సొరకాయతినఁగూడదని చెప్పితినిగాని పాదుననున్న సొరకాయతినఁగూడదని చెప్పలేదు. మఱియు నది యితరులు తినగూడదంటినిగాని మనము తినకూడదని చెప్పలేదు." ఆమాటలు విని భార్య మగనికిఁబురాణములయందున్న నమ్మకమునకు మిక్కిలి యాశ్చర్యపడెను.

---

80. ఒక పండితుఁడు తాఁటియాకులపై వ్రాయఁబడిన వాల్మీకిరామాయణమును దేవాలయములో గ్రామస్థుల నందఱిఁ జేర్చి పురాణము జెప్పుచుండెను. పురాణమువినుటకు వచ్చినవారిలో నొక వితంతువు ప్రతిదినము కన్నులనీరుబెట్టుకొని యేడ్చుచువచ్చెను. ఆమెను జూచినవారందఱు నామె జాలిగుండెకలదిగాబోలు రాముని యరణ్యవాసము సీతాదేవికష్టములు విని దుఃఖపడు చున్నదికాఁబోలు ననుకొనిరి. ఆవల రామునిపట్టాభిషేకము మొదలగు శుభములు వినినప్పుడు గూడ నామె యెప్పటియట్లు దుఃఖపడుటచేఁ బురాణము వినుటకు వచ్చినవారిలో నొకఁడు లేచియామెనుబిలిచి అమ్మా! నీవు ప్రతిదినము కంటికి నేలకునేకధారగానేడ్చుచుంటివి. దీనికారణమేమి, మాయందఱి

కంటె నీకుఁగథ చక్కఁగ బోధయగుచున్నదా? యేమి" యనియడిగెను. అప్పుడావితంతు విట్లనియె. నాయనా! నాకుఁ గథగిథయేమియు బోధపడుటలేదు. ఆ తాటియాకుల పుస్తకమునకు గట్టినత్రాడు నామగడు గట్టుకొను మొలత్రాడువలెనున్నది. ఆత్రాడుచూచునపుడెల్ల మావారు నాకు జ్ఞాపకము వచ్చుటచె దుఃఖముపట్టఁజాలక నే నేడ్చుచు వచ్చితిని. ఆమె పలుకులు విని యాాషె వెంగలితనమున కందఱు సంతసించిరి.

---

81. ఒక వీరవైష్ణవుఁడు నలుగురు వైష్ణవులను సాతానులను దాసరులను జేర్చి వైష్ణవ ధర్మముల నుపదేశించుచు సందర్భవశమున నద్వైతుల మొగము జూచిన వైష్ణవులు మఱియొక జన్మమున గాడిదలై పుట్టుదురు. కాఁబట్టి మీరెన్నడు పొరబాటుననైన నద్వైతుల మొగము జూడవద్దుసుఁడీ యని హితోపదేశముచేసెను. అప్పుడాదారిని బోవుచున్న నియోగిబ్రాహ్మణుఁ డొకఁ డామాటలువిని యాప్రక్కనే గడ్డిమేయుచున్న యొకగాడిదవద్దకు బోయి దానిమెడ గట్టిగఁ గౌగిలించుకొని అయ్యో! మీకెంత దురవస్థసంభవించినది స్వామీ!' యని పెద్దపెట్టున నేడ్వ నారంభించెను. వాని గోలవలన పురాణము సాగకపోవుటచే పురాణము చెప్పునతఁడు వినువారు గలిసి నియోగియొద్దకు వచ్చి నీవిపరీతదుఃఖమునకుఁ గారణమేమి. ఇది వెఱ్ఱిగాదుగదా, యని యడిగిరి. అప్పుడానియోగి వారికిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. స్వామీ! నాకువెఱ్ఱిగాదు. మతిభ్రమగాదు. అద్వైతులు మొగముచూచిన వైష్ణవులందరు గాడిదలై పుట్టుదురని మీకిప్పుడే సెలవిచ్చినారు ఈగాడిద మీరుచెప్పిన సిద్ధాంతప్రకారము క్రిందటిజన్మమున నెవరోగొప్ప శ్రీవైష్ణవాచార్యులై యుండవలయును. అంత గొప్ప యాచార్యులవారికి మావంటి యద్వైతుల మొగము జూడఁబట్టి యింతదురవస్థ

బట్టినదిగదా! యను జాలిచేత నేడ్చుచున్నాను. ఈయూరిలోనున్నమందులవాండ్రియొక్కయు చాకలివాండ్రి యొక్కయు గాడిదలన్నియు బూర్వజన్మమునందు పరమభాగవతోత్తములైన వైష్ణవస్వాములేకాబోలును. అతని చమత్కారమును జూచి పురాణము జెప్పిన వైష్ణవుడు సిగ్గుపడి యావలకుఁ బోయెను.

---

82. సాధువగు నొకబ్రాహ్మణుఁడు తనగయ్యాళిభార్యచేత నిడుమలఁ బడఁజాలక పెండ్లామును బిలిచి, ఓసీ! నన్నింతతిట్టుచున్నావు. దేవాలయములో నొకశాస్త్రిలవారు పురాణము చెప్పచున్నారు. ఈవేళ నీవుపోయి యాపురాణము వినిరమ్మా. ఆఁడుది మగని నేలాగున జూడవలెనో యాపురాణమునందుఁ జెప్పఁబడియున్నది. అనిచెప్పి మెట్లయిన తనభార్య తనమాట వినకపోయినను పురాణము వినియైన బాగుపడి తన్ను గౌరవించునేమోయని యాసపడి యామెను బలవంతముగ దేవాలయమున కంపెను. గుడిలో పురాణవేత్త యావేళ పతివ్రతాధర్మములనుగూర్చి చదివి స్త్రీ మగనిని దైవములాగునఁ జూడవలెనని చెప్పెను. పురాణము విని యాగయ్యాళిగంప యింటికి వచ్చినతోడనే మగఁడు దానినిఁజూచి పురాణము వినివచ్చినావుగదా యందేమి చెప్పఁ బడియున్నదని యడిగెను. ఆమాటలువిని యాయిల్లాలు పండ్లు కొరుకుచు మగనిమీఁదికి వచ్చి యానిర్భాగ్యపు ముండకొడుకుఁగూడ నీవు చెప్పినట్లే నీ మొగముమీఁద నిప్పులుద్రవ్వి పోయుమన్నాఁడు. అని చెప్పెను. దుర్జనులేపురాణము విన్నను కార్యము లేదుగదా యని మగఁ డాశవదలుకొని యూరకొనెను.

---

83. ఒకబ్రాహ్మణునిభార్య మగఁడు కష్టపడి తెచ్చిన బియ్యము మొదలైన సరకులు రహస్యముగ నమ్ముకొని నగలుచేయించుకొనుచు సరకులను వెంటవెంటనే తెమ్మని తొందరపెట్టుచువచ్చెను. సంపాద

నచేయలేక మగఁడు మిక్కిలి బాధపడుచు నొకనాఁడు భార్యను సర కుల నమ్ముకొనవద్దని గట్టిగా మందలించెను. అందుకు భార్య మిక్కి-లికోపించి తనవల్లనపరాధములేదని చెప్పి యిట్లనియె. నామీఁద ని ష్కారణము మీరపనింద వేయుచున్నారు. నావల్ల లోపమున్న పక్ష మున నాఱునెలలుదిరుగకుండ నాపసపుకుంకుమ పోవలెను మీవల్లలో పమున్న నాయుసురుకొట్టి మీరే పోవుదురు. ఆపలుకులు విని మగఁ డు రెండువిధములచేత నేనే పోవలెనని చెప్పితివిగాని నీకేమి బాధ లేదు. ఇదియేమి వట్టి పాపాత్మురాలా! యని నోరుమూసికొని యూరకుండెను.

---

84. ఒకలోభి తనయిల్లుశిథిలమయిపోఁగా దానిని బాగుచేయిం చిన పక్షమున ధనమువ్యయమగునని బెంగగొని యాపాతయింటిలో నే కాలక్షేపముచేయుచుండెను. ఒకనాఁడు గొప్పవాన గురియగా నింటనిలుచుట కైన వీలు లేనందున లోభితల తడియకుండ కిటికీలోఁగూ ర్చుండెను. ఆదారింబోవుచున్న మిత్రుఁ డొకఁడు వానిం బిలిచి "ఓ యీ! ఇంత యిబ్బంది పడియెదవేల? ఇల్లునేయించుకొనరాదా" యని యడిగెను. "ఇంత వానలో నిల్లు నేయంచుకొనుట యెట్లు?" అని లోభి వానికి బదులు చెప్పెను వాన వెలిసినతరువాత నేయించుకొన వలసినయవసర మేమున్నది. అని లోభి ప్రత్యుత్తరమిచ్చెను.

---

85. సంస్కృతముఁ జదువు కొనుచున్న శిష్యుఁ డొకఁడు ‘అయ్యా! విద్యనెప్పుడు సమాప్తము చేయవలయు, నని ప్రసంగవశ ముననడుగ గురువు వానికిట్లనియె. క్రొత్తపాఠము ప్రాతపాఠము నొ క్కరీతిగా నెప్పుడుండునో యప్పుడు చదువు మానవచ్చును. ఆపలు కులువిని శిష్యుఁడు "స్వామీ! నాకిప్పుడే క్రొత్తపాఠము పాతపాఠ ము నొక్కరీతిగా నున్నవి. క్రొత్తది యర్థమగుటలేదు. ప్రాఁతది జ్ఞా పకముండుటలేదు. ఇంక నేను జదువు మానవచ్చునా" యని యడిగె

ను. గురువు వానిమాటలు విని నవ్వి యోరీ! మూర్ఖుఁడా! నాయర్థ మిదికాదు. ఎవరేని యొక పుస్తకము చేతికిచ్చిన నాపుస్తకము చదివి నట్లుచదివి యర్థముచెప్పఁగలసామర్థ్యము వచ్చినప్పుడు మానవలయు నని నా యభిప్రాయము.

---

86. మిక్కిలిపిరికియగు నొకబ్రాహ్మణుడును వానిభార్యయు బిడ్డలు నిద్రించుచుండగా నొకనాఁడు రాత్రి వారియింట నొకదొంగ ప్రవేశించెను. దైవవశమున భార్యకు మెలఁకువ వచ్చినందున నామె ధైర్యవంతురా లగుటచే లేచి దొంగచేతులు రెండును గట్టిగపట్టుకొని వానినిఁగదలనీయక పెనిమిటిని కేకలువేసి పిలిచెను. పెనిమిటి మేలుకొని భయముచే గడగడ వడఁకుచు దొంగదరికైనరాకపోవుటయే గాక మీదుమిక్కిలి భార్యను బిలిచి "యోసీ! తెలివిమాలినదాన! దొంగ మోటవాఁడు కఱవఁగలఁడుసుమాజాగ్రత్త" యని పలికెను. అదివఱకుపట్టువదలించుకొనుట కేయుపాయమును దోఁచక చింతించుచున్న దొంగవాఁడు మంచియుపాయము దొరకినదని సంతోషించియాయిల్లాలిచేయి నెత్తురుకండ లూడివచ్చునట్లు గట్టిగా కొఱికి విదిలించి కొని పారిపోయెను.

---

87. ఒకపర్యాయము ధర్మరాజు తమ్ముఁడగు భీముఁడు త్రేతాయుగమున కుంభకర్ణుఁడు పట్టె యుద్ధముచేసిన యాయుద్ధములను దెచ్చుకొనవలయునని లంకానగరమునకుఁ బోయెనఁట. అక్కడికిఁబోవునప్పటికి సాయంకాలమయినందున నతఁ డొకకోనేటియొడ్డునఁ గూర్చుండి సంధ్యావందనంబు చేయుచుండెనఁట. అప్పుడు పశులకాఁపరి యగు రాక్షసబాలకుఁడొకఁడు భీమునిఁజూచి వికవికనవ్వి ఏమయ్యా! నీవు శుచి యెఱుఁగవా?యిచ్చటసంధ్యవార్చుచున్నావేమి? అబ్బెబ్బె" యని పలికెను. భీముఁడామాటలువిని తెల్లఁబోయి కారణమేమనియ

డుగ నాబాలుఁడిట్లనియె. "ఇదికోనేరుగాదు. మొన్నటివానకుఁ గుంభకర్ణునిపుఱ్ఱెలో నీళ్ళు నిల్చినవి. ఇది నీవు కోనేరనుకొని యిట్లు చేపితివి గాఁబోలు" నని చెప్ప విని భీముఁడు "కుంభకర్ణునితలయే యింతయున్నపుడు వానిచేతులెంతయుండును. వానియాయుధములెంతయుండు నని తన కాయాయుధములు తగవని సిగ్గుపడి పాఱిపోయెను.

---

88. ఒకబ్రాహ్మణుఁడు తన కొడుకును పెద్దపండితుని జేయవలయునని ముందుగా వాల్మీకి రామాయణమును జెప్పనారంభించెను. కొడుకు రామాయణశ్లోకముల యర్థము తెలియకపోయినను తెలిసినట్టు నటించుచు పెద్దపుస్తకము పట్టినప్పటినుండియుఁ దనకుఁజక్కగా నిద్రపట్టుచున్నదని తండ్రితోఁ జెప్పెను. రామాయణార్థము బోధపడుటచేఁ గొడుకున కట్లు చక్కగా నిద్రపట్టుచున్నదని తండ్రియనుకొనెను. ఒకమాఱు మఱియొకపండితుఁడు వచ్చి రామాయణములో రెండుశ్లోకముల కర్థము చెప్పుమని కొడుకునడుగ నతఁడు చెప్పలేక నోరుఁదెఱచెను. ఆపండితుఁడు వెళ్ళినపిదప తండ్రి కొడుకును శిక్షించి పెద్దపుస్తకము బట్టినప్పటినుండియు నిద్రచక్కగాఁ బట్టుచున్నదని యబద్ధమేల చెప్పవలయునని యడిగెను. ఆమాటకుఁ గొడుకిట్లనియె. నేనబద్ధము చెప్పలేదు. ఆపుస్తకము పెద్దదగుటచే నాకు మంచి తలగడగా నుపయోగపడుచున్నది అందుచేత సుఖముగా నిద్రపట్టుచున్నదని చెప్పితిని, కాని రామాయణార్థము తెలియుటచే నిద్రపట్టుచున్నదని నేను చెప్పలేదు. ఆపలుకులు విని తండ్రి కొడుకు తెలివిమాలినతనమునకు సిగ్గుపడి యూరకొనెను.

---

89. ఒకబ్రాహ్మణుని కుమారుఁడు కాశికిఁబోయి చతుశ్శాస్త్రములుఁ జదివి గొప్పపండితుఁడై వచ్చెను. వచ్చినదిమొదలు వానిని జనులందఱు మిక్కిలి గౌరవించుచు తండ్రితో "అయ్యా! మీరదృష్ట

వంతులు మీకుమారుని వంటి పండితుఁడు మఱియొకఁడు లేఁడు సు మండీ'' యనుచు వచ్చిరి. అట్లు జనులు మిక్కిలిపొగడుటచేఁదనకుమా రునకాయుఃక్షీణమగునని భయపడి తండ్రివారితోఁ 'వాని కేమి తెలియు నండీ! వాఁడు పిల్లవాఁడు తెలియనివాఁడు' అని వినయముగాఁ బలు కుచుండును. తండ్రిభావమెఱుఁగలేక కొడుకు తనకుఁ దండ్రి యప్ర తిష్ఠఁ దెచ్చుచున్నాఁడని కోపించి యామాట తల్లితోఁ జెప్పి తండ్రిని విడిచి తా నేదేశమైనఁ బోవుదునని పయనమయ్యెను. తల్లివానిని బ్రతి మాలాడి వారించి కొడుకు ప్రజ్ఞాహీనుఁడని పలుకుటకుఁగారణమేమని మగనినడిగెను. తండ్రి నవ్వి 'ఓసీ! మూర్ఖురాలా! కుమారుని ప్రజ్ఞలు తండ్రి కొనియాడినను వేరొకరు కొనియాడుచుండగా విని యూరకు న్నను వాని కాయుఃక్షీణమని పెద్దలు చెప్పుదురు. అందుచేత నేనట్ల నుచుంటినిగాని మనపిల్లవానివంటిపండితుఁడు లేఁడని నేనుమాత్రమె ఱుఁగనా' యని పలికెను. చాటునుండి కొడుకాపలుకులు విని తన దే తప్పని తెలిసికొని బుద్ధితెచ్చుకొని యూరకొనెను.

---

90. ఒకపిల్లవాఁడు తల్లిదండ్రుల మాటలువినక చదువుకొనక యెల్లప్పుడు స్నేహితులయిండ్లకుఁ బోయి యాడుకొనుచుఁగాలముబు చ్చుచుండెను. తండ్రి వానిపై పలుమారు కోపించి కొడుకుతో నా యనా! నాకిద్దఱికంటె నెక్కువ స్నేహితులు లేరు. నీకింతమంది యె ట్లుదొరికినారో యెఱుఁగను నీచదువు పాడుచేయునట్టిద్రోహులేకా ని సమయము వచ్చినప్పుడు సహాయముచేయు నిజస్నేహితులుగారు. వారినినమ్మి నీవుచెడిపోవద్దు. అనినొక్కి చెప్పెను కుమారుఁడా పలు కులువిని కోపముతో మండిపడి నీకిద్దరే స్నేహితులున్నారుగానినాకు నూరుమందియున్నారు. అవసరమైనప్పుడు వారందఱు బ్రాణములిమ్మ న్న నిచ్చెడివారెకాని నీస్నేహితులవంటివారు గారని పలికెను. తండ్రి కొడుకుమూర్ఖతకు విస్మయమంది నామిత్రులను నీమిత్రులనుఁబరీక్షించి

చూతమని కొడుకు నొప్పించి వానిని వెంటఁబెట్టుకొనివాని స్నేహితుల యొద్దకుఁ బోయి వారితో నిట్లనియెను. "నాయనా ! నాకుమారుఁడు మీకుఁ బ్రాణస్నేహితుఁడు గదా వాఁడు నిన్నటి రాత్రి కోపావేశమున నొకమనుష్యుని నఱికి చంపినాఁడు. ఈవిషయమున మీరు వానికిగట్టి సహాయము చేయవలయును." ఆమాటలు విని కుమారుని స్నేహితులు తెల్లబోయి 'మాకతఁడు స్నేహితుఁడే కాఁడని కొందఱును, వానిని మేమెఱుఁగనేయెఱుఁగ, మని కొందఱును, నట్టివాఁడు స్నేహితుఁడని చెప్పుకొనుటకు మాకు సిగ్గుగానున్న, దని కొందఱును, వాఁడు తప్పక శిక్షపొందవలసినవాఁడె, యని కొందఱును జెప్పి మెల్లమెల్లగ జారిరి. కుమారుని ప్రాణమిత్రులనడత కుమారునకుఁ జూపినపిదప తండ్రితన స్నేహితులను గూడ శోధింపఁదలఁచి కొడుకుందోడ్కొని తన మొదటిస్నేహితునియొద్దకుఁ బోయి తనకుమారుని యాపద విన్నవించెను. ఆమిత్రుఁడు వానిం గౌఁగిలించుకొని "మిత్రుఁడా! నీకువచ్చినభయము లేదు. నేను మిక్కిలి సంపన్నుఁడను. నావద్దనున్న ధనమంతయు వ్యయముచేసి నీకుమారుని ప్రాణముఁ గాపాడెద"నని యభయమిచ్చెను. తరువాత నతఁడు రెండవస్నేహితునియొద్దకుఁ బోయి సంగతి నెఱిఁగించిపుత్రభిక్షను తనకుఁ బెట్టుమని వానిం బ్రార్థింప నతఁడిట్లనియె. "మిత్రుఁడా! యీయాపద నాదిగాని నీదిగాదు. నీకొక్కఁడే కుమారుఁడు. నాకైదుగురు కుమారులున్నారు. కావున నేరము నాకుమారులలో నొకఁడు చేసినాఁడని చెప్పి శిక్ష వాఁడు పొందునట్లునేనేర్పాటుచేసెదను. నీకునేను స్నేహితుఁడనై నందుకు నీకిప్పుడుపకారము చేయకపోయినపక్షమున నాస్నేహమెందుకు? భయపడక వెళ్లుము." ఆమాటలు విని కొడుకాశ్చర్యపడి తండ్రిస్నేహితులు నిజమైన మైత్రిగలవారనియుఁ దనమిత్రులు పనికిమాలినవాండ్రనియుఁ దెలిసికొని బుద్ధిఁ గలిగి వారిచెలిమి మాని బాగుపడెను.

---

91. ఒక యల్లుఁ డొకమా అ త్తవారియింటికి వచ్చెను. అతఁడ క్కడనుండఁగా నాగులచవితి పండుగవచ్చినందున న త్తవారు చిమ్మిలి దొరిక్కి యింటనందఱకుఁ దలయొకకొంచెము పెట్టి యల్లునకుఁగూడ కొంచెము పెట్టఁవచ్చెను. పెట్టగానే పుచ్చుకొన్నచో బెట్టుసరి తగ్గునని యల్లుఁడుతనకది యక్కర లేదని నిరాకరించెను. నిరాకరించినది మొద లు వానిమనసు చిమ్మిలిమీఁదనే యుండుటచే తుట్టతుదకు కోరికెపట్ట లేక యర్ధరాత్రమున నింట నందఱు నిందిరించుచున్నపుడు మెల్లమెల్ల గా నతఁడు లేచి చిమ్మిలిదొరిక్కిన రోలువద్దకుఁ బోయి యారోటిలోఁ దలబెట్టి చిమ్మిలినాకఁజొచ్చెను. దైవవశమున వానితల రోటిలో నిఱు కుకొని పోయి యెంతప్రయత్నించినను మఱల రాదయ్యెను. తెల్లవా రగట్ల మామగారు లేచి ముందుగా కుక్క రోలు నాకుచున్నదనుకొని చేతికఱ్ఱతో రెండుబాది తరువాత మనుష్యుఁడని తెలిసికొని దీపముదె చ్చి యింటనందఱను లేపి యెంతో కష్టముమీఁద నల్లునితలరోటనుం డి యూఁడదీసెను. తనచర్య దలఁచుకొని తానే సిగ్గుపడి యల్లుఁడు వెం టనే తనయూరికిఁ బోయెను.

---

92. అడవిమృగమువంటి యొకమనుష్యుఁ డత్తవారి యింటికిఁ బోయి యదివఱ కెన్నఁడు నతఁడు దీపము జూచి యెఱుఁగక పోవుట చేనచ్చట నొక దీపము జూచి మిక్కిలి యాశ్చర్యపడి యది యేదో విచిత్రమైనవస్తువనుకొని యత్తవా రెఱుఁగకుండ దానిని దనయూరు తీసికొని పోవలయునని నిశ్చయించి యందఱు నిద్రించుచుండఁగా రెం డుజాములవేళ నాదీపము నింటిచూరులో దాఁచుకొనెను. అత్తవారి ది తాఁటాకుల యిల్లగుటచే నది వెంటనే యంటుకొనెను. ఇంటిలో నందఱు లేచిచూచునప్పటి కిల్లు నాలుగుమూలలుఁ బాగయు మంట యు చుట్టుకొనెను. ఇంటిలో మనుష్యులు ప్రాణములతో బయలప డుటయే కష్టమయ్యెను. గాలి విసురుగానుండుటచే వారియిల్లేకాకగ్రా

మమంతయుఁ బరశురామప్రీతియయ్యెను. ఇంటి కెవరు నిప్పుపెట్టినా రాయని యత్తవారు సందేహముఁనొందుచుండఁగా నిప్పులు చల్లబడిన వెనుక యల్లుఁడు కాలిన గోడలయొద్దకుఁబోయి తనవస్తువేదో పోయి నట్లు వెదకుకొనుచుండెను. ఏమివెదకికొనుచున్నావనిమామగా రతని నడుగఁగా నతఁడిట్లనియె. "గూటిలోఁ ప్రమిదెలోఁ బెట్టిన యెఱ్ఱకణిక నేనీచూరులోఁ దాఁచుకొన్నాను. అది యేమైనదో యని వెదకుకొను చున్నాను." ఆమాటలు విని మామగారుకోంపకు నిప్పుపెట్టినవాఁడల్లు డే యని గ్రహించి నిష్కారణముగా కూఁతురుగొంతుక గోసితిననియే డ్చి యూరకొనెను.

---

93. నిరక్షర కుక్షియైన యల్లుఁడు సంక్రాంతిపండగ కత్తవారి యింటికివచ్చెను. మామగారు పొలమునకుఁ బోయియుండఁగా నితర గ్రామమునుండి యొకమనుష్యుఁడు వానికి జాబొకటి తెచ్చెను. అల్లుఁడు చదువురానివాఁడని తెలియక యత్తగారాజాబు చదువుమని వానిచేతి కిచ్చెను. చదువురాదని చెప్పుకొనుట యవమానమని యల్లుఁడుజాబు చేతఁబట్టుకొని దానికేసి యొకమాఱును పైకొకమాఱును జూచుచు నేదోయాలోచించుచున్నట్లు కూరుచుండెను. అతఁ డూరకొనుటచే నాయుత్తరములోనేదో యశుభవార్త యున్నదని యాఁడువాండ్రం దఱు తొందఱపడి చదువుమని వానిని మఱింత తొందఱపెట్టిరి. ఎంత తొందఱపెట్టినను లక్ష్యపెట్టక యతఁడు త్తరముక్రిందపాఱవైచి మోకా ళ్ళపైఁదలపెట్టుకొని విచారింపఁజొచ్చెను. అతనివిచారముఁజూచి యే దోమరణము సంభవించినదని యింటివారందఱుఁ బెద్దపెట్టున నేడ్వ నారంభించిరి. వాండ్రియేడుపుచూచి యల్లుఁడును వారినిగాఁగిలించు కొని యేడ్వఁజొచ్చెను. అనేకులు వారిచుట్టును జేరి కారణము తెలియ క కళవళపడఁజొచ్చిరి. అంతలో మామగారుపొలమునుండివచ్చి యం దఱ వారిం దుఃఖకారణమడుగ భార్య మనకొంప మునిగిన దింకేము

న్నదని యుత్తరము చేతికిచ్చెను. ఆయుత్తరము చదువుకొనగానందు లోవానికుమారునకు మేనమామ పిల్లనిచ్చునని వ్రాయఁబడియుండెను. మామగారాసంగతి యందఱకు జెప్ప నందఱుఁ దెల్లబోయి "ముందుగా నల్లుఁడు కన్నులనీరు వెట్టుకొనెను. అందుచేత మేమునువిచారించితి"మని చెప్పిరి. మామగారల్లునిబిలిచి నీవెందుకు విచారించితి వయ్యా యనియడుగ నల్లుఁడిట్లనియె. 'నాకుచదువురాదు. ఉత్తరము నాచేతికియ్యగా నాకుఁజదువురానందునకు పుట్టెడుదుఃఖము వచ్చినది. అందుచేత నేడ్చితిని. అల్లుని తెలివి కత్తమామలేగాక చూడవచ్చిన వారందఱు సంతసించిరి.

---

94. పరమలుబ్ధుఁడగు నొకబ్రాహ్మణుఁడు మినుపసున్ని దినవలయునని కోరికవొడమ నది చేయించినచో నింటివారందఱుఁ దినఁగోరుదురనియు నట్లయిన దనసొమ్మెక్కువగ వ్యయమగుననియు నెంచి వేరేమఱియొకయింటఁ దనకుఁ గావలసినదంత చేయించుకొని యది యొక కుండలోఁ బెట్టి యటకమీఁదఁ బెట్టుకొని యనుదినముఁ దినుచుఁ దన యాలుబిడ్డలు తానింటలేనప్పుడు దానిం దిందురేమోయనుభయమున నది యొక దారుణమైన మందనియుఁ దనకు రోగముండుటచే దాను దినుచుంటిననియు రోగము లేనివారు తిన్నచోఁజత్తురనియుఁజెప్పిభయముపెట్టెను. గడుసుబుద్ధి యగు వానిపెండ్లాము మగఁడుతిను మందును గూర్చి కొంచెమనుమానించి యొకనాఁడతఁ డింటలేనప్పుడటకమీఁది కెక్కికుండమూతఁదీసి మినుపసున్నియనిగ్రహించి యందున్నయుండలన్నియుమిగెను. మఱునాఁడు మగఁడు వచ్చికుండజూచుకొని 'నామందేమిచేసితి" వని భార్యనుదర్కించెను. భార్య వానితోనిట్లనియె. అది దారుణమగు విషపుమందుఁకదా! అది నేనుతిన్నచో చచ్చియే యుందును. నేనుబ్రతికియుండుటచేఁ దిననిమాట నిజము. "ఆపలుకులు

విని మగఁడు స్వయంకృతాపరాధమని నోరుమూసికొని యూర కుండెను.

---

95. ఒక చిన్న జమీందారునొద్ద నొకమంత్రి యుండెను. ఆమంత్రిభార్య యొకనాఁడు చెఱువులో స్నానముచేయుచు తాను స్నానముచేయుచుండ మఱియెవ్వరు స్నానముచేయఁగూడదని కొంచె మావలస్నానముచేయుచున్న యొక బీదబ్రాహ్మణుని స్నానము మానిపొమ్మని వర్తమాన మంపెను. ఆబ్రాహ్మణుఁడు కొంచెము పెంకివాఁడగుటచే నామెమాటలు సరకుచేయక స్నానము చేసెను. ఆమెయు మహాకోపముతో నింటికిఁబోయి యాబండబ్రాహ్మణుని శిక్షింపుమని మగనిని బలవంత పెట్టెను. మంత్రియు భార్యకు దాసుఁడై మఱునాఁ డుదయమున బ్రాహ్మణుని దనవద్దకురమ్మని వర్తమానమంపెను. బ్రాహ్మణుఁడు సరేయని మంత్రిరమ్మన్నట్లు మఱునాఁడుదయమున వెళ్లక జాముపొద్దెక్కినవెనుక వెళ్లెను. బ్రాహ్మణుఁడు వేళకుసరిగా రానందుకు మండిపడి మంత్రి యాయాలస్యమునకుఁ గారణ మడిగెను అందుకు బ్రాహ్మణుఁ డిట్లనియె. అయ్యా! నేను నీయొద్ద కుదయమున బయలుదేరి వచ్చుచుండఁగా మార్గములో, లోకములో నాఁడువాండ్ర సంఖ్యయెక్కువా? మగవాండ్రసంఖ్యయెక్కువా? యనుసంశమును గూర్చి వివాదములు పొడమి మనయూరిగొల్లలు తమలోఁదారు కలహించుచుండిరి. అది తెలిసికొనవలసిన యంశము గనుక నాయంశ మెట్లుతీరునో చూతమని నే నచ్చటఁ గూర్చుంటిని. 'చివర కాయంశ మెట్లుతీరినది?' అని యడుగ బ్రాహ్మణుఁడు మంత్రికిట్లనియె. 'లోకములో నాఁడువాండ్రసంఖ్య యెక్కువ యని తుద కక్కడి పెద్దలు తీర్మానించిరి.' అనవుడు మంత్రి యాశ్చర్యపడి లోకములో నాఁడువాండ్రు మగవాండ్రుకొంచె మించుమించుగ సమానముగ నుందురు

కాని యాఁడువాం డ్రెక్కువగ నెట్లుందురు? ఈసందియ మక్కడ నెవరికిం దోఁచలేదా యని యడిగెను. మంత్రిపలుకులువిని బ్రాహ్మ ణుఁ డిట్లనియె. ‹అక్కడ నున్నవారిలో నొకనికీసందియముదోఁచినది ఆశీర్వానము చేసినవారిలో నొకఁడు వానికిట్లుత్తరము చెప్పెను. దేవు డు మగవాండ్రి నాఁడువాండ్రి సమాసముగనే సృష్టించెను. అందుచే లోకులలో సగ మాఁడువాండ్రున్నారుగదా; ఆఁడువాండ్రిమాట విని నిరపరాధులను బాధించునట్టిమగవాండ్రిగూడ నాఁడువాండ్రిలోనే చేర్పదగినవారు. కావున నీరెండుసంఖ్యలు గలిసినప్పుడు లోకములో మగవాండ్రికంటె నాఁడువాండ్రెక్కువకారా? బ్రాహ్మణునిపలుకులు విని మంత్రి తనమాటజ్ఞప్తికిఁ దెచ్చుకొని తనకతఁడు చక్కగాబుద్ధి చెప్పెనని వానిని బొమ్మనియెను.

---

96. ఇద్దఱుశూద్రులు నూతిలోనుండి తాఁబేలును దీసి దానిం జంపఁదలఁచి కఱ్ఱతో, పైబొరుసుమీఁదఁ గొట్టుచుండిరి. ఎన్నిదె బ్బలు గొట్టినను తాఁబేలు చావదయ్యె. అప్పుడాదారి నొకసన్యాసి పోవుచు వారియవస్థజూచి యిట్లనియె. ‹మేము సమస్తభూతములయం దు దయగల సన్యాసులము. మేము జంతువధనుగూర్చి యుపాయ ములు చెప్పఁగూడదు గాని యీతాబేలును వెతగిలవేసి పొడువుఁడు వెంటనే చచ్చిపోఁగల' దని పలికెను. శూద్రు లాప్రకారము దానిం జంపి తినిరి.

---

97. ఒకసన్యాసి యొకబ్రాహ్మణుని యింటికి భిక్షకుఁబోయి యాబ్రాహ్మణునకు వేదాంతశాస్త్రమునందలికొన్నిసంగతులుపదేశిం చెను. బ్రాహ్మణుఁడు, స్వామీ! పూర్వజన్మమున్నదా? పూర్వజన్మవృ త్తాంత మెఱిఁగినవా రెవరైనఁగలరా? యని యడుగ సన్యాసియిట్లని యె. అయ్యో పూర్వజన్మము లేకేమి. ఆవృత్తాంతములు నేనెఱుఁగు

దును. దాని కుదాహరణముఁ జెప్పెదవినుము. నీభార్యపూర్వజన్మము నందుఁ గుక్క. పూర్వజన్మగుణములామెయొద్దనింక నున్నవి. ప్రతిరాత్రియు నామె నీవీపునాకుచుండును. నిద్రలోనుండుటచే నీవదియెఱుంగవు. ఈరాత్రి మేలుకొని కనిపెట్టుము. ఆపలుకులువిని బ్రాహ్మణుఁడు రాత్రి కనిపెట్టదలంచి మధ్యాహ్నము పొలమునకుఁ బోయెను. పిమ్మట సన్యాసి బ్రాహ్మణునిభార్యనుబిలిచిఁఅమ్మా! నీవుత్తమవంశమునందుఁ బుట్టితివి. నీమగఁడు క్రిందటిజన్మమున నుప్పరివాఁడు సుమీ' యని పలికెను. ఆమాట లామె నమ్మజాలనని బదులుచెప్ప "అమ్మా! యీ రాత్రి వానివీపునాకిచూడుము. ఉప్పగానుండును. అతఁ డుప్పరివాఁడైనది కానిది నీవేయెఱుంగఁగల' వని చెప్ప నామె సరేయని లోనికిం జనియె. రాత్రిమగఁడు భార్యయేమిచేయునో చూతమని మేలుకొని యుండెను. మగఁ డుప్పరివాఁడగునో గాదో తెలిసికొనుటకై భార్య యతఁడునిద్రించుచున్న వాఁడనుకొని మెల్ల మెల్లగా వీపునాకెను. తోడనేభర్తలేచి ఛీ కుక్క యావలకుబొమ్మని కేకలువేసెను. ఛీ యుప్పరివాఁడాయనియామె వానిని గదిమెను. అప్పుడిరువురు నీవు కుక్కవు నీవుప్పరివాఁడవని యొకరినొకరు నిందించుకొనుచుండ ధ్వని విని చుట్టుపక్కలవారు లేచివచ్చిరి. తనగుట్టుబయలుపడునేమోయని భయపడి సన్యాసి తనగంతబొంత దీసికొని పారిపోయెను. చుట్టుపక్కలవారు కలహకారణము దంపతులవల్ల దెలిసికొని యది సన్యాసి చేసిన మోసమని తెలియఁజెప్పి వారిని శాంతింపఁజేసిరి.

---

98. సాముద్రికశాస్త్రవేత్తయొకఁడొకగ్రామమునువచ్చి యదృష్టలక్షణములను జెప్పుచు మేనమామచెవిలో వెండ్రుక లున్నపక్షమున మేనల్లునకు గొప్పయైశ్వర్యముఁగలుగునని చెప్పెను. ఆమాటలు విని యొక బ్రాహ్మణకుమారుఁడు చప్పునపయనమై మేనమామయున్న

యూరునకుఁబోయి యతని రెండుచెవులను బరీక్షించిచూచెను. సాముద్రికశాస్త్రజ్ఞుఁడు చెప్పినలక్షణములక్కడ లేకపోవుటచే నతఁడు విచారమునొంది యైశ్వర్యముగలుగు నుపాయమేదియుఁ దోచక పరమేశ్వరునిగూర్చి యుగ్రతపముఁ జేయఁబూనెను. అతని మహాతపస్సునకు మెచ్చి పార్వతీసమేతుఁడైన పరమేశ్వరుఁడు ప్రత్యక్షమయి నీకేమికావలయునని వాని నడుగ నతఁడు వారికినమస్కరించివినయమున నిట్లనియె. "నా మేనమామచెవిలో వెండ్రుకలు మొలిపింపవలయును. అదియే నాకోరిక." ఆకోరికవిని పార్వతీపరమేశ్వరు లచ్చెరువొంది ఓరీ మూర్ఖుఁడా! యిది యేమికోరిక! మంచిదేదైన గోరుమనిచెప్పిరి. ఆబ్రాహ్మణుఁడు వారిమాటలు సరకుసేయక "స్వామీ! జ్యోతిష్కుని మాటప్రకారము మా మేనమామచెవిలో వెండ్రుకలు మొలిచినతోడనే మాయింట సంపదలు నిలుచును మీరారవంతపనిమాత్రముఁ జేయుఁడు. మీరంతకన్న నేమియుం జేయనక్కరలేదు." అని యడుగ వారిద్దఱు నట్లేయని యంతర్హితులయిరి. బ్రాహ్మణుని మేనమామ చెవినిండ వెండ్రుకలు మొలిచెను. కాని యైశ్వర్యముమాత్రము కనుబొమ్మలమీఁది వెండ్రుకలవలె నెప్పటియట్లు నెదుగుబొదుగు లేక యుండెను.

---

99. పరమమూర్ఖుఁ డగునల్లుఁడు తనయత్తవారియింటికిఁ బోవ విద్యావంతులయిన వానిబావమరుదులు వానిమూఢత్వమునకుఁ బరిహసించి చదువుకొమ్మని వానికుపదేశముచేసిరి. అక్కడనున్న చుట్టములలో నొకఁడు మిక్కిలి బండయగువానికిఁజదువు రాదనినమ్మి,ముసలఃకిసలాయతే కి' మ్మనియడిగెను. ఆపలుకులువినియందరు నవ్వుటం జేసి యల్లుఁ డామాటలు జ్ఞాపకముంచుకొని యొకపండితునియొద్దకు బోయి యాశబ్దములయర్థ మేమని యడుగ నాపండితుఁడు "రోకలిచి

గుర్చునా” యని దానికర్థము. నీవంటి బండకు చదువు వచ్చునాయని దానిభావ” మనిచెప్పెను. అల్లుఁ డాపలుకులకు రోసమునంది కాశికిఁ బోయి పండితుఁడై రావలయునని నిశ్చయించి యెవరికింజెప్పక తెల్ల వాఱగట్ల లేచిపోయి కొన్ని దినములకుఁ గాశికి జేరి యచ్చటనొక మహావిద్వాంసు నాశ్రయించి తానెట్లుపండితుఁడుకావచ్చునని వానినడిగెను. పంచకావ్యములు నాటకములు జదువవలయునని విద్వాంసుఁడు చెప్ప నంతవఱకుఁ జదువుటకు దనకోపిక లేదనియు నంతకన్న సులభముగఁ బండితుని జేయుమనియు వానినతఁడడిగెను అట్లయిన శతశ్లోకేనపండితః యనువాక్యము చొప్పున నూరుశ్లోకములు చదివినయెడల పండితుఁడు కావచ్చునని యాయన చెప్పెను. అందుకుఁదనకోపిక లేదని యల్లుఁడుచెప్ప విద్వాంసుఁడుకనికరించి “చతుశ్శ్లోకేనపండితః” యనువాక్యము ప్రకారము నాలుగుశ్లోకములు చదివినవాఁడు పండితుఁడగునని చెప్పెను. ఆమాటలు వినినతోడనే మూఢుఁ డేనుఁగునెక్కినట్లు సంతసించి యానాలుగు శ్లోకములు నాలుగునెలలు కష్టపడి చెప్పుకొని పండితుఁడనైతిననుకొని గర్వముతో మరల నత్తవారియింటికి రాఁబయన మయ్యెను. వచ్చుచుండమార్గమధ్యమున చచ్చినగాడిదయొక్కటి కనఁబడెను. దానినిజూచినతోడనే వాని మనస్సునకు మున్ను జదువుకొన్న “అనాథప్రేత సంస్కారా త్కోటియజ్ఞఫలం లభే” త్తను వచనముజ్ఞప్తికి వచ్చెను. తోడనే యాదిక్కులేని గాడిదను దహనము చేసినచో తనకు పుణ్యమువచ్చునని నమ్మిదానిని గాల్చుటకు మెడకు బట్టచుట్టి బరబరలాగుకొని కొంతదూరము పోయెను. కొంతసేపటి కాబరువు మోయలేక విసికి యతఁడు తానేమిచేసిన తనకు సులభముగ ఫలముదక్కునని విచారించి “సర్వాంగేషు శిరఃప్రధాన”మ్మని కత్తితో దానితలఁ దెగ నేసి దాని మూటగట్టి నెత్తినిబెట్టుకొని కొంత దూరముపోయెను. కొంతద వ్వరిగినపిదప నదియు భారమగుటచే నత

నికి 'సర్వేంద్రియాణాం నయనం ప్రధాన' మ్మను మాట స్ఫురణకు రాఁగా నతఁడు సర్వేంద్రియములలోఁ గన్నులు ప్రధానములని యా గాడిద యొక్క రెండుగుడ్లు ముంజికన్నులలాగు నూడబెఱికి పవిత్రమైన చోట వాటిని దహనము చేయవలయునని పదిలముగ మోసికొని య త్తవారియింటికి వచ్చెను. వచ్చినమఱునాఁ డాయూరి రాజు కాశికి వెళ్ళి వచ్చినయాబ్రాహ్మణుని జూడఁగోర బావమఱఁదులు వానిని వెళ్లుమని బలవంతబెట్టిరి. రాజదర్శనము వట్టిచేతులతోఁ జేయఁ గూడదని తా ను తెచ్చిన యపూర్వవస్తువులను రాజున కీయదలంచి పట్టుకొనిపోయి రాజు దోసిలిలోఁ బెట్టెను. ఇదియేమని రాజు వాని నడుగ గాడిదగ్రు డ్లని యతఁడు బదులు చెప్పెను. కాశికిఁ బోయి గాడిదగుడ్లు తెచ్చితి వా యని రాజు పరిహాసము చేసెను.

---

100. మందమతియగు నొక యల్లుఁడు పండుగ క త్తవారియింటి కిఁ బోయినప్పుడు వాని వెంగలితనమునకు బావమరదులునవ్వి యెగ తాళిచేసిరి. అతఁడు మిక్కిలిరోషముజెంది తానును బావమరదులట్లు నెఱజాణగావలయునని నిశ్చయించుకొని నెల్లూరు నెఱజాణలకుఁ బ్రసి ద్ధికెక్కినదని వినుటచే గడుసుదనమునేర్చుకొనుటకక్కడకుఁ బోయెను అక్కడనున్న స్త్రీపురుషులందఱు గడుసువారే యనియు వారాడు మాటలన్నియుఁ గడుసువేయనియు వానికి నమ్మకముండుటచే ముందు గా తనయెదుట గట్టెలమ్మకట్టె లని కేకవేయుచు వంటచెఱకు నమ్ము చున్నయొక యాఁడుదానిమాటవిని యది నేర్చుకొనవలసిన గడుసుమా టయే యని దానినిగట్టిగా పదిమాఱులువల్లించి జ్ఞాపకముంచుకొనెను తరువాత మఱియొకఁ డెవఁడో దారినిబోవుచు నందుకు సందేహమే మని తనమాటలగొడవలో ననెను. అదియు నేర్చుకొనవలసిన రెండవ గడుసుమాటయని యాయన వల్లించెను. తానప్పటికి చాలగడువాఁ

డనయితినని నిశ్చయించి యామూర్ఖుఁడు నాఁటిరాత్రి సంగీతమునకు మిక్కిలి ప్రసిద్ధికెక్కినయొక వేశ్యాంగన యింటికి సంగీతమువినుటకుఁ బోయెను. తనగడుసుఁదన మామెకు ముందుగాఁ జూపవలయుననికట్టె లోయమ్మకట్టెలని పలికెను. ఆమాటవినినతోడనే యామె వాఁడుమూర్ఖుండని తలఁచి "మీరు సాక్షాత్తుయమధర్మరాజువాహనమేసుడీ" యనిపలికెను. తన మొదటిగడుసుమాటచే నంతటి రసికురాలిని సంతోషపెట్టితినని గర్వించి యామూఢుఁడు తనరెండవ గడుసుమాట బలుకుట కదేసమయమని 'అందుకు సందేహమే' మని యనెను. వెంటనే యావెలయా లొకకత్తెర తెచ్చి వానికుడిచెవిలోఁ గొంచెముముక్క గత్తిరించి పొమ్మనియెను. ఏలయిట్లుచేసితివి నేను గడుసువాఁడను గానాయని వాఁడడుగ నామె "నీవు గడుసువాఁడవే. మాయూరువచ్చిన గడుసువాం డ్రిందఱకు నిట్టియానవాలు వేయుదుము" అని బదులు చెప్పెను. చెవిపోయినను గడుసువాఁడన్నబిరుదు వచ్చినది గనుక యతఁడు మఱల యత్తవారియింటికివచ్చి మఱునాఁడుదయమున వీథియిరుగు మీఁద దంతధావనముచేయుచుఁగూర్చుండెను. అప్పుడాదారిని రెండుచెవులుగోసిన కుక్కయొకటి పోవుచుండ దానినిజూచి యామహానుభావుఁడు తనపెద్దబావనుబిలిచి 'బావా యీకుక్కమిక్కిలిగడుసుది. ఇది రెండుసారులు నెల్లూరువెళ్ళియుండవచ్చు' ననిపలికెను ఆపలుకులు విని వానిబావ మిక్కిలియాశ్చర్యపడి కుక్కకుగడుసుదనమెక్కడిది. అది నెల్లూరుపోవుటయేమిటి యని యడుగ నతఁడిట్లనియె. నీవెఱుఁగవా! నెల్లూరుపోయిన గడుసువాండ్రిందఱకుఁ జెవిగోయుటయాచారము. ఈగడుసుకుక్క రెండుసారులు వెళ్ళియుండుటచే దీనిరెండు చెవులుఁ గోయఁబడినవి. నీవిది నమ్మవేమో. ఇదిగోచూడు మిక్కిలి గడసరిసగు నేను నెల్లూరువెళ్ళినతోడనే నాచెవియిట్లుకోయబడినది. మీరు దేశములు వెళ్ళినవారుగారు, సంగతులు తెలిసినవారుగారు. తెలియ

నివారు తెలియనట్లుండరు. అని మందలింప వానిని వెనుకటివృత్తాంత మంతయు నడిగి తెలిసికొని వాని భావలు మఱఁదులు చుట్టములుమొ దలగువారందఱు గడుపులు పగులునట్లు నవ్విరి.

---

101. రేజీకటిగల యొకయల్లుఁడు సంక్రాంతిపండుగ నిమిత్త మత్తవారియింటికిఁ బోయెను. తనలోపమును వారికిఁ దెలియఁజేయుట కతనికిష్టములేనందున నతఁడు దార్ఢ్యముగలవానియట్లీవలకావలకుఁ బోవుచు నొకరాత్రి వాకిటిలోనున్న పాతరగోతిలోఁబడెను. ఆచప్పుడు విని బావమఱఁదులువచ్చి బావా గోతిలోఁబడితివా? యని యడుగ నత్తవారియింట పరువు నిలుపుకొనుటమంచిదని నేనుబడలేదు. పాతర గొయ్యి యెంతలోతున్నదో చూచుట కిందులో దుమికితిని దీని లోతింతతక్కువగానున్నదేమి? అనిబావమఱఁదులచేయూఁత బుచ్చు కొని మెల్లగాలేచి భోజనమునిమిత్తములోపలికిఁబోయెను. భోజనము చాలవఱకయినపిదప నత్తగారు బంతినున్న తక్కినవారికి మజ్జిగవడ్డిం చి యల్లుడుగదాయని వానికి పెరుగువడ్డించెను. అల్లుడు పరధ్యానము గా నుండుటచేతను నెదుట వడ్డించుచున్న యత్తగారగపడక పోవుట చేతను పెరుగువడ్డించునపుడు తొళుకుతొళుకుమను ధ్వనివిని తనవిస్త రిలో కుక్కకలియబడినదనుకొని కుక్కనుబెదరింపఁ బోయియత్తగారి నొకచంపకాయగొట్టెను. అత్తగారయ్యోయని వెనుకకుఁ బారిపోయె ను. మామగారు భావమరదులు మిక్కిలికోపపడి నీకిదియేమి వినాశ కాలమురా యనియడుగ నతఁడిట్లనియె. నేనంత తెలివితక్కువవాఁడ నుగాను. ఊరకకొట్టితినా! పంక్తినిగూర్చున్నవారి కందఱికి మజ్జిగవ డ్డించి యీమె నాకొక్కనికిఁ బెరుగువడ్డించినది. ఈవేళ నేనైనాను రే పు మఱియొక రగుదురు. భోజనమువేళ నిట్టిపక్షపాతము లెప్పుడు చే యవద్దనిబుద్ధి చెప్పితిని. ఆఁడువాండ్రికిఁ జేతితోఁజెప్పినగాని బుద్ధిరాదు

అనిచెప్ప నల్లునిమాటలు విని వారందఱు నతఁడు తెలివిగలవాఁడేయ ని సంతసించిరి. తరువాత నతఁడు పండుకొని రెండుజాములవేళ లేచి యావలకుఁ బోయి మఱల తనమంచముమీఁదికిఁ బోవుటకుదారి కన బడనందున నిటునటు దడుముకొని తిరుగులాడుచుఁ జిట్టచివరకతనిమం చమనుకొని యత్తగారిమంచముపైఁ గూరుచుండెను; అత్తగారదిరిప డిలేచి యిదియేమోయి యర్ధరాత్రిమున నిటు వచ్చితివనియడుగ న తఁడిట్లనియె. నేను నిష్కారణముగా మిమ్ము చెంపకాయ గొట్టితిని. అదిమీఁరు మనసులో నుంచుకొనక నన్నుక్షమియింపుఁడని బ్రతిమా లవచ్చితినని యుత్తరముచెప్పెను. అయ్యో! నాయనా! నీవునాబిడ్డవం టివాఁడవు. నీపైమనసులో నేమియుంచుకొనను; పోయి పండుకొనుమ ని యామె యెంతయు బ్రతిమాలెను. ఆమె యెంత బ్రతిమాలినను వినక "మీఁరు నన్నునామంచముమీఁదికిఁదీసికొనివెళ్ళికూర్చుండబెట్టి తిరా నాపైఁగోపములేనట్లు. అట్లుచేయకపోతిరా కోపమున్నట్లె" య నిపలికెను. ఆమె యందు కొప్పుకొని తనబిడ్డను దీసికొని పోయినట్లు వానినిదీసికొనిపోయిమంచముపైఁగూర్చుండఁబెట్టిమఱలనెప్పటిచోటు నకువచ్చి తాను నిద్రించెను. ఒక రాత్రి యన్నిపరాభవములు జరు గుటచే నతఁ డక్కడ నుండఁగూడదని నిశ్చయించి వెళ్ళిపోయెను.

---

102. ఒక బ్రాహ్మణగృహమునకు బిచ్చమునిమిత్త మొకదా సరి వచ్చెను. అపుడత్తగా రింట లేకపోవుటచే ముష్టివేయుటకువీలులేద ని కోడలు బిచ్చగానినిబంపివేసెను. అత్తగారుచెఱువునకుబోయిమఱ లనింటికివచ్చుచుఁ దనయింటిగుమ్మము దిగిపోవుచున్న దాసరినిఁజూచి దగ్గఱకు బిలిచి నీవెందుకుపోవుచున్నావని యడిగెను. బిచ్చమువేయు టకువీలులేదని మీకోడలు చెప్పినందున పోవుచుంటినని యతఁడుపలి కెను. ఆమాటలువిని యత్తగారు కోపమున మండిపడి "సరిసరి! నా

కోడలికేమి తెలియును వెళ్ళకురారా" మ్మని దాసరినిబిలుచుకొనివచ్చెను ఆమె తనకు ముష్టిపెట్టుననిసమ్మి దాసరిచాలసేపు గుమ్మమువద్దనిలిచి విసిగి "అమ్మా! ప్రొద్దెక్కుచున్నది. నన్ను పంపండి" అని బిగ్గఱగా నఱచెను. అప్పుడత్తగారివలకువచ్చి ముష్టివేయుటకు వీలులేదు పొమ్మ నిపలికెను. ఆపలుకులువినిదాసరయ్య తెల్లఁబోయి "యిదియేమమ్మా" మీకోడలు పొమ్మన్నప్పుడు నాదారిని నేనుబోవుచుండఁగనన్నువెళ్ళ నీయక బిచ్చము పెట్టుదానివలె రమ్మని యిట్లుచేయఁదగునా? అప్పుడే పోనిచ్చిన నేనీలోపల నాలుగిండ్లుతిరుగుదునుగదా" యనిపలికెను. అం దుకత్తగా రిట్లనియె. "ఓయీ! ఈయింటిపెత్తనము నాదిగాని నాకో డలిదిగాదు. కద్దని చెప్పినా లేదనిచెప్పినాఅత్తగారనునేనుజెప్పవలయు ను గాని నాకోడలెవతె? లేదని నేనిప్పుడుచెప్పుచున్నాను గనుక వెళ్ళుము.

---

103. ఒకముసలమ్మ చాలప్రయత్నముచేసి తన కుమారునకు వివాహముచేసెను. కోడలుకాపురమునకు వచ్చినదిమొదలు అత్తగారిని దిట్టుచు పలుమాఱు "అత్తా! నీవెప్పుడుచచ్చిపోదువమ్మా" యని యడు గుచువచ్చెను. గడుసుదియగు నత్తగారు కోడలితో "ఓసీ నీకడుపున రెండుకాయలు కాసినతరువాత చచ్చిపోవుదును. అంతవఱకు నన్నుం డనీయవే" యని వేఁడుకొనియెను. తరువాతనామెకొకకొడుకుపుట్టెను అపుడత్తగారిని చావుమని కోడలడుగఁగా నామె "యోసీ కుఱ్ఱవాని ముద్దుముచ్చటలు చూడనీయవే వీడికిపుట్టువెండ్రుకలుదీయుట,వడుగు చేయుటఁ జూచిపోయెదను." అని చెప్పెను. ఆరెండుకార్యములయిన తరువాత కోడలు మఱల నత్తగారిని జావుమని బలవంతము చేయ నామె "యోసీ పెండ్లికానీయవే. ఆముచ్చటగూడఁజూచిపోయెదను." అనిచెప్పెను. కుమారుని పెండ్లియైనపిదప ముసలమ్మనుబొమ్మని కోడ లడుగ నత్త మనుమఁడు మనుమరాలు కాపురము చేయుచుండఁగా

జూడవలయునని యున్నది. ఆపిల్ల కాపురమునకువచ్చినతరువాత నేనొక్క గడియయైన నుండను. తత్క్షణమే చచ్చిపోదును. ఈమాటనిజము. అంతవఱకు బ్రతుకని"మ్మని బ్రతిమాలుకొనెను. తరువాత రెండేండ్లకు మనుమనిభార్య కాపురమునకువచ్చెను. వచ్చినవెనుక నత్తగారిని జచ్చిపొమ్మని యెప్పటియట్లు కోడలు నిలువదీసి యడిగెను.అప్పుడత్తగారిట్లనియె "కోడలువచ్చినతరువాత నత్తగారు బ్రతుకగూడదు. గనుక నీవు నన్ను చావుమంటివి. ఇప్పుడు నీకోడలు కాపురమునకువచ్చినది. గనుక నీవును చావవలసినదే మనమిద్దఱమును గలిసియే చచ్చిపోవుదము రమ్ము." ఆమాటలువిని కోడలు తెల్లబోయి యదిమొదల త్తగారిజోలికిఁ బోవుటమానెను.

---

104. ఒకయత్తగారు కోడలికన్నముపెట్టక మలమలమాడ్చఁ జొచ్చెను. ఇరుగుపొరుగువారితోఁ గోడలు తనదురవస్థం జెప్పుకొని విచారింప వారందరు వచ్చి యత్తగారి నడిగిరి. అప్పుడత్తగారు వారితో "అమ్మా! నాకోడలు పుట్టినింటనుండి పదునెనిమిదిసేర్లకంచము దెచ్చుకొన్నది. ఆకంచములోనే యన్నముఁ బెట్టుచున్నాను. తిని లేదని యబద్ధమాడుచున్నది" అనిప్రత్యుత్తరముఁ జెప్పెను. ఆమాటలువిని యిరుగుపొరుగమ్మలక్కలు కోడలింబిలిచి యడిగిరి. అప్పుడామె యిట్లనియె. "అమ్మా! కంచముపదునెనిమిదిసేర్లదే. అందులోఁ బెట్టెడు మెతుకులు మాత్రము గుప్పెడే." అనిచెప్పి తనకత్తగారన్నము పెట్టినపు డొకమాఱాయన్నము వారికిజూపెను. వారందఱాశ్చర్యపడి యత్తగారిని మందలించి యన్నము సరిగఁ బెట్టించిరి.

---

105. ఒకసంవత్సరమున వర్షములుబొత్తుగ లేమిచే జనులు మిక్కిలిబాధపడఁజొచ్చిరి. కొందఱు సహస్రఘటాభిషేకముచేసిరి.కొందఱు గ్రంథపారాయణము చేసిరి. ఎంతకు వాన కురియక పోవుటచే

నొక యూరి బడిపంతులు తాను వానగురిపించెదనని ప్రతిజ్ఞపట్టి తన వద్దఁజదువుకొనుచున్న పిల్లలనందఱను దీసికొనిపోయి నడివీథిలో నిలువఁబెట్టి "యోరీ! మీరందఱు మెడలెత్తియాకాశమువంకఁ జూచుచు వానగురియవలయు వానగురియవలయునని గడియవఱకుఁ గేకలు వేయుఁ" డనియానతిచ్చెను. అట్లుచేయకపోయినచో పంతులుగారు చిల్లత్రాడుతో వీఁపుబ్రద్దలుకొట్టి కోదండము దీయించుననుభయమునఁ గేకలువేయనారంభించిరి. అప్పుడొక బ్రాహ్మణుఁడావినోదముంజూచి పంతులుగారిని బిలిచి "ఏమయ్యా పిచ్చిబ్రాహ్మణుఁడా! వానగురియవలయునని పిల్లలు గేకలువేసినంతమాత్రమున వానగురియునా, యనియడిగెను. వానికిబంతులుగారిట్లనిరి. "బాలవాక్యంబ్రహ్మవాక్య"మ్మని పెద్దలుచెప్పుదురు. బ్రహ్మవాక్యమువలనవానకురియకపోవునా. ఒక బ్రహ్మవాక్యమునకే వానలుకురియునప్పుడింతమందిబ్రహ్మలవాక్యములకు వానకురియదా." పంతులుగారిపలుకులకాబ్రాహ్మణుఁడిట్లని యుత్తరముఁ జెప్పెను. "బాలవాక్యం బ్రహ్మవాక్య"మ్మనుమాట నిజమైనపక్షమున మీరీపాటికి గడతేరవలసినదే. ఏలయన మీరు చిల్లత్రాడుతోఁ గొట్టినపుడెల్ల పిల్లలు "వీడమ్మకడుపుకాల వీఁడుచచ్చిపోయినబాగుండును." అని మనసులోఁ దిట్టుచునేయున్నారు. వాండ్రమాటలు బ్రహ్మవాక్యములయినయెడల నాతిట్లుతగిలి మీరీపాటికిఁ జావవలయుఁగదా" ఆయుక్తివిని పంతులుగారుసిగ్గుపడి పిల్లలందీసికొని యావలకుఁ బోయిరి.

---

106. ఒకబ్రాహ్మణునకుఁ దనబొరుగుననున్న వేంకటశాస్త్రి యను మఱియొకబ్రాహ్మణునితో విరోధముసంభవించెను. ఆమొదటి బ్రాహ్మణుఁడు వేంకటశాస్త్రినిబలుమారుతిట్టితిట్టి యెంతకుఁదనకసిదీరకపోవుటచే సంధ్యావందనము వార్చునపుడు ప్రవరచెప్పుటలో

"చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు" అని చెప్పవలసిన దానికి మాఱుగ "చతుస్సాగరపర్యంతం మాయింటిప్రక్కనున్న వేంకటశాస్త్రిలు గారి పిల్లలు గోవులుదప్పతక్కిన గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు" అనిచెప్పెను. నాలుగు సముద్రములమధ్యమందుగల సమస్త బ్రాహ్మణులకు గోవులకు శుభము గలుగవలయునని యామాటల యర్థము. తనకిష్టములేని బ్రాహ్మణునకుఁగూడ శుభముగలుగునేమో యనుభయమున నతఁడు వారికిఁదప్ప దక్కినవారందఱకు శుభము కలుగవలయునని కోరెను.

---

107. పూర్వకాలమందు దైవభక్తిగల యొకపరమయోగియరణ్యమందొకయాశ్రమమున వసించుచుండెను. వానిభక్తికి యోగ్యతకు మెచ్చి యప్పుడప్పుడు భగవంతుఁడువానికిఁబ్రత్యక్షమగుటయుఁ గలదు. భోజనము చేయునపుడు దనపంక్తిని రెండవమనుష్యుఁడుండవలయునని వాని కొకనియమముండెను రెండవవాఁడు దొరకనప్పుడా పరమయోగి భోజనము మానుకొనును. అతనిపంక్తికిఁ బ్రతిదినమొకరిద్దఱు దొరకుచునే వచ్చిరి. ఒకనాఁడుమధ్యాహ్నము రెండుజాములవేళ తొంబదియాఱేండ్లవయసుగలిగి నడుమువంగిపోయిశల్యచర్మావశిష్టుఁడైన యొకవృద్ధుఁడు వానియింటికతిథియైవచ్చియన్నము వేఁడెను. యోగి వానిరాకకుసంతసించిగౌరవించిస్నానముచేయించి "ముందుగా నీశ్వరప్రార్థనముఁ జేయుము. ప్రార్థనానంతరము భుజియింతమని చెప్పెను. వృద్ధుఁడు బౌద్ధుఁడగుటచేఁ బ్రార్థనమున కిష్టపడక "దేవుఁడులేఁడు ప్రార్థనములేదు గీర్తనములేదు. నాకాఁకలివేయుచున్న దన్నముపెట్టు" మని యడిగెను. భగవంతుఁడు లేఁడనివాదించువాని మొగముఁ జూచుటయు మహాపాతక మనితలఁచి యోగి వానికన్నముఁబెట్టకపోవుటయే గాక వానిని నాలుగుతన్ని యింటనుండి వెడలగొట్టి తా నన్నము

దినక భగవంతునిఁ దలఁచుకొనుచు నుపవాస ముండెను. అప్పుడు భగవంతుఁడు వానికిఁ బత్యక్షమై యిట్లనియె. "ఓ యోగీ! నీవుజ్ఞానివనియుఁ బరమశాంతుఁడ వనియు లోకులు చెప్పుకొందురు. ఇదియేనా నీశాంతము? ఆముసలివానితో నాలుగుగడియలు వేఁగలేకపోతివి నేను వానితోఁ దొంబదియాఱు సంవత్సరములనుండి వేగుచున్నాను. అభిప్రాయభేదము వచ్చినమాత్రమున నిరపరాధులను గొట్టుదురా! భగవంతుఁడులేడని యామూర్ఖుఁ డన్నమాత్రమున నేను లేకపోవుదునా! కావున నికముం దిట్టిపనులు చేయకుము." అని మందలింప యోగి సిగ్గుపడి తన చేసినపని క్షమింపుమని వేఁడుకొనెను.

---

103. పాలకొల్లులో వసియించు నొకబ్రాహ్మణునివద్ద పుల్లయ్యయను నొకసేవకుఁడుండెను. ఆబ్రాహ్మణుఁడొకనాఁడు రాత్రి "మన పుల్లయ్యను రేపు వేమవరము పంపవలయును. కాఁబట్టి యుదయమున వానిని సిద్ధముగ నుండుమను" మని భార్యతోఁ జెప్పెను. ఆపలుకులు వీధియరఁగుమీఁదఁ గూర్చుండి పుల్లయ్య విని యెక్కడికో పోయిమఱునాఁడు పగలు రెండుజాములకు మఱల నింటికి వచ్చెను. ఈలోపల యజమానుఁడు భార్యయు జాలసేపు పుల్లయ్యకొఱకు వెదకికొనియెందుంగానక తుదకు రెండుజాములప్పుడు వాఁడు రాఁగానే "ఓరీ! ఎక్కడకుఁ బోయితి వెందుండి వచ్చితి" వని యడిగిరి. "అయ్యా! రేపు పుల్లయ్యను వేమవరము పంపవలయునని మీరు రాత్రి యనుకొన్నారుగదా. ఆమాటలు నాచెవిని బడినవి. నన్ను మీరు పంపకమానరు మీచేతఁ జెప్పించుకొనకుఁడ ముందుగా బయలుదేఱివెళ్ళినాపని నేను జేసికొనివచ్చినచో బాగుండు నని వేమవరము వెళ్ళివచ్చితి" నని పుల్లయ్య ప్రత్యుత్తరము చెప్పెను. ఆమాటలువిని దంపతులు వాని మూర్ఖతకు నవ్వి "ఓరీ! యెవరియింటికి వెళ్ళవలయునో యెందుకు వెళ్ళ

వలయునో తెలిసికొనకుండ నూరక నడకచేటుగా వెడలి వచ్చితివా” యని మందలించిరి. ఈచిత్రకథయే లోకమందు పుల్లయ్య వేమవర మని సామెతయైనది.

---

109 ఒక వైష్ణవబ్రాహ్మణుఁడు తండ్రి యాబ్దికమ్మునకు మంత్రముఁ జెప్పుట కొకయద్వైతినిఁ బిలిచెను. వైష్ణవుఁడు భుజించుచుండగా నద్వైతి జూడఁగూడదు గనుక యతఁడు చాటుననుండి మంత్రముఁ జెప్పుచుండెను. పార్వణపూజ వచ్చినప్పుడు మంత్రబ్రాహ్మణుఁడు మొదటిముద్ద పుచ్చుకొనుఁడీ యని వైష్ణవునితోఁ జెప్పెను. వైష్ణవుఁడు మంచియాఁకలిమీఁద నుండుటచేఁ బుచ్చుకొనుటయనగాఁ దినుటయనుకొని యాపనిచేయనారంభించెను. ఇంతలో మంత్రము ముగియుటచే బ్రాహ్మణుఁడు రెండవముద్ద పుచ్చుకొనుడీ యనిచెప్పెను. వైష్ణవుఁడు కోపించి “యేమయ్యా! నేను మనుష్యుఁడ ననుకొన్నావా కాననుకొన్నావా? మొదటిముద్ద కడతేఱఁ బుచ్చుకొనకుండ రెండవముద్ద యెట్లు పుచ్చుకొనగల ననుకొన్నా” వని పలికెను. మంత్రబ్రాహ్మణుఁ డదిరిపడి “ఓరి దుర్మార్గుఁడా! పిండములు దినుచున్నావురా! శ్రాద్ధము చెడినది పుచ్చుకొనుట యనఁగాఁ జేతఁ బట్టుకొనుటగాని తినుటగాదురా’ యని కేకలువేసి లేచిపోయెను.

---

110. క్రొత్తగా నుపనయనమైన యొకబ్రాహ్మణ బాలునకు వాని పురోహితుఁడు సంధ్యావందనముఁ జెప్పఁబూని “ఓంభూః” అనుచోట ముక్కు పట్టుకొమ్మని చెప్పెను. ఆపిల్లవాఁడు దనముక్కు పట్టుకొనవలయు ననుమాట యెఱుఁగక లేచివచ్చి పురోహితుని ముక్కు పట్టుకొనియెను పురోహితుఁ డూపిరివిడుచుకొనుటకు వీలులేక వదులు వదులుమని గట్టిగఁ గేకలువేసెను. తాను వదులుగాఁ బట్టుకొన్నందుకు గుసవుగాపు కోపపడుచున్నారు. ఇంతకంటె బిగువుగాఁ బట్టుకొనవల

యుఁగాఁబోలు ననుకొని పిల్లవాఁడు ముక్కు మఱికొంచెముబిగువుగా బట్టుకొనియెను. అంతట గురువుగా రూపిరి యాడక గిజగిజతన్నుకొనన నారంభించిరి. అంతలో బాలునితండ్రివచ్చి యీ యవస్థఁజూచివానిని విడిపించి గురువుగారిని బ్రతికించెను.

---

111 ఒకరాజసభలో నెవ రెక్కువపిఱికివారని ప్రశ్నవచ్చెను. కోమటులే యెక్కువపిఱికివా రని మంత్రిచెప్పెను. ఆమాటరాజునమ్మ జాలక దాని యథార్థస్థితిని ఋజువుచేయు మనిచెప్పెను. అట్లేయని మంత్రి యొకసారి సంస్థానములో నున్న షరాబుల నలుగురనుబిలిచి నాలుగువేలరూపాయిలను వారిచేతికిచ్చి యాసొమ్ము బండిమీఁద వేయించుకొని నాలుగామడ దూరమున నొకయూరిలోనున్న యొక రాజబంధువునకిమ్మని దొంగలు వచ్చినప్పుడు రక్షించుకొమ్మని యొ క్కొక్కని కొక్కొకకత్తి యొక్కొకడాలు నిచ్చిపంపెను. కోమటులు నలుగురు నాయుధములఁబూని పోవుచుండ నడిదారిలోదొంగలడ్డము వచ్చి వారినందఱిని బెదరించి సొమ్ముదోచుకొనిపోయిరి. కోమటులు భయపడుచు రాజువద్దకువచ్చి సొమ్ముపోయిన దనిచెప్పిరి. అప్పుడు రాజు "మీయొద్ద నాయుధము లుండగా మిమ్ము దొంగలెట్లుదోఁచు కొని" రనియడిగెను. అప్పుడు కోమ ట్లిట్లనిరి. అయ్యా! మాచేతులు మాస్వాధీనమునలేవు. ఒకచేతిలోఁ గత్తి యొకచేతిలో డాలు బెట్టి దొంగలను గొట్టుమన్న నెట్లుకొట్టగలము చేతు లూరకున్నచోనేబని నైనఁ జేయుదుము నోటితోఁ గరవవలెనన్న వారు మాకందలేదు. ఇందు మాలోపమేమున్నది. ఆపలుకులు విని రాజు పక్కున నవ్వి కోమట్లకన్న బిఱికివారు లోకమున లేరని యొప్పుకొనెను.

---

112 ఒక పేదబ్రాహ్మణబాలకునకు వివాహసంబంధము కుది రెను. బాలకుని తల్లిదండ్రులుదమబిడ్డ కేమియునగలులేవనియెక్కడ

నుండి మో మెరువు దెచ్చి చెవులపోగులు పెట్టిరి. పెండ్లికూఁతురు తండ్రి పెండ్లికుమారుని జూడఁగోర సరేయని వాని తలితండ్రులు బాలకుని చెవిపోగులు పెట్టి తలఁద్రువ్వి మంచిబట్టలు గట్టఁబెట్టి పురోహితుని బాలకునియొద్ద నుండుమని తామావల నుండిరి. పెండ్లికూఁతురుతండ్రి వచ్చి పురోహితునిఁజూచి యితఁడేనా పెండ్లికొడుకని యడిగెను. పెండ్లికొడు కితఁడే కాని పోగు లితనవి గావని పురోహితుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. వచ్చినపెండ్లివారువచ్చినట్లె వెళ్ళిరి. వారు వెళ్లినతరువాత బాలుని తలిదండ్రు లట్టిమాటలు చెప్పినందుకు పురోహితుని నిందించి ముం దట్టి తెలివితక్కువమాటలు చెప్పవద్దని వానికి బుద్ధిచెప్పిరి. ఈసారి తెలివిగలిగియే మాట్లాడెదనని చెప్పి పురోహితుఁ డూరకొనెను. అంతఁ గొన్ని నాళ్ళకుమఱియొక సంబంధము వచ్చెను. అప్పుడు పెండ్లికూఁతురు వారిపక్షమున నొక బ్రాహ్మణుఁడు వచ్చి పెండ్లికొడు కితఁడేనా యని పురోహితునడిగెను. పెండ్లికొడు కితఁడే పోగు లతనివే యని పురోహితుఁడు సెప్ప వీరికిఁ జెవులపోగులైన లేవనుకొని యవలకుఁబోయిరి.

---

113. కొండవీటిసీమలోఁ గాపురముండు నొకబ్రాహ్మణునకు మందమతి యగుకొడుకు గలఁడు. ఆకుమారునకుఁ బెండ్లి బేరములు రాగా బెండ్లికూఁతును జూచిరమ్మని యాబ్రాహ్మణుఁడుతనకుమారునకు వాని మేనమామను సాయమిచ్చి పంపెను. మేనల్లుఁడు మిక్కిలి మోటువాఁడగుటచే మృదువుగ మాటలాడు మనియు, నన్నము దినునపుడు పెద్దపెద్దముద్దలు మ్రింగక చిన్నపిడచలు చేసికొని తిను మనియు, నాగరకత గలిగియుండు మనియు, మేనమామ త్రోవలో వానికి హితోపదేశముఁ జేసెను. మేనమామయు మేనల్లుఁడుఁ బెండ్లికూతురు వారింట రాత్రి భోజనమునకుఁ గూర్చున్నప్పుడు మేనల్లుఁ డన్నము గలుపుకొని మొదట దబ్బకాయంతముద్ద చేసి యదినాజూ

కుగా నున్నదో లేదో తెలిసికొనుటకుఁ గుడిప్రక్కనున్న మేనమామను బిలిచి యాముద్దఁ జూపి "మామా! ఇది పాళమేనా" యని యడిగెను. అంతకన్న ముద్ద తగ్గింపు మని మేనమామ చెప్పెను. ప్రక్కనున్న పెండ్లివారిపురోహితుఁడు వారిరువురిమాటలు విని యీ బాలిక నామోటుపశువునకుఁ గట్టవద్దని పిల్ల తండ్రితోఁ జెప్పెను.

---

114. ఒకమనుష్యుఁడు తీర్థయాత్రలు చేయుచుఁ దన పొట్ట బోసికొనుచుండెను. ఒకనాఁ డతఁడొకగ్రామమునుండి మఱియొకగ్రామమునకు బోవుచుండగాదారిలోగ్రొత్తమనుష్యుడొకఁడునీపేరెవరని వాని నడిగెను. నాపేరు భద్రయ్య యని యతఁ డుత్తరము జెప్ప "ఏమి భద్రియ్య" యని యతడు మరల నడిగెను. అందుకతఁ డిట్లనియె. ఏమి భద్రియ్యయో యిప్పుడు చెప్పను. ఎదుటియూరును బట్టి నాపేరు మారుచుండును.ఎదుటియూరు లింగధారులుండుగ్రామమైనచో నాపేరు వీరభద్రియ్య యగును. ఎదుటియూరు వైష్ణవుల గ్రామమైనచో నాపేరు రామభద్రియ్య యగును.

---

115. భాగ్యవంతుఁ డగునొకతురకవద్ద మంచియేను గొకటి యుండెను. అతని ముఖ్యస్నేహితుం డొకడు దనయింటవివాహమున బెండ్లికొడుకు నూరేగించుట కేనుగు నొకసారి యిమ్మని యడిగి తీసికొనిపోయెను. దైవవశమున నచ్చట యేనుఁగు మృతినొందెను. ఆస్నేహితుఁడు తురకవద్దకువెళ్ళి యేనుగు మృతిజెప్పి విచారించి దాని వెలగాని క్రొత్తయేనుగును గానిగాని యిచ్చెదనని చెప్పెను. తురక మహాకోపము గలవాఁడై నాకు దానివెల వద్దు క్రొత్తయేనుగు వద్దు నాయేనుఁగు నాకు గావలెను. ఏలాగున నిచ్చెదవో యి'మ్మని బలవంతపెట్టెను చచ్చిన యేనుఁగును మరల నెట్లు తేగల నని స్నేహితుఁడెంతబ్రతిమాలినను వాడు వినక ప్రతిదినము స్నేహితుని

యింటికిఁబోయి యేనుఁగునిమ్మని బాధపెట్టజొచ్చెను. ఆబాధపడలేక యాస్నేహితు డాయూరి కరణమువద్దకు బోయి చెప్పుకొనగా నతఁడీ యుపాయము జెప్పెను. "ఓయీ; ఈపర్యాయము తురక మీయింటికి వచ్చునప్పటికి మీయింటనున్న కుండలన్నిటిని వీధితలుపువెనుక దొంతరగ బెట్టుము. తురక మీయింటికివచ్చి తలుపు ద్రోసినతోడనే యవి పగిలిపోవును. అప్పుడు నాకుండలునాకుఁదెమ్మని నీవు పట్టుపట్టుము. దానితో వాఁడు లొంగగలఁడు. యాలోచనము విని సంతసించి యట్లే కుండలన్నియుఁ దలుపువెనుక దొంతరగ బెట్టెను. తురక కోపావేశమున వానియింటికి వచ్చి వీధితలుపు త్రోయగానే గబగబ కుండ లన్నియు బడి ముక్కలయ్యెను. వెంటనే యతఁడు వచ్చి "అయ్యో! నాకుండలన్నియు బగులగొట్టితివా" యని కేకలువేయ నారంభించెను. తురక దెల్లబోయి "పోనీ విచారింపకుము. ఈకుండల వెల నేనిచ్చెదను. నీవుక్రొత్తకుండలు కొనవచ్చు" ననిబ్రతిమాలెను. స్నేహితుఁ డామాటలు వినక క్రొత్తకుండలు నాకక్కఱలేదు.. ఈ కుండలు మాయింట మూడుతరములనుండి యున్నవి. కావున నాకుండలే నాకు గావలయు" నని పట్టుపట్టి యిమ్మని పీడించెను. ఆమాటలువిని తురక కొంచెమూసే పాలోచించి వాని కిట్లనియె. "మేము సబబులెఱిగిన మనుష్యులము. ఒకరిచేత జెప్పించుకొనము. మనము రాజీనామాచేసికొందము. ఇద్దఱము నష్టపడితిమి, నాయేనుగు నీవీయనక్కరలేదు. నీకుండలను నే నియ్యనక్కఱలేదు. ఆపలుకులు విని స్నేహితుఁడు మిక్కిలి సంతసించి తురకవాని మూర్ఖతకు నవ్వుకొనుచు బోయెను.

---

116. ఒక వైష్ణవుఁడు తురకయుం గలిసి గ్రామాంతరము పోవుచు దారిలో నొకటి రెండుచోట్ల దులసిచెట్లు కనబడ వైష్ణవుఁడు భక్తిచేత దళములు దీసి కండ్ల నద్దుకొని శిరస్సునం బెట్టుకొని చెట్లకు

ప్రదక్షిణము జేసెను. తురక కాపని యిష్టములేకపోవుటచే వైష్ణవు నవమానింపవలెనని వాడు సంకల్పించి యాతులసిచెట్టు మొదలంట బెరికి వైచి కాలికిందబెట్టి రాచి వానిపై నుమ్మివైచెను. వైష్ణవు డందుకు మిక్కిలి దుఃఖపడి తురకవానిపాగ రణపవలయులని త్రోవలో దూలగుండచెట్టొకటి కనబడ దానికి బ్రదక్షిణముచేసి రెండాకులు కన్నులనద్దుకొని శిఖలో బెట్టుకొనెను తురక మఱింత కోపముతో మునుపటికన్న నెక్కువ యవమానము చేయవలయునని యాచెట్టూడబెరికి యాకులను జేతులతోను గాళ్లతోను సలిపి రాచి యావల బారవేసెను. వెంటనే చేతులు కాళ్ళు దద్దురులతో నిండి దురదపెట్ట నారంభించెను ఆబాధ పడలేక తురక యేడ్చుచు వడివడిగ నింటికి బోయి తనవారిలో 'అరే బాపనోళ్ల దేవుడు బలేజూటా మాకాలికి చేతుల్కి దెయ్యం పెట్టాడు వాడిజోల్కి పోగూడదు' అని చెప్పి దానికి వలయు నుపశాంతిఁ జేసికొనెను.

---

117. ఒకనవాబు హిందువులందఱు భారతగ్రంథమును మిక్కిలి గౌరవింతురనియు దానియందలి కథమిక్కిలి మనోహరమనియు నెవరో చెప్పఁగా విని తన మీఁద నొకభారతము రచింప వలసినదని గ్రామమునందున్న పండితులను బిలిపించి యాజ్ఞాపించి యాఱుమాసములు గడువుపట్టెను. పండితులు భయముచేఁ జిత్తమట్లేచేయుదుమని యావలకుఁ బోయి యిట్లు విచారింపఁజొచ్చిరి. "తన చరిత్రముభారతముగ నెట్లు చేయఁగలము? గ్రంథము చేయుటకుఁ దనచరిత్రమేమున్నది? కొంచెము చరిత్రమున్న నదినవాబుచరిత్రమగునుగాని భారత మెట్లగును? వీలులేదని చెప్పినచో బుఱ్ఱదీయించును. దీనికేమిగతి?" అట్లు వారు విచారించుచుండ నొక నియోగి యక్కడకువచ్చి వారి విచారకారణ మడిగి తెలిసికొని మీరు భయపడవద్దు. దీనికొక్కమం

చి యుపాయ మున్నది. ఆఱునెలల గడవు కాగానే నవాబుఁగొలువున కు నన్ను మీతోఁదీసికొనిపొండు మీకు బాధలేకుండ నేను జేసెద నని చెప్పెను. అట్లేయని యాఱుమాసములు గడచిన వెనుక వారు నియోగిని వెంటబెట్టుకొని నవాబు కడకుఁ జనిరి. వారినిఁజూచినవాబు "భారతము సిద్ధమైనదా?" యనియడిగెను. అప్పుడు నియోగిలేచియి ట్లనియె. "మహాప్రభూ! భారతమంతయు సిద్ధమైనది. రాత్రియనక పగలనక కష్టపడి వ్రాసితిమి. కాని మాకొక్కచోట చిన్న సందేహము తోఁచినది. అది యేలినవారిని స్వయముగ నడిగి తెలిసికొని పుస్తక ము పూర్తిచేసి తేవలెనని వచ్చితిమి. ఆసందేహమిది. భారతములో ద్రౌపదీదేవి కైదుగురు మగలున్నారు. ఏలినవారి జనానా వారికెం దఱు మగ లున్నారని వ్రాయుమందురో సెలవియ్యవలయును" అని నియోగిపలుకుటయు నవాబు. 'ఛీ! ఛీ! అదినఖారాపుస్తకం. మామీ ద మీరు వ్రాయవద్దు. ఇదివఱకు వ్రాసినది చింపి కాల్చివేయుఁడు' అని యాజ్ఞాపించి వారిని నిరపాయముగఁ బొమ్మని సెలవిచ్చెను.

---

118. దుష్టుఁడగునొకతురక వైష్ణవమతముపైఁగల ద్వేషముచేఁ దన కంటికిఁ గనఁబడిన ప్రతివైష్ణవునియొక్క పంగనామములు నాకివే యుట కారంభించెను. బుద్ధిమంతుఁడగు నొకవైష్ణవుఁడు తురకచేయు దౌర్జన్యమును సహింపలేక వానికి వానిబంధువులకు బుద్ధిచెప్పవలయు నని నిశ్చయించి యొకనాఁడు నాభి నఱుఁగదీసి సుద్దతోఁగలిపి పంగ నామము. బెట్టుకొని తురకయెదుటికి వచ్చెను. వెంటనే మహమ్మదీ యుఁడెప్పటియట్లు నాలుకఁజాచి వైష్ణవుని పంగనామములు మొదలం ట నాకి యింటికిఁజనియె. కొంతసేపటికి వాని నాలుక వెనుకకులాగ నారంభింప మొత్తుకొయని యేడ్చి మఱియొక గడియకు వాఁడు ప్రాణ ములు వదిలెను. నాభిమాట యెఱుఁగక వైష్ణవుల దేవుఁడు మహిమ

గలవాఁ డనినమ్మి యాయూరితురక లదిమొదలు వైష్ణవులజోలికిఁ బోవుట మానిరి.

---

119. ఒకనవాబు తనయింట నేదో గొప్పకార్యము జరుగఁగా సాటిబంధువుల నందఱిని విందునకుఁ బిలుచుచు స్వగ్రామములో నున్న బ్రాహ్మణులనుగూడఁ బిలిచెను. తమమతము చెడిపోవునని బ్రాహ్మణులందఱు మొఱ్ఱపెట్టుకొనినను వినక రానివారిబుఱ్ఱలుదీయించెదనని బెదరించెను. ఆదుర్మార్గునకు భయపడి బ్రాహ్మణు లొకకంట దుఃఖపడుచు వానియింటికిఁ బోయిరి. నవాబు తురకలపంక్తిని బ్రాహ్మణులకుఁగూడ పళ్ళెములలో నన్నము మాంసాదులువడ్డింపించెను. వడ్డన ముగిసినవెనుక నొకనియోగిబ్రాహ్మణుఁడు లేచి నవాబును జూచి "అయ్యా! మేము మీకూర లెన్నఁడుఁ దినినవారముకాము. అందుచే నడ్డించినప్రతివస్తువు పేరుఁ జెప్పవలయు"ననిపలికెను. సరేయని యట్లుచెప్పుటకు నవా బొకతురక నంప వాఁడు 'ఇదిగొడ్డుమాంసము. ఇది కోడిమాంసము. ఇది చేఁపలకూర, యని వేరువేరుగఁ జూపెను. అప్పుడు నవాబు నుద్దేశించి "అయ్యా! పందిమాంస మేది. అదిలేనిచో మాకు ముద్దదిగదు" అని పలికెను. తురకలు పందిమాంసముఁ దినరు. దానిని వారు ముర్దార్ (అనఁగాముట్టఁగూడనివస్తువు) అందురు. అందుచే నవాబు నియోగిమాటలువిని కోపోద్దీపితుఁడయి, 'ఛీ! ఛీ! అది ముర్దార్ దానిని మేముముట్టుకొన' మని కేకలువేసెను. "నీకుఁ బందిమాంసము ముర్దారయితే మా కన్నిమాంసములుముర్దారు లేకావా? కాఁబట్టి మాకదికూడ బెట్టింపు" మని యడిగెను. ఆమాటలకు నవాబు మఱింత కోపపడి తనబంట్లను బిలిచి "మోరీ! ఈదార్భాగ్యులు పనికిమాలినపందిమాంసముఁ దినువారు. వీరిబంతినిగూర్చుండి తినుట పాపము. కాఁబట్టి వీరి నావలకుఁదరిమివేయుఁ" డనియాజ్ఞాపిం

చెను. తోడనే వారు బ్రాహ్మణుల నందఱ నావలకుం బాఱఁదోలిరి, ఏలాగో యొకలాగు మాంసము మైలకూడుఁ దినకుండ బయటపడఁ గలిగితి మని సంతసించి యిండ్లకుఁబోయిరి.

---

120. ఒకఫాదుషా జమాబందీపేరుపెట్టి దేశమందున్నకరణముల నందఱఁ బిలిపించి తనకుఁ గథల చెప్పుమని వారినడిగెను. ప్రతికరణముఁ దనకు నచ్చినన్నికథలు చెప్పుచువచ్చెను నవాబుకథవినఁగానే 'ఫిర్ ఫిర్' అనెను. (ఫిర్ అనఁగా తురకభాషలోఁ దరువాతయనియర్థము.) ఎందఱెన్నికథలఁ జెప్పినను నవాబుతృప్తినొందక ఫిర్ అనుచుండెను. చెప్పినన్నికథలు చెప్పి మీఁద జెప్పలేక మాకిఁక రావని కరణము లూరకొనఁగానే నవాబు వారినందఱఁ జెఱసాలలో నుంచుచు వచ్చెను. కథలు చెప్పలేక జమాబందీకి వచ్చినకరణా లందఱు ఖైదులోఁబడిరి. అట్లు పడినకరణములలో నొకనికుమారుఁడు మిక్కిలిగడసరి తండ్రికి వచ్చినయాపత్తు విని ఫాదుషాయున్న చోటికిఁబోయి వానికిఁ దనివిగలుగునట్లు తాను కథలుఁ జెప్పఁగలనని వర్తమానమంపెను. ఫాదుషా పరమానందభరితుఁడయి వానిని లోపలికిరప్పించి గౌరవించి కథచెప్పు మనియెను ఆనియోగిబాలకుఁ డిట్లని చెప్పఁ దొడఁగె. "అనఁగనఁగనొకమఱ్ఱిచెట్టు ఆచెట్టునకు వేయికొమ్మలు. కొమ్మకువేయి పలవలు. పలవకు వేయియాకులు. ఒక్కొక్కయాకున కొక్కొకపక్షిచొప్పున నాచెట్టుమీఁద నొకనాఁడు గూర్చుండెను. అప్పుడొకవేఁటకాఁడు చెట్టువద్దకు వచ్చి చెట్టుమీఁది కొకబాణము వేసెను. తోడనే యొకపక్షి చచ్చి క్రిందఁబడెను. దానిని జూచి భయపడితక్కినపక్షులలో నొకపక్షి తుఱ్ఱుని పాఱిపోయెనుఁ" అనిచెప్పి యాబాలకుఁ డూరకొనియెను. తోడనే ఫాదుషా ఫిర్ అని పలికెను. బాలకుఁడు తుఱ్ఱుని జవాబు చెప్పెను. మరల నవాబు ఫిర్ అనెను. నియోగిబా

లుఁడు మరల తుట్టనెను. అప్పుడు నవాబుకోపించి "ఏమిది నీతు ట్రాంతవఱ కుండు' నని యడిగెను. "మీాఫిట్రాంతవఱకుంకునో నాతు ట్రాంతవఱ కుండును. ఆచెట్టుమీాఁద లక్షలకొలఁది పక్షు లున్నవి. అవి యొకమాఱెయెగిరిపోక యొకదాని వెనుకనొకటిగఁ బరుగెత్తెను. అవి యన్నియు వెళ్ళినట్లు చెప్పినగాని కథ ముగియదు. ఇది ముగిసిన గాని కొ్రత్తది చెప్పను" అని నియోగిబాలుఁడు వలుక నవాబు వి స్మితుఁడయి నాకిఁకఁ గథలక్కఱలేదు. నీవుపొమ్మనిపలికెను. అతఁడు దాను పోవుటయేగాకతక్కిన కరణములఁగూడ ఖయిదులోనుండి విడి పించి తనయూరికిం బోయెను.

---

121. ఒకసుల్తాను వేటకుఁ బోయి సాయంకాలమున నొక పల్లెటూరునకుఁ బోయి యక్కడ చెఱువులో స్నానముచేసి పెరుగ న్నముఁదిని పండుకొనియెను. దైవవశమున నతనికారాత్రి చలిజ్వరము వచ్చెను. జ్వరము రాఁగానే యతఁడాయూరు మునసబుకరణములఁ బిలిపించి నాకు జ్వర మెందుకువచ్చెనని యడిగెను. సుల్తాను నెట్లయిన దమయూరునుండి పంపివేయవలెనని మునసబు కరణములు మా యూరి నీళ్లు మాఁయూరిగేదెపెరుగు మంచివికావు మహాప్రభూ' యని పలికిరి. సుల్తాను వెంటనే యాయూరు విడిచిపోయి యదిమొదలు జనులలో నెవఁడేనేరముఁ జేసినను వాని కితర దండన విధింపక "ఈ దుర్మార్గు నాయూరు దీసికొనిపోయి చెరువులో స్నానముచేయించిగే దెపెరుగు, అన్నము పెట్టండి. దానితో వీనిరోగము వదిలిపోవు" నని యాజ్ఞాపించుచు వచ్చెను. నేరస్థులు హాయిగా స్నానముజేసి పెరుగ న్నము దిని సుఖపడుచు వచ్చిరి.

---

113. ఒకనవాబు తనరాజధానికిదగ్గఱనున్న యడవికివేటకుబో యెను. రాత్రిజేరాలు వేయించుకొని యతఁడు నిద్రింప నది చలికా

ల మగుటచే నెన్నిదుప్పట్లుగప్పుకొనినను జలియాగదయ్యె. అప్పుడున వాబు చలిచే గడగడ వడఁకుచు మేలుకొని పరుండెను. అంతలో న క్కకూతలు వానిచెవినిబడెను. నవాబు మిక్కిలిజాలిగుండె గలవా డగుటఁచే గాఁబోలు మంత్రినిబిలిపించి యిట్లనియె. "మంత్రీ! మంచి చొక్కాతొడుగుకొని యిన్నిదుప్పట్లుగప్పుకొన్న మనమేచలిచే నింత గడగడవడఁకుచున్నాముగదా? ఏగుడ్డలులేని నక్కలెంతవడఁకుచున్న వో! చలి కాగలేకనే కాబోలు నవి యంతగా గూయుచున్నవి. పాపము రేపుదయముననే బట్టలవర్తకుని బిలిపించి కావలసినగుడ్డపు చ్చుకొని వీటికన్నిటికిఁ జొక్కాలను గుట్టింపుము. నౌకర్లు శ్రద్ధగాఁ బనిచేయరు కుట్టించినదిలేనిది దెలిసికొనవలయునుగాన నాకునక్కలను జూపుము." ఆపలుకులువిని మంత్రి యక్కజపడి చెప్పినచొప్పునఁ జే యనిచో నవాబు బుద్ధిదీయించునని భయపడి మఱునా డుదయము న సేవకుల నలుదెసలకు బంపి పదినక్కలను బట్టి తెప్పించి వర్తకుల ను బిలిపించి గుడ్డలు చింపించి కుట్టించి తొడిగించి వానికిఁ జూపించెను. నవాబు నక్కలను జూచి సంతసించి తనవంటి ధర్మాత్ముఁడు లేడని కులుకుచుండెను.

---

113. గోలకొండనవాబొకఁడు లంకసీమకుజమాబందీనిమిత్తము వచ్చి యొక గ్రామములోడేరాలు వేయించుకొని యందులో బ రుండెను. నవాబునకు బ్రతిసంవత్సరము పన్నులిచ్చుకొనుచున్న సం పన్నులు తమ పన్నులు గొట్టివేయింపుమని మంత్రిని బ్రార్థించి వానికి గొంత లంచ మిచ్చిరి. అట్లేయని మంత్రి సమయముకొఱకు నిరీక్షిం చుచుండెను. అట్లుండ నొకనాటినడిరేయి మెన్నోనక్కలు చేరువనె కూయ నారంభించెను. దానిచే నవాబునకు నిద్రాభంగము కాగా నతఁడు మేలుకొని మంత్రినిబిలిపించి యేమి యీచప్పుడని యడిగెను.

మంత్రియదే మంచిసమయమని "స్వామీ! ప్రజలు పన్ను లిచ్చు కొనలేమని మొఱవెట్టుకొనుచున్నారు" అని యుత్తరముఁ జెప్పెను. మనుష్యులకంఠము లీలాగున నుండునా యని మరల నవాబడుగ మంత్రి యిట్లనియె. "ఏలినవా రెఱుఁగరు. లంకసీమమనుష్యులకంఠములు రాత్రి లిట్టేయుండును. ఒక్కొక్క మనుష్యులగొంతుక లొక్కొక్కవిధముగ నుండునుగాబోలు ననుకొని నవాబు మంత్రి మాటలుమెచ్చి వారిపన్నులు తీసివేసెను.

---

124. ఒకసాహేబు దారిని బోవుచుండఁగ నొకబ్రాహ్మణుఁడు వానిని బిలిచి "అయ్యా! మీరు చిక్కినట్లు కనఁబడుచున్నారేమి" యనియడిగెను. బ్రాహ్మణుఁ డట్లడుగుట తన్ను పరాభవించుట యనుకొని తురకకోపముతో నిట్లనియె. చిక్కుతాము. ఇంకాచిక్కుతాము. చచ్చిపోతాము. మాజోలి నీకి యెందుకోయి అమాటలువిని బ్రాహ్మణుఁడు భయపడి యూరకొనెను.

---

125. తెలివిమాలిన యొకనవాబువద్ద గడుసుదనముగల యొక బ్రాహ్మణుఁడు మంత్రిగానుండెను. మంత్రియందు మిక్కిలి నమ్మిక కలిగి నవాబు తన యధికార మంతయు వానికివిడిచెను. అట్లుండ నొకసారి మంత్రి తన నాశ్రయించిన బ్రాహ్మణులకు నవాబుతోఁ జెప్పకుండ నతనిసంతకముఁ జేసి మాన్యము లిచ్చెను. ఆసంగతి నవాబు కొంత కాలముః గడచినపిదప విని యట్లేలచేసితివని మంత్రినడుగ నతఁ డిట్లనియె. అయ్యా! మీకుజ్ఞాపకము లేదేమోకాని మీరిమ్మని సెల విచ్చుటచేతనే నీమాన్యములిచ్చితిని. అయిన నిప్పుడు దాని వలన నష్టము లేదు. ఆబ్రాహ్మణులవద్దనుండి యామాన్యములు మీరు మరలఁ బుచ్చుకొనుఁడు. అనిపలుక నవా బిట్లనియె. అదియేమిమాట

మాన్యములు నీవిచ్చువాఁడవు నేను బుచ్చుకొనువాఁడనునా? నే బుచ్చుకొనను. అని యాభూములు వారికే స్థిరపరచెను.

---

126. ఎండమొగ మెప్పుడునెఱుఁగని యొకనవాబుభార్యయొకసారి యకస్మాత్తుగ నంతఃపురమువిడిచి యీవలకువచ్చెను. తోడనే యెండతగలి యామెశరీరము చుఱ్ఱుమనెను. అప్పుడామె మహాకోపముతో భర్తయొద్దకుఁ బోయి "నేను గొప్పనవాబుభార్యనని యయినఁ జూడక యీసూర్యుఁడు తక్కినయాడువాండ్రశరీరములు గాల్చినట్లే నాశరీరమును గాల్చినాఁడు. వీనిపొగరు తక్షణమే మీారడపవలయు" ననిపలికెను. సూర్యుని పెంకితనమునకు నవాబును మిక్కిలి కోపమువచ్చుకొని ఫిరంగులు గాల్చి సూర్యుని బారదోలవలసినదని సేనాపతుల కాజ్ఞాపించెను. వెంటనే సేనాపతులు నూరుఫిరంగులు తెచ్చి యెడతెఱపి లేనుండ గాల్చిరి. ఆఫిరంగులపొగలో సూర్యబింబము కనబడకపోవుటచే నవాబు వానిభార్యయు దమప్రతాపమునకు సూర్యుఁడు జడిసి పారిపోయినాడని తలఁచి సంతసించి లోపలకుఁ జనిరి.

---

127. ఒక దేశపు రాజుగారొకనాడుదయమునగుఱ్ఱమెక్కిషికారునకుఁ బోయెను. ఆయన కోటవెడలనతోడనే యొకకాపువాఁడెదురుగ వచ్చెను. కొంతదూరము పోయినవెనుక గుఱ్ఱముబెదరి రాజుగారిని నేలఁ బడవైచెను. అందుచే రాజునకు గాలు నొప్పిపెట్టెను. అతఁడు వెంటనే కోటకువచ్చి యుదయమున దనకు మొట్టమొదట గనఁబడిన కాపువానిని బిలిపించి "నీమొగముపాడుమొగము ఈయుదయమున నీమొగము జూచుటచే నాకాలు నొప్పిపట్టినది. నావలెనే నీమొగము జూచినవారి కనేకుల కింకముందుగష్టములురాకుండనిన్ను జంపించెద' నని పలికెను. రాజుమాటలు విని తనకు జీవితాశ యెటులయినను లే

దని నిశ్చయించి కాపువాఁడు ధైర్యముతో నిట్లనియెను "స్వామీ! నా మొగముఁ జూచినందువలన మీ కొకచిన్న దెబ్బ తగిలినది ప్రాణభయిము లేదు ఈయుదయమున నేను మీమొగము జూచినందు వలన నాకు మరణమే కలుగుచున్నది కాబట్టి యెవరిమొగముఁ జూచుటవలన నపాయ మెక్కుడు కలుగునో దేవరవారే నిశ్చయింపవలయును" అన వానిపలుకులు విని రాజు కొంచెము విచారించి వానిని జంపక విడిచిపెట్టెను.

---

128 ఒకవర్తకునియొద్ద మందబుద్ధియగు సేవకుడుండెను.ఆవర్తకుడు దాము సరకు లమ్ముకొను కొట్టుమీద నౌకరును గూర్చుండబెట్టి యోరీ తలుపుజాగ్రత్తయని చెప్పి పనిమీద నెచ్చటికో పోయెను. యజమానుఁ డెంత సేపటికి రాకపోవుటచే నౌకరు మిక్కిలి యాకలి బాధచేతఁ దాళఁజాలక యజమానుఁడు రాకముందే యింటికి బోఁదలంచి తలు పేమయిపోవునో యనిభయపడి యుతగయెత్తి తలుపూడదీసి నెత్తినిబెట్టికొని యింటికిఁబోయెను. వాఁడు వెళ్ళినతోడనే కొందఱు దొంగలు కొట్టుజొచ్చి కావలసినసరకులు నెత్తికొనిపోయిరి పిమ్మట యజమానుఁడు వచ్చితనకొట్టు సంగతిఁ జూచుకొని నౌకరును బిలిపించి యిది యేమని యడుగఁగా వాఁ డిట్లనియె "అయ్యా! మీరు తలుపుజాగ్రత్తయని చెప్పినారు మీమాటను నేనుమీఱలేదు నేనిక్కడ నుండుటకు వీలులేనప్పుడు కష్టపడి యాతలుపునునెత్తినిబెట్టుకొని మోసి యింటికిఁ దీసికొనిపోతిని; తలుపు జాగ్రత్తగానేయున్నది దానికేలోపము లేదు" ఆమాటలు వినఁగానే వర్తకునకునవ్వు నేడ్పునొక్కసారియే రాఁగా సేవకుని తీసివేసెను

---

129 ఒకవర్తకుడు విలువగల కాశ్మీరశాలువలు బనారసుబట్టలు దెప్పించి యమ్ముచుండెను. అతఁడు తక్కువజీతమునకు వచ్చినాఁ డను

కారణముచేత బొత్తుగాఁదెలివిమాలినవానిని సేవకునిగా నుంచుకొనెను. ఒకసారి యావర్తకుఁడు విలువగలబట్టలు గోనిసంచులలో వేయించి తెప్పించి తనవాకిటఁ బడవేయించి పనిమీఁద నెక్కడికో పోవుచు నాకరునుబిలిచి యోరీ మబ్బువేసినది. వానవచ్చునేమోసంచులుతడవకుండ జాగ్రత్తచేయుమని చెప్పెను. సేవకుఁడు సరేయని యజమానుని బంపెను. పిమ్మట కొంతసేపటికి వాన ప్రారంభమయ్యెను. అప్పుడు సేవకుఁడు సంచులు తడిసిపోవునేమో యనుభయముచేతఁ జప్పుచప్పున సంచులువిప్పి యందులోనున్న శాలువలు బనారసుబట్టలు తీసి సంచులకుఁ బయిన చుట్టఁబెట్టి సంచులు తడవకుండఁ జేసెను. యజమానుఁడు కొంతసేపటికివచ్చి సంచులు తడవకుండ జాగ్రత్తపెట్టితివా యనియడుగ చిత్తము. జాగ్రత్తపెట్టితి నని చెప్పి వాఁడాయనకాసంచులఁ జూపెను. విలువగలబట్టలన్నియు నెందుకుఁబనికిరాకుండఁ దడిసి ముద్దయయిపోవుటఁ జూచి యజమానుఁడు లబలబ మొత్తుకొని యిది యేమిరాయని కేకలువేయ వాఁడిట్లనియె. "ఏమండీ సంచులు తడవకుండ జాగ్రత్తపెట్టుమని మీరు చెప్పినారు, అందుచేత నేను నా తల దడుపుకొని నానాకష్టములఁ బడి సంచులు తడవకుండ జాగ్రత్త పెట్టినందుకు నన్నెదురు తిట్టుచున్నారు, నామంచిమీకెప్పుడు పనికిరాదు. అనవుడు యజమానుఁడుకలిగిననష్టముచేతఁ గడుపుమండి నోటికి వచ్చినట్లుతిట్టి చేతికివచ్చినట్లు కొట్టి యాసేవకు నావలకుఁ బంపించెను.



130. పూఁటకూళ్ళుపెట్టి జీవనముచేయునట్టి యొకతె భోజనముకు వచ్చిన యొకమనుష్యునకు రాత్రి నెయ్యివడ్డింపఁబోయి నేతిగరిటె తిరుగవేసి వడ్డించి నేయిపడకుండఁ జేసెను. ఆమనుష్యుఁడు గడుసువాఁడగుటచే నది గ్రహించి తొందరతో "అమ్మా! దీపముదీపము. చేతిలో నేదోపడిన'దని యఱచెను. తేలో జెఱ్ఱియో చేతిలోఁ బడినదను

కొని భయపడి యాయవ్వచప్పుచప్పున దీపముఁ దీసికొనివచ్చి చూచి "నాయనా! ఏమియుఁ బడలేదు వట్టిభయ మేపడినావుసుమీ" యనిప లికెను. అప్పు డతఁ డిట్లనియె. "అమ్మా! యేమీ పడలేదన్నమాట నే నెఱుఁగుదును. ఆసంగతి నీకుఁ బ్రత్యక్షముగాఁజూపుటకె నిన్ను దీపముఁ దెమ్మని చెప్పితిని ఆమాటలు విని యచ్చట భోజనముఁ జేయువారందఱునవ్విరి. ఆయవ్వయు సిగ్గుపడి వానికి సరిగానేయివడ్డించెను.

---

131. బొత్తుగాఁదెలివిలేని యొకకుఱ్ఱవానినిబురోహితుఁడు పెండ్లికొడుకుచూపులకయి యొకయూరు తీసికొనిపోయెను. పోవుచుమార్గములో "కుఱ్ఱవాఁడా! పెండ్లివారు నిన్నేవయినమాట లడిగినప్పుడుతిన్నిమాటలు మృదువయినమాటలు నీవు చెప్పవలయునుజుమా" యని యుపదేశించెను. చిత్తమాలాగే చేయుదునని యావెఱ్ఱికుఱ్ఱఁడు పలికెను పిమ్మట బాలుఁడు పురోహితుఁడు పెండ్లివారియింటికిఁ బోయినపుడు పెండ్లికూఁతురుతండ్రి నీవేమి చదువుచున్నావని యడిగెను. తిన్నినిమాటలు చెప్పుమని గురువాజ్ఞాపించుటచే నామాట మనసులోనుంచుకొని యాబాలుఁడు కదురు, కాడి కరుకోలయని పలికెను. దగ్గఱగూర్చున్న పురోహితుఁడు మృదువయినమాటలాడుమని మెల్లగా జీవాట్లు పెట్టెను. వెంటనేయాబాలుఁడు దూది వెన్నపూస దున్నపోతు నాలుక యని మామగారితోఁజెప్పెను. మామగారు పెండ్లికుమారుని తెలివికి సంతసించి యాపూఁట యన్నముబెట్టి వారినిరువురను బంపివేసెను. పురోహితుఁడు పెండ్లికొడుకునుజూచి యిటువంటిమాటలెందుకంటివని యడుగ నతఁ డిట్లనియె. మీరు తిన్ననిమాట లాడుమని నాతోఁజెప్పిరి. కదురుకరుకోల వంకరలేనితిన్ననివస్తువులుగనుకనవియే తిన్ననిమాటలనుకొనిపలికితి. దూది వెన్నపూస మృదువయినవస్తువులు గనుక నవియే మృదువయినమాటలనుకొంటిని.

---

132. ఒకమనుష్యుఁడు లోకులనువంచింపఁదలఁచి యాపనిలోఁదన కు సాయముఁజేయుటకయి యొకతెలికులవానిఁ దెచ్చుకొని వానికొక శాలువఁ జుట్టి యొకసవారిలో వానిగూర్చుండఁబెట్టి యతఁడు మహా పండితుఁ డని చెప్పుచు నొకరాజునొద్దకుఁ బోయెను. ఈ యిద్దఱు వంచకులసంగతి యెఱుఁగక యారాజు వారు పండితులే యనుకొని చాల గౌరవించి వేదాంతశాస్త్రమునందుఁ దనకుఁగలసందేహములఁ దీర్చుకొనఁదలఁచి కొన్నిసంగతులడిగెను. కాని "గురువుగారు మౌన వ్రతముదాల్చినారు. ఆయన యెవ్వరితోఁడనుమాటలాడరు'అనిశిష్యుఁ డు రాజుతోఁజెప్పెను. అప్పుడు రాజు సంజ్ఞలఁ జేసి యామహాత్ముని యభిప్రాయముఁ దెలిసికొనవలయునని యొకసున్నఁ జుట్టి ముందొక వేలు తరువాత రెండువేళ్ళుఁజూపి యేమిటని యడిగెను. ఈబ్రహ్మాం డమునకు భగవంతుఁ డొక్కఁడా యిద్దఱా యనిరాజుగారి యభిప్రా యము. తెలికులవాఁడు వెంటనే యొకవేలు చూపించెను. రాజుగారు బ్రహ్మానందభరితు డయి భగవంతుఁడొక్కఁ డయినట్టు గురువుగారు చెప్పిరని సంతసించి వారికిద్దఱకు గొప్పబహుమానములు చేసి పం పెను. ఆమాయగురువు మాయశిష్యుఁడు రాజసమక్షమునుండి యీ వలకువచ్చి తమపన్నినపన్నుగడ చక్కఁగా నమకూరినదని సంతసిం చిరి. మాటలలో శిష్యుఁడు గురువునుజూచి రాజుగా రడిగినప్రశ్న వలన నీ కేమర్థ మయినదని యడిగెను. అప్పుడు గురు విట్లనియె. "నీకుఁదెలియనేలేదా? రాజుగారు నాసంగతి యెట్లో తెలిసికొని నీగా నుగ కొకయెద్దా రెండెడ్లాయని న న్నడిగినారు. నాకున్నదొకయెద్దే గనుక నొకటే యని నేను జెప్పితిని. ఆపలుకులు విని యొకరినొకరు కౌఁగిలించుకొని యాసొమ్ముపంచుకొని యెవరిదారిని వారుపోయిరి.

---

133. ఒకయూరినుండి మఱియొకయూరికిఁ బెండ్లివారుతరలివచ్చిరి ఆపెండ్లికొడు కపూర్వపుబుద్ధిమంతుఁడగుటచే నత్తవారి తెలివికనుగొం

దమని యాలోచించి విడిదెలో నటకమీఁద నెక్కి కూర్చుండెను. సుముహూర్తసమయము సమీపించుటచే మంగళస్నానములుచేయించుటకత్తవారు తనవారు వచ్చిన చుట్టములుఁ జుట్టుపట్లవారు నొకర్లు పెండ్లికొడుకునిమిత్తము తెగవెదకిరి. ఎంతవెదకినను గనఁబడకపోవుటచేఁ బ్రాణమువిసిగి మామగారాపిల్లను దనయింటనున్న మేనల్లునికిచ్చి పెండ్లిచేసెను. పిమ్మట పెండ్లికొడుకు కటకమీఁదనుండి కోయని కేకవేసి నన్నెవరు కనుఁగొనలేకపోయినారు. మీప్రజ్ఞ యింతేనా యని యడిగి దిగివచ్చెను వాని తెలివికిఁ బెండ్లివారు తనవారు లబ్బుబ్బున సంతసించిరి.

---

134. ఒకగడుసుబ్రాహ్మణుఁడుసాక్ష్యమిచ్చుటకుఁగచేరీకిఁబోయెను, న్యాయాధిపతి వానిసాక్ష్యముఁ బుచ్చుకొనుటకు ముందు నీవయసెంతయని యడిగెను. ఆబ్రాహ్మణుఁడు నాకు ముప్పదియవయేఁడని ప్రత్యుత్తరముఁ జెప్పెను. అప్పుడున్యాయాధిపతియాబ్రాహ్మణునిజూచి "నీవు వెనుక రెండుసంవత్సరములక్రిందట నానద్దకుసాక్ష్యమిచ్చుటకు వచ్చి యప్పుడును నీకు ముప్పదియేండ్లున్నవనియే చెప్పితివి. ఈయబద్ధ మెందుకు చెప్పితివి?" అని యడిగెను. అందుకాబ్రాహ్మణుఁడిట్లనియె. "నేనప్పుడొకమాట యిప్పుడొకమాట చెప్పువాఁడనుగాను. నేనెప్పుడు నొక్కమాటమీఁద నిలువఁబడియున్నాను. ఆమాటలు విని వానిగడుసుదనమున కందఱు నవ్విరి.

---

135. ఒకయూరుబడిపంతులుజీడిగింజకంటెనల్లగాయుండెను.ఆబడిలోనిపిల్లలు కొందఱొకనాఁడు కొంటెతనమునకై కొంచెముతారుదెచ్చి పంతులుగారికుర్చీకిబూసిరి. అయ్యవారు మొదట దానిని జూడక తరువాత దానిఁగనిపెట్టి "ఈపనిఁ జేసినదౌర్భాగ్యుండెవఁడురా" యని యడిగెను. ప్రతిపిల్లవాఁడునేనెఱుఁగను నేనెఱుఁగనని ప్రత్యుత్తరమిచ్చె

ను. అప్పు డయ్యవారు కోపముచే మండిపడి యందఱను గొట్టబోవగా మిక్కిలి తెలివిగల బాలుఁ డొకఁడు ముందునకువచ్చి యిట్లనియె. "అయ్యా! ఈపనిమే మెవరము చేసినదికాదు. మీరుచేసినదే ఇదిమీ శరీరములోనుండి పైకివచ్చిన చెమటగాని తారుకాదు. మీరు నల్లగా నుండుటచే మీచెమటయు నల్లగానున్నది" ఆపలుకులువినగానేపంతులుగారి కోపము మేరమీర నతఁడందఱిఁబట్టుకొని చావఁగొట్టెను.

---

136. ఒకబ్రాహ్మణునియింటికి నొకనాఁటిరాత్రి యొకదొంగ వచ్చెను. అలుకుడువిని బ్రాహ్మణుఁడు మేలుకొని వానిని బట్టుకొనఁ దలఁచి వాఁడు బలవంతుఁడగుటచే బట్టుకొనుట యసాధ్యమనియెంచి చప్పుచప్పునఁ దనపొడుముకాయదీసి గుప్పెడుపొడుము చేతఁబట్టుకొని దొంగ ముక్కుమీఁదజల్లి దొంగదొంగయని గట్టిగా నఱచెను. ఆ కేకలకిరుగు పొరుగువారందఱు లేచివచ్చిరి. దొంగ బ్రాహ్మణుని బారినుండి తప్పించుకొని పరుగెత్తఁజొచ్చెనుగాని వాఁ డేమూలదాగొన్నను పొడుము ముక్కులోఁ బడుటచేత వానికి లెక్కలేనితుమ్ములబాధ కలుగుటచేత వాఁడు క్షణములోఁ బట్టుపడెను. పట్టుపడిదొంగ బ్రాహ్మణునిజూచి "అయ్యా! ఇదియేమియన్యాయము. కొట్టవచ్చుఁ దిట్టవచ్చుఁగాని ముక్కులోపొడుముపోయవచ్చునా" యని యడిగెను. అందుకు బ్రాహ్మణుఁడు నీవుచేసినపని న్యాయమై నేను జేసినపని యన్యాయమైనదా? ఎట్లయిన నిన్నుఁ బట్టుకొనుటయేన్యాయమనెను.

---

137 చదువురాని యొకరాజువద్దకు యాచనము నిమిత్త మొకగొప్ప పండితుఁడువచ్చెను. ఆయన వేదములు మీమాంసశాస్త్రములు ధర్మశాస్త్రములుమొదలగునవన్నియు నేర్చుకొని సంపాదన నిమిత్తము బయలుదేరి యారాజు నాశ్రయించెను. ఆరాజువద్ద వేంకటశాస్త్రి యను నొకబ్రాహ్మణు డుండెను. ఈశాస్త్రిశబ్దమాయనకుఁ బుట్టకచే

తనేగాని చదువుచేతగాదు. ఆరాజసభ కేపండితుఁడు వచ్చినను వేంకట శాస్త్రియేదో మాయోపాయముబన్ని వానిని వెడలఁగొట్టుటపాడుక యైయుండెను. పరమమూర్ఖుఁడగునారాజు వేంకటశాస్త్రి విద్యావిహీనుఁడనియెఱుఁగక యితం డేమోగొప్పపండితుఁడని యెంచుచుండెను ఈక్రొత్తపండితుఁడు సభకురాగానే రాజు వానితో వాదముఁజేయుటకు వేంకటశాస్త్రిని బిలిపించెను. పండితుఁడు పాళితశాలువఁ జుట్టుకొని వచ్చినవేంకటశాస్త్రినిజూచి "అయ్యా! మనమేశాస్త్రములో వాదముచేయుద"మని యడిగెను. నాకన్నిశాస్త్రములు సమానముగ వచ్చును. ఏదైన సరేయని యతఁడు బదులుచెప్పెను. అదివిని పండితుఁడు సరే బ్రహ్మమీమాంసశాస్త్రము వాదింతము. మీరుపూర్వపక్షముచేయుదురా? సిద్ధాంతముచేయుదురా? యనిపలుక వేంకటశాస్త్రి యీమాట లెన్నఁడు జన్మమధ్యమున వినియుండక పోవుటచేతను అది నోటపట్టకపోవుటచేతను మీరదిచేయండి నేనిదిచేసెదననిబదులు చెప్పెను. అప్పుడు బండితుఁడు వాద మారంభింపఁదలంచి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా"యను బ్రహ్మసూత్రములలోని మొదటిసూత్రముఁ జదివి దానిని దానుపూర్వపక్షముఁజేసి సిద్ధాంతముఁజేయుమనిశాస్త్రి నడిగెను. శాస్త్రియు వెంటనేలేచి యతనికంటె గొప్పపండితుం డనిపించుకొనవలయునని గొంతెత్తి సభాభవనము ప్రతిధ్వనులిచ్చునట్లు "అథాతో కఱ్ఱజిజ్ఞాసా, చెంబుజిజ్ఞాసా,గోడజిజ్ఞాసా,బల్లజిజ్ఞాసా"యని గుక్కతిరుగకుండ నూరుసూత్రములు చదివెను. వానిమాటలకు రాజుగారు సభలోనివారు మహానందభరితులై రిచ్చవడిరి. పండితుఁడువాని పలుకులువిని తెల్లబోయి యతఁడట్లనుటకుఁ గారణమెఱుఁగగోరి'కిం' అనియడిగెను. (కిం అనగా నేమిటియనియర్థము.)ఆమాటవిని శాస్త్రి తారాజువ్వవలెలేచి కిం,కం,భం,టం,షం,హం అని బిగ్గఱగానఱచెను. సభవారందఱు శాస్త్రిపండితునోడించితాను గెలిచెనని చప్పట్లు కొ

ట్టిరి. రాజుగారును దన పండితుని దెలివికి సంతసించి జోడుశాలువలు వానికిప్పించిర్రొత్తపండితునిబిలిచి తెలివిమాలినవాఁడా! యీపాటికవత లకుఁ బొమ్మని యాజ్ఞాపించెను. పండితుఁడు తనదురదృష్టమునకు రాజుగారి తెలివి తక్కువకుఁ జాలవిచారించి బహుదేశములుతిరిగినగడుసువాఁడగుటచే వెంటనే సభవెడలిపోక తిన్నగా వేంకటశాస్త్రివద్దకు బోయి యతనికాళ్లమీఁదఁబడి సాష్టాంగనమస్కారముఁజేసి "మహాత్మా! మీరు మహానుభావులు! మీ మహిమ మెఱుఁగక నేనపరాధముఁ జేసితిని నన్ను క్షమింపవలయు"ననిస్తుతియించి వానికాలివెండ్రుకయొకటి తనచేతితో నూడదీసి రాజు సభికులు జూచుచుండభక్తిశ్రద్ధలతో దానిని దనతలమీఁదఁ బెట్టుకొనెను. రాజువానిభక్తి కాశ్చర్యపడి "ఏల మీరు మావేంకటశాస్త్రి గారివెండ్రుక తలమీఁద ధరించినారని యడిగెను. అప్పుడు పండితుఁడు రాజుతోనిట్లనియె. అయ్యా! వీరిమహిమలు సామాన్య లెఱుఁగరు. నాకిప్పుడు దెలిసినవి నేననేక దేశములు తిరుగుచుండువాఁడను గనుక నాకు భూతపిశాచ భేతాళాది భయములు తగులవచ్చును. ఈయన వెండ్రుక యట్టిభయములు గలుగకుండ రక్షరేఖవలెనుండి నాకేకీడు రాకుండఁ గాపాడును. అందుచేత నేనట్లు ధరించితిని. ఇది ధరించు వారికి సకల శ్రేయములు గలుగును. ఆమాటలు వినినతోడనే రాజు నలుప్రక్కలఁజూచి "ఓరీవెంకా! ఓరీస్వామిగా! ఊరకేచూచుచున్నారేమిరా? మనయూరిలోప్రజల కేయపాయము రాకుండనింటింటికొక వెండ్రుకచొప్పునబంచిపెట్టుదము కావున వేంకటశాస్త్రిల్లుగారి కాలిమీఁదనున్న వెండ్రుకలన్నియుఁ బీకివేయండిరా"యని యాజ్ఞాపించెను. వెంటనే బంటులందఱు వేంకటశాస్త్రిమీఁదఁబడి నొప్పినొప్పి మొఱ్ఱోయని యతఁడేడ్చుచున్ననువినక రోమకూపములనుండి నెత్తురుగారుచున్నను లక్ష్యముచేయక కాళ్ళవెండ్రుకలన్నియు నూడబెరికిరి. అట్లు మహాపదలో

నుండి విముక్తుండై వేంకటశాస్త్రి క్రొత్తపండితునిజూచి "బ్రాహ్మణు డా! నాపొగరుబోతుదనమునకుం దగినట్లు బుద్ధిచెప్పితివి ఈవఱకు నే ననేకపండితుల నేడిపించితిని గాని నీవలె నాకు బుద్ధిచెప్పిన వారెవ రును లేరు నే నిఁక నేపండితునిజోలికిం బోవ"నని వానికి నమస్కార ముఁ జేసెను

---

138 ఒకనాఁటిరాత్రి గొప్పవాన గురియుచుండ నొకవైదిక బ్రాహ్మణుఁ డొకవీరవైష్ణవుని యింటివద్దకు వచ్చి పండుకొనుటకు స్థలమిమ్మని యడిగెను అద్వైతికిబసయిచ్చుటకులాచారవిరుద్ధమని య తఁడు వీలుపడదని చెప్పెను జాలిగుండెగలవానిభార్య మగనింజీవా ట్లుపెట్టి బ్రాహ్మణునకు స్థలమిప్పించెను బ్రాహ్మణుఁడు పండుకొని నిద్రించి నాలుగుగడియల తెల్లవారగట్ల మేలుకొని "శివరామబ్రహ్మం శివరామబ్రహ్మం" అని యీశ్వరధ్యానముచేయ నారంభించెను వైష్ణవుఁ డాతనిపలుకులు విని మనస్సులో మిక్కిలి ఖేదపడి తొందర తో భార్యనులేపి "ఓసీ! ఆపాడుకూఁతలు విన్నావా? ఈ పాడుముం డాకొడుకునకు స్థల మియ్యవద్దని నేనెంత మొత్తుకొన్నను నామా ట విన్నావుకావుగదా" యనెను భార్యలేచి విని యేమియుందెలియక తెల్లబోయి యేమిటేమిటియని యడిగెను భర్త మిక్కిలి కోపగించి యోసిమొద్దా యింకా తెలియలేదఁటే వాఁడు మనవాని నిద్దఱిమధ్య పెట్టి యెట్లునలిపిచంపుచున్నాడో చూడుమనిచెప్పెను అప్పటికి భా ర్యకుం దెలియనందున నతండిట్లనియె ఓసీ వెఱ్ఱిపాడుగట్టా మనరా ములవారి నీబ్రాహ్మణుఁడు శివునకు బ్రహ్మకు నడుమబెట్టి నలిపివే యుచున్నాడు మన పెరుమాళ్ళను శివునితో గలపవచ్చునా యిది నేనసహింపజాలనని భార్యను రెండుగొట్టి యాబ్రాహ్మణుని నింటనుం డి వెడల గొట్టెను.

139. సంగీతశాస్త్రమునందుఁ బరిపూర్ణపండితుఁ డొకఁడుతనశి
ష్యులకు సంగీతము నేర్పుచు శిష్యులకభ్యాస మెక్కువగానుండుటకై
తనతో వారేమాటచెప్పినను సంగీతముతోఁ జెప్పవలయునని యాజ్ఞా
పించెను. ఆలాగున శిష్యులందఱు గొంతకాలము చెప్పదలఁచిన ప్రతి
వాక్యము సంగీతముపాడుచుఁ జెప్పిరి. ఒకనాఁడు గురువుగారు పొల
ములోనుండఁగా వారియిల్లంటుకొనెను. వెంటనే భార్య శిష్యునొక్క
నింబిలిచి యావార్త గురువుగారితోఁ జెప్పిరమ్మనియెను. ఆశిష్యుఁడు
పరుగుపరుగున గురువువద్దకుబోయి నిలిచి "గురువుగారు మీకొంప"
యనువాక్యము పల్లవి జేసి దానికి స్వరకల్పన జేసి యొకగంట సేపు పా
డనారంభించెను. గురువుగారు తత్తరపడుచు మాకొంపసంగతి యేమి
టిరా? చెప్పరా బాబుయని బ్రతిమాలెను. సంగీతముతోఁ జెప్పక
పోయినచో గురువుగారు కోపింతురను భయముచేతఁ దొందరపడకం
డి యంతయు సంగీతముతోఁ జెప్పెదనని యామాటలు సంగీతముతో
నే చెప్పి చిట్టచివరకు "గురువుగారు మీకొంపకాలిపోయెను" అనిచె
ప్పెను. ఆమాటలువిని గురువుగారు పరుగుపరుగుననింటికిఁబోయిచూ
చునప్పటి కిల్లంతయు సంపూర్ణముగఁ బరశురామప్రీతియయ్యెను. తె
లివిమాలిన శిష్యునకుఁ బ్రతిసంగతి సంగీతముతోఁ జెప్పుమని తాను
త్తరువిచ్చుట తనదేలోపమని విచారించి యాయన యూరకుండెను.

---

140. ఒకతురకచక్రవర్తి భార్య యొకనాఁ డుదయమునఁ దనమే
డలోఁ దూర్పువైపుగఁదిరిగికూర్చుండెను. అప్పుడే యుదయించుచుం
డిన సూర్యబింబ మామెకన్నులకు బాధ కలిగించెను. అపుడామె చా
లకోపించియామేడ సూర్యబింబమున కెదురుగనుండకుండున ట్లడ్డముగ
దిప్పుమని సేవకులకాజ్ఞాపించెను. సేవకులందఱుఁ దలలు మేడగోడలపై
బెట్టి సాయంకాలమువఱకు గోడలనుగెంటి, యదికదులుచున్నదనుకొ

ని సంతసించుచుండిరి. సాయంకాలము సూర్యబింబము తూర్పుననుం డక పడమటిదిక్కుననుండుటచే సేవకులు మేడయడ్డముగఁ దిరిగియుం డవచ్చునని రాణితోఁజెప్పిరి. ఆమెయు మరలమేడమెక్కి తూర్పుదెస నిలిచి యక్కడ సూర్యబింబము లేకపోవుటచే మేడయడ్డముగఁ దిరిగి నదని నమ్మి సంతోషించి సేవకులు చేసిన పనికి మెచ్చి వారికష్టము లకు దగినట్లు పెద్దపెద్ద బహుమానము లిప్పించెను.

---

141. ఒకరాజుగారు తెల్లవారుజామున మేలుకొని నిద్దురబద్ధకముచేత గన్నులు తెరువలేక సేవకులలో నొకనినిబిలిచి “ఓరీ! తెల్లవారిన దేమో చూచిరారా”యని యాజ్ఞాపించెను. ఆసేవకుఁడు లేవలేక మఱి యొకసేవకున కా పనిచేయుమని యాజ్ఞాపించెను. వాఁడు తాను లేవలేక వేరొకపరిచారకున కాజ్ఞాపించెను. వాఁడు తన కాజ్ఞాపించినవానితో నిట్లనియె “ఇంకను జీఁకటిగనున్నది. తెల్లవారినదో లేదో చీఁకటిలో నేలాగున కనఁబడును” ఆమాటలువిని వానికన్నను బుద్ధిమంతుఁడగు నా సేవకుఁడు ఓరిబుద్ధిహీనుఁడా! రాజుగారాజ్ఞాపించుచున్నారుచూడ కపోయినచో నాయనకు గోపమువచ్చును. తెల్లవారినది లేనిది చీక టిలో నీకు గనపడనిపక్షమున దీపము వెలిగించియైన సూర్యోదయ మైనదో లేదో చూడుమని చెప్పెను.

---

142. ఒకమనుష్యుని ముక్కు లేనేలేదని లోకులు భావించునంత పలుచగ నుండెను. అతఁడొకనాడొక బ్రాహ్మణునకు నమస్కారము జేయ నతడు నీదృష్టి యెల్లకాలముసరిగానుండుగాక యనిదీవించెను. ఆదీవన కామనుష్యు డాశ్చర్యపడి యేల మీరునన్నట్లుదీవించుచున్నా రు. నాదృష్టి సరిగానేయున్నదేయని పలికెను. అపు డాబ్రాహ్మణుఁ డిట్లనియె. నీదృష్టి సరిగానున్నదని నేనెఱుంగకపోలేదు. ఎఱిగి యేల యిట్లు దీవించితినందువేని వినుము. దృష్టిసరిగా లేకపోయినచో నీవు

సులోచనములు పెట్టుకొనవలసియుండును. సులోచనములు పెట్టుకొను టకు నీకు ముక్కు లేదు గనుక మిక్కిలి యిబ్బందిపడుదువు, అందు చేత సులోచపములు వేయ నవసరము లేకుండ దృష్టి బాగుండవల యునని దీవించితిని.

---

143. ఒక యుద్యోగస్థుఁ డొక రాజువద్దకు జేరి ప్రజలవల్లలంచము లు గ్రహించి చాలధనముసంపాదించెను. రాజుగారతనిని లంచములు వచ్చుటకు వీలులేని యుద్యోగములోఁ బడవేయుటకునిశ్చయించుకొని కోటలో రాత్రులు గంటలుకొట్టించుపనిమీఁద నియోగించెను. అతఁ డు సరెయని యాపనిలో బ్రవేశించి ధన మెట్లు సంపాదించగలమని విచారించుచుండెను. ఆరాజున కిద్దరుభార్యలుండిరి. రాజు ప్రతిరాత్రి మొదటిజామున భోజనాదికృత్యములుదీర్చుకొని తక్కి నమూడుజాము లలో పెద్దభార్యయంతఃపురమునజామునరయు జిన్నభార్యమందిరమున జామునరయు గడపుచుండు వాఁడు. ఈక్రొత్తయుద్యోగస్థుఁడుగంటలు కొట్టుపనిలో బ్రవేశించిన మరునాడు రాత్రి రాజుగారు పెద్దభార్య యింట జామునరసేపు గడవకముందే గంటకొట్టెను. వెంటనే రాజా మెమందిరము విడిచి చిన్నభార్యయంతిపురికిఁ బోయెను. పెద్దభార్య భర్తత్వరగా దనయింటనుండి పోవుటకు విచారించి తనసవతిగంటలు కొట్టువానికి లంచమిచ్చి పెందలకడ గంటకొట్టించెనని యనుమానప డి తానునెలకు నూరువరహాలు లంచమిచ్చెదననియుగంటలాలస్యముగ గొట్టుమనియువానికివర్తమానమంపెను. ఆనూరువరహాలుపుచ్చుకొని యాలంచగొండి రాజుగారు పెద్దభార్యయింట జాలసేపుండునట్లుగంట లు కొట్టనారంభించెను. అది యెఱిగి చిన్నభార్య నెలకు రెండువందల వరహాలు లంచమిచ్చెదననియు రాజుగారు పెద్దభార్యమందిరముత్వర గా విడుచునట్లు గంటలుకొట్టుమని వర్తమాన మంపెను. ఆటక్కరి

యారాజపత్నుల కిద్దఱకు బోటీలు బెట్టి నెలకు జెరియొక వేయివరహా లిచ్చునట్లు నిర్ణయించుకొని నైదుమాసములలో బదివేలవరహాలు సంపాదించెను. అనంతరము రాజుగా రొకనాడు వానింబిలిచి వానికేమియు లంచము దొరకుటలేదని తలంచి వానినిబరిహాసించుటకై యిప్పుడేమాత్రము సంపాదించుచున్నా వని యడిగెను. అతఁడు చేతులుజోడించి యేలినవారు క్షమించినచో నిజముచెప్పెదను. ఇప్పటికిబదివేలు సంపాదించితినని బదులు చెప్పెను. ఆమాటలువిని రా జాశ్చర్యపడి ఏమీ పదివేలా! ఎట్లుసంపాదింప గలిగితివని యడుగ నతఁడు తన పన్నిన పన్నుగడ యంతయుఁ బూసగుచ్చినట్లు ప్రభువునకువిన్నవించెను. రాజు వానిచరిత్రమంతయు విని లంచములు పుచ్చుకొనదలంచిన దుష్టుఁ డేయుద్యోగములో నున్నను వానికి లంచము దొరకుచుండు ననియు సజ్జనుఁ డెందులోనున్నను దురాశమీఁదికి బుద్ధిపోవదనియు నమ్మెను.

---

144. ఒక చాకలివానికి గొప్పయుద్యోగ మయ్యెను. అందుచేత వానిని దమ కుద్యోగములు చెప్పుమని యన్నివర్ణములవా రాశ్రయింపఁ జొచ్చిరి. పలుమారువచ్చి యాజనులు తన్ను విసిగించుచుండుటచే నతఁ డొకనాఁడు కోపముతో మీరందఱు గాడిదలులాగున్నారు. ఎన్నిసారులు చెప్పినను బుద్ధిలేదేమి? అని కేకలువేసెను. వారిలోనొకఁ డప్పుడు వాని కిట్లనియె. గాడిదలమగుటచేతనే చాకలివానిచెంతకు వచ్చితిమి. చాకలివానికిఁ గావలసినవి గాడిదలేకదా" యనిపలికి యచ్చటనుండి వెడలిపోయెను.

---

145. ఒకమనుష్యునకుఁ జిన్నగా దృష్టియానని కూఁతు రుండెను. తండ్రి యెంతప్రయత్నముఁ జేసిన నాబిడ్డనెవ్వరు బెండ్లియాడరయిరి. తుదకు దూరదేశమునుండి యొకనినిదీసికొనివచ్చి వానితోనే

సంగతిఁ జెప్పక తండ్రి యెట్లో కూఁతునిచ్చి వానికిఁ బెండ్లిచేసెను. పెండ్లి యయినతోడనే యాతండ్రి తనమిత్రు నొకనిబిలిచి "చూచితి వా,నా తెలివి? మనగుట్టు తెలియకుండ మభ్యపెట్టి యేలాగో పెండ్లి చేసితి" నని చెప్పెను. అల్లుఁడు గోడచాటునుండి యాపలుకులు విని మామగారికి వినఁబడునట్లు తనస్నేహితునితో నిట్లనియె. ఓరీ నా బోదకాలునుబట్టి నాకు వివాహముకాదని నీవు వాదించుచు వచ్చితి విగదా చూడు నా తెలివి నాకాలుసంగతిపెండ్లివారికిఁ దెలియకుండ నటించి నేనేలాగున బెండ్లి చేసికొన్నానో" ఆపలుకులువిని మామ గారు తన యల్లుఁడు దనకు మించినప్రయోజకుఁ డని సిగ్గుపడి యావ లకుఁ బోయెను.



146 ఒక బ్రాహ్మణుఁడు చక్కనిచుక్క యగు తనకూఁతున కుఁ బెండ్లిచేయఁ దలఁచి యెక్కడ సంబంధములు దొరకక విచారిం చుచుండఁగ వానిపురోహితుఁడు దగ్గరకుఁబోయి ‘ఒకయూరిలో మం చిసంబంధ మున్నట్లు విన్నాము. మీసెలవయిన పక్షమున నేను బో యి చూచివచ్చెద’ ననిపలికెను. ఆబ్రాహ్మణుఁడు “సరేమీరుపోయి చూచి వచ్చుటయేగాదు. సంబంధము మంచిదియని మీకుఁ దోఁచిన పక్షమున నిశ్చయముచేసుకొని వారముదినములలోనొకముహూర్తము న్నదిగదా. ఆముహూర్తమునకు రమ్మని చెప్పుఁడు. పిల్ల నాపుటకు వీలులేదుగదా’ యని బదులుచెప్పెను. పురోహితుఁ డాగ్రామమునకు బోయి పెండ్లివారితో మాటలాడ వారాయనకు నూటపదారులు లంచమిచ్చి యేలాగయిన నాసంబంధము కుదుర్చుమని బ్రతిమాలిరి పురోహితుఁడు-సరేయని,యొప్పుకొనిపెండ్లికూఁతురు తండ్రివియ్యాల వారి స్థితిగతులగూర్చియుఁ బెండ్లికుమారుని రూపరేఖావిలాసముల గూర్చియు నడుగఁగాఁ బురోహితుఁ డిట్లనియె. పెండ్లివారియింటనిం

డ కావలసినన్ని యెలుకలు పిల్లులు నల్లులు నున్నవి. ఇంటిలోఁగావల సినంతగాలి వెలుతు రున్నది. ఆ తేజస్సునుబట్టి చూడగా వారు సూర్యచంద్రులనింటిలోఁ గట్టివేసినట్లు తోఁచుచున్నది. పెండ్లికొడుకు మిక్కిలిసుకుమారి. తలిదండ్రులు వానిని నేల నడవనీయరు. సవారిలో కాలు చావడిలోను చావడిమీఁదకాలు సవారిలోను బెట్టవలసిన వాఁడు. వారి యైశ్వర్యముమాట వేరే చెప్పనేల? ఎదుట నెంతవాఁడున్న నాకుఱ్ఱవాఁడు చూడనేచూడఁడు." ఈమాటలన్నియు విని పెండ్లికూఁతురు తండ్రిసంబంధము నిశ్చయించుకొని పెండ్లివారిని రప్పించి వివాహము చేసెను. వివాహకాలమందుఁ బెండ్లికుమారుఁడు కొంచెము కుంటుచు నడచుటచేతను దండ్రిచేయి పట్టుకొని వానిని నడపించుటచేతను పెండ్లికూఁతురుతండ్రి యనుమానించి కారణమేమని పెండ్లికొడుకుతండ్రినడుగ నతఁ డిట్లనియె. మాపిల్లవానికిఁ గాలిలోముల్లు విరిగినది. అందుచేతఁగుంటుచున్నాఁడు. ఇతఁడరిపేదవాఁడుఁ బ్రొద్దుటినుండి భోజనములేకపోవుటచే శోషతగిలి పడిపోవునేమో యని నేను బట్టినడిపించుచున్నాను. ఆపలుకులు విని నిజమే కాబోలునని వారూరకుండిరి. రాత్రి వివాహముకాగా మరునాఁ డుదయమున నత్తమామలు బంధువులు పెండ్లికొడుకును జూచి వెలవెలబోయి దుఃఖపడి పురోహితునిం బిలిచి "ఏమయ్యా! మాకొంపఁ దీసితివి నీమాటలునమ్మి మాపిల్లగొంతుఁ గోసితిమి పిల్లవానికిఁగన్నులు లేవు ఒకకాలుకుంటి. వారివైఖరిచూడ నిల్లువాకిలి లేనట్లు కనఁబడుచున్నది. పిల్లులున్నవనుట చేతఁ బాడి గలదనియు నల్లు లున్నవనుటచేత మంచములుగలవనియు నెలుక లున్నవనుటచేత ధాన్యము గలవనియుఁ దలంచితిమి. నీమాటలనుబట్టి చూఁడగా నింటిమీఁదఁగప్పయిన లేనట్లు తోఁచుచున్నది. అని వానిని నిరోధించి యడిగిరి. అప్పుడు పురోహితుఁడు గడుసుదనముగ నిట్లనియె. నేను మొదటినుండియు నిజమే చె

ప్పితిని. ఇంటినుండ నెలుకలు నల్లులు పిల్లు లున్నవో లేవో సూర్యచం
ద్రు లింటనున్నట్టు కనఁబడుచున్నదో లేదో మీరు వెళ్ళిచూడుఁడు.
పెండ్లికొడుకు సవారి యెక్కవలసినదే కాని నడవలేఁ డనియు నెంత
వారినయిన జూడఁడనియు మొదటనే చెప్పితిని. మీరు తెలివిగలవా
రయినయెడల నామాటలు మీకప్పుడే యర్థము కావలసినది. నాలో
ప మేమియు లేదు. అని చెప్పి యటనుండి లేచిపోయెను. తాము స్వ
యముగాఁ బోయిచూడక యితరులను నమ్మినందువలన నిట్టియాపద
లు వచ్చినవనియు దైవకృతమనియుఁ బూర్వజన్మకృతమనియు పెండ్లి
వా రూరకుండిరి.

---

147 ఒక చెవిటిగొల్లవాఁడు కుంటిమేఁకనొకదానిఁ దోలుకొని
పోవుచు మార్గమధ్యమున నొక చెట్టునీడకుఁ బోయి యక్కడ గూ
ర్చుండి యున్న యొక మనుష్యుని జూచి 'అయ్యా నేను పంచినీరు
త్రాగివచ్చెదను. అంత వఱకీమేఁకను జూచుచుండుఁ" డని మేఁకను
వానివద్దనిలిపెను. ఆమనుష్యుఁడు గూడ చెవిటివాఁడగుటచే, నతఁడది
వినక "ఆ మేఁక కాలు నేనువిరుగగొట్టలేదు నాజోలికిరాకు" మని
వానినావలకుఁ దోసివేసెను. ఆమాటలు వినఁబడక గొల్ల తన కా
యుపకారముఁ జేయుమన్నందు కామనుష్యుఁడు కోపించితిట్టి తోసి
నాఁడనుకొని వానిపైఁ గలియబడెను. ఇద్దఱు జుట్టుజుట్టు పట్టుకొని
కొంతతడవు పెనఁగులాడి తమ తగవుఁ దీర్చుకొనుటకు దారింబోవు
చుండిన మఱియొక మనుష్యుని జూచి వానివద్దకుఁజనిరి. అతఁ డొక
చెవిటిబ్రాహ్మణుఁడు. భార్యపైనప్పుడే కోపించి జందెములు దెంపు
కొని పోవుచుండెను. ఆచెవిటివానివద్ద కీచెవిటివారిద్దఱు బోయి నేను
మంచినీరుత్రాగి వచ్చినదాక మేకను జూచుచుండుమనుటతప్పాయని
గొల్లవాఁడును, మేకకాలు నేను విరుగగొట్టలేదు. దాని ఖరీదునే

నియ్యనని రెండవవాఁడును దమతమ సంగతులు మొదలుపెట్టుకొనగా మీరు నూరుచెప్పండి వేయి చెప్పండి. ఆపాడుముండతో నేను కాపురము జేయనని బ్రాహ్మణుఁడు బదులుచెప్పెను. ఇట్లొకరిమాట్లొకరు సందర్భించకుండ కొంతసేపు మాటలాడివిసిగి వారింటికేఁజనిరి.

---

148 తెలివిమాలినయొకపల్లెటూరికాఁపుబుణబాధపడలేకభార్యమెడనున్న పుస్తెపూసలఁదెగనమ్మి యప్పుతీర్పగోరి యావస్తువుల నొకపట్టణమునకుఁ దెచ్చినూరురూపాయలకు విక్రయించియామొత్తము పుచ్చుకొని మరలనింటికేఁబోవఁ బ్రయత్నించుచుండెను. ఆకాపు వాని వెంగలితనముఁ జూచి కొందఱుతుంటరులు వానివెంటనే యంటియుండి మచ్చికచేసి యేదోపనిమీఁద వానివెనుకయింటికిఁదీసికొనిపోయిరి. అతఁడాయింటికి వెళ్ళినతోడనే యిద్దరుబిడ్డల వెంటబెట్టికొని యొకయాఁడుదివచ్చి "అయ్యో! ఎంతకాలమున కగపడితివయ్యా ఇందుకేనా నన్నుబెండ్లిచేసికొన్నది. ఈకరవుదినములలోఁ బిల్లలునేను మలమలమాడుచుండగ మాసంగతిజూడక నీవు తిరుగుచుంటివా" యనియేడ్చినీపిల్లలనునీవు దీసికొని పొమ్మని వారిని దగ్గరకుఁబంపెను. ఆమె తనభార్యగాదనియు వారు దనపిల్లలుగారనియు నతఁడెంతనొక్కిచెప్పినను నాస్త్రీ వినక బాధపెట్ట నతండు విసిగితుదకు "సరే! నీవు నాభార్యవే. నీకుఁ బిల్లలకుఁ గొంతధనమిచ్చెదలే" యనిపలికెను. అట్లు పలికిన వెంటనే యామెదాపుననే యున్న మగతుంటరుల సాక్షులుగావేసి తనకు బిడ్డలకు మగడన్నము పెట్టుటలేదని రాజువద్దఫిర్యాదుచేసెను రాజు సాక్షులను విచారింపగా నామెభార్యయైనట్లు వారుపిల్లలైలట్లు కాఁపువాఁడు తమయొద్ద నొప్పుకొన్నట్లు సాక్ష్యమిచ్చిరి. అప్పుడు రాజు.వానివద్దనున్న నూరురూపాయలు భార్యాపుత్రులసంరక్షణార్థమై యిప్పించి చీవాట్లు పెట్టిపంపెను. కాఁపువాఁడు ధనము గోల్పడిమోస

గాండ్రికతమున నిరుపేదయై నందుకు విచారించుచు స్వగ్రామమునకు బోయి జరిగినవృత్తాంతము గ్రామస్థుల కెఱింగింప నందులోఁ గొందఱు గడుసువాండ్రు మరలఁ దనసొమ్ము వచ్చునట్టి యుపాయమప్పుడు చెప్పిరి. అది మనసునఁ బెట్టుకొని యాకాఁపువాఁడు మరల పట్టణమునకుఁ బోయి మున్ను తన్ను వంచించిన యాఁడుదాని యింటికిఁ జని, ఓసీ దుర్మార్గురాలా! పిల్లలను బాధ చేయుచున్నావా నేనువారికి విద్యాబుద్ధులుచెప్పించి బాగుచేసికొనియెదను. నాబిడ్డలను నావద్దకుఁబంపుమని నిలువదీసి యడిగెను. ఆమె వానికి సరియైన సమాధానము చెప్పకపోవుటచే నతఁడు రాజువద్ద ఫిర్యాదు చేసెను. రాజు దానిని బిలిపించి కొడుకుల నప్పగింపుమని యాజ్ఞాపింప మునుపు రాజువద్దగాఁపువాఁడు తనమగఁడని యొప్పుకొన్నది గావున నపుడు మరల నోరెత్తలేక చచ్చినట్లు నోరెత్తక యావలకుఁబోయి బిడ్డలను దీసికొని వెళ్ళవద్దని కాఁపువానిని బ్రతిమాలి వానిరూపాయలు వానికిచ్చి పంపెను. కాఁపువాఁడు తనసొమ్ముదనకు దక్కెననియు నాయాఁడుది తనబిడ్డలు తనకు దక్కిరనియు సంతసించిరి.

---

149 పంచమహాపాతకమహారాజుగారు రాజ్యమునుబరిపాలించుచుండగా నొకరాత్రి యొకగృహస్థునియింట కన్నపుదొంగతనముజరిగెను. మహారాజుగారు దొంగలను వెదికించి తెప్పించుటకు మారు ముందుగా నాగృహస్థుని బిలిచి "నీవు గోడలు కన్నముత్వరగాఁబడునటు లెందుకు పెట్టితివి. నీగోడలు సరిగా నున్నచో కన్నముత్వరగాఁ బడక పోవును గదా" యని కేకలువేసి వానిని దండింపఁదొడగెను. అతఁడు భయముతో వడంకుచు స్వామీ యిది గోడపెట్టినవాండ్రలోపముగాని నాలోపము గాదనియెను. రాజుగోడపెట్టిన కూలివాండ్రం బిలిపించి యింతవదులుగా నేల గోడపెట్టిరని యడుగ వారు మహాభయ

ముతో స్వామీ యిది మాతప్పుగాదు మట్టికలిపినవాండ్రితప్పు వాం డ్రుజెసవచ్చునట్లు మట్టితొక్కి కలపలేదని ప్రత్యుత్తరముఁ జెప్పిరి. అంతట రాజు మట్టికలిపిన పనివాండ్రం బిలిపించి యట్లేలచేసితిరనియ డుగ వాండ్రు స్వామీ యిది మాలోపముగాదు. మేము మట్టికలుపు చుండునపుడు దారిని భోగముది యొక తెనడచిపోయెను. దానిటక్కు లు దాని యొయ్యారములుజూచుచు మేము మన్ను తిన్నగాఁగలుపఁ జాలమైతిమని బదులు చెప్పిరి. రాజుగారు బుద్ధిమంతులగుటచేఁ ద ప్పంతయు భోగముదానిదే యని నిశ్చయించి దొంగతనమున కదే మూలకారణమని నూరువరహాలు ధన దండన విధించెను.

---

150 పంచమహాపాతక మహారాజుగారి రాజ్యములో యొకవృద్ధ బ్రాహ్మణుఁడుండెను. ఆబ్రాహ్మణునకు మిక్కిలి సుందరియగు నొక కుమార్తెగలదు. ఆమెనొకచిన్నవానికిచ్చి పెండ్లిచేసి యతఁడల్లునినిల్ల రికముంచుకొనెను. ఆయూరిలో నొకచాకలివాని గాడిద యొకనాఁడు బ్రాహ్మణుని చేనిలోఁబడగా నల్లుఁడు కోపముతోఁ బోయి గాడిద కాలువిరుగఁ గొట్టెను. చాకలివాఁ డామాటవిని పదిమందిబంధువుల ను వెంటబెట్టుకొనిబోయి బ్రాహ్మణుని యల్లుని బడి తెలతో బాఁదిచం పివేసెను. ఆఘోరకృత్యమును విని బ్రాహ్మణుఁడు మహారాజు గారి యొద్దకుఁబోయి మహాప్రభూ! చాకలివాఁడునాయల్లునిజంపివేసినాఁడు మహాలక్ష్మివంటి నాకూఁతురు వైధవ్యదుఃఖమనుభవించుచుండగా నే నుజూచి యెట్లుభరింపఁగలను? నాకేమిగతియని మొఱపెట్టుకొనెను. అంతలోఁజాకలివాఁడువచ్చి రాజుకాళ్ళపైఁబడి స్వామీనామైలగుడ్డలు మోయు గాడిదకాలువిరిగిపోయినది. ఈమూటల నెవరుమోయఁగల రని యేడ్చెను. రాజుగారు న్యాయపరిపాలనమునందు మిక్కిలి యిష్ట ముగలవా రగుటచే వారికిరువురకును న్యాయముచేయఁ దలఁచియిట్లని

సెలవిచ్చెను. బ్రాహ్మణుండా నీయల్లుఁడు చాకలివాని గాడిదకాలువి రుగఁగొట్టెను గనుక దానికాలు చక్కబడువఱకు వాని మైలగుడ్డలు నీవు మోయుచుండుము. చాకలీ నీవు బ్రాహ్మణుని కూఁతురునివిధవగాఁ జేసితివిగావున నాచిన్నది వైధవ్యదుఃఖ మనుభవింపకుండ నీవామెను బెండ్లియాడి బ్రాహ్మణున కల్లుఁడవై యుండుము. ఎవరికి నష్టము లేకుండఁగ నేను దీర్పుఁ జేసితినిగనుక మాటాలాడకపొండు" ఆతీర్పువిని బ్రాహ్మణుండు చెవులుమూసుకొని రామరామా నేను వేదమెనుబదిరెండుపన్నములు చదువుకొన్నందుకుఁ జిట్టచివరకు జాకలివాని మైలగుడ్డలు నేనే మోయుటయు నాకూఁతు వానికిచ్చి పెండ్లి చేయుటయు సంభవించినదా యని యేడ్చుచుఁ బోయెను

---

151 ఒకతుంటరి కల్లంగడికిఁబోయినాఁకొకదమ్మిడికల్లు పోయుమని యొకయాడిగదానినడిగెను. అది యాశ్చర్యపడి "ఓయీ! దమ్మిడి కల్లుతో నీకేమి కైపెక్కును. ఎందుచేత నంత స్వల్పముగాఁబుచ్చుకొనుచున్నావని యడిగెను. ఆనిర్భాగ్యుఁడామె కిట్లని యుత్తరముచెప్పెను. అమ్మా! ఒడలెఱుఁగకపోవుట, నోటికి వచ్చునట్లు ప్రేలుట మనసు నిలుకడలేకపోవుట, తూలిపడుట మొదలగు త్రాగుబోతు లక్షణములు నావద్ద నిదివఱకెయున్నవి. పూర్ణముగాఁ ద్రాగుబోతుననిపించుకొనుటకు వాసనయొక్కటే తక్కువగనున్నది. దమ్మిడీకల్లువాసనకుఁజాలదా" యనికొంచెమే కొనుచున్నాను.

---

152 ఒకతురక పెద్దమీసములు పొడుగుగడ్డముఁగలిగి దారినిబోవుచుండనొకబాలుఁడు వానినిజూచి యాశ్చర్యమునొంది దగ్గఱనున్న మఱియొక బాలకునితో "ఓరీ యీసాహేబునకు మొగమంతయుగడ్డములు మీసములేగాని నోరులేనట్లున్నది. నోరులేని మనుష్యులుంచు

రా!" యనిపలికెను. ఆమాట తురకచెవినిబడినందున నతఁడు కోపము తో బాలకుని మీఁదికివచ్చి మీసముదువ్విపై కెత్తి గడ్డము క్రిందికి దువ్వి నోసు బాగుగాఁదెఱచి పిల్లవాని మొగము మీఁద మొగముఁ బెట్టి "అగే పోఖరీ! ఇదిగో నోరుగాదఁటరా! ఇదినోరుగాక మెలుకకన్న మనుకొన్నావా? పీతబొక్కయనుకొన్నావాయని యడిగెను.

---

153 చిన్నతనమునుండి దొంగతనములుచేసిచేసిపలుమారుచెర సాలకుఁబోయిపోయి తుదకు ముసలితనముచేతఁ గన్నులుగానక నడన లేక యొకమనుష్యుఁ డింటివద్దనే కూర్చుండెను. ఒకనాఁ డొకపడుచు దొంగవానియొద్దకుఁబోయి మునుపటికంటె వానిమనసేమయినమారిన దో లేదో కనుగొందమని వానితో "తాతా! ఈరాత్రి దొంగతనము నకుఁ బోవుదమువత్తువా" యని పలికెను. ఆముసలివాఁడు చిన్న నవ్వు నవ్వి నాయనా! దొంగతనముచేయవలయునని నాకును గంపెడాసయు న్నది. కాని నన్ను జాగ్రత్తగాఁ దీసికొనిపోవువారెవరుగోడదగ్గఱకూ ర్చుండబెట్టు వారెవరు కన్నములోనుండి యీవలకు లాగువారెవరు. ఏదైనఁబ్రమాదము వచ్చునపుడు భుజముమీఁద నెక్కించుకొనిజాగ్రి త్తగా మరల నిలుచేర్చువారెవరనిబదులు చెప్పెను. వానిమాటలు విని పడుచువాఁడు తనలో "వీనికడుపుకాల; వీనికిప్పటికి దొంగతన ము చేయవలయుననియే యున్నది. పెద్దవాఁడను నాకు దుర్వృత్తి యెందుకని పలుకుటకుమారు తీసుకొనిపెళ్ళువారులేక మానుచున్నా నని చెప్పుచున్నాఁడు పుట్టెనుబుట్టిన గుణము పుడకలఁతోగాని మాన దుగదా" యనుకొనుచుఁ బోయెను.

---

154 ఒకకూలివాఁడు చిన్నయేటియొడ్డున నొకచెట్టుపడఁగొట్టు చుండ వాని గొడ్డలి చేయిజారి యేటిలోఁబడెను. అందుచేత వాఁడుమి గుల దుఃఖపడుచుండ దేవేంద్రుఁడు వానికిఁ బ్రత్యక్షమై కారణమడిగి

యొకబంగారుగొడ్డలి తెచ్చి యిది నీదాయని యడిగెను. కూలివాఁడది తనదికాదనిచెప్ప నింద్రుఁడు వెండిగొడ్డలినొకదానినిఁదెచ్చియిదినీదా యని యడిగెను. అదియుఁదనదికాదని వాఁడుచెప్ప నింద్రుఁడు వాని సత్యాసక్తికి సంతసించి వానిగొడ్డలి తెచ్చి వానికిచ్చుటయేగాక వెండి బంగారుగొడ్డళ్ళ బహుమానముగఁ గూడనిచ్చెను. దురాశగల మరి యొక కూలివాఁ డదివిని తనకు వెండిబంగారుగొడ్డళ్ళువచ్చునని యేట బారవేసి యేడ్వసాగె. చెట్టుపడఁగొట్టుచు గొడ్డలినదిలో వేయవలెనని యెడ్డునకుఁ బోయెను. దేవేంద్రుఁడు వెనుకటివలెవచ్చి యొకబంగారు గొడ్డలి దెచ్చి యిది నీదాయని యడిగెను. ఆకూలివాఁడు సంతసించి యిదే నాగొడ్డలి యని తొందరతోఁ బుచ్చుకొనబోయెను. దేవేంద్రుఁడు వానిదురాశగనిపెట్టి వెండిబంగారుగొడ్డళ్ళ నియ్యకపోవుటయే గాక స్వంతగొడ్డలియయిన నీయక వచ్చినదారిని బంపెను. దురాశ దుఃఖముచేటుకదాయని కూలివాఁడు సిగ్గుపడి వెళ్ళెను.

---

155. ఒక కరణము తనతండ్రికి తద్దినముఁబెట్టుకొనుచుండగ తహశ్శీల్‌దారువద్దనుండి తాఖీదుతీసికొని యొకతురకబంటోతు వచ్చెను. వానిని వీథిలోఁ గూర్చుండుమని వర్తమానమంపికరణముపితృకార్యము నెరవేర్చి బంటోతుతో మాటలాడి యాపూఁటభోజనముచేసిపొమ్మ నియెను. ఆసాహేబు గారెలు పాయసము మొదలగు భక్ష్యములతో భోజనము చేసి కరణముగారిని బిలిచి అయ్యా! ఈదినమున మీయిం ట్లో నేమి?" అని యడిగెను. మాయింట తద్దినమని కరణము ప్రత్యుత్తరము చెప్పెను. అదియేదోశుభకార్య మనుకొని సాహేబు "అయ్యా! మీయింట్లో రోజు తద్దినమే రావాలండీ" అని పలికిపోయెను.

---

156. ఒకరాజువద్దకు బెస్తవాఁడొకఁడు గొప్పచేఁపను విక్రియమునకుఁ దీసికొనిపోయెను. ఆబెస్త రాజసన్నిధికిఁబోవప్రయత్నింపగు

మ్మముపద్ద రాజభటుఁ డొకఁడడ్డగించి లోపలకుఁ బోనిచ్చినందులకు లంచమడిగెను. బెస్త దనకువచ్చినలాభములో సగమిచ్చెదనని చెప్పి వాని నొడంబఱచి లోపలకుఁబోయెను. పిమ్మట రాజు చేపను జూచి దీనివెల యెంతయని యడిగెను. బెస్త "అయ్యా! దీనినిమిత్తముమీరు నాకు సొమ్మునియ్యనక్కఱలేదు. దీనివెలనూరుకొరడాదెబ్బ"లని యు త్తరముఁజెప్పెను. రాజు ముక్కునవేలు పెట్టుకొని యింత విరుద్ధము న్నదా! ఎవడైన వస్తువునమ్ముకొని దెబ్బలు తినునా? నూరురూపా పాయల నిచ్చెదఁ బుచ్చుకొనుమని యెంతయు బ్రతిమాలెను. ఎంత చెప్పినను వినక వాఁడు దెబ్బలేకావలయునని పట్టుబట్టగా రాజు సరే యని నూరు దెబ్బలు గొట్టుటకొక సేవకుని నియోగించెను. ఆసేవ కుఁడు కొట్టమొదలుపెట్టి యేఁబదిదెబ్బలు కొట్టగానె బెస్తవాఁడు చప్పునలేఁచి "ఆగండి! ఆగండి! ఇందులో నాకొకభాగస్థుఁడున్నాఁడు. తప్పక వానికి సగమీయవలయు" నని కేకలువేసెను ఆమాటవిని రాజు మఱింతయాశ్చర్యపడి "నీవంటిమూర్ఖుఁడు లోకములో మఱి యొకఁడున్నాఁడా? వాని బిలిపించెద చెప్పు" మని యడుగ వాఁడు "అతఁడు మీద్వారపాలకుఁడేగాని మఱియొకఁడుగాడు. వచ్చెడులా భములోఁ జెరిసగము యిచ్చుచున్నట్లు నే నొడంబడినప్పుడుడుగాని నన్ను లోపలికిరానియ్యఁడయ్యె. అందుచే వానికి భాగము తప్పక పెట్టవలయునని బదులుచెప్పెను. రాజామాటవిని లంచగొండులకు బుద్ధిచెప్పుటకు వీఁడు తగినయుపాయముఁబన్నినాఁడని సంతసించి ద్వారపాలకుని బిలిపించి యేఁబది దెబ్బలు వీఁపుమీఁద గొట్టించి బెస్తవానికి నూరురూపాయలు బహుమానమిచ్చి పంపెను.

---

157. ఒకయూరి కరణము లింగధారిబ్రాహ్మణుఁడు ఆయన కుటుంబమునందు వాని జ్ఞాతులకుటుంబములయందుమొత్తముమీఁద నూరునాటయేఁబదిమందిమనుష్యు లుండుటచేఁ బ్రతిసంవత్సరము

నిద్దఱో ముగ్గురో మృతినొందుచువచ్చిరి. పోయినపుడెల్లఁ గరణమువడ్ల బత్తునియింటికిఁ బోయి వాని చేతిలోని డబ్బువచ్చెడుపని మానిపించి యనంతశైనములు చేయుమని తొందర పెట్టుచుండును. కరణముగారి పని వెట్టిదగుటచేతను డబ్బు చేతిలోఁబడునట్టిపనులు మాటిమాటికిఁ జెడిపోవుచుండుటచేతను వడ్లబత్తుఁడు విసుగుజెంది తీరికయయినపుడెల్ల నొక్కొకయనంతశైనము చొప్పున నేడెనిమిది చేసి యింటఁబెట్టియొక నాఁడాకరణముగారిని బిలిచి తాను జేసియుంచున యనంతశైనము జూపి కరణముగారూ! ఈయనంతశైనము మీది ఇది మీయమ్మ గారిది. ఇది మీపెద్దబ్బాయిగారిది. ఇది మీపినతండ్రికొడుకుది ఇవి మీతక్కినబంధువులివి. మాటికిమాటికినన్నుఁజంపక కావలసినప్పుడెల్ల బట్టించుకొని పొండు లేకపోయెనా మీయింటనే తీసుకపోయి దాఁచు కొండు' అని చెప్పెను ఆపలుకులు విని కరణము చెవులు మూసికొని యోరి పాపాత్ముఁడా! బ్రతికియున్నవాండ్లకందఱకునననంతశైనములు కట్టుచున్నావేమిరా? నిన్ను జేయుమనుట నాదే లోపము. ఇంకమీ యింటి కెన్నఁడాపనినిమిత్తము రానులే యని చెప్పి లేచిపోయెను.

---

158. ఒకజ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు ధనవంతుఁడగునొకబ్రాహ్మణుని వద్దఁ జేరి ప్రతికార్యమున నతనికిఁ బ్రశ్నములు చెప్పుచు ముహూర్తములు బెట్టుచుండెను. ఆధనవంతునకు జ్యోతిశ్శాస్త్రమునందునమ్మక ములేనిమిత్రుఁడొకడుండెను. అతండు జ్యోతిష్కుఁడు పెట్టినముహూర్తములనుగురించి ప్రతిదినము వాని నధిక్షేపించుచుండును. ఒక నాఁడు ధనవంతుఁడు వానిమిత్రుఁడుఁ జెరియొకపనిమీఁదఁ జెరియొక గ్రామము పోఁదలంచిరి ధనవంతుఁడు తనకుముహూర్తముఁ బెట్టుమని జ్యోతిషుక నడిగెను. అతండు పంచాగముఁజూచిఁ రేపుదయముబొత్తుగ మంచిదిగాదు. రేపు మధ్యాహ్నముచాల మంచిది. వెళ్ళినకార్య

ము మిక్కిలి లాభముతో నగు, నని చెప్పెను. మిత్రుఁడు మంచిది కాని వేళ బయనమయినచో నేమగునో చూతమనిదుర్ముహూర్తమున నిల్లు వెడలెను. ధనవంతుఁడు సుముహూర్తమున నిల్లు వెడలెను. దైవవశమున మార్గములో ధనవంతునిబండి బోల్తపడ నతఁడు చేయి విరుగఁగొట్టుకొని యొడలు తెలియక సాయంకాలమున కిల్లుచేరెను. వానిమిత్రుఁడుకార్యసాధనముఁ జేసికొనుటయేగాక చాలధనలాభమును గాంచి వచ్చెను.ధనవంతుఁడు తనయవస్థయుఁ దనమిత్రునియవస్థయుఁ జూచి రెండుదినములు పోయినవెనుక జ్యోతిష్కుని బిలిచి 'స్వామీ! మీరు పెట్టిన సుముహూర్తమునందు వెడలినందుకు నాకింత దుర్గతి సంభవించిన దేమి? దుర్ముహూర్తమున వెళ్ళినవాని కంతలాభముగలిగిన దేమి,' యని యడిగెను. అందుకు జ్యోతిష్కుఁ డిట్లనియె. పైకిమీకు నష్టము గలిగినట్లు వానికి లాభముకలిగినట్లు కనఁబడుచున్నది. కాని నిజముగా వానికేనష్టము మీకే లాభము గలిగినది. అది యెట్లో చెప్పెద వినుండు మీజాతకమునుబట్టి మీకీదినమున ఘోరమయిన మరణము జరుగవలసియున్నది. ఇంతసుముహూర్తమున మీరుబయలుదేరుటచేతనే చేయి విరిగి నాలుగుదినములు బాధపడుటతో మీ గండము గడచినది. మీమిత్రునిజాతకమునుబట్టి యతని రాచరికము రావలసినది. దుర్ముహూర్తమున బయలుదేరుటచేత నది యంతయు నున్నయయి స్వల్పధనలాభముతోఁ దేలిపోయినది. మీకెక్కువలాభము కలిగినదో వాని కెక్కువలాభము కలిగినదో యీసారిచూచుకొనుఁడు ఆపలుకులు విని ధనవంతుఁడు నిజమేయని ముహూర్తబలము కొనియాడెను. వానిమిత్రుఁ డాసంగతి విని జ్యోతిష్కులు దమమాట లబద్ధములయినపుడు వారుకోసెడు కోఁత లివియేయని నవ్వియూరకొనెను.

---

159. ఒకవైద్యుఁడుమందులసంచి చంకనుబెట్టుకొని దారింబో వుచుండ నొకముసలిది వానిం జూచి నాయనా! మాకుఱ్ఱవానికిజబ్బు గానున్నది. మీరు లోపలికివచ్చి కొంచె మౌషధము వేయవలయు నని ప్రార్థించెను. ఆప్రార్థన విని వైద్యుఁడు లోనికిఁబోయి సంచి వి ప్పి రెండుమాత్ర లిచ్చి వేఁడినీళ్ళతో మ్రింగించవలసినదని చెప్పెను. మాత్రలు పుచ్చుకొని ముసలిది వైద్యునిజూచి నాతండ్రీ! మందిచ్చి తివి. ఇప్పుడు నీళ్ళుకాచుటకు నాయింట వంటకట్టెలు లేవు. వేఁడినీళ్ళు కూడ నీసంచిలో నున్నవేమో చూచి మందిచ్చినట్లె యుచితముగ నిమ్మని పలికెను.

---

160. ఒకబండవాఁడు ధనవంతునకొకరికిఁ గొంతసొమ్మి ఋణ ముండెను. ఆధనవంతుఁడు వానిని నిలుపనీయక చాలసారులు ఋణమి మ్మని వేధించుటచే నతఁడు గదిమి ఋణదాతను వెడలఁగొట్టెను. ఋణ ప్రదాత వానిచేఁ దిట్లుదినితనయూరికరణమువద్దకుఁబోయితనయవస్థఁ జెప్పుకొనియెను. కరణము వానిని జూచి నీవు నావద్ద కేలవచ్చితివి? నిన్ను వాఁడేమన్నాఁడని యడిగెను. ఋణప్రదాత యిట్లనియె. "అ య్యా నేను సొమ్మడుగఁగానే యాబండవాఁడు నన్ను నోటికి వచ్చిన తిట్లు దిట్టి సొమ్ము నేనియ్యను వల్లకాట్లో రామనాథయ్యతోఁ జెప్పుకో పో యని గెంటెను. ఆలాగేయని నేను వెంటనే మీవద్దకు వచ్చితిని. ఆమాటలు విని కరణము నగుచు వల్లకాటిలో రామనాథ య్యవద్దకు వెళ్ళుమని వాఁడు నిన్ననఁగానే నీవు నావద్దకువచ్చితివా? ఆరామనాథయ్యను నేనేనా యని హాస్యమాడెను.

---

161 ఒకపడుచువాఁడు త్రాగుడు కలవాటుపడి ధనమెల్ల బాడు చేయుటయేగాక యన్నదమ్ములనుతలిదండ్రులనుభార్యను దిట్టి కొట్టి బాధింపఁజొచ్చెను. ఆబాధపడలేక తండ్రి త్రాగుడుమానుమని చా

లసారులు వానికి బోధించి యొకనాఁడు బలవంతపెట్టెను. అప్పుడు కుమారుఁడు తండ్రిని జూచి 'నాయనా! ముప్పదిదినములు నీవు నాతోఁ గలిసి త్రాగితివేని ముప్పదియొకటవనాఁడు నేను ద్రాగుడు మానివేసెదనని నేనుప్రమాణము చేయుచున్నాను. ఈమాటకుఁదిరుగులేదని వానికి నచ్చునట్లు పలికెను కొడుకు కెన్నివిధముల జెప్పినను దుర్వ్యసనము మానకపోవుటచే వాఁడు చెప్పినట్లొప్పుకొన్నచో మానునేమో యని యొడంబడెను. కొడుకుం దండ్రియుఁ గలిసి ముప్పదినములు తప్పత్రాగిరి. ముప్పదియొకటవనాఁడు కుమారుఁడుతండ్రినిజూచి 'నాయనా! ఈదినమునుండిమనయింటికొక్కసారాచుక్కయయిన రానియ్యవద్దు. నాప్రతిజ్ఞాప్రకారము నేను త్రాగుడు మానివేయుచున్నా' నని చెప్పెను. అది విని తండ్రి కుమారున కిట్లనియె. ఓరీ! నీకిష్టములేనిచో నీవు మానుకొనుము. అంతియేకాని బ్రహ్మదిగివచ్చి ననుసరే నేనుమాత్రము త్రాగుడు మానను. ముప్పదిదినములతరువాత మానివేయునట్లు నీవు ప్రమాణము చేసితివిగాని నేను జేయలేదు. ఆమాటలువిని కొడుకు ముప్పదిదినములనుండి యలవాటుపడినవాఁడవు నీవే మానలేనప్పుడు మూడేండ్లనుండియలవాటుపడిన నేనెట్లు మానగలుగుదునని తండ్రిని మించి కొడుకు కొడుకును మించి తండ్రి తెగత్రాగి యిల్లుగుల్లచేసి రెండేండ్లలోఁ జచ్చిరి.

---

162 ఒకతురకవాఁడు మంత్రశాస్త్రజ్ఞునితో దయ్యములు లేవని వాదింపఁజొచ్చెను. అవియున్నవని నమ్మినమాంత్రికుఁడు తురకతో నిట్లనియె. దయ్యములు లేవని నీవు నమ్మినయెడల నే నొక మేకు నిచ్చెదను. అది నీవు శ్మశానములో మఱ్ఱిచెట్టుక్రింద కొట్టిరమ్ము. అని చెప్పఁగానే తురక సరేయని యామేకుఁదీసికొని రాత్రి రెండుజాముల ప్పుడు వల్లకాటికిఁబోయి యొకచోట గూర్చుండి మెల్లగా మేకు దిగగొట్టెను. ఆపని ముగిసినపిదప నతఁడు లేవబోఁగా నెవరోక్రిందికి దిగి

లాగినట్లయ్యెను. వెంటనే శరీరము చెమటలతో నిండెను. గుండెలు జల్లుమనెను. ఆపట్టు వదల్చికొనుటకు వాఁడు గొప్పప్రయత్నముఁజేసి చివరకు వదలించుకొని పరుగెత్తుకొని యింటికివచ్చుచుండఁగా వానిశరీరముమీఁద గొన్నికొన్ని దెబ్బలు తగిలి నెత్తురువచ్చెను. దెబ్బతగిలినపుడెల్ల నతఁడది యేమో తెలిసికొనక ఇది తప్పక దయ్యమేయనుకొని కేకలువేయుచుఁ బరుగులెత్తుచు 'అయ్యో! బాపనపిశాచీ! నీకు సలాము. నాజోలికి రాకు, మని పలుకుచు గ్రామములోఁ బడెను. అందఱు చేరి వానితొందరకుఁ గారణమడుగ, నేను దయ్యములులేవనుకొని ధైర్యము చేసితిని. అట్లన్నందుకు నన్నేదో దయ్యమువచ్చి బాఁదుచున్న'దని చెప్పఁ గొందఱు వానిఁ జూచి 'ఓరీమూర్ఖా! నిన్ను గొట్టుచున్నది దయ్యముగాదు బుద్ధిహీనుఁడవయి నీవు కొట్టఁదలఁచినమేకు నేలమీఁదఁ గొట్టక నీచొక్కామీఁదనేకొట్టుకొని యున్నావు. అది నీవు లాగినప్పుడు చొక్కానంటియుండి నీవు పరుగెత్తునపుడు వీఁపునఁ దగులుచున్నది అని చెప్పిరి. ఆపలుకులువిని యాతురకవాఁడు అయ్యో నేను దయ్యమనుకొన్నాను. ఇది నేను గొట్టినమేకేనా? అయినను దయ్యములజోలి కెప్పుడు బోఁగూడదు' అని తనదారినిదాను బోయెను.

---

163 ఒకబ్రాహ్మణుఁడు దినమంతయు బిచ్చమెత్తుకొని జీవించుచుండును. అతఁడావృత్తివల్ల ధనము కొంత సంపాదించినాఁడనిలోకమున వాడుకబుట్టి లోకులుకొందఱు నీవెంతో భాగ్యవంతుఁడవయితివిగదా. ఇంకను బిచ్చమెత్తనేల? అని యడుగుచువచ్చిరి. అట్టివాడుక వినుట మంచిదేయనితలంచి యాబ్రాహ్మణుఁడు తనవద్ద ధనమున్నదనక లేదనక గడుసుదనముగ "నేనుజనిపోవునప్పుడు నాకున్నమట్టుకు లోకముపాలుచేసియేపోవుదును మీరు విచారింపవద్దని చెప్పుచువచ్చె.

ఆమాటలువిని లోకమున కర్తఁడు గొప్పమొత్తమిచ్చి చచ్చునని లౌకులు తలంచిరి తరువాతఁ గొన్నినాళ్ళకతని కంత్యకాల మాసన్నము కాగాఁ గొందఱుగారిమస్థులతనికడకుఁబోయి యందఱి నావలకుఁ బొమ్మని రహస్యముగ నీకున్నమట్టుకు లోకులపాలుచేయుదు నంటివి. ఎక్కడేమున్నదో చెప్పుమని యడిగిరి అందు కర్తఁ డిట్లనియె. "నేనన్న మాటతప్పను. అట్లేచేయుదును. నాకిప్పటిమట్టుకు నలుగురుకొడుకులున్నారు. అదియేనాయాస్తి. వారిని లోకముపాలుచేయుచున్నాను మీజాగిరిత్తమీఁద మీరుండుఁడు" ఆపలుకులువిని వారు నవ్వి తమ యవివేకమునకుసిగ్గుపడివానిగడుసుదనమునకుమెచ్చుకొనుచుబోయిరి.

---

164 ఒక గడుసరి గోదావరితీరమందున్న యొకగ్రామమునకుఁ బోయి తానుండుటకొకయిల్లు వెదకికొనుచు నొకనియింటికిఁ బోయి నాకిల్లద్దెకు గావలయు నిచ్చెదరాయని యడిగెను. ఆయింటియజమానుఁడు బయటకువచ్చి నీయాలుబిడ్డలెక్కడనున్నారయ్యా! నీకుఁజిన్న యిల్లు గావలయునా? పెద్దయిల్లు గావలయునా? యని యడిగెను. ఆగడుసరి వానికిట్లనియె. నాయాలుబిడ్డలెందున్నారా? గోదావరిలో నున్నారు. వాళ్ళమాటదలపెట్టక యింటిమాటచెప్పుడు నాకెంత చిన్న భాగమైనను సరిపోవును. గృహయజమానుఁ డాపలుకులు విని 'పాపము! వానియాలుబిడ్డలు చనిపోయినారుగాఁబోలు. ఏచిన్నభాగమైన వానికి జాలు ననుకొని యొకగది నెలకు రూపాయకు వానికద్దెకిచ్చి యొకసంవత్సరము షరతు నేర్పఱచి ప్రవేశింపుమనిచెప్పెను. సరేయని యాగడుసరి యాస్థలమువిడిచి సాయంకాలమగునప్పటికి రెండుబండ్ల సామానుతో పదిమంది బిడ్డలతోను భార్యతోను వచ్చి యింట బ్రవేశించెను. గృహయజమానుఁడు వానితో వచ్చిన గంపెడు బలగమును వానినిజూచి "ఏమయ్యా! ఆలుబిడ్డలుగోదావరిలోనున్నారంటి

వి; చిన్నభాగము చాలునంటివి. ఇంతమందియెక్కడనుండివచ్చినారు ఒకగదియన్న పేరేగాని యిల్లంతయు నీవే యాక్రమించుకొన్నావు. ఇ దేమి పాపమయ్యా" యనియడిగెను. అప్పు డాగడుసరి యిట్లనియె. "నేను నీతోనబద్ధమాడుటలేదు. అప్పుడునాయాలుబిడ్డలు గోదావరి లోనున్నమాట నిజము, మేము గోదావరిమీఁదఁ బడవయెక్కి వచ్చి తిమి. మావాండ్రను గోదావరిలో పడవమీఁదనేయుంచి యిల్లుమా టలాడుకొనుటకు నేనూరిలోనికి వచ్చితిని" అన విని గృహయజ మానుఁడు "ఓరీ నీగడుసుదనము దొంగలు దోల. ఎంతపనిచేసితివ య్యా! అట్లయిన నాకద్దెయైన నెక్కువయిమ్మ"ని యడిగెను. ఆగడు సరి నవ్వుచు నిట్లనియె. "నేనొకగవ్వయెక్కువయియ్యను. సంవత్సర ముదాక మీయిల్లువిడువను. నీయిష్టమువచ్చినట్లు చేసికొను" మని మొండిమాటలాడెను. గృహయజమానుఁ డేమియుఁ జేయలేక యూ రకొనెను.

---

165 ఒకకాఁపువాఁడు పొలమునకుఁబోవ నిల్లుబయలుదేరికొం తదూరమరిగి యక్కడనుండు తనకుమారుని గేకవేసిపిలిచి "నీవెండి మొలత్రాడు బియ్యపుగూనలోఁ బెట్టినాను. నీవు కావలసినప్పుడు పె ట్టుకోవచ్చు"నని చెప్పిపోయెను. ఆపిల్లవాఁడు సరేయని యూరకొనె ను. ఆమాటలు దారినిబోవుచున్న యొకదొంగవాఁడువిని యావస్తువ పహరింపవలయునని సంకల్పించి కాఁపువానియింటికిఁబోయికుమారు ని బిలిచి "మీనాయనబియ్యపుగూనలోనీమొలత్రాడు దాఁచినాఁడఁ ట. మేమటువంటి మొలత్రాడొకటి చేయించుకొనవలయునని మచ్చు నిమిత్తము మీవస్తువిమ్మనియడిగినాము; మీతండ్రినిన్నడిగిపుచ్చుకొ మ్మనిచెప్పి బియ్యపుగూన యానవాలు చెప్పె" నని పలికెను. కొడు కామాటలువిని తండ్రినిజముగాఁ జెప్పియుండవచ్చు; లేనిచో బియ్య పుగూనలోనున్న సంగతి వీనికేమి తెలియు'నని నమ్మి వస్తువాదొంగ

కిచ్చెను. అది పుచ్చుకొని వాఁడు మరల కనఁబడలేదు. కాఁపువాఁడింటికవచ్చి బియ్యపుగూనలోనున్న సంగతి గట్టిగాఁ దాసఱచినందున నట్లయ్యెనని విచారించెను.

---

166 ఒకగ్రామమునందు మూర్ఖుఁడగు కాఁపువాఁడొకఁడుండెను. ఊరందఱువానినిబలుమారుపిరికిపందయని వెక్కిరించుచువచ్చిరి. ఆయపవాదముఁ బడలేక వాఁడు శూరుఁడనిపించుకొనవలయునని ప్రయత్నించుచుండనాగ్రామసమీపముననిద్దఱురాజులకుగొప్పయుద్ధము జరిగెను. ఆకాఁపువాఁ డాయుద్ధమునకుఁబోయి కొన్ని దినములయిన తరువాత స్వగ్రామమునకు వచ్చి "ఈవఱకు నన్ను బిరికిపందయనియెగతాళిజేయుచువచ్చిరి. నేనెంత పని జేసితినో చూడుఁడు. యుద్ధభూమిలో నేను వేయిమందికాళ్ళుచేతులు నఱికివేసితి"నని డంబములుపలుకసాగెను. వానిచేష్టలువిని గ్రామస్థులు మిక్కిలి యాశ్చర్యపడి ధైర్యమునకుమెచ్చిరి. అందొకగడుసువాఁడు లేచినీవుశూరుఁడవైనపక్షమున యుద్ధములో మనుష్యులతలలు నఱుకక కాళ్ళుచేతు లేలనఱుకవలయునని యడిగెను. అందుకు వాఁడిట్లనియె. "తలలు నేవెళ్ళకముందే యెవరోనఱికివేసిరి. అందుచేత నేను మిగిలినకాళ్ళుచేతులు నఱికితిని. తలయున్నపక్షమున నేను దానిని నఱకలేకపోవుదునా?' అట్లు పలికిన వాని వెంగలిపలుకులు విని యచ్చటచేరినవారందఱు జప్పట్లు జరుచుచు వికవికనవ్విరి.

---

167 ఒకబ్రాహ్మణుఁడు ప్రతిదినము మూడుపూఁటలుపూఁటకు గచ్చకాయంత యుండునట్లు నల్లమందుమాత్ర మ్రింగుచువచ్చెను. అందుచేత నతని కెక్కడ కూర్చుండిన నక్కడనే కునికిపాట్లు మత్తు వచ్చుచుండెను. అతఁడు ప్రతిసాయంకాలము చెఱువునకు సంధ్యావార్చుకొనుటకుఁబోయి తనజారీతో నీళ్ళునిండముంచి గట్టుమీఁదనున్న

యొక చెట్టుకుఁ జేరబడి సంధ్యావందనముఁ జేయుచుండును. నల్లమందు మైకముగలవాఁడగుటచే సంధ్యావందనముఁ జేయుచు నేనడుమనడుమఁ గునికిపాట్లుపడుచు మొదటన్నమాట మఱచుచు మగల మొదలుపెట్టుచు నెంతసేపటికి ముగింపక రాత్రి జామున కింటికిఁ బోవుచుండును. ఒకనాఁ డెప్పటియట్టు లాబ్రాహ్మణుఁడు చెరువుగట్టునఁగూర్చుండ నొకదొంగ యాజారీనెత్తుకొనిపోవలయునని సంకల్పించి ప్రక్కన జేరి యతఁడు మేల్కొన్నవాఁడో లేదో కనుఁగొనుటకై రెండుబెడ్డలాజారీమీఁదవేసెను టంగుటంగుమనుశబ్దము బ్రాహ్మణునకువినవచ్చెనుగాని మత్తుచేతఁ గన్నులుతెఱచి చూడలేకపోయెను. ఆదొంగవానిసంగతిగ్రహించి మరింతదగ్గర జేరి వానిస్థితికనిపెట్టుటకుఁ గొంచెము నీళ్ళొలుకబోసెను. జారీకొమ్ములోనుండి నీళ్ళు బొళకుబొళకుమనిపడుట వినియు బ్రాహ్మణుఁడు మత్తుచేఁ గన్నులుదెఱచి చూడలేకపోయెను. అప్పుడుదొంగ జారీయెత్తుకొని పారిపోయెను. బ్రాహ్మణుడు కూర్చుండికూర్చుండి జాము రాత్రియైనపిదపలేచి యింటికిఁబోవఁదలఁచి జారీ వెదకుకొనఁగా నది లేకపోయెను. ఎవఁడో దుర్మార్గుఁ డది దొంగిలించుకొని పోయెనని తెలిసికొని మరునాఁ డుపాయముచేత దొంగను బట్టుకొనవలయునని నిశ్చయించుకొని యింటికిఁ బోయెను. దొంగయుఁ బ్రతిదిన మొక జారీవంతున వానివద్ద దొంగిలించిపట్టుకొని పోవచ్చునని మఱునాఁడు సాయంకాలముకూడ చెఱువుగట్టునకు రాఁదలఁచెను. మఱునాఁడు బ్రాహ్మణుఁడుజారీపట్టుకొని రాకుండ తానే జారీలాగునఁ గూర్చుండవలయు ననియుఁ దననే జారీయనుకొనిదొంగ పుచ్చుకొనుటకు వచ్చుననియు నప్పుడు సులభముగా వానినిబట్టుకొనవచ్చుననియు నిశ్చయించుకొని చెఱువుగట్టుమీఁదఁదనకుడిచేయిజారీకొమ్ములాగు జాచి తాను జారీలాగునఁ గూర్చుంటిననియనుకొని కునికిపాట్లు పడఁజొచ్చెను. దొంగ చీఁకటిపడినపిదప వచ్చి జారీగానకదగ్గ

అగాఁ బెట్టుకొన్నాడనుకొనియెక్కడనున్నదో తెలిసికొనుటకు రాళ్ళు వేసెను. అవి బ్రాహ్మణునకుఁ దగిలెను. తగిలినతోడనే బ్రాహ్మణుడు తానే జారీయనుకొని యది మ్రోగునట్లు తాను మ్రోగకపోయినచో దొంగ జారీకాదనుకొనునేమో యను భయమున టంగుటంగుమని నోటితో ధ్వనిచేసెను. అది లక్ష్యముసేయకయే దొంగ వానిదగ్గఱకువచ్చి జారీ యెక్కడనున్నదోయని వెదకుచుండ వానిచేయిబ్రాహ్మణునకుఁదగిలెను వెంటనే యతఁడుజారీలాగునేబొళుకుబొళుకుమని నోటితో ధ్వనిచేసి దొంగను బట్టుకొనవలయునని సంకల్పముండియు మత్తున జేతులు జాపలేక టంగుటంగుబొళుకుబొళుకుమనియఱచుచుఁ గూర్చుండెను. దొంగ వానియుద్దేశము కనిపెట్టి జారీ తేలేదని తెలిసికొని నవ్వుచు నింటికిఁ బోయెను. బ్రాహ్మణుఁడును విఫలప్రయత్నుఁడై గ్రామమునకుఁబోయి బంధువులను మిత్రులను బిలిచి జారీ కడచినరాత్రి పోవుటయుఁ దా నాదినమున దొంగను బట్టుకొనుటకీయుపాయము పన్నుటయుఁ జెప్పి యెంతప్రయత్నించినను దొంగ దొరకలేదని విచారించెను. ఊరందఱు ఆకథవిని వాని తెలివితేటలకు మహానందభరితులైరి.

---

168 ఒకపండితుఁడు శిష్యునకు వేదాంత ముపదేశము చేయుచు "దైవసాహాయ్యమే సాహాయ్యము మనుష్యసాహాయ్యము సాహాయ్యముకాదు" అని చెప్పెను. ఒకబండివాఁడు దారిని బోవుచు వాని మాటలు విని యవియే గట్టిగా నమ్ముకొని కొంతదూరము పోవునప్పటికి వానిబండి బురదలోఁగూరుకొనిపోయెను. ఆపదలో మనుష్యసాహాయ్యము సాహాయ్యము కాదనియు దైవసాహాయ్యమే ముఖ్యమనియు వాఁడు నమ్ముటచే దైవమువచ్చి బండిపైకిలాగుననుకొని సాయము చేయుమనిమార్గస్థుల నెవ్వరిని నడుగక బండిమీఁదఁ బండుకొని చే

తులుజోడించి "బండిలాగు దేవుఁడా, బండిలాగు దేవుఁడా" యని ప్రార్థింపఁజొచ్చెను. వాఁడు పిచ్చివాఁడనుకొని యనేకులు నవ్వుకొనుచుఁ బోయిరి. ఎట్టకేలకు కొందఱు వానికడకుఁబోయి బండిలాగుట కేల ప్రయత్నించవ వని యడుగ దైవమే పైకిఁదీయునని వాఁడు బదులు చెప్పెను. అంతట వారు నవ్వి మూర్ఖుఁడా! పురుషప్రయత్న మున్నప్పుడే దైవము సాయముచేయునుగాని యూరక చేయఁడు. కాఁబట్టి లేచి పాటుపడుము. మేమును సాయముఁ జేసెదమని పలికిరి. అంత వాఁడు బుద్ధిగలిగి వారి సాయమున బండిఁ బైకిఁ దీసికొనెను.

---

169 ఒక బడిపంతులు తనవద్దఁ జదువుకొనుచున్న పిల్లలుతిన్నగాఁ జదువుట లేదని కోపించి, మీయాడున నేను మిక్కిలి తెలివిగలవాఁడనై పాఠములుచదివియుంటి' ననిపలికెను. అదివిని యొక తెలివిగల బాలకుఁడు లేచియిట్లనియె. "పంతులుగారు! మీరంత తెలివిగానుండుటకుఁ గారణము తెలిసినది. మీపంతులువారు చాల తెలివిగలవారై యుందురు. అందుచేతనే మీకంత తెలివిగలిగినది" తోడిబాలకులాపలుకులువిని కిలకిల నవ్విరి. పంతులు సిగ్గుపడి యూరకొనెను.

---

170 ఒక వెంగలివాఁడు భార్యను బిడ్డలను నగలతోఁగూడ నొకయూరికిఁ దీసికొనిపోవుచుఁ దాను బాణాకఱ్ఱ త్రిప్పనేర్చి యుండుటచేఁ దనమీఁద కెవ్వరు దొంగలురారని నిర్భయముగ నడచుచుండెను. కొంతదూరమరిగిన వెనుక వారిని దొంగలుకొట్టినగలపహరించిరి. గ్రామము చేరినతరువాత బంధువులు నీవు బాణాకఱ్ఱ త్రిప్పఁగలవుగదా నిన్ను దొంగలెట్లుకొట్టిరని యడుగ నతఁడిట్లనియె. అపాడుదొంగలు నేను బాణాకఱ్ఱత్రిప్పినదాకనైన నిలువలేదు. నేను త్రిప్పినదాకవారు దోఁచుకొనక పోయినపక్షమున దొంగలను దరికి రానిత్తునా" అనవుడు చుట్టము లందఱు వాని వెంగలితనమునకుఁ బకపక నవ్విరి.

---

171 ఒకపకీరుజ్యోతిశ్శాస్త్రములో మిక్కిలిగట్టివాఁడనని చెప్పుకొనుచు నందువల్ల ధనము సంపాదన చేయుటకై గోలకొండబోయెను. అతఁడు చెప్పినమాటలు కొన్ని కాకతాళన్యాయముగ నిజములయ్యెను. అతనికీర్తి నవాబువిని వాని నెప్పుడైనం బరీక్షింపుచుండవలయునని యోచించుచుండ నంతలో నవాబుగారి మందిరములోఁ గొన్నినగలు పోయెను. నలువదిమంది దొంగలు పొరుగూరినుండి వచ్చి దోఁచుకొనిరి. నవాబు పకీరుని బిలిపించి దొంగలెవ్వరో యెంతమందియో తెలియఁజేయుమని యడిగెను. పకీరు నిజముగ ప్రజ్ఞలేనివాఁడగుటచే నది తత్క్షణమున జెప్పలేక నలువది దినములు గడు వడిగెను. నవాబు సరేయని గడువిచ్చి యానియమితకాలములోఁ జెప్పనిపక్షమున తల గొట్టించి కోటగుమ్మమునకుఁ గట్టింతుమని ప్రతిజ్ఞ జేసెను. పకీరును ప్రత్యేకముగ నొకమందిరముఁ బుచ్చుకొని యందు జపముజేసికొనుచుఁ దన కంత్యకాలము వచ్చినదని బెంగపెట్టుకొని చింతగింజలతో దినములు లెక్కపెట్టుకొనసాగెను. ఒకదినము గడవగానే యొకచింతగింజదీసి "యేక్" అని ఒకగిన్నెలోవేసెను. రెండవదినము గడవగానే 'దో'అని రెండు గింజలు వేసెను. మూఁడవదినము గడచిన తోడనే 'తీన్'అని మూఁడు గింజలు వేసెను. నాలుగవ దినమున నాలుగు, అయిదవ దినమున నయిదు వేసెను. తమజాడలు తెలిసికొనుటకై యొకపకీరును నవాబు ప్రత్యేకముగ నేర్పఱచినాఁడనివిని దొంగలు భయపడి యాపకీరు మందిరములో నేమి చేయుచున్నాఁడో చూడవలయునని మొదటినాఁటి తెల్లవారగట్ల తమలో నొకనిని బంపిరి. ఆదొంగ వచ్చి కిటికీవద్దఁగూర్చుండి 'యేక్'అని పకీరొకగింజ గిన్నెలోవేయుట జూచి పరుగుపరుగున తోడిదొంగలవద్దకుఁబోయి ఓరీ మన కొంప మునిఁగినది. నేనొక్కఁడనె యక్కడఁ బోయినట్లు వానికి జ్యోతిషమువలనఁ దెలిసినది అందుచేతనే 'యేక్'అని యొకగింజ గిన్నెలో వే

సెను. వానియొద్ద నేదో మహిమ మున్నదిరా యనిపలికెను. దొంగ లామాటలు విని మరునాఁడు పకీరు చర్యలు గనిపెట్టుటకై తెల్లవార గట్ల నిద్దఱు దొంగలను బంపిరి. పకీరు నలువది దినముల గడవులో రెండుదినములు చెల్లినవి. నాయంత్యకాలము దగ్గఱపడుచున్నదియని వగచుచు ‹దో› యని రెండు గింజలు గిన్నెలో వేసెను. చూడవచ్చిన దొంగ లిద్దఱు తమరాక పకీరు కనిపెట్టి యిద్దరు దొంగలు వచ్చినట్లు తెలిసి ‹దో›యని రెండుగింజలు వేసినాఁడనుకొని భయపడి యింటికిఁ బోయి యట్లుచెప్పిరి. దొంగలు మరింత భయపడి మరునాఁడు మువ్వ రనంపిరి. పకీ రానాఁడుమూఁడుగింజలు వేసెను. ఆవిధముగా నాలు గవనాఁడు నలుగురు దొంగలు నైదవనాఁ డైదుగురు దొంగలు రాఁగా పకీరు నాలుగవనాఁడుచారని నాలుగుగింజలు, నయిదవనాడు పాంచని యైదుగింజలు వేసెను. రోజులు గడచినవని పకీరు గింజలు వేయగా తమ రెండఱు వచ్చినారో యాసంఖ్య తెలిసికొని గింజలు వేసినాఁడని దొంగ లనుకొనిరి. అట్లనుకొని చోరులు మిక్కిలి భయ పడి యాపకీరు తమ్ముఁబట్టి తప్పక వప్పగించునని నిశ్చయించి దొంగి లించినసొమ్ము పూరిపుల్లయైన దాఁచుకొనక యంతయుఁ గోటలోఁ బారవైచి పారిపోయిరి. సొమ్ము తెప్పించినాఁడని పకీరునకు గొప్ప కీర్తియు బహుమానమును లభించెను.

---

172 ఒక రాజుకొడుకు రెండేండ్లవాఁడు పున్నమినాఁడు చంద మామనుజూచి చాలసేపు సంతోషించి కేరింతలుకొట్టుచుఁ జిట్టచివర కాచందమామను దెచ్చి తనచేతి కిమ్మని తన్నెత్తుకొని యాడించు చున్న యాదాదినడిగెను. తెచ్చియిచ్చుట కసాధ్యమయిన వస్తువగు టచే దాది నవ్వి యూరకుండెను. తనకోరిన పదార్థము చేపడ లేదని యాబాలుఁడు పోరువెట్టి గొంతు పోవునట్లు శరీరము ముచ్చెమటలు

బట్టునట్టు రోదనముచేసెను. ఆరోదనముఁజూచి తల్లిదండ్రిలుతక్కిన రాజబంధువులు బాలుఁడేమగునోయని భయపడి యనేకవస్తువులం దెచ్చి వానిమారము మాన్పఁ బ్రయత్నించిరి. కాని బాలుఁడు తనకు జందమామయే గాని మఱియొకవస్తు వేదియు వద్దని తనయేడ్పుమానకపోయెను. అప్పుడు రాజు బుద్ధిమంతులగు పండితులను సేనానాయకులను కర్తవ్యమేమని యడుగదా వారేమియుం జెప్పలేకపోయిరి. అప్పుడు మంత్రికి వర్తమాన మంపగా నతఁడు బాలుని రోదన కారణము రాజువల్ల విని పిల్లవాని నెత్తుకొని నాయనా! నీకుఁజంద మామగావలయునా? సరే యిచ్చెదనుఁలేయని యొక యద్దముఁదెప్పించియది చంద్రుని కెదురుగాఁ బెట్టించి యాయద్దమున కెదురుగా బాలుని గూర్చుండఁబెట్టెను. చంద్రబింబ మద్దములో ప్రతిఫలించి సరిగఁ జందమామవలెనే యుండుటచే బాలుఁడదిచూచి తనకోరిన చందమామయే యదియనుకొని సంతోషించి యూరకొనెను.

---

173 ఒకపల్లెటూరున కొకనాఁడు రాజుగారియేనుఁగువచ్చెను. ఊరందఱు దానిని జూడబోయిరి. మూఁడేండ్ల పిల్లవాఁ డొకఁడు దానింజూచి యింటికిఁ బోయి యేనుఁగునుఁదెచ్చి తన యేకుల బుట్టలోఁ బెట్టుమని మారము చేసెను. తల్లిదండ్రి లేమియుఁ జేయలేక వానిపోరడఁచుట యెట్లని విచారించు చుండగా నాదారిని కరణము పోవుచుండెను. బాలునితండ్రి యాసంగతి వానితోఁజెప్పగా నతఁడు దానిని దనయింటికిఁ దీసికొనిపోయి లక్కయేనుఁగు నొకదాని నిచ్చి దీనిని దీసికొనిపోయి యేకులబుట్టలోఁ బెట్టి బాలకునకుఁజూపుమని చెప్పెను. అతఁడును సరేయని యాయేనుఁగు నట్లుబుట్టలోఁ బెట్టి కుమారునకు. జూపగా బాలకుఁ డాకారసామ్యమును బట్టి యేనుఁగే యని సంతోషించి యేడుపు మానెను.

---

174. ఒకబ్రాహ్మణుఁడు తానొకయుంగరముఁ జేయించుకొనఁ దలఁచి బంగారము కంసాలిచేతి కిచ్చెను. ఆకంసాలియు బంగారము చాలమట్టుకు హరించి లోపల లక్క పెట్టి కొంచెము బంగారముతో గుల్లయుంగరముఁ జేసి యిచ్చెను. మొదటబ్రాహ్మణుఁడదికనిపెట్టలేక పిమ్మట కొంతకాలమునకు వాఁడుచేసిన మోసమును గ్రహించివాని నేమియుఁ జేయలేక కంసాలికులమందుఁబుట్టినవానినెన్నఁడునమ్మఁగూడదనియు వానిపను లన్నియు మోసపు బనులే యనియు నమ్మకము గలిగియుండెను. అటులుండ నొకనాఁడు వానిభార్యయొకకంసాలివాని వద్ద నొక గేదెను బేరముచేసి కొనితెచ్చి యింటఁ గట్టిపెట్టెను. బ్రాహ్మణుఁ డింటికివచ్చిన పిదప గేదెను జూచి, యెక్కడిదని భార్య నడుగ నామె కంసాలివద్ద కొని తెచ్చితి నని చెప్పెను. అపుడావెంగలి బ్రాహ్మణుఁడు నోరునెత్తి గొట్టుకొని "యోసీ! వెఱ్ఱిముండా! డబ్బు నిష్కారణముగ బాడుచేసితివే. కంసాలివానిని నమ్మి యేవస్తువైనఁ గొనవచ్చునా? అతనివద్దనుండి వచ్చిన ప్రతివస్తువులోను తప్పకలక్క యుండును. ఇది లక్కగేదె. దీనినిమరల నిచ్చివేయు" మని చెప్పెను. భార్య మగని మాటలు విని వాని యమాయకత్వమునకు నవ్వి "అయ్యా! ఇది లక్కగేదె కాదు అన్ని గేదెలవలెనే యిదియు నున్నది. దీనికిఁ బ్రాణమున్నది. నడుచు చున్నది; మేత మేయు చున్నది. పాలిచ్చుచున్నది ఇది లక్కగేదె యెట్లగు" నని యెన్నివిధములనో చెప్పి వానిమూర్ఖతను బాపుటకుఁ బ్రయత్నించెను. కాని యతఁడు భార్యపలుకులు గణింపక "ఓసి, తెలివితక్కువరండా! అది యన్ని గేదెలవలె నుండును. మేతయు మేయును పాల నిచ్చును. కాని నిలువెల్ల లక్కయుండును. కంసాలివద్దనున్న చిత్రమే యదిఁ. లోకానుభవమును నీవేమి యెఱుంగుదువు. కాఁబట్టి యీగేదె పనికిరాదిచ్చివేయు" మని బలవంతముచేసి గేదెను కంసాలి కిప్పించెను.

---

175. సంపన్నుఁడగు నొకకాఁపువాఁడు నిరంతరముపల్లకినెక్కి తిరుగుచుండును. ఆపల్లకిమోయుటకు నాలుగురుచాకలివాండ్రు రేయింబవళ్ళు వానియింటఁ గనిపెట్టుకొని యుండెడివారు. ఒకనాఁడాకాపువాని పాడియావుదూడ తప్పిపోయి రాత్రిరానందున నతఁడుపల్లకిబోయిలను బిలిచి మాదూడతప్పిపోయినది. ఆవు రాత్రి తెగయఱచినది కావున నాదూడనువెదకి తెండని యాజ్ఞాపించెను. ఆబోయెలాపలుకులు విని "అయ్యా! మమ్ము మీరు పల్లకిమోయుటకె నియమించిరిగాని రెండవపనిగొఱకు గాదు. కావున దూడనువెదకుపని మాదికా" దని పొగరుబోతుతనముతోఁ బ్రత్యుత్తరము చెప్పిరి. కాఁపువాఁడాపలుకులు విని యామూర్ఖులకు బుద్ధిచెప్పవలయునని నిశ్చయించుకొని సరే! నా దూడను నేనే వెదకికొనియెదను. పల్లకిసిద్ధముచేయుఁడనిపల్లకినెక్కి యెండవేళ బయలుదేరి సందులుగొందులుతోటలుదొడ్లుచవటిపఱ్ఱలునిసుకనేలలు తిరిగెను బోయలకుఁగాళ్ళునెత్తి మాడిపోవుటచే వారుమిక్కిలి బాధపడి మేమిఁక మోయలేమని వానితోఁజెప్పుకొనిరి. అప్పుడాకాపువాఁడు పల్లకిమోయుపని మీది దూడనువెదకుపనినాదిగదా? మీపని మీరుచేయుఁడు నాపని నేనుజేసికొనియెద"నని బదులుచెప్పెను. ఆపలుకులు గ్రహించి బోయలు కాఁపువానికాళ్ళమీఁదఁబడి బుద్ధితెచ్చుకొని దూడనువెదకి తెచ్చి యప్పగించిరి.

---

176. ఒకగొల్లపిల్లవాఁడు పశువులంగాయుచు నెగతాళి కొకనాఁడు పులిపులియని యఱచెను. వాని కేకలు విని చుట్టుపక్కలపొలములోనున్న కాఁపువాండ్రిందఱు కఱ్ఱలు బల్లెము పుచ్చుకొని పరుగెత్తికొనివచ్చిపులియెక్కడనున్నదనివానినడిగిరి. ఆబాలుఁడునవ్వుచు నేను పరిహాసమునకంటిని.ఁపులినిజముగారాలే' దని వారితోఁజెప్పెను అదివిని కాఁపువాండ్రు వానినిదూషించిపోయిరి. అంతఁగొంతకాల

మున కొంకనాఁడు నిజముగాఁపులివచ్చి పసువులమంద మీఁదఁబడెను. గొల్లపిల్లఁడు పులిపులియని బిగ్గరగఁ గేకలువేసెను. చుట్టుప్రక్కలనున్న కాఁపువాండ్రు వాని కేకలువినియు వెనుకటియట్లది యెగతాళిమాటయేయనుకొని దరికిరారైరి. పులి యాగొల్లబాలుని గొన్ని పశువులనుదినిపోయెను. అబద్ధమాడుటవలనగదా గొల్లపిల్లనికి బ్రాణాపాయముగలిగెను.

---

177. ఒకబ్రాహ్మణుఁడు కాశీయాత్రకుఁ బోవుచుఁ దన పొరుగుననున్న మఱియొక బ్రాహ్మణునియింటికిఁబోయి “నావద్దనూరువరహాల సంచియున్నది. నేను కాశికిఁ బోవుచున్నాను. ఈసంచి నేను కూడఁదీసికొనిపోవుదునేని దొంగలపహరింతురు ఇంటనుంచుటకంతకన్న వీలులేదు. కావున నీవిది దాఁచిపెట్టఁగలవా” యని యడిగెను. ఆపొరుగు బ్రాహ్మణుఁడు వరహాలసంచి తనవద్దకు వచ్చునను సంతోషముతో “అయ్యో దాఁచలేకేమి మాయింట గట్టిబోషాణమున్నది నీసొమ్ము నీకు జాగ్రత్తగనప్పగించెద” నని చెప్ప మొదటిబ్రాహ్మణుఁడుసంచి వానిచేతి కిచ్చి కాశికిఁ బోయెను. అతఁడు కాశీలో రెండుసంవత్సరములుండి మరలివచ్చి వాని నాధనమడుగ నావద్ద నీవుదాఁచనేలేదని ప్రత్యుత్తరమిచ్చెను. ఆబ్రాహ్మణుఁడు దుఃఖపడుచు రాజువద్దకుఁ బోయి చెప్పుకొనగా రాజు వానిమనవి విని వెంటనే యారెండవబ్రాహ్మణుని బిలిపించి నీవు వానిసొమ్మెఱుఁగుదువాయని పలికెను. నే నేమియు నెఱుఁగను మహాప్రభూయని బ్రాహ్మణుఁ డేడ్వసాగెను. రాజు వాని భయమును జూచి “ఈకల్లబొల్లి యేడ్పులకేమిగాని యీతాఁటియాకు గంటముఁబుచ్చుకొని నేను జెప్పినట్లు నీకొడుకుపేర నొకయుత్తరము వ్రాయు” మని యాజ్ఞాపించెను. ఆమహాపాతకుఁడు తనగుట్టు బయటపడుననే భయమున మఱింతవడఁకుచు “ఉత్తరమెందుకండి నేనేపోయి నాకొడుకును దీసికొనివచ్చెద” నని బదులుచెప్పెను. రాజు

కఠినస్వరముతో కదలకుండ నక్కడ గూర్చుండు మని యాజ్ఞాపించి వాఁడు వ్రాసినట్లె వానికొడుకు పేర నీక్రిందియుత్తరమును వ్రాయించె ను. "వెనుక మనయింటిపొరుగు బ్రాహ్మణుఁడు మనవద్ద దాఁచుకొన్న వరహాలసంచినినేను మరలవానికిచ్చివేయఁదలఁచుకొన్నానుగనుక నీవది పట్టుకొని తక్షణము రావలసినది" ఆయుత్తరమువ్రాయించివాని చేత వ్రాలు చేయించి యొకసేవకునిచేతికిచ్చి వానియింటికిఁ బంపెను. తనమోసము బయలుపడుచున్నదని బ్రాహ్మణుఁడు మిక్కలి కళవళ ము పడఁజొచ్చెను. అంతలో వానికొడుకు సంచిపట్టుకొని రాజుగారి యెదుటికివచ్చెను. రాజాసంచిపుచ్చుకొని మొదటిబ్రాహ్మణుని బిలి పించి వాని ధనము వానికిచ్చెద.

---

178 ఒకముసలిబైరాగి యొకగ్రామముఁజేరి యచ్చటిజనులకు దాను తిరిగి వచ్చిన కాశీ రామేశ్వరము మొదలగు పుణ్యక్షేత్రముల లోగల మహిమలు చెప్పుచువచ్చెను. ఆచేరినవారిలో నొకముసలిగొల్లవాఁడుండి వాఁడు చెప్పినంతసేపు వలవల యేడ్చుచుండెను. చేరిన వారిలో నొకఁడు గొల్లవానిని జూచి యెందు కీవిధముగా నేడ్చుచు న్నావని తెలిసి తెలిచి యడుగ నతఁడిట్లనియెను. వెనుక నావద్దనొక తెల్లమేఁక యుండెను. దానిగడ్డ మీబైరాగి గడ్డమువలెనే యుండెను. దానిని నాబిడ్డవలెఁ బెంచుకొంటిమి. అది చచ్చిపోయినది వీనినిజూడ గానే యది జ్ఞాపకమురాగా నేడ్చుచుంటిని. అనవుడు నామాటలు విని యక్కడివారందఱు పకపకనవ్విరి.

---

179 ఒకరాజు జనులందఱకిఁ దాను స్వయముగ దర్శనమిచ్చి వివాదములలో న్యాయములగుతీర్పు లీయవలయునని నిశ్చయించుకొని జనులు తనవద్దకు స్వయముగావచ్చి పిలుచుటకు వీలులేదు గనుక వారు వచ్చినట్లు తనకుఁ దెలియుటకు సింహద్వారమువద్ద నొకపెద్దగం

టఁ గట్టించి తన దర్శనము కావలసినవా రాగంట వాయించవలసిదని యాజ్ఞాపించెను. ఆగంట కొకపొడుగుత్రాడు గట్టించెను. అది వీథిలోనికి వ్రేలాడుచుండును. అన్యాయమువలన బాధపడు జనులందఱు సింహద్వారమువద్దకుఁ బోయి యాత్రాడులాగినతోడనే గంట మ్రోగుచువచ్చెనుఁ గంటమ్రోగినతోడనే రాజచ్చటికివచ్చి వారల మొఱలు విని న్యాయముదయచేసి పొమ్మనుచువచ్చెను. ఆరాజు మంత్రి చిరకాలముతనవద్దఁ బనిచేసినగుఱ్ఱమును ముసలిదను వంకబెట్టి మేఁతఁ బెట్టక వదలిపెట్టెను. ఆగుఱ్ఱము మూడుదినములు గడ్డిలేక మలమల మాడి యాఁకలికిఁ దాళఁజాలక రాజద్వారమువద్ద వ్రేలాడుచున్న గంటకుఁగట్టిన త్రాడు నమల నారంభించెను నమలుట ప్రారంభించినతోడనే గంటమ్రోగఁజొచ్చెను. మ్రోగినతోడనే ప్రజలెవ్వరో సంగతులు మనవి చేసికొనుటకువచ్చిరనిభ్రమపడి రాజుసభకుఁబోయి కూర్చుండి వచ్చినవారిం బిలువుమని భటుల కాజ్ఞాపించెను భటులు చూచి రాజువద్దకుఁబోయి "దేవా! త్రాడుమనుష్యులులాగుటలేదు. మంత్రిగారు మేతఁబెట్టక విడిచిన ముసలి గుఱ్ఱము దానిని గడ్డియనుకొని లాగితినుచున్న"దని విన్నవించిరి. ఆపలుకులు విని రాజు నవ్వి తత్క్షణమే మంత్రింబిలిపించి "ముసలితనమందుఁ బనిచేయలేనప్పుడు గుఱ్ఱమును మఱింత శ్రద్ధతోఁ బోషించుటకుమాఱుగా దానిని వదిలితివా"యని చీవాట్లుపెట్టి దానిని దన గుఱ్ఱాలశాలలోనుంచి మేతపెట్టుమనియాజ్ఞాపించి తనరాజ్యములో మనుష్యులకేకాక జంతువులకుఁగూడ న్యాయము జరుగుచున్నదని సంతసించెను.

---

180 ఒకకన్నుగలవాఁ డొకఁడు రెండుకన్నులుబాగున్నవాఁడొకఁడు కలసి ప్రయాణము చేయుచుండిరి. అప్పుడు రెండుకన్నులున్నవాఁడు ప్రక్కనున్న యేకాక్షునిజూచి "పాపము రెండవకన్నులేకపోవు

ట గొప్పవెలితిగదా? దృష్టి సరిగాలేకపోవుటకన్న కష్టములే" దని జా లిపడెను. ఒక్కకంటివాఁడు వానిమాటలకుఁదురభిమానమునొంది (నీ కన్న నాకేదృష్టిబాగున్నది నాకుఁగనబడట్టు నీకుఁగనబడినదని ప్రత్యు త్తరమిచ్చెను. ఆమాటలువిని మంచిదృష్టియున్నవాఁడు నీపలుకులు ఋజువుచేయగలవాయని యడుగ నేకాక్షి యిట్లనియె. "ఆహా ఋ జువుచేయలేకేమి చూడునాదృష్టి చెడ్డదైనను నీమొగముమీఁద నాకు రెండుగన్నులు కనఁబడుచున్నవి. నీవు రెండుకన్నులు బిర్దలుచేసికొని చూచినను నామొగముమీఁద నీకొక్కకన్నే కనఁబడుచున్నది. నీదృ ష్టికన్న నాదృష్టి మంచిదగునా కాదా?"

---

181 ఒకరాజు మంత్రివద్దకు నొక బ్రాహ్మణుఁడుబోయి "అ య్యా!అన్యాయముగా నాపొలము కరణముగారి బంధువుఁడొకఁడుక లుపుకొన్నాఁడు దాని నిప్పించవలయు" నని చెప్పుకొనెను. వానిమనవి విని మంత్రి "యీయూరి కొత్వాలుగారితోఁ జెప్పుకొనుము. అతఁడి ప్పింపగఁల" డనిచెప్పెను. అయా కొత్వాలు వానిబంధువుఁడే కా వున న్యాయముదొరకదని వాఁడు ప్రత్యుత్తరము చెప్పెను. అదివిని మంత్రి "పోనీ సేనాపతియొద్దకుఁ బోయిచెప్పుకొనుము అతఁడిప్పించు" నని చెప్పెను. అయా సేనాపతియు వానిబంధువుఁడేయని బ్రాహ్మణుఁ డు మరల బదులుచెప్పెను. అట్లైన దేశపాండ్యాతోఁ జెప్పుకొనుము. అతఁడు నీకిప్పించగలడని మంత్రిమరల చెప్ప నతఁడును వానిచుట్టమే యని బ్రాహ్మణుఁడు వెండియు మొరపెట్టుకొనెను. అప్పుడుమంత్రి వి సిగి కోపముతో నట్లైన మృత్యుదేవతకడకుఁబొమ్మని పలికెను. బ్రా హ్మణుఁడును విసిగి కోపించి చిత్తము. అక్కడకే వచ్చియున్నాననియ చ్చోటు విడిచి యావలకుఁబోయెను.

---

182. ఒకగొప్పవర్తకుని కుమారుఁడు వ్యాపారమునిమిత్తము దేశాంతరమందుండగా స్వస్థలమునుండి వానివద్దకు వాని సేవకుఁడొకఁడు పోయెను. అప్పుడు వారికిద్దఱికి నీ క్రిందిచిత్రసంభాషణము జరిగెను.

కు—(సేవకునితో) ఓయీ! ఎప్పుడు వచ్చితివి? నాడేగ బాగున్నదా?

సే—స్వామీ! ఏమని చెప్పుదును. డేగ చచ్చిపోయినది.

కు—పాపము! పోయిన దేమి ఎందుచేత బోయినది.

సే—తెగతిన్న జంతువు బ్రతుకునా?

కు—అంత తెగతినుట కేమి దొరకినది.

సే—గుఱ్ఱపుమాంసముతిని చచ్చిపోయినదండి.

కు—అంతవిస్తారము గుఱ్ఱపుమాంస మెక్కడ లభించినది?

సే—మీతండ్రిగారి గుఱ్ఱములన్నియు నొక్కమారే మృతినొందినవి గావా?

కు—గుఱ్ఱములన్నియు నొక్కసారేపోయినవా! ఏమి!

సే—శక్తికిమీరిన పని చేయించినప్పుడు చావక బ్రతుకునా?

కు—అంత మితిమీరిన పని యేమిగలిగినది.

సే—చెఱువునద్దనుండి మీయింటివఱకు నీళ్ళు తెగమోసి చచ్చినవి.

కు—అంతవిస్తారము నీరేల కావలసివచ్చెను.

సే—నిప్పులార్పుటకు.

కు—ఏమినిప్పులు? అంతటిమంట యెట్లుగలిగినది.

సే—అయ్యో! మీయిల్లు మీమిద్దెలు మేడలు కాలిపోలేదా?

కు—ఏమీ మాయిండ్లు కాలిపోయినవా! ఎందుచేత?

సే—కాగడాలచేతనని నేను తలఁచెదను.

కు—అన్ని కాగడాలు వేయవలసిన యవసరమేమి.

సే—మీయమ్మ దీపాలవేళ చనిపోవుటచే రాత్రి తీసికొని వెళ్ళవలసి వచ్చినది.

కు.—అయ్యయ్యో! మాతల్లి మృతినొందినదా! ఏమిరోగమువచ్చి?

సే.—రోగముగాదు. ఆదుర్వార్తవిని సహింపలేకపోయినది.

కు.—ఏదుర్వార్తవిని?

సే.—పాపము మీతండ్రిగారి మరణవార్త!

కు.—అయ్యో! మాతండ్రిగారుకూడ మృతినొందిరా!

సే.—అవును, ఆయన యోజాజాబును జూచికొని గుండెలుపగిలిచచ్చెను.

కు.—ఏజాబు చూచుకొని

సే.—మీయోడలు మునిగిపోయెనని మీసంపదలు నసించినవని.

కు.—కటకటా! అందఱు మృతినొందుటయు సంపదలు నసించుటయు సంభవించెనా? ఎన్నిదుర్వార్తలు తెచ్చితివిరా!

సే.—ఇన్నిదుర్వార్తలొకసారిచెప్పిన మీరు గుండెలుపగిలి చత్తురేమోయని భయపడి చావుకబురు చల్లగాఁ జెప్పితిని.





# వి నో ద ము లు

ఒక రాజసభలో నొకవికటకవి యుండెను. అతఁడుతనమాటల చమత్కారముచే రాజును సంతోషపెట్టు చుండును. ఆరాజువద్ద కొక్కనాఁడు నాలుగుశాస్త్రములఁ జదివిన పండితుఁడువచ్చెను. ఆతఁని యెదుట నేపండితులు నిలువలేకపోయిరి. వికటకవి రాజుసన్నిధి కరిగి పండితునితో వాదముఁ జేయుటకు తనకు సెలవిమ్మని యడిగెను. వికటకవికినిజమైన పాండిత్యములేదని రాజెఱిఁగియు నతని చమత్కారవచోరచనలు విని సంతసింపవలయునని సెలవిచ్చెను. అంతట వికటకవి పండితుని సమీపించి "అయ్యా! 'ఇది' యను శబ్దమునకెన్నియర్థములున్నవో చెప్పుఁ"డని యడిగెను. పండితుఁడు తెల్లబోయి యిది యనఁగా సమీపవస్తువు. దానికర్థము లేదని బదులు చెప్పెను. అదివిని వికటకవి యిట్లనియెను. 'ఇదియా నీపాండిత్యము? నవద్వీపములో నాలుగేండ్లు, కాశిలోఁ బండ్రెండేండ్లు చదువుకొంటినని విఱ్ఱవీఁగుచుంటివి. నీచదువుబూడిదలోఁ బోసినపన్నీరు. నేను చెప్పుచున్నాను విను. ఇది యనుమాటకు నూఱర్థములున్నవి. తిరిగి మాటలాడితే రెండు వందల యర్థములున్నవి. మళ్ళీమాటలాడితే మూడువంద లర్థములున్నవి. నాకు తెలిసినవే నాలుగువందలయర్థములున్నవి." అనవుడు నప్పండితుఁడు విస్మితుఁడై హీనస్వరముతో "నేనన్నియర్థములెన్నఁడు వినలేదు. నిఘంటువులలో నెక్కడనన్నియర్థములు లే"వని ప్రత్యుత్తరమిచ్చెను. వికటకవి వెక్కిరింపునవ్వు నవ్వి యిట్లు బదులుచెప్పెను.

"నిఘంటువులలో లేక పోయినంతమాత్రమున నర్థములు లేవా? నిఘంటువులు చేసినవారుసర్వజ్ఞులా? చూడు. నేనుచెప్పుచున్నాను. ఇది యను శబ్దము కల్పవృక్షమువంటిది. అది యన్ని శబ్దములకు నర్థమే, ఈక్రిందప్రయోగము చూడు. "ఏమండీ మీరు కొంచెము యిదిగా నున్నారు? మీ మొగమెంతో యిదైనట్లున్నది? మీశరీరములో ఇది గానున్నదా యేమిటి. మీకు నాలుగు నెలలనుండి పనిమెంతో యిది గానున్నది. ఎంత యిదున్నప్పటికి అంత ,యిదికూడదు. కొంచెమిది గానుండవలె గాని లేకపోతే మనపని అసలే యిదైపోతుంది. ఒంట్లో యిది యుంటెగదా యేయిదైనాను. ఆయిదికొంచెముపోతే తరువాత యేమి ఇదాతుంది. మీయిదేమి బాగుగలేదు. ఎవరియిది వారు చూచుకోవాలికానియొకరి యిది యొకరుయిది చేయుదురా! ఇందులో మీతహసీల్ దారుగారి యిదికూడ కొంతయున్నట్లున్నది. ఆయన బొత్తిగా యిదైనాఁడు. అధికారితో యిదివచ్చినది. మఱియొక యిదైతే యేదైనా చేసికొందుము."

"శాస్త్రిగారూ! చూచినారా యిదిశబ్దమున కెన్నియర్థములున్నవో. మీయిది చూడఁనాకెంతోయిదగుచున్నది.ఇదిమొదలుకొని యిది యనఁగా నేమిటో తెలిసికొని కొంచెమిదిగా నుండండి, వికట కవిమాటలు విని యాపండితుఁడు జన్మమధ్యమం దెన్నఁడు నెఱుఁగ నంత యాశ్చర్యము నొందెను. రాజు సభాసదులు వికవిక నవ్విరి. అనంతరము రాజు పండితునకు దుశ్శాలువలు నూటపదార్లు బహుమతి నిచ్చిపంపెను.

2 పూర్వకాలము తామర్లేనను తురకచక్రవర్తి యొకఁడుండెను. అతఁడు హిందూదేశముగూడ దండెత్తి డిల్లీ పట్టుకొనెను. చిన్నవాఁ డతండు సాహసులగు కొందఱు పడుచువాండ్రను సైన్యముగఁ

గూర్చుకొని రాజ్యము సంపాదింపవలె నని సంకల్పించి యొకరాజు దేశముపై దండెత్తి ముందుగా నాతని రాజధానిఁ బట్టుకొనుటకు యత్నించెను. కాని దైవవశమున నోడిపోయెను. అతనిసైన్యము చెల్లాచెదరయ్యెను. తురక తానొక్కఁడు ప్రాణములఁదక్కించుకొనుటకుఁబాఱిపోవలసి వచ్చెను. అటు పారిపోవుచు నొకనాఁడురాత్రి యొకచిన్నగ్రామములో నొకయింటఁ దలఁదాచుకొని మిక్కిలియాకఁలిగొని యాయింటనున్న ముసలమ్మను తనకాహారమేదైన నిమ్మనిప్రార్థించెను. ఆమె సరేయని వేఁడిరొట్టె తెచ్చి యతనిముందు పెట్టెను. ఆకఁలిబాధచేత తామర్లేను ముందుగా రొట్టెయొక్క మధ్యభాగమునుండి కొంతముక్క తీసికొనయత్నింప నాతనిచేయి కాలెను. ముసలమ్మయితఁడు తామర్లేననుమాట యెఱుఁగక యతఁడు వ్రేళ్ళూదుకొనుచుండుటఁ జూచి నవ్వి నాయనా నీవెవ్వఁడవో కాని తామర్లేనువలె మూర్ఖుఁడట్లు గనపడుచున్నావు సుమీ! యని పలికెను. ఎందుచేతనని తామర్లే నామెను హేతువడిగెను. అవ్వ యతని కిట్లనియెను. శత్రురాజ్యమునుఁ బట్టుకోదలఁచినవాఁడు ముందుగా రాజ్యముయొక్క కొట్టకొననున్న చిన్నగ్రామములు పట్టుకొనవలెను. అక్కడ రాజసైన్యములుండవు గనుక సులభముగఁ జిక్కును. కొన్నిగ్రామములు స్వాధీనమైనతరువాత క్రమక్రమముగా రాజ్యము స్వాధీనపడును. అట్లుచేయక ముందుగా రాజధానే పట్టుకోతలఁచి తామర్లేను భగ్నప్రయత్నుఁడయ్యెను. వేఁడిరొట్టెఁ దినఁదలఁచినవాఁడు చివరముక్కలుమెల్లమెల్లగఁ దుంచి తినుచుండినయెడల మధ్యభాగము చల్లారి స్వాధీనమగును. అట్లుచేయక ముందుగా మధ్యభాగముఁ దినుటచే నీకు చెయికాలినది. అందుచేత తామర్లేను నీవుసమానమూర్ఖులని నాయభిప్రాయము. ఆమాటలు విని తామర్లేను తనగుట్టు బయలు పెట్టుకొనక తెల్లవారుఝామున లేచి స్వగ్రామమునకుఁ బోయి కాలక్రమమున మరలఁ గొం

తసైన్యముఁ గూర్చుకొని ముసలమ్మ చెప్పిన యుపాయము ప్రకారము శత్రువులయొక్క రాజ్యములో గొట్టకొనగాగ్రమముఁ బట్టుకొని తరువాత రాజ్యమంతయు నాక్రమించుకొని సఫలమనోరథుఁ డయ్యెను.

3. తామర్లేను చక్రవర్తి ఢిల్లీదండెత్తి వచ్చినప్పుడు నగరములో సంగీతమునకు ప్రసిద్ధికెక్కిన యొక వేశ్యను పిలిపించి గానము సేయుమని యడిగెను. ఆమె యెంతో మనోహరముగ గానముఁ జేసి తురకచక్రవర్తిని మెప్పించెను. కాని యావేశ్య కురూపి. ఆమెగానము ను మెచ్చి చక్రవర్తి యపహాస్యముగ నిట్లనియె. "గానవిద్యాదేవత గ్రుడ్డివలె నున్నది. అట్లుగాక కన్నులుగల దైవపక్షమున నీవంటి కురూపి నాశ్రయించి యింతప్రజ్ఞావంతురాలుగఁ జేయునా?" ఆపలుకులు విని గడుసుఁదనపుటెంకి యైన యావేశ్య యిట్లనియె. "రాజా! నిజమే! గానవిద్యాదేవత గ్రుడ్డిదే. కాని యామె యొక్కర్తియె కాదు గ్రుడ్డిది. లక్ష్మికూడ గ్రుడ్డిదే. కానిపక్షమున నీవంటికుంటివానివరించి యింత మహైశ్వర్యము నీకేల యిచ్చును." తామర్లేను జన్మమునుండియుఁ గుంటివాఁడు.

4. ఔరంగజీబుచక్రవర్తి యొకపావురమును మిక్కిలి యనురాగముతో బెంచి యాపావురము చచ్చిన దని మొట్టమొదటనెవఁడు తనతో జెప్పునో వానిబుఱ్ఱతీయించెదనని ప్రతిజ్ఞఁ జేసెను. అందుచేత సేవకులు దానిని మిక్కిలి జాగరూకతతో పెంచుచుండిరి. ఒకనాఁడు దైవవశమున సకలగృహవర్తియగు మార్జాలచక్రవర్తి ఢిల్లీచక్రవర్తిగారిపావురపుచక్రవర్తిని చలిదిముద్దఁ జేసికొనెను. సేవకులందఱు భయభ్రాంతులై యెవఁడు చక్రవర్తితో చెప్పిన వానిబుఱ్ఱ తెగునని చెప్ప శంకించిరి. ఆసేవకులలో నొక విదూషకుఁడుండెను ఆతనిమాటల కౌరంగజేబు మిక్కిలి సంతసించుచుండును, అతఁడు తోడిసేవకుల నూర

డించి తానావర్తమానము చక్రవర్తికి నెఱింగింపఁబూనికొని యాతని యెనుటికిఁ బోయి సలాముఁజేసి నిలిచెను. పావురము బాగున్నదా యని చక్రవర్తి ముందుగా వానినడిగెను. బాగున్నదని బదులుచెప్పి యాసేవకుఁడు వెండియునిట్లనియె. "అయ్యా! మనపావురముసామాన్యపుఁబావురము కాదండి. ఈదినముననదిపై కెగిరి పల్టీలుకొట్టికొట్టికొట్టి యొకసారి యడ్డముగాను నొకసారినిలువుగాను వేరొకసారివంకరగాను వేరొక సారి గుండ్రముగాను తిరిగి తిరిగి యిప్పటికిని గూఁడు జేరలేదు. మఱికొంచెము సేపటికో రెండుజాముల రాత్రికో యెల్లుండికో అవతలెల్లుండికో ప్రొద్దున్నకోతప్పకవచ్చుననితోఁచుచున్నది. దాని కేమియు భయములేదు." అనుచుండ చక్రవర్తి నీమాటలువినగా మనపావురము చచ్చినదని తోఁచుచున్నది యనెను. అనవుఁడు సేవకుఁ డిట్లనియె. "స్వామీ! పావురము చచ్చినదన్నమాట ముందుగా మీనోటనుండి వచ్చినది. మానోటనుండి రాలేదు. మీద దేవరవారి చిత్తము" అప్పలుకులు విన జక్రవర్తికి కోపముపోయి నవ్వు వచ్చెను. అంతట సేవకుల భయము తీఱెను.

5 అద్భుతచరిత్రగల యొకానొక మనుష్యునకు మిక్కిలియక్కజములగు సంబంధ బాంధవ్యము లొకానొక వివాహమువల్ల కలిగెను. ఆవిచిత్ర బాంధవ్యములను వీలైనపక్షమున ప్రపంచమునందందఱికిని అట్లువీలుగాని పక్షమున నథమపక్షమాంధ్ర మహాజనులకైననుఁ దెలియజేయవలసినదని మమ్మె మఱిమఱి కోరియుండినందున లోకమునకిది యుపకారమనియుఁ వినోదకరమనియు దలంచి మేమా గృహచ్ఛిద్రములఁ బ్రకటించుచుంటిమి. ఆతఁడు మాపేర నిట్లు వ్రాసినాఁడు.

అయ్యా!

నాసంగతి మీమనోరమ పత్రికయొక్క వినోదములలో బడ దగినదని నేను తలంచి కష్టపడి మీపేర వ్రాయుచున్నానుగాన తప్పక దానిని ప్రకటింపవలయునని వేడుచున్నాను.

నేను వితంతువివాహము లంగీకరించిన యొక వర్ణమువాడను. కొన్నిసంవత్సరములనుండి నాకొక వితంతువుతో పరిచయమైనది. ఆమెకొక సవతికూతురు గలదు. ఆమెకు వివాహము కాలేదు. ఈ వితంతువు పడుచుదగుటచేతను నాకంటికి రూపవతిగా గనబడుటచేతను నాకామెమీద మనస్సు నిలుచుటచేతను ఆమెకు నాయందనురాగము కలుగుటచేతను నేనావితంతువును వివాహమాడితిని. అప్పటికి నాతల్లి చనిపోయి మూడుసంవత్సరములైనది. మాతండ్రి వివాహయోగ్యమైన వయస్సులో నుండుటచేత తనకనుకూలమైన పిల్లను వెదకికొనుచుండెను. ఇంతలో నాభార్యయొక్క సవతికూతురు తనకుదగిన యిల్లాలగునని తలంచి తన్నువివాహమాడుమని యాపెకువర్తమానమంపెను. వయసు మీఱినను ధనము విశేషముగ నుండుటచే నాభార్య సవతికూతురు మాతండ్రిని వివాహ మాడెను. అప్పుడు నాభార్య నాతండ్రి కత్తగా రయ్యెను. నాభార్యయొక్క సవతి కూతురు నాకు సవతితల్లి యయ్యెను. నాసవతితల్లికి నేను సవతి తండ్రి నైతిని. నాసవతితల్లికి కొడుకుపుట్టెను. నాతండ్రివరసను బట్టిచూచిన పక్షమున ఆకుఱ్ఱవాఁడు నాతమ్ముఁడుగదా! మాతండ్రి గారి కుమారుఁడు నాకుసోదరుఁడు గాకపోవునా? కాని నాభార్యవరసనుబట్టి చూచినపక్షమున ఆసంబంధము నిలువదు. ఆకుఱ్ఱవాఁడు నా భార్యకు సవతికూతురి కొడుకుగావున నాభార్య వాని కవ్వయగును. అవ్వమగడగుసు నేనువానికి తాతనగుదును. ఆవరసనుబట్టి నాసవతితమ్మునకు నేను తాతనైతిని. దైవానుగ్రహమున యీవితంతుభార్యన

లన నాకొక కుమారుఁడుబుట్టె. అందుచేత నాసవతితల్లి నాకుమారు నకు సవతి యప్పగారైనది. కాని నాకుమారునకు నాసవతితల్లి తాతగారిభార్య యగుటచే నాయనమ్మకూడ నయినది. నాతండ్రి నాకుమారుని యొక్క సవతియప్పగారి మగఁడగుటచే ఆకురరి వానికాయన బావమఱది యయ్యెను. ఈసందర్భములో నాకొడుకు నాసవతితల్లినేమని పిలువవలయునో నాతండ్రి నేమని పిలువవలయునో నేనువారి నేవరసతో పిలువవలయునో వారు నన్నేవావిపెట్టి పిలువవల యునో ధర్మశాస్త్రవేత్తలగు పండితులు మనుస్మృతి మొదలైన ధర్మశాస్త్రములు వెదకి నాసందేహముఁ దీర్పవేడుచున్నాను.

6. గాఢదేశాభిమానముగల యొకశూరుఁడు తండ్రియొద్దసెల వుఁగైకొని యుద్ధమునకు వెళ్ళెను. యుద్ధభూమినుండి తండ్రికొకసారి యిట్లు జాబువ్రాసెను. "నాయనా! నారెండవకాలు తెగిపోయినది. చికిత్స చేయించుకొనుచు వైద్యశాలయందున్నాను. నాకిపుడు ఖర్చుల నిమిత్తము నూరు రూపాయలు కావలెను. వెంటనే పంపించవలెను. మిక్కిలి చిక్కుపడుచున్నాను. అశ్రద్ధచేయవద్దు" ఆజాబునకు తండ్రి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "కుమారా! ఈయుద్ధములో నీకిపుడు పో యినకాలు నాలుగవది. అందరు మనుష్యులకు రెండుకాళ్ళే యున్నవి గాని నీకెన్నో కాళ్ళున్నట్టు కనఁబడుచున్నది. ఈకాలు పోయినను నీకు మఱియొక కాలుండవచ్చును. కాబట్టి నీకుసొమ్ము పంపనక్కర లేదు. అబద్ధపుజాబులు వ్రాసినవారిగతి యిట్టిదేకదా!

7. ఒకగృహయజమానుఁడు త్రాగుబోతు. అతనిసేవకుఁడంత కన్న త్రాగుబోతు. యజమానుఁడింట లేనప్పుడు సేవకుఁడు వానిబుడ్ల లోని సారాయి త్రాగివేసి యందు నీళ్ళుగలిపి పెట్టుచుండును. ఎంత త్రాగినను తనకు తగినంతనిషా కలుగుటలేదని యజమానుఁడు సేవకుని

మీాద ననుమానపడి తర్వాత తెచ్చుకున్న సారాయిబుడ్లమీాద "ఇది విషము త్రాగకూడదు." అనివ్రాసి చీటినంటించెను. సేవకుఁడారహస్యముఁగనిపెట్టి యెప్పటియట్లు త్రాగుటకు వచ్చెను. అపుడు యజమానుఁడాకస్మికముగా వచ్చి "ఓరీ! అది విషము చచ్చెద"వని వెనుకప్రక్కనుండి యఱచెను. సేవకుఁడుమనోధైర్యముఁజిక్కఁబట్టియిట్లనియె. ‹స్వామీ! మీాసారాయి యెవరో త్రాగివేయఁగా మీారు నిష్కారణముగా నామీాద ననుమానపడినారు. ఇటువంటి యపనింద నాపైఁబడినందున సిగ్గుపడి చావదలఁచి యీావిషము త్రాగవచ్చితిని.

8. తెలివితక్కువవాడైన యొక మనుష్యునియొద్ద నాలుగైదు లక్షల రూపాయలుండెను. ఆసొమ్ము వానితండ్రి సంపాదించి యిచ్చి పోయెను. అతఁడేవ్యవహారమును జేసి దానిని వృద్ధిజేసికొనలేక బోషాణములోఁబెట్టి దాచెను. తల్లిదండ్రులెంతకష్టపడి విద్యచెప్పించినను వానికి విద్యవచ్చినదికాదు. అందుచేత లెక్కపెట్టుటకూడ తెలియదు. ఆతనిస్థితిఁజక్కఁగఁ దెలిసికొన్న యొకవంచకుఁడు వానికడఁజేరి క్రమముగ వానితో స్నేహముఁజేసి యెల్లకార్యములనతనికాలోచనఁజెప్పుచు దనయందతనికి సంపూర్ణవిశ్వాసము కుదురునట్లు నటించెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటి కామూర్ఖుఁడు వంచకునివలలోఁబడి వాఁడు తనకు నిజముగ నాప్తమిత్రుఁడనుకొని వాఁడుచెప్పినట్లెల్లఁ జేయఁజొచ్చెను. వంచకుఁడొకనాఁడు మూర్ఖునితో నిట్లనియె. నీదగ్గఱనాలుగైదులక్షల రూపాయలున్నవని నేనువిన్నాను. ఇదినిజమైనపక్షమున నేనొక సలహా జెప్పెదను. ఆసలహా వినకపోయిన పక్షమున నారూపాయలు నిష్కారణముగఁ జెడిపోవును. అనవుఁడు మూర్ఖుఁడు "బాబూ బాబూ నారూపాయలు చెడిపోకుండ మంచిసలహా చెప్పు" మని బ్రతిమాలుకొనియెను. అప్పుడు వంచకుఁ డిట్లనియెను. రూపాయలు బోషాణములోఁబెట్టి మూసిపెట్టినపక్షమున క్రమముగ బూజుపట్టి

చెదపురుగుల పాలై పోవును. కొంతకాలమగునప్పటికి మనకొక్క రూ
పాయయయిన నక్కఱకు రాదు. అవిమెత్తపడి మారవు. అందుచేత
నెలకొకసారి యయిన నవితీసి యెండబెట్టి మరల బోషాణములో
బోయవలయును. బలవంతములేదు. నీకిష్టమైనయెడల నీ వ్రీకారము
చేయుము. కాని యెండబెట్టినప్పుడు కొంచెము తరగిపోవుచుండును.
పచ్చివస్తువులు తూచునప్పుడు బరువెక్కువై యెండినతరువాత బరువు
తీసిపోవుట నీవెఱుఁగవు కనుకనా! ఎండబెట్టకుండ నుంచిన పక్షమున
సొమ్మంతయు వ్యర్థమైపోవును. ఆమాటలు వినఁగానే మూర్ఖుఁడు భయ
పడి నాలుగుచాపలు తెప్పించి గదిదొడ్డిలో నెండలో వేయించి బోషా
ణము తాళముచెవి వంచకునిచేతికిచ్చి రూపాయలుతీసి యెండఁబోయు
మని చెప్పెను. వంచకు డావ్రీకారము తాళముపుచ్చుకొని రూపాయ
లెండఁబెట్టి నూటికి పది చొప్పున తరుగువచ్చినదనిచెప్పి యేబదివేల
రూపాయలు తీసికొని యివి పనికిరానివి. పాడైనవి. ఇవిగోతులో
బారబోయించెదనని తట్టలతో బట్టించుకొని యింటికిఁ బోయెను.
మూర్ఖుఁడు నాలుగైదు తట్టలరూపాయలు పోయిననేమి తక్కినసొమ్ము
నిలిచెనని సంతోషించెను.

9. ఒకగృహస్థుఁడు వేటకుక్కను మిక్కిలి ప్రేమతోఁ బెంచి
కొనుచుండెను. ఒకనాఁడది వీథిలో నిలిచియుండి దారిని బోవుచున్న
యొక్క కాఁపువాని మీఁదఁబడి కరవబోయెను. ఆకాపువానిచేతిలో
నప్పుడు గునపమున్నందున నతఁడాగునపముఁ బుచ్చుకొని కుక్కను
నెత్తిమీఁద బొడిచెను. కుక్క చావలేదు. కాని నెత్తిమీఁద పెద్ద
గాయముపడి నెత్తురు వరదలై పాఱెను. ఆ యజమానుఁడు రాజు
నొద్దకుఁబోయి ఫిరియాదు చేసెను. రాజు కాఁపువానిని పిలిపించి
యేల కుక్కను గొట్టితివని యడిగెను. అతఁడు జరిగిన వృత్తాంత
మంతయుఁ జెప్పెను. అప్పుడు యజమానుఁడు కాఁపువానితో రాజ

సన్నిధి నిట్లనియె. కుక్క నిన్ను కరవవచ్చినపుడు గునపముతల క్రిందునేసి పొడవక మొనయున్నవైపుతో నేల పొడువ వలయును. అది దార్జన్యము కాదా? అనఁగా నాకాఁపువాఁడిట్లనియె. కుక్క నన్ను తోఁకతో గరవక మూతితో నేల కరవవలయును? ఆమాటవిని రాజును సభాసదులును నవ్విరి. ఆపత్సమయములో శునకము తన్ను కరచిచంపునని భయపడినప్పుడు కాఁపువాఁడు గునపము తిరగవేసి పొడువవలెనో మొనతో బొడువవలయునో యాలోచించునా? మీ కుక్కను మీరు జాగ్రతపెట్టుకొనవలయునుగాని కాఁపువానితప్పు లేదని రాజు తీర్పిచ్చెను.

10. లోభియయిన యొకనేతివర్తకుఁడు కంపునెయ్యిఁదూచి యమ్మజొచ్చెను. అందుచేత వానిని రాజభటులు పట్టుకొని న్యాయాధిపతికడకు దీసికొని పోయిరి. న్యాయాధిపతి వానింజూచి నీవుమిక్కిలి తప్పుపనిఁజేసితివి. ఇందుకు నీకు మూఁడు విధములైన దండన లేర్పఱచెద. ఈమూఁడు దండనలు నీవనుభవింప నక్కఱలేదు. నీ యిచ్చవచ్చిన దేదోయొకటి యనుభవింపుము. వీశెడు కంపునెయ్యి నీవు త్రాగిననుసరే. నూరుకొరడా దెబ్బలు తిన్ననుసరే. నూరువరహాలు జరిమానా నిచ్చిననుసరే. ఇందులో నేదియేసుకొందువో నీ యిష్టమని యానతిచ్చెను. వర్తకుఁడు తనలోనిట్లు వితర్కించుకొనియెను. ఈమాత్రిమునకు నూరువరహాలు పాడుచేయుదునా. దెబ్బలు తినఁజాలను. అందుచేత నేలాగోయొకలాగు నేయి త్రాగెదను. అని మూఁడుతవ్వలనేయి కాపించి తెప్పించి త్రాగనారంభించెను. చచ్చి చెడి సోలెడు నేయిత్రాగి యాపైని త్రాగలేకపోయి వరహాలిచ్చుకొనుట కిష్టములేక దెబ్బలుకొట్టుమని వేడుకొనియెను. రాజభటులు కొట్టనారంభించిరి. ఏబది దెబ్బలు తిన్నతరువాత బాబూ దెబ్బలు తినలేను. సొమ్మిచ్చుకొందును. నన్ను వదలి వేయండి యని బ్రతి

మాలి నూరు పరహాలనిచ్చుకొనియెను. లోభి యన్నివిధములచేత భ్రష్టుఁడగునుకదా!

11. ఒకపట్టణములో నొకవేశ్యయుండెను. దానియిల్లు మిక్కిలిపెద్దదగుటచే వీథియరుగులు విశాలముగా నుండెను. అందువలన బాటసారు లప్పుడప్పుడాయరుగులమీఁద రాత్రులు పండుకొనుచుందురు. ఒకనాఁడొక సన్యాసి యాయరుగు మీఁద పండుకొనియుండెను తెల్లవాఱుజామున దానియింటిప్రక్క నొకమనుష్యుఁడు మృతినొందెను. ఆయేడ్పులవల్ల వేశ్యయు, దానికూతురును, సన్యాసియు మేల్కొనిరి. ఆవేశ్య తెల్లవాఱగానే కూఁతునుఁబిలిచి "అమ్మాయీ! యీచచ్చిపోయిన మనుష్యుఁడు స్వర్గమునకు వెళ్ళినాఁడో, నరకమునకు వెళ్ళినాఁడో కనుఁగొనిరావే" యని చెప్పెను. "సరే యట్లేచేయుదు"నని యాపిల్ల వీథిలోనికి వెళ్ళెను. ఆపలుకులువిని సన్యాసి మిక్కిలి యాశ్చర్యమునొంది యిట్లుతలంచెనుఁ "చనిపోయిన మనుష్యుఁడు స్వర్గమునకు వెళ్ళెనో నరకమునకు వెళ్ళెనో తెలిసికొనుట యెంతెంత వారికి సాధ్యముకాదు. అట్టిచో మిక్కిలి యపవిత్రురాలైన యీ బోముగది ముక్కుపచ్చలారని తనకూఁతును పంపించి యింత గొప్ప విషయము తెలిసికొనుచున్నది. ఇది మిక్కిలి అద్భుతముగా నున్నది దీనిపర్యవసానమేమిటో తెలిసికొని పోయెదనుఁ." అని యాసన్యాసి బాలికవచ్చువఱకు నచ్చటనే కూర్చుండెను. కొంచెము సేపటిలో వేశ్యాపుత్రిక తిరిగివచ్చి, తల్లినిఁబిలిచి, "అమ్మా! ఆయన స్వర్గమునకువెళ్లినాఁడే" యని చెప్పెను. అదివినఁగానే సన్యాసి మనస్సులో మఱింత కళవళము పుట్టెను. "ఏమిది! నేను వేదాంతశాస్త్రముఁ జదువుకున్నాను. అనేక యోగులతో సహవాసముఁ జేసినాను. నాకీవిషయము తెలియలేదు. పన్నెండు సంవత్సరములుగల యీవేశ్యబాలిక చనిపోయినమనుష్యుఁడు స్వర్గమునకువెళ్లినాఁడని చెప్పుచున్నది. ఈశక్తి

దీనికి దేవతోపాసనము వలన కలిగినదా? బ్రహ్మజ్ఞానమువల్ల కలిగిన దా? అయినను నేను దీనినడిగి చూచెదను. అడిగినందువల్ల ప్రమాద మేమున్నది. ఇష్టమైనచో ప్రత్యుత్తరముఁ జెప్పును. లేదామానును" అని సన్యాసి తనలో తర్కించుకొని మెట్టకేలకు మనసుపట్టజాలక లోపలిగుమ్మములోనికి వెళ్ళి వేశ్యనుబిలిచియిట్లనియె. "ఓకల్యాణీ చనిపోయిన మనుష్యుఁడేగతికి వెళ్ళినాఁడో కనుఁగొని రమ్మని నీవు బిడ్డనుబంపితివి. ఆమెపోయి కనుఁగొని స్వర్గమునకే వెళ్ళినాఁడని చెప్పిన ది. ఇదిమీకెట్లు తెలిసినదో నాకు చెప్పవలెను" అనవుడు, వేశ్యన వ్వుచు తనకూఁతునుఁ బిలిచి "అమ్మాయా! ఆయన స్వర్గమునకు వెళ్ళినట్లు నీకేలాగున తెలిసినదో యీయనతోఁ జెప్పవే" యని పలి కెను. అనుటయు దానికూఁతురు ముసిముసి నవ్వులు నవ్వుచు నిట్లనియె "అయ్యా! యీమాత్రపు విషయము మీకుఁ దెలియలేదా? ఒకమను ష్యుఁడు చనిపోయిన తరువాత స్వర్గమునకు వెళ్ళునో! నరకమునకు వెళ్ళునో? తెలిసికొనుట యతిసులభము. నేనెట్లు తెలిసికొంటినోవినుం డు. చనిపోయిన మనుష్యుని యింటిచుట్టు ప్రక్కలనున్న పదియిండ్ల కుఁబోయి యీమనుష్యుఁ డెట్టివాఁడని నేనడిగితిని. వారందఱు మిక్కి లి మంచివాఁడని చెప్పిరి. చెడ్డవాఁడని యొక్కరైనను జెప్పలేదు. అందుచేత నతఁడు స్వర్గమునకు వెళ్లినాఁడని నేను నిశ్చయించితిని. ఆతఁడు దుర్మార్గుఁడైనపక్షమున నించుమించుగా నందఱు లేదా కొం దఱు "దుర్మార్గపు ముండాకొడుకు పోయినాఁడు. పీడవదలిందని చె ప్పుదురు. కాఁబట్టిమృతుఁడైన మనుష్యుఁడు సద్గతికిఁబోవునో దుర్గతికి బోవునో ఆతఁడున్న వీధినే ఆతఁడు పోయినవెంటనే తెలిసికొనవచ్చు ను." అదివిని సన్యాసి సంతోషించి యది నిశ్చయమే యనినమ్మెను

12 జనకమహారాజు గొప్పవేదాంతి అందుచేత నతనిరాజ్య మందంతటను ముఖ్యముగా నతని రాజధానియగు మిథిలాపట్టణమున

కాపురమున్న జనులందఱు "యథా రాజా తథాప్రజా" యను సా
మెతప్రకారము గొప్పవేదాంతులై యుండిరని లోకమున వాడుకకలి
గెను. ఆవాడుక యెంతవఱకు నిజమో తెలిసికొనవలెనని నారదునకు
బుద్ధిపుట్టెను. ఆతఁడుమిథిలాపురమునకుఁబోయి చెఱువుగట్టుమీఁదను
న్న మఱ్ఱిచెట్టునీడను దనచేయిఁ దలక్రిందఁబెట్టుకొని మార్గాయాస
నివారణార్థము పండుకొనెను. అది నీళ్ళరేవగుటచే నెందఱో స్త్రీలు
వచ్చి నీరు గొంపోవుచుండిరి. అందొక యాఁడుది తనస్నేహితురాలి
తో నిట్లనియె. "అక్కా! చూచినావటమ్మా! ఈయన వాలకముఁ
జూడ మహామునివలెకనఁబడుచున్నాఁడు. కాని యీయనకు దేహాభి
మానముపోయినట్టు కనఁబడదు. ఎందుచేతనందువా? తలగడలేని దే
యీయనకు నిద్రబట్టదు. కాబట్టి తనచేయి తలగడగా జేసికొని పం
డుకొన్నాఁడు. ఈయన యెక్కడమునియే! ఆమాటవినఁగానేనారదుఁ
డు కొంచెము సిగ్గుపడి తలక్రిందనున్న చేయితీసివేసి తల క్రిందబెట్టు
కొని పరుండెను. ఆస్త్రీ మఱల నీటికివచ్చి చూచి తనస్నేహితురాలి
తో నిట్లనియె. "ఓసీ! చూచితివా? ఇదివరకు దేహాభిమానమొక్కటే
యీమునికిఁగలదని నేననుకొంటిని. ఇప్పుడు మాటలపట్టింపుగూడ
కలదని నేననుకొనుచున్నాను. తలక్రింద చేయిఁ బెట్టుకొని పండుకొ
న్నాఁడని నేనన్నందుకు రోసముకలిగి యిప్పుడు చేయితీసివేసినాఁడు.
రోషముగలవాఁడు మునియగునా?" ఆమాటలు వినఁగానే నారదుఁడు
"ఓరినాయనా! యీపట్టణమందున్నట్టి యాఁడువాండ్రు సహితము వే
దాంతినులే. వీరియెదుట నేమిజేసిన తప్పే, జనకుని పరిపాలనమున
జనులాబాలగోపాలము వేదాంతులైరి. నావంటివాఁడు మీదగ్గఱనిలు
వలేఁడు." అని పట్టణముం బ్రవేశించకయేపోయెను.

13. ఒకబ్రాహ్మణుఁడు మిక్కిలిపేదవాఁడై వ్యవసాయముచేసి
జీవించుచు తనపొలములో మంచికూరలు పండించి పేదలైనవారికా

కూర లుచితముగా నిచ్చుచుండును. ఆతఁడు కొంత కాలమైన తర్వాత మృతినొంది, పూర్వజన్మజ్ఞానముతో మఱల జన్మించెను. ఈజన్మము లో నతఁడు మిక్కిలి యైశ్వర్యవంతుఁడాయెను. వెనుకటి జన్మములో మంచికాయగూరలు దానముచేయుటవలన నీజన్మములో నింతసంప ద దనకుఁగలిగినదని యతండెఱిఁగి వట్టికాయలదానమువల్లనే యింత భాగ్యము కలిగినప్పుడు బంగారపుకాయలు దానముచేసినయెడల ముందుజన్మములో మఱియు గొప్పయైశ్వర్యముగలుగునని భావించి బంగారపుగుమ్మడికాయలు చేయించి చదువుకొన్న బ్రాహ్మణులకు దానమిచ్చుచు "అంతకింతైనది. ఇంత కెంతౌనో. పుచ్చుకొండి." యని దానసమయములో బలుకుచుండును. ఆమాటలకర్థమెవరికిఁ దెలియ దు. ఒకనాఁడొక గొప్పపండితుఁడతనియొద్దకుఁబోయెను. ఆయనకతఁ డు బంగారపు గుమ్మడికాయ దానమిచ్చి యెప్పటియట్లే యామాట ననెను. ఆపండితుఁడుదానముగ్రహించి, "అంతకింతైనదిగానియింతకిం తే" యని వెళ్ళిపోయెను. ఆమాట యీబ్రాహ్మణునకర్థముగాలేదు. భయము, శంక మనస్సులోపుట్టి బాధపెట్టెను. రెండు మూడుదిన ములైనతర్వాత బ్రాహ్మణుఁడుపండితునిఁబిలిచి "మీమాటకర్థమేమి టి?" యని యడిగెను. ఆపండితుఁడిట్లనియె "అయ్యా పూర్వజన్మము నందు నీవుకూరగాయలు దానముచేసినందుకు నీకింతసంపద గలిగినది. అంతకింతన్నమాటనిజము. అప్పుడు నీవు మంచిబుద్ధితో ఫలమపే క్షింపక దానముఁ జేసితివి. ఇప్పుడు ఫలమపేక్షించి యాడంబరార్థము చేయుచుంటివి. కాఁబట్టి యింతకింతె కానియెక్కువఫలముదొఱుకదు. భగవంతుఁడు నీవంటి మెఱమెచ్చుల దాతలను మెచ్చఁడు.

14. మహావిక్రమశాలియై యనేకదేశములు జయించిన యొక గొప్పరాజుండెను. అతఁడొకసారితనరాజ్యమునుఁజూచుటకై బయలు దేఱి యొక గ్రామమునఁబోవుచుండఁగా నొకతాటాకులయింటి యుఱు

గుమీఁద వట్టిక్రిందఁ గూర్చుండి శిష్యులకు బాఠముఁజెప్పుచున్నయొక బ్రాహ్మణుఁడగపడెను. అతఁడొకంగవస్త్రముఁ గట్టుకొని మఱియొక యంగవస్త్రము పైనవేసికొని యుండెను. అతనివర్చస్సుచూచి, రాజ తనితో మాటలాడఁదలఁచి, పిలిచి యిట్లనియె. "అయ్యా! నీకుభూము లేమైన నున్నవా? నీవెట్లు జీవించుచున్నావు? నీవు గొప్పపండితుఁడవ ని విన్నాను. నీకగ్రహారమిచ్చెదను పుచ్చుకొందువా" అనవుడు బ్రాహ్మణుఁ డిట్లనియె. "రాజా! నాభుక్తికి సరిపడిన భూమియున్నది.దానితో నేనుసంతుష్టుఁడనైనాను. నాకగ్రహారమక్కరలేదు. అందలము లక్కరలేదు. వస్తువులక్కరలేదు. వాహనము లక్కరలేదు. నాయిల్లే స్వర్గము. నామట్టియరుగే నాసింహాసనము. నాకింతకంటె నేమియున నక్కరలేదు." అనుటయు రాజాయనకు నమస్కరించి "నాతోగూడ మూఁడుదినములుండుఁ"డని ప్రార్థించెను. "సరే" యని బ్రాహ్మణు డంగీకరించి వెళ్లెను. మఱునాడుదయమున రాజు నిద్రలేచి "భగవంతుఁడా! నాకు పాడిపంటలిచ్చి యైశ్వర్యమిచ్చిరక్షింపుము. శత్రువులంజయించునట్టిశక్తినిమ్ము" అని ప్రార్థించెను. అదివిని బ్రాహ్మణుఁడు పరుగెత్తనారంభించెను. అదిచూచి రాజువానినిఁబట్టి తెప్పించిపరుగెత్తుటకు కారణమడిగెను. అతనికి బ్రాహ్మణుఁ డిట్లనియె. "రాజా! నీవు రాజవనుకొంటినిగాని యాచకుఁడవనుకొనలేదు. నీవు యాచకుఁడవని తెలిసిన తర్వాత నీదగ్గఱ నుండగూడదని పరుగెత్తుచుంటిని. నీవే యాచకుఁడవైనప్పుడు నాకేమి యీయగలవు? ముష్టిలో ముష్టి నాకక్కఱలేదు. నీవెట్లు యాచకుఁడవైతివో విను. పాడిపంటలిమ్మని భాగ్యమిమ్మని భగవంతుని వేఁడుచుంటివి. అందుచేత నీవు యాచకుఁడవు. అట్టినీకడ నేనొక్క నిముసముండనని విసవిస నడచిపోయెను. బ్రాహ్మణుని సంతుష్టికి రాజు మిక్కిలి సంతసించెను.

---

15. ఒకనాఁడు నారదుఁడు లక్ష్మీదేవిసమీపమునకు వెళ్ళి యిట్లనియెను. "ఓజగన్మాతా! నాదొక్కసందియమున్నది. అదియడిగి తెలిసికొనవలయునని కోరికయున్నది. కాఁబట్టి నాయందనుగ్రహించి చెప్పుము. నీది దివ్యమంగళవిగ్రహము. నీచరిత్రము నిష్కళంకము. నీవు శ్రీమన్నారాయణుని యర్ధాంగివి. పరిశుద్ధుఁడైన క్షీరసాగరుని పుత్రికవు. చంద్రుని తోఁబుట్టువవు. అటువంటి పరిశుద్ధురాలవైననీయొక్క మీఁగాళ్ళు నల్లగానున్నవి. ఇందుకేమికారణమో చెప్పగలవా? తల్లీ!" యనియడుగుటయు లక్ష్మీదేవియిట్లనియె. "వత్సా! నారదా! చెప్పెదవినుము. నామీఁగాళ్ళు నల్లగానున్నవన్నమాటనిజమే. అవియట్లుండుటకు మంచికారణముగలదు. నియతియునియమము లేని నిర్దయాత్ములనేకులు నన్నుఁబూవులతోఁ బూజించి తమయింటికి నన్ను రమ్మని ప్రార్థించి తమతలలునామీఁగాళ్ళుసోకునట్లునమస్కారముచేయుదురు. మలినవర్తనులు, మలినమనస్కులు, మలినహృదయులు, మలినదేహులునైనవారి తలలు నామీఁగాళ్ళుసోకుటచేతనతిస్వచ్ఛమైన నాశరీరభాగముఁగూడ నల్లబడిపోయినది. వారిసహవాసముచేత నాకేయిట్టి దురవస్థవచ్చినప్పుడు తక్కిన సామాన్య మనుష్యులమాటఁ జెప్పనేల?"

16. ఒక కోమటికొడుకు కలపవర్తకమున కడవికివెళ్ళగా నొక పెద్దపులి వానింబట్టుకొని చంపి తినివేసెను. కోమటి యదివిని చుట్టములతో నిట్లనియెను. "పెద్దపులి మనవానిని మ్రింగివేయుటకు మనకు, దానికి నేదోయొక లెక్కయుండవలెను. లెక్కలేనిదే పెద్దపులియైనను యిటువంటిపని చేయదు. కాబట్టి యది యేలెక్కప్రకారము మ్రింగినదో తెలిసికొనవలయును." అని గుమస్తాలను పిలిచి యాలెక్క తెలిసికొనుటకు కవిలెకట్ట లన్నియు వెదుకుట నాజ్ఞాపించెను. మనుష్యులకు లెక్కలును కాతాలు నుండునుకాని పెద్దపులుల కేమి

కాతా లుండును? అందుచేత మేములెక్కలు, నావర్జాలును వెదుకుట వ్యర్థ" మనిరి. కోమటి యామాటకుఁ గోపించి తప్పక వెదకి తీఱ వలెనని చెప్పెను. వారన్నిలెక్కలు వెదకిరి. పెద్దపులికాతాయెక్కడ నున్నదో కనపడలేదు. వారిమాటలయందు నమ్మికలేక తానే మఱల చిట్టాలన్నియు వెదకికొనెను, కాతా కనఁబడలేదు. పెద్దపులిని స్వయముగా వెళ్ళి యడిగి యాలెక్కయేదో తెలిసికొనవలెనని యతనికి బుద్ధిపుట్టెను. ఒకరిద్దఱిని సాయముతీసికొని యడవికిఁబోయెను. అక్కడ నతనికొకపులి యగపడెను. దానినిఁజూచి యతఁడు "నీవే మాపిల్లవానిని మ్రింగినదానవు? మ్రింగితే మ్రింగినావు గాని లెక్కసరిపుచ్చు. ఏలెక్కను మ్రింగినావో చెప్పు"మని యడిగెను. ఆమనుష్యులను జూఁడగానే పెద్దపులి "గుఱ్ఱు గుఱ్ఱు" మని రెండుసారులు మూల్గి "గాండ్రు" మని కేకవేసెను. అది వినఁగానే కోమటిశరీరము చెమటలు పోసెను. కనులఁ జీకట్లు క్రమ్మెను. అక్కడ నిలువలేక కోమటి "యీలెక్కను మ్రింగినావా? యింత పెద్దలెక్కయున్నదని యిదివఱకు నాకుఁ దెలియలేదు. ఈతూరిలెక్క సరిపోయినది. అని పలుకుచు మెల్లమెల్లగా దాటి యావలఁబడెను.

17. ఒకగొప్ప మహారాజుదగ్గఱ నొక గొప్పమంత్రి యుండెను. ఆయన నియోగి బ్రాహ్మణుఁడు. నిరతాన్న ప్రదాతయగుటచే వందలకొలఁది బ్రాహ్మణులు వచ్చి యతని పంక్తిని భోజనముచేయుచుందురు. పంక్తి కెందఱువచ్చినారో, వచ్చినవారెన్ని దినములుండి భోజనము చేయుచున్నారో యతఁ డెప్పుడును లెక్కజూచుకొనుట లేదు. ఒక బ్రాహ్మణుఁడు వచ్చి యతని పంక్తిని రెండుపూటలు భోజనము చేసెను. ప్రతిదినమును కనఁబడుచుండుటచే నతనిమొగమాయన కలవాటుపడెను. అందుచేత నొకనాఁడామంత్రి బ్రాహ్మణునిం బిలిచి "అయ్యా! మీరెవ్వరు? ఏయూరని యడిగెను. నేను మీపెత్త

ల్లి కుమారుఁడ నని యతఁడు బదులుచెప్పెను. "నాతల్లికప్పగారే లే దే! నాకెట్లు పెత్తల్లి కొడుకవగుదు" వని మంత్రి యడిగెను. అపుడు బ్రాహ్మణుఁ డిట్లనియె అయ్యా! మంత్రి పదవిలోనుండుటచే మీరు మఱచినారు. నాతల్లియు, మీతల్లియు, నప్పచెల్లెండ్రే. జ్యేష్ఠాదేవి యు లక్ష్మీదేవియు, నప్పచెల్లెండ్రు. అందు పెద్దదగు జ్యేష్ఠాదేవి కు మారుఁడను నేను, మీరు లక్ష్మీపుత్రులు. చిన్నావిడకొడుకులు. నా తల్లి లక్షణములు నాదగ్గఱఁ గనఁబడుచున్నవి. మీతల్లి లక్షణములు మీదగ్గఱఁ గనఁబడుచున్నవి. కాఁబట్టి భిన్నోదరులమైనను దగ్గరవార ము. వేరిలువిడిచిన యన్నదమ్ముల మగుటచే నాకేదైన నొక యుప కారముఁ జేయవలెను." అనవుడు మంత్రి నవ్వి చమత్కార సంభా షణముఁ జేసిన యాబ్రాహ్మణునకుఁ దగిన యుద్యోగమిచ్చి రక్షించెను.

18. భోజనప్రియుఁడైన యల్లుఁడొకఁడు పండుగ కత్తవారియిం టికి వెళ్ళెను, అత్తగారుదయమునం దల్లునిఁ బిలిచి యిట్లనియె "అ బ్బాయీ! నీవు చలిదియన్నము తిందువా? లేక యరిసెలు మినుపసు న్ని యిప్పుడు తిని యేకముగా మధ్యాహ్నము మీమామగారితో భోజనము చేసెదవా? అందు కల్లుఁడిట్లనియె.

చల్దియన్నముఁ దిని మినుపసున్ని యరిసెలు కొంచెముభక్షిం చి మధ్యాహ్నము, మామగారి పంక్తిని వేఁడియన్నముఁదినియెదను.

19. ఒకయవ్వ తన మనుమరాండ్రి నిద్దఱను బెంచుచుండెను. అందులో నొకతె గయ్యాళిపిల్ల, రెండవది పరమసాధువు, అవ్వమిక్కి లి తెలివిగలదగుటచే గయ్యాళిపిల్లమీఁద మనసులో ననిష్టమున్నను దానినిఁ దిట్టక పరమసాధువైన దానిని విశేషముపైకి మెచ్చుకొనక లోలోపలనే మెచ్చుచు నిద్దఱను జెరియొక విధమున దీవించుచుండె ను. నీవు పెట్టిన ముగ్గులు చెడిపోక యట్లేయుండవలెను. నీయింటి

సామాను లెక్కడపెట్టిన వక్కడనుండవలెను. నీకు విశేషము కర్చు లేకుండవలె నని గయ్యాళిపిల్లను దీవించుచుండును. "నీవు పెట్టిన ముగ్గులు చెడిపోవలెను. ఎక్కడ పెట్టినసామానులక్కడ నుండక చిందరవందరగ నుండవలెను. నీసొమ్ము కర్చయిపోవుచుండవలె నని సాధువైనపిల్లను దీవించుచుండును. సాధువైన బాలిక తానెంత మంచిదైనను దనయవ్వ తనకన్నియు నష్టములే కలుగునట్లు దీవించుచుండె నని విచారపడుచుండును. కాలక్రమమున నిద్దఱుఁ బెరిగి పెద్దవాండ్రై యత్తవారి యిండ్లకు వెళ్ళిరి. సాధుబాలికకు సంతానము కలిగెను. ఆమెపిల్లలు పెట్టిన ముగ్గులు చెరిపివేయుచు నెక్కడపెట్టిన సామానులక్కడ నుంచక యిల్లు చిందరవందర చేయుచుండిరి. బిడ్డలనిమిత్తము సొమ్ము విశేషముకర్చగుచుండెను. అట్టిస్థితిలో నామెయవ్వ తనమీఁద ప్రేమచేత తనకు సంతానము కలుగవలెనని దీవించెనని తెలిసికొని సంతసించెను. గయ్యాళిపిల్లకు సంతానము కలుగలేదు. అందుచేత నామెమగఁడు సంపాదించినసొమ్ము కర్చుపడక యెక్కడసామానులక్కడ నుండెను. తనగయ్యాళితనముచేత విసిగి తనయవ్వ సంతానము కలుగకుండునట్లు దీవించెనని తెలిసికొని గయ్యాళిపిల్ల విచారింపఁజొచ్చెను.

20. ఒక గొప్పయుద్యోగస్థుఁడు పల్లకియెక్కి తనయూరినుండి గ్రామాంతరము వెళ్ళుచుండఁగా మార్గమధ్యమున శ్మశానము తగిలెను. అందొకపుఱ్ఱె వానికంటఁబడెను. ఆయుద్యోగస్థుఁడు బ్రహ్మలిపి తెలిసినవాఁడు. మనుష్యుల లలాటములమీఁద బ్రహ్మదేవుఁ డేమివ్రాయునో యదియెల్ల నతఁడు సామాన్యమైనవ్రాత చదివినట్లు చదువనేర్చి యుండెను. అందుచేత నతఁడాపుఱ్ఱెఁ దెప్పించి "యీమనుష్యుఁడు కట్టకడపట బ్రహ్మలోకముఁ జేరు నని యీలలాటమున వ్రాసియున్న యక్షరములఁజదివి తనలో నిట్లుతలంచె. ఈమనుష్యుఁడు బ్రహ్మలోకము

చేరవలయునని బ్రహ్మ వ్రాసియుండఁగా నిదియావల్లకాటిలో నేల దొర్లుచుండవలెను. బ్రహ్మ తప్పువ్రాసి యున్నాఁడని తోఁచుచున్నది. కాఁబట్టి యిప్పుడీపుత్త్రిని పల్లకీలో బెట్టుకొని బ్రహ్మలోకమునకుఁ బోయి యిటువంటి పొరపాటు బ్రహ్మదేవుఁ డేలచేసెనో కనుఁగొని వచ్చెదఁగాక యని నిశ్చయించుకొని తిన్నఁగా బ్రహ్మలోకమునకువెళ్ళి యాకపాలము బ్రహ్మముందరఁ బాఱవైచి "యేమయ్యా! బ్రహ్మదేవుఁడా? నీవేమో తెలివిగలవాఁడ వనుకొంటిని. నీవు వ్రాసినవ్రాత యొకటి. చేసిన చేతయొకటి. ఈమనుష్యుఁడు బ్రహ్మలోకము చేరునట్లు వ్రాసి భూలోకములో దొర్లుచుండునట్లు చేసితివేమి? నీవ్రాతకే తిరుగున్నపక్షమున నీక మనుష్యులవ్రాత లెక్కయేమి" యని గట్టిగా నడిగెను. అదివిని బ్రహ్మదేవుఁడు మందహాసపూర్వకముగ నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. నేనువ్రాసినదంతయునిజము. ఈమనుష్యుఁడు బ్రహ్మలోకము చేరుననిగదా వ్రాసితిని. నీవు తెచ్చిపెట్టుటవల్ల నిప్పుడిది బ్రహ్మలోకము చేరలేదా! సందర్భము యెఱుఁగక యిట్లు పలుకఁదగునా? అనవుడు నతఁడు సిగ్గుపడి వెళ్ళిపోయెను.

21. ఒకబాటసారి ప్రయాణము చేయుచుండఁగా విశేషముగ నెండకాసెను. మీఁద నెత్తి క్రింద కాళ్ళుమాడఁ జొచ్చెను. ఎండ వేడిమికి మిక్కిలి తహతహపడి యొక మఱ్ఱిచెట్టుక్రిందికి పరుగెత్తి యానీడను నిలిచి యమితానందము నొంది కొంతసేపుకూర్చుండి ప్రక్కకు ప్రాకుచున్న యొక గుమ్మడిపాదుఁజూచి తనలో నిట్లుతలపోసెను. దేవుఁడు సర్వజ్ఞుఁడని పెద్దపెద్ద పండితులందురు. కాని వారిమాటలయం దెంతమాత్రము సత్యములేదు. నాబుద్ధికి దేవుఁడు వట్టిమూర్ఖుఁడని తోఁచుచున్నది. మూర్ఖుఁడే కాకపోయినయెడల నిటువంటి తెలివితక్కువపనిఁ జేయునా? ఈమఱ్ఱిచెట్టు మిక్కిలివిశాలమై రమారమి పదికుంచములనేల యాక్రమించినది. ఇంతపెద్దచెట్టునకు మిక్కిలి చి

న్నకాయ పెట్టినాఁడు. పెద్దవృక్షములను పెద్దకాయలుండవలదా; అంతేకాదు. ఈగుమ్మిడితీగ సన్నముగానున్నది. దీనికెంతో పెద్దకాయలిచ్చినాఁడు. మఱ్ఱిచెట్టున కంతచిన్నకాయలు పెట్టుటచేతను బ్రహ్మదేవుఁడు వట్టిమూఢుఁడని స్పష్టమగుచున్నది. అని వితర్కించుకొనుచు మార్గాయాసమునఁ గన్నులు మూసికొని పండుకొనఁగా నిద్దురపట్టెను. అతఁడు గుఱ్ఱుపట్టి నిదురపోవుచుండగా గొప్పగాలివచ్చెను. ఆగాలికి మఱ్ఱిచెట్టుకాయలు దడదడ రాలి మీఁద పడెను. దానితో నతనికి మెలఁకువ వచ్చెను. మేలుకొని యతఁడిట్లు తలంచెను. "అన్నా" నే నెంతమూర్ఖుఁడను. నామూర్ఖత నేనెఱుఁగక బ్రహ్మదేవుఁడు మూఢుఁడని నిందించితిని. ఈమఱ్ఱిచెట్టునకు నేననుకొన్న ప్రకారము గుమ్మిడి కాయలంత కాయలే పుట్టినపక్షమున నవి యీగాలికి రాలియుండెనా నేనీపాటికి చచ్చిపోవలసినదే, కాఁబట్టి బ్రహ్మదేవుఁడు మిక్కిలి తెలివిగలవాఁడు, ఈశ్వరునియుద్దేశమును మనము గ్రహించుట దుర్లభము.

22. ఏనుగెటులుండునో చూడవలయునని నలుగురు గ్రుడ్డివాండ్రకుఁ గుతూహలము కలిగెను. దానిం జూపుమని వారొక మావటివాని నాశ్రయించిరి. సరేయని యతఁడు వారినలువురను వెంటఁబెట్టుకొని యొకనికితొండముచేతితో బట్టిచూపెను. ఒకనికి చెవిఁజూపెను. ఒకనికి దానికాళ్లుజూపెను. వారుచేతులతో దానిశరీరము దడవి గ్రహించిరి. పిమ్మట వారునలువురు నొకచోట చేరినపుడేనుఁగేలాగున నుండునని ప్రశ్నవచ్చెను. తొండముపట్టి చూచినవాఁడేనుగు రోకలివలె పొడుగుగ నుండునని చెప్పెను. కాళ్లుపట్టుకొని చూచినవాఁడు రోలులాగుండునని చెప్పెను. పొట్టతడవిచూచినవాఁడు పాణకవలెనుండునని వాదించెను. చెవిపట్టిచూచినవాఁడు చేటవలెనుండుననెను. చిట్టచివరకు యేనుఁగెట్లుండునో వారు నిర్ణయింపలేక వాదములు పెరిగి

కొట్టుకొనిరి. మావటివాఁడది యెఱిఁగి వారికడకు వచ్చియిట్లనియె. ఏ నుఁగుశరీరములో మీరొక్కొక్కభాగము మాత్రమె చూచిరి. కాని సంపూర్ణముగఁ జూడలేదు. మీలో మొదఁటివాఁడుచూచినభాగము రోకలివలెనున్నమాట ని.ము. రెండవవాఁడు చూచినది రోటివలెను న్నది. మూఁడవవాఁడు చూచినది పాణకవలె నున్నది. నాల్గవవాఁడు చూచినది చేటవలెనున్నది. తక్కినశరీరముఁ జూడక మీరు చూచిన భాగమె యేనుఁగనుకొన్నారు. ఆనాలుగుభాగములుగిలిపినపక్షమున నే నుఁగగును తెలియని విషయమున వాదించుకొని మీరు కొట్లాడవద్దు

23 మూర్ఖుఁడైనయొకానొక మనుష్యునితల్లికి మిక్కిలి జబ్బుచే సెను. ఒకవైద్యుఁడామెకు మందిచ్చి రోగనివారణము జేయుచుండెను. మాయమ్మకేమిపథ్యమని యామూర్ఖుఁడు వైద్యునడుగఁగావైద్యుఁడు కొన్నివస్తువులుచెప్పి మజ్జిగ ముఖ్యముగఁ బోసికొని తినుమనిచెప్పెను. "ఈరోగమునకు మజ్జిగ కూడదని చాలమందిచెప్పినారే. అదిజబ్బుచే యదుకదా." యని మూర్ఖుఁడు వైద్యునడిగెను. "గరిటెకాల్చిపెట్టిన పక్షమున మజ్జిగదోషము పోవునని వైద్యుడు బదులుచెప్పెను. సరే యని మూర్ఖుఁడింటికి వెళ్ళి తల్లికిమజ్జిగఁబోసి యన్నముఁబెట్టించి భో జనానంతరము గరిటె యెఱ్ఱగగాల్చితల్లిమెడమీఁదఁ బెట్టెను. తల్లి మొఱ్ఱోమొఱ్ఱో యనియేడ్చెను. చుట్టుపక్కవాళందఱుఁ జేరియా కుమారునిఁదిట్టిరి. వైద్యుడాలాగున జేయుమన్నాఁడని వాఁడుచెప్పెను. అందఱుఁ జేరి వైద్యునికడకుఁబోయి యడుగఁగా నతఁడిట్లనియె. "గ రిటె కాల్చి తల్లిమెడమీఁదఁ బెట్టుమని నేనెప్పుడును జెప్పలేదు. గరిటె కాల్చి మజ్జిగలో పడవైచిన పక్షమున మజ్జిగయొక్కదోషముపోవున నివైద్యశాస్త్రములో నున్నది. నేనాలాగుననేచెప్పితిని. ఈమూర్ఖుఁడు తప్పర్థముఁ జేసికొని యిట్లువికృతముగఁ బనిచేసినాఁడు." వైద్యులు సరిగఁ జెప్పకపోవుటచేతను మందులనిమిత్తమువచ్చువారు సరిగ నడిగి

తెలిసికొనకపోవుటచేతను దరుచుగా నిటువంటి చిక్కులు సంభవించు నని వారనుకొని వెళ్ళిపోయిరి.

24 ఉత్తరహిందూస్థానమున గడ్డములు మీసములుచాలమంది పెంచుకొందురు. ఒకగ్రామమున నొకకోమటి తనగరిమీసములుపైకె గదువ్వి తనదుకాణముమీఁద గూర్చుండి సరకు లమ్ముచుండెను. ప ఠాణిజాతివాఁడైన యొకమహమ్మదీయుఁడు వస్తువేదో కొనుటకంగడి కిబోయి కోమటిమీసములు చూడగానే కోపగించి వస్తువుమాట మఱచి యతనితో నిట్లనియె. "సెట్టీ! నీవు నాతో నిప్పుడు యుద్ధము చేయవలయును. చేయకపోయినచో నిప్పుడు విడువను." అనవుడు వైశ్యుడు "నేనేల నీతో యుద్ధము చేయవలయు" నని యడిగెను. "నీవు నావలె మీసములుపైకెగదువ్వినావు. కత్తిపట్టుకున్నవాఁడె మీసము దువ్వవలయును. కాని దుకాణమీఁదఁ గూర్చుండి సరకులమ్మువాఁడు మీసములుదువ్వఁగూడదు. పౌరుషమున్నవాఁడె మీసముదువ్వవలయును. నీకు పౌరుషమున్నయెడల నాతో యుద్ధముచేయవలయును. లేదా నీమీసముత్రిప్పి వైవవలయును. ఏదోయొకటివెంటనే చెప్పుము." అని యాపఠానుఁడు పలికెను; "ఏమిది నామీసములు నేనెగదువ్వుకొనఁగూడదా. నాదేహముమీద మొలచిన వెంట్రుకలవిషయమై నాకుస్వతంత్రము లేదా" యని వైశ్యుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "నీమీసములునీవు దువ్వుకొనుటకధికారమున్నదా? పౌరుషవంతు లున్నచోట నట్టిపనులు సాగిరా" వని పఠానుఁడు పలికెను. అంతట కోమటి కొంచెమాలోచించి "నీకాలుబిడ్డలు కలరా" యని పఠాను నడిగెను. "నాకు నలుగురు భార్యలున్నారు. ఏడెనమండుగురు పిల్లలున్నా" రని తురకవాఁడుత్తరముఁ జెప్పెను. "నాకును నలుగురు పిల్లలు భార్యయు నున్నా" రని వైశ్యుఁడు మెల్లఁగా నని

తురకను జూచి ,,మనమిద్దరము గొట్టుకొని చచ్చినపక్షమున మన యాలుబిడ్డలు మనకోసమేడ్తురు. మనకోసమేడ్చేవారెవరు. లేకుండఁ జేసి పిమ్మట యుద్ధముచేయుట మంచి" దని హెచ్చరించెను. ,,సరే అట్లయిన నాభార్యను బిడ్డలనుఁ జంపి రేపుదయమువచ్చెదను. నీవీ లోపున నీభార్యను బిడ్డలను జంపి సిద్ధముగ నుండుమని పఠానుఁడు వి స విస తనగృహంబునకుఁ జని యారాత్రి నిద్రించుచుండఁగాఁ దనభా ర్యను బిడ్డలనునరికివైచి మరునాఁడుదయమున వైశ్యునికడకుఁ బోయి రమ్ము్మయుద్ధమునకు రమ్మనిపిలిచెను. "ఎందుకు నీతో యుద్ధమునకు రావలయు" నని గోమటి యెఱుఁగనట్లడిగెను. "ఎందుకా మీస మెగదువ్వనందుకు తెలిసిందా" యని కోపముతో బదులు చెప్పెను. అనవుడు వైశ్యుఁడు నవ్వునిట్లనియె. "ఈమాత్రమునకు యుద్ధమెం దుకు. నీకంతయిష్టములేనియెడల నామీసములు నేను దిగదువ్వెద ను" అని వెంటనే మీసములుదిగదువ్వెను. "అదేనాకుగావలసిన పని యని సంతోషముతో మహమ్మదీయుఁడు వెడలిపోయెను సాధా రణముగ లోకములో జరుగునట్టి గొప్పయుద్ధముల కిట్టిపిచ్చికారణము లెమ్మై యుండవచ్చును.

25. పూర్వమొకసారి చిన్నమ్మకు పెద్దమ్మకు వారిద్దరిలో నెవ తె యందమైనదను విషయమునుగురించి కలహము సంభవించెను. వా రిద్ద ఱావిషయమునిర్ణయము చేయవలసినదనిముందుగా బ్రహ్మదేవుని కడ కరిగిరి. పెద్దమ్మపక్షమునఁ దీర్పిచ్చినయెడలవెంటనే చిన్నమ్మకెం తో కోపమువచ్చును, చిన్నమ్మపక్షమునఁదీర్పిచ్చినపక్షమున వెంటనే పెద్దమ్మ కాగ్రహముపుట్టును. ఎవరికాగ్రహము కలిగినను గష్టమేగ నుక బ్రహ్మదేవుఁ డావిషయము నిర్ణయముచేయలేక భయపడి తనచే తగాదని యొప్పుకొని వారిని పంపెను. పిమ్మట వారిద్దఱుశివునికడకుఁ బోయిరి. అతఁడును మొగమోటపడి యాధర్మసూక్ష్మమునిర్ణయించుట

తనతరముగాదని చెప్పి వారిని పంపివైచెను. పిమ్మటవారు విష్ణుకడకు మహేంద్రునికడకు దిక్పాలకులకడకు వెళ్ళిరి. కాని వారు నిట్లేచెప్పి పంపిరి. తిరిగివచ్చుచుండ వారికి మార్గమధ్యమున నారదుఁ డగపడి యెను.ఆతనికి వారీవిషయము నెఱిఁగింప నతఁ డిట్లనియె "ఈవిషయ మున నేనును నిర్ణయము చేయఁజాలను. కాని చేయగలవానిఁజూపెద ను. కాశీపట్టణములో రత్ననిధియను నొక వైశ్యుఁడు గలఁడుఅతనికడ కు పొండు" ఆపలుకులు విని వారిద్దఱు సత్వరముగా నాతనికడకరిగి వానికి తమవివాదాంశముఁ దెలిపి నిర్ణయము చేయుమనియడిగిరి. పాపము రత్ననిధి పచ్చివెలగకాయ గొంతుపడినట్లు తోఁచక యెటుచె ప్పిన యెవరికికోపము వచ్చునో యని భయపడి యుభయులకాగ్రహ ము రాకుండునట్లు తీర్పు చెప్పఁదలఁచి యిట్లనియె."మీరు నాయెదు ట నిలువఁబడి యుండఁగా నేను తీర్పు చెప్పజాలను.నాలుగు మూఁడు సారులు మీరిట్టట్టు పచారుచేసిరండు. అప్పుడు మీనడకలు మీయొ య్యారములు మీహొయలుఁ దెలిసికొని తీర్పుఁజెప్పుటకు నాకవకాశ ముండును." అప్పుడు వారిద్ద ఱిట్టటు పచారుచేసివచ్చి వానియెదుట నిలువఁబడిరి. అప్పుడు కోమటి యిట్లు తీర్పుజెప్పెను. "అమ్మా! యి దిగో చెప్పుచున్నాను.వినుండు.లోపలినుండి వచ్చునప్పుడు పెద్దమ్మ యెంతో యందముగనున్నది;లోపలికివెళ్ళునపుడు చిన్నమ్మయెంతో యందముగ నున్నది." ఆతీర్పు విని యిద్దఱును మిక్కిలిసంతసించిరి. తనయాపద తప్పినదని కోమటి మిక్కిలి సంతసించెను.

26. ముగ్గురు జూదరులు జూదమాడిరి. అందొకడు పూర్తిగా నోడిపోయి తక్కినయిద్దఱుజూదరులకు సొమ్ముబాకిపడెను. సొమ్మిచ్చి కదలవలసినదనివారతనినిర్బంధముఁ జేసిరి.ధనహీనుఁడైన యాజూదరి వారిబారినుండి తప్పించుకొని పోవునుపాయములేక కొంతసేపు విచా రించి వారిట్టటుఁజూచుచుండఁగాగుప్పెడిసుకఁదీసి వారికన్నులలోగొట్టి

గబగబ పాఱిపోయెను. వారిద్దఱుఁ గన్నులలోయిసుకఁ దుడుచుకొనికొం తవిశ్రాంతిఁ జెంది తమకు సొమ్ము బాకీపడిన దొంగజూదరిని వెదకు టకై మరల బయలుదేఱెను. సందులు గొందులు పాడుగుళ్ళపంచలు వెదకిరి. కాని వారికెందును గానరాలేదు. చిట్టచివరకు వారు విసుగు జెంది యొకమామిడితోటలోనికిఁ బోయి కూర్చుండిరి. పాఱిపోయిన యాజూదరినిగూడ నచ్చటనే యొక చెట్టెక్కి కూర్చుండెను. ఆచెట్టుక్రిం దనె తక్కినజూదరు లిద్దఱుఁ గొంతసేపుకూర్చుండిరి. యేమియుందో చక యొకపందెము వైచుకొందమని జూదపుసారెలు దీసి యాడఁబో చిరి. ఈజూదపుసారెలు జూడగానె చెట్టుమీఁదనున్న యాదొంగకు శరీరముప్పొంగెను. ఆపరవశతచేత వాఁడు తనస్థితిగతులు తెలిసి కొనలేక నీమారుపందెము నేను వైచెద నని చెట్టుమీఁదనుండి గుభా లున నేలకురికెను. దొంగదొఱకినాఁడని వారు సంతోషించి వాని పట్టుకొని మర్దించిరి.

27. మహానుభావుఁడైన భీష్ముఁడు తనమరణకాలమందు మను మలైన పాండవులఁ బిలిచి "వత్సలార! నేను చనిపోయినతరువాత నాకళేబరముఁ దీసికొనిపోయియిదివఱకెవ్వరికిని దహనము సేయనిచోట దహనము చేయవలసిన దని కోరెను. అట్లే చేయుదుమని మనుమ లు తాతతోఁ జెప్పిరి. సంతుష్టమనస్కుఁడై భీష్ముఁడు మృతినొందెను. పాండవులాయన కళేబరమును సామాన్యస్మశానమునకుఁ గొనిపోవక గంగాతీరమున మిక్కిలిపవిత్రమైనయొకానొకచోటికిఁ దీసికొనిపోయి యచ్చోట దహనముఁ జేయ సంకల్పించిరి. అప్పుడాకాశవాణి "శతంభీ ష్మం" అని పలికెను. అనఁగా నిచ్చట నూరుమంది భీష్ములు దహన ము చేయఁబడిరని యామాటకర్థము. అప్పుడు పాండవులు కళేబరము నచ్చట దహనము చేయుటమానిహిమవత్పర్వతశిఖరమునకుఁ గొంపో యి చితిపేర్చిరి. ఆకాశవాణి "శతంభీష్మం" అని వెనుకటివలెనె పలికె

ను. ఇదిగూడ ననేకజనులను గాల్చిన శ్మశానమె యని గ్రహించి పాం డవులు తాతకళేబరమును సముద్రమధ్యంబుననున్న యొకదీవికిఁగొంపో యిరి. ఆచ్చటగూడ శతంభీష్మం అని యాకాశవాణి పలికెను. ప్రాణ మువిసికి పాండవులేమిచేయుటకుఁ దోఁచక చూచుచుండ మహాసాహ సుఁడైన యర్జునుఁడు తనయరచేతిలో భీష్ముని దహనము చేయుదునని చెప్పి యన్నదమ్ములుఁ జుట్టములువిస్మయమందుచుండనరచేతియందు చితిపేర్చి తాతనుదహనముచేసెను. ప్రపంచమందలి ప్రతిస్థలము మ నుష్యులయొక్కయు జంతువులయొక్కయు నెముకలతో నిండియున్న దనియు శ్మశానముకానిచోటు లేదనియు నీకథయొక్క ఫలితార్థము.

మిడతంభట్టుశకునము.

28. ఒక బ్రాహ్మణుఁడు చదువుసంధ్యలు రాక దేశములుదిరిగి య త్తవారింటికి వచ్చెను. అత్తగారు మనసుపడి పిండివంటఁ జేసికొని తినఁదలచెను. కాని యల్లుఁడు తిండిపోతగుటచే వండినదంతయునతఁడె తినికూర్చుండునని భయపడి యతడింట లేనప్పుడు వంటనారంభించె ను. పిండివంట ప్రారంభించునప్పటికతఁడెక్కడెక్కడో తిరిగివచ్చి య త్తగారు వదినెగారు జూడకుండ వంటయింటివెనుక చూరుక్రింద గూ ర్చుండెను. వారు గారెలు చమురులో వేయనారంభించిరి. పిండి నూనె లోఁ బడగానే చుయ్యిమని చప్పుడగుచుండును. గనుక నెన్నిమారులు చప్పుడైనదో యన్నిగారెలు వండిరని నిశ్చయించినారెఱుగకుండ మ రల వీధిలోనికివెళ్ళి యేమియునెఱుఁగనట్లులోపలకువచ్చెను. వంటయి నది మడిగట్టుకొమ్మని యత్తగారు తనతో జెప్పనతఁడు స్నానముచేసి మడిగట్టుకొని కూర్చుండి పిండివంటతప్ప వండినపదార్థము లన్నియు వడ్డించినతరువాత గారెలువడ్డించినారుకారే మని యడిగెను. "గారె లెవరు వండినారు, లేనిపోనిమాటలనకుమని యత్తగారుమందలించె

ను "మీారేవండినారు. నూటముప్పదిరెండు గారెలు వండినారు. లె క్కచూచుకొనుఁ" డని యల్లుఁడు బదులుచెప్పెను. తనదొంగతనము దాగినదికాదని తెలిసికొని యత్తగారు "నాయనా నీవదినెలు నిన్నెగ తాళిచేయదలఁచి పిండివంట వండినట్లునీకు తెలియజేయవద్దని నాతో జెప్పినారు. అందుచే నేను వడ్డించక దాచినాను. సరె గారెలు వం డినట్లు తెలిసికొన్నావుకదా. నీకులెక్కయేలాగు తెలిసినది" యని యడిగెను. అందుకితఁడిట్లనియె. "యేదో నాపూర్వపుణ్యముచేత తెలి సినది. అదంతా మీాకెందుకు. మీారువండినమాటనిజమాకాదా.అబ ద్ధము చెప్పలేదుకదా." భోజనమైన తరువాత వానియత్తగారు వదినె లు మొదలగువారందరు చుట్టుపక్కలనున్న యమ్మలక్కలతోఁ దమ యల్లునిపరీక్ష జెప్పి యతఁడు గొప్పజ్యోతిశాస్త్రజ్ఞుఁడని వెల్లడిచేరి. ఆమాట గ్రామమంతయు వ్యాపించెను. అట్లుండ నొకచాకలివానిగా డిద తప్పిపోయెను. దానినిమిత్తము వాఁడు వెదకివెదకి కాళ్ళునొప్పులె త్తుటచే నడవలేక విసిగి వేసారియీాయద్భుతజ్యోతిష్కునిమాటజ్ఞప్తి కివచ్చి యీాయనకడకు బోయి తనగాడిద యేమయ్యెననియడిగెను. ఇ తనికి జ్యోతిశాస్త్రములో నొకముక్కయైనరాదు. రాకపోయినను గొ ప్పజ్యోతిష్కుఁడని లోకములో వాడుకపడుటవలన దనకుధనలాభము వలుకుబడి గలుగునని సంతోషించెను కాని నడుమ నడుమ నిటువంటి విషమపరీక్షల కుత్తరము చెప్పవలసివచ్చినప్పుడు మాత్రము మిక్కి లి బాధపడుచుండును పరీక్షచెప్పితీరవలయును చెప్పకపోయినచోఁ దనకు వచ్చినప్రతిష్ఠ యంతయు నశించునని భయపడ్డి యిట్టటు జూచి యాకాశమువంకఁజూచి వేళ్ళులెక్కపెట్టి యేవో నాలుగుమాటలు గొణుగుకొని, యోరీ చాకలీ ఈరాత్రి చక్కగానాలోచించి రే పు చెప్పెదును. ఉదయమునరారా" యని చెప్పిపంపెను. చాకలివాఁ డు వెళ్ళునప్పటికి నాలుగుగడియలరాత్రియయ్యెను అప్పు డతఁడు భో

జనముఁజేసి తనప్రతిష్ఠ నిలబెట్టుకొనుటకై యెట్లయినఁ గష్టపడి వెద కి చాకలివానిగాడిదను సంపాదించుకొని రావలయునని సంకల్పించి భోజనానంతరమున బయలుదేఱి తోటలు దొడ్లు పొదలు పొలములు సందులు గొందులు వెదకెను. అట్లు వెదుక నెట్టకేల కాగాడిదెకనఁబ డెను. పరమానంద భరితుఁడై యతఁడు దానిని పట్టుకొనిబాదమువైపొ యొక తాటిచెట్టునకు గట్టిపెట్టి యింటికివచ్చి కొంచెము సేపు పండుకొని తెల్లవారుటతోడనే లేచి దంతధావనము చేసికొనుటకు వీథి యరుగుమీఁదఁ గూర్చుండ చాకలివాఁడువచ్చి దండముపెట్టి నిలిచె ను. వెంటనే యాబ్రాహ్మణుఁడు వానితో నిట్లనియె" చాకలీ? నీగాడి ద నిమిత్తమై రాత్రినిద్రమానిపుస్తకము చూచితిని. చిట్టచివరకుదాని జాడ తెలిసినది. తూర్పుచెరువునకు దక్షిణముగా నున్నపొలములోను త్తరపువైపున నున్నతాడిచెట్టునకు గాడిద నెవరో కట్టివైచినారు.దా నికాళ్ళకు బందములు కూడనున్నవి. వెళ్ళి తెచ్చుకో"యనవుడు చా కలివాఁడు పరుగుపరుగున నచ్చోటికిఁబోయి చూచునప్పటికి బ్రాహ్మ ణుఁడు చెప్పినట్టు చెప్పినచోటనుండెను. అంతట వాఁడు మిక్కిలి సం తోషించి మరల బ్రాహ్మణునియింటికివచ్చి యతనికి దండముపెట్టి నా లుగణాలియ్యవచ్చెను. అదిపుచ్చుకొనక బ్రాహ్మణుఁడు వానినిదీవిం చి పంపివైచెను. దీనితో బ్రాహ్మణునికీర్తి యాగ్రామమందేగాక చు ట్టుపక్కల గ్రామములుగూడ వ్యాపించెను. ఇంతవాఁడు లేఁడనిపేరు పడెను. అటులుండ రాజుగారియింట నగలు కొన్నిపోయెను.దొంగలె వ్వరో తెలిసినదికాదు. జ్యోతిశ్శాస్త్రమందు మిక్కిలి ప్రౌఢుఁడనిపే రుగాంచిన యాబ్రాహ్మణునిఁ బిలిపించి రాజుగారునగలుదొంగిలించి న చోరులెవ్వరో కనుగొనవలసినదని యాజ్ఞాపించెను. అట్లు కనుగొన నిపక్షమున ముక్కు చెవులుకోసి పంపించెదనని యతఁడుచెప్పెను. ఆ పలుకులు వినఁగానే బ్రాహ్మణునిగుండె దడదడలాడెను. ఈసారితనగు

ట్టు బయిటపడుననియు రాజుగారు ముక్కు చెవులుగోసితనకు గొప్ప పరాభవముఁ జేయుదురనియు నతఁడు భయపడెను. దొంగలజాడకని పెట్టుటకు రాజుగారొకవారము దినములు గడువిచ్చిరి. ఆవారము దిన ములతనికి నిద్రాహారములులేవు. ఆభయముచే నతఁడన్యవ్యాపారము లుమాని హరిభక్తుఁడు నిరంతరము రామరామయని రామస్మరణము జేయునట్లు రేయుంబవళ్ళు ముక్కో చెవో ముక్కోయనిస్మరణజేయు చుండెను. రాజుగారిదగ్గఱ నిద్దఱుపనికత్తెలుండిరి. అందులోనొకదాని పేరు ముక్కు రెండవదానిపేరు చెవి, వీరిద్దరప్పచెల్లెండ్రు. పుట్టినపిల్ల లంజఱుఁ జచ్చిపోవుటచేత వాండ్ర తలిదండ్రులు మంచిపేళ్లేవియుఁబె ట్టక తిమబిడ్డలకు ముక్కు చెవియని పేరుపెట్టిరి. వాండ్రుచిన్ననాఁట నుండియు రాజుగారియింటనెబ్రతికి యక్కడనె సేవజేయుచుండిరి.వా రిద్దఱు గలిసి రాజుగారినగలుతీసిరి. ఇంటిమనుష్యులుచేసినదొంగతన మగుటచే నది బయుటపడలేదు. జ్యోతిష్కునిఁబిలిపించి దొంగపేళ్ళుతె లిసికొమ్మని రాజుగారాజ్ఞాపింపఁగానె "యితఁడు గొప్పజ్యోతిష్కుఁడు మనపని బయటఁబడకమాన"దని పనికత్తెలిద్దఱు మిక్కిలి భయపడ సాగిరి. భయపడి జ్యోతిష్కుడేఁమి చేయుచున్నాఁడో చూడఁదలఁచి యర్ధరాత్రిమువేళ వారలతని యింటిపంచను నిలిచిరి. జ్యోతిష్కుఁడు నిద్రలేక రాజుగారు తనముక్కోచెవో కోయించుననుభయమునమతి పోయి ముక్కో చెవోయని స్తవము చేయుచుండెను. ఆపలుకులు వి నఁగానే పనికత్తెలడలి "అయ్యో! బ్రాహ్మణుఁడుమనసంగతికనిపెట్టి నాఁడు. మనగుట్టియనదగ్గఱ సాగదు. ఈయన కాళ్ళుపట్టుకొని బ్రతి కించుమని వేఁడుకొనుట మంచిది." యని జ్యోతిష్కునిఁ బిలిచిరి. అతఁడు తలుపు తీసికొని బయటకు వచ్చెను. రాఁగానె వాండ్రిద్దరు వానికాళ్ళమీఁదఁబడి యిట్లనిరి. "బాబు!, నాపేరు ముక్కు దీనిపేరు చెవి. రాజుగారినగలు మేమిద్దరము దొంగిలించినాము. మేము తీసిన

ట్లుమీారు కనిపెట్టినారు. ముక్కో చెవో యని మీారు అనుచున్నారు మారాజుగారితో మాపేర్లు చెప్పవద్దు. మమ్మురక్షించండి. ఈనగలు తెచ్చి మీాకిచ్చెదము ఇవి మీారు రాజుగారికీయండి అని ప్రార్థింపగా నతఁడు విస్మితుఁడై తానొక కారణమున ముక్కో చెవో యనిస్మరణ చేయుచుండఁగా నది మఱియొకవిధముగఁబరిణమించి దొంగసొమ్ముదొరకుటకుఁ గారణమైయున్నదని మిక్కిలి యక్కజపడి తనయదృష్టము బాగున్నదని సంతోషించి దాంభికుఁడగుటచే చూచినారా నాప్రజ్ఞ నాదగ్గఱ మీాదొంగతనము దాఁగునా! జాగ్రత్త సొమ్ముతెచ్చి యియ్యండి, మిమ్మురక్షించెద నని పలికి వారిని పంపెను వారిద్దఱుబోయి నగలమూట దెచ్చియిచ్చిరి జ్యోతిష్కుడామూటఁ దీసికొని చెఱువుగట్టునకుఁబోయి గొయిదీసి యందది పాతిపెట్టి యింటికి వచ్చి మఱునాడుదయమున రాజుగారికడకుఁ బోయెను నగలజాడయేమైన దెలిసినదాయని రాజుగారడిగిరి అడుగుటయు నతడిట్లనియె "సామీా! తెలిసినది ఎవరో దొంగలు చెఱువుగట్టుమీాఁద నేరేడుచెట్టుక్రింద పాతించినారు మీారుత్రవ్వించి చూడండి సొమ్మక్కడనుండును దొంగలీయూరువారుకారు కావునవారిపేళ్ళు తెలియవు! అనవుడు రాజు సేవకుల బంపించి చెఱువుగట్టున త్రవ్వించి చూడఁగా సొమ్మందుకనఁబడెను ఈదెబ్బతో జ్యోతిష్కునికీర్తి మిన్నుముట్టెను ఇంతటియఖండప్రజ్ఞావంతుఁడు లేఁడని జనులు చెప్పుకొనిరి రాజుగారి కతనిమీాఁద నతిదయగలిగెను కావలసినంతధనమిచ్చిరి రాజుగారెక్కడికిబోయిన నక్కడికి వానినిఁగూడ బండిమీాఁదనెక్కించుకొని యేనుఁగుమీాఁదనెక్కించుకొని తీసికొనిపోయిరి ఒకనాఁడు జ్యోతిష్కుని వెంటబెట్టుకొని రాజుగారు షికారు వెళ్ళుచుండిరి అప్పుడు రాజుగారిచేతిలోనొక మిడత పడెను అదిజ్యోతిష్కుడు చూడలేదు అప్పుడు రాజు జ్యోతిష్కునిఁజూచి "నాచేతిలో నేమిపడినదో చెప్పు అప్పుడు నీజ్యోతిష

ము మహిమ తెలియఁగల" దని యడిగెను దానితో వానిగుండెలో తాయిపడెను మునుపు కపటోపాయముచేతఁ దనకు జ్యోతిష్కుఁడని యొకగొప్ప పేరుకలిగినదనియు నదినేటితోఁ బోవుననియుఁ బోవుట యేగాక శిరచ్ఛేదముకూడ నగుననియు భయముకలిగెను అట్టిసమయములో దనయపరియోజకత్వ మొప్పుకొనుట మంచిదనియిట్లనియె "చుయ్యి చుయ్యి అప్పచ్చిదృష్టం కష్టపడితిరిగే గార్దభందృష్టం ముక్కో చెవో భూషణందృష్టంమిడతంభట్టుచెయ్యిచిక్కె,చుయ్యిచుయ్యి యనుచప్పుడువలన నప్పచ్చులలెక్క తెలిసినది రాత్రియంతయు మిక్కిలి కష్టపడి తిరిగినందువలన గాడిదకనఁబడినది ముక్కో చెవో యనుకొనుటవలన నగలు దొరికినవి. నేడుపాయముదోఁచకమిడతవలెచేతిలోబడితిని రాజాయని దానియర్థము రాజుగారికి దానియర్థము తెలియలేదు తనచేతిలో నేమిపడినదో తెలిసికొనుటకై యతఁడేదోమంత్రము చదువుచున్నాఁడని రాజుగారనుకొనెను మిడతంభట్టుచేచిక్కెననఁగానే తనచేతిలో మిడత పడినసంగతి తెలిసికొన్నాఁడని సంతోషించి కౌఁగిలించుకొని మీవంటి జ్యోతిష్కుఁడు శాస్త్రకారులలోనైన లేఁడని మెచ్చి యతనికొక యగ్రహారమిచ్చెను, ఈవిధముగానె తెలివితేటలు లేనిప్రభువులయొద్ద పరిజ్ఞులులేని మనుష్యు లదృష్టముచేతను మోసముచేతను నధికు లగుచుందురు

29. భగవద్విషయము తెలిసిన యొకపురుషునికడకు నాస్తికుఁ డొకఁడువచ్చి ‹ఓయి నీవు భగవంతుఁ డున్నాఁడని ఘోషించుచున్నావుగదా భగవంతుఁ డెక్కడున్నాఁడో యేమిచేయునో చెప్పఁగలవా' యని యడిగెను అతనికి భగవద్భక్తుఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను "అయ్యా! భగవంతుఁ డెక్కడున్నాఁడని యడుగుచున్నావు భగవంతుఁడెక్కడ లేఁడో నీవుచెప్పు భగవంతుఁ డేమిచేయునని నీవడిగితివి భగవంతుఁ డేమిచేయఁడో చెప్పు! నాప్రశ్నలకు ముందు నీవుత్తరము చె

ప్పితివా తరువాత నీపశ్నలకు నేను జవాబు చెప్పెదను. ఆపశ్నల కుత్తరము చెప్పలేక నాస్తికుఁడూరకుండెను.

30. ఒకపిచ్చివానిని పిచ్చివాండ్రినిమిత్తమేర్పడిన వైద్యశాలలో వానిచుట్టములుపెట్టి మందిప్పించుచుండిరి. పిచ్చివాఁడుకాకమును పతడు మిక్కిలి చమత్కారముగా మాటలాడసామర్థ్యముగలవాఁడు. అతఁడు వైద్యశాలలోనుండఁగా నొకనాడొక ప్రాతస్నేహితుఁడతని జూడఁబోయి 'నిన్నీవైద్యశాలలో నేలపెట్టిరి! యని యడిగెను. పిచ్చివాఁడైనను గడుచమత్కృతితో సహజముగమాటలాడగలవాఁడగుట చేనతఁడిట్లనియె. "అభిప్రాయభేదముచేతనన్నిందుఁబెట్టిరి. కానినాకే విధమైన జబ్బులేదు. లోకమందరియభిప్రాయము వేఱు. నాయభిప్రాయము వేఱు. నేను పిచ్చివాఁడనని వారందరనుచున్నారు. అట్టివాఁడను కానని నేననుచున్నాను. సూర్యుఁడు రాత్రియుదయించుచున్నాఁడని నేనంటిని. పగలుదయించుచున్నాఁడని వారనుచున్నారు. నిప్పుచల్లగానుండునని నేనంటిని. కాదని వారనిరి. ఈవిధముగా నాయభిప్రాయభేదము గమనింపక వారు నన్నువైద్యశాలలోఁ బెట్టిరి.

31. కాశిలో గంగయొడ్డున నొకబైరాగి చేతిలోగంజాయిమొక్కపట్టుకొని కూర్చుండి అయ్యో! నాగంజాయిమొక్కా! నాశ్రమయెంతయు వ్యర్థమైనదె. నీనిమిత్తమెంతపనిచేసినానే, యని యేడ్వదొడగెను. అదియెంతో చిత్రముగానుండుటచే గంగలో స్నానముచేయుచున్న వారందరుబైరాగిచుట్టుజేరి నవ్వదొడగిరి. కోటీశ్వరుఁడైన యొకవర్తకుఁడు ముందుబోయి బైరాగికిట్లనియె. ఓయీ! నీకు వెట్టియెత్తినదా యేమి. గంజాయిమొక్క కేల యేడ్చెదవు? అదినీకేమియుపకారముచేసినది? అనవుడు బైరాగివానికిట్లనియె. "అయ్యా! ఈగంజాయిమొక్కను తులసిమొక్కను జేయవలయునని నేను బహువిధముల ప్రయత్నముచేసితిని. దీనిని హరిద్వారమున గంగలో ముంచితిని కాశీ

గంగలో స్నానముచేయించితిని. కేదారేశ్వరమునకువెళ్ళి ప్రయాగ లో త్రివేణిసంగమునందు నీళ్ళలో గడియసేపు నానబెట్టితిని. మధుర లోను గోకులములోను బృందావనములోను రామేశ్వరములోను గలపు ణ్యతీర్థములలో దీనినిపలుమారు తానమాడించితిని. ఎన్నితీర్థములలో ముంచినను తులసిమొక్క కాలేదు. నాశ్రమయంతయు వ్యర్థమైనదని యేడ్చుచున్నాను. ఆపలుకులువిని చుట్టునున్న వారందరు పక్కునన వ్విరి. కోటీశ్వరుఁడిట్లనియె. "ఓయి, పిచ్చివాఁడా! పుణ్యనదులలోముం చినంతమాత్రమున గంజాయిమొక్క తులసిమొక్కయగునా? అన వుడు బైరాగివారికిట్లనియె. ఓయి!వెఱ్ఱివాఁడా!నాగంజాయిమొక్కతు లసిమొక్క కాకపోయినపక్షమున గంగలో స్నానములు చేయుచు న్నట్టిమీరందరు పుణ్యాత్ములగుదురా?స్నానములవల్లమహాపాపాత్ము లుపుణ్యాత్ములగుదురేని నాగంజాయిమొక్కయు తులసిమొక్క య గును. అందరిమాటయెందుకు నీమాటచెప్పు నీవు గొప్పవర్తకుఁడవు కోటికి పడగెత్తితివి ధనగర్వముచేత విఱ్ఱవీగుచుంటివి. రాత్రినాలుగు జాములు నీచేయునవన్నియు పాపములె. ఎందరోభోగమువాండ్రనుం చితివి. దిట్టముగా మద్యపానముచేయుదువు. ఎందఱిసొమ్మో అపహ రించి కోటిరూపాయలు చేసితివి. దండసపరతులమీద వడ్డీవ్యాపార ముచేసి కొంపలుకూల్చితివి. ఇటువంటి దుర్మార్గునకు నీకే స్నానము వల్ల మోక్షమువచ్చినపక్షమున నాగంజాయి తులసిగాదా! రాయిర త్నముకాదా! కుక్క గోవుకాదా?" ఆమాటలు వినగానే కోటీశ్వరుఁ డు సిగ్గుపడెను. చుట్టుప్రక్కవారందరుబైరాగినెగతాళిచేయుటమాని యతనియేడ్పులో నెంతో జ్ఞానమున్నదని సిగ్గుపడి వెళ్ళిపోయిరి.

32. ధనవంతుఁడైన యొకవర్తకునియింటికి రాత్రి దొంగలు వచ్చిరి. వాళ్ళుకన్నముత్రవ్వుచుండఁగానతనికిమెలకువవచ్చెను. రాగానె యతఁడుభార్యనులేపిమిక్కిలిరహస్యముగ తానుగనిపెట్టినసంగతి జెప్పి

యామెతో దొంగలువినునట్లు గట్టిగ నిట్లు సంభాషణచేసెను. "ఓసి! అవకతవకముండా! తెల్లవారులు నన్ను నిద్రపోనీకుండా చంపదలచుకున్నావాయేమిటి? వెధవనగలు నీనగలు. యెఱుగకపోయి తాకట్టుపెట్టినాను. ఈసంవత్సరము కందులు మిక్కిలిప్రియమయినవి. రూపాయకు రెండు సేర్లిచ్చుచున్నారు. అందుచేత మనకు చాలాలాభము వచ్చునని నీనగలన్ని దీసికొనిపోయి తాకట్టుపెట్టి కందులుకొన్నాను. సరుకమ్మి లాభమురాఁగానే నగలునీకిచ్చివేయుటయేకాక మంచినగలు రెండుమూడు చేయించెద భయపడకు. అంతగా నీకు కావలసియున్నపక్షమున రేపుదయమందేకొన్నిబస్తాలనమ్మివేసెదను. కాబట్టి నీవ_స్తమానమేడ్చి నన్ను బాధపెట్టకు!" అనవుడు దొంగలువినునట్లు భార్య ఇట్లనియె. లోకములోనివారందరువ_ర్తకముచేసుకొనుటలేదా? ఈలాగె భార్యవస్తువులను తాకట్టుపెట్టినారా? మనచుట్టాలయింటిలో మొన్న పెండ్లియయినది. నగలులేకుండ మూసివాయనపుపేరంటాలవలె నేనుంటచేత నలుగురిమొగముచూచుటకు సిగ్గుపడి పేరంటమునకు వెళ్ళలేదు. అందెలుపుస్తెతప్ప మరేమిలేకుండచేసినారు. ఈలాటివర్తకమున్నదా లోకములో" నని యటమీఁద మాటలాడలేక పెద్దపెట్టున యేడ్చెను. దొంగలామాటలువిని యదినిజమనుకొనికన్నము దప్పివ్వటమాని మెల్లగా తమలో నిట్లనుకొనిరి. "ఈనిర్భాగ్యుడు నగలన్నియు తాకట్టుపెట్టినాడు. కష్టపడి కన్నముత్రవ్వమనములోపల ప్రవేశించినను ముంతలు చెంబులు తప్ప మనకేమియు దొరకవు వీరిదగ్గర రొక్కముకూడలేదు మనకీవృథాశ్రమమెందుకు? కందులు చాలప్రియమయినవని శెట్టి చెప్పుచున్నాఁడు లోపలిచావడిలో యెన్నోకందులుబస్తాలున్నవి ఆబస్తాలు మనము తీసికొనిపోయి రేపు అమ్ముకొందము మనకు కావలసినంతలాభము వచ్చును" అనియక్కడనున్న ఏబదిబస్తాలు మోసికొనిపోయి మరునాఁడు బజా

రులో బెట్టి దొంగలమ్మజొచ్చిరి రూపాయకు రెండు శేర్లకందులనివా రుచెప్పుటచేతనొక్కడైనను కొనలేదు ఆకందులబస్తాలయజమానుడ గుకోమటి బజారుకుపోయి దొంగల మకాముపద్దకరగి పదితెనసా త్తేయని మెఱిగియుండియు దొంగలనుజూచి "కందులెట్లిచ్చెద" రని యడిగెను రూపాయకు రెండు శేర్లని వారు జబాబుచెప్పిరి "ఇంకను మీరు రాత్రిబేరములోనే యున్నారా? యిది పగటిబేరమునుమీ" యని నవ్వుకొనుచు వెడలిపోయెను

మహాపతివ్రత.

33. దేవదూతయైన మహమ్మదువారి కడపటికూఁతురిపేరుఫ తీమాబి ఆమెను మహమ్మదువారు తనపినతండ్రి కుమారుఁడైనఆలీ యను నతనికియిచ్చి వివాహముచేసెను మహమ్మదువారి తరువాత మహమ్మదీయ ప్రపంచములో దేవదూతయని సత్యసంధుఁడని మహ ర్షియని పేరుపడిన మహాత్ముఁ డీయాలీ యొక్కఁడే మహమ్మదీయు లాయనను హాజరతాలీ యనియు భార్యను హాజరత్ బీఫతిమాయని యు వ్యవహరింతురు ఫతిమాబీ సకలసద్గుణసంపన్నురాలయ్యు దేవ దూతయగు మహమ్మదువారి పుత్రిక యైనందుననో మరియేకారణ ముచేతనో, కొంచెము గర్వముగలదయి పతికుపచారములు నేయువిష యములో నించుక యశ్రద్ధచేయుచు వచ్చెను ఆలీ యదికనిపెట్టియా మె కావిషయమునఁ జిన్నపాఠము చెప్పవలయునని సంకల్పించెను. దానియింటికి సమీపమునసే గడ్డికోసికొని తెచ్చి యమ్ముకొని జీవిం చు పేదవాఁ డొకఁడుండెను అతనిభార్య మహాపతివ్రత ఆలీ యొక నాఁ డేదో ప్రసంగమున భార్యకు గర్వాపహరణము చేయవలెనని యిట్లనియె "ఆగడ్డివానిభార్య స్వర్గమునకు నీకన్నముందుగాఁ బోవు ను." ఆమాటవినగానే ఫతీమా మిక్కిలికోపము గలిగి "ఏమి! మహ మ్మదువారి పుత్రికనై యాయన తరువాత మహర్షియని పేరుఫడినఆ

లీకి భార్యనై యెంతో గొప్పదాననయిన నేను స్వర్గమునకు వెళ్ళక ముందే యానిరుపేదవానిభార్య వెళ్ళునా" యని తీవ్రముగఁబలికెను. ఆపలుకులువిని యాలి"అట్లనఁగూడదు. మీరిద్దరేక కాలమునందు స్వర్గమునకు బయలుదేరినను నీవెక్కిన లొట్టిపిట్టయొక్క కళ్ళెమయిన ను పట్టుకొని యాపేదరాలె స్వర్గములో ముందుగా నడుగు పెట్టును. సుమీ! ఇట్లు నేనెందుకంటినో నీవు తెలిసికొనఁ గోరుదేని యామె యింటికిఁబోయి చూడుము." అని బదులు చెప్పెను. ఆమాటలు ఫతీమాబీకి మిక్కిలి రోసముకలిగించెను. కాని యాపేదరాలి గొప్పతనమేమో చూచితీరవలెనని సంకల్పించి మరునాఁడుదయమునగడ్డివాని యింటికింబోయి తలుపుదట్టెను. గడ్డివానియిల్లాలు లోపలనుండిమెవరువారని యడిగెను. "నేను హాజరత్ బీఫతీమా" నని యామె బదులుచెప్పెను. మీరేలవచ్చితి' రని యామె మరల నడిగెను. మిమ్మును మీయిల్లునుఁ జూడవచ్చితినని వెండియు నామె యుత్తరమిచ్చెను. అప్పుడాపేదరాలు "అమ్మా! మీకు తలుపు తీయవలసినదని నాభర్తగారి యాజ్ఞలేదు. మిమ్ములోపలికి రానిచ్చి మీతోమాటాడవచ్చునని నాభర్తగారు సెలవిచ్చినపక్షమున రేపు తలుపుఁదీసి మీతో మాటాడెదను. కాబట్టి రేపొకసారి దయచేయుఁడు. ఈరాత్రి నేను నాభర్తగారితో మాటాడెద' నని లోపలనుండియె బదులుచెప్పెను. ఫతీమాబీబి గిరుక్కునమరలి గృహమునకుఁబోయి జరిగినవృత్తాంతము భర్తకెఱిగించెను. "కనిపెట్టిచూచి నేర్చుకో"యని భర్తబదులుచెప్పెను. ఫతీమాదేవి మరునాఁడు తనకుమారుఁడైన హసేనునివెంటఁబెట్టుకొని పేదరాలి యింటికిఁ బోయి యెప్పటియట్లు తలుపుదట్టెను.ఆమెయొక్క తెయే వచ్చినదనుకొని పేదరాలు వెంటనె తలుపుఁదీయవచ్చెను. కాని పిల్లవానిమాట వినబడుటచే నామె తలుపుఁ దీయక "అమ్మా! మీతోవచ్చినవారెవరని ప్రశ్న జేసెను. "మాపెద్దపిల్లవాఁడు

హూసేన్ వచ్చినాఁడని బదులుచెప్పెను. అప్పుడు పేదరాలు ‹అమ్మా! మీరువచ్చినప్పుడుతలుపుదీసిమాట్లాడవలసిన, దనినాభర్తగారు సెల విచ్చినారు. కాని, యొక మీపిల్లవాఁడుకూడవచ్చినప్పుడు తలుపుదీసి మాటాడవచ్చునో లేదో నేనెఱుఁగను ఈరాత్రి యీసంగతి వారి కె ఱిఁగించి యామెను రానియ్యవచ్చునన్నపక్షమున రేపు తలుఁపు దీసె దను. ఈవేళకు దయఁచేయుఁడు” అని తలుపుదీయకయే బదులు చె ప్పెను. ఫతీమా వచ్చినదారినె గృహమున కరిగి యావృత్తాంతము మ గనికి. జెప్పెను. కనిపెట్టిచూచి తెలిసికొమ్మని మగడు చెప్పెను మూ డవనాఁడు ఫతీమా తన పెద్దకుమారుఁడైన హసేనును, రెండవ కు మారుఁడయిన హుసేనును వెంటబెట్టుకొని పేదరాలియింటికిఁబోయి తలుపు తట్టెను.ఇద్దరు కుమారులతో వచ్చినట్లు సడికట్టి పేదరాలిట్ల నియె. “అమ్మా! నిన్నరాత్రి నాభర్తగారి నడుగగామిమ్ముమీపె ద్దకుమారుని లోపలకు రానియ్యవచ్చునని సెలవిచ్చినారు. మీరెండవ కుమారుని తీసుకొనిరమ్మని చెప్పలేదు. కాబట్టి యీరాత్రి యడిగి చెప్పెదను. రేపు దయచేయుఁడు.” అనవుడు ఫతీమా మరలగృహంబు నకుఁబోయి తనప్రాణేశ్వరున కాకథ చెప్పెను. కనిపెట్టిచూచి నేర్చు కొనుమని యతఁడెప్పటియట్ల బదులుచెప్పెను నాలుగవనాఁడామెగో త్రవారి నెవ్వరినిఁ దీసికొనపోక తనయిద్దరు కుమారులనుమాత్రమె దోడ్కొని యాగడ్డివానియింటికిఁ బోయెను. పేదరాలు నాఁడు తలు పు తీసికొనియే కూర్చుండెను. అందుకు కారణ మేమన వెనుకటిరా త్రి యిద్దరుకుమారులతో ఫతీమా వచ్చినప్పుడు తలుపు తీసిమాటా డ వ చ్చు నా య ని భా ర్య త న్న డి గె ను. అ తఁ డు భా ర్య మీఁ దఁ గో ప ప డి “ఏ మి ది ! మ హా ను భా వు రా ల యిన ఫతీమాదేవి నాయింటికివచ్చి నాగృహము పావనముచేయఁదల చు కొనుచుండఁగా మాటిమాటికి నీవేదో వంకబెట్టి యామెను రా

కుండఁ జేయుచున్నావు. ఆమె యెవరిని దీసికొని వచ్చినను సరె అడ్డు చెప్పక యెదురుగఁబోయి తీసికొనివచ్చి గౌరవింపుము" అనిమందలించెను. అందుచేత మరునాఁ డాతనిభార్య ఫతీమాదేవిరాక కెదురుచూచుచుండెను. ఆమెను జూడఁగానె పేదరా లెదుర్కొని మిక్కిలిగౌరవించి లోనికి దోడ్కొనిపోయి తమకున్న మంచియాసనముమీఁదఁ గూర్చుండఁ బెట్టెను. ఫతీమా యిల్లంతయు గలయఁ జూచెను సంసారము పేదదయినప్పటికి గృహమంతయు మిక్కిలి పరిశుభ్రముగ నుండెను. ఎక్కడ నుండవలసినవస్తు వక్కడనుండెను. ఒకమూల పట్టిమంచముండెను. పఱుపుపరచిన మంచము మరియొకమూల నుండెను ఒక మూలచద్దియన్నముచన్నీళ్ళునుండెను:ఒకచోటప్రొయ్యిమండుచుండెను పెనము దానిప్రక్కనేయుండెను. పెనముప్రక్క తడిపినగోధుమపిండి యుండెను. ఒకమూల నొకత్రాడు దూలమునకు వ్రేలుచుండెను. ఒక మూల బెత్తమొకటి చిలుకకొయ్యకు దగిలింపఁబడి యుండెను. ఫతీమా యవియెల్లఁ జూచి ప్రతివస్తువునుజూపి దీనియుపయోగ మేమని యడుగుచువచ్చెను పేదరాలిట్లుత్తరముఁ జెప్పెను. 'అమ్మా! నాభర్తగారలసి వత్తురుగదా! ఊరక కూర్చుండఁదలంచెన పట్టిమంచము పండుకొనఁ దలఁచుకొన్నయెడల పఱుపున్నమంచము. తినుటకు చద్దియన్నము. త్రాగుటకు చన్నీళ్ళు ఒకవేళ వేడిరొట్టెలమీఁద మనసుపుట్టెనా యిదిగో నిప్పు, అదిగో పెనము, ఇదే గోధుమపిండి నాలుగు రొట్టెలు గబగబ పెనముమీఁద వేసి యిచ్చెదను" ఆమాటలువిని ఫతీమా సంతోషించి సరె వీటిమాట తెలిసినది. ఆత్రాడెందులకు? ఆబెత్తమెందు' కని యడిగెను. ఆయిల్లాలిట్లనియె. 'అమ్మా! నా తెలివితక్కువవల్ల భర్తగారికి నామీఁద నెందుకయినఁ గోపమువచ్చెనా నన్ను స్తంభమునకు గట్టిపెట్టుటకు త్రాడు, నన్ను గొట్టుటకు బెత్తము ఎండబడివచ్చి బెత్తముకోసము త్రాడుకోసము ఆయన వెదకుకొనఁగల

రా?" ఈచివరమాటలు చెవినిబడగానే ఫతీమాదేవి మిక్కిలి యాశ్చర్యపడెను. ఆమెవంటి మహాపతివ్రత లోకములోనుండుట యసాధ్యమని నమ్మి యింటికి వెళ్ళెను. ఆసాయంకాలము భర్తయైన ఆలీ యింటికి రాఁగానే ఫతీమా విసనకఱ్ఱతీసికొని యాతనికి విసరి యుపచారములు చేసెను. ఆలీ తనమనసులో "ఇంతకాలమునుండి కాపురము చేయుచున్నను నాకెన్నఁడు నీమె విసరియెఱుఁగదు. ప్రాయశః గడ్డివాని భార్యం జూచి యీమె యీపాఠము నేర్చుకొనియుండు'నని తలంచెను. అదిమొదలుకొని ఫతీమా భర్తయొక్క యుపచారము ప్రధానముగ నెంచుకొనుచు వచ్చెను.

34. విశ్వబ్రాహ్మణులగురువు శిష్యులనుజూడ సంచారమునకు బయలుదేరి యొకగ్రామమునకు బోయి యొకవిశ్వబ్రాహ్మణునియింట జేరెను. ఆవిశ్వబ్రాహ్మణుఁడు మిక్కిలిపేదవాఁడు. సపరివారముగా వచ్చినగురువును దగినట్లాదరించి భిక్షలు సేయుటకతనికి సామర్థ్యము లేకపోయెను. కాని గురువునకు తనమీఁదఁ గోపమువచ్చునేమో యనుభయమున తన యింటనే యుండుమనికోరెను. తనకేవిధమైన వ్యయము లేకుండ కాలక్షేపము చేయవచ్చునని గురువు సంతోషించి యుండెను. గురువుకడ బంగారపు శివవిగ్రహముండెను. గురువు కొంచెము బద్ధకముచేత విగ్రహమును పూజింపక యావిశ్వబ్రాహ్మణునే పూజనిమిత్తము నియోగించెను. ఆవిశ్వబ్రాహ్మణుడందుకు సమ్మతించి గురువునకు పరివారమునకు కావలసినసొమ్ము తనదగ్గర లేకపోవుటచేఁ బ్రతిదినము బంగారువిగ్రహమునుండి యొకముక్క తెగఁగొట్టి తీసి యదివిక్రయించి కర్చుపెట్టి పిండివంటలతో భోజనము పెట్టుచుండెను శిష్యుఁడు స్వార్జితమైన విత్తముచేత తనకు విందులు పెట్టుచుండెనని నమ్మి సుఖముగా భోజనము సేయుచుండెను. అదివఱకొక పూటకైన గతిలేని యాతఁడు దినమునకు మూఁడునాలుగురూపాయ

లు వ్యయముచేయుట చూచి మిత్రులనేకులు ‹నీవాసొమ్మెక్కడ తెచ్చుచున్నా'వని యడిగిరి. అతఁ డిట్లు బదులు చెప్పెను. ‹ఎవరికైనను దేవుఁడేకదా యివ్వవలసినది. నాకు దేవుఁడే యిచ్చుచున్నాఁడు. అది విని తనశిష్యుఁడు పరమభాగవతోత్తముఁడగుటచే భగవంతుఁడనుగ్రహించి డబ్బిచ్చుచున్నాఁడని తలంచెను. ఒకనెల గడచినతరువాత గురువు మఱియొకగ్రామమునకుఁబోవఁ బ్రయాణమై తనవిగ్రహమడిగి పుచ్చుకొని యది మిక్కిలిపలుచఁబడి యుండుటఁజూచి ‹ఇదియేమి నా విగ్రహము మిక్కిలిపలుచగానున్నది. దీనిలోని బంగారము తెగఁగొట్టియమ్ముకొని కర్చుపెట్టితివా, యని శిష్యునడిగెను. ఎవరికైనను దేవుఁడేకదా యిచ్చువాఁడు. మీకిచ్చినను దేవుఁడే. నాకిచ్చినను దేవుఁడే. ఈబంగారపుదేవుఁడే యిచ్చినాఁడు. ఈవిషయమై మీరధికప్రసంగములు చేయవద్దని యతఁడు బదులుచెప్పెను.

౩౫. ఒకమనుష్యుఁడు గ్రామాంతరముననున్న తనచుట్టమునకు మంచిమామిడిపండ్లు నూరు బుట్టలో పెట్టి యొక కూలివానిచేతికిచ్చి యొక జాబుకూడ వానికి వ్రాసి యిచ్చిపంపెను. ఆజాబులోనూరుపండ్లు పంపినట్లుండెను. కొంతదూరము పోయినతరువాతఁ గొన్నిపండ్లు తినవలెనని కూలివానికి సంకల్పము కలిగెను. జాబులో నూరుపండ్లు పంపినట్లున్నది గనుక తక్కువైనపండ్లు తానుతిన్నట్లుజాబుతప్పక చెప్పునని శంకించి యాజాబు చూడకుండ తాను తిన్నపక్షమున రహస్యమెవ్వరికిఁ దెలియదని తలంచి వాఁడు జాబుతీసికొనిపోయి యిసుకలోఁ గప్పిపుచ్చి కావలసినన్ని మామిడిపండ్లు తిని మరల నిసుకలోనుంచి జాబుతీసి తక్కినపండ్లు పట్టుకొని యాగ్రామమునకుఁ బోయి జాబు చుట్టముచేతికిచ్చి పండ్లక్కడఁ బెట్టెను. చుట్టమాజాబును తీసికొని పండ్లు లెక్కపెట్టుకొని తక్కువయున్నవేమియనియడిగెను. ‹ఏమోనే నెఱుఁగనని కూలివాఁడు బదులుచెప్పెను. జాబులో నూరుపండ్లుపంపి

నట్లున్నదే ఏల తక్కువరావలెనని యతఁడు గట్టిగా నడిగెను. ‹అయ్యో! జాబిసుకలో గప్పిపుచ్చి నేను తిన్నానుగదా యీసంగతి జాబెట్లు చూచెను. ఎట్లు వీనితోఁజెప్పె› నని యాశ్చర్యపడి విధిలేక తానుచేసిననేర మొప్పుకొనెను.

36. తెలివిమాలిన యొకానొక రాజుకడకు హాయిగా సంగీత ము పాడఁగలయొకసాతాని పోయి తనగానకళా ప్రభావముచేత రాజును సభాసదులను మెప్పించెను. రాజు వాని గానమునకు మెచ్చి పరమానంద భరితుఁడై సాతానితలకు మల్లెపూదండలు చుట్టవలసినదని యాజ్ఞాపించెను. ‹అయ్యా! ఇతనిది బోడితల. వెండ్రుకలు లేకపోవుటచే దండలు చుట్టుటకు వీలులేదని సేవకులు మనవిజేసిరి. అనవుడు రాజిట్లనియె. "తలవెండ్రుకలు లేనంతమాత్రమున మనము దండలు చుట్టక మానుదుమా? నెత్తిమీద నొకపొడుగుపాటి మేకుగొట్టి దండలు చుట్టవలెను." ఆపలుకులువిని సాతాని భయపడి గౌరవమక్కఱలేదని పారిపోయెను. మూర్ఖులకు దయవచ్చినను, కోపమువచ్చినను కష్టమేకదా!

37. వేసఁగికాలములో నొకనాఁడొక గ్రామము పరశురామప్రీతి యయ్యెను. ఆగ్రామమందున్న పండితులందఱు దేవాలయములోఁజేరి సభచేసి ‹యేయగ్నివలన గ్రామము దగ్ధమైనది? ధార్మ్యాగ్నివల్లనా? తస్కరాగ్నివల్లనా? యనిచర్చచేసియుభిప్రాయభేదములుగలిగి వివాదపడఁజొచ్చిరి. ధార్మ్యాగ్ని యనఁగా యజ్ఞసంబంధమైననిప్పు తస్కరాగ్నియనగా దొంగలు పెట్టిననిప్పు. ఆవివాదమువిని గ్రామమందలి లౌక్యుఁడొకఁడు లేచి యిట్లనియె. ‹ధార్మ్యాగ్నివల్లనైననేమి తస్కరాగ్నివల్లనైన నేమి? గ్రామము తగులపడిపోయినది. వ్యర్థవాదములు చేసి కాలముపాడుచేయకలెండి.

మూర్ఖులు ప్రస్తుత విషయమునుగూర్చి పరిసంగింపక యప్రస్తుత విషయములఁగూర్చి చర్చించి వృధాకాలక్షేపము చేయుదురు.

38. ఒకయూర నిద్దరు సోదరులుండిరి. అందుఁ బెద్దవాఁడు దరిద్రుఁడు; రెండవవాఁడు సంపన్నుఁడు. కనిష్ఠుఁడు భాగ్యవంతుఁడయ్యు జ్యేష్ఠున కేవిధమైన సహాయముం జేయక యన్నగారిబ్బందిపడుచుండగా తానె సకలసౌఖ్యము లనుభవించుచుండెను. పెద్దవాఁడు తనయాలుబిడ్డలఁ బోషింపలేక నానాబాధలు పడుచు నొకనాఁడు భార్యం జూచి "నేను దేశాంతరమువెళ్ళి యేదియైన నుద్యోగము సంపాదించి కాని యాచనావృత్తిచేతఁ గాని ధనము సంపాదించుకొని వత్తును. దారిలో నాకాఁకలియైనప్పుడు తినుట కేదియైనఁ జేసియి" మ్మని చెప్పెను. సరేయని భార్యసంతోషించి తనమంగళసూత్రము తాకట్టుపెట్టి రూపాయి తెచ్చి మినుపసున్నియుండలు చేసియిచ్చెను. ఆయుండలు మూటఁగట్టుకొని యాదరిద్రుఁడు నిరంతర ప్రయాణములు చేసి యొకనదీతీరమునఁ జేఱి యచ్చటనున్న వెదురుపొదక్రిందఁగూర్చుండి వంగియున్న యొకవెదురునకుఁ దనమినుపసున్నియుండల మూటఁగట్టెను. ఆవెదురుగడ యెండ యెక్కినకొలది పైకిలేచి నిటారుగా నిలిచెను. అంతట బ్రాహ్మణుఁడు మినుపసున్ని తినవలెనని తలంచెను గాని యది వెదురుచివర నుండుటచేఁ జేతికందకపోయెను. అంతలో గంధర్వస్త్రీలు కొందఱాకాశ మార్గమునఁ బోవుచు వెదురు చివరనున్నమూటఁ జూచి అదియేమిటో యని పరీక్షించి యాయుండలుజూచి యవి నోటవైచుకొని మిక్కిలిరుచిగానుండుటచే సంతసించి యాయుండలున్న గుడ్డలో నొకబంగారపు గిన్నె కట్టి వెడలిపోయిరి. వెదురు క్రిందికి వాలినతరువాత సున్నియుండలు తినవలెనని గంపెడాసతో బ్రాహ్మణుఁడు కూర్చుండెను. కొంత సేపటికి వెదురువాలెను. మిక్కిలి యాత్రముతో బ్రాహ్మణుఁడు మూఁటవిప్పి చూచెను. అందులో

సున్ని యుండ యుండుటకుమారుగా నొకబంగారపు గిన్నెయుండెను ఆగిన్నె బోర్లించి యొకసారి క్రిందఁబెట్టగా పంచభక్ష్యపరమాన్నముల తో నిండిన యొకవిస్తరి యక్కడఁగనబడెను. బ్రాహ్మణుఁడాఁకలితీరు నట్లు భుజియించి మహానంద భరితుఁడై యాగిన్నె దీసికొని యింటికిఁ బోయి భార్యకావృత్తాంతముఁ జెప్పెను. గిన్నె బోర్లించినపుడెల్ల భ చ్యములగు పదార్థములతో నిండిన యొక విస్తరి వచ్చుచుండెను. దానితో బ్రాహ్మణుని దరిద్రము తీరిపోయెను. ఇంటిలో వంటఁజేసి కొననక్కర లేకపోయెను. శ్రమలేకపోయెను ఎందరుచుట్టములు వచ్చి నను లెక్కలేకపోయెను. కొన్ని దినములైనతరువాత బ్రాహ్మణుఁడు గ్రామవాసులకందఱ కొకసంతర్పణము చేసెను. భోజనార్థము వచ్చిన వారందఱుఁ గూర్చున్నతరువాతఁ బ్రతివానియొద్దకుఁ బోయి యితఁ డు గిన్నెబోర్లించుచుండెను. గిన్నెతీసినతోడనే రసవంతములైనపదా ర్థములతో నిండినవిస్తరి సిద్ధమగుచుండెను. వచ్చినవారందఱుఁ గడు పార భుజించి యాగిన్నె సంపాదించినందు కతని నెన్నోవిధములఁబ్ర శంసించి పోయిరి. ఆబ్రాహ్మణునితమ్మునిభార్య బావగారికాగిన్నె దొరికినందుకసూయఁ జెంది యటువంటిగిన్నె సంపాదింపవలెనని మ గనిని బలుతెఱఁగుల వేధించెను, ఆపోరు పడలేక యతఁడన్నకడకుఁ బోయి గిన్నె యెట్లుదొఱకెనని యడిగెను. అతఁడు జరిగినవృత్తాంత మంతయు దాపక తమ్మున కెఱింగించెను. అతఁడుఁగూడ భార్యప్రో త్సాహముచేతఁ తనయన్న వెళ్ళినచోటికె పోయి యటువంటిగిన్నె సంపాదించుకొని రావలెనని నిశ్చయించుకొని దారిలోఁ దినుటకేమైన నిమ్మనియడిగెను. భార్య రెండుమానికల యటుకులు మూటగట్టియి చ్చెను. ఆమూఁటదీసికొని యతఁడు మునుపు తనయన్న వెళ్ళినచోటి కె పోయి యావెదురుక్రిందనే గూర్చుండి యందొక వెదురుచెట్టునకా మూటకట్టెను. వెదురెప్పటివలెఁ బైకిలేచెను. ఎప్పటివలె గంధర్వ

స్త్రీలు వచ్చిరి. మూటవిప్పిరి. గుప్పెడటుకులు నోటవేసికొనిరి. అవి వారికి రుచింపలేదు. అందుచేత వారొక రాగిగిన్నె యాగుడ్డలోఁగట్టి వెడలిపోయిరి. వెదురుకిరిందికి వారిలినతరువాత బ్రాహ్మణుఁడు విప్పి చూచుకొని దానిపరిభావము పరీక్షించి చూడక యింటికిఁబోయి భార్యకావృత్తాంతముజెప్పి గిన్నెఁజూపి యన్నగారిగిన్నెవలెనే యది కూడఁ బంచభక్ష్యపరమాన్నముల నిచ్చుననుకొని మరునాఁడు గ్రామమందలి బ్రాహ్మణులందఱఁ బిలిచి సంతర్పణచేయదలఁచెను. బ్రాహ్మణులందఱు వచ్చిరి. అతఁడు మొదటిబ్రాహ్మణునిదగ్గర గిన్నె బోర్లించెను. గిన్నెతీయఁగానె పదిమంది మంగలవాండ్రు దానిలో నుండి పుట్టిరి. పదునుకత్తులతో నిండిన పొదులు వాళ్ళచంకలలోనె యుండెను. ఆమంగలవాండ్రిచ్చటఁ జేరినబ్రాహ్మణుల నందఱఁ బట్టుకొని క్షౌరముఁజేసి యంతతోఁదనవినోందక వచ్చినముత్తైదువుల తలలుగూడగొరిగి లేచిపోయిరి. నవ్వినవారునవ్విరి. ఏడ్చినవారేడ్చిరి. కొందఱు కోపించిరి. కొందఱు తిట్టిరి. దురాశ దుఃఖము చేటన్న సామెత నిజమని యెల్లవారుఁ దలంచిరి.

39 ఆంధ్రదేశస్థుఁడైన బ్రాహ్మణుఁడొకఁడు పునహాసతారాలకువెళ్లి కొంతకాలమచ్చటనుండి మరల హైదరాబాదుదారిని స్వదేశమునకు వచ్చుచుండెను. హైదరాబాదురాజ్యములో తురకలెక్కువ గనుక నతఁడొకనాఁడు సాయంకాలమొక గ్రామసమీపమున నడుచుచుండనిద్దఱు తురకలు తప్పదాగి యీ బ్రాహ్మణునిఁ బట్టుకొని సంగీతము పాడుమని నిర్బంధించిరి. వారికెంతమాత్రము తెనుఁగు రాదు. ఈబ్రాహ్మణునకు నాలుగు హిందూస్థానీముక్కలు వచ్చియుండుటచేత వారిమాట తెలిసికొనఁజాలెను. తనకు సంగీతము రాదని యెన్ని విధములఁ జెప్పినను వారు వినక బలవంతపెట్టుటచే గత్యంతరము లేక యక యతఁడీ క్రింది విధమునఁ బాడెను.

‘రాదంటే పాడుమంటరు రండాకొడుకులు ఇదేమి కాలమహి మ’ అనుపల్లవివైచి రాగజ్ఞానము లేకపోయిన నేదోయొక రాగము పెట్టి ‘సరిగమ రిగమ’యని స్వరకల్పనచేసి లయ తెలిపోయినను చేతులతో నేదోవిధమైన తాళమువైచి గాలక్షేపము చేసెను. సాహేబులా సంగీతము విని మిక్కిలి సంతసించి ‘వహావ్వా వహావ్వా’ యని పదిసారులని వానికి సంగీతరావు అని పేరుపెట్టి రెండువరహాలు చేతిలో బెట్టిపోయిరి.

మూర్ఖులకు దమపంతము చెల్లించుకొనుటే ప్రధానము గాని రసమక్కరలేదు.

40. ఒకమహారాజుయొక్క యాస్థానములో వీరవైష్ణవ పండితుఁడొకఁడు, వీరశైవపండితుఁడొకఁడుగలరు. అన్నియభిప్రాయములయందు వారిద్దరు విరుద్ధముగానుండుచువచ్చిరి. ఒకనాఁడు మహారాజుగారు వారిద్దరజూచి “లోకములో వైష్ణవులెక్కువమంది యున్నారా శైవులెక్కువమంది యున్నారా” యనియడిగెను. ‘శైవులే యెక్కువమంది యున్నా’రని శైవుఁడు చెప్పెను. అదినిజమని సభాసదులందఱుఁబల్కిరి. తనవారు తక్కువమంది యున్నారని సభలోఁ జెప్పబడినందున వైష్ణవుఁడు తనకు బరాభవము జరుగుచున్నదని యభిమానమున “మహారాజ్! గరుడపక్షులెక్కువ యున్నవా! గ్రద్దలెక్కువ యున్నవా” యనియడిగెను. గ్రద్దలె యెక్కువయున్న’వని రాజును సభాసదులునుబల్కిరి. శైవులు గ్రద్దలవంటివారు వైష్ణవులుగరుత్మంతులవంటి వారని భావము తేల్చుటచే శైవులు కోపించి రాజుతో ‘మహాప్రభు? ఊరంత మాలపల్లెయుండునా’ యని బదులుచెప్పిరి. ఊరుపెద్దదిగాను మాలపల్లె చిన్నదిగానునుండును’ అని సభాసదులనిరి. ఆమాటలకుఁ బ్రత్యుత్తరముచెప్పలేక వైష్ణవుండూరకుండెను.

41 ఒకరాజు సభలో నొక నియోగికవీశ్వరునితో నొకవైదికకవికి వివాదమువచ్చెను. నియోగికవి మిక్కిలి బుద్ధికుశలత గలవాఁడగుటచే వైదికిని మెల్లమెల్లగా వానికిరాని శాస్త్రములలోదింపి యోడించెను. రాజసభలోగౌరవమంతయు నియోగికవికిఁ గలిగెను. అప్పుడు వైదికుఁడు తనకు సమయోచితబుద్ధిని కలిగింపనందుకు మిక్కిలి దుఃఖించి సరస్వతి నుద్దేశించి యీక్రింది పద్యము చెప్పెను.

క. జిలిబిలి పలుకుల వెలఁదీ
పలుగాకి నకారగుండ్ల పాలయితిగదే
యిలలో వైదిక విద్వ
త్తిలకంబుల కేదిదిక్కు తెలుపఁగదమ్మా.

42 ఒక యాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు పూర్వకాలము కొండవీటిసీమనేలుచుండిన యనవేమరాజుయొద్దకుఁ బోయి స్తోత్రపూర్వకముగ నాతనిమీఁద నీక్రింది శ్లోకముఁ జెప్పెను.

అనవేమమహీపాల । స్వస్త్యస్తుతవబాహవే
అహవేరిపుదోర్దండ । చంద్రమండల రాహవే.

ఈశ్లోకార్థమిది ఓ యనవేమరాజా! యుద్ధమందు శత్రువుల భుజాదండ మనెడు చంద్రమండలమునకు రాహువైన నీబాహువునకు శుభమగుఁగాక! ఆశ్లోకము విని యనవేమరాజు కవీశ్వరునకు వేయి రూపాయల బహుమాన మిమ్మని యానతిచ్చెనఁట కవి యందుకుసంతుష్టినొందక యాసొమ్ము తానుబత్తెకర్చులక్రింద వ్యయముచేసినసొమ్మునకు సరిపోయినదని చెప్పెను అదివిని రాజు మఱియొక వేయిరూపాయ లిమ్మనెను. కవి యప్పటికిని సంతసింపక నాదేశమునకు తిరిగి పోవుటకు బత్తెఖర్చులు వచ్చినవని పలికెను కవిని సంతోషపరచవలెనని రాజు మూఁడువేలిమ్మని పలికెను అప్పటికిఁ దనివినొందక కవీ

శ్వరుఁడు నేను నాలుగువేలుమీా కిచ్చియుండగా మూఁడువేలుమాత్ర
ము మీరు నాకిచ్చెదరా? యని యడిగెను. రాజు విస్మితుఁడై నీవు
నాలుగువేలు నాకెట్లిచ్చితివని ప్రశ్నచేయ కవి యిట్లనియె 'రాజా! నే
ను మీాకు నాలుగు 'వే' యను నక్షరము లిచ్చితిని. వేమమహీపాలా
యన్నపు డొక వే యున్నది బాహావే, ఆహావే రాహావే యను పద
ములలో తక్కిన మూఁడువేలున్నవి ఇవియే నాలుగువేలు' రాజువా
నియుక్తికి మెచ్చి నాలుగువే లిమ్మని యానతిచ్చెను గడుసరి యగు
నాకవీశ్వరుఁడు మీాసంస్థానములో మాదిమాకిచ్చుట మడిమాన్యము
లిచ్చుటయైనది కదా యనెను అట్లయిన కవీశ్వరున కైదువేలిచ్చియా
పలకు పంపుఁడని వేమభూపాలుఁడు మంత్రులతోఁ జెప్పెను కవీశ్వరుఁ
డది విని 'రాజేంద్రా! మేమాఱువేల నియోగులము ఆఱువేలవారి
కైదువే లిచ్చుట యేటి న్యాయమని యడిగెను రాజు పక్కున నవ్వి
మారు మాటాడక నీయాఱువేలు నీవుపట్టుకొని పొమ్మని బదులుచె
ప్పెను: మీావంటి రాజదర్శనము చేసినందుకు మాకులగోత్రములైన
నిలిచినవి నయమేయని పరిహాసముగాఁబలికెను అనవేమభూపాలుఁడు
కవి సమయోచితబుద్ధికి సంతసించుచు వాని కేడవవేయికూడ నిమ్మని
సెలవిచ్చెను ఆమాటలు రాజునోటనుండి వెడలిన తోడనె కవిరాజు
—'దేవా! ఏడు రోదనసంఖ్య అది మీాకును నాకునుఁగూడ జయము
కాదు కావున దానిని తలపెట్టకుఁడని మనవిచేసెను అట్లయిన నెనిమి
దివేల రూపాయలఁదీసికొని మారుపలుకక పొమ్మనియనవేమభూపా
లుఁ డానతిచ్చెను కవీశ్వరుఁడు" చిత్తము నేనిప్పుడు సంపూర్ణముగ
సంతుష్టుఁడనైతి" నని యాధనము పుచ్చుకొని స్వగ్రామమునకు
బోయెను

43 భద్రాచల సమీాపముననున్న మధ్యప్రదేశములలోఁబూ
ర్వము కొటారియుఁడను మన్నెపురాజొకఁడుండెనఁట నాలుగుశాస్త్ర

ములం జదువుకొని సంస్కృతాంధ్రములందసమానముగఁగవిత్వముఁ జెప్పఁగల యొక పండితుఁడు కాటారియుని దర్శనమునకుఁ బోయిమం చికల్పనలతో వానిమీఁద నెన్నో పద్దెములఁ జెప్పెనట. ఆకోయరా జున కందొక యక్షరమయిన నర్థముకాకపోవుటచే వాఁడు కవీశ్వరున కొక్క చిల్లిగవ్వయైన నీయక వానితో సరిగమాటలాడక మొద్దువలె గూర్చుండెను. కవీశ్వరుఁ డారాత్రి యింటికిఁ బోయి తనపడిన శ్రమ యంతయు వ్యర్థమయినదని విచారించి యారాజున కర్థమగునట్టిపద్య ములు చెప్పవలెనని కృతనిశ్చయుఁడై మరునాఁడు వాని యెదుటికిఁ బోయినప్పు డీక్రిందిపద్యముఁ జదివెను.

"కాటారియుఁడు దొడ్డవాఁడు క ఖ గ ఘ జ
ఛేటు పాటు యెఱుఁగడయ్యా చ ఛ జ ఝ ఞ
ట ఠ డ ఢ ణ, త థ ద ధ న
ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ, చీవహ్యా.

ఆపద్యము వినఁగానే కాటారియుఁడుగారి కెక్కడలేని సంతోషము కలిగెను. అందలి యర్థమంతయు నాయనకు చులకనగా నవగాహన మగుటవల్ల నూటపదునారులు బహుమతి యిచ్చి పంపెను.

44. గోలకొండ నవాబులు తెనుఁగు గవుల కప్పుడప్పుడు ప్రో త్సాహము కలిగించుచువచ్చిరి. దీని కుదాహరణము లనేకములు గల వు. పొన్నగంటి తెలగనార్యుఁడు తనయచ్చ తెనుఁగు ప్రబంధమగు యయాతిచరిత్రమును గోలకొండ నవాబు దర్బారులోనుండినయమీా రుఖానువ కంకితము చేసెను. గోలకొండకు మల్కిభరాము నవాబుగా నున్నకాలమునఁ దెనుఁగుకవులు కొందరు వానికడకుఁ బోయి వాని మీఁద ననేకపద్యములఁ జెప్పిరి. ఆపద్యములు కల్పనాప్రౌఢిమ గలిగి మిక్కిలి సుందరముగా నుండినను నవాబు వానికర్థమును గ్రహింప లేక యివి మెచ్చుకపోయెను. ఆకవీశ్వరులతో నెంతమాత్రము పోలిక

లేని యొకనియోగి యాసంగతి కనిపెట్టి నవాబుదయ సంపాదించుకొ నుట కుపాయము వెదకి యీక్రింది పద్యము చదివెను.

క. కరయుగములు చరణంబులు
నురము లలాటస్థలంబు నున్నత భుజముల్
సరి ధరణి మోపి మ్రొక్కిరి
మఱిమఱి నీశత్రుజనులు మల్కిభరామా.

ఇందు నాలుగవ పాదముదక్క తక్కినదంతయుఁ బూర్వ మె వరో చెప్పినపద్యమే. ఈపద్యమువిని నవాబు దానియర్థము తనకుం జెప్పుమనియెను. శత్రురాజులందఱు కాళ్ళు చేతులు భుజములు మొ గము వక్షస్థలము నేలఁ దగులునట్లు నమస్కారము చేయుచున్నారని కవి యర్థము చెప్పెను. అందలి యర్థము స్పష్టముగా దెలిసినందున నవాబు మిక్కిలి సంతోషించి యతనివంటి కవీశ్వరుఁడు తన్నుఁజూడ వచ్చినవారిలో లేఁడనుకొని వానికి వేయి నూటపదహారు రూపాయ లును దుశ్శాలువలును బహుమాన మిచ్చి పంపెను.

45. ఒక గురువునొద్ద ననేకులు కావ్యములు చదువుకొని కవ నము చెప్పనారంభించిరి. ఆశిష్యులలో గంగన్న యనుకోమటికూడ నొ కడుండెను. గురువు శిష్యుల కందఱకు గణ యతి ప్రాస లక్షణములు చెప్పి యవివారు నేర్చినపిదప నొకనాటిరాత్రి వెన్నెలలోఁ గూర్చుండి శిష్యులందఱిం బిలిచి యొకొక్కక్క డొకొక్కక్క పద్యము చెప్పవల యునని యాజ్ఞాపించెను. అందఱన్నిపద్యములం జెప్పి గురువున కానం దము కలుగజేసిరి కాని గంగన్నమాత్రము పద్య మల్లలేకపోయెను. గురువుగారు మాటిమాటికి వానిం ద్వర పెట్టుచుండుటచే నతఁడారా త్రిని వర్ణింపదలచి మొదటిపద్యములో నీక్రింది రెండుపాదములు జెప్పెను. పున్నమవెన్నెలగాసెగా! పొన్నపై గోయిల కూసెగా" ఆచ రణములు రెండు ముగిసినపిదప వాని కేమియుందోచలేదు. శిష్యులు

నవ్వ మొదలుపెట్టిరి. గురువు చీవాట్లువేయ నారంభించెను. అప్పుడు గంగన్న యేమియుం దోచక "అంగట్లో గుగ్గిళ్ళు పాసెగా" యని మూఁడవపాదము చెప్పెను. గంగన్న గుగ్గిళ్ళవర్తకము చేయుచున్నందున తన యంగడిలో పాసిపోయిన గుగ్గిళ్ళనుగూర్చి యాపాద మల్లెను. ఆపాదము వినినతోడనే గురువుగారికి శిష్యులకు మహాశ్చర్యము సంతోషము కలిగెను. అప్పుడు గురువు వాని నెగతాళి చేయుటకై నాలవపాదము తానే పూర్తిచేయదలంచి "గంగన్న నీముండమోసెగా"యనియె శిష్యులందఱు పకపక నవ్విరి. గంగన్న గురువు తన్నెగతాళి చేసినట్లెఱుఁగక యెట్లో పద్యముగూర్చి బయటపడితినని సంతోషించి గురువుగారితో "స్వామీ! ప్రతిపాదాంతమునందు ప్రాస సరిగా సరిపోయిన"దని యానందించెను.

46. ఇప్పటికి రమారమి యాఱువందల యేండ్లకిందట కొండవీటిసీమ ననవేమారెడ్డి పాలించుచుండెను. అతడు కవులకేగాని సంభావన నిచ్చుటలేదని ప్రతిజ్ఞచేసెనట వేదముచదువుకొన్న యొకబ్రాహ్మణుఁడు కవిత్వముఁజెప్పి రాజును మెప్పింపశక్తిలేక గృహమందన్నము లేక యాలుబిడ్డలతోఁగలసి మలమల మాడజొచ్చెను. ఆయన యిల్లాలు బిడ్డలాకలి యాకలి యని యేడ్చుచున్నందున వారి దుర్దశజూడ లేక మగని బిలిచి "యీదినమున మీరు కవిత్వము జెప్పి రాజువద్ద సంభావన దెచ్చినగాని మన కన్నములేదు. అంతవఱకు నేను పోయిలో నిప్పువేయుటకు వీలులేద"ని చెప్పెను. ఆబ్రాహ్మణుడు సరేయని కవిత్వముఁ జెప్పనిశ్చయించుకొని యుదయము మొదలు సాయంకాలము లోపుగా పద్యములో మూడుపాదములల్లి నాల్గవపాదముచాలక సాయంసమయమునసంధ్యవార్చుకొనుచు వెలితియైనపాదమాలోచించుచుగూర్చుండెను. అప్పుడుభార్యవానింజూచిపద్యముపూర్తియైనదా యని యడిగెను. ఒకపాదము తక్కువ యున్నదని మగఁడుత్తర

ము చెప్పెను. ‹ఒక్క పాదమున కంత విచారమెందుకు? సంధ్యావం దనములోని దొక్కముక్కదీసి యందులోవేసి పాదముపూర్తిచేయ రాదా' యని భర్తకు భార్య హితోపదేశముఁ జేసెను. ఆముపదే శమునకు మగఁడు చాల సంతసించి యీక్రిందివిధమున శ్లోకముఁ జెప్పి భార్యకు వినిపించెను.

శ్లో॥ అనవేమ మహీపాలా చూపులుంగడు లెస్సలున్, యుద్ధమందు మహాశూర్లు,
శహబాసునే భలాముండా, జియోయోనః ప్రచోదయాత్॥

ఆపద్యము విని భార్య శహబాసునే భళాముండయని యేల వ్రాసినారని యడిగెను. అందుకు మగఁడు భార్య కిట్లనియె. ‹ఒక్క పాదము తక్కువయినిదని నేను చెప్పగా సంధ్యావందనములోనిదొ కముక్క వేయుమని నీ వాలోచన చెప్పితివి. అంత సమయస్ఫూర్తి గలిగి నీవు నాకాలోచనచెప్పినందుకు నీకీర్తి లోకములో నుండవల యునని నిన్ను మెచ్చుకొనుటకయి యాపాదము వేసితిని. ఆపలుకులు విని భార్య మిక్కిలి సంతోషించి మగని తెలివికి మెచ్చు కొనెను. మరునాఁడు బ్రాహ్మణుఁ డుదయమున లేచి పద్య మునుఁ దాటియాకు మీద వ్రాసి రాజదర్శనమునకుఁ బో యెను. మంచికవీశ్వరుఁడె యనుకొని రాజు వానిని మన్నించి పద్యము జదువుమని యడిగెను. బ్రాహ్మణుఁ డాయవకతవక పద్య మునుఁ జదివెను. చదివినతోడనె పొట్టలు తరుగునట్లు నవ్విరి. రాజు వాని బేలతనమునకు మిక్కిలి జాలినొంది బ్రాహ్మణుని బిలిచి "స్వామీ! యిట్టి కవిత్వము మీరెన్నఁడు చెప్పవద్దు. మీకుసంవత్స రమునకుఁ గావలసిన గ్రాసమంతయు నేను బంపెదనని చెప్పి యతనిం బంపెను. ఏవెట్టి కవిత్వముఁ జెప్పిననేమి, తన మనోరథము నెరవేరినది కదా యని బ్రాహ్మణుఁడు సంతసించుచుఁ బోయెను.

47 నూజివీడు సంస్థాన ప్రభువగు నరసింహ అప్పారావుగారు మహాదాత. ఆయనను గీర్తించని బైరాగులు గోసాయిలులేరు. ఆమహాత్ముఁడు బ్రాహ్మణులకెన్నోవందల పుట్లభూమి దానముచేయుటచేత మంత్రులు యాచకులకు వాని దర్శనముగానీయక పోయిరఁట. ఒక కవీశ్వరుఁడు నూజివీడుబోయి చాలకాలము రాజదర్శనార్థముకనిపెట్టుకొనియుండ నొకనాఁడు రాజు పల్లకీయెక్కి తలుపులుమూసికొని యెక్కడికో బోవుచుండెను. అదిరాజు పల్లకీయని తెలిసికొని కవి తలుపులు తీయించుటకు దగిన యుపాయము వెదకి యీక్రిందివిధముగా పద్యముఁ జదివెను.

చ. వెలమ కులంబునందు నిలు వెళ్ళరు కాంతలనంగ విందు న
 ప్పలుకులబధమాయె ... ... ... ...

అని పద్యమంతయు చదువక కొంతభాగము జదివి యూరకుండెను. వెలమవారియింటి యాఁడువాండ్రు గృహము వెడలరని యిదివఱకు వింటి. ఆపలుకులబద్ధమాయెగదాయని యాపద్య భాగముయొక్క యర్థము. అదివినగానే యప్పారావునకు మహాకోపము వచ్చెనట. వచ్చినతోడనే యతఁడు పల్లకీయాపి యాపద్యముం జదివిన వాని జుట్టుపట్టుకొని తనయొద్దకు దీసికొని రమ్మనియానతిచ్చెను సేవకులట్లే చేసిరి. కవీశ్వరుఁడు రాజదర్శనముకాగానే పద్యము పూరింపదలఁచి యిట్లు జదివెను.

చ. వెలమ కులంబునందు నిలు వెళ్ళరు కాంత లనంగవిందు న
 ప్పలుకు లబద్ధమాయె కుల పాలక ధీమణి యప్పరాయ రా
 ట్కలభముకీర్తికాంతకృతి కాంతమహాజయకాంతమువ్వురున్
 గలజగమంతయున్ దిరు గఁగా గనుగొంటిమి చిత్రమిద్ధరన్.

కులశేఖరుఁడయిన యప్పారావుయొక్క కీర్తికాంతకృతికాంత, జయకాంత, యనుముగ్గు రాఁడువాండ్రు విచ్చలవిడిగ లోకమంతయుఁ

దిరుగుచున్నాగని యర్థము. రసవంతమయిన యీపద్యమువిని య ప్పారావు కోపమువిడిచి యనుగ్రిహము(పూని నూట పరియాఱు రూపాయలు వానికి బహుమానము యిప్పించి పద్యమీవిధముగా నేల యారంభించితివని కవినడగెను. కవి యిట్లనియె. ‹అట్టి పద్యము(జెప్పి మీకు రోషము( దెప్పించనియెడల మీరు పల్లకి తలుపులు తియ్యరు నాకు మీదర్శనముకాదు. అందుచే నట్లు పద్యమారంభించితిని., అన వుడు రాజు కవియుక్తికి మిక్కిలి సంతసించిపోయెను.

48 పెద్దాపుర సంస్థానమందు బూర్వము పరికాశరాయుడను పేరుగలమంత్రియుండెను. ఆయన వ్రాసియిచ్చిన యీనామములకు పన్నులుగట్టి చాలబాధించుటచే నొక కవీశ్వరు(డు వానిమీద నీక్రిం దిపద్యము చెప్పెను.

చ. ఇరువది చేతులుం దలలు నెక్కువ తక్కువ యంతెకాని వీ
డరయగ రావణాసురుని యంతటివా(డు పరికాశరాయు( డీ
శ్వర పదభక్తికిన్ సమర శక్తికి ధర్మము పై విరక్తికిన్
బరవనితానురక్తికిని బ్రాహ్మణుసొమ్ము హరించు యుక్తికిన్

ఈపద్యముయొక్క యర్థము.—

ఈపరికాశరాయునకు రావణాసురునకున్నట్లిరువది చేతులు పదితలలు లేవుకాని, తక్కినసుగుణములలో నిత(డా రాక్షసునివంటి వా(డే ఆతక్కినగుణము లేవనిన శివభక్తి యుద్ధశక్తి ధర్మమునందు విరక్తి( పరస్త్రీలయందాశక్తి బ్రాహ్మణుల సొమ్ము హరించుటలో యుక్తి.

49. ఒకరాజు తనమేడమీ(ద నిలిచియుండి వీధిపంక జూచు చుండ నిద్దఱు విద్యార్థులు తాళగ్రింథములు చేతుల(మీని దారింబో వుచుండిరి. ఆరాజు వారినిదరం బిలిచి చేతులోని పుస్తకము లేమియని

యడుగ నాంధ్రభాగవతములని వారు ప్రత్యుత్తర మిచ్చిరి. అప్పుడా రాజు వారినిద్దరి జేరియొక పద్యముం జదువుమని యానతిచ్చెను. అందొకడీ క్రిందిపద్యముఁ జదివెను.

శా. పుట్టంధుండవు బెద్దవాఁడవు మహాభోగంబులా లేవు నీ
పట్టెల్లన్ జెడిపోయె దుస్సహజరా భారంబు పైగప్పె నీ
చుట్టాలెల్లనుజచ్చి రాలు మగడుర్ శోకింపుచున్ బిట్టుగా
గట్టా దాయల పంచనుండఁ దగునే కౌరవ్య వంశాగ్రణీ!

ఆపద్యమువిని రాజు రెండవవిద్యార్థినిం బిలిచి మఱియొకపద్యముఁ జదువుమనెను. అతఁడీ క్రిందపద్యము జదివెను.

మ జనజాతపరిభవాదులన్ దలుఁపులోఁ జర్చించి భాషావళిన్
బలుకన్ లేని జనార్దనా హ్వాయపర బ్రహ్మంబు మీయింట నె
చ్చెలియై, మేన మరందియై, సచివుఁడై, చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుఁడై చరించుటలు మీ భాగ్యంబు రాజోత్తమా

చదివినపిదప రాజు మొదటివాని కొక్కరూపాయియు రెండవ వానికి నూటపదియార్లును బహుమానము చేయించెను. అట్లు విశేష భేదముఁ జూపుటకు కారణమేమని మొదటివాఁడడుగ రాజిట్లనియె. ఓయీ! నీవు పరమమూర్ఖుఁడవు, పద్యముఁ జదువమన్నప్పుడు శుభమయినది చెవికి హాయిగానున్నది చదువవలయునుగాని చాధులపద్యముఁ జదువుదురా? నీవుచదివినపద్యము ధృతరాష్ట్రుఁడు నూఱుగురు గొడుకులం బోగొట్టుకొని దిక్కులేక పాండవుల పంచంజేరి యుండినప్పుడు విదురుండు వానితో నన్నమాట. అదిమిక్కిలి యశుభముగా నున్నది. నీచెలికాఁడు చదివినది నారదుఁడు ధర్మరాజుతో నన్నది. అది మిక్కిలి శుభముగానున్నది. చదివిన నిట్టిపద్యములే చదువవలయు అందుచేత నీకవమానము నీమిత్రునకు బహుమానము

50. ఒక కవీశ్వరుఁడు పంచమహాపాతకమహారాజు పరిపాలించు పట్టణమునకుఁ బోయి యొక బ్రాహ్మణుని చూచెను, వారికిద్దఱకు నీకిరింది శ్లోకములో నున్నట్లు సంభాషణ జరిగెను.

శ్లో. విప్రాస్మిన్నగరే మహాన్కథయక స్తాళద్రుమాణాంగణః
కోదాతా రజకోదదాతి వసనం ప్రాతర్గృహీత్వానిశీ
కోవిద్వాన్పరదార విత్తహరణె సర్వేపివిద్వత్తమాః
కస్మాజ్జీవసి హేసఖే విషక్రిమిన్యాయేన జీవామ్యహం॥

దీనియర్థము.

కవి—ఓయి బ్రాహ్మణుఁడా ! ఈనగరముఁ బెద్దకారెవరు?

బ్రాహ్మ—తాటిచెట్టు పెద్ద.

కవి—దాతయెవఁడు.

బ్రాహ్మ—చాకలివాఁడు దాత. వాఁడు బట్టలుదయమున తీసుకపోయి సాయంకాలము తెచ్చును.

కవి—విద్వాంసుఁ డెవఁడు?

బ్రాహ్మ—పరకాంత ధనములు హరించుటలో నందఱు విద్వాంసులే.

కవి—మిత్రుఁడా నీవెట్లు బ్రతుకుచున్నావు.

బ్రాహ్మ—నేను విషములోపురుగులాగున బ్రతుకుచున్నాను.

51. గయ్యాళియగు భార్యకు సాధువగు భర్తకు జరిగినసంభాషనము నొక కవీశ్వరుఁ డీకిరింది శ్లోకమునఁ జమత్కారముగఁ గూర్చెను.

శ్లో. అఃపాకంనకరోషి పాపినికథం పాపీత్వదీయఃపితా
రండేజల్పసికిం త్వదీయజననీ రండా త్వదీయస్వసా

నిర్గచ్ఛస్వహాతాన్ మదీయభవనం నేదం త్వదీయంగృహం
హావిశ్వేశర దేహిమేద్యమరణం పీడామదీయాగతా

అర్థము.

భర్త—ఓసీ పాపాత్ముఁరాల! ఏల వంటచేయలేదే?

భార్య—నీతండ్రి పాపాత్ముఁడు నేను గాను

భర్త—రండా! యేమి ప్రేలుచున్నావే?

భార్య—నీతల్లిరండ, నీచెల్లెలు రండ.

భర్త—నాయింటినుండి తత్క్షణమే నీవు లేచిపో

భార—యిది నీయిల్లు గాదు.

భర్త—హాదైవమా! నన్ను చంపుకొనిపోమ్మ.

భార్య—నాపీడ బోవును.

52 ఒక బ్రాహ్మణబాలుడు గురువువద్దవిద్యనేర్చుకొనివివాహ మాడఁదలంచి గురువుభార్య గయ్యాళియగుటచేఁ దనభార్య యట్టిది కాకుండ మంచికన్యను వివాహమాడవలయునని విశ్వప్రయత్నము చేసి యెట్టకేల కొకకన్యను వివాహమాడెను. ఆమెగయ్యాళితనమున గురువు భార్యను మించియుండెను. ఒకనాఁడు శిష్యుఁడు గురువుగారి యింటికిఁ బోయి భోజనముఁ జేయుచుండ గురుభార్యభర్తమీఁదకోప ముచే నన్నపుకుండఁదెచ్చి మగని నెత్తినివేసి పగులఁగొట్టెను. గురువు తనయవస్థ శిష్యునితోఁ జెప్పుకొని చాలదుఃఖించెను. శిష్యుఁడు గురు వుతో నిట్లనియె. "స్వామీ! మీరు పదిదినములపాటు మాయింటికి వచ్చి సుఖముగా నాతోకలసి భోజనముచేసి యుండవలయునని కోరు చున్నాను. ఈమెబాధ తప్పించుకొని మీరు పదిదినములున్నను మం చిదే. నాభార్యమిక్కిలి దొడ్డది. మీకు నాకు గానలసిన యుపచార ములు చేయగలదు. అనవుడు గురువు సుఖపడవచ్చునని శిష్యునియిం

టికిం బోయెను. శిష్యుండు తన గృహమునకుబోయి భార్యను జూచి "ఓసీ! నీవు మిక్కిలి మంచిదానవని గురువుగారితోఁ జెప్పితిని నామాట బోటుగాకుండ మాగురువున్న పదిదినములు నీవు వినయముగలిగి ప్రవర్తింపవలెను ఆతరువాత నీవు నన్నెట్లు చేసినను సరే ఆయన యున్నంతకాలము ప్రతిదినము నేను నిన్ను నూరుతిట్లుతిట్టెదనుఅన్నిటికి నీవు పడియుండవలెను" అనిబ్రతిమాలుకొనెను. ఆమెయు దానికొడంబడెను. శిష్యుఁడు గురువుగారు వినుచుండఁగా భార్యను జీటికి మాటికి దిట్టసాగెను. అమె నోరెత్తక యాతిట్లు పడుచుండుట జూచి గురువు "శిష్యునిభార్య మహాపతివ్రత. తన కట్టైయిల్లాలు దొరకదయ్యె" నని విచారింపఁ దొడగెను. శిష్యునిభార్య చింతగింజలు ముందరపోసుకొని తవ్వ దగ్గరపెట్టుకొని మగఁడు తిట్టినప్పుడెల్ల యొకగింజ తవ్వలోవేయుచు తిట్లు లెక్కపెట్టుకొనుచుండెను. ఒకనాడు భోజనము వేళ శిష్యుఁడు తనభార్య మహాపతివ్రతయని గురువుగారికి మిక్కిలితోచునట్లు చేయఁదలచి భార్యను మిక్కిలి తిట్టసాగెను. భార్య నూరుతిట్లవఱకు మాటలాడక యూరకుండి నూటయొకటవతిట్టు మగనినోటనుండి రావేగమే యన్నపుకుండఁ దెచ్చి మగనినెత్తివేసి పగులగొట్టి యిష్టమువచ్చినట్లు తిట్టి తిరిగి యన్నపుకుండ దెప్పించుటకు డబ్బులిమ్మని పీడింపజొచ్చెను. శిష్యుని యవస్థఁజూచి గురువుగారీ క్రింది శ్లోకమును జెప్పిరి.

శ్లో. అనేకశతభాండాని భిన్నాని మమమస్తకే
అహోభాగ్య వతీనారీ భాండమూల్యంనయాచతే॥

అర్థము—ఎన్నోవందల కుండలు నాతలమీఁద పగిలినవి; అయినను నాభార్యయే యోగ్యురాలు. కుండ పగులగొట్టుటయేగాని కుండవెలఁ దెమ్మని యెన్నడు పీడింపలేదు. అని గురువుగారు స్వగృహమునకుఁబోయెను. శిష్యుఁడు తరువాత భార్యంబిలిచి యేమే

యిట్లు చేసితివని యడుగ యామె యిట్లనియె. మీరు దినమునకు నూరుతిట్లు తిట్టెదననిరి. నేనందుకొప్పుకొని నూరుతిట్లవఱకు నోరునొత్తనైతిని. నామాట నేనిలుపుకొంటిని. మీమాట మీరు నిలుపుకొనక నూటికంటె నెక్కువ తిట్టినపుడు నాపని నేను సాగించితిని. ఇందు నా లోప మేమియు లేదు. లోపమంతయు మీదే.

58. ఒక వైష్ణవుడు శైవుడు కలిసి పయనముచేయుచు శివుఁడు పరబ్రహ్మమాయని శంకించి వివాదము పడిరి. వైష్ణవుఁడు శివుఁడు తెలివితక్కువవాఁడని జూపుట కీక్రిందిశ్లోకము చెప్పెను.

శ్లో॥ అత్తుంవాంఛతివాహనం గణపతేరాఖ్ఖుం క్షుధార్తఃఫణీ
తంచక్రౌంచపతేశ్శిఖీ చగిరిజాసింహోపి నాగాననం
గౌరీజహ్నుసుతామసూయతి కళానాథం లలాటనలః
నిర్విణ్ణస్సహ సాకుటుంబ కలహా దీశోపిహాలాహలం॥

అర్థ—"విఘ్నేశ్వరునివాహనమైన యెలుకను వానిశరీరభూషణమగు పాము కోపముచేత మ్రింగఁబోవుచున్నది. ఆపామును కుమారస్వామి వాహనమగు నెమిలి చంపఁదలచుచున్నది. పార్వతీదేవి వాహనమగు సింహము విఘ్నేశ్వరుని యేనుగుతలను చీల్చివేయఁ జూచుచున్నది. గంగకు గౌరికి సవతిపోరాటము హెచ్చుచున్నది. శివుని మూడవకంటిలోనున్న యగ్నిహోత్రునకు తలఁమీద నున్న చంద్రునకు నొకరు వేడిగా నొకరు చల్లగానుండుటచే సరిపడుట లేదు. తనసంసారస్థితి యీవిధముగా నున్నదని బెంగబెట్టుకొని. చావవలయుననియే సుమా శివుఁడు వెనుక విషము మ్రింగినాఁడు లేకపోయినచో నతఁడు హాలాహల మేలమ్రింగును? ఆశ్లోకమువిని శైవుఁడు తనదేవుని వైష్ణవుఁడు దూషించినందుకు మిక్కిలిదుఃఖపడి వానిదైవమునుగూడ దాను నిందింపఁదలఁచి యీక్రింది శ్లోకమునుజెప్పెను.

శ్లో॥ ఏకాభార్యా అచలరచితా చంచలాసాద్వితీయా
ఏకఃపుత్రో సకలసృడపి మన్మధో దుర్నివారః
శేషశ్శయ్యా శయనముదధిర్వా వాహనఃపన్నగాః
స్మారం స్మారం స్వగృహచరితం దారుభూతోమురారిః

అర్థము—విష్ణుమూర్తి భార్యలలోనొక్క తెగదలనిది. అనగా భూమి. రెండవభార్యయగు లక్ష్మి చలచిత్తముగలదైయొకచోటనిలువదు. ఒకకుమారుఁడగు బ్రహ్మ మంచిచెడ్డలు లేక యెల్లవస్తువులం జేయును. రెండవకొడుకగు మన్మధుడు పట్టపగ్గములులేక లోకములం బీడించుచున్నవాఁడు. ఇంక పడకటిల్లుసముద్రము. పాన్పుపాము. ఆపా మెప్పుడు వీకునో యెప్పుడు నేటిలోబడి మృతినొందవలసి వచ్చునో యని యతఁడు భయపడుచుండును. వాహనము పక్షి. అదియు నపాయకరమైనదే యిట్లున్న తనసంసారస్థితి దలఁచితలఁచి విష్ణుదేవుఁడు కొయ్యయైపోయెను. జగన్నాధక్షేత్రములో జగన్నాధస్వామి విగ్రహము కొయ్యబొమ్మ తక్కినచోట్లవలె శిలావిగ్రహము గాదు. కవి దానిని మనసులో పెట్టుకొని యీశ్లోకము చెప్పెను.

కు టుం బ క వు లు.

54 భోజమహారాజుగారి యాస్థానమున నొకనాఁడు నలుగురు మనుష్యులు వచ్చిరి. ముసలివాఁడు భార్య కొడుకుఁ గోడలు గల యాకుటుంబముననందఱుఁ గవిత్వము జెప్పగలవారై యుండిరి. భోజుడు వారి కవిత్వ పటిమఁ బరీక్షింపఁదలంచి "క్రియాసిద్ధిస్సత్వే భవతీ మహతాన్నోపకరణే", యనియొక సమస్యఁ బూర్తిచేయుమని యిచ్చెను. మహాత్ములయొక్క కార్యసిద్ధి వారి సత్వగుణమందే యుండును. కాని వారివద్దనున్న సాధనసామగ్రిలో నుండదని యావాక్యమున కర్థము. కుటుంబయజమానుఁడగు వృద్ధకవి యాసమస్య నీక్రిందివిధముగాఁ బూరించెను.

శ్లో॥ ఘటోజన్మస్థానం మృగపరిజనో భూర్జవసనం
వనే వాసః కందాదిక మశన మేవంవిధగుణః
అగస్త్యః పాథోధిం యదకృతకరాంభోజకుహరే
క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే॥

అర్థము.—అగస్త్యునకు జన్మస్థానము కుండ; పరివారములు మృగములు; భూర్జవృక్షముయొక్క యాకులుకట్టుబట్టలు అడవినివాసము దుంపలు భోజనము. ఇట్టిగుణములు కలిగియు నతడు సముద్రజలమంతయుఁ జేతులోఁబోసికొని త్రాఁగెను కదా ఇదియాయన మహిమవలననే గాని యాయనవద్దనున్న సాధనసామగ్రివల్ల గాలేదుగదా, కావున మహాత్ముల కార్యసిద్ధి వారిసత్వగుణమందే యుండునుఁకాని వారికడనున్న సాధనసామగ్రిలో నుండదు.

మునసివానిభార్య యీక్రిందిరీతి నానసమస్యఁ బూర్తిచేసెను.

శ్లో॥రథస్యైకంచక్రంభుజగయ్యమితాస్సప్తతురగా
నిరాలంబోమార్గ శ్చరణవికల స్సారథిరపి
రవిర్యాత్యేవాంతం ప్రతిదిన మపారస్య నభసః
క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణే॥

అర్థము.—సూర్యునియొక్క రథమునకొక్కటే చక్రము. అరథమును లాగుగుఱ్ఱము లేడింటికి త్రాచుబాములు. కట్టుత్రాళ్లు రథము పోవలసినమార్గము నిరాధారమైనది. రథము నడపువాఁడు కాళ్ళులేనివాఁడు (అనూరుడు) అయినను సూర్యుఁడు ప్రతిదిన మాకాశము యొక్క మొదలు మొదలుకొని చివరదనుక బోవుచుండును. ఇదియాయన మహిమవల్లనేగాని సాధనసామగ్రివల్ల నగుచున్నదా! కాఁబట్టి మహాత్ములయొక్క కార్యసిద్ధి వారి సత్వగుణమందే యుండునుకాని వారికడనున్న సాధనసామగ్రిలో నుండదు.

ముసలివాలి కుమారుఁ డాసమస్యనే యీక్రిందివిధమున బూరించెను.

శ్లో॥ విజేతవ్యాలంకా చరణ తరణీ యోజలనిధి
ర్విపక్షః పౌలస్త్యోరణభువి సహాయాశ్చకపయః
పదాతిర్మర్త్యోసౌ సకలమవధీ ద్రాక్షసకులం
క్రియాసిద్ధి స్సత్వే................................

అర్థము—జయింపవలసినదిలంక. అందుకుసముద్రము కాలితో దాటవలసియుండెను. జయింపవలసిన శత్రుఁడసాధ్యుడయిన రావణుడు. సహాయము వచ్చినవారా కోఁతులు. ఎక్కుటకురథమైనను లేదు. ఇట్టియవస్థలోనుండియు శ్రీరాముఁడు రాక్షసకులమునంతను రూపుమాపెను! ఇది యాయన మహిమవల్లనేకాని సాధనములవల్లకాదుగదా! కావున, మహాత్ములకార్యసిద్ధివారి మహిమవల్లనేగాని, సాధనములవల్లకాదు.

పదునెనిమిది వత్సరముల ప్రాయముగలకోడ లాసమస్య నీక్రిందివిధమున సంపూర్తిఁ జేసెను.

శ్లో॥ ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చంచలదృశాం
దృశాంకోణో బాణస్సుహృదపి జడాత్మాహిమకరః
స్వయం చైకోనంగ స్సకలభువనం వ్యాకులయతి
క్రియాసిద్ధి స్సత్వేభవతి మహతాన్నోపకరణే॥

అర్థము—మన్మథునకు ధనస్సు తాఁకినమాత్రమున గందిపోవు పుష్పము. వింటినారినిలుకడలేని తుమ్మెదగలగుంపు. స్త్రీల కేరిగంటిచూపులు బాణములు ప్రాణములేని జడుఁడగు చంద్రుఁడు స్నేహితుడు. తాను శరీరమే లేనివాఁడు. ఇటులుండియు, మన్మథుఁడు మూడులోకములను వ్యాకులపెట్టుచున్నాఁడు. ఈమహాకార్య మాయన మహిమవల్లనే జరుగుచున్నదేకాని సాధనసామగ్రిలో నేమున్నది.

భోజమహారాజు వారినలుగురి కవిత్వము విని మగవాండ్రిద్ద ఱుం జెప్పిన శ్లోకములుకంటె నాఁడువాండ్రు చెప్పినశ్లోకములు రసవం తముగానున్నవని యిందుముఖ్యముగ యావ్వనవతియగుకోడలుచెప్పి న శ్లోకము రసవంతముగానున్నదని యా శ్లోకమునకు విశేష బహు మానముఁ జేసి తరువాత నామెయత్తగారికిఁ గొంతధనమిచ్చి పురుషు లకు స్వల్పబహుమానములిచ్చి పంపెను తగునట్లు విద్యాభ్యాసము చేయించినచో స్త్రీలుఁగూడ పురుషులకంటె నెక్కువ రసవంతముగఁ గవిత్వము జెప్పఁగలరని యీకథంబట్టి లోకులు గ్రహింపవలయును.

55. భోజమహారాజుగారి యాస్థానమునందుదండి భవభూతి శంకరులను ముగ్గురు కవీశ్వరులుండిరఁట. మహాకవియైన కాళిదాసుఁ డు గూడ పండితకల్పవృక్షమని చెప్పఁదగిన భోజమహారాజు నాశ్రి యించి యమితగౌరవము నందుచుండగాఁ జూచి యోర్వలేక చిరకా లాశ్రితులైన యాకవులు ముప్వరు గాళిదాసుమీఁద నసూయఁబూ నియుండి వానిఁ జెఱుపుట కనేకప్రయత్నముల జేసిరఁట కాళిదాసుఁ డును వారింజెఱుపుటకు సమయము వెదకుచుండెను. అట్లుండ నొక నాఁడు కాళిదాసుఁడు వారిముప్వరితోఁగూడి సల్లాపము జేయుచుండ నొకసన్యాసి యక్కడకువచ్చి వారికి వేదాంతోపదేశము జేసెనఁట. అప్పుడు దండిభవభూతి శంకరుల మనస్సులు వైరాగ్యముతోఁ గూడి యుండెను ఆయదను గనిపెట్టి కాళిదాసుఁడు వారిపీడ వదలించుకొన వలెనని "మనము చిరకాలము సంసారసుఖము లనుభవించితిమి. ఇంక సన్యసించి యోగవిద్యచే శరీరముల విడచిపెట్టుద" మని పలికె నఁట. అందుకువారంగీకరింప గాళిదాసుడు మనకోరికల రాజుగారి కె ఱిగించి వారిసెలవుగైకొనిపోవుదమని యందఱను రాజుగారియెదుటి కి దీసికొనిపోయెను. అందఱు దమతమ కోరికల రాజుతోఁ జెప్పెను ద్యుక్తులయిరి. ముందు దండియిట్లనియె.

శ్లో॥ కదాబృందారణ్యే విపులయమునాతీరపులినే
చరంతం గోవిందం హలధర సుదామాదిసహితం
అహోకృష్ణస్వామిన్ మధుర మురళీ మోహనవిభో
ప్రసీదేతిక్రోశన్నిమిష మివనేష్యామి దివసాన్॥

అర్థము—ఎల్లప్పుడు యమునాతీరమందలి బృందావనమందు జరించునట్టి గోవిందుని ,ఆహా! కృష్ణస్వామీ మురళీమోహనవి భో యనుగ్రహింపు"మని ప్రార్థించుచు దినములు నిమిషములవలె నే ను గడపివేయుదును. అదివిని రాజు వారికోరిక ప్రకారము చేయవ చ్చునని పలికెను.

అంతటభూవభూతి యిట్లనియె.

శ్లో॥ కదావారాణస్యా మమరతటినీరోధసివసన్
వసానః కౌపీనం శిరసి నిదధానోంజలిపుటం
అయేగౌరీనాథ త్రిపురహర శంభోత్రిణయన
ప్రసీదేతి క్రోశన్నిమిషమివ నేష్యామి దివసాన్॥

అర్థము—కాశీపట్టణములో గంగాతీరమందుండి గోచిపెట్టు కొని శిరస్సుమీఁద చేతులు మోడ్చి నమస్కరించుచు "ఓగౌరీనాథ యోత్రిపురహర యోత్రినేత్ర యనుగ్రహింపు, మని శంకరుల భజ నజేయుచు దినములొక నిమిషమువలెగడిపివేయుదును. అంతపరమ భక్తిగలవారిని వారింపఁగూడదని రాజుగారు వాని యిచ్ఛాప్రకారము పొమ్మనిరి. అనంతరము శంకరుఁడనుకవి యిట్లనియె.

శ్లో॥ కదావా సాకేతే విపులసరయూ తీరపులినే
వసానః కౌపీనం శిరశి నిదధానోంజలిపుటం
అహోరామస్వామిన్ జనకతనయావల్లభ విభో
ప్రసీదేతి క్రోశన్నిమిషమివనేష్యామి దివసాన్॥

అర్థము-అయోధ్యాగరమందు సరయూనదీతీరమున నేను గోచి పెట్టుకొని శిరస్సుమీఁద చేతులు జోడించి నమస్కరించుచు "ఓ రామస్వామీ! యో జనకతనయావల్లభా! యనుగ్రహింపు" మని ప్రార్థించుచు దినములను నిమిషములట్లు గడిపివేయుదును. అతనిపలుకులు విని రాజు నీయిచ్ఛాప్రకారము చేయుమని వానికి యానతిచ్చెను.

అట్లు మువ్వురు కవులు సభనుండి వెడలి కాళిదాసుఁడుగూడ సన్యసించి వచ్చునని వానిరాక కెదురుచూచుచుండ నప్పుడు కాళిదాసుఁడు రాజులో నిట్లనియె.

శ్లో. కదాకాంతాగారే పరిమళ మిళత్పుష్ప శయనే
శయానః శ్యామాయామృదుల పరిరంభం హృదివహన్
అయేస్నిగ్ధే ముగ్ధేచటులనయనే చంద్రవదనే
ప్రసీదేతి క్రోశన్నిమిషమివనేష్యామిదివసాన్.

అర్థము-నిరంతరమంతఃపురమందుకమ్మకమ్మని తావులవెదజల్లు పువ్వులపాన్పుమీఁద బండుకొని ప్రియురాలిని గాఢాలింగనము జేసికొని యోముగ్ధా! యోచంచలాక్షీ యోచంద్రముఖీ నన్ననుగ్రహింపవే యని ప్రార్థింపుచు దినముల నిమిషములవలె గడపివేయుదును. అనవుడు రాజు సరే నీయిచ్చవచ్చినట్లు నీవుమాపట్టణమున నేసకలసౌఖ్యములనుభవించుచు నుండుమని యానతిచ్చెను. దండిభవభూతి శంకరులు కాళిదాసుఁడు చేసినపనికి విస్మయము దుఃఖము మల్లడిగొన రాజుగారియెదుటనే తాము సన్యాసము పుచ్చుకొన్నందున మరల గృహస్థాశ్రమము బుచ్చుకొన వీలులేక మహాదుఃఖముతో నవ్వలకుంబోయిరి.

56. ఒకకవి పిల్లిమీఁద నీక్రింది పద్యము చెప్పెను.

సీ. క్షీరఘటాంభుధి స్థిరకుంభసంభవ!
బహుమూషికోరగ పక్షిరాజ!
శుకకులమత్తేభ నికర కంఠీరవ!
శలభసంకుల వన జ్వాలకీల!

వృశ్చికదానవ విష్ణుసురద్వన!
వాయసమేఘ దుర్వారపవన!
కుక్కుటపర్వత ఘోరవజ్రాయుధ!
పారావతిమహాంధ కారసూర్య!

గీ. యనగనీవిట్లు వెలసితి వఖిలదిశల
వ్యాఘ్రకులమాతులస్వామి! శీఘ్రగామి
పయనములమి త్తి ! దొంతుల పాలికత్తి !
సకలగృహవర్తి! మార్జాల చక్రవర్తి!

తాత్పర్యము—సకలగృహవర్తి! మార్జాలచక్రవర్తి! నీవు పెద్దపులికి మేనమామవు. పాలకుండయను సముద్రమున కగస్త్యుడవు ఎలుకలనియెడు సర్పములకు గరుత్మంతుఁడవు. చిలుకలనియెడుమదపు టేనుఁగులకు సింహామవు. మిడుతలనియెడు నడవికిఁ గారుచిచ్చువు. తేళ్ళనియెడు రాక్షసులకు విష్ణుచక్రింబవు. కాకులనియెడు మేఘము లకు బెద్దగాలివి. కోళ్ళనియెడు పర్వతములకు వజ్రాయుధంబవు. పావురములనియెడు చీకటికి సూర్యుండవు. ప్రయాణములకు మృత్యుదేవతవు. కుండ దొంతులపాలిఁటి కత్తివి ఇట్టి నీమహిమల నెవరు వర్ణింపగలరు.

57 దక్షిణదేశపు శూద్రులలో పిళ్ళలను నొకతెగవారుకలరు ఒకపిళ్ళ గొప్పయుద్యోగములోఁజేరి యొకకవి కపకారముఁ జేయఁగా నాకవి వానిమీఁద నీక్రింది హాస్యకవిత్వముఁ జెప్పెను.

గీ. మేఁతఁగరిపిల్ల రణమున మేఁకపిల్ల
పాఱుఁబోతః తనంబునఁ పందిపిల్ల
ఎల్లపనులను జెఱుపంగ బిల్లిపిల్ల
అందమునఁగోతిపిల్ల యీ మురవపిళ్ళ.

తాత్పర్యము—ఈయరవపిళ్ళ తిండి కేనఁగుపిల్ల. యుద్ధములో మేఁకపిల్ల. పాఱుఁబోతుతనములోఁ బందిపిల్ల.ఎదురుగావచ్చినతలఁచు కొనినకార్యములన్నియుఁ జెఱుపుటకు పిల్లిపిల్ల. ఇఁక నందమునకో కోఁతిపిల్ల యని వర్ణించెను.

58 అడిదముసూరకవి తూర్పునాడున బ్రసిద్ధికెక్కిన పుసఁగుపాటి వెంకటమంత్రికి మిత్రుఁడై యుండుటంజేసి వారిరువురు బావమఱుదుల వావిబెట్టుకొని పిలుచుకొనుచు వచ్చిరి. వెంకటమంత్రిగారిచెల్లెలుకూడ విద్యావతియగుటచే సూరకవిగారి కవిత్వచమత్కృతులం గ్రహించి తనయన్నగారివలెనె కవిని యామెయు బావగారూయని బిల్చి యప్పుడప్పుడు సమయస్ఫూర్తిగ మాటలాడుచుండును. వెంటమంత్రిగారింట వివాహము జరుగగా దానినిమిత్తము ఉప్పు,నెయ్యి, పాలు, పెరుగు చెఱుకుపానకము మొదలయిన సంబారములు విశేషముగ తీసుకరాఁబడెను. వేలకొలది బ్రాహ్మణులకు సరిపడు మంచినీరుకూడా గంగాళములలో నింపఁబడెను. అవిచూచి సూరకవి యీ క్రింది పద్యముఁ జెప్పెను.

క. ఒక్కసముద్రము దక్కఁగఁ
దక్కగుసంద్రములు నీ యుదారమహిమచే
జిక్కెఁగద విప్రభుక్తికి
వెక్కసముగఁ బుస్గుపాటి వేంకటమంత్రీ!

తాత్పర్యము—ఉప్పుసముద్రము, చెఱకుపానకపు సముద్రము, కల్లుసముద్రము, నేతిసముద్రము, పెరుగుసముద్రము, పాలసముద్రము, మంచినీళ్ళసముద్రము అను నేడుసముద్రములలో మూడవదియగుకల్లుసముద్రము తప్ప తక్కినయాఱుసముద్రములును నీదాతృత్వమువల్ల బ్రాహ్మణులభోజనమునిమిత్తమున్నదపడినవిఅనగానాయాసముద్రములలోనున్న పదార్థమంతయుదెచ్చి బ్రాహ్మణసంతర్పణనిమిత్తము

నీయింటనెజాగ్రత్తపెట్టితివనిభావము సూరకవివివాహాదీక్షాగృహము నభోజనముచేయనిస్వయంపాకనియమస్థుఁడు వెంకటమంత్రిగారి చెల్లెలాపద్యమువిని సూరకవితోనిట్లనియె "బావగారూ ఆమూడవసముద్రమునుమీవంటి స్వయంపాకులనిమిత్తముమాయన్నగారు విడిచిపెట్టిరి ఆమాటలువిని యక్కడనున్నవారందఱుపకపకనవ్విరి. అంత తెలివిగలసూరకవిగూడి యామెయుక్తికిఁ బ్రత్యుత్తరమీయలేక పోయెనఁట.

59 ఉల్లిపాయ మిక్కిలియిష్టముగలయొకకవిదానిమహిమ నీక్రిందివిధమునఁ గొనియాడెను.

క. ఉల్లినిదూషించినయా
గుల్లామునఁబట్టిముక్కుఁ గోయఁగవలదా
తల్లుండవలయు, లేదా
యుల్లుండగవలయు, భోజ నోత్సవవేళన్!

తాత్పర్యము—ఉల్లిని! దూషించినవాని ముక్కుఁగోయవలయు, మనుష్యునకు భోజన సమయమందు తల్లియైనా యుండవలయును. లేదా యుల్లియైనా యుండవలెను. అనగా యుల్లివంటి వస్తువులేదని కవి యభిప్రాయము.

౬0 ఒకకవి శివునిమీఁద నీ క్రిందిపద్యముజెప్పెను.

క. సాంబ! గరాశ! దిగంబర!
డంబుగ నిన్నాశ్రయించుటంజేసి కదా
యంబళు లన్నములయ్యెను
కంబళు లంబరములయ్యెఁ గవిరాజులకున్.

తాత్పర్యము—ఓశివుఁడా! విషభోజనుఁడవు దిగంబరుఁడవునై నిన్నుసేవించుటచేతనేగదా మావంటికవీశ్వరులకు భోజనమునిమిత్తమంబళ్ళు, కట్టుకొనుటకుకంబళ్ళు దొఱుకుచున్నవి. అనగా మేము కూటికి గుడ్డకు మొగమువాచియున్నామని భావము.

61 ఒకకవి కుంపటిమీద నీక్రిందిపద్యమును జెప్పెను.

మ. అలచామీకర రత్నసంఘటిత సౌ ధాగారములల్లి పే
శల తల్పంబు సుమాల్యగంధదకట్టా శాల్జోడ మాల్యాంబరం
బులు తాంబూలము లాదిగాగల మహా భోగంబులుం గల్గినన్
జలిపోదెన్నఁడు నీవులేనియెడ శు ష్మాలంపటీ కుంపటీ.

తాత్పర్యము.—ఎన్నిదుప్పట్లు పచ్చడములుశాలువలు కప్పుకొన్నను, వేడిచేయువస్తువు లెన్నితిన్నను, ఎట్టివెచ్చనియిండ్లలో పండుకొన్నను, కుంపటిపెట్టుకొన్నప్పుడు కలిగినంత సౌఖ్యముకలుగదని కవిభావము.

62 చలిమీఁద వ్రాయఁబడిన పద్యములు.

మ. చలిమమ్మాగతి బాధపెట్టెదవు నీ సామంతముల్వట్టి బీ
దల పైఁగాక దగద్ధగాయిత మణి స్తంభోన్నతాంతఃపుర
స్థలసంవాసిత కామినీ దృఢపరి ష్వంగాను సంయుక్తని
శ్చలులౌ భోగులమీఁద లేశమును నీ జంఝూటము ల్సాగునే.

తాత్పర్యము.—ఓచలీ! వట్టిబీదలనే సాధింపగలవు; కాని మంచి యంతఃపురములలో నుండునట్టిదంపతులమీఁద నీయాటలు సాగవు గదా;

మ. చలిగా నీకొకవార్త జెప్పెదను ని శ్శంకాగ్రభటుల్ దంపతుల్
గల యాయిండ్లకుఁబోకు దంపతులమే ల్కౌఁగిళ్ళ మధ్యంబున
న్నిలువం దిట్టటలేదు మిట్టిపడిన న్నిప్రాణము ల్గొందు గే
చెలి లేకుండెను బ్రహ్మచారులపయిం జెల్లింపు నీ దర్పముల్

తాత్పర్యము.—బ్రహ్మచారులను బాధించునట్లు చలి దంపతులను బాధింపలేదని దీనిభావము.

63 శ్రీనాథ మహాకవి పల్నాటిసీమకుఁబోయి యచ్చటిజనుల యనాగరికతను మోటుదనముం జూచి యీక్రిందిపద్యము చెప్పెను.

క. రసికుల కేలా పల్నా
డెసఁగెడు నారంభయైన నేకులె వడకున్
వసుధేశుఁడైన దున్నును
కుసుమాయుధుఁడైన జొన్న కూడేకుడుచున్.

తాత్పర్యము—పల్నాటిసీమ నాగరికులకు వసియింపఁ దగిన దికాదు అక్కడ రంభయైనను నరే యేకులు వడకుకొనవలయును. రాజైనను నేల దున్నుకొనవలెను. మన్మథుఁడైనను జొన్నన్న మేతిన వలయును.

64. అనేకాపద లొక్కసారిగా నొకప్పుడు వచ్చునని తెలుపుట కీక్రిందిపద్యము వ్రాయఁబడెను.

చ. గురువులరాక, దాసిమృతి గుఱ్ఱపుదాడియు నల్లునల్కయున్
వరసతిగర్భవేదన వివాహము విత్తులుజల్లు కార్తియున్
పొరుగున నప్పుబాధ చెవి పోటును వీథిని దొమ్మరాటయున్
గరవు దరిద్రిమాబ్దికము గల్గునొకప్పుడు కృష్ణభూవరా!

ఇది సులభముగా గాన తాత్పర్యము వ్రాయనక్కరలేదు.

65 బంగారమునుగూర్చి వ్రాయఁబడిన పద్యము.

క. కరగిన నఱికిన నొరసినఁ
బొరయదు దుఃఖంబు మేలి పుత్తడితన్నున్
గురిగింజకు వరిగింజకు
సరిగాతులఁదూతురను విషాదము దక్కన్.

తాత్పర్యము—మేలిబంగారము తన్ను ముక్కముక్కలుగా నఱికినందుకు, నిప్పులలోఁ బడవైచి కరఁగినందుకు విచారించదు. కాని

యెందుకును పనికిరాని గురివిందగింజలతోను వడ్లగింజలతోను తన్ను సమానముగా త్రాసులోవైచి తూచుచున్నారనిమాత్రము విశేషముగా దుఃఖపడుచున్నది.

66 క. బసవనకుఁ బుట్టినప్పుడె
పసరము గోవిందరాజు పసనంబైనన్
గసవేటికిఁ దినఁడనఁగా
గసవుం దిను శత్రురాజిఁ గదసినవేళన్.

తాత్పర్యము—గోవిందరాజనునాతఁడు బసవరాజుగారి కుమారుఁడు. కవి గోవిందరాజుమీఁద కోపముచే నీపద్యము చెప్పెను. బసవశబ్దమునకు వాడుకలోనున్న యర్థముయెద్దు. గోవిందరాజు బసవన్న కెపుడు పుత్రుఁడై పుట్టెనో యపుడే పశువయ్యెను. పశువయిన పక్షమున గడ్డి యెందుకు తినఁడని యందురేమో శత్రువులు యుద్ధమున నెదుర్కొనినపు డడ్డమైనగడ్డి గఱచును.

67. సంస్కృతభాష సరిగారాని యొకపండితునివద్దకు విద్యార్థియొకఁడుపోయి తానపుడు చదువుచున్న రామాయణములోని యీ క్రింది శ్లోకమున కర్థము చెప్పుమని యడిగెనఁట. తెలియదనినచో గౌరవభంగ మగునని యాపండితుఁడా శ్లోకమునకు మిక్కిలి చిత్రమైనయర్థము చెప్పెను.

శ్లో. జితం భగవతా తేన । హరిణా లోకధారిణా।
అజేన విశ్వరూపేణ । నిర్గుణేన గుణాత్మనా॥

పండితుఁడు చెప్పినయర్థము.

భగవతా=భగవంతుఁడవైన యో శ్రీరామచంద్రమూర్తీ! జితం=మేమింతకాలము మీవద్దచేసిన పనికి రావలసిన జీత మియ్యవయ్యా యని వానరులందఱు రాములవారి నడిగినారఁట.

ఆయన వానరుల కేమి బదులు చెప్పినారనఁగా?

తేన=అడవిలో రూపాయలు దొరకవు గనుక యిక్కడనున్న పుట్ట తేనెయానత్తు జీతముకి్రింద పుచ్చుకోవలసినది. లోకధారిణా=లోకధర పరికారముచూఁడగా అజేన విశ్వరూపేణ=అదయిన వీశరూపాయ అణా. నిర్గుణేనగుణాత్మనా=అన్ని దుర్గుణములు కొట్టివేసి మంచిగుణముచేయును.

ఈశ్లోకమునకు నిజమైన అర్థమిది.

భగవంతుఁడు, పుట్టుకలేనివాఁడు, విశ్వరూపుఁడు, లోకరక్షకుఁడు, నిర్గుణుఁడు త్రిగుణపరిధానుఁడు, నారాయణుఁడు నగు నతనిచేత (అనగా రాములవారిచేత) జయింపబడెను. (అనఁగా రావణాదిరాక్షసులు)

68 క. శ్రీకంఠ చాపఖండన
పాకారిప్రముఖవినుత భండన, విలస
త్కాకుత్థ్స వంశమండన
రాకేందు యశోవిశాల రామనృపాలా.

పల్లెటూరిలో గొప్ప పండితుఁడని పేరువడి పురాణము చెప్పుచున్న యొకపండితనామధారుఁడు భాగవతము దశమస్కంధము పురాణము చెప్పుచు నీపద్యమున కీకి్రంది విపరీతార్థము చెప్పెను.

శ్రీకంఠమనఁగా శ్రీకంఠమేగదా, చాపఖండన=గొప్పచేఁపను తెచ్చి ముక్కలుగాఁగోసి, పాకారిప్రముఖవినుత భండన=మంచిపాకముచేయుటకై యొక కుండలోవేసి, విలసత్కాకుత్థ్సవంశమండన=బాగాకాక తగులునట్లు పొయ్యికి్రింద పుల్లలు మంటఁబెట్టిన పక్షమున, రాకేందు యశోవిశాల=రాకేమిచేయును రా చానికిరుచి, రామనృపాలా=ఓ రామరాజా.

తెనుఁగు భాగవతము బమ్మెరపోతరాజు శ్రీరామునికంకితము చేసినాఁడు గనుగ స్కంధ ప్రారంభమున నీపద్యము జెప్పెను. దీనికి నిజమైనయర్థమిది. «శివునివిల్లు విఱిచినవాఁడా? దేవేంద్రాదులు మెచ్చుకొనెడియుద్ధములు కలవాఁడా! గొప్పదైన కకుత్థ్సవంశమున కలంకారమా! పూర్ణచంద్రునివంటి కీర్తిగలవాఁడా? ఒదామనృపాలా! యని,

69 శ్లో. శుక్లాంబరధరం విష్ణుంశశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనంధ్యాయేత్సర్వవిఘ్నోప శాంతయే.

ఈశ్లోకము విఘ్నేశ్వర స్తవమైయుండఁగా నదియెఱుఁగకయొక పండితుఁడు "కవి యీశ్లోకములో గాడిదను వర్ణించినాఁ" డనియీక్రింది యర్థముఁజెప్పెను.

శుక్లాంబరధరం=తెల్లబట్టలు మోయునది. చాకలివాఁడు సాధారణముగా బట్టలు గాడిదలమీఁద వేసి మోయించుకొనిపోవుచుండును. విష్ణు=సర్వవ్యాపియైనది. (అనఁగా నెక్కడఁజూచిన నక్కడ కానఁ బడునది.) శశివర్ణం=తెల్లని రంగుగలది. చతుర్భుజం=నాలుగు చేతులుగలది. (అనఁగా జంతువునకు చేతులు, కాళ్ళు విభజనము లేదు.) ప్రసన్నవదనం=మంచి ముఖముగలది యైనగాడిదను, సర్వవిఘ్నోప శాంతయే= అన్నివిఘ్నములు శాంతించుకొఱకు, ధ్యాయే=ధ్యానించుచున్నాను.

ఈయర్థమువిని వేఱొక పండితుఁడు కోపించి లేచి, విఘ్నేశ్వరునిమీఁద చెప్పఁబడిన యీశ్లోకము గార్దభపరముగా నర్థముచెప్పి తగులఁ బెట్టితివేమయ్యా యని కలహమాడ దొడఁగి మొదటిపండితుఁ డిట్లనియె. «ఓ వెఱ్ఱివాఁడా! ఇదివిఘ్నేశ్వరునిమీఁది పద్యము కాదు తప్పక గాడిదమీఁది పద్యమే. పూర్వము శ్రీకృష్ణమూర్తి పుట్టినపుడు వసుదేవుఁడు గాడిదకాళ్ళు పట్టుకొనెనని మీరువినలేదా! అతఁడీశ్లోక

ముతో మొదట గాడిదను స్తనముచేసియే పిమ్మట దానికాళ్ళు పట్టుకొనెను ఇంతస్తోత్రము చేయుటచేతనే యది కూఁత కూయుటమానెను” మొదటిపండితుని యర్థమును మెచ్చుకొని సభవారు రెండవపండితుని “తెలివి తేటలు లేనివాఁడవు లేనట్లూరకొనక పానకములో పుడకలాగున నడ్డము వచ్చెదవేమయ్యా, యని వానినావలకీడ్చి వేసిరి.

70 పురాణమున కర్థముచెప్పు పండితునకుఁ బురాణము చదువువానికంటె నెక్కువజీతమిచ్చుచుందురు. ఏలయనఁ జదువువానికివిశేషపాండిత్యమక్కరలేదు. అర్థము చెప్పువాఁడు పండితుఁడై యుండవలెను. పురాణము చదువునొక బాలుఁడు తనకుఁ దక్కువ జీతమిచ్చుచున్నారని మనసులోఁ గోపముఁబూని తానుసరిగాచదువని పక్షమున బండితుఁడర్థము చెప్పలేడని తలంచి, తనచదువుటయే పురాణమునకు ముఖ్యాధారమని నిశ్చయించి, యర్థముచెప్పువాని నిబ్బందిపెట్టుటకై భారతము విరాటపర్వములోని, మాసెనభోమణి నక్కలుగూసెన్ అను పద్యమును మాసెన—బొమిడినక్కలుగూసెన్ అనిచదివెను పౌరాణికుఁడాపాదమున కర్థముగాక చాలాసేపు గిజగిజలాడి పిదప స్వయముగ పుస్తకముఁ జూచికొని సరిగానర్థము చెప్పి యదిమొదలు పుస్తకము సరిగాఁజదువుచుండుటకై యాబాలకుఁ దనజీతముతో గొంత బిళ్లిమానమిచ్చుచు వచ్చెనఁట.

ఈవిధముగానే పాఠకునకుఁ బౌరాణికునకు రామాయణము పురాణము చెప్పునపుడు వాదము రాఁగా పాఠకుండు రామునితో కపివరుఁడిట్లనియె ననుదానిని ‘రామునితోక—పివరుఁడిట్లనియె నని చదివెనఁట. అదివిని పౌరాణికుఁడు దానియర్థము స్ఫురింపక ‘కోతులకుతోఁకలున్నవని వాల్మీకివ్రాసెగాని రామునికున్నట్లెచ్చటనువ్రాయలేదు. అదిగాక పివరుఁడను శబ్దమున కర్థమేమి చెపుమా యని నిఘంటువులు తిరుగవేసి యెందునుంగానక యెట్టకేలకు పురాణమును

స్వయముగఁ జూచి పాఠకుఁడుచేసిన మోసమెఱిఁగి సరియైనయర్థము ను జెప్పెను.

71 తెలుఁగు సరిగారాని యొక సంస్కృత పండితుఁడు తెలుగు భారతము పురాణము జెప్పుచుండఁగా నందులో నొకచోట "అనవు డు యను పదములు మఱియొకచోట "నావుఁడు. అనుపదమును వ చ్చెను. ఆరెండు మాటలకు 'ఇట్లనగా, నని యర్థము- సంస్కృతపం డితుఁడీ యర్థమేఱుంగక. డు, వర్ణకము చివరనుండుటచే నవిమనుష్యు లపేర్లనుకొని "దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, ద్రోణుఁడు,భీష్ముఁడు కర్ణుఁడు మొదలగు వారెవరో తెలిసినది. అనవుఁడు' నావుఁడు, నను ని ద్దఱు నెవరో,యేవంశమువారో ధృతరాష్ట్రునకెట్టి చుట్టములో తెలి సినదిగాదు. వీరిద్దఱన్న దమ్ముల లాగునఁగనఁబడుచున్నారు. అని సభ వారితో ననెను. అదివిని తెనుఁగు సాంప్రదాయము తెలిసిన యొక బాలుఁడులేచి "అవి మనుష్యులపేర్లుకావు. అవి అవ్యయములు యని వానియర్థములు చెప్పెను.

72 తెలివితక్కువవాండ్రు పదిమందిచేరి పురాణకాలక్షేపము సేయనెంచి తమలో నొకని గ్రంధము చదువుటకు నియమించిరి. ఆ పాఠకుఁడు ముందుగా గజేంద్రమోక్షము చదువనారంభించి సీ॥మా నవాధీశ్వరా! మనువు నాలవవాఁడు, అనుపద్యమును "సీ॥ మానవాధీ శ్వర! మణుఁగు నాలుకవాఁడు, అనిచదివెను చదివినతోడనే వినువా రు దానిముందు చరణము చదువనీయక " మణుఁగు నాలుక వాఁడె" వఁడని విచారణసేయ నారంభించిరి.అట్టిమనుష్యుని పేరు వా రిలో నెవరికి స్ఫురణకు రానందున నాటికిఁ బురాణముకట్టిపెట్టి మఱు నాఁడా కథయే చదువుటమాని పదిమంది పదిభాగవత పుస్తకములు పుచ్చుకొని యట్టివాఁడెవఁడని వెదుకసాగిరి. అందొకఁడురుక్మిణీకల్యా

ణ ఘట్టముతీసి చూడఁగా "చ. వినుము విదర్భ దేశమున వీరుఁడుకుం డినభర్త" యను పద్యపాదము కనఁబడెను. కనఁబడినతోడనే వాఁడు సంతోషముతో నుప్పొంగి "ఇనుపనాలుక వాఁడు దొరకినాఁడురా దొఱకినాడురా" యని కేకలువేసెను. "ఎవఁడురా" యని తెక్కిన వారు వానిచుట్టుమూఁగి యడుగ నతఁడిట్లనియె. "యినుము యిదర్భ దేశమున యిారుఁడు కుండెను. అనిపుస్తకములోనున్నది. మఱుగునా లుక యిదర్భ దేశమున యిారుఁడనువానికుండెనట. మీరెవ్వరు తెలుసుకొనలేకపోయిరిగదా" అప్పుడు మఱియొకఁడు తనసన్నిజ్ఞఁ జూపుటకు "ఓరీ! అది యినుము నాలుకకూడనఁట. పద్యము మొదట"యినుము" అనియున్నది చూడండి" యనిపల్కెను. అప్పుడు మఱియొకడులేచి "ఓరీ ! తెలివితక్కువవాఁడా ! ఇనుమునాలుకని నీవువేఱె మాతో చెప్పవలెనా ? ఇనుము కాకపోయిన మఱుగు బరువెట్లుండునురా ?" యనెను. అందఱుఁ దమతమ తెలువులకు సంతసించియిం డ్లకుఁబోయిరి.

73 పెద్దాపురసంస్థాన మేలిన తిమ్మజగత్పతిమీఁద నొకకవి యీ క్రిందిపద్యముఁ జెప్పెను.

ఉ. ఇవ్వఁడు యివ్వడంచు జను లెప్పుడు తప్పకచెప్పచుందు రే
మివ్వఁడు? యన్యకాంతకుర మివ్వఁడు, సంగరరంగమందు వె
న్నివ్వఁడు శతృల న్బలబల నివ్వఁడు బెబ్బులినైనఁబట్టి పో
నివ్వఁ డసత్యవాక్య మెపు డివ్వఁడు తిమ్మజగప్పతీంద్రుఁడే

ఇందు సంధులు కలుపకపోవుటచేత వ్యాకరణదోషము లున్నప్పటికి పద్యము మిక్కిలి రసవంతముగా నున్నది. తాత్పర్యము సులభము.

74. ఒకసంతర్పణమునుఁగూర్చి యీక్రిందిపద్యముఁ జెప్పఁబడినది

క. జనసేవన గళగళ ల

ప్పళములపెళపెళల భో క్తృ భళభళలబలా
వళిపట బెళబెళలందెల
ఝుళఝుళ లేకీభవించె జనము భుజింపఁగ.

తాత్పర్యము=జనులు భుజించుచున్నప్పుడు నీళ్ళు త్రాగునప్పుడు గళగళధ్వనులు అప్పడములు విరుచునప్పుడు పెళపెళధ్వనులు మెచ్చు కొని బ్రాహ్మణులు చేయు "భళా భళీ !" ధ్వనులు వడ్డించు స్త్రీలయొక్క బట్టల పెళపెళ ధ్వనులు,అందెల ఝుళఝుళధ్వనులు నివన్ని యుఁ గలిసి యొక్కమారుగా వినబడెను.

75. జూపెలి ధర్మారావుగారను రాజు దానముఁగూర్చి యొక కవి చెప్పినపద్యము.

శా. నే నాకాశతరంగిణిన్, బుడమిలో నీవెవ్వలే వాహినీ?
నేనా జూపెలి ధర్మభూవిభునిపా ణింబుట్టు దానాంబువున్
నీ నా యంతరమేడ, నేడ నవునౌ నీ వేడ నే నేడ నే
నేనా యాచకపాదజాతనఁటవే? నేదాత హస్తాబ్జజన్

తాత్పర్యము—బ్రాహ్మణుల కేదానమైన నిచ్చునప్పుడుదాని ని ధారాదత్తము చేయుట యనఁగా కొంచెము నీళ్ళతో విడుచుట మనలో సాంప్రదాయము. జూపెలి ధర్మారావుగారు దానసమయమందు విడిచిన జలము గొప్పనదియై ప్రవహించునఁట. విష్ణుమూర్తిపాదములందుఁ బుట్టిన యాకాశగంగ యొకసారి కొత్తనదినిఁగలిసి నేనాకాశగంగను ఓనదీ! నీవెవ్వతెవే" యని యడిగెనట. "నేనా జూపెలి ధర్మారావుగారి దానధారవలన నాయన హస్తమునం బుట్టిన నదినే" యని కొత్తనది బదులుపల్కెనట. "నీవటే! ౹ మెవరో యనుకొంటి ని. సరే! నియంతర మెక్కడ నాయంతరమెక్కడ" యని నిందాగర్భముగా నాకాశగంగ పల్కెను. కొత్తనది యాపలుకుల కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "అవును. నీయంతరమెక్కడ నాయంతరమెక్కడ

బలిచక్రవర్తివద్ద మూడడుగుల నేల యడుగుకొనిన యాచకుని పాద ములో బుట్టినదానవు నీవు. యాచనమేమో యెఱుఁగని మహాదాత హస్తములోఁ బుట్టినదానను నేను. నీవనినట్లె నీకును నాకును పోలిక లేదు.

76. క. అన్నాతిఁగూడ హరుఁడవు
అన్నాతినిఁ గూడకున్న ససురగురుఁడవా
దన్నా ! తిరుమలరాయా !
కన్నొక్కటి దక్కఁగాని కౌరవపతివే.

తాత్పర్యము:—తిరుమలరాయుఁడనునొకఁడుతనమీఁదఁ బద్య ముఁ జెప్పుమని యొక కవినిఁ బ్రార్థించెనట కాని పాపము తిరుమల రాయని కొకకన్ను గ్రుడ్డి ఆసంగతినే కవి మిక్కిలి చమత్కారముగా నీపద్యములో వర్ణించెను ఓతిరుమలరాయా ! నీవు నీభార్యను గలసి యున్నపుడు రెండవసాంబమూర్తివి. (అనగాభార్యకన్నులుగల సాం బమూర్తియగునని భావము). భార్యతోగలిసియుండనపుడు కేవలము శుక్రాచార్యుండవు. (అనగా రెండవకన్ను లేదుకనుక నేకాక్షియై యుండునని భావము) దైవవశమున నొకకన్నుండిపోయినది కాని లే కున్న ధృతరాష్ట్రుడవే. అని తిరుమలరాయని సాంబమూర్తితోను శుక్రాచార్యునితోను, ధృతరాష్ట్రునితోను పోల్చిగొప్పగా వర్ణించిన ట్లు పైకికనబడుచున్న నొక కన్ను లొట్టయని యెగతాళిగాఁ బద్య ముచెప్పినట్లు స్పష్టమగుచున్నది.

77. గ్రామము చేతనుండఁ గృషి కల్పితధాన్యములింటనుండి శ్రీ
రామకటాక్షవీక్షణ పరంపర మాదిన మేగాఁగాక మా
రామయమంత్రి భోజన పరాక్రమ మేమనిచెప్పవచ్చు నా
సామియెఱుంగుఁ దక్కబళ చాతురి తాళఫలపరిమాణముల్.

రామయమంత్రి యను కరణము మంచిజఠరాగ్నిఁ గలిగి స్థు

ష్టుగా భోజనము చేయుచుండెనట అదియెఱిఁగిగి యొకకవి హాస్యము
కొఱకు పై పద్యముఁ జెప్పెను.

తాత్పర్యము—కరణమగుటచే గ్రామము చేతనుండఁబట్టియు
బూర్వార్జితములయిన భూములలోఁ గావలసినంత ధాన్యము పండబ
ట్టియు నెట్టెటో శ్రీరామకటాక్షమువలన నిత్యకృతము జరుగుచున్న
దిగాన్ని, లేనిచో జరిగియుండకపోవును. ఏలయన మారామయమంత్రి
భోజనపరాక్రమము చెప్పుట కలవిగానిది. ముద్దపాళము తాటిపండు
తూకము కలది.

78.మ. సకలస్థాణు శిరఃపరివిష్ణుఁడను, ప క్షద్వంద్వశుక్లాభిరం
జకుడన్, సర్వదిగంతగామి నసదృ క్సంసేవ్య మానుండ నే
నకలంకుండఁ గలంకి వీవనుచు గ ర్వాయ త్తతన్బల్కుచున్
బకమిందు న్బరిహాసించురీతిసుగుణున్ బల్కున్దురాత్ముండిలన్.

కొంగ చంద్రునివెక్కిరించునట్లీపద్యమునఁజెప్పబడినది. కొంగ
యిట్లనునఁట. ఓచంద్రుడా! నీవొక్క స్థాణునిశిరస్సుననున్న వాఁడవు
ఇక్కడస్థాణుశబ్దమునకు శివుఁడనియర్థము నేనో సకస్థాణు శిరస్సు
లమీఁద నుండును ఇక్కడ స్థానుశబ్దమునకు రాయి యని యర్థము
అన్నిరాళ్ళపైని వాలుమనని భావము నీవొక్కపక్షమునందే తెలు
పుగలవాఁడని యర్థము (అనగా శుక్లపక్షమందు) నేనో రెండు ప
క్షములయందుఁ దెలుపుగలదానను (ఇక్కడ పక్షములనగా ఱెక్క
లు) నీవొక్క దిక్కునుండి మఱియొక దిక్కునకేపోవుదువు (అనగా
దూర్పున నుదయించి పడమట నస్తమించునని భావము) నేనో, యె
ల్లదిక్కులకుఁ బోవుచుందును. (కొంగలు తిరుగని చోట్లుండవుగదా)నీ
కెప్పుడో యొకప్పుడు మీనసంయోగము గలుగుచుండును. (అనగా
చంద్రుఁడప్పుడు మీనరాసిలో జేరుచుండునని భావము) నేనో

నిరంతరము మీనసంయోగముఁ గలిగియుండును. (అనగా కొంగ తెల్లప్పుడుఁ జేపలఁదినుచుండునని భావము.) నీకుమచ్చకలదు. (చంద్రునిలోని మచ్చయని భావము) నేను మచ్చలేనిదానను (కొంగలు స్వచ్ఛమైన తెలుపుగలిగియుండును) అనియిట్లుకొంగ చంద్రుని వెక్కిరించినట్లే దుర్జనుఁడేవియో వంకలుకల్పించి సజ్జనుని దూఱుచుండును.

79. క. శీతజల స్నానంబును
భూతల శయనంబు వంటి పూటశనంబున్
నాతిగల బ్రహ్మచర్యము
నాతరమా రాచవారి నౌకరిసేయన్

ఒకయుద్యోగస్థుఁడొక రాజుదగ్గరగొలువుచేయుచుండఁగా నా రాజాయనను నిరంతరమునేదో పనిమీఁద నూళ్లదిరిప్పుచుండెనేకాని యింటిపట్టున నొకపూటయయిన నుండనీయఁడయ్యెనఁట. దానికాతఁడు విసిగి పైపద్యముఁ జెప్పెనట.

తాత్పర్యము—నిరంతరము చన్నీళ్లస్నానము కటికనేలబండుకొనుట, ఒంటిపూటభోజనము, భార్యయున్నను బ్రహ్మచర్యముగల యీరాజుల కొలువు చేయుట నాతరమా యని యాతని యభిప్రాయము.

80. క. దంగేరేడిద పొలమూ
రంగర కపిలేశపురము నైదిఁట భిక్షం
బంగజ హరునకు నైనను
జంగము వేసమునఁ జేయి జాచిఁన గలదే.

శ్రీనాథుఁడు దేశాటనము జేసినప్పుడు దంగేరు, ఏడిద, పొలమూరు. అంగర, కపిలేశపురము నను నీయైదూళ్ళలో నతనికిఁ దిన్నగ

భోజనము దొరకకపోవుటచేఁ బైపద్యముఁ జెప్పెనని లోకములో వాడుక. తాత్పర్యము—పైన చెప్పఁబడిన మైదుదూళ్లలో జంగము వేషము వేసుకొని సాంబమూర్తి స్వయముగావచ్చి చేయిజాచి యడిగినను బిచ్చముదొఱకదు.

81 క. కలిమిగల లోభికన్నను
విలసితుఁడగు పేదమేలు వితరణి యైనన్
జెలమైన మేలుకాదా
కులనిధి యంభోధికన్న గువ్వలచెన్నా

తాత్పర్యము—భాగ్యముఁగల పిసినిగొట్టుకన్న, దాతయయిన పేదవాఁడే మేలు. ఎట్లనఁగా నుప్పునీటితో నిండిన మహాసముద్రము కంటె కొంచెము మంచినీరుగల చిన్న చెలమయైనను బ్రయోజనమే కదా.

82.క. కలిమిగలవాఁడె మనుజుఁడు
విలసిల్లఁగ వలయుజుమ్మ వితరిణి యగుచున్
కలమేమి యెల్లకాలము
కులగిరులా కదలకుండ గువ్వలచెన్నా.

తాత్పర్యము—తాసంపద లున్నపుడే మనుజుఁడు చేయఁదలచినదానములు చేయవలయును. ఏలయన సంపదలు శాశ్వతములై కదలకుండుటకు మహాపర్వతములు కావుగదా.

83. ఉ. భారతులెన్న దంతిపురి వారలు; వీరును దంతులూరివా
రారయ ధర్మరాజొకఁడు నందఱు నిందున, ధర్మరాజులే
పేరున భీముఁ డొక్కరుఁడు; వీరన నందఱు భీమసేనులే
పేర ధనంజయుం డొకఁడు; వీరు ధనంజయ గోత్రులందఱున్

తాత్పర్యము—దంతులూరి వారను క్షత్రియులకు. దంతిపురి (అనఁగా హస్తినాపురము) నేలిన పాండవులనుఁ బోల్చి కవి పై పద్యముఁ జెప్పెను.

ఆభరత వంశజులయిన పాండవులు దంతిపురివారు, వీరు దంతులూరివారు. ఆభరతవంశమందు ధర్మరాజొక్కఁడే. ఈవంశము నందు బుట్టినవారందఱు ధర్మరాజులే. ఆవంశములో భీముఁడొక్కఁడే. ఈవంశములో నందఱు భీములే. ఆవంశములో ధనంజయుఁ డొక్కఁడే (అనగా అర్జునుఁడు) వీరందఱు ధనంజయ గోత్రులే.

84. ఉ, మానిని మాలతీ కుసుమ మంజరి బాసి. భరింపఁజాల కీ
మేను దొఱంగగాఁ దలఁచి మిక్కిలి పూచిననిన్నుఁజూచిఘో
రానల రాశివంచు వెన వ్రాలఁగ వచ్చితి నంతెకాని నీ
సూనవితానవాసనల సుక్కిన దానను. కాను కింశుకా.

తాత్పర్యము—ఒక తుమ్మెద మోదుగుచెట్టుంగూర్చి నిందాగర్భముగాఁ బలికినట్లీపద్యమునఁ జెప్పఁబడినది ఓ మోదుగుచెట్టా! నే నింతవఱకు నొకస్త్రీ తలందాల్చిన మాలతీ పుష్పములగుత్తి నాశ్రయించుకొని యుంటిని. ఆగుత్తి యిప్పుడు దొఱకినదికాదు. ఆదుఃఖము భరింపలేక యెందులోనైనఁబడి చావవలయునని సంకల్పించి యెఱ్ఱని మొగ్గలతోనున్న నినుఁజూచి నిప్పుల రాశివని భ్రమించి నీ దఱిఁ జేరితిని కాని నీ పువ్వుల వాసనల మెచ్చి నీ దగ్గఱకు వచ్చితి నని గర్వింపకుము.

85. మ. విధి సంకల్పముచే నొకా నొకఁడు తావిశ్వంబు బాలింపుచో
బధిరంబెక్కువఁ చూపు తక్కువ, సదా భాషల్దురూక్తుల్మనో
వ్యథతో మత్తతతోడ దుర్వ్యసన దుర్వ్యాపారతన్ జెందు స
య్యధికారాంతము నందు జూడవలదా యాయయ్య సౌభా
గ్యముల్.

తాత్పర్యము—దైవవశముచే నధికారముగలపురుషున కాయధికారమున్నంతకాలము చెవుడు, గుడ్డి మొదలగు రోగములుండును ఆడినవెల్ల దుర్భాషలగును. దుర్వ్యసనములకు దుర్వ్యాపారములకు మేరయేలేదు. (అనగా నతఁడెవరేమి చెప్పినను వినిపించుకొనఁడు. ఎవరిని సరిగాఁజూడఁడు. ఒక్కనితోను సరిగా మాట్లాడఁడు. చేసెడు వన్నియు దురాచారములేయని భావము) ఆయయ్య సౌభాగ్యము నధికారమయిన తరువాత చూడవలయును.

86. సీ. తప్పుగానక సర్వ మొప్పుగాఁ గైకొని
శ్లాఘింతురెంతయు సరసజనులు
తప్పును దప్పుగ నొప్పు నొప్పుగఁగాంచి
ప్రకటింతురెంతయుఁ బ్రాజ్ఞజనులు
తప్పులే గైకొని యొప్పులదిగఁద్రొక్కి
దూషింతురెంతయు దుష్టజనులు
యొప్పులెల్లను బల్మి తప్పులుగాఁజేసి
కలహింతు రెంతయుఁ గలుషజనులు
గీ. వెనుకముచ్వంకనొక యుక్తి విధముగలదు,
నాలుగవపక్షముననున్న నరులకరయ
హేతువెద్దియుఁగాన మీ ఘాతుకులకుఁ,
గేలుమోడ్చెదమెప్పుడీ కీడుఁదొలగ.

తాత్పర్యము—ఈపద్యము గ్రంథముల విమర్శించువారిని గురించి చెప్పబడినది. ఉత్తములకుఁ దప్పులు కనఁబడక యన్నియు నొప్పులుగాఁ దోఁచును. మధ్యముల కొప్పులొప్పులుగాను, తప్పులు తప్పులుగాను కనఁబడును. అధములకు గ్రంథములయందున్న తప్పు లేగాని యొప్పు లెన్నఁడు గన్పడవు. అధమాధములు పుస్తకమున నున్న యొప్పులనుగూడ దప్పులుగా సమర్థించి గ్రంథమున కీప్రతిష్ఠ

దేబరియత్నింతురు. మొదటిముగ్గురట్లు చేయుటకు హేతువేమయిన నుండిన నుండవచ్చును. కడపటి వారి కే హేతువును గానఁబడదు. కావున నీ మహానుభావుల బారినుండి దప్పించుకొనుటకు వీరికి సాష్టాంగ దండప్రమాణమములు గావింపవలయును.

87. ఉ. ఇల్లుససర్పమైనఁ దన యిష్టుఁడు వైరికి మర్మమిచ్చినన్
గల్లనిజంబు లేర్పరుపఁ గానక భూపతి చంపఁ జూచినన్
దల్లివిషంబు వెట్టినను దండ్రి ధనాఢ్యులకమ్మఁ జూపినన్
వల్లభుఁడొల్లకున్న మఱి వారల కెవ్వరు దిక్కు భూవరా!

తాత్పర్యము—ఇల్లు పాములకిరువై భయంకరమైనను, తన స్నేహితుఁడు విరోధులలోఁగలసి వారికి గుట్టుచెప్పినను న్యాయాన్యాయ పరీక్ష సేయకయే రాజుచంపఁదలఁచినను తల్లి విషంబు వెట్టినను తండ్రి ధనవంతుల కమ్మఁజూపినను మగనికిష్టములేకున్నను వారి కెవ్వరుదిక్కు.

88 ఉ. ఆలములోనఁ గృష్ణవసు ధాధిపు దాడికినోర్వలేక యీ
కేలఁ బసిండి పంజరము కీ లెడలించినఁ బోకయిప్పుడా
గౌళపతీయటందు చిలుకా! కలకాలము పెంచినందుకా
మూలనునున్న వాని నీఁట ముంగిటఁ బెట్టుట నీకున్యాయమా

గౌళదేశపు రాజుమీఁద గృష్ణదేవరాయలు దండెత్తిపోఁగా నారాజుపాఱిపోయి దాఁగుకొనెను. ఆతఁడు పాఱిపోవునప్పుడు తాను చాలకాలమునుండి పెంచినచిలుకను పంజరమునుండి విడిచిపెట్టెను. ఆచిలుక పాఱిపోవక యెగిరి యాతనివెంటఁబోయి యతఁడు దాఁగియున్న చోటునకు సమీపమున నున్న యొక చెట్టుకొమ్మపై నుండి "గౌళపతీ! గౌళపతీ! యని పిలువఁజొచ్చెను, అప్పుడారాజు పైపద్యమునుజెప్పెనఁట,

పద్య తాత్పర్యము="చిలుకా! నేను కృష్ణదేవరాయల ధాటి కోడిపోయి పారిపోవుచు బంగారు పంజరములోనుండి నిన్నువిడిచి పెట్టినను బాఱిపోవక "గాళపతీ!" యని పిలుచుచున్నావు. చాల కాలము పెంచినందుకా మూలదాఁగియున్న నన్ను ముంగిటఁ బెట్టు చున్నావు."

89 క. మీరుం బొగఁ దాగుదురా,
వారిజభవ! వామదేవ! వైకుంఠపతీ!
యోరీనారద! వినరా!
యీ రేడుజగంబులందు నిది ముఖ్యమురా.

ఒకకవి హాస్యముగాఁ బొగచుట్టను గురించిపై పద్యముఁజెప్పెను

తాత్పర్యము=నారదుఁడు, బ్రహ్మవిష్ణు మహేశ్వరుల వద్దకుఁ బోయి "మీరును చుట్టతాఁగుచున్నారా!"యని యడిగెనఁట.దానికి వారు "ఓరీనారదా! ఈపదునాలుగు లోకములలో నిది ముఖ్యము రా" యని యుత్తరముఁ జెప్పిరఁట.

90 క. నగపగతు పగతు పగతుని,
పగతుంఁడౌ మగధరాజుఁ బరిమార్చినయా
జగజెట్టి యన్నతండ్రికిఁ
దగువాహన మైనయట్టి ధన్యుండితఁడే.

ఒకకవి తనబావమఱఁదినీపయిపద్యముఁజెప్పిహాస్యముచేసెనఁట

అర్థము=పర్వత శత్రుఁడగు దేవేంద్రునియొక్క, పగతు=పగతుఁడగు బలిచక్రవర్తియొక్క, పగతుని=పగతుఁడగువిష్ణుయొక్క,పగతుఁడౌ=పగతుఁడయినట్టి మగధరాజున్=జరాసంధుని పరిమార్చిన=చంపినట్టి ఆజగజెట్టి=ఆబాహుశాలియగు భీమునియొక్క అన్న=అన్నయైన ధర్మరాజుయొక్క తండ్రికి=తండ్రియగు యమధర్మరాజునకు

తగువాహనమైనట్టి ధన్యుండు=వాహన మగుటకుఁదగిన ధన్యుఁడు ఇతఁడే=ఈయనే యమధర్మరాజు వాహనము దున్నపోతు బావమఱఁది దిని దున్నపోతుతోఁ బోల్చిచెప్పెను.

బావకును మఱఁదలకులు జరిగిన సంవాదము. బావ మఱఁదలి తో సున్నము దెమ్మని యిట్లు హాస్యముగాఁ బలికెను.

తే. గీ. పర్వతశ్రేష్ఠపుత్త్రిక పతివిరోధి
యన్న పెండ్లాము నత్తను గన్నతండ్రి
ప్రేమతోఁడుత నాతని పెద్దబిడ్డ
సున్నమిప్పుడు తేఁగదే సన్నతాంగి

అర్థము=పర్వత శ్రేష్ఠపుత్త్రిక=అనఁగా పార్వతియొక్క పతి= మగఁడైనశివునియొక్క విరోధి=శత్రుఁడైన మన్మథునియొక్క అన్న= అన్నయగు బ్రహ్మయొక్క పెండ్లాము=భార్యయగు సరస్వతియొక్క అత్తను=అత్తగారగు లక్ష్మిని కన్నతండ్రి=తండ్రియగు సముద్రుని యొక్క ప్రేమతోఁడుత నాతని పెద్దబిడ్డ=ఆతనిచే ప్రేమింపఁబడిన యాతని పెద్దకూఁతురగు పెద్దమ్మవారైన సన్నతాంగీ=ఓస్త్రీ సున్న మిప్పుడు తేఁగదే=సున్నము తెచ్చిపెట్టుమా అనఁగా ఓపెద్దమ్మ వా రా! సున్నము తెచ్చిపెట్టుము.

92 మఱఁద లిట్లుత్తరముచెప్పెను.

క. శతపత్రింబుల మిత్రుని
సుతుఁజంపిన వానిబావ సూనుని మామన్
సతతము తలదాల్చునతని
సుతువాహన వైరివైరి సున్నంబిదిగో.

అర్థము—శతపత్రంబులమిత్త్రుని=పద్మబాంధవుఁడైన సూర్యు నియొక్క సుతు=కుమారుఁడైన కర్ణుని చంపినవాని=చంపినయర్జునుని యొక్క బావ=బావయగు కృష్ణునియొక్క సూనుని=కుమారుఁడైన

మన్మథునియొక్క, మామన్=మేనమామయగు చంద్రుని, సతతము తలఁదాల్చు నతని=ఎల్లప్పుడు తలను ధరించు శివునియొక్క, సుతు కుమారుఁడయిన విఘ్నేశ్వరునియొక్క, వాహన=వాహనమైన యెలుక యొక్క వైరి=శత్రువైన పిల్లియొక్క, వైరి=శత్రువైన కుక్కా సున్నంబిదిగో=ఇదిగోసున్నము.

౦౩ క. తారాపతి ధరసుతుఁడును
తారాపతియన్నసుతుఁడు తారాసుతుడున్
తారాపతిఁ జంపుదమని
తారాలోచించిరపుడు దర్పోన్నతులై

ఈపద్యమునకు రెండర్థములు కలవు. రామాయణార్థ మొక విధముగాఁ బొసఁగియున్నది. గాని భారతార్థ మంతగాఁ బొసఁగి యుండలేదు. ఐనను రెండును వివరింపఁబడుచున్నవి.

రామాయణార్థము—తారాపతిధరసుతుఁడును=చంద్రుని ధరించిన శివుని కుమారుఁడగు హనుమంతుఁడును. (హనుమంతుఁడును రుద్రతేజమునఁ బుట్టెనని పెద్దలు చెప్పుదురు) తారాపతియన్నసుతుఁడు=చంద్రుని యన్నయగు సూర్యుని పుత్రుఁడగు సుగ్రీవుఁడును, తారాసుతుఁడున్=ఆరాజు కుమారుఁడైన శ్రీరాముఁడును తారాపతిన్=తార భర్తయైన వాలిని చంపుదమని=చంపివేయుదమని దర్పోన్నతులై=గర్వోన్నతులై తారాలోచించిరపుడు=అపుడు తమరాలోచించుకొనిరి.

భారతార్థము—తారాపతిధరసుతుఁడును=శివుని పుత్రుఁడైన అశ్వత్థామయును (అశ్వత్థామ రుద్రతేజమునఁబుట్టెనని పెద్దలుచెప్పుదురు.) తారాపతియన్నసుతుఁడు=చంద్రుని యన్నయగు సూర్యుని పుత్రుఁడగు కర్ణుఁడును తారాసుతుఁడున్=రాజపుత్రుఁడైన దుర్యోధ

నుఁడును తారు=తాము ఆపతిన్=ఆరాజగు ధర్మరాజును దర్పోన్నతు లై=గర్వోన్నతులై చంపుదమని తారాలోచించిరి=చంపుదమని తమరాలోచించుకొనిరి.

95. క. అంచిత చతుర్థజాతుఁడు
పంచమమార్గమున నేగి ప్రథమతనూజన్
గాంచి తృతీయంబప్పురి
నుంచి ద్వితీయంబు దాటి నొగి నృపుగాంచెన్.

తాత్పర్యము—నాలుగవ జాతివాఁడు అయిదవమార్గమున వెళ్ళి మొదటిదాని కూతురుంజూచి మూడవదాని పట్టణమునందుంచి రెండవదిదాటి రాజుకడకుఁ బోయెను. పృథివ్యాపస్తేజో వాయురాకాశములని పంచభూతములు కలవుకదా! అందు మొదటిది భూమి రెండవది జలము మూఁడవదగ్ని నాలుగవది వాయువు అయిదవదాకాశము.

అర్థము—అంచిత చతుర్థజాతుఁడు=నాలుగవవానికిఁ బుట్టినవాఁడు (అనగా వాయుదేవుని కొడుకగు హనుమంతుఁడు) పంచమమార్గమున నేగి=ఆకాశవీథింబోయి ప్రథమ తనూజంగాంచి మొదటిదగు భూదేవికూఁతురునజూచి (అనఁగా సీతనుజూచి) తృతీయంబప్పురినుంచి=మూఁడవదగు నగ్ని నాపురమందుంచి (లంకానగరముఁ గాల్చి;) ద్వితీయంబుదాటి=రెండవదియగు జలమునుదాటి (అనగా సముద్రమునుదాటి) నొగినృపుగాంచెన్=రాముని జూచెను.

96. పొడుము బీల్చుటకు మిక్కిలి యలవాటుపడిన పండితుఁడెవరో పొడుము మహత్త్వమును వర్ణించుచు నీక్రిందిపద్యమును జెప్పెను.

సీ. ద్యోవాహినీద్వీప ధూమపర్ణంబులు
హరు నిటవిలోచ నాగ్నిగాంచి
జలజసంభవు కమం డలువునందున పాంచ
జన్యమూర్తికచూర్ణ సంగతముగ
ననిమిషధేను హ య్యంగవీనముబోసి
గామోదకీగదా గ్రిముననూరి
కైలాసవనబిల్వ ఘనశలాటువులోన,
సూరివిష్వక్సేను భూరివేత్రి
గీ. కోణశకలంబు ననుమూఁతఁ గూర్చియిడిన
పొడుముబీల్చుట సురలు కన్మూయరజుఁడు
ఫాలములవ్రాయు హరి జగ త్పాలనాప్తి
నడరు హరు డభిషేక జా డ్యంబు విడుచు.

తాత్పర్యము—ఆకాశగంగ లంకలో బెరిఁగిన పొగాకుఁదెచ్చి శివుని మూఁడవ కంటినిప్పుమీఁద కాఁచి బ్రహ్మదేవుని కమండలువు లో వేసి విష్ణుమూర్తి శంఖమగుపాంచజన్యపుచూర్ణము సున్నముగా వేసి కామధేనువుయొక్క క్రొత్త నెయ్యి యిందులోఁబోసి విష్ణు మూర్తిగదతోనూరి కైలాసవనమందున్న మారేడుచెట్ల కాయలలో బోసి విష్వక్సేనుని బెత్తపుచివర ముక్కలుకోసి యాకాయలకు బిరడాలు పెట్టి దేవతలందరు ఆ పొడుము పీల్చుచున్నారు. అదిపీల్చుటచేత నే దేవతలెప్పుడు కన్నుమూయరు. అది పీల్చుటచేతనే బ్రహ్మదేవుఁడు మనుష్యుల లలాటములమీఁద నక్షరముల వ్రాయుచున్నాఁడు. అది పీల్చుటచేతనే విష్ణువు జగత్పాలనముఁ జేయుచున్నాఁడు. అదిపీల్చుట చేతనే శివుఁడెల్లప్పుడు నభిషేకముచేతఁ దడియుచున్నను జలుబులేక సుఖముగ నున్నాఁడు.

97. చ. గరళపుముద్దలోహ మవ గాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్నికొల్మి యురగాధిపు కోరలుపట్టుకార్లుది

క్కరఁటి శిరంబు దాయ యిలకాలుఁడు కమ్మరివై రివీరసం
హరణగుణాభిరాముఁడగు మైలము భీమన ఖడ్గసృష్టికిన్.

ఈపద్యము వేములవాడ భీమకవి చెప్పినది. మైలముభీమన్న యను గొప్ప పరాక్రమశాలి చేతిలోనున్న కత్తి యీపద్యములో వర్ణింపఁబడినది. ఆకత్తి యెవ్వనిమీఁద విసరఁబడునో వారందఱుఁ దప్పక మృతినొందుచు వచ్చినందున నాఖడ్గము సామాన్యమైనలోహముతో లోకములోనున్న కమ్మర్లచేతఁ జేయఁబడక దారుణమైనవస్తువులతోఁ జేయఁబడినదని కవి వర్ణించియున్నాఁడు.

తాత్పర్యము—మైలము భీమన్నయొక్క ఖడ్గము సృజించుటకు గరళపుముద్ద యినుముగాను, పిడుగులు సమ్మెటలుగాను సాంబమూర్తి మూఁడవకన్ను కొలిమిగాను ఆదిశేషునికోరలు కారులుగాను దిగ్గజముయొక్క శిరము దాయిగాను కల్పించి ప్రళయకాల యముఁడు కమ్మరియై యీఖడ్గమును జేసెను.

98. ఉ. వేములవాడ భీమకవి వీరునిచూచి కళింగ గంగు తా
సామయి వాని కోపమున సందడిదీఱిన రమ్ము పొమ్మనన్
మోమునుజూడ దోషమిఁక ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్థ మందతని సంపద శత్రులఁ జేరు గావుతన్.

వేములవాడ భీమకవి రాయకళింగ గంగును జూడఁబోగా నతఁడు "ప్రస్తుతము సందడిగానున్నది. సందడి తీఱినవెనుక రమ్మని చెప్పెను. అందు కతఁడు కోపించి "యీతని మొగము జూడఁగూడదు ఈతని యైశ్వర్యము ముప్పదిరెండుదినములు వెళ్ళిన తరువాత ముప్పదిమూఁడవ దినమున జామునర ప్రొద్దెక్కినతరువాత నశించు"నని శపించెనఁట. ఆశాపము ననుసరించి యతనిసంపద శత్రురాజులచే హరింపఁబడెనఁట. అతఁడట్లు రాజ్యభ్రష్టుఁడై మిక్కిలి దీనదశలోనుండి

యొకనాఁడు రాత్రి చీఁకటిలోఁ బోవుచు నొక గోతిలోఁబడి యిట్లను కొనెనట, "అకటకటా! అంతటి యైశ్వర్యమనుభవించిన వానికి సందె దివ్వటియైన లేకపోయెనుగదా" అనుపలుకులు వేములవాఁడ భీమకవి చెవినిఁబడగా నతఁడు కళింగ గంగుమీఁద జాలిపడి మరల మునుపటి యైశ్వర్య మిప్పింపఁదలఁచి యీ క్రిందిపద్యముఁ జెప్పెనఁట.

99. ఉ. వేయి గజంబులుండఁ బది వేలతురంగములుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనగ రంబున బట్టముకట్టుకో వడిన్
రాయకళింగగంగు కవిరాజు భయంకరమూర్తిఁ జూడఁదాఁ
బోయిన మీనమాసమునఁ బున్నమపోయిన షష్ఠినాటికిన్.

తాత్పర్యము—వేయి యేనుగులుండఁగా పదివేలగుఱ్ఱములుండఁగా నీకేమిభయము. శతృవులనుగెల్చి సజ్జాపురమునఁ బట్టముకట్టు కొని సుఖముగానుండుము.

అనవుడు రాయకళింగ గంగు మిక్కిలి సంతోషించి శతృవుల గెల్చుట యెట్లని యాలోచించుచుండ నతనికి గొందఱు నాటకులగప డిరి. కళింగగంగుయొక్క శతృరాజు లదివఱకా నాటకులం బిలిపించి రాయకళింగగంగు తనచేత నోడింపఁబడి మిక్కిలి దీనముగానుండుట జేసి యాకథయెల్ల నొకనాటకముగా గూర్చి తనకు వినోదముగా నా డుమని యాజ్ఞాపించెను. నాటకులట్లేయని యొకకవిచే రాజకళింగగం గుచరిత్రి నాటకముగా వ్రాయించుకొని రాజువేసగాఁడు దొరకక తి రుగులాడుచు కళింగగంగును కలిసికొని యతఁడెవ్వరో యెఱుఁగక త మనాటకములో రాజువేషము వేయగలవాయని యడిగిరి. కళింగగంగు తనపేరు చెప్పక సరియేయని యొప్పుకొని సజ్జాపురముఁబోయి రాజు వేషము వేసి తనవేషమున కనుగుణముగా నుండునట్లు రాజుగారికత్తి యు గుఱ్ఱము నడిగి పుచ్చుకొని నాటకమాడి సగము నాటకమైనపిద

ప వినోదముగా జూచుచున్న శతుౖరాజును కత్తితోఁబొడిచి చంపి గద్దెమెక్కెను.

100. శా. ఆనీతాభ్యుపదానశృంఖల పదా భ్యాలంబిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవి నే నిం జిత్రికూటంబులో
భూనావ్యాపిత పల్లవోద్భవ మహా పుష్పౌపగుచ్ఛంబులన్
నానాపక్వఫలప్రదాయివగుమా నాకల్పవృక్షాకృతిన్.

ఒకనాఁడు రాజు వేములవాఁడ భీమకవితో గలిసి యుద్యాన వనములోఁ గూర్చుండి మల్లెపందిరి గుంజమీఁద కాలుపెట్టి భీమకవిని జూచి "నీవన్నమాట సరిగాజరుగునుగదా? ఈపందిరిగుంజను యెప్పటి యట్ల చెట్టుగాఁజేయు" మనెను. అట్లేచేయుదునని భీమకవి పయిపద్యముఁ జెప్పెనఁట.

తాత్పర్యము—నేనే వేములవాడ భీమకవినైన పక్షమున నీ పందిరిగుంజ యెప్పటియట్లు పువ్వులతోను కాయలతోను నిండి చెట్టగుగాక,

రాజుకాలు చెట్టులో నిరుకుకొని పోయినందున తన కాలూడి వచ్చునట్లు మరల దానిని పందిరిగుంజను చేయుమని భీమకవినిగోరగా నతఁడీ క్రిందిపద్యముఁజెప్పెనఁట.

101. ఉ. శంభువర ప్రసాద కవి సంఘవరేణ్యుఁడనైన నావచో
గుంభనచేయ నెంతొయను కూలతనొంది తనూన భావనన్
గుంభినిఁ జొక్కనామనృప కుంజరు పందిటి మల్లెసాలకున్
స్తంభమురీతి నీతనువుఁ దాలిచి యెప్పటియట్ల యుండుమా!

య=శివవరప్రసాదమున బుట్టిననామాటచేత నీవు పువ్వులుఁ గాతాలుగలిగి చెట్టువయితివి. మరల నెప్పటియట్ల చొక్కరాజుయొక్క మల్లెసాలకు స్తంభమవై యుండుము. అనఁగానే యది యెప్పటియట్ల స్తంభమయ్యెనఁట.

102. చ. హయమది సీత పోతనను ధాధిపుఁడారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ సహ్యజవారిధిమారుడంజనా
ప్రియతనయుండు లచ్చన విభీషణుఁ డా గుడిమెట్టలంకనా
విజయము బోతరక్కసుని చావును నేడవనాఁడుఁ జూడుడీ.

వేములవాఁడ భీమకవి యెక్కుడి గుఱ్ఱమును గుడిమెట్ట ప్రభువైన పోతరాజుహరింపఁగా, గవిరాక్షసుఁడైనభీముఁడీపద్యమును జెప్పెనఁట.

తా—గుఱ్ఱము సీత పోతరాజు రావణాసురుఁడు నేనే శ్రీరాముఁడను ఈనదియే సముద్రము మారనయే హనుమంతుఁడు లచ్చన విభీషణుఁడు ఆగుడిమెట్ట లంక నాజయమును పోతరక్కసుని చావు, ఏడవనాఁడు తెలియును,

103. క. కూటికిఁ గాకులు కూసెను
నేటావల మూకఁగూడి యేడువదొడగెన్
గాటికిఁ గట్టలు చేరెను
లేటవరపు పోతరాజు లేఁడా! లేఁడా!

తురగా రామకవి లేటవరపు పోతరాజును జూడఁబోగానతఁడు పిసినిగొట్టగుటచే రామకవి కేమైన నీయవలసివచ్చునని నింటనుండియే లేఁడనిపించెనఁట ఆసంగతి రామకవి గ్రహించి "అయ్యో పాపము లేఁడా లేఁడా" యని లేఁడన్నమాటలకు చచ్చినాఁడను నర్థముఁ గల్పించి "పిండాలకూటికై కాకులుకూయుచున్నవి. కాటికిపుల్లలుచేరినవి. ఏటావల జనులందఱు గొల్లున నేడ్చుచున్నారు. లేటవరపు పోతరాజు లేఁడా లేఁడా" యని ఈపద్యముఁ జెప్పెను. ఆపద్యముఁ జెప్పగానే పోతరాజు మృతినొందెనఁట. అప్పుడు పోతరాజుభార్య రామకవి పాదములపైఁబడి పతిభిక్షము పెట్టుమని వేఁడఁగా నతఁడు కరుణించి మరల నీక్రింది పద్యముఁజెప్పి తనశాపము త్రిప్పి వానిని బ్రతికించెనఁట

104. క. నాటిరఘురాముతమ్ముఁడు
పాటిగ సంజీవిచేత బ్రదికినరీతిం
గాటికిఁ బో నీడి కేటికి
లేటవరపు పోతరాజ లెమ్మా! రమ్మా!

తా—పూర్వకాలము రాముని తమ్ముఁడైన లక్ష్మణుఁడు సంజీవిచేత బ్రతికినట్లు పోతరాజా నీవు కాటికి వెళ్ళవలసిన యవసరము లేదు. లేచిరమ్ము.

105. క. బడబానల భట్టారకు
కుడిచేయుంగరము రవికి గొబ్బున నర్ఘ్యం
బిడు వేళను నీలో
బడియె దటాకంబ నీటి బాయుము వేగ౯.

బడబాగ్నిభట్టను మహాకవియొక్క యుంగరము నీటిలో పడిపోగా నతఁడీపైపద్యముఁజెప్పి చెఱువింకించెనఁట.

తా—బడబానల భట్టారకుఁడు సూర్యున కర్ఘ్యప్రదానమిచ్చుచుండగా కుడిచేయుంగరము నీటిలోఁ బడిపోయినది. కాబట్టియో తటాకమా! నీరు లేకుండా నెండిపొమ్ము.

106, క. సాళువ పెద్దతిమ్మ మహీ
పాలవరుఁడు వీఁడెవచ్చె బద్యము వ్రాయన్
గేలను లే దాకొక్కటి
తాళమ! ముత్తునియలగుచు ధరపైఁ బడుమా.
ఈపద్యము మేధావిభట్టు చెప్పెను.

తా—సాళువ పెద్దతిమ్మరాజు పద్యము వ్రాయుమనినన్నుకోరెను వ్రాయుటకాకు లేదు. కాబట్టి యోతాటిచెట్టా! ఊడికిందపడవే!

107. క. గుడియన్న నృపతిఁ బొడఁగన
నడవంగాఁ గొండపల్లి నగరి పడమటన్
గుడిమెడమ మడమ గాడిన
చెడుముండులు బ్రహ్మెఁడి చెట్టున డుల్లున్.

ఈపద్యము పౌరిధకవి మల్లన్న చెప్పెను.

తా—రాజును జూచుటకు కొండపల్లిదారిని నేను బోవుచుండగా దారిని రెండుపక్కల బ్రహ్మెదండి ముండ్లుండి నామడమకు గుచ్చుకొనెను ఈముండ్లిక నెవ్వరికి గుచ్చుకొనకుండ చెట్లనుండి క్రింద రాలిపోవుఁగాక !

108 ఒకకవి చాకలివాండ్రను గురించి చమత్కారమైన యీ క్రిందిపద్యము చెప్పెను.

ఆ. వె. చాకివానితోడ జగడాలు పడలేక
శిరిగలాడు పట్టుచీరకట్టె
శివుడు తోలుగట్టె సీ! యని మదిరోసి
భైరవుండు చీరపాలివైచె.

చాకలివానిబాధ పడలేక విష్ణుమూర్తి పట్టుబట్ట కట్టుకొనియెను. విష్ణు పీతాంబరుడు గనుక కవి యట్లు చెప్పెను. శివుడు చర్మము కట్టుకొనియెను. కాలభైరవుడు ఛీ యీబట్టకట్టుకొననేల యని దిగంబరుడయ్యెను.

10). నల్లిబాధను గురించి మఱియొకకవి విచిత్రముగా నిట్లు చెప్పెను.

క. శివుడదిరిని వశియించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం

డవిరళ సముద్రమందున
బవళించుట నల్లిబాధ పడలేకసుమీ.

శివుడు కైలాసపర్వతముమీద కాపురముండుటకు సూర్యచంద్రులు ఆకాశముమీద సంచరించుటకు విష్ణుమూర్తి సముద్రములో పండుకొనుటకు కారణమేమనగా, వారు నల్లులబాధ పడలేక వారాప్రకారముచేసిరి.

110. ఒకయోడమీగ నొకవర్తకుడు ప్రయాణముచేయుచుండెను. ఓడకళాసుతో వర్తకుడు బహువిషయములు మాటలాడి "ఓయీ నీతండ్రితాత లెక్కడమరణమందిరి"యనియడిగెను. "అయ్యా నాతండ్రియు, నాతాతయు, నాముత్తాతయు గూడనావలమీద కళాసులై సముద్రముమీదనే చనిపోయిరి" అని యతడుబదులుచెప్పెను. అనవుడు వణిజుడు "ఓయీ! యీసముద్రము మీవారినందరినిమ్రింగినదికదా నీవు మఱల సముద్రముమీదనే పనిచేయుచున్నావే నీకుభయములేదా!" యని యడిగెను. అందుకు కళాసి "అయ్యా, మీతండ్రి తాతలెక్కడ మృతినొందినారు"

వర్తకుడు—మామేడమీదనే మృతినొందినారు.

కలాసి—నీమేడ మీతండ్రితాతలను మ్రింగినదికదా యింకను దానిలో నీవు వసియించుచున్నావు నీకు భయములేదా.

వర్తకుడు—(చిరునవ్వునవ్వి) అవును నిజమే. ఎవరికి యేవృత్తి యభ్యాసమో అదియే సుఖప్రదముగానుండును. ఎవరికెక్కడ వసియించుట యలవాటో వారికక్కడ భయముండదు.

111 ఒకకుక్క పదిమంది నడచుచున్న బాటమీద నడ్డముగా పండుకొనెను. ఒకబాటసారి దానినిజూచి "ఓసీ! నీకు బుద్ధిలేదా, దారికడ్డముగా పండుకొని లేవకున్నావు? పొరబాటుచేత నెవరైన మీద కాలువైచినపక్షమున వెంటనే పట్టుకొని పీకెదవు, ఇదియేమి

పాడుపని" యని కోపపడెను. కుక్క వానికిట్లనియె. "అయ్యా! ఈ దారిని పోవువారిలో మంచివారెవరో చెడ్డవారెవరో కనిపెట్టుటకై నేనిక్కడ నడ్డముగా బండుకొన్నాను. మంచివారిని చెడ్డవారిని నీవే లాగున కనిపెట్టగలవని మీరందురేమో వినుండు నాజోలికి రాకుండ తమదారిని బోవువారు మంచివారు. నిష్కారణముగా నన్నుతన్ని కొట్టి హింసించువారు చెడ్డవారు. నేనడ్డముగా పండుకొన్నప్పటికి మీరు పోవుటకు రెండుపక్కలను కావలసినంత స్థలమున్నది.

112. ఒకరాజునొద్దకు గుఱ్ఱముల వర్తకుండొకడువచ్చి మహాప్రభూ! "నావద్ద మంచి లక్షణములుగల గుఱ్ఱమున్నది. అది యెవరి దగ్గఱనుండునో వారు చక్రవర్తులయ్యెదరు. దానివెలఅయిదువేలరూపాయలు. దేవరవారు సొమ్మిచ్చినపక్షమున దానినిప్పుడే తెచ్చిమీకప్పగించెదను!" అని పలికెను. రాజు మంత్రిని పిలిచి తత్క్షణమే అయిదువేల రూపాయలిమ్మని యాజ్ఞాపించెను. మంత్రిరాజుతో నిట్లు మనవిచేసెను: "స్వామీ! ఆగుఱ్ఱము మనము చూడలేదు; అది యింతఖరీదు చేయునో లేదో తెలియదు? ఇతడు గుఱ్ఱాలవర్తకుడు అవునో కాదో, యితనిదగ్గఱ గుఱ్ఱములున్నవో లేవో తెలియదు," అనవుడు రాజు కండ్లెఱ్ఱచేసి నీపద్ధతి యెప్పుడు నిట్లేయున్నది; ప్రపంచములో నెవరిని నీవు నమ్మవు; నమ్మకములేనియెడల వ్యవహారము లెట్లు జరుగును? వాడు పెద్దమనుష్యుడు; కావున వెంటనే వానికి సొమ్మిచ్చివేయుము అని యానతిచ్చెను; మంత్రి యాప్రకారమేచేసి మరునాడు నొకకాగితముమీద ఒకటి, రెండు, మూడు అని అంకెలువైచి ఒకటవ యంకెకు నెదురుగా నేమియువ్రాయక స్థలము వదలిపెట్టి, రెండవయంకె కెదురుగా రాజుగారిపేరును, మూడవయంకె కెదురుగా తనపేరును వ్రాసికొనియెను; ఆకాగితము రాజుగారిచేతిలో పడగా దానియర్థమేమిటని రాజుగారడిగిరి; మంత్రి యిట్లు చెప్పెను; "నేను

తెలివితక్కువవారి పేర్లు వ్రాసినాను. గుఱ్ఱమునిమిత్తము సొమ్ముప్ర చ్చుకున్నవాఁడు మఱల మనకు కనబడినపక్షమున తెలివితక్కువవారి లో మొదటవాడే యగును వానిపేరే మొదట వ్రాయవలసియుండు ను గనుక మొదటి యంకెదగ్గఱ స్థలము వదలివైచితిని వాడు వచ్చి నయెడల రెండవ తెలివితక్కువవారు మీరు. మీమాటనుబట్టి సొ మ్మిచ్చినందుకు మూడవ తెలివితక్కువవాడను నేను వాడు రాని యెడల మొదటివారుగా మీపేరు వ్రాయవలసియుండును అప్పుడు నేను రెండవవాడనగుదును. గుఱ్ఱాలవర్తకుడు తిరిగికనబడలేదు రాజు గారు తన తెలివితక్కువకు తానే సిగ్గుపడెను

11వ ఒక పశువులసంతలో నొక కాపువాడు తనయెద్దు నమ్ము కొనుటకుఁ బోయెను మరియొకఁడు తన యావును విక్రయించుటకుఁ బోయెను వారిద్దరు కలిసికొని వానియెద్దునువీడును వీనియావును వాడును మార్చి పుచ్చుకొనుట కేర్పాటుచేసికొనిరి నీ యెద్దెట్టిదని యావుఁగలవాఁడడిగెను; ఎడమప్రక్కదాసోహము, కుడిప్రక్కదా సోహమని వాడుత్తరముచెప్పి ‘నీయావెట్టిదని వానినడిగెను; ‘పొద్దు న్న ముంత గోవింద రాత్రి ముంత గోవింద’ అని గోయజమానుఁడు బదులుచెప్పి యెద్దు మంచిదని వాఁడు, గోవు మంచిదని వీఁడుసంతసిం చిగృహములకుపోయిరి; మరునాడావును పాలు పిండబోగా నది రెం డుపూటల పిదుకవచ్చినవారిని చెడదన్ని ముంత పగులఁగొట్టెను.

కాపువాడెద్దును బండికికట్టగా కుడిప్రక్కఁగట్టిన నెడమప్రక్క గట్టిన నది నడువక నేలపై బండుకొనసాగెను; ముంత గోవింద అను మాటకు దాసోహమను మాటకు నొక్కయర్థము వారికప్పుడు తోచెను.

సమాప్తము.

—oo—

# చమత్కారమంజరి

## భారవి

### మొదటి ప్రకరణము.

భారవి సంస్కృతమహాకవులలో నొకఁడు. బ్రాహ్మణుఁడు. కిరాతార్జునీయమను మహాకావ్యమును సంస్కృతములో రచించెను. ఈతనికవిత్వము మిక్కిలి యర్థగాంభీర్యముగలిగి రసవంతమయియుండును. "భారవేరర్థగౌరవ" మ్మనునట్టి యార్యోక్తి పయివిషయమును స్థిరపఱచుచున్నది. ఈమహాకవినిగూర్చి చిత్రమయిన యొకకథకలదు ఇది సత్యమయినదని మేము స్పష్టముగా చెప్పఁజాలము. సత్యమయినను గాకపోయినను చిరకాలమునుండి పండితముఖమునుండి పారంపర్యముగ వచ్చుటచేతను, వినోదకరముగా నుండుటచేతను ఈకథవ్రాయుచున్నాము. భారవిభట్టుయొక్కతండ్రి భవానీభట్టు. ఈతఁడుగూడ గొప్పపండితుఁడు. అట్లగుటచేఁ దనకుమారునకుయుక్తవయస్సువచ్చినతోడనే వానినివిద్యాప్రవిష్టునిఁజేసి యతని కిరువదిసంవత్సరములు దాఁటకమున్నె గొప్పపండితునిఁ జేసెను. బాల్యవయస్సు. వయస్సునకు మించిన పాండిత్యము. పాండిత్యమునకుదగిన కవిత్వము. విద్యాకవిత్వములకుఁదగిన వినయసంపత్తి భారవిభట్టునకుఁ బెట్టనియలంకారములయి, వానికి విశేషకీర్తిని సంపాదించెను. "పుత్రాదిచ్ఛేత్పరాజయ" మ్మను నార్యోక్తి భవానీభట్టునందు సార్థకమయ్యెను, భారవి పాండిత్యమునందు సత్కవిత్వమునందు శాస్త్రప్రవాదములందు తన జనకుని మించెను. అందుచే భవానీభట్టు సర్వవిధముల తన్నుధన్యునిగా భావించెను. భారవిభట్టుయొక్క ప్రజ్ఞావిశేషములనుమెచ్చి విద్వాంసు

లెవరయిన భవానీభట్టునొద్ద కుమారుని స్తోత్రముచేసినప్పుడు భవానీ భట్టు "కుఱ్ఱవాఁడు. వానికేమి తెలియును? వానికేమియు రాదు. మీకు వానియందుగల యభిమానముచేత నట్లనుచున్నారు. స్తోత్రము చేయఁదగినంత గొప్పతనము వానియందులేదు" అనిపలుకుచుండును.

కుమారునిస్తోత్రము తండ్రివినఁగూడదనియు నెవరయిన పొగ డినప్పు డీవిధముగానేపలుకవలయు ననియు మనపెద్దలు చెప్పుదురు. ఇతరులతోపాటు తండ్రికొడుకును మెచ్చుకొనిన పక్షమున కుమారున కాయువు క్షీణమగునని మనవారియభిప్రాయము. అదియునుఁగాక ఆత్మావైపుత్రనామాసి" అను వేదవాక్యము కలదు. మనుష్యుఁడు తా నే పుత్రరూపమయి జన్మించుచున్నాఁడని దాని తాత్పర్యము. అందు చేత జనకుఁడు పుత్రుని మెచ్చుకొనుట తన్ను మెచ్చుకొనుటయే య గును. ఆకారణముచేతఁగూడ తండ్రి కుమా.ునిస్తోత్రము వినఁగూడ దని పండితులయభిప్రాయము. ఇవియన్నియు మనస్సులోబెట్టుకొని భవానీభట్టు కుమారునిపొగడ్తకు విముఖుడయ్యెను. ఇది భారవిభట్టు నకు మిక్కిలి కష్టమైతోఁచెను. దిగ్గంతులవంటి మహాపండితులు దేశ దేశములనుండివచ్చి తన్ను స్తోత్రముచేయుచున్నప్పుడు దనతండ్రి వా రితోఁ గలిసి తన్నుఁబొగడకపోవుటయేగాక మీఁదుమిక్కిలి తన్ను హీనునిఁగా తండ్రి పరిగణించుటచేత భారవిభట్టునకు తండ్రిమీఁద మిక్కిలికోపమువచ్చెను. తనపాండిత్యప్రకర్షముం జూచి, యోర్వలేక తండ్రి యిట్లుచేయుచున్నాఁడని యతఁడు భావించెను. కొడుకుపొగ డ్త తండ్రివినఁగూడదను సంప్రదాయము భారవిభట్టు వినలేదు. అం దుచే నతనికి తండ్రియభిప్రాయ మించుకయిన దెలియక యీవిధమ యిన క్రోధమునకు వశుఁడయ్యెను. అటులుండ నొకనాఁడొక గొప్ప సభజరిగెను. ఆసభలో సుప్రసిద్ధులయిన మహావిద్వాంసులు భారవి భట్టుచే నోడింపఁబడిరి. అప్పుడు సభాసదులెల్ల భళీభళీయని భారవిభట్టు

ను మెచ్చి పొగడిరి. కుమారునివిజయమునకు తండ్రి మహానందభాష్పములు విడిచి లోలోనసంతోషించియు ''వానికేమి తెలియును? వానికేమి తెలియును? వానియొద్ద స్తోత్రముచేయఁదగిన గొప్పతనములేదు" అని తన వాడుకప్రకారము ప్రశంసను మందీకృతముచేసెను. అప్పుడప్పు డొక రిద్దఱు పండితులయొద్దనే తండ్రి తనప్రజ్ఞ నల్పముగఁ జేసి మాటలాడినందుకే మనస్సులో నెంతో కుందుచున్న భారవిభట్టున కా సమయమున జనకుఁడుపల్కిన పలుకులు ములుకులవలెనాటెను.

నాటుటయు, నాతఁడు చివాలున సభలోనుండిలేచి యింటికిఁ బోయి తల్లికడకుం జని యిట్లనియె—"అమ్మా! యెన్నిదినములనుండియో నీతో నేనొకమాట చెప్పందలఁచి యెప్పటికప్పుడే పోనీ యెందుకని యూరకుండుచు వచ్చితిని. నాపాండిత్యమునుంజూచి నాయన యోర్వలేక నన్నందఱముందు నిందించుచుండును. నాస్తోత్రముగిట్టదు. ఎవ్వరెప్పుడు నన్ను స్తోత్రముచేసినను 'వాఁ డేమెఱుఁగును? కుఱ్ఱవాఁడు. వానికేమియురాదు.' అని నన్ను హీనునిగాఁ బరిగణించుచుండును. దేశములో నున్న పండితులకందఱకు నెంతో పూజ్యుఁడనయి యున్న నేను వీనికంటికి గడ్డిపరకగాఁ గనఁబడుచున్నానుగాఁబోలు! ఈతనిపాండిత్యమెంత? ఈతఁ డెంత? నాముందర నిలుచుండుటకయినఁ దగఁడు. ఈతనిం జంపివేయవలయునంత కోపము నాకువచ్చుచున్నది. ఈతఁడు నాకు తండ్రికాఁడు పరమశత్రువు. ఈతని మొగము జూడఁ దలంచుకోలేను. వీనిమొగముఁజూచిన మహాపాతకమువచ్చును. ఇతని యింట నుండఁదలఁచుకోలేను. ఇంకొకసారి యీవిధముగా నన్నుగుఱించి ప్రశంసించినపక్షమున నెత్తురుకన్నుల జూచెదనని స్పష్టముగాఁ జెప్పుము. నేటిదినము మహావిద్వాంసులసభలోఁగూడ నీవిధముగానే పరాభవించినాఁడు. దీనిని సహింపఁజాలనని చెప్పుము." ఆపలుకులు వినఁగానే తల్లి నిశ్చేష్టితురాలయి, కొంతవడి కిట్లనియె. "నాయనా

తొందరపడకు. మీనాయనగారు వయస్సుచేతనువిద్యచేతను మిక్కిలి పూజ్యులు. ఆయన యవివేకులుగారు. ఆయనయెందుచేత నిట్లనుచున్నారో కారణము తెలిసికొని చెప్పెదను. అంతవఱకు తొందరపడకు నాయనా" యని చెప్పఁగానే, సరే కనుఁగొనినాతోఁ జెప్పుము. కారణ మేముండును? ఓర్వలేనితనమె" యని సణగుకొనుచు నతఁ డావలికిఁ బోయి గదిలోఁ గూర్చుండెను. తర్వాత భవానీభట్టు గృహమునకు వచ్చెను. రాఁగానే, భార్య కొడుకు తనతో చెప్పినమాటలాయన నడిగి, కుమారునియొక్క మనోవైకల్యము నంతయుఁ దెలిపెను. భవానీభట్టు విషాదసంతప్తమానసుఁడయి యిట్లనియె. "నాకుమారుఁడింత తెలివి తక్కువవాఁడగునని నేనెప్పుడు తలంపలేదు. తండ్రి కుమారుని దాను స్వయముగా స్తవమొనరింపఁగూడదు. మఱియొకరు స్తవమొనరించుచున్నప్పుడు వినియూరకుండఁగూడదు. తానుఁగూడ నితరులతోఁగలసి కొడుకును మెచ్చుకొన్న,కొడుకున కాయువుక్షీణమగును. అందుకు భయపడి వాని కేమి తెలియునని పలుకుచు వచ్చితిని. వానికేమి తెలియదని నాయభిప్రాయము కాదు. వాఁడు నాకంటె గొప్పపండితుఁడు. నాకంటెనేకాదు. వానితో సమానుఁడయిన విద్వాంసుఁ డీనాఁటి పండితులలో లేనేలేడని చెప్పవచ్చును. నాకొడుకునుబొగడుట నన్ను నేబొగడుకొనుటయని మానితిని గాని వానికీర్తి తగ్గించుటకుఁ గాదు. ఇటువంటి కుమారరత్నము నాకుఁగలిగినందుకు మనస్సులో నేనెంత సంతసించుచున్నానో పరమేశ్వరుఁ డెఱుఁగును. వాఁడునాకుల దీపమని, నావంశాలంకారమని నాపుణ్యముపంట యని నేనుసంతోషించుచున్నాను. చిన్నతనముచేత వానికీవిషయము తెలియక దురభిప్రాయపడినాఁడు. మనస్సులో నట్టియభిప్రాయ ముంచుకోవద్దని యాతనితోఁ జెప్పుము." ఈమాట గదిలోనున్న భారవిభట్టుచెవినిబడెను. పడఁగానే యతఁడు తాను తండ్రివిషయమయి పడిన దురభిప్రాయము

నకు మిక్కిలి పశ్చాత్తాపమొంది, మెడకు బట్టఁజుట్టుకొని కన్నీళ్ళతోఁ దండ్రికాళ్ళపయిఁబడి తాజేసిననేరము క్షమింపుమని వేఁడుకొని చేయఁదలఁచిన పితృద్రోహమహాపాతకమునకుఁ దగినప్రాయశ్చిత్తము విధింపుమని ప్రార్థించెను. పాదములపయి బడ్డకొడుకును లేవనెత్తి తండ్రి "సంవత్సరమత్తవారియింటనుండి రమ్ము. దీనికిదే ప్రాయశ్చిత్త" మని విధించెను.



రెండవప్రకరణము—అత్తవారియింట నివాసము.



తండ్రిని నిందించినందుకుఁ జంపఁదలఁచినందుకు మహాప్రాయశ్చిత్తముగా భారవిభట్టు కొంతకాల మత్తవారియింటఁ దనతండ్రి యానతిచ్చినచొప్పున వాసముచేయుటకు నిశ్చయించుకొని తల్లిదండ్రులను విడువవలసివచ్చినందుకు మిక్కిలి విచారించి పయనమయి బయలుదేఱిపోయెను. కొడుకును విడువలేక తలిదండ్రులువిచారించిరి భారవిభట్టుయొక్క భార్య పుట్టినింటనేయుండెను. పునస్సంధానమయినది కాని యామె నత్తవారింటికిఁ బంపలేదు. అల్లుండు వచ్చినతోడనే యత్తమామలు బావమఱఁదులు ప్రత్యుత్థానముచేసి సాధారణముగా సగౌరవముగా లోపలికిఁ దీసికొనిపోయి, సకలోపచారములు చేసిరి. మూఁడునాలుగుదినము లయినతరువాత మామగారు వచ్చినపని యే మని యడిగిరి.

తనదుర్వ్యసనయమునకు ప్రాయశ్చిత్తముగాఁ నత్తవారింటనుండ వలసివచ్చినట్లు చెప్పక కొన్నికారణములచేతఁ దనకుం దండ్రికి మన స్పర్ధలు బయలుదేఱుటచేతఁ గొంతకాల మిక్కడనుండవలసివచ్చినట్లు చెప్పెను. అది విని మామగారు పెదవి విఱిచెను. ఆదినము మొదలు కొని భారవిభట్టున కదివఱకు జరుగుచుండిన గౌరవాదులు క్రమక్రమ

ముగా సన్నగింపజొచ్చెను. మొదటి మూఁడుదినములయందు వలె నెగువపీఁటలు దిగువపీఁటలు వేసి యల్లుని గూర్చుండఁబెట్టుటలేదు. అడుగకముందే యతనికిఁగావలసిన వస్తువులు పూర్వమువానియొద్దకు వచ్చుచుండెడివి. ఇప్పుడు పదిసార్లడిగినను వచ్చుచుండుట లేదు. పూర్వ మల్లునకు భోజనము పెందలకడఁ జేసిపెట్టుచు వచ్చిరి. ఇప్పుడంద అతోపాటు రెండుజాములు దాఁటినపిమ్మటనే మొదటిభోజనము జరుగుచు వచ్చినది. ఇతరసౌఖ్యములన్నియు నీవిధముగానే యడుగంటినవి. బావమఱఁదులు భారవిని దమపొలములోనికి రమ్మని తీసికొని వెళ్లి మెల్లమెల్లగా నొక్కొక్కపనిఁ జేయించి తుట్టతుదకు పాఱగునపము తట్ట చేతికిచ్చిరి. భారవిభట్టు సకలపురాణములు సకలేతిహాసములు చదివిన మహావిద్వాంసుఁడగుటచే "నవస్థాభేదమునుబట్టి రాజ్యసుఖములు విడిచి రథసారథియైన నలచక్రవర్తికంటె, చండాలసేవజేసిన హరిశ్చంద్రునికంటె, సన్యాసియైన ధర్మరాజుకంటె, వంటలవాఁడయిన భీమునికంటె, జడలుదాల్చి వనవాసముచేసిన రామునికంటె మన మెక్కువవారమా? అనుభవింపవలసివచ్చినప్పుడు సుఖదుఃఖముల రెంటిని సమానముగ ననుభవింపకతప్ప" దని మనస్సు కుదుటపఱచుకొని యత్తవారేపనిఁజెప్పిన నాపనిశ్రద్ధాళుఁడయి కూలివానికంటె నెక్కువ జాగరూకతతోఁ జేయఁజొచ్చెను. కొన్నిదినము లెవరో యొకరుపొలములో నుండవలసివచ్చినందున బావమఱఁదులు భారవిభట్టునే యక్కడ నుండుమని యాజ్ఞాపించిరి. అతఁడు వారియాజ్ఞ శిరసావహించి యక్కడనే యుండెను. అత్తవారు వానికి భోజనము భార్యచేత ప్రతిదినము పొలమునకుఁ బంపుచువచ్చిరి. భారవి నెంద అవమానపఱచినను నెంద అలుసుచేసినను భార్యమాత్రి మాతనియందుఁ బరమభక్తిగలిగి తనపుట్టినింటివారు తనభర్తయెడలచేయుచున్న యపచారమునకు మిక్కిలి కుందుచు దానుజేయునదేమియులేక తనశక్తివంచనలేక యాత

సికి సకలోపచారములు చేయుచు, నెప్పుడు తన పుట్టినింటనుండి తా
మిద్దఱును బయదేఱివెళ్లి సుఖపడుకాలము వచ్చునాయని మంచిదిన
ములకై యెదురుచూచుచు ననుదినము భర్తకాహారము పొలములో
నికి దీసికొనివెళ్ళి కడుపారఁ గుడువఁబెట్టి యాతనిమనస్సు కుల్లాసము
గల్గించి వచ్చుచుండును. ఆయూరిలో నివారందఱు, భారవిభట్టుయొక్క
యవస్థఁజూచి "యాహాహా! ఈశ్వరసంకల్పముయొక్క వైచిత్ర్యములు!
మెచ్చఁదగినవి. గంటముపట్ట నలవాటుపడినవానికి గడ్డపాఱ చేతికివచ్చి
నది. మహారాజసభలలో నుంకువానికిఁ బొలములలో నుండవలసి
వచ్చినది. తర్కమీమాంసావ్యాకరణాది శాస్త్రములనువాదము సేయు
నోటితో దుక్కిఎడ్లను చోయిచోయి యని నడిపించి పాలేళ్ళను బిలువ
వలసి వచ్చినది. భుజములమీఁద శాలువధరించువానికి నాగళ్ళు ధ
రింపవలసివచ్చినది." అని తమలోఁదాము చెప్పుకొని జాలిపడుచుండిరి.
ఈయూహాలలో నొకటియయిన బావమఱఁదులకుఁగాని మామగారికిఁ
గాని తోఁపలేదు. పొలములో నల్లుఁ డెంతకష్టపడినను సరిగాఁ బని
చేయలేదని, యాతనిమీఁద వారందఱు విసుగుకొందురు. "తిండి
కేనుఁగు పనికి పీనుఁగు" నని పరిహాసమునకై కొన్నిమాటలు, నిజ
ముగ కొన్నిమాటలు దెప్పుచువచ్చిరి. పిల్లిమీఁదఁబెట్టి యెలుకమీఁ
దఁబెట్టి సాధించుచువచ్చిరి. శూలములవంటి సూటిపోటుమాటలచేత
నతనిమనసు నొప్పింపఁజొచ్చిరి. ఎక్కడలేని సామ్యములు పోలికలు
వానినిమిత్తమయి తీసికొనుచు వచ్చిరి. చదువుకొనియు భారవి య
ప్పుడేమియు సంపాదింపకపోవుటచేత చదువుకొన్నవానికంటె చాకలి
వాఁడు మేలనియు చదువునే నమ్ముకొని పిల్ల నిచ్చుటకంటె పిల్లను
గంగలో దింపుట మంచిదనియు నేవో లేనిపోని సందర్భములుతీసికొని
వచ్చి యత్తగారు పలుమాఱనఁజొచ్చెను. చదువుకొన్నవానికి శాంత
మె పరమభూషణ మని భారవి నమ్మియుండుటచేత నీపలుకులెల్ల విని

యు వినవచ్చియుండి, శరీరము దాఁచుకొనక వారిని మెప్పించుటకయి బహువిధముల పాటుపడుచు వారితో నెన్నఁడు వివాదపడక తండ్రి యేర్పఱచిన నియమితకాలము ముగియువఱకు కాతఁడు పని చేయఁజొచ్చెను. సుఖపడుచున్నప్పుడు కాలము ఱెక్కలు కట్టుకొని మిక్కిలి వేగముగఁ బరుగెత్తును. మనుష్యుఁడు కష్టపడుచున్నప్పుడు కాలము సంకెలల కాళ్ళతో నడుచువానివలె మందగమనము గలిగియుండును. భార్యకు నాతనికిగూడ దినములు సంవత్సరములయినట్లు తోఁచెను. ఇటులుండఁగా శ్రావణమాసము వచ్చెను. భారవిభట్టుమీఁద మామయు బావమఱఁదులుచేయు హుంకారధ్వనులవలెనే యుఱుములాకాశమున వినంబడెను. భారవియొక్కయు భార్యయొక్కయు మనంబుల గ్రమ్మిన విచారపటలమువలెనే మేఘపటల మాకాశమున నిండెను. భారవి భార్యయొక్క కన్నుదమ్ములనుండి యప్పుడప్పుడు వెడలెడు బాష్పబిందువులవలెనె చినుకులు రాలఁజొచ్చెను.

ఒక్కొక్కప్పు డామెకు వచ్చు పెద్దదుఃఖమువలెనే గొప్పవానయు గురియఁజొచ్చెను. దుఃఖమధ్యమున నడుమనడుమఁ గనిపించు స్వల్పమయినయాశ వలెనే మేఘములలోనుండి యప్పుడప్పుడు తళుకుతళుక్కని మెఱపులు మెఱయఁజొచ్చెను. అదృష్టవంతురాండ్రయిన పుణ్యస్త్రీలకు శ్రావణమాసము మిక్కిలి మనోహరమయినది. ముత్తయిదువలు నోఁచుకొనునట్టి నోములు పెక్కులీమాసముననే యున్నవి. మంగళవారవ్రతముచేయని గృహమేయుండదు. శుక్రవారవ్రతములు భాగ్యవంతుల గృహములలో జరుగుచుండును. లక్ష్మీదేవి కూడ భాగ్యవంతుల గృహములలో నుండునుగాని పేదలగృహములకు రాదుకదా. కొందఱు పేదలునయితేము నాలుగయిదుగూకలు కూడఁబెట్టుకొని యేపిల్లకాసో తెచ్చుకొని నోము చేసికొందురు. భారవియొక్క బావమఱఁదులభార్యలు కాసులఁ దెప్పించుకొని శుక్రవారవ్రతములఁ జేయ

దలంచిరి. తమభార్యలకు కాసులుతెచ్చి యిచ్చి నోములు నోమించిన పక్షమున తమచెల్లెలు చిన్నవోవునేమో యనుమాట వారికిఁ దోఁచినది కాదు. భారవిభార్య మిక్కిలి చిన్నఁబోయి యుండెను. రేపు వ్రతమనఁగా నామెభర్తకన్నము దీసికొని పోయి యాతఁడు భుజించిన పిదప మిక్కిలి చిన్నబోయి యక్కడఁ గూర్చుండెను. చిన్నఁబోయి యుండుటకు కారణమేమని భర్తయడిగెను. ఓదార్చువారుఁ గారణము లడుగువారు నున్నప్పుడు దుఃఖములు పొంగి పొరలివచ్చుచుండును. భర్తయడుగఁగానే భార్యకు దుఃఖము పాలపొంగువలెనే పొరలిపొరలి వచ్చెను. కాటుకకన్నులనుండి నీరు జలజల ప్రవహించెను. భారవి కారణమేమని యెక్కువయాత్రముతో మరలమరల నడిగెను. కొంతసేదదేఱి యామె యిట్లనిచెప్పెను. "మావదినెలు బంగారునాణెములు తెప్పించుకొని శ్రావణ శుక్రవారము నోములు నోఁచుకొనుచున్నారు. నాకు నాణెములు లేవు సరికదా యూరక వ్రతమయిన నోచికొమ్మని యయిన మావాం డ్రనలేదు. నాణెములు లేనందుకు వచ్చిన దుఃఖముకంటె మావాండ్రు నాకుఁజేసిన యనాదరణమున కెక్కువ దుఃఖము వచ్చుచున్నది. మాపుట్టిన యింటనుండి మనమెప్పుడు వెళ్లుదుమో నాకుఁదెలియకున్నది." ఆమాటలు విన్నతోడనే భారవియిట్లనియె. ఓసీవెట్టిదానా! మాతండ్రియొకసంవత్సరము గడువు పెట్టెను. గడువు దాదాపుగా ముగియవచ్చినది. ఇంక రెండుమాసము లున్నవి. ఈగడువు దాఁటినపిదప నేను నీకుఁగావలసినన్ని రూకలిచ్చెదను. అయినను విచారపడకుము. నాకొక్కయుపాయము దోఁచుచున్నది. నేను కిరాతార్జునీయ మను మహాకావ్యము రచియించుచున్నాను. అందులో నొకశ్లోకమున్నది.

శ్లో. సహసా విదధీత నక్రియా
మవివేకః పరమాపదాం పదమ్.

వృణు తేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేన సంపదః.

అర్థము: సాహసించి యేపని చేయఁగూడదు. అవివేకము మిగుల అపదలకుఁ గారణము. సంపదలు గుణములయం దాసక్తి గలిగినవి. అందుచేత నవి చక్కఁగా నాలోచించి కార్యములు చేయువానినే యాశ్రయించును.— ఈయూరిలో నొకకోమటి యున్నాఁడు. ఆతఁడు విద్వాంసుఁడు. ఈశ్లోకమాతనియొద్ద తాకట్టుఁబెట్టి కొన్నిరూకలు దెచ్చుకొని యందులో నొకకొంతఁబెట్టి నాగాము కొని తక్కిన సొమ్ము బెట్టి నీకుఁ గావలసిన వస్తువులుదెచ్చుకొని మిక్కిలి శోభాకరముగా వ్రతముఁ జేసికొనుము. ఇది వెండియా? బంగారమా? దీనిమీఁద నెవ్వఁడు సొమ్మిచ్చునని తలంపకుము. ఆకోమటి తక్కినవర్తకులవంటివాఁడు గాఁడు. చదువుకున్నవాఁడు. నాసామర్థ్యమెఱిఁగినవాఁడు. ఆతఁడుతప్పక దీనిమీఁద నీకోరినసొమ్మిచ్చును. ఈశ్లోకము తాకట్టు వదలించుకొనకుండ నేను పుస్తకమును ప్రకటింపనని యాతనితోఁ జెప్పుము. నామాటనతఁడు శిరసావహించును.” అని తాటాకు, గంటము పుచ్చుకొని యాశ్లోకమును వ్రాసి యిచ్చి భార్యను బంపెను. శ్లోకమును తాకట్టు పెట్టుక యామె కనివినిగుమెఱుఁగదు. వర్తకుఁడు శ్లోకమును కుదువఁబెట్టించుకొని సొమిచ్చునను నమ్మకమామెకు లేదు. లేకపోయినను మగనిమాట చెల్లింపవలయునని యామె దానిం దీసికొని వర్తకునియొద్దకుబోయిఁ వానిచేతికిచ్చి సొమ్మడిగెను. వర్తకుఁడు దానినిజదువుకొని యామెనేవో కొన్నిప్రశ్నలడిగి యామె సమాధానము చెప్పినతరువాత కొన్నిరూకలామెకిచ్చి కవిలెకట్టలో పద్దువ్రాసికొని శ్లోకమువ్రాసిన తాటిటాకు వ్రాసినగంటమును నొకవెదురు గొట్టములోబెట్టియాగొట్టమునకుమూఁత వేసి దానిని చూరులోదోఁపెను, రూపాయలు తీసికొని యామె పరమానంద

భరితుగాలయి బంగారునాణెము; వలయుపదార్థములు దెప్పించుకొని వదినెలకంటె నెక్కువవై భవముతో వ్రితము చేసికొనెను. శ్లోకముతా కట్టుమీఁద సొమ్ము తెచ్చుకొనుట విని యామె యన్నదమ్ములు తల్లి దండ్రులు మిక్కిలి యాశ్చర్యము నొందిరి. ఊరివారందరు వినివిస్మ యము నొందిరి. కొందఱు కోమటి వెఱ్ఱివాఁడనిరి. భారవిరాతియొద్దఁ గూడ డబ్బుపుట్టింపఁగలడని కొంద రనుకొనిరి. బ్రాహ్మణులకు వ్రితమునిమిత్తము సొమ్మిచ్చుట పుణ్యమని వర్తకుఁడు భావించి సొమ్మిచ్చెనే గాని శ్లోకము తాకట్టుమీఁద సొమ్మిచ్చియుండఁడని, గొందఱు పలికిరి. "ఇప్పుడి య్యఁగానె సరికాదు. వడ్డికి వడ్డిగట్టి కవీశ్వరుఁడుగారి కొంపగోలె మమ్మించిపుచ్చుకొను"నని కొందఱనిరి. ఏమన్న నేమి కార్యము నెఱవేఱినదికదా!

---

## మూఁడవ ప్రకరణము—ప్రతిజ్ఞాపూర్తి.

---

శ్లోకము తాకట్టుపెట్టిన కొన్నిదినములలోనే వర్తకుఁడు వ్యా పారముమీఁద ద్వీపాంతరమునకుఁ బయనమయి వెళ్ళెను; దైవవశ ముచేత నప్పుడెదురుగాలి వీచుటచే నతఁడెక్కిన యోడ సరిగానడువ దయ్యెను. తరువాత కొన్నాళ్ళకా యోడ పగిలిపోయెను. ఒకద్వీప మును చేరుటకు బదులుగా నతఁడు మరియొక ద్వీపమును జేరెను. ఆ ద్వీపమునందతని నెఱింగినవారుగాని యాతనిభాష మాటలాడువారు గాని లేనందున నతఁ డచ్చట నెన్నిచిక్కులు పడవలయునో యన్ని చిక్కులబడెను. వెంటఁదీసికొనిపోయినధనమంతయు నోడపగిలినప్పుడు సముద్రముపాలయ్యెను లక్షలకొలఁదిరూకలతో వ్యవహరించునాతని కొక్కరూక కఱవయ్యెను ఎన్నఁడలవాటు లేకపోయినను స్వకాయ కష్టమువల్ల నతఁడు జీవింపవలసివచ్చెను లక్షాధిపతులను భిక్షాధిపతు

లుగను భిక్షాధిపతులను లక్షాధిపతులుగను జేయునట్టియనిర్వచనీయ ప్రభావుఁడగుటఁ బరమేశ్వరుని యాజ్ఞాబలమునకు గించిద్జ్ఞుఁడైన మనుష్యునిబుద్ధి బల మెదురై ప్రతిఘటింప నేర్చునా?

ఇట భారవి తండ్రియాజ్ఞాప్రకారము మామగారియింట నుండ వలసినకాల ముండి గడువుచెల్లినతోడనే యాయత్తమామలవద్ద సెలవు పుచ్చుకొని బావమరదులను వీడ్కొని భార్యసమేతుఁడై స్వగ్రామమునకుఁ బోయెను తన్నారీతి నవమానముచేసిన బావమఱఁదుల యందుఁగాని యత్తమామలయందుగాని యాతనికి ద్వేషముజనింప లేదు అక్కడకు వచ్చినప్పుడతనిమన స్సెంతయుల్లాసముగా నుండునో వెళ్లునప్పుడు నంతయుల్లాసముగా నుండెను. వెళ్ళునప్పుడు మును పటికంటె నెక్కువ యుల్లాసముగానుండెనని కూడ చెప్పవచ్చును అట్లుండుట కొకకారణముగలదు మామగారియింట నున్నకాలములో నతఁడెక్కువ లోకానుభవము సంపాదించెను ఏమనుష్యుఁడుగాని తాను స్వయముగా కష్టపడిధనసంపాదనము సేయక యొకరికి భారముగా నున్నపక్షమున నాతని గౌరవమొకక్షణములో బోవుననియు నాత్మగౌరవము నిలుపఁదలుచుకొన్న ప్రతిమనుష్యుఁడు పాలుమాలిక లేక మేనవంచి పనిచేసి స్వకుటుంబపోషణము చేసికొనవలసినదనియు నతఁ డనుభవమువలన నేర్చుకొనెను ఈయనుభవసిద్ధ మయిన జ్ఞానము తండ్రివద్ద కష్టపడి దెబ్బలుతిని చీవాట్లుతిని నేర్చుకొన్న తర్కశాస్త్రముకంటె వ్యాకరణ మీమాంసా శాస్త్రములకంటెఁ గవిత్వముకంటె నాతని కెక్కువలాభకారి యయియుండెను. లోకానుభవముకూడ విద్యయే విద్యయనఁగా కేవలము పుస్తకమువిప్పి పాఠము చదువుట కాదు లోకానుభవము పుస్తకములు ననునీ రెండింటివల్లను మనుష్యుఁడు జ్ఞానసంపాదనము సేయును లోకానుభవమే లేకపోయిన యెడల జ్ఞానము సంపూర్ణముకాదు. ఈ యనుభవ మాతనికి బహుదవ్యము

కంటె నెక్కువ యుపయుక్తమైయుండెను. శాస్త్రజ్ఞానము నేర్చుకొనుచున్నప్పుడు గురువుగారు చెంపకాయలుకొట్టినను మనుష్యుడెట్లు సహించి యూరకుండునో లోకానుభవజ్ఞానము నేర్చుకొనునప్పుడు నదియుఁగూడ విద్యయేయని బాధలు సహింపవలెను భారవి స్వగృహమునకు వెళ్ళినతరువాత తన కిరాతార్జునీయకావ్యమును సమాప్తము చేసి సవరించియు దానిం బ్రకటింపలేదు ఏలయనఁగా నందులో నొక శ్లోకములేక పుస్తకము సమాప్తముకాదు. అసమాప్త గ్రంథము ప్రకరించుట కిష్టము లేదు ఆ శ్లోకము నీతఁడు ప్రకటించినను వర్తకుఁడు తగవులాడఁడు పైగా 'వర్తకుడు దేశములో లేడు. అయినను భారవి నీతిసంపన్నుఁ డగుటచే వణిజునిసొమ్ము వణిజునకిచ్చి శ్లోకమును విడుదల చేసికొనకముందు దానిని తాను గ్రహించి ప్రకటించుట దుర్నీతియని నమ్మి యూరకుండెను. అట్లు పదునెనిమిది సంవత్సరములు గతించెనట ప్రకటించుట యనఁగా నాదినములలో నచ్చువేయుట కాదు ఇతరులు వ్రాసికొనుటకై తన తాటియాకుపుస్తకమునిచ్చుటయే ఆమహాకావ్యము ప్రటింపబడకపోయినందులకు విద్యార్థులు పండితులు మిక్కిలివిచారించిరి వర్తకునివద్దనుండి వర్తమాన మేనాఁటికిం దెలియలేదు అతఁడు మృతినొందియుండునని బంధువులు నిశ్చయించిరి ఉత్తరక్రియలు జరిగించుట సముచితమా యని బంధువులు ధర్మశాస్త్రజ్ఞుల నడుగఁ జొచ్చిరి ధర్మశాస్త్రజ్ఞులు తమ ప్రాతతాటియాకులు ధర్మశాస్త్రములు తిరుగ వేయఁ జొచ్చిరి అప్పుడయినను భారవి తనగ్రంథము ప్రకటింపదలచుకోనలేదు వర్తకుని నిశ్చితవార్త తెలియువలయును గ్రంథము ప్రకటింపవలెనని యూరకుండెను

---

## నాలవప్రకరణము—తాకట్టువిడుదల

పదునెనిమిది సంవత్సరములు గతించి పందొమ్మిదవ సంవత్సరము నడచుచుండఁ జిరప్రవాసదుఃఖితుఁడయిన వర్తకుఁడు స్వస్థలముఁ జేరెను స్వగ్రామమునకు సమీపమందున్న రేవుపట్టణములో నతఁడు నావదిగి స్వగృహము జేరునప్పటికి రాత్రి జాముపొద్దు పోయెను చిరకాలముక్రిందట చూచుటచేతను రాత్రియగుటచేతను వాని నెవ్వరానవాలుపట్టలేదు ఇంటికివచ్చి యతఁడు తలుపు తట్టినతోడనే గృహసేవకులు తలుపుతీసిరి. ఎవరుమీరని సేవకులడుగఁగా నే నింటియజమానుఁడగు వర్తకుఁడనని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఆమాటలు విని సేవకులు తెల్లబోయిరి. అందొకఁడు పోయి యజమానురాలితో నీవార్తవిన్నవించెను. ఆమాటలువినఁగానె యామెసంతోషాశ్చర్యంబులు మనంబున మల్లడిగొన పదునెనిమిది సంవత్సరములు వయస్సుగల యొకపడుచువానిని వెంటఁబెట్టుకొని భర్త దర్శనమునకు వచ్చెను. ఆపడుచువాఁడు వర్తకునిజూచి నాయనగారు నమస్కార' మని పాదములఁపయిఁబడెను. వీఁడెవ్వఁడని, వర్తకుఁడు భార్య నడిగెను. 'వీఁడు మీకుమారుఁ'డని భార్య ప్రత్యుత్తరమిచ్చెను, ఆమాటలు వినఁగానే వర్తకుఁడు కోపము నాశ్చర్యము నందడించుహృదయముతో నిట్లనియె, "ఓసీదుర్మార్గురాలా! నేనీస్థలమువిడిచి వెళ్లునప్పటికి నాకు లేనికొడుకు నేను వెళ్ళినతరువాత బయలుదేఱినాఁడా? దేవతావరప్రసాదముచేతనో నీపతివ్రతాధర్మముచేతనో భర్త దేశాంతరమందుండఁగనే నీకు కుమారుఁడు జన్మించినట్లు తోఁచుచున్నది. వీఁడు నీకొడుకయినమాట నిజమే కాని నాకొడుకయి యుండఁడు. వీఁడెవనికొడుకో వానికే వెళ్ళి నమస్కారము చేయవలసినదిగాని నాకు చేయగూడదు; నీవింత దుర్మార్గురాలవని నే నెన్నఁడు దలపోయలేదు; నేను

దేశాంతరమందు మృతినొందితి ననుకొని నీకొడుకు నీవు సుఖముగ జీవింపవచ్చు ననుకొంటివి గాబోలు మీదౌర్జన్యము బయలుపెట్టుటకే భగవంతుఁడు నన్ను బ్రతికించినాఁడు; ఛీ! మీరు నాయెదుటనుండి లేచి యవ్వలకుఁ బొండు; మీమొగములు చూచుట మహాపాతకము” అని తూలనాడుచుండ భార్యయుఁ గుమారుఁడు నిశ్చేష్టులయి ప్రత్యుత్తరము నీయఁజాల రయిరి; అతని కేకలు విని యిరుగుపొరుగు వారనేకులు వచ్చివర్తకునితో “నీవు వెళ్లునప్పటికి నీభార్యకు నెల తప్పినది; అది నీవెఱుఁగవు; నీవు వెళ్ళినతరువాత నీకుమారునిఁ బ్రసవించినది; ఆమె పరమపతివ్రత; ఆమె యందు దోషము లే” దని చెప్పిరి; కాని యాతనికి తృప్తిజనింపదయ్యెను; అందఱు ఎవరిగృహములకు వారు పోయిరి; వర్తకుఁడు కంటికి నిదుర రామిచే గోడకుఁ జేరఁబడి కూర్చుండెను. తనకు భర్తగావించిన పరాభవమునకు దుఃఖితయై భార్య కంటికి నేలకు నేకధారగా నేడ్చుచుండెను; కుమారుఁడును గాటమయిన యవమానముచేత తలవంచుకొని విచారింపసాగెను; తన యెడ ద్రోహము చేసిన భార్యను, నామెకుమారుని నాఁటిరాత్రి యెట్లయిన సంహరింపవలెనని వర్తకుఁడు తలపోయఁజొచ్చెను; అట్లు తలపోయుచు నాయుధమేదయిన సంపాదింపవలయు నని యిట్టటు తిరుగసాగెను; అట్లుతిరుగుచుండగా ముంజూరులో నతని కొకవెదురు గొట్టము కనఁబడెను. ఆగొట్టములాగి తెరచిచూడ నందులో నొకగంటము తాటాకు గనఁబడెను; గంటముతో వారింబొడిచి చంపవచ్చు నని సంతోషించి యాతాటాకులో నేమున్నదో చూడవలయునని కుతూహలము పొడమ దానిం దీపపువెలుఁగునకు దీసికొనిపోయి చదువుకొనెను; అది తనయొద్ద భారవి తాకట్టుఁబెట్టినశ్లోకమయ్యెను; శ్లోకము చదువఁగానే దానియర్థ మతని మనంబున నాటెను.

అర్థము బోధపడినతోడనే గంటము క్రిందపాఱవైచి పైకి

చూచుచు నతఁడాలోచనము చేయసాగెను. "ఏమిది! సాహసించి, ఏ కార్యమును చేయఁగూడదు. అవివేకము మహాపదల కాస్పద మని కదా యీశ్లోకార్థము; మహాకవి యైన భారవి యీశ్లోకము నాకు తాకట్టు పెట్టెనుగదా! దీనియందెంతో విలువ యుండుటంబట్టియే గదా నాలుగు బంతుల శ్లోకమునకు నాలుగు వరహాలు నేనిచ్చితిని; నేనిప్పుడు చేయఁబూనిన పని మహాసాహసము; ఇది యవివేకము; చక్కఁగా విచారించి వీరిద్దఱు దోషులని తెలిసినపిదప నేనీకార్యము చేసెదను ప్రస్తుతము విరమించెదను;" అని యీయుద్యమ ముపసంహరించి మఱునాఁడు గ్రామమునందున్న పెద్దలం గలసికొని తన గృహవృత్తాంతమంతయు వారి నడిగి తెలిసికొనెను; వారందఱు నైకకంఠ్యముగ నిట్లనిరి: "నీభార్య మహాపతివ్రత; ఈతఁడు నీకుమారుఁడు; నిష్కళంక మయిన మనసుతో నీవు వానితోఁ గాఁపురము నేయవచ్చును;" ఆమాటలు విని తృప్తినొంది వర్తకుఁడు దారపుత్రులం జేరఁతీసి మరల సంసారియయ్యెను.

వర్తకుఁడు వచ్చినవార్త విని భారవిశ్లోకము తాకట్టు వదలించుకొని గ్రంథము ప్రకటించుకొనుసమయము వచ్చిన దని పరమానందభరితుఁడయి యాతనియొద్ద పుచ్చుకొన్న నాల్గువరహాలు వడ్డితోఁగూడ దీసికొని వచ్చి యతనికిచ్చి తాకట్టుశ్లోకము నిమ్మని యడిగెను; తానువచ్చువఱకు శ్లోకము వదలించుకొనువఱకు గ్రంథము ప్రకటింపక నీతికి నిలువఁబడియున్న యమ్మహానుభావుని భారవిని గని వర్తకుఁడు లేచి దండప్రణామంబు గావించి యాతని కిట్లనియె: "మహాత్మా! యీశ్లోకము నిమిత్తమయి గ్రంథమంతయు ప్రకటింపక యాఁగిన నీవంటిమహానుభావులు తఱుచుగా లోకమున సంభవింపరు; నీయొద్ద నేను సొమ్ము గ్రహింపజాలను; ఏలయనిన శ్లోకమువలన నేను మహోపకారము నొందితిని; ఆశ్లోకమువలన నాకు భార్య

యుబిడ్డయు బ్రతికిరి; దానివలననే నాకీర్తి నిలిచెను; మీశ్లోకము అక్షరలక్షలు విలువగలది; అందుచేత నేను మీయొద్దసొమ్ము పుచ్చుకొనను సరేగదా విశేషించి మీకు గొప్పబహుమానముగూడ చేయ దలంచుకొన్నాఁడను" అని వేయినూటపదాఱు లాయన కిచ్చి నమస్కరించి పంపెను.

---

# భర్తృహరి

## మొదటిప్రకరణము.

ఇతఁ డొకసంస్కృతమహాకవి. నీతిశృంగారవైరాగ్యములను గూర్చి గీర్వాణభాషయందు మూఁడుశతకముల రచియించి కవిశిఖామణియై యమితప్రఖ్యాతిగాంచెను; ఏరసము వర్ణించినప్పు డారసము మూర్తిదాల్చి చదువరుల మనోరంగములందు తాండవమాడునట్లు చేయఁగల యద్భుతశక్తి యీకవిసార్వభౌమునియందు గలదు; నీతిబోధకమగు గ్రంథము గాని శృంగారవైరాగ్యములను మనోరంజకములుగాఁ దెలుపుగ్రంథముగాని సంస్కృతభాషయం దేదియని యడిగినపక్షమున వ్రేలుమడిఁచి భర్తృహరి విరచితమైన సుభాషితరత్నావళి యొక్కటేయని చెప్పవలెను; ఇటీవల మహాకవు లనేకులు నీతిశాస్త్రములు రచించిరి గాని భర్తృహరి గ్రంథముముందున అవి యంతగాఁ బ్రశంసనీయములుగావు. ఈమహాకవి యేకాలపువాఁడో తెలిసికొనుటకుఁదగిన యాధారములు గానరావు ఊహాలపై నూహలఁబన్ని పలువురు పలుతెఱంగుల వ్రాసిరి ఆకారణమునఁ గాలనిర్ణయముచేయుట కష్టము అయినను ఈతని జన్మమునుఁ గూర్చియు, ననంతర వృత్తాంతమునుఁ గూర్చియు మనోహరమైన కథయొకటి గలదు అది వ్రాయుటయే ముఖ్యోద్దేశము.

## జన్మవృత్తాంతము.

---

యమునానదీతీరమున మధురయను పట్టణము గలదు. ఇది దక్షిణదేశముననున్న మధుర గాదు ఈమధురానగరము త్రేతాయుగమున రఘురాముని తమ్ముఁడైన శత్రుఘ్ననకు రాజధానియై ద్వాపరయుగంబున శ్రీకృష్ణుని మేనమామయగు కంసునకు రాజధానియై నారాయణావతారమని కొనియాడబడుచున్న వాసుదేవునకు జన్మస్థానమై మోక్షదాయకములైన యేడుపుణ్యక్షేత్రములలో నొకటియై యిప్పటికిని లక్షలకొలంది తీర్థవాసులచే సేవింపఁబడుచున్నది పూర్వకాల మాపట్టణమును శృంగారశేఖరుండను రాజు పాలించుచుండెను, ఆతఁ డొకనాఁడు సచివులు, సామంతులు, దౌవారికులు ,దండనాయకులు, చారులు, శూరులు, నటులు, భటులు, విదూషకులు,విద్వాంసులు, కవులు, గాయకులు, పరిజనంబులు, బంధువులు పరివేష్టింప నిండుకొలువుండెను. ఆసమయమున శంకరునియనుగ్రహమున ,మరల రూపముఁ దాల్చివచ్చిన మన్మథుఁడో,భూతలంబునఁ జరియింపవచ్చిన జయంతుఁడో, కాలుసేతులు మొదలగు నవయవములఁ గైకొని వచ్చిన చక్కదనంపుముద్దయో యన్నట్లొక బ్రాహ్మణుఁడు సభామంటపమునం బ్రవేశించి రాజున కభిముఖుఁడై నిలిచెను. ఆమేనిచెలువము, నాసౌకుమార్యము, నాలావణ్యము, నాతారుణ్యముంగని సభాసదు లచ్చెరువొందిరి. అందఱిమొగములు వానిమొగమున కభిముఖము లయ్యెను. అందఱికన్నులు వానికన్నుల వైశాల్యమును తనివిసనక చూచుచుండెను. అందఱిచెవులు వానినోటిమాట వినుటకుఁ దత్తరపడుచుండెను. అందఱివాక్కులు వానితోఁ బ్రసంగింప ముచ్చటఁబడఁజొచ్చెను. గద్దియమీఁద రాజునకు నట్టికుతూహలమే జనియింప నతఁడిట్లనియె. "విప్రకుమారా! మారసమానుఁడవైన నిన్నుఁ

జూచినకొలఁది కడుంగడుఁ జూడ బుద్ధియగుచున్నది. నీముఖచంద్రమండలమునఁ గాయువెన్నెలలచే నీసభాసదుల మొగంబు లనియెడు కలువలు విచ్చినవి. కొన్ని ప్రశ్నలు నిన్నడుగఁదలఁచినవాఁడనై నామనంబు తత్తరపడుచున్నది. నీవాలకము నీవు బ్రాహ్మణోత్తముఁడని చాటుచున్నది. నీదే దేశము.? ఈమధ్యలోకమన్మథుని గని లక్ష్మీనారాయణులట్లు ధన్యులయిన దంపతు లెవ్వరు? ఏకారణంబున మమ్మును మానగరమును ననుగ్రహింప నిందువచ్చితివి! దాఁపక నీచరితంబు మాకెఱిఁగించి తత్తరపడుచున్న మాశ్రవణంబులకు విందుసేయుము."

అనవుడు నాభూసురకుమారుఁ డిట్లనియె. "రాజా! భగవంతుఁడగు వాసుదేవునకు జన్మస్థానమై కొంతకాలము మధ్యలోకవైకుంఠమై వాసికెక్కిన మథురాపురము నేలుచు ధన్యుఁడైన రాజన్యుని నిన్నుఁ గాంచి చరితార్థుఁడ నగుటకై వచ్చితిని. నాకుఁ దలిదండ్రులు లేరు. ప్రస్తుత మేకాకిని. వివాహ మింకను గాలేదు. నాపేరు చంద్రగుప్తుఁడు. మీరన్నట్లు నేను బ్రాహ్మణుఁడనే. చిన్ననాఁటనే కావ్యనాటకాలంకారగ్రంథములఁ జదివి కుశాగ్రబుద్ధియని గురువులచేఁ బేరువడసితిని. అనంతర మాఱుశాస్త్రముల నధిగమించితిని. అఱువదినాలుగు కళలయందు నధికపరిచయము సంపాదించితిని. వేదాధ్యయనమునందు వినుతిఁ గాంచితిని. రసవంతమగునో కాదో కాని కవిత్వముఁగూడఁ జెప్పఁగలను. బంగారుపళ్ళెరమునకైనను గోడచేర్పు గావలయునన్నట్లు కవిజనకల్పకంబై, పండితజనపారిజాతంబై, శ్రితజనచింతామణియైఁ కరుణాసముద్రుఁడై, కీర్తివెల్లువలు దిగంతములయందుఁ బ్రవహింపఁ జేయుచున్న నిన్నుఁ జేరి నీయాస్థానపండితుండనై కవినై, గౌరవంబుగ గాలక్షేపముఁ జేయ వచ్చితిని. అనుగ్రహించి నన్నుఁ జేకొనుము."

అని విన్నవించుటయు రాజు పరమానందభరితుఁడై యాతనిం దగిన యాసనంబునఁ గూర్చుండఁబనిచి నూతనవస్త్రాలంకారముల నిచ్చి

యాస్థానపండితుం జేసి దైన్యహీనమగు జీవనము కలుగునట్లు చేసెను. కవి పండితులకు మిక్కిలి దగ్గఱిచుట్టమై యెల్లయెడల వారి నెడఁబాయక తోడునీడయై చరించుదారిద్ర్యదేవత వానిని విడువలేక విడువలేకయెట్టెటో విడనాడి రాజాశ్రియములేని తక్కినపండితులయొక్కయండనుండుటకై పోయెను.

అతఁ డావిధమున సకలసౌఖ్యము లవ్వారిగాఁ బొందుచు సుఖించుచునుండ నొక్కనాఁడొక ముసలిది వానికడకుఁబోయి దండముపెట్టి యాతనితో నిట్లనియె. "మహానుభావా నాదొక్కమనవికలదు. ఆగ్రహింపక యాలకింపుము. ఈపట్టణమేలుచున్న శృంగారశేఖరమహారాజుగారి సేనాపతియగు వీరవర్మకు మదనరేఖయను గారాపు గూఁతురు గలదు. నే నాబిడ్డ దాదిని. నీవు మొన్నసాయంకాలమున నీచెలికాండ్రతోఁ గలసి సరససల్లాపము లాడుచుఁ బోవుచుండ నా బాలిక కనులపండువుగా నిన్నుఁగాంచి వీనులవిందుగా నీమాటలను విని మోహపరవశయైనది. అదిమొదలుకొని యాఁకలి యనదు. అన్నము దినదు. నీరు ద్రావదు. నిదురపోవదు. నీనామమే స్మరియించును. నీరూపమే ధ్యానించును. నీకథలే వినఁగోరును. కునుకొకవేళఁ బట్టినను నిన్నుగుఱించియే కలవరించును. వెయ్యేల? ఆమెప్రాణము నీదిగా భావించుచున్నది. కావున గుణమణియగు నాబాలికను నీవు వివాహమాడి ప్రాణరక్షణముచేసి వీరవర్మకుఁ బుత్రికాభిక్షముపెట్టవలెను" అని వేడుకొన నాచంద్రగుప్తుఁడు కొంచెముకోపము విస్మయము మొగంబునం దోఁప నిట్లనియె. "మూర్ఖురాలా! పెద్దదానవగుటచే నీమతి పోయినట్లున్నది. కానిచో నిట్టిమాటలాడవు. నేను బ్రాహ్మణుండను. వేదాధ్యయన తత్పరుండను. సకలశాస్త్ర కోవిదుఁడను. విశేషించి నైష్ఠికుఁడను. ఇట్టి నన్ను భయభక్తులు లేక మంచిచెడ్డలు విచారింపక శూద్రకన్యను వివాహమాడుమని పురికొల్పుటకు నీకు

నో రెట్లాడెను? పడుచుదనంపు గర్వమున నీమదనరేఖ నిన్ను నాకడకుఁ బొమ్మని ప్రోత్సాహము చేసినఁ జేయుఁగాక! వయస్సు మళ్ళినదానవు లోకానుభవముగలదానవు. తగుదునని నీవెట్లువచ్చితివి? చాలుఁజాలుం. ఇఁకఁ బేరిలక యవ్వలకుఁ బొమ్ము" అని కఠినముగా మందలించుటయు నామె మాఱు మాటాడక చిన్నపోయినమొగముతో నంతకన్న విన్నవోయిన మనస్సుతో నీమాట వినిన బాలిక యేమగునో యనుభయముతో వచ్చినదారిం బోయి మదనరేఖకు జరిగినవృత్తాంతమంతయు విన్నవించెను. ములుకులవంటి యాపలుకులు చెవినిబడినతోడనే మబ్బుగప్పిన చంద్రరేఖవోలెఁ గాంతిదొఱఁగి విహ్వలచిత్తయై చంద్రరేఖ యన్నముఁ గుడువక, యలంకారములఁ దాల్పక, నిదురవోవక, నెచ్చెలులతోఁ బలుకక జలకమాడక చందనమొల్లక, నెండకుశోషిల్లిన కలువపూవువలె నుండెను. చెలికత్తె లామెయవస్థను వీరవర్మ కెఱిఁగించిరి. వీరవర్మపుత్రి మృతినొందునేమోయని భయంపడి తనయందు మిక్కిలి దయగల శృంగారశేఖరమహారాజుకడ కరిగి తనకూఁతుకథయంతయు నాతని కెఱిఁగించి బిడ్డను బ్రతికింపుమని ప్రార్థించెను. అది తనచేతిలోనిపనిగావగచి మధురాపురమహారాజు వాని కభయమిచ్చి పంపి బ్రాహ్మణకుమారుని రావించి గౌరవించి మదనరేఖను వివాహమాడు మని చెప్పెను. బ్రాహ్మణుఁడు కటకటంబడి చెవులుమూసికొని తనస్వతంత్రప్రభావము తేటపడ వినయగర్భితముగా నిట్లనియె. "రాజా! సకలధర్మాధర్మవిదుఁడవైన నీవు పరమపవిత్రుఁడనైన నన్ను నిట్టిపాపకార్యమునకుఁ బనుచుట న్యాయమా? వర్ణాశ్రమ ధర్మపరిపాలనము చేయవలసిన నీవే వర్ణసాంకర్యముచేయఁదలఁచుకొన్నప్పుడు చెప్పెడు వారెవరు? కంచెయే చేనుమేసినప్పుడు తల్లియే విషముఁబెట్టినప్పుడు, రాజే ధర్మవిరుద్ధముఁ గావించునప్పుడు, నివారించువా రుండరు. నిరుపమాననిష్ఠాగరిష్ఠుఁడైన నే నెక్కడ?

శూద్రికన్యాపరిణయ మెక్కడ? ఈవిషయమున మీరు మహారాజు లైనను నాకన్నవస్త్రములిచ్చి పోషించుప్రభువులైనను ధర్మభంగ ప్రమస్య కలుగుటచే నేను సరకుచేయను. నన్ను మీయాస్థానమునుండి వెడలగొట్టిననుసరే. శిరచ్ఛేదముచేయించినను సరే నేనుమాత్రము ధర్మపథంబు దప్పను. ఇది త్రికరణశుద్ధిగాఁ జెప్పినమాట" అనుటయు రాజాతని మనోధైర్యమునకును, ధర్మపరాయణత్వమునకును, స్వాతంత్రభావమునకునువిస్మితుఁడై లోలోన మిక్కిలి మెచ్చి యితని పరిశుద్ధజీవనముఁ జెరుపఁగూడదని నిశ్చయించుకొని యాతని నింటికిఁబొమ్మని సెలవిచ్చి మదనరేఖను జిన్ననాఁటనుండియుఁ దనకూఁతురైన రాగమంజరితో సమానముగాఁ బెంచుటంజేసి యామె మనోరథము నెఱవేఱకుంటకు మిక్కిలి వగచి యెట్లయిన నామెకోరిక సఫలము చేయఁదలంచి మంత్రులతో నాలోచించి యెట్టకేల కొక్క వ్యవస్థనేర్పఱచి బ్రాహ్మణకుమారుని మరల రావించి యిత్తెఱంగున భాషించెను "విప్రకుమారా! నీవు ధర్మము దప్పకుండునట్లు నామనోరథము నెఱవేఱునట్లుచేయుటకు మంచియుపాయమొకటి కలదు అది యుభయతారకము కావున నీవట్లుచేసి నాముద్దు చెల్లింపుము బ్రాహ్మణుఁడు మొదట బ్రాహ్మణకన్యను వివాహమాడి పిదప క్షత్త్రియ, వైశ్య, శూద్రకన్యలను వివాహ మాడవచ్చునని శాస్త్రములు చెప్పుచున్నవి అందుచేత నాపురోహితుఁడైన విష్ణుశర్మకూఁతురు శీలవతిని ప్రథమ భార్యగాఁ బరిగ్రహింపుము నాగారపు బిడ్డయైన రాగమంజరిని ద్వితీయభార్యగాఁ బాణిగ్రహణముఁ జేయుము నాదుకోశాధ్యక్షుఁడైన ధనగుప్తుని ప్రియపుత్త్రిని సుమతిని తృతీయకళత్రముగాఁ స్వీకరింపుము వీరవర్మగారాలపట్టియగు మదనరేఖను జతుర్థపత్నిగాఁ జేకొనుము దీనంజేసి నీకు ధర్మభంగమును నా కాశాభంగమునుఁ గలుగదు బహుకుటుంబికత్వముచేసాంసారిబాధలుసంభవించునని భయపడకుము

నాయల్లుఁడవైన నీకుఁ గొఱదవయుండునా? కావున మాఱుమాటాడక నావిన్నపము సఫలముచేయుము" అని ప్రార్థించిన రాజుపలుకులు ధర్మ విరుద్ధములు గాకపోవుటంజేసి మంచిదని రాజానుమతంబున శుభ ముహూర్తములయందు బ్రహ్మ,క్షత్రియ,వైశ్య, శూద్రకన్యకలను వివా హమాడి వారితో నిరుపమాన సౌఖ్యముల నందుచు భూలోక స్వర్గ సౌఖ్య మనుభవించుచుండెను.

కాలక్రమంబున నలుగురు పడంతులు గర్భవతులైరి. పురోహి తపుత్రికయగు శీలవతికి వరరుచియను కుమారుఁడు జనియించెను. రాజనందనయగు రాగమంజరికి విక్రమార్కుఁడు పరిభవించెను.కోశా ధ్యక్షుని కూఁతురగు సుమతికి భట్టియనుఁసుతుఁ డుదయించెను. మద నరేఖకు భర్తృహరి పుట్టెను, వారు క్రమక్రమంబున బెరిగి విద్యా భ్యాసము జేసి సకలలోక వంద్యులైరి. వరరుచి వ్యాకరణశాస్త్రవే త్తయయ్యెను. విక్రమార్కుఁడు మాతామహుని యనంతరమున రాజై విశ్వంభరాభారము వహించెను. భట్టివిక్రమార్కుని మంత్రి యై విఖ్యాతుఁడయ్యెను. భర్తృహరి సాహసవిక్రమార్కుని,సేనాపతి యై విశేషించి మేటి పండితుఁడై సుభాషితరత్నావళి యనుగ్రంథము రచియించి నాశనములేని కీర్తికాయముదాల్చి నేఁటికిని సహృదయుల హృదయములందు సంచరించుచున్నవాఁడు.

## రెండవప్రకరణము.

### అనుమానము.

భర్తృహరి భానుమతియను కన్యను వివాహమాడెను. ఆమె గుణసంపదచేతను లావణ్యతారుణ్యవిలాసములచేతను కులశీలములచే తను, భర్తృహరికిఁ దగినకాంతయై మగనిమీఁద మేఱమీఱినమక్కు

వగలదై, చక్కదనంపు దీవియై పుట్టినయింటికి మెట్టినయింటికి నిరుపమానమైన కీర్తిని దెచ్చుచుండెను. భర్తృహరియుఁ బతివ్రతాలలామమైన యాపడంతియందు గాటమైనవలపు గలిగి సంసారసుఖంబులను భవించుచుండెను. విక్రమార్కుఁడు తన యాస్థానపండితుఁడును తన కన్నివిధముల నగ్రజన్ముఁడునైన వరరుచియొక్క పాండిత్యమును మెచ్చుచుఁ బెద్దతమ్ముఁడైన భట్టియొక్క సమయోచితబుద్ధికుశలతకు మిక్కిలి హర్షమొందుచుఁ గడఁగొట్టు తమ్ముఁడైన భర్తృహరిరసములఁ గుమ్మరించు కవిత్వము చెప్పునప్పుడు మహానంద మొందుచుఁ బకృతిజనరంజనమే పరిధానకర్తవ్యముగాఁ జేసికొని భట్టియొక్క బుద్ధిబలము భర్తృహరియొక్క బాహుబలమున తనకుఁ బెట్టనికోటలై, వజ్రకవచములై, రక్షరేఖలై పరివర్తింప మహీమండల మేలుచుండెను. భర్తృహరి విక్రమార్కునియొక్క వెలుపలిశత్రువులను శౌర్యసంపదచేత జయించినట్లే తనలోపలి శత్రువులను జ్ఞానవైభవముచే జయించి, గంటముపట్టిన చేతనే ఖడ్గముపట్టుచు, ఖడ్గము పట్టినచేతనే గంటముపట్టుచు, తన జన్మము చరితార్థము చేసికొనుచుండెను. అట్లు కొంత కాలము గడచెను. ఒకనాఁడు భర్తృహరి భానుమతీసమేతుఁడై తన మేడపై సుఖాసీనుఁడై సరససల్లాపము చేయుచుండెను. అది ప్రాతఃకాలము. దగ్గఱఁజేరి మెల్లఁగ మీఁద జేయివైచి రాత్రి సుఖనిద్ర పట్టినదాయని పరామర్శచేయు ప్రాణమిత్రుఁడువలె మందమలయానిలుఁడు దేహంబులు స్పృశియించుచుండెను. భానుమతీదేవి నెమ్మొగముమీఁది కుంకుమబొట్టు చందంబున పొడుపుకొండమీఁదఁ బొద్దుపొడిచెను. పరాజితుఁడై పాఱిపోవుటకు సిద్ధముగా నున్న శత్రురాజుముఖమువలెఁ గళాహీనమై యస్తమించుటకు సిద్ధముగానున్న చంద్రమండలము వెలవెలఁబాఱుచుండెను. అప్పుడాదంపతులకు దూరమునుండి భేరీరావము వినఁబడెను. అది యంతకంతకు సమీపించెను.

ఎట్టకేలకు జనసమూహ మొకటి వారికంటఁ బడెను. ఆసమూహము నకు ముందుభాగమునఁ జెవులు చిల్లులుపడునట్లు భేరీలు మ్రోఁగుచుం డెను. ఆమేళమువెనుక నొకశవము కనఁబడెను. ఆపీనుఁగువెనుక ముఖ మునిండఁ బసపురాచుకొని కుంకుమబొట్టు బెట్టుకొని పసపువన్నెచీర కట్టుకొని మనసులోనున్న దుఃఖమునంతయుఁ దెలియఁజేయుచు రెండు కన్నులనుండి కాలువలై పాఱుబాష్పములతో నొకయంగన కనఁబ డెను. అడుగులు తడఁబడ నడువలేక నడువలేక పోవుచున్న యామెను బంధువులు పట్టుకొని నడపించుచుండిరి. ఆమె వెనుక హరినామస్మరణ చేయుచున్న బంధుమిత్రుల బలగము కనఁబడెను. వీథి కిరుప్రక్కల నున్న గృహంబుల యరుగులమీఁద నుండియు మేడలమీఁదనుండియు, నుజ్జయినీపురనివాసులు గుంపులుగుంపులుగఁగూడి యాయుత్సవముఁ గనుఁగొనుచుఁ గన్నుల నీరునించుకొనుచు నిలిచియుండిరి. అదియేమో చూడవలయునని కుతూహలము జనియింప భానుమతియుఁ దన పీఠము నుండి లేచెను. ఆమెతో భర్తయు లేచెను. భార్యాభర్త లాయూరే గింపు కనుఁగొనిరి. అదియేమో భానుమతికిఁ దెలియనందున "అయ్యా! యిదియేమియుత్సవ" మని భర్త నడిగెను. "కళ్యాణి! యిదియేమో యెఱుఁగవా; ఇట్టి దెన్నఁడు చూడలేదా? మగఁడు మృతినొందఁగ మహాపతివ్రతయైన యతనిభార్య భర్తతో సహగమనముచేయుటకై శ్మశానభూమి కరుగుచున్నది. బంధుమిత్రులుగూడఁ బోవుచున్నారు" అని భర్తృహరి యామెప్రశ్న కుత్తరము చెప్పెను. చెప్పుటయుభాను మతి విస్మయగర్భితమయిన చిఱునవ్వుతో "భర్త మృతినొందినచో సహగమనముచేయుటకై భార్య శవముతోఁగూడ వెళ్లవలయునా?" యని యడిగెను. "ఏమి! వెళ్లనక్కఱలేదా" యని భర్తృహరి పలికి యూరకుండెను. అంతట భానుమతి గృహకృత్య నిర్వాహణమునందు సేవకులను నియోగించుటకై మేడదిగి క్రిందికరిగెను. భర్తృహరిమ

నస్సు కలత(జెందెను. భార్య తనకడనుండి లేచి వెళ్ళుచుండ నామెవా లకము నతఁడు తెప్పవాల్పక యొక్కనిమేషము చూచెను. ఆమె మేడమెట్లు దిగుచుండ నతనిమన స్సగాధమైన యనుమానసముద్రి మున దిగిపోవఁ దొడఁగెను. సముద్రితరంగములవలెఁ దలంపుల పైతలం పులు తెంపులేక పరంపరలై పొడమి యడగఁజొచ్చెను. అతిగంభీరమ యిన యాతని మనస్సాగరమందు మున్నడుగునం బడియున్న క్రోధ మాత్సర్యములనియెడు మకరతిమింగిలములు పైకివచ్చి యదేచ్ఛముగా సంచరింపఁజొచ్చెను. పరిశాంతమయిన యాతనిమనస్సు మంచిచెడ్డ తలంపులు పోరాడు రణరంగమయ్యెను. మాటిమాటికి నిట్టూర్పులు మొగమునుండి వెడలఁజొచ్చెను. ఒకమా రాసనమునుండి లేచి యిట్ట ట్టుఁదిరుగును. వెంటనే యాసనమునం జదికిలఁబడి పైకిఁజూచును కావి తో నేలరాయును. అఱచేతితోఁ దలఁ ఛామఁకొనును. తలయూఁచును. పెదవికఱచును. పండ్లుకొఱుకును. వెయ్యేల? ఆతఁడున్మత్తునివలె నుం డెను. కొంతసేపటికి ధైర్యము దెచ్చుకొని తనలో నిట్లు తలపోసెను. "భానుమతి మహాపతివ్రతయని నేనింతకాలము తలంచుచుంటిని. నేఁటిమాటవలన నీమె సాధ్వికాదని తెల్లమైనది. భర్త మృతినొందిన ప్పుడు భర్తతో సహగమనముచేయుటకై భార్యపోవలెనాయనియీామె యడిగినదిగదా! ఉత్తమజాత స్త్రీ లక్షణ మీామె యెఱుఁగదా? ఎఱుఁగకపోవుటకుఁ గారణమేమి? సత్కులమందు జననమొందినది. కొంత చదువుకొనినది. లోకజ్ఞానముకలది. ఈమాత్రి మెఱుఁగదా ఉత్తమవంశ సంజాతలయిన కాంతలు మగని మరణానంతరమున భయములేక చిచ్చుఱికి ప్రాణత్యాగముచేసి యిహలోకమునందుఁ గీర్తిని, బరలోకమునందు మోక్షమును బడయుట సదాచారమని యీామె యెఱింగియు నింతనిర్భయముగ నాయెదుట నట్లాడుట నరసి చూడ నిది యెంతకైనను సాహసురాలని తోఁచుచున్నది. అట్లేకా

కున్నచో మగఁడ్డైన నా కట్టియుత్తర మిచ్చునా? అభిప్రాయము లనేకములు లుండవచ్చును. కొన్ని వెలిపుచ్చవచ్చును. కొన్ని వెలి పుచ్చరాదు. ఆయుక్తాయుక్తవివేచనజ్ఞానమే దీనికి లేసట్లుతోఁచుచున్నది. ఈసాహసురాలు నామరణానంతరమున సహగమనము చేయునా? చేసిన నాకేమి? చేయకున్న నాకేమి? నేనది చూడఁబోవుదునా? ఈమె యభిప్రాయము నిరంకుశమై విశృంఖలమై యున్నది. ఉండుఁగాక! దీని మనస్సెంత లోఁతున్నదో యారయవలయును."

---

## మూఁడవ ప్రకరణము.

---

### ప రీ క్ష

అని మది నిశ్చయించుకొని యాపూఁట సరిగా నన్నము దినక పరధ్యానముగానుండి సేవకులతోడఁగాని భానుమతితోడఁగాని సంభాషింపక యడిగిన ప్రశ్నములకుఁ దగినయుత్తరమీయక విచారగ్రస్తుఁడైయుండెను అది కనిపెట్టి సేవకులు భానుమతిని సమీపించి "అమ్మా! అయ్యగారేలాగుననోయున్నారు. బొంది మాత్ర మిచ్చటనున్నది. కాని మనస్సెచ్చటనో యున్నది. కారణ మారయలేకున్నాము. హేతువు మీరెఱుఁగుదురా" యని యడిగిరి. అప్పలుకులువిని యామె మిక్కిలి యక్కజపడి ప్రాణనాయకుని సన్నిధికరిగి మృదుమధురభాషణంబుల నిట్లనియె. "ఎందుచేతనో మీమనస్సు మనసులో లేదు. చిత్తము పరాయత్తమై యున్నది. నేను కారణమూహింపలేక యున్నాను. శ్రీవిక్రమార్క మహారాజుగారికి మీమీఁద నెందుకైన నాగ్రహముగలిగినదా? లేక మీకాప్తులైన చుట్టములు నెచ్చెలులు మృతినొందిరా? అట్లుగాకున్న నే నేదైన మీయెడల నపచారముగావించితినా? పరిజను లెవ

హైన మీయాజ్ఞఁ దిరస్కరించిరా? అదియుఁగాదేని మీదేహము నందు స్వస్థతలేకయున్నదా? నాయెడల నపచార మున్నపక్షమున క్షమియింపుఁడు. సేవకులు తప్పుచేసిన శిక్షింపుఁడు. ఇతరకారణ మున్న నాకెఱిఁగింపుఁడు. మీరెప్పటివలె మనసిచ్చి మాటలాడకున్నారు. ప్రేమతోఁ బలుకరింపకున్నారు. చిఱునవ్వులతో నెల్లప్పుడు కలకలలాడు మొగము నేఁడు చిన్నవోయి యుండుటచే నామనస్సెంతో చిన్నవోయినది. ఇల్లంతయు చిన్నవోయినది. కావున మీవిన్నవనమునకుఁ గారణంబు నాకెఱిఁగింపుఁడు" అనవుడు భర్తృహరి, "మహారాజునకు నామీఁద నాగ్రహములేదు. బంధుమిత్రులు మృతి నొందలేదు. నాయెడ నెవ్వరపరాధముఁ జేయలేదు. నావిచారమునకుఁ గారణము నేనితరులకుఁ దెలియఁజేయఁదలఁచుకొనలేదు. కాలక్రమంబున నీవే యెఱుంగఁగలవు." అని యుత్తరమిచ్చి పీఠమునుండి లేచి సేవకులలో నొక్కనిని బిలిచి వేటకుఁబోవుటకు సన్నాహముఁ జేయుమని యాజ్ఞాపించెను. పరిజనులు, తెరలు నురులు, నచ్చులు దీమములు వేటకుక్కలు మొదలగువాని నన్నిటిని సిద్ధముజేసిసకల కళ్యాణలక్షణలక్షితమైన గుఱ్ఱముమీఁద జీను వైచి ప్రయాణమున కాయత్తముచేసి సన్నాహము సంపూర్ణమైనదని స్వామి కెఱిఁగించిరి. అదివిని భర్తృహరి మృగయాక్రీడకుఁ దగిన వస్త్రాలంకారములను దాల్చి యాయుధములను సమకూర్చుకొని మునుపటియట్లు ప్రియురాలిని బిల్చి మాటాడక యామెతో నేమియుఁ జెప్పక యశ్వారూఢుఁడై సపరివారముగా వెడలిపోయెను. పూర్వము తనపై నింతింత యనరాని యనురాగముగల జీవితేశ్వరుఁడు నిష్కారణముగా నాఁడంతయనాదరణము తనయెడఁ జూపినందుకు భానుమతి దుస్సహమైన వేదనంబొంది గుఱ్ఱముపైనెక్కి పోవుచున్న భర్తృవిగ్రహము కన్నుదోయికిఁ గనఁబడినంత సేపు చూచుచు నతఁడు దృష్టిపథము

దాఁటిపోయినవెనుక శయనాగారము ప్రవేశించి పానుపుపైఁ బవ్వళించి తనయవస్థను గూర్చి చింతింపఁదొడఁగె. పరిచారిక లామెను పలు తెఱంగుల నూరడించిరి. మనోవ్యాధులకు మాటలుమందులగునా? ఆమెవిసాదము లేశమైన మంపగింపలేదు. అట్లు నాలుగుదినములు గడచెను. అయిదవనాఁడు భానుమతి తనకిష్టదైవతమై పలుమాఱు తన మొఱలాలకించి తనమనోరథములు సఫలముగావించిన జగన్మాతయగు పార్వతీదేవికి సమారాధనము జేయవలెనని నిశ్చయించి స్నానాది విధులఁ దీర్చి పరిశుద్ధమైన యంతఃకరణముతో దేవిని బూజించి నానావిధములఁ గొనియాడి తన యెట్టయెదుట నామె నిజరూపముతో నున్నట్టు భావించి తనమనోవేదన నిట్లు తెఱంగున నెఱిఁగించెను "అమ్మా! జగజ్జననీ! నీవు సకలలోకములలోపల వెలుపలను వ్యాపించియుండి యెల్లవారి యభిప్రాయముల నెఱుఁగుదువు. అయినను నామనోవ్యథ నానోటనే నీకు విన్నవింపవల యునని కుతూహలము గలదు. దేవీ! సావధానవై యాకర్ణింపుము. మనోవాక్కాయకర్మములచేత నా ప్రాణేశ్వరునియెడల నే నపరాధముఁ జేసియెఱుఁగ. ఆయనమాట జవ దాఁటియెఱుఁగ. ఆయన కనుసన్నలనే మెలఁగుచుంటిని. అమ్మహాత్ముఁడే నాపాలిటిదైవమని, నాపున్నెముల పంటయని, నాభాగ్యరాశియని భావించుకొని యాయనచరణంబులు శరణంబుగాఁ గాలక్షేపము నే యుచుంటి. ఇటులున్నను నాలుగుదినములక్రిందట నాయనకు నామీఁదఁ గారణలేకయే బిట్టలుక పుట్టినది. నాచరిత్రమును నేనెన్నివిధములఁ బరిశోధించిచూచినను నావలన నేరములేదనియే నానమ్మిక. కాని యొక్కసందియంబు మాత్రము నామనంబును బాధించుచున్నయది. అయిదుదినములక్రిందట నొకపతివ్రత తన మగనిశవముతో సహగమనము చేయవలెనని యుత్సవముతోఁ బోవుచుండఁగా నేనది చూచి మొదట నదేమో తెలిసికొనలేక భర్తగారివలననిని పతివ్రతమైన

స్త్రీ భర్త శవముతో సహగమనముచేయుటకుఁ బోవలయునా' యంటి ని. ఆమాటలు నానోటనుండి వెడలినదిమొదలు భర్తగారు విచారాకాంతచిత్తులైయుండిరి ఈమాటఁనుబట్టి యాయనకు ననుమానము కాఁబోలును! నేను పతివ్రతనుగానని యాయన తలంచెను గాఁబోలును. నాపలుకులకై యాయన కలుకపుట్టినదేమో యని యాయన వేఁటకు వెళ్ళినతఱువాత నాకనుమానము కలిగినది. వెళ్ళకమునుపు తోఁచిన పక్షమున నాయభిప్రాయ మాయన కెఱింగించి సంశయము నివారించియుందును. ఆయన యిచ్చట లేఁడు. కావున నాయాశయము నేను నీకు విన్నవించుచున్నదానను పతివ్రతయైన యంగన భర్తృ మరణవార్త వినినతోడనే ప్రాణములు వాయక మఱికొంత సేపు బ్రతికియుండి సహగమనముచేయుటకు నగరజనుల యెదుటనుండి పోవలయునా యనునర్థముతో నట్లంటినిగాని పతివ్రతలు సహగమనము చేయఁగూడదని నాయభిప్రాయము కాదు. పిడుగువంటి భర్తృ మరణవార్తవినినతోడనే పతివ్రతమేన ప్రాణములుండునా యని నాసంశయము. నేను సత్యమే పలుకుచున్నానో యసత్యమే పలుకుచున్నానో సకలభూతహృదయవర్తిని వైన నీవెఱుఁగవే? తల్లీ! సత్యమిప్పుడు నీకు విన్నవించితిని. నాభర్తమనంబునఁ బ్రవేశించియాయనకు నాయందెప్పటియనుగ్రహముగలుగునట్లు,నిరపాయముగా నామహాత్ముఁడు వేఁటనుండి గృహంబునకు మరలివచ్చునట్లు కటాక్షింపుము. నావందనములు చేకొనుము. అని విన్నవించుకొని పూజాగారము విడిచి యావలకుఁ బోయెను. అంతలో నొకసేవకుఁడు పరుగుపరుగున వచ్చి రోదనముచేయుచు నామెయెదుట నిలిచెను. భానుమతి యాతనినిఁ జూచి వెలవెలఁబారు మొగముతో వణఁకుచున్న నెమ్మేనితో గద్గదమైనకంఠముతో "ఓరీ విజయా! ఏల యేడ్చుచున్నావు? కుశలమా భర్తగారికి!" అని వానినోటనుండి ప్రత్యుత్తరము రాకునికి మఱల

మఱల రెండుమూఁడుసారు లడిగి వానివలన నేయుత్తరముఁబడయ లేక శరీరము కంపించుటఁజేసి నిలువఁజాలక, "అమ్మా! ఆసనముఁ దెచ్చుచున్నాను; క్రిందఁగూర్చుండవలదు" అని పరిచారిక పలుకు చున్నను నరకుసేయక కటికినేలఁ జదికిలఁబడి వెండియు "విజయా! విజయా! చెప్పుము ఏలయేడ్చెదవు? కుశలమా భర్తగారి" కనియడి గెను. విజయుఁడు కన్నీరు త్తరీయమునఁదుడుచుకొని చేతుల జోడించి హీనస్వరముతో నిట్లనియె. "అమ్మా! యేమని విన్నవింతును? మే మందఱము మందభాగ్యులము. ప్రభువువారు భీకరాటవులకుఁ జని క్రూరమృగంబుల వేఁటాడుచుండ నేమూలనుండియో యతిభయం కరమైన పెద్దపులియొకటి వచ్చి గాండ్రుగాండ్రుమని గుండెలవియున ట్లు మహాటవి మాఱుమోఁగునట్లు పెల్లఱచుచు స్వామిపైఁబడెను. అమానుషశక్తిగల ప్రభువు క్రూరమృగముతోఁ గొంతసేపు పెనగు లాడెను. కాని తుదకు మనుష్యబలముకంటె జంతుబలమే యధికమ య్యెను. స్వామిశరీరమునిండ నెత్తురువఱదలై ప్రవహించెను. ఒడ లెఱుఁగక స్వామి పడిపోయెను. అది మూర్ఛయనుకొంటిమి హా! యే మిచెప్పుదును? అది మరణమేకాని మూర్ఛకాదు." అని వెండియు నేదో చెప్పఁబోవుచుండ "హాపరమేశ్వరా" యని భానుమతి నేలఁబ డెను. "అయ్యో! దేవీ! అయ్యో! దేవీ! యెంతకష్టమెంతకష్ట!" మని పరి చారిక లాక్రందనముచేయుచుఁ జన్నీళ్ళు పన్నీరు మొదలగు చల్లని పదార్థములఁదెచ్చి సముచితోపచారములు చేసిరి. కాని భానుమతికి స్పృహరాలేదు. పరిచారికలు పెద్దపెట్టున నేడువసాగిరి. విజయుఁడు బొమ్ముమోఁదుకొని యేడ్చుచు "హా! నేనెంత పాపాత్ముఁడను? ఈపాడువార్త చెప్పిన దురాత్ముఁడను నేనేకదా! ఈమె నిజముగా మరణించియుండునా! అట్లయిన నీపరమసాధ్వి బలవన్మరణమునకు నేనే కారణముగదా! ఈపాపము వేయిజన్మములకైన హరించునా?

నాబ్రతు కేల ? ఇచ్చట నేనిలువఁగూడదు." అని ఖేదపడుచు నచ్చో టు విడిచిపోయెను.

---

## నాల్గవపరికరణము.

---

### వైరాగ్యము

విజయుఁడు శక్యమైనంత వేగముతో భర్తృహరి వేఁటకై విడి సిన యడవికిఁ బోయి భయము, దుఃఖము మనమునఁ బెనఁగొన స్వామి సన్నిధిని నిలిచెను. భర్తృహరి వాని మొగముఁజూచి "విజయా! ఏమి జరిగినది? నీ మొగము మిక్కిలి విచారమును సూచించుచున్నది. అప్రి యముచెప్పవచ్చితివా?" యని యడిగెను. విజయుఁడుభయసంభ్రమము లుగదుర నాతనికిట్లువిన్నపముచేసికొనెను. "దేవా! నేనుమిక్కిలిపాపా త్ముఁడను. నాచేసిన పాపమునకు నరకమేగాని వేఱొకప్రాయశ్చిత్త ములేదు. దేవరవారియాజ్ఞ శిరసావహించి మాయబద్ధపు మరణవా ర్తను నేను దేవిగారి కెఱిఁగించినందుకు నిజమైన మరణవార్తనే మీకు మఱల నెఱిఁగింపవలసివచ్చెను. స్వామీ! యిట్టివింత లెన్నడు కనివిని యెఱుంగము. భార్యయొక్క పాతివ్రత్యము నీవిధముగా శోధించినవా రెందునులేరు. ఇది మీకే తగియున్నది. పతిమరణవా ర్తను వినఁగానే యామెల్లాలు పెద్దగాలిపెట్టున కూఁకటివ్రేళ్లతోఁ గూలిపోవు చెట్టువలె నేలంబడెను. పరిచారికలు కొన్ని శైత్యోపచా రములు చేసిరి. కాని నేను బయలుదేరునప్పటికి తెలివిరాలేదు. ఆపర మసాధ్వి మృతినొందెనని చెలికత్తెలు భయపడుచున్నారు. ఈ దారుణ వార్త నెఱిఁగించుటకై నాపాడుజీవమును విడువలేక సిగ్గుమాలిమఱల మీకడకు వచ్చితిని. మీఁద దేవరచిత్తము."

అని విరమించుటయు, భర్తృహరి యాశ్చర్యవిషాదములతో

"విజయా! యెట్లెట్లు! దేవి మృతినొందినదా? అంతపని జరిగియుం డునా? కర్ణకఠోరమయిన యీవార్త శ్రవణగోచరమైనతోడనే దేవి శోకభారముచేత మూర్ఛిల్లియుండును. నీవు వచ్చునప్పటికి తెలివి రాకపోయినను నీపాటికైన వచ్చియుండును. నీవు వెంటనేపోయి నా గుఱ్ఱమును బయనమున కాయత్తము జేకొనిరమ్ము. ముందు నేను బోవుచుండెదను. వేఁట చాలించి పరివారమంతయు వెంటనే ప్రయాణమై నగరమునకు రావలయువని చెప్పుము. నామన స్సిప్పు డు దేవిసన్నిధికే పోయినది ఆలస్యముచేయకుము." అని యానతిచ్చి తన మనంబున నిట్లు వితర్కించెను. "ఏమి? కుడిచి కూర్చుండి మహా పద తెచ్చుకొంటినే? అది మూర్ఛయైన పక్షమున సరే, కాక, మర ణమేయైన పక్షమున హానియు లోకనిందయుఁ బొందినవాఁడ నగుదు ను. అది మూర్ఛయే యైనచో నెంతబాగుండును! పరమేశ్వరా! రక్షింపుము. రక్షింపుము. నీ నామస్మరణమే సంజీవని యగుఁగాక! నీవే గతివి. నీపాదద్వయమే నన్ను విపత్తునుండి దాటించు తెప్ప" అని తలపోయుచుండ నంతలో హయరత్నము ప్రయాణమునకు సిద్ధ మైవచ్చెను. అతఁడు వెంటనే వారువము నెక్కి బయలుదేరెను. పరి వారముగూడ నాతని వెనుకనే బయలుదేరెను. తనమనస్సు తనగృహ ముమీఁద వ్రాలినంత వేగముగాఁ దనగుఱ్ఱము గూడ తన యింటి ముందఱ వ్రాలవలయు నని యతఁడు కోరి యశ్వమును తఱటుచే సియుఁ జేతితోఁ దట్టియు, మాటలచే నుత్సాహపఱచియు, నప్పుడప్పు డు కశాఘాతంబుల నొప్పించియు సాధ్యమైనంత వేగముగా నడపిం చెను. ఎట్టకేలకు గుఱ్ఱము శిప్రానదీప్రాంతమున నున్న శ్మశానభూమి సమీపమునకుఁ బోయెను. అక్కడ వేలకొలఁది జనులు గుమిగూడి యుండిరి. భర్తృహరి గుఱ్ఱము నాపి యొకపురుషుని బిలిచి యాసం దడి యేమని యడిగెను. అతఁడు భర్తృహరియని యాపురుషుఁ

డెఱుఁగక యిట్లు చెప్పెను.

"అయ్యా! భర్తృహరి వేఁటకుఁబోయి పెద్దపులిచేతఁ బడి చచ్చిరట. ఆవార్త విని యాతనిభార్య మృతినొందినది. భర్తశవము వ్యాఘ్రి మీఁదుచ్చుకొని పోయినందున నామెనుమాత్రమే దహనము చేయుటకు బంధువులు శవమును గొనితెచ్చిరి." ఆమాటలు తిన్నగా ముగియకమును పే భర్తృహరి గుఱ్ఱమునుండి దిగి నేలఁబడెను. సేవకు లాయనను లేవనెత్తిరి. అవయవముల పటుత్వము తప్పెను. అంగము వడఁకెను. చిల్లిపడిన కుండలోనుండి జలమువచ్చునట్లు కనులనుండి నీరు కారఁజొచ్చెను. భార్యాశవము కడకుఁ దీసికొనిపొమ్మని యాతఁడు సేవకులతోఁ జెప్పెను. మఱియొకచేయి పట్టుకొని యిరువురు సేవకు లాతని నచ్చోటికిఁ గొనిపోయిరి. ఎఱిఁగినవారందఱు నాతనిఁజూచి నిశ్చేష్టులై కొంతవడికిఁ దెలివిఁదెచ్చుకొని "భర్తృహరివచ్చెభర్తృహరి వచ్చె" నని కేకలువైచిరి. అందఱాశ్చర్యము నొందిరి. తిన్నఁగా నతఁడు భానుమతి కళేబరమునొద్దకుఁ బోయి యాశవమును చూచి మూర్ఛపోయెను. చల్లని యుపచారములచేత మెలఁకువ గలిగియిట్లు విలపించెను. "ఓమహాపతివ్రత! నేను నీకు భర్తనుగాను; నీపాలిటియ ముఁడను నీమాటల యర్థముఁ దెలిసికొనలేక నిన్నుఁ బరీక్షింపఁ దలఁచి యబద్ధపుమరణవార్త యనుశూలముతో నిన్నుఁబొడిచి చంపి తిని. నుగని మరణవార్త వినినతోడనే పతివ్రత యచ్చటఁ జావవలెఁ గాని సహగమనము చేయుటకై నడిచిపోవవలయునాయని నీయభిప్రా యము. ఆహాహా! ఎంతగొప్పయాశయము? ఎంత యున్నతభావము? ఎంత పరిశుద్ధజీవనము? ఎట్టియమానుషవర్తనము? నీయాశయములు దెలియ దేవతలకునైన శక్యము గాదు. నీమహోదారభావములు నేను గ్రహింపలేక మందమతినై చేతులార నిన్నుఁ జంపుకొంటిని. క్షణకాలములో నీశరీర మాహుతిగాఁ జేసికొనఁదలఁచిన యీయా

గ్నిహోత్రిముకంటె నీవు పవిత్రురాలవు. మందభాగ్యుఁడనగు నాకు నీవెట్లు దక్కుదువు? నాయబద్ధపుమరణవార్త విని నీవు ప్రాణములను విడిచితివి. నీనిజమైనచావుఁ జూచి నేను బ్రతికితిని. నాహృదయము దారువో, శిలయో, వజ్రమో కానోపు. మగనిమేనితోడఁ బతివ్రత యైన మగనాలు చిచ్చురుకుట సాంప్రదాయముగదా! నే నిప్పుడు కళేబరముతో నిప్పులదునికి భార్యసహగమనసాంప్రదాయము నెల కొల్పెదను. కళ్యాణి! మొగముమీఁద కళపోలేదు. ఇంకను జీవించి యుంటివేమో యని యాశ కలుగుచున్నది కాని నాది వట్టియాశ!" అని వగచివగచి దుఃఖము పట్టలేక ప్రాణత్యాగము చేయఁదలఁచెను. బంధుమిత్రులాతని వారించి కొంచెము దూరము తీసికొనిపోయి భానుమతీకళేబరమునకు నగ్నిసంస్కారము జేసిరి. ఆమెశరీరమువలెనే యాతని మనస్సుకూడ మండిపోవుచుండెను. ఆత్మహత్యగావించుకొని శోకము నివారించుకొనుట కతఁడు యత్నింప నాప్తబంధువు లట్లు చేయనీయరైరి. అగ్ని నీటిచేతఁజల్లారునుగావున బాష్ప జలముచే నతఁడు శోకాగ్ని నార్పుకొనుచుండెను.

ఆసమీపమున మఱ్ఱిచెట్టు కలదు. దానికడ నొక సన్యాసి కూర్చుండి కొంతసేపిటునటు చూచి తన కమండలువు ముక్కముక్కలుగాఁ బగులఁగొట్టి యాతునియలన్నియు నొకచోటఁ జేర్చి యిట్లు వాపోవఁదొడఁగెను "హా కమండలమా! భూమండలమంతయు ధార వోసినను నిన్ను నే నెవరికి నీయఁజాలను. అయ్యో! నీవు చెఱుకురసమువంటి తియ్యని నీరిచ్చి దాహముతీర్చి తల్లివలెఁ గాపాడితివి ఎండ కాలమున గాడ్పులువీఁచునప్పుడు తాపమున కోర్వలేక చల్లదనమునకై నేను నిన్నుఁ గౌఁగలించుకొనువాఁడను. ఇఁక నాకెవ్వరుదిక్కు? దాహ మెవ్వరుదీర్చెదరు? నేనెవ్వరిఁ గౌఁగలింతును? అయ్యో! నీవు లేకపోవుటచే నా చేతులు చిన్నవోయెనే! సూర్యుఁడు వెలుఁగుచున్నను

లోకము చీకటికోసమైనదే! నీమెడ యెంత సుందరముగా నుండెనే! నీకడుపు చలువ నేమనివర్ణింతునే? నీలోనుండి నీళ్ళు తొళ్ళుకుక్కు తొళ్ళుక్కు మని పైకివచ్చునప్పుడు స్వర మెంత మనోహరముగ నుండెనే? అయ్యో! నాకనుల చందమామా! నాపాలిటిపారి జాతమా! నాముద్దులమూటా! నాచింతామణి! నాకామధేనువా! యెందుఁబోయితివే? నిన్నువిడిచి నేనెట్లుండెదనే!" అని బొమ్మ మోఁదుకొని మొత్తుకొని యతఁ డేడ్చుచుండ నెల్లవారికి నది వింతగాఁ దోఁచెను. తోఁచుటయు ననేకులు కాలక్షేపము నిమి త్తమై మట్టికడకరిగిరి. బంధువులు భర్తృహరిని గూడ నచ్చటికిఁ గొనిపోయిరి. సన్యాసి పిచ్చివాఁడని కొందఱనిరి. కాదుకాదు గంజా యిమత్తుచే నట్లు ప్రేలుచున్నాఁడని కొందఱు వాదించిరి. పిశాచము పట్టినదని కొందఱు వచించిరి. లేదు లేదు సన్యాసి గొప్పజ్ఞాని యని కొందఱాడిరి. పలువురు పలుతెఱఁగుల భాషింపుచుండ భర్తృహరి తనదుఃఖము కొంతమఱచుకొని సన్యాసితో నిట్లనియె. "స్వామీ! మీరు యతీశ్వరులు, జ్ఞాన సంపన్నులు. విశేషించి వయోవృద్ధులు. లోకానుభవము గలవారు. అట్లయ్యు మీయాశ్రమధర్మ విరుద్ధము గా లోకవిరుద్ధముగా మట్టిపాత్రకై యింత విచారించెదరేల? మీము ఖము బ్రహ్మతేజస్సుతో వెలుఁగుచున్నది. కావున మీకు వెఱ్ఱియని నేననఁజాలను. మహానుభావులైన మీసమీపమున కేపిశాచములు రావు. మీరుకోరినయెడల నిట్టి కమండలములు నూఱు మీకు క్షణ ములో రాఁగలవు. కావున నిట్టి దుఃఖమునకు హేతువెద్దియో నే నూ హింపఁజాలకున్నాను. అదియునుఁగాక మీచేతితో మీరు పగులఁగొట్టు కొని యేడ్వఁదగునా?" నావుడు సన్యాసిమొగమునఁ జిఱునవ్వుసంధిల్ల నిట్లనియె. "నాయనా! అడుగవలసిన ప్రశ్న మడిగితివి. కాని నాప్ర శ్నమునకు ముందు నీవుత్తరముచెప్పుము. నీవు నీభార్యను చేతులారఁ

జంపుకొని యీమెకొఱకై యేల యేడ్చుచున్నావు? నాకమండలఘట మెట్టిదో నీభార్యఘట మట్టిదే. ఈకమండలపుముక్క లదుకుట యెట్లు సాధ్యము కాదో నీకళత్రమును బ్రతికించుటయునట్లే సాధ్యముకాదు. కావలసినయెడల నీకు నూఱుగురు భార్యలుదొరకరా?" ఆమాటలు శ్రవణగోచరములు కాఁగానే భర్తృహరిమనస్సుమాఱిపోయెను. దుఃఖము పటాపంచలై యెగిరిపోయెను. జ్ఞానసూర్యమండలము మనోగగనమునఁ దోఁచెను. శోకాంధకారము విచ్చు మొగ్గయ్యెను. అగుట యు నతఁడు సన్యాసిపాదములకు జాగిలంబడి మ్రొక్కి యిట్లు విన్నవించెను. "మహాత్మా! మీకు పిచ్చిలేదు. పిశాచపీడలేదు. నాకు జ్ఞానోపదేశముఁ జేయుటకై మీరీపన్నుగడఁ బన్నితిరి. నేను ధన్యుడనైతిని. జ్ఞానోదయమైనది. నేనిఁక మీశిష్యుఁడను. నేనిప్పుడే సన్యసించుచున్నాను"

---

## వేమనకవి

వేమనశతకము రచియించిన కవినిగూర్చి యనేక కథలున్నవి అందొక్కకథ యీక్రింద చెప్పఁబడుచున్నది. ఆంధ్రదేశమును పదునాల్గవశతాబ్దమునందును పదునైదవ శతాబ్దము కొంతభాగమువఱకు ను రెడ్డిరాజులు పాలించిరి. అద్దంకి రాజధానిగఁజేసికొని కొందఱు, కొండవీడు రాజధానిగఁ జేసికొని కొందఱు, రాజమహేంద్రవరము ముఖ్యనగరముగఁ జేసికొని కొందఱు రెడ్డిరాజులు తెలుఁగునాడు పాలించిరి. ఈ రెడ్లలో భూమంచిరెడ్లు, పంటరెడ్లు, మోటాటరెడ్లు, పాకనాటిరెడ్లు, రేనాటిరెడ్లు, లోనగు తెగలు పెక్కులు గలవు. ఈ రెడ్లలో తెలుగుదేశ మేలినవారు ముఖ్యముగ పంట్లరెడ్లు. ఈ రెడ్డిరాజులు వారు స్వయముగ విద్యావంతులై విద్వత్కవుల ననేకులఁ ...

బోషించి ప్రఖ్యాతిఁగాంచిరి. ప్రబంధ పరమేశ్వరుఁడని బిరుదువహిం
చి భారతశేషమును బూరించిన యెఱ్ఱాప్రగడ యద్దంకి రాజధానిగ
నేలిన ప్రోలయవేమారెడ్డివద్ద నాస్థాన కవీశ్వరుఁడుగ నుండెను. నైషధ
ము, కాశీఖండము, భీమఖండము మొదలగు మహాకావ్యముల రచియిం
చిన శ్రీనాథమహాకవి రాజమహేంద్రవరమునేలిన వేమారెడ్డివద్దను
వీరభద్రారెడ్డివద్దను సంస్థానకవీశ్వరుఁడై ప్రతిభగాంచెను. కొండవీడు
నేలిన రెడ్డివద్ద ప్రబంధములు రచియించినకవి యెవ్వఁడు నుండినట్లు
కనఁబడదు. కాని యనేకప్రబంధములకన్న మిన్నయై నీతిరత్నభాం
డారమై ముద్దులమూటగట్టు తేటతెనుఁగుమాటలతో రచియింపఁబడిన
పద్దెముల కునికిపట్టయి యాంధ్రదేశమునం దాబాలగోపాలము ప్రతి
మనుష్యునినోటనుండు వేమనశతకము రచియించిన వేమనమాత్రము
కొండవీటిలో నుండెనని లోకమందొక ప్రతీతి కలదు. ఈవేమన కొం
డవీటిప్రభువైన యనవేమారెడ్డియొక్క తమ్ముఁడు. ఈతఁడు వివాహ
ము చేసికొనక బోగముదానినుంచుకొని రాజగృహంబునఁ బంచభక్ష్య
పరమాన్నములతో భోజనముచేసి యే వ్యాపారమునందు మనస్సుజొ
రుపక రాజకీయ వ్యవహారంబుల పొంతబోక విద్యాగోష్ఠి దరికి రానీక
వేశ్యాముఖసందర్శనంబె బ్రహ్మానందసంధానముగ దాని గృహంబె
స్వర్గంబుగ దాని సహవాసమె మోక్షముగ భావించుచు భోజనకాల
ముదక్క తక్కిన కాలమంతయు దానిగృహంబుననె గడుపుచు లోక
మెల్ల మఱచి యుండెను. అనవేమారెడ్డియొక్క పట్టమహిషి యైన
నరసాంబ విజ్ఞానవంతురాలు. మహాపతివ్రత. ఆమె వివాహము చేసికొ
నక చెడిపోవుచున్న తనమఱఁదింజూచి జాలిపడి పుత్రభావముతో నా
తని జిన్ననాఁటనుండియుం బెంచినదగుటచే నాతనివిషయమై కడుంగ
డు విచారించి పలుసారులు వానింబిలిచి మందలించి నీతులుచెప్పి హి
తోపదేశములు చేసె కొంతవఱకు వానిబుద్ధి మంచి మార్గమునకుఁ ది

ప్పెను. నిర్వ్యాపారముగ నున్నవారిమనస్సు దురాలోచనలకు నిల యమగుట లోకవిదితము గావున నరసాంబ, వేమన నిర్వ్యాపారముగ నున్నపక్షమున మరల దుర్వ్యాపారమునఁ బ్రవేశించునని భయపడి యాతనికేదైన వ్యాపారముఁ గల్పింపఁదలంచి యంతఃపురం బునంగల స్త్రీలకుఁ దనకు నగలు చేయింపనమకట్టి కంసాలులం బిలి పించికోటలోనె వారిచేత దుకాణములబెట్టించి సూర్యోదయము మొద లుకొని సూర్యాస్తమయమువఱకును వారక్కడపనిచేయునట్లేర్పఱచి మఱిఁదియగు వేమన్ననుబిలిచి కంసాలులు వేళకుసరిగావచ్చుచున్నారో లేదో కనిపెట్టుమనియు బంగారము హరింపకుండఁ జూచుచుండుమని యుఁ జెప్పి వారిపై యధికారిగ నియమించెను. అక్కడ పనిచేయవ చ్చిన కంసాలులిద్దఱన్నదమ్ములు అభిరాముఁడు లక్ష్మణుఁడు వారిపేరు లు. అభిరాముఁడు పరమ శివభక్తుఁడు. అతఁడు ప్రాతఃకాలమందు లేచి స్నానముచేసి శివపూజ జేసికొని ప్రతిదినము నగలుచేయుటకుఁ గోటకుఁబోవుచుండును. ఆతనియనుష్ఠానములు తీరునప్పటికి ప్రతిదిన ము నించుకప్రొద్దెక్కుచువచ్చెను. వేమన యేపనిలోఁబ్రవేశించినను దానియందు దీక్షగలిగియుండువాఁడు. తెల్లవాఱకముందేలేచి కాల్య కృత్యములఁ దీర్చికొని కంసాలులు రాకముందె దుకాణము గదితలు పులు తీయించి తానక్కడ కూర్చుండి యాలస్యముగవచ్చుచున్న య భిరాముని పై గోపించి ప్రతిదిన మాలస్యమునకుఁ గారణములడిగి పెం దలకడ రమ్మని వానిని నిర్బంధించుచు వచ్చెను. అభిరాముఁడు స హజముగ దైవభక్తుఁడు. పాపభీతిగలవాఁడు నీతిసంపన్నుఁడు. అయిన నను వేమనవలన మిక్కిలి యిబ్బందిగలవాఁడయ్యెను. సామాన్యుఁ డైన యధికారినేర్పఱచినప్పుడె పనిచేయువాండ్రకు విశేషబాధ కలుగు చుండునుగదా. అట్టియెడ రాజసోదరుఁడె స్వయముగవచ్చి యెల్లవే ళలయందుఁ బనివాండ్రపై నధికారము జేయుచు నీవలావలకుఁ బోనీ

యక వంచిననడుమెత్తనీయక యొక్కయడుగైన హెచ్చుతగ్గగ రానీ యక యడకత్తెరలోఁ బోకచెక్కవలె వారిని నొక్కుచుండుటచే కంసాలులిద్దఱు మిక్కిలి మనఃక్లేశము నొందఁజొచ్చిరి. అందభిరాము నిబాధ జెప్పనలవిగాకుండెను. ఒక్కనిమేష మాలస్యమైనను వేమన యూరకుండఁడు. ఎంతపెందలకడ లేచినను దనయవశిష్టంబులఁ దీర్చుకొని వచ్చునప్పటికి గొంతయాలస్యము కాకపోదు. రాజసేవనే ప్రధానముగఁ జేసికొని యీశ్వరసేవ మానజాలకయు నీశ్వరసేవనే ప్రధానముగఁ జేసికొని రాజసేవమానఁజాలకయు బాపమాయభిరాముఁడు మిక్కిలి సంకటముపడుచు వచ్చెను. మీసగలు చేయఁజాలనని చెప్పుదమన్న రాజు బుఱ్ఱతీయించునేమో యన్నభయము, ప్రపంచములో బ్రతికెడుబ్రతుకు మూడునాళ్ళముచ్చటగదా దీనినిమిత్తమై భగవంతుని సేవ మానుకొనవచ్చునా యని యతని మానసమున సందేహము పొడముచువచ్చెను. రాజు బుఱ్ఱ తీయించకపోయినను బనిమానుకొన్న పక్షమున సంసారముగడచుట కెత్తులేదు. ఇట్లనేకవిధంబుల నయ్యభిరాముఁడు బాధపడుచుఁ నొకపూట సరిగ వేళకువచ్చుచు నొకపూట రాఁజాలక బాధపడుచు వేమనచేతఁ జీవాట్లుపడుచుఁ గాలక్షేపము సేయఁజొచ్చెను. ఇట్లుండఁగా నొక్కనాఁడు వేమన యభిరాముఁడుదయకాలమున నేమిచేయునో స్వయముగ వెళ్ళిచూడవలయునని సంకల్పించుకొనెను. అతఁడేది సంకల్పించుకొన్నను దానిని నిరంతరాయముగ నెఱవేర్చుకొనుశక్తి యాతనియొద్ద కలదు. ఇట్లగుటచే మరునాఁడు తెల్లవారుజామున నిద్రమేలుకొని కాల్యకృతంబులఁదీర్చికొని యభిరాముని యింటివైపరగి చాటుచాటున నక్కి యాతని వ్యాపారంబుల గనిపట్టెను.

అభిరాముఁడాదినమున నెప్పటికంటె ముందుగా మేలుగాంచి కాల్యకృత్యంబులందీర్చుకొని చెరువునకుఁబోయి స్నానము జేసి శివ

పూజజేసికొని యిల్లువిడిచి పుష్పంబులు ఫలంబులు గొన్ని చేతబట్టు కొనియూరుబైట నొకపర్వతముపైనకరిగెను. అతఁడెఱుంగకుండ వేమన చాటుచాటున వాని వెనువెంటనే యరిగెను. అభిరాముఁడు కొంతదూరముపోయి కొండసమీపించి యందొకగుహ ప్రవేశించెను. గుహకీవలప్రక్క వేమనపొంచియుండెను. అభిరాముడు గుహజొచ్చి యందు భగవధ్యానపరుఁడైన యొక వృద్ధయోగిని సమీపించి యాతని ధ్యానమగువరకు నచ్చటనె నిలువంబడి యనుష్ఠానమైనతరువాత నాతఁడుకన్నులు తెఱచినతోడనే పాదములపైఁబడిసాష్టాంగనమస్కారమొనరించి తాను తెచ్చిన ఫలములు బుష్పములు వానికి సమర్పించెను. శతవృద్ధగు నాయోగిశిఖామణియాశీర్వదించి యభిరాముని లెమ్మని యానతిచ్చి యిట్లనియె. "నాయన పూవులు బండ్లు నానిమిత్తము కష్టపడి తెచ్చితివా! ఈవిధముగ చిరకాలమునుండి నీవునానిమిత్తమై కష్టపడి తెచ్చుచుంటివి. అనుదినము నన్ను సేవింప నాగుహకు వచ్చుచుఁ బోవుచుంటివి. నీనిష్ఠకు నీపరమభక్తికి మెచ్చితిని. నాకడగుప్తమైయున్న బ్రహ్మవిద్యను దగినమనుష్యున కెవ్వనికైన నుపదేశముజేసి యీమేను విడువవలయునని నాకు సంకల్పము గలదు. ఈవిద్య పరిగ్రహించుటకు నీవుతగిన పాత్రమవని నాకుఁదోఁచుచున్నది. నామరణ మాసన్నమైనది. రేపు పగలు రెండుజాములవేళ నేను సిద్ధిబొందుదును, కావున ప్రాతఃకాలమున సూర్యోదయమగునప్పటికి నీవునాకడకు తప్పకరమ్ము. పరతత్వము నీకుపదేశము జేసి నేను మేనువిడిచెద. మఱచిపోకుము నాయనా. అడవిలో పుట్టిన పువ్వు లడవిలోనె జీర్ణమై నశించినట్లు నావిద్య నాతో నశించిపోఁగూడదు." అని యోగి యానతిచ్చుటయు నభిరాముఁడు పరమానందభరితుఁడై యాతఁడు తనకుఁ జేయఁదలంచిన మహోపకారమునకుఁదనకృతజ్ఞతనుదెలిపి వాక్పుష్పంబుల వానింబూజించి యాత

నివద్ద సెలవుగైకొనెను. గుహచాటున పొంచియుండిన వేమన యభి రామునకు యోగికి జరిగినసంభాషణవిని వెంటనేయాస్థానమువిడిచికో టకుఁబోయి యభిరామునికంటె ముందుగా దుకాణముమీఁదఁగూ ర్చుండెను. మధ్యాహ్నమైనతరువాత వేమన కంసాలుల నిద్దఱను భోజనముల కింటికంపి తానును మందిరమున కరిగి భోజనముజేసి తల్లి కంటె తన్నెక్కుడు ప్రేమతో నాదరించుచుండిన వదినెగారగు నర సాంబనుజూచి వినయపూర్వకముగ నామె కిట్లనియె. "అమ్మా! అభి రాముఁడు ప్రతిదినము దుకాణముమీఁది కెంతో యాలస్యముగ వ చ్చుచున్నాఁడు. ఎన్నోసారులు నేను మందలించితిని. నామాట నత డులక్ష్యముజేయుటలేదు. నీవేదైన నొకవంకబెట్టి ప్రాతఃకాలమున సూర్యోదయము గాకమునుపేవచ్చి దుకాణముమీఁదఁగూర్చుండున ట్లాజ్ఞాపింపవలయును. నీచేతకాకపోయినపక్షమున మాయన్నగారితో జెప్పి యావేళకతని రప్పించితీరవలయును. కానిచోఁ గార్యభంగమగు ను." అని వేమన పలుక నరసాంబ యిట్లనియె. "నాయనా! నీవిదివ రకు కంసాలులమీఁద నధికారము జేయుచుంటివి. అదియె వారికెం తో కష్టముగనుండియుండును. ఇందునేను గూడ కలుగఁజేసికొని వా రిని నిర్భంధ పెట్టుట నాకిష్టములేదు. పాపము పిల్లలు మేకలు గలవా రు యేదైన పనిపాట లింటివద్ద నుండవచ్చును. ఏల వానినంత నిర్భం ధపెట్టవలయు. నీకుఁ గావలసినపని యేమో చెప్పు అందువలన నీకధి కప్రయోజనము గలిగెడుపక్షమున నట్లుచేసెద." అనవుడు వేమన్న నరసాంబ కిట్లనియె. అమ్మా! నాప్రయోజనము మీరడుగవద్దు. నిలు కడమీద మీకంతయుం దెలియఁగలదు. ఇట్లు నీవుచేయకపోయిన ప క్షమున నాజన్మము వ్యర్థమగును. నాబ్రతుకు వ్యర్థమగును. చేసితివా నాకు కీర్తి నీకుకీర్తి దేశమునకుకీర్తి. ఇంతకంటె నానోటపలికిరావ ద్దు." అని వేమనపలుక నరసాంబ యాతనికోరిక యం దేదోమహా

ప్రయోజనముండి యుండపచ్చునని నిశ్చయము జేసికొనిమఱదిమ నోరథముదీర్చదలఁచి భర్తయగునన వేమారెడ్డిని సమీపించి యనేక విషయములంగూర్చి ముచ్చటించి ప్రసంగవశంబున నిట్లనియె, "దేవరవారు నాకొక్కవర మీయవలయును. నా చెవినున్న దుద్దులలోనొకటిపోయినది. వట్టిచెవితోనుండుటఁజేసి నా మొగమెంతో చిన్నవోయినది. ఒకచెవికి దుద్దుబెట్టుకొని రెండవచెవికి మానఁజాలను. అందుచేత మీరభిరామునిఁ బిలిపించి రేపుదయమున సూర్యోదయముగాకమునుపె దుకాణముమీఁదికి వచ్చికూర్చుండి జాముప్రొద్దెక్కులోపల దుద్దుచేసి నాకిచ్చునట్లాజ్ఞాపింపవలయు. ఒక్కనిమేష మాలస్యమైనను నేను సహించుదానను కాను." ఆపలుకులు వినగానే రాజుచిఱునవ్వునవ్వి "యిదియా నీకుఁగావలసినవరము. పెందలకడ కంసాలిని రప్పించుట యొకగొప్పవరమేనా? ఈవరమిచ్చితిని. ఇప్పుడేయభిరామునిబిలిచియభిరాముని వెంటఁబెట్టుకొని రమ్మనియెను. ఆతఁడుపోయి యొక్కనిముసములోనభిరామునిఁ దోడ్కొనివచ్చెను. అభిరామునిఁజూచి వేమభూపాలుఁడిట్లనియె. "ఏమోయియభిరాముఁడా! నీవు రేపుసూర్యోదయముగాకమునుపె దుకాణముమీఁదికివచ్చి రాణిగారిదుద్దుచేసి జాముపొద్దెక్కులోపల నిచ్చి వేయవలెను. రాణిగారి దుద్దొకటిపోయినది. అందుచేత నామె మనసువలెనే మొగముగూడ చిన్నవోయినది. ఇందుకు నీవు మారుమాటచెప్పక చీకటితోనలేచి యిక్కడకురమ్ము." అని యాజ్ఞాపించి రాజాంతఃపురమున కరిగెను.

ఆపలుకులు వినగానే యభిరామున కెక్కడలేని విచారమువచ్చెను. మారుమాటాడుటకు మఱొకరు మఱొకరుగాదు. రాజుగాడు. ఎదురాడిన బుఱ్ఱతీయించి కోటకొమ్మముకుఁగట్టఁగలరు. అప్పుడు అతఁడీవిధముగ విచారించెను. "కటకటా నేనెంత దురదృష్టవంతుడను. మహానుభావుఁడైనయోగి రేపుదయమున నాకు బ్రహ్మవిద్య నుపదే

శించుటకు సంకల్పించి నిండుప్రేమతో రన్నుని పిలిచెగదా. బ్రహ్మ విద్యకు నాకు నాలుగుజాములు మాత్రమే యెడమున్నదనినేను తలం చుచుండ రాజాజ్ఞపిడుగుపాటువలె నాపైఁబడినది. రాజాజ్ఞకు వ్యతిరే కముగా నడచుకొన్నపక్షమున శిరచ్ఛేదమగును. అదియొకవేళ కాక పోయినను జీవయాత్రజరుగుటకష్టము. రాజాదరమువలన నాకుఁ జేతి నిండగావలసినంత పనికలిగినది. రేపటిమాట యేమనకుండ సకలసౌ ఖ్యములతోఁ గుటుంబభరణము జేసికొనుచున్నాఁడను. మజూరీక్రింద నెలనెలకు వందలకొలఁది రూపాయలిచ్చి నాచేత నగలుచేయించువా రెవరు. వెనుకకుఁబోయిన గొయ్యి ముందుకుఁబోయినను నుయ్యిగదా ఈసమయములో నేనేమి చేయుదును. ఇహమేచూచుకొని మానుదు నా? పరమేచూచుకొనిపోదునా. “శరీరమాద్యంఖలు ధర్మసాధన”మ నికదాయార్యోక్తి; శరీరమున్నతరువాతనేకదా బ్రహ్మవిద్య నేర్చుకొ నుట. శరీరమున్నపుడెకదా పరలోకసౌఖ్యముమాట యాలోచించు ట. అదియేపోవుచున్నప్పుడు చేయవలసినదేమి. అదిగాక రాజు భూ లోకమం దవతరించిన దైవము. రాజాజ్ఞ దైవాజ్ఞ. రాజశాసనమునె రవేర్చుట దైవశాసనము నెరవేర్చుట. మఱియు నెవ్వాగిధర్మము వా డుసేయవలయును. నాధర్మము స్వర్ణకారవృత్తి. అదినేను చేయవలసి నవాఁడను. మఱియు స్నానము శివపూజ సత్ప్రవర్తనము మొదల గునవే మోక్షకారణములు. ఇవినాకు చిన్ననాటనుండి యలవడియుం డుటచేత నేను గేవలము నరకమునకుఁబోను. అయ్యయో! నేను నా మనసెట్లు సరిపెట్టుకొనుచుంటిని. ఇది యభావవిరక్తిగాదా. అనేక సంవత్సరములనుండి శుశ్రూష జేసియవసానదశలో ప్రయత్నము వ్య ర్థముచేసితిని. ఈనగాచి నక్కలపాలు చేసితినన్నమాట నాకడసార్థ కమైనది. ఇంతకు నాకాబ్రహ్మవిద్య ప్రాప్తము లేదు. పరమనిర్భా గ్యున కది యెట్లుప్రాప్తించును. అని తన్ను తనయదృష్టమును నిందిం

చుకొనుచు మిక్కిలి ఖిన్నమనస్కుఁడై గృహమున కరిగెను. ఆరాత్రి పాపమతని కన్నమే హితవుకాలేదు. సరిగానిద్రియేపట్టలేదు. స్వప్నములో నొకసారి యోగిదర్శనము మరియొకసారి రాజదర్శనము. మెలకువవచ్చినపుడెల్ల మనసు విచారాక్రాంత మగుచుండెను. రాత్రి యెట్లో గడపి యభిరాముఁడు తెల్లవారుజాముననే లేచి కాలకృత్యములం దీర్చుకొని స్నానముజేసి శివపూజజేసికొని తనకు బ్రహ్మవిద్యయుపదేశముకావలసిన దినము తనదురదృష్టమున తనకు దుర్దినమైపోయెగదాయని వగచి కన్నీరువెట్టుకొను యోగియున్న కొండవంక తిరిగి యొకనమస్కారము మాత్రము చేసి రాజుగారికోటకుంజని రాణిగారిదుద్దు చేయఁబూనెను. అప్పుడు తనమనస్సు యోగిమీఁదను జేతులు కన్నును దుద్దుమీఁద నుండెను.

అక్కడవేమన జాముురాత్రివేళనెలేచికాలకృత్యములనిర్వర్తించుకొని స్నానముఁజేసి శుచియై మంచివస్త్రంబులు కట్టుకొనిపూవులు బండ్లుచేతబట్టుకొని యరుణోదయసమయమునకె కొండనద్దకరిగి గుహలోనికింజని వినయతత్పరుఁడై యోగియెట్టయెదుట నిలిచెను. యోగి కొంతసేపు పరబ్రహ్మానుసంధానము జేసికొని కన్నులువిచ్చిచూచెను. చూచునప్పటి వాతని యెదుటనతిభక్తితో ఫలములుపుష్పములు జేతబట్టుకొని యాతఁడనుకొన్నట్లు ప్రతిదినము దన్ను సేవించుచున్న యభిరాముఁడు కాక క్రొత్త మనుష్యుఁడు నిలిచియుండెను. ఆతనింజూచి యోగి "నాయనా! నీవెవ్వఁడవని యడిగెను. "స్వామీ నేనభిరాము నిశిష్యుఁడ" నని వేమన బదులుచెప్పెను. "అతఁడేడి. ఆతనిరమ్మంటినే! యేలరాలే"దని మరల యోగిపలికెను. "అతఁడువచ్చుటకు వీలులేకపోయినది. మీరుపదేశింపదలంచిన బ్రహ్మవిద్య నన్ను నేర్చుకొని రమ్మని పంపినాఁడు. అనుగ్రహించి దేవరవారు నాకుపదేశింపుఁడని పలికి వేమన వేడికొనెను. అనవుడు యోగియిట్లనియె, "నాయనా!

వాడు పరమ నిర్భాగ్యుఁడు అనేక సంవత్సరములనుండి నన్నాశ్రయించి సమయమునకు రాజాలకపోయెను. చెట్టుపెంచిన వాఁడొకఁడు ఫలము నుభవించు వాఁడొకఁడు. ఏవేళ కేది యెవ్వరికి ప్రాప్తమో చెప్పఁ జాలము. ఇంతకు నీ వదృష్టవంతుఁడవు. నీకీవిద్య ప్రాప్తమున్నది. నీకే యుపదేశించెద" అని తానుపదేశింపఁదలంచిన పరమార్థము వేమన కుపదేశించి యనంతరము ప్రాణములు విడిచెను. వేమన రాజ్యాధికారము చేయుచున్నతన యగ్రసోదరునికంటె తానెక్కువ యదృష్టవంతుఁడని భావించుకొని పరమానందభరితుఁడై కోటకువచ్చి ముందుగా నభిరాముఁడున్న చోటికిఁబోయి నేల సాష్టాంగపడి యభిరాముని పాదములు పట్టుకొని "నేను మహాపరాధిని. నన్ను నీవు క్షమింపవలయు క్షమించువరకు నీపాదములు వదల" నని బ్రతిమాలుకొనఁజొచ్చెను. అభిరాముఁడు మహాశ్చర్యము నొందెను. అక్కడ నున్నవారందఱు చిత్తరువులవలె నిశ్చేష్టులై చూచుచుండిరి. తనపై యధికారము జేయుచున్న మహారాజసోదరుఁడు తనకాళ్ళు పట్టుకొని తన్నువేఁడుకొనుటచే నభిరాముఁడు దిగ్భ్రమ జెంది యేమియుందోచక వెఱ్ఱిచూపులం చూచుచు మాటతడబడ నిట్లనియె. "బాబుగారు బాబుగారు రక్షించండి రక్షించండి. నన్నువదలండి తమరీపాటి పనిచేయుట రాజుగారు విన్నను లోకులు విన్నను బాగుండదు. రాజుగారు విన్నచో నాప్రాణముమీదికి వచ్చును. "అనవుఁడు వేమన వినయముతో" అయ్యా! నీకు నేను ద్రోహము చేసినాను! క్షమించితినని మీరు సెలవిచ్చినఁగాని నేను మీపాదములు విడిచిపెట్టను. ఆపలుకులు విని యభిరాముఁడు "నాకు మీరెన్నఁడు ద్రోహముచేయలేదు. లేవండి" యని బదులుచెప్పెను. "నీవెఱుఁగవు. నీకు నేను ద్రోహముజేసితిని. క్షమించితినంటివా వదలుదును. లేనిచో వదలను." అని వేమన మొండితనముగ బదులుచెప్పెను. ఇంతలో నచ్చోటికి పదిమందిచేరిరి. ఈ

చిత్రికథవిని రాజుకూడ నక్కడకు వెళ్లెను. ఏలినవారిని క్షమించితిన ని యంతమాట యనగలనా" యని యభిరాముఁడును అంటేకాని విడువనని వేమనయుఁ బెనగులాడుచుండిరి. ఎట్టకేలకు మీరు నాకుచే సినద్రోహ మేమో చెప్పు" డని యభిరాముఁ డడిగెను. వేమన క్షమి యించినతరువాత చెప్పెదనని యభిరాముఁడు బలికెను. క్షమించితి నన వయ్యాయని రాజుగారును నచ్చటచేరినవారందఱు నభిరామునితోఁ బలికిరి. క్షమించితిని. లెండియని యభిరాముఁడు వచియించెను. ధ న్యుఁడనయితి ధన్యుడనయితి నని కేకలువేయుచు వేమన పాదములు విడిచి లేచెను.

అచ్చటచ్చట చేరినజనులు వేమన్ననుజూచి "యభిరాముఁడు నిన్ను క్షమించినాఁడు గనుక నీతనియెడ జేసిన యపరాధమేమో వి స్పష్టముగఁ జెప్పుమని కోరిరి అనవుడు వేమన నిట్లనియె. "అభిరా మయ్యా! నీకునేను గొప్పయపరాధముచేసితిని. నాచేసినయపరాధము వలన నీకుధననష్టమురాలేదు. పరాభవము సంభవింపలేదు. అందుచే తనే నీకుదెలియకున్నది. కాని యట్టినష్టమేదియు నీకుఁ గలిగింపకబో యిన నుభయలోకతారకమగు మహావిద్య నీకు లభింపకుండఁ జేసితి ని. అనుదినము నీవాలస్యముగ దుకాణముమీఁదికి వచ్చుచుండుటఁ జూచి యాలస్యమునకుఁగారణమేమో దెలియఁగోరి నిన్నటియుదయ మునఁనీ వెఱుఁగకుండ నీవెంటనంటి నీవు యోగివసియించు కొండగు హ కరిగినప్పుడు నీవెనుక నే వచ్చి పొంచుండి నీకును యోగికిని జరిగిన సంభాషణము వింటిని. విన్నదిమొదలుకొని నామనంబున బొడమిన త త్తరపాటు యింతింతని చెప్పనలవికాదు. యోగియనుగ్రహంబునకు నేనే పాత్రుఁడగావలెననియు మహోపదేశము నేనే పొందవలయున నియు బ్రహ్మవిద్యాప్రధానము నేనేగై కొనవలయు నిన్నేదో యుపా యమున వంచింపవలయుననియు సంకల్పము నామనమున గలిగినది.

కలుగుటతోడనే నెఱవేర్చితిని. రాజపత్నికి నీవునేఁడు తెల్లవారగనె వచ్చి దుద్దుచేయవలసిన యవసరము నాకపటోపాయముచేతనే గలిగి నది. నామాయోపాయమే నిన్ను సూర్యోదయాత్పూర్వము రప్పించి నది. కిరించుధనంబున నిన్నిక్కడకు రప్పించి మహాయోగి సన్నిధికి నేనరిగి సాష్టాంగదండప్రణామ మొనరించి నిలిచి యుంటిని నాశి ష్యుఁడేడని యతఁడడిగెను. అతఁడు నిన్నె తల పెట్టెను. అతనిమన స్సు నీమీదనేయుండెను. నీకె యుపదేశము జేయ సంకల్పించెను. అ తడేల రాలేదని నిన్నుగురించి యడిగెను. నేనబద్ధమాడితిని. నేనాయ న శిష్యుండనే యంటిని. మీవద్దనుపదేశముగమ్మని యాయనయె యిక్కడికి పంపెనంటిని. ఆతఁడు నిన్నుగురించి జాలిపడెను. ఆ యు వదేశము నాకుఁజేసెను. చేసిన రెండుగడియలకు మృతినొందెను. ధన మునకెన్నడు గక్కురితిపడి యెఱుంగను ధనములలోనెల్ల నుత్తమధ నము మోక్షసాధనము నగుటచే విద్యాధనమును సంపాదించుటకై కక్కురితిపడి నిన్ను వంచించి యబద్ధము లాడితిని ఇదేనేను నీయెడ గావించిన ద్రోహము. ఇందుకు నన్ను నీవుమనసార క్షమింపవలయు ఈవిధముగ నిన్ను నేను వంచించినను నీపేరు తెనుఁగుభాష భూమి మీఁద నున్నంతకాలము నిలుచునట్లు శాశ్వతమైనపని జేసెదను. అభి రాముఁడనుపేర వర్తమాన భవిష్యత్కాలయములందలి యాంధ్ర మహాజనులందఱు నీజాతి యాజాతియనకుండ, నీతెగ యాతెగయన కుండ స్త్రీలు పురుషులు. బాలురు వృద్ధులు స్మరించునట్లుజేసెదనుఁ ఏమి చేసెదనో నీవే చూచెదవుగాక! ఖేదపడకుము. ఆగ్రహింపకుము నపింపకుము నన్నునీశిష్యుఁడుగఁ బరిగ్రహింపుము. దాసునితప్పు దం డముతోఁ జెల్లుననుమాట సార్థకము జేయుము." అని వేమనపలుకుట యు నభిరాముఁడామాటలువిని తెల్లబోయి కొండొకసేపు మాటాడఁ జాలక యెట్టకేలకిట్లనియె.

"అయ్యా! మీవలన నేరములేదు. నాదురదృష్టముచేత నట్లు జరిగినది. మీరదృష్టవంతు లగుటచే మహాత్ముఁడైనయామోగి చరమావస్థలో బ్రహ్మవిద్యను మీకుపదేశించినాఁడు. వేయిజన్మములెత్తియైన నార్జింపలేని బ్రహ్మవిద్యాధనము మీకవలీలగా లభించినది. ఎవరికే కాలమున నేదిప్రాప్తమో తెలియదు. నాకావిద్య ప్రాప్తము లేదనియు మీ కేప్రాప్తమున్నదనియు నామనంబున కిప్పుడు పొడగట్టినది. అందుచేత మీపై నా కాగ్రహములేదు." అని యభిరాముడు పలుకుటయు వేమన సాదరాయత్తమనస్కుఁడై యిట్లనియె. "నీవు యోగ్యుఁడవు పరమశాంతుండవు గావున నావలననేరములేదనుచున్నావు. నేను నీయెడ నిశ్చయముగ ద్రోహము జేసితిని. దీనికి నేనొక మహాప్రాయశ్చిత్తము విధించుకొంటిని. అదియేదనిన లోకంబునకు జ్ఞానోపదేశము జేయుటకై కొన్ని నీతిపద్యంబుల నేను చేయఁదలంచితిని. అందు నాపేరు నీపేరు శాశ్వతముగ నుండునట్లు చేసెద' నని చెప్పి "విశ్వదాభిరామ వినురవేమ" యని చివరపాదము వచ్చునట్లు కొన్నివేలపద్యముల రచియించెను. ఇవి యాటవెలఁది వృత్తములు. ఈకవిత్వము ద్రాక్షాపాక మనిచెప్పుట కేవిధమైన సందియము లేదు. పదలాలిత్యము భావగౌరవము లోకానుభవము నీతిసంపత్తి యీపద్యములందు విశేషముగఁగలదు. ఇవి జనసామాన్యమునకెల్ల సుబోధకములగును ఈకవిత్వమందు కాఠిన్యమన్న మాటయే లేదు. ఉపమానములు గూడ నెంతోమనోహరములై సమయోచితములై యుండును. ఇవి మూడువేలు కలవని కొందఱు, నాలుగువేలు కలవని కొందఱు, పంచెూంఙువేలుకలవనికొందఱు వచియించుచున్నారు. ఇప్పుడురమారమి రెండువేలపద్యములవఱకు నచ్చుపడినవి. వేమనపేరు పెట్టికొందఱు కల్లబొల్లిపద్యంబులఁ గొన్ని కల్పించి యవి శతకంబులోఁ జేర్చినట్లుకనఁబడుచున్నది. ఏలయన నట్టి పద్యములలో వేమన

కవిత్వములో నుండునట్టి మాధుర్యము శబ్దసౌష్టవము మొదలగు సులక్షణములు గానఁబడవు. "విశ్వదాభిరామ వినురవేమ" యను మకుటముతోఁ గొన్ని వెఱ్ఱి మొఱ్ఱి పద్యములు గూడ గలవు. అట్టివి ప్రక్షిప్తము లని మాయభిప్రాయము. భారతమునందు భాగవతమునందు మఱియు ననేకము లగుసద్గ్రంథములయందు గంభీరశైలితోఁ జెప్పంబడిన నీతివాక్యములు వేమన పద్యములలోఁ దేటతెనుఁగు మాటలతోఁ జెప్పంబడినవి. ఆంధ్రదేశములో వేమన కవిత్వ మాబాలగోపాలము పఠనయోగ్యమైయున్న దనుట యతిశయోక్తిగాదు. చదువుకొన్న వారిలోను చదువుకోని వారిలోను వేమనశతకములోని యొకటి రెండు పద్యములైన రాని వా రుండరు. విద్యాగంధము లేనిస్త్రీలు సైతము వేమనపద్యములలోఁగొన్నిటిని జదువఁగలరు. వేలకొలఁది పద్యము లున్నను నీగ్రంథమునకు వేమనశతక మనియే పేరు వచ్చినది. మహారాష్ట్రదేశమునందు తుకారాము మొదలగు పరమభక్తులు భగవద్విషయమున మనోహరము లైన యా యభంగములను గీతములు రచియించినట్లె వేమన తెనుఁగు దేశమున నీతివిషయమున నిరువది ముప్పది శతకంబులు గలమహాగ్రంథమును రచియించి యాంధ్రదేశమునకు మహోపకారము చేసినాఁడు. జనసామాన్యమునకు ధర్మోపదేశము జేయవలయునన్న నింతకంటె సులభశైలిలోనున్న పుస్తకము దొరకదు. వేమన మహానుభావుఁడని తెనుఁగువారి నమ్మకము. బ్రహ్మజ్ఞానసంపన్నుఁ డగుటచేత నాతనికి జనసామాన్య మాచరించు కర్మకాండలయందు విశ్వాసము లేదని యాతని గూర్చి దేశమునం దెల్లెడలఁ జెప్పుకొనఁబడు పుక్కిటిపురాణములం బట్టి మన మూహింపవచ్చును ఈ విషయమై యొక చిన్నకథ గలదు. వేమనతల్లి కాశీయాత్ర చేయఁ దలఁచి వేమననుగూడ రావలసినదని యడిగెనఁట! గంగా

స్నానమునందును విశ్వేశ్వరవిగ్రహదర్శనమునందును వేమనకు విశ్వాసము లేనందున కాశీయాత్రకు రానని చెప్పి మీఁదుమిక్కిలి యామెను నిరుత్సాహపఱచెను. అతని బోధలు వినక తల్లి కాశీ యాత్ర బయలుదేరెను. ఒక రాగిడబ్బునకు దారముగట్టి వేమనతల్లి చేతి కాడబ్బు గట్టి కాశీ గయా ప్రయాగాది క్షేత్రములలో స్నానము చేయునప్పు డాడబ్బు విప్పి పారవేయవలదనియు మరల దానిని తెచ్చి తనకు చూపవలసిన దనియుఁ దల్లితోఁ జెప్పెను. అట్లే యని తల్లి కాశీయాత్రకరిగి గంగానదిలో నెల్లఘట్టములయందు స్నానము జేసి పిమ్మట గయయందును, ప్రయాగ కరిగి త్రివేణీసంగమమందును స్నానమాడి యనేక పుణ్యక్షేత్రములు సేవించిమరల నింటికివచ్చెను. ఆమె వచ్చినతరువాత వేమన యామెనుచూచి నాడబ్బు జాగ్రత్తగాఁ దెచ్చితివా యని యడిగెను. ఇదిగో దెచ్చితినని తల్లి డబ్బు చేతికిచ్చెను. "అయ్యో! ఇది బంగారపునాణె మగు నని నే ననుకొంటిని. కాలేదే" యని వేమన బదులుచెప్పెను. "నాయనా! రాగి బంగార మెట్లగు" నని తల్లి ప్రత్యుత్తరమిచ్చెను. పాపాత్ములు పుణ్యాత్ము లైనట్లె గంగాస్నానమువల్ల విశ్వేశ్వరదర్శనమువల్ల రాగి బంగార మగునని నే దలంచితి" నని వేమన వెండియుం బదులుచెప్పెను. ఆమాటలువిని యందఱు నవ్వి యాతని భావము గ్రహించిరి. యాత్రవల్లను మహానదీస్నానములవల్లను నపవిత్రులు పవిత్రులు గారని యాతని యభిప్రాయము. ఆత్మశుద్ధి యున్న పక్షమున నిల్లు కదలక పోయినను మోక్షము గలదనియు నాత్మశుద్ధి లేనప్పుడు కాశికిఁ బోయినను గంగలో మునిఁగినను ముక్తి రాదనియు నాతని మాటలవలనఁ దేలుచున్నది. గంగలో నెన్నిస్నానములు చేయించినను రాగిడబ్బు బంగారునాణెము కానట్లె యపవిత్రుఁ డెన్నిస్నానములు చేసినను పవిత్రుఁడు కానేఁడని వేమన యభిప్రాయము.

ఈయోగియొద్ద నుపదేశ మగుటచేతనో లేక గ్రంథపఠనము వలననో నెట్లో వేమనకు నిజమైన బ్రహ్మజ్ఞానము గలిగిన దని యీతని విషయమై లోకమున జెప్పుకొనఁబడుచున్న కథలం బట్టియు నాతని పద్యములం బట్టియు మన మూహించుకొనవచ్చును. తన మాటప్రకారము ప్రతిపద్యాంతమునం దభిరాముఁడను పేరు వచ్చునట్లు కవిత్వము జెప్పి యభిరాముని పేరు తెనుఁగుదేశమున్నంతకాలము తెనుఁగుభాష యున్నంతకాలము సుస్థిరము గావించెను.

---

# తుకారాము.

జనసామాన్యము స్వధర్మముల మరచి, స్వగౌరవముల విడచి నీతిదూరులై స్వలాభాపేక్షయే పరమధర్మమని నమ్మి సంచరించు కాలమునఁ బ్రతిదేశమందును మహనీయులుద్భవించి తమ సచ్చారిత్రమువలనను, దివ్యజ్ఞానమువలనను ప్రజానురాగమును సంపాదించి ప్రజలలో నీతిని నెలకొల్పుచుందురు. వీరిపుట్టుకయే రాఁబోవు జాత్యున్నతిని వెల్లడించును. వీరి సద్ధర్మచారిత్రమే ముందుసంతతులవారి సత్ప్రవర్తనకు పునాది యగుచుండును. వీరి నీతిసంపదయే జాత్యంధతను పారదోలి దివ్యజ్ఞానమును దేశమంతట ప్రసరింపఁజేయును. మన దేశమున మహారాష్ట్రులు కొంతకాలము కట్టుదిట్టముగ రాజ్యమును స్థాపించి జయప్రదముగ పరిపాలన జేసిరి. వారట్టి యున్నతస్థితికి వచ్చుటకు కొన్నిశతాబ్దములకు ముందు వారిదేశమున నీతికోవిదులు కవిశిఖామణులు, భక్తాగ్రేసరులు మున్నగు వారనేకు లుద్భవించిరి. వారిలో నీతికోవిదులగువారు ప్రజల సన్మార్గవర్తనులుగఁజేసిరి. కవిశిఖామణులు తమయున్నతోద్దేశములఁ బ్రకటించి ప్రకృతిధర్మముల నెల్లఁబట్టబయలుచేసి జనసామాన్యమునకు జ్ఞానాభివృద్ధి నొసంగిరి.

భక్తాగ్రేసరు లమూల్యమగు తమ వైరాగ్యముచేతను, దైవచింతన చేతను ప్రజల గౌరవమును వడసి తమ కీర్తి నాచంద్ర తారార్క ముండునటుల జేసిరి. ఆకాలమున బయలుదేరిన భక్తాగ్రేసరులలో తుకారామను నతఁడు దేశమంతట ప్రఖ్యాతిగాంచెను. ఆతని దయా రసము, ఆతని సత్యసంధత, ఆతని నిర్మలహృదయము నెఱుంగని వారును ఎఱిఁగి యాతని మన్నింపని వారును ఆకాలమున లేరని చెప్పవచ్చును. తుకారాముచేసిన కీర్తనలు, తత్వములు నీరోజులలో సైతము భక్తితో ప్రజలు పాడుచుందురు. ఆకీర్తనలకే యభంగ ములని పేరు. ఆయభంగములలోని నీతివచనములు మహారాష్ట్ర దేశమున సామాన్యముగ ప్రతిగృహమందును సామెతలక్రింద వాడు చుందురు. ఆదేశమందు ధనికులనక దరిద్రులనక గొప్పజాతి వారనక కొద్దిజాతివారనక ప్రతివారును తుకారాముపేరు జెప్పిన నతిగౌరవ ముగ మన్నింతురు. ప్రతి సంవత్సర మచ్చట తుకారాము యుత్సవ మని యొక యుత్సవము జరుగును. ఆయుత్సవము తుకారాము జన్మ స్థానమగు "దేహు" గ్రామమున బయలుదేరి దివ్యజ్ఞానమునకు నిల యమని చెప్పఁదగిన పంధరపురమునకు పోవుచుండును. ఆతని యుత్స వమును జూచుటకు జనులు వేనవేలుగ వచ్చుటను బట్టియే ఆతని యందు వారికెంత గౌరవముగలదో తెలసికొనవచ్చును.

పూనాపట్టణ సమీపమున "దేహు"యను గ్రామముకలదు. ఆగ్రామమున వల్లభుఁడను శూద్రుఁడొకఁడు చిన్నవర్తకము జేయు చు కాపురముండెను. ఆతనికి దైవభక్తి యపారము. పంధరపుర మందున్న 'విఠోబా' దేవుఁడతని కిలువేల్పు. ఆదైవమందలి యమిత భక్తిచేతను అభిమానముచేతను నతఁడచ్చటకు సుమారు 25 పర్యా యములు యాత్రచేసి విఠోబాదేవుని సందర్శించెను. అతని ప్రాణ మునకు పంధరపురమును మించిన పుణ్యక్షేత్రములేదు. వల్లభుని

భార్యపేరు కనకాబాయి. ఆమెకూడ దైవభక్తియందు భర్తకు తీసి పోవునదికాదు. వారు ధవంతులు గాకున్నను గుణవంతులు తృప్తి వంతులు సౌఖ్యవంతులు నై హాయిగఁ గాపురము జేయుచుండిరి. వారికి సేవుజి, తుకారాము, కనుహోబా యనిముువ్వురు కుమారులు. తలిదండ్రుల మార్గమె పుత్రులనువర్తించుట ప్రాపంచకధర్మమగు టచే నాముువ్వురు బాల్యమునుండియు భగవద్భక్తి, సత్ప్రవర్తనము, సదాచారము, గలవారై మనుచుండిరి. వారిలో నగ్రజుఁడగు సెవుజీ మొదటనుండియు మతవ్యవహారములందును నాచారవ్యవహారములం దును పట్టుదలగలవాఁడై హిందూదేశ పుణ్యక్షేత్రములనెల్ల సంద ర్శించు వేడుకతోనుండెను. ఆతనికి మతము దైవము తప్పరెండవ పనిలేదు. అందుచే నతఁడు పనిపాటలు జేసి కుటుంబమును పోషించుట కర్హుఁడు కాజాలఁడయ్యెను. రెండవవాడగు తుకా రాము ప్రపంచజ్ఞానము దూరదృష్టియుఁ గలవాఁడగుటచే భక్తి శ్రద్ధలయందన్నగారికిఁ దీసిపోక వీలగునపుడు దండ్రికి వ్యా పారమున దోడుపడుచుండెను. ముగ్గురుపుత్రులకుతండ్రి చిన్నవయసు నందె వివాహము జేసెను. తుకారాముభార్యకు ఉబ్బసముండుటచే న తని తండ్రి పూనాపట్టణమందలి యొకగొప్పవర్తకుని పుత్రికనాతనికి రెండవవివాహము జేసెను. బాల్యమున తుకారాము సుగుణవంతుఁడు బుద్ధిమంతుఁడు దయాదాక్షిణ్యములుగలవాఁడని పేరువడసెను. చిన్న తనమంద తనికి నాటపాటలయం దాసక్తి యధికమగుటచే పెద్దవాఁడు చేసిన యభంగములందలి యుపమానములు గొన్ని మనవారు పాడు తత్వములందువలెనే ద్వంద్వార్థమిచ్చుచు నొకయర్థము చిన్ననాటి యాటల సూచించుచుండ వేఱొకయర్థము దివ్యజ్ఞానమును బోధించు చుండును. 13సంవత్సరము.లవయసప్పుడె తుకారాము కొట్టును కనిపెట్టు కొనియుండి తండ్రికి సాయమగువాఁడు. ఇతనిమంచితనమునుబట్టియు

మాటనమ్మకమునఁబట్టియు ననేకు లీతనికొట్టుకువచ్చి వస్తువులనుగొను చుండెడివారు. ఈయంశమును గ్రహించి తండ్రి తనకుటుంబమున కీతని మూలమున నైశ్వర్యముగలుగునని మనమందుత్సాహము నొందెడు వాడు. వల్లభుఁడు పాపమాకాలమున దైవేచ్ఛవేఱొకతీరుననున్నదని తెలిసికొనఁజాలఁడయ్యెను. బంగారము మేలిమియగుట కెన్నిపరియాయములొ అగ్నిలో పొరలవలసియుండును. అట్లే తుకారాముగూడ జ్ఞానియగుటకుముందు సంసారదవానలమునఁబడి యెన్నెన్నికష్టముల నో యనుభవించి దరిద్రమున పొగలాడవలసియుండెను. ఇతనికి 17సం వత్సరములు వయస్సువచ్చునప్పటికే తల్లితండ్రులు గతించిరి. పిమ్మట కొన్నిదినములలో నన్నగారగు సేవుజీభార్య చనిపోయెను. భార్యా వియోగమున విరాగియై సంసారమందసూయతగలిగి సేవుజీగృహము ను బంధువులవిడనాడి తానుతలపెట్టిన యాత్రల సేవింపఁబోయెను. ఇ ట్లు పుణ్యక్షేత్రముల సేవింపఁబోయిన సేవుజీ మరలగృహమునకు రాక యేపుణ్యక్షేత్రమందో ప్రాణముల విడువ నిశ్చయించుకొనిపోయెను. అందుచేత బాల్యమందె కుటుంబభారమంతయు తుకారాము తలపైఁ బడెను. అతఁడును శక్తివంచనలేకుండ కుటుంబధర్మముల నిర్వర్తింపఁ జూచెను. సద్వర్తనగలవాఁడగుటచే కుటుంబమువారికెంత ప్రేమగల దో పైవారికిఁగూడ నతనియం దంతే ప్రేమగలదు. అతనికొట్టువద్ద వస్తువులు కొనువారికిగూడ నతనియం దాదరముగలదు. కానిదినము లెల్లపు డొక్కతీరుననుండవు. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి అత ని మంచితనము నాధారముచేసికొని యనేకు లతనివద్ద రొక్కమిచ్చి కొనుటకుమారుగ నరువులఁబెట్టి యెంతకును సొమ్మునియ్యక యతని నివేధించిరి.

ఇంటిలో పొట్టగడచుట కష్టమయ్యెను. ఎల్లపు డరువులనిచ్చి వ్యాపారముసాగించుట దుర్ఘటమయ్యెను. రాబడి తగ్గినతోడనే కుటుం

బమున పోరధికమయ్యెను. అతనివద్ద సరువుగొన్నవారిలోఁ గొండఱు బాకీతీర్చఁదలఁచినను మన దేశమందిపుడు తాండవమాడుచున్న కఱవు పిశాచము మూలమున నొకదమ్మిడియైన తీర్పఁజాలరైరి. తుకారాము ను బాకీదారులు పీడింపఁదొడఁగిరి. సంసారమన నేమొ తుకారామపు డు బాగుగ గ్రహించెను. అతనికి ధనసంపన్నులగు బంధువులుగలరు. అతఁడు గోరినయెడల వారుతప్పక సహాయముచేయువారెకాని తుకా రాము స్వగౌరవముమాత్రము అతనినెన్నడు నొరులచేయిజాచి యడుగ నిచ్చినదికాదు. ఒకరిసహాయమునుగోరనొల్లక నతఁడు ఎన్నికష్టములు వచ్చినను దరిద్రమునే యనుభవింప నిశ్చయించుకొనెను. ముందు దా రేమియుఁ దోఁచక నతఁడు భార్యను పుట్టినింటికనిపి కర్తవ్యమాలో చింపఁదొడఁగెను. ఇంతలో నతఁడు పూనఁదలఁచిన వైరాగ్యదశకు కాలమాతనిఁ ద్వరపెట్టుచున్నదోయనునటు లాకస్మికముగ నాతనిభా ర్యయు, శాంతుఁడను పుత్రుఁడును ఆఁకలిబాధ కోర్వఁజాలక, కృశించి తుకారాము కన్నులయెదుటనే ప్రాణముల విడిచిరి. అతనిమంచితనము గాని, వివేకముగాని, ప్రేమాతిశయముగాని వారిని మృత్యుముఖము నుండి రక్షింపఁజాలవయ్యెను. దుర్భరమగు వీరిమరణముతో నాతని దురవస్థ సంపూర్ణమైనది. ప్రపంచముపైనాతనికిరోఁతబుట్టెను. ఐహిక సౌఖ్యములు క్షణభంగురములని యతఁడెఱింగెను. అంతవఱకు పడిన కష్టపరంపరలెల్ల కంటికిగట్టినట్లగపడి హేయమగుజీవితముపై నతని కసూ యత గలిగించెను. ప్రపంచమెల్ల నంధకారబంధురమై గనిపించిన యా తనిబుద్ధికి తెరువేదియుగానరాక పరిపరివిధముల నతఁడు బాధపడు చుండెను. ఆసమయమున బాల్యమందె మనమందంకురించి నానాట నభివృద్ధిగాంచుచు తనయందు నిబిడీకృతమైయున్న దైవభక్తి, దివ్య జ్ఞానము నతనికి తోడయ్యెను. అందుచేత దుఃఖమున గుందియు మతి చెడక తుకారాము మిగిలిన తనజీవితమునంతయు దైవమునకు ధార

వోసి రేయింబగళ్ళతని సేవజేయనిశ్చయించుకొనెను. కర్మసిద్ధాంతము పునర్జన్మసిద్ధాంతముపై నతనికి నమ్మకముహెచ్చెను. మహానుభావుల పాదములుబట్టిన దివ్యజ్ఞానమార్గమేర్పడుననియు, వారికృపవలననే ముముక్షుసాధనమేర్పడుననియు, దృఢమైన విశ్వాసము మనమున బాదుకొనెను. మనమందీచింత యధికమైనతోడనే యతఁడుగృహమునకరిగి ప్రపంచసుఖములు, ధనధాన్యసంపదలు మిథ్యయనియు నిరర్థకములనియుఁ దలంచి వానినెల్లవిడనాడ నిశ్చయించెను. తనయాస్తినంతయు రెండు భాగములుచేసి యొకభాగము తమ్ముఁడగు కనుహాోబాకొసంగి రెండవభాగమును ధర్మముచేసి తనవంతుకువచ్చిన పత్రములనుచించి నదిలోఁబారవైచెను. ఇటులాస్తినంతయు విడనాడినతోడనే యతనిహృదయము చల్లబడి నిజమైన విశ్రాంతిగలిగెను. తుకారాము భక్తిమార్గమే మోక్షసాధనమని మదినెంచి యేరికిని పురాకృతకర్మ ఫలంబనుభవింపక తీరదని దలంచి దైవేచ్ఛయెట్లున్న నట్లగునను నమ్మకముతో తనజీవితమును భగవదర్పితముజేసి ప్రపంచసౌఖ్యమునెల్ల మరచియుండెను. తుకారాము యభంగములందలి కొన్నిటి యభిప్రాయమిది. (1) ఉదరపోషణార్థము పరితపించకుము, సంచితార్థమునుబట్టి యెంతలభించనగునో యంతయు తప్పక లభించితీరును. మనదృష్టినంతయు నాపరమేశ్వరునియందె నిలిపియుండుట ధర్మము. అటనికంటె తక్కువపదార్థము నొందఁగోరి శ్రమపడుట నిరర్థకప్రయాసము. (2) చనిపోవునపుడు మనతో వచ్చునదొక్కటియులేదు. అందుచేత నీజీవుఁడు వ్యర్థముగ కాలముగడుపరాదు. జననమరణములఁ దరించుటకు మనశక్తిచాలదు. మన మీప్రపంచమున నిజముగ బీదవారమే కావచ్చును. అయిన నొకపర్యాయము జ్ఞానమనునోడనెక్కఁ జాలితిమా యది యే మనల జన్మపరంపరల నొక్కమారుగ దాటించఁగలదు. అట్టి తరి మనమేల నీభుజశక్తిని నమ్ముకొని యీఁదులాడి, యలసటనొంది శ్రమ

జెందవలెను! భగవత్సాన్నిధ్యము నొందఁజేయుకార్యములఁ జేయుట
యే పరమధర్మము (లే) ప్రారబ్ధముచేతనే ధనములభించుచున్నది. ప్రా
రబ్ధముచేతనే కీర్తివ్యాపించుచున్నది. వ్యర్థముగనేల ప్రయాసనొందెద
వు. ఓమనసా! పంఢరపురనాధుని గొలువుము. ప్రారబ్ధవశమున నే సౌ
ఖ్యము గలుగుచున్నది. ప్రారబ్ధవశముచేతనే దుఃఖమనుభవించుచున్న
ది. తుకారాము విచారింపఁబనిలేదు. ఈపైయర్థమిచ్చు యభంగము
లనేకములుగలవు. తుకారామెల్లపుడు దైవమునే మదినుంచెడివాఁడు.
భక్తాగ్రేసరులందఱివలెనే యతనికిఁగొన్ని మనోవికారములుగలవు.
పరమేశ్వరసేవయే యతని మూలధనము. అతని దినచర్యనుజూడఁగోరి
తిమా యెడలేని భగవదారాధనతప్ప వేఱొండుగానరాదు. ప్రాతః
కాలము గాకపూర్వమె నిద్రలేచి సమీపమందలి పర్వతప్రాంతముల
కరిగి నిర్జనప్రదేశముఁ బ్రవేశించి యచ్చట నుదయమంతయు ధ్యానే
శ్వర, ముక్తాబాయి, నామదేవ, జానాబాయి మున్నగు మహనీయ
కృతములగు ధ్యానసంకీర్తనలఁ బఠించుచు మనస్సు పరమేశ్వరునియం
దు లీనముజేసికొని, యాడుచు నాడుచు, విఠోబావిఠోబాయని మైమర
చి స్మరించుచు నానందమహాసముద్రమున నోలలాడుచుండును సా
యంకాలమగువర కీర్తిని గడపి పిమ్మట భోజనమునకుఁ బోవును. ఏ
స్నేహితుఁడైన పిలిచి యన్నముబెట్టినతినును. భోజనమునకై యతఁడు
ప్రయత్నముజేసెడివాఁడుగాఁడు ఎవరైనకుటుంబమునకంతకు వారము
దినములకుఁ జాలిన యన్నసదుపాయము జేసినయెడల నతఁడు దాని
నంతయు వారికండ్లముందరనె బీదలకుఁ బంచిపెట్టును. తుకారామిట్లు
చరించుచుండ నతని ద్వితీయభార్య దరిద్రముతో నింటగుందు చుం
డెను. ఆమె మిగుల పౌరుషము గలది. తండ్రి సాయమునుగూడ
పొందనొల్లదు. భర్తయేమితెచ్చిన దానిలో తనభాగమును గొను
చుండును. కాని దరిద్రమధికమైన కొలఁది యామె శాంతముతగ్గ

నారంభించెను. అంతటనుండియు తుకారామునకు వెఱ్ఱియో, మతిభ్రమయో, ప్రవేశించెననితలంచి యామె విధివిరామములేక అతనిని, అతనిదైవమగు విఠోబాను, అతనిభక్తులను తిట్టసాగెను.

తుకారాము తనభార్యయొక్క పరుషవాక్యములుగూడ గొన్ని పాటలరూపమున వెల్లడించెను. రెండుపాటలందలి యర్థమును తుకారాము ప్రత్యుత్తరమును వినోదార్థ మీాదిగువనుదహరింతుము. "ఇతఁడు నాపాలిటి శత్రువుగాని, చెలిమిటిగాఁడు. నాపాపకర్మముచే నేల్నాటిశనియే యిట్లవతరించియుండును. ఈనిర్భాగ్యపుబ్రతుకెంత కాల మనుభవింతును? పరులయొద్దకుఁ బోయి యెంతకాలము భిక్షాటనకై విలపింతును? ఈదిక్కుమాలిన విఠోబాదేవుఁ డెక్కడ దాపురించెను. నాదౌర్భాగ్యపుకొంపకు వీఁడెప్పుడేమి యుపకారముచేసెను' భార్య యిట్లువిలపించునపుడు తుకారాము "ఈభార్యకు పిచ్చి. దీనికేదో మూర్ఛరోగము. ఇదియొకమారు నిట్టూర్పులుపుచ్చుచుండును వేఱొకమాఱు వెఱ్ఱియరపుల నరచుచుండును. మరియొకమారు మందహాసముచేయుచుండును" అని యనుచుండెడివాఁడు. తుకారాము భార్య పుత్రునిజూచి మరియొకసారిట్లనియె. "దరిద్రగొట్టా! నీకిపుడేమితిండి తెచ్చిపెట్టను? నీతండ్రికి దేవుఁడుపిచ్చిపట్టినది. అతనికి నీటమునుఁగుటతోను, తులసితావళముల ధరించి తిరుగుటతోను సరిపోవుచున్నది. పనియంత కట్టిపెట్టినాఁడు. కొట్టుమొగముచూచుటయే లేదు. తనకడుపుదారి మాత్రము దాను చూచుకొనును. మనమంచిచెడ్డలతనికక్కఱలేదు. కరతాళములతో నరచుచు వీధులబయలు దేరును. దేవాలయమున జేరి తనదేవునిముందుబడి పాటలు పాడుటతో నతని పని సరి. మనగతి యేమికాను? ఎప్పుడుజూచిన నడవులఁబడి యతఁడు తిరుగుచుండును. అతనికి కొంపయక్కర లేదు." ఇట్లు విలపించుభార్యను జూచి తుకారామిట్లనువాఁడు. ఓసీ! ఇంకను కొంచె మోపికపట్టుము.

రావలసినదంతయు ముందేయున్నది.

మంచియుద్దేశము గలదైనను దరిద్రవశమున తుకారాము భార్య కఠినచిత్తురాలు గావలసివచ్చెను. దరిద్ర మధికమైనకొలంది తుకారాముగృహమున పోరధికమయ్యెను. ఆమె యెన్నివిధముల నిందించినను గణనసేయక తుకారాము మితిమీరినయోపిక జూప నారంభించెను. పామరులగు ప్రజలతని బరిహసించుచుండువారు. అట్టి వారియెడ తుకారా మెన్నడు క్రోధముజూపి యెఱుఁగఁడు. అసమా నమగు నాతని శాంతమే యాయజ్ఞానుల నోరడంచెను. ఆతనియోరి మి, శాంతము దెలుపు పుక్కటికథ లనేకములుగలవు. మహారాష్ట్ర దేశమున బిడ్డలాకథల నెంతో యాప్యాయముగ వినుచుందురు. ఆచ మత్కారకథలఁ గొన్నిఁటి నిచట దెలుపుట యప్రశస్తముగానందున నీదిగువ వ్రాయఁబడుచున్నవి.

తుకారాము ధ్యానసమయములందును, భజన సంకీర్తనకాల మందును నతనియందు భక్తివిశ్వాసములుగల శిష్యవర్గ మతనిదరిజేరి సేవించుచుండువారు. ఇట్లు సేవించువారిలో నాప్రాంతమందలి గ్రా మనివాసియగు నొకబాలుఁ డెల్లపుడు తుకారామును గనిపెట్టుకొని యుండువాఁడు. ఆచిన్నవానిభార్యకు తనభర్త తుకారాము సహవా సమున చెడిపోవుచు న్నట్లభిప్రాయము గలిగెను. ఈయభిప్రాయము బలపడినకొలంది నామెకు తుకారాముపై నసూయతహెచ్చెను. ఇ ట్లుండ నొకదినమున నాబాలునిగృహము ముందట తుకారాము జన వలసివచ్చెను. ఆతనిజూచినతోడనే దీర్ఘక్రోధానలముచే పరితపించు చున్న యాచిన్నది తనకసి దీర్చుకొనుటకును క్రోధము చల్లార్చుకొ నుటకును నదియే యదనని తలంచి, దిగ్గునలేచి సలసల మరుగుచున్న యుష్ణోదకము నొక పాత్రతోఁ దెచ్చి పాప మాతనివెన్నుపైఁబోసె ను తుకారా మెంతటి మహనీయుఁడో చూడుఁడు! ఆయుష్ణోదకముచే

వెన్నంత తెగమాడిన నిది యేమియని యతఁడడుగలేదుసరికదా, వెనుకకు తిరిగియైనజూడక నాబాధనంతయు నోరిమితో భరించుచు తనదారినితలవంచుకొని పోయెను. ఆమహనీయుని యపారమగు శాంతముఁ జూచినతోడనే యాచిన్నది యద్భుతముచే నెఱగంది సిగ్గున తలవంచుకొనెను. అంతటనుండియు నామె కాతనిపైఁగల యసూయత మబ్బువిడినట్లు విడిపోయెను. భర్తవలెనే యామెయు నతనిని మహానుభావునిగఁ దలంచుచుండెను. ఇతనిగూర్చిమరియొకకథకలదు. మంబాజీబావాజి యను సన్యాసి యొకఁడుగలఁడు. తుకారాముకీర్తి నానాట వ్యాపించుటఁజూచియు, ప్రజలతనిం బ్రహ్మజ్ఞుఁడని చెప్పుకొనుటఁజూచియు నీర్ష్యచే భరింపఁజాలక నాబావాజి యెట్లయిన తుకారాముపై క్రోధముతీర్చుకొనఁదలఁచి యతని కపకారముచేయుట కెన్నిప్రయత్నములోచేసెను. ఒకదినమున తుకారాము దేవాలయముచుట్టు బాగుచేయుచుండగా నాదుర్మార్గుఁ డచ్చటకుఁబోయి నిర్హేతుకముగ తుకారామును బట్టుకొని తనచేతనున్న ముండ్లకఱ్ఱతో కసితీరునట్లుమోదెను. పాపమాతుకారాము వెన్నెల్ల చీరుకొనిపోయెను. రక్తము గాయములనుండి జొటజొట గారనారంభించెను. ముండ్లవలనగలిగిన వేదన యపారముగ నుండెను. శూద్రసంభూతుఁడగు నీయోగి దుష్టుని కెగ్గుసేయక, మదినించుకైన నాతనికిఁ గీడుదలంపక నతిశాంతమును బూని యోరిమితో నాబాధనెల్ల భరించుచు తన విఠోబాదైవమును వినువారలకుసైతము మనసుకరగునట్లు పాటలతోఁ గొలువనారంభించెను.

భళీ! భళీ! విఠోబా! నీవు మంచిపని జేసితివి. నాయోర్మి నెఱుంగుటకే నన్ను ముండ్లకఱ్ఱతో బాధించితివి. ఎన్నెన్నో తిట్లు దిట్టించితివి. నన్నవమానము పాలగునట్లు చేసితివి." తుకారాము మరియు నిట్లనుకొనెను. క్రోధమునకుఁ లోనై చెడకుండ రక్షించితి

వి. ఆ! అందినదందినది. ఓదైవమా! అందవలసినదేదో యందినది. నాసంచితార్థ మెట్లుండెనో యట్లే జరిగినది. నేను చెప్పుకొనవలసిన దేమున్నది? ముండ్లకంపలతో నిండియున్న మార్గములను మంచితనము చేత బాగుచేయఁబోతిని. ఆపనియైనతోడనే నన్నుందుండి యీవిధ ముగ తొలంగించితివి."

తనకుజరగిన పరాభవమునకు తగిలిన దెబ్బలకు నోరెత్తిమా టాడక దైవమునే గొలుచుచున్న తుకారామును జూచినతోడనే మంబాజీకాశ్చర్యమయ్యెను. తుకారాముపై నతనికిఁగలయసూయయు క్రోధముపోయి భయభక్తులుదయించెను. "అపకారమెన్న డూరక పోదు. చేసినవాసినే పాపముకట్టి కుడుపు" నను నార్యోక్తి మంబాజియె డల వ్యర్థముకాలేదనుటకు ఆకాలమున జెప్పుకొను నీక్రిందిసంగతియే నిదర్శనము ఈసంగతియందలి నిజానిజము లెట్లున్నను ప్రజలుమాత్రి మిట్లుచెప్పుకొందురు. ధ్యానావేశముచే మైమరచి బాధలెవ్వియు నెఱుంగక తుకారామున్న కాలమున మంబాజీ శరీరమున నాగాయ ములన్నియు కసిపించినట్లును నాతఁడు మొఱ్ఱోకుయ్యో యని విల పించుకాలమున దయాప్రేరితుఁడై తుకారా మతని యొద్దకుఁబోయి యుచితసంభాషణతో నతని నూరార్చి బాధనంతయుఁ దొలఁగించి నట్లును, నాబావాజి తాఁజేసిన దుర్మార్గమునకు సిగ్గుపడి తుకారా ముయొక్క యౌదార్యమునకు మెచ్చి యాతనిపాదములపైఁ బడి వేడుకొని యంతటనుండియు నాతనిప్రియశిష్యులలో నొకఁడయ్యెన నియుఁ జెప్పుకొందురు.

తుకారాముయొక్క యోరిమి, భక్తియౌదార్యములెట్టివో పైకథలబట్టి గ్రహింపవచ్చును. ఇతని నిగూర్చి యిట్టికథ లనేకములు కలవు. భక్తిమార్గమునఁ బ్రవేశించి యావేశముననున్న కాలమున నొకప్పుడు దైవ మీతనికిఁ బ్రసన్నుఁడై యభంగములను, తత్వము

లను జేయుమని బోధించెనని చెప్పుకొందురు. భక్తిమార్గమున నితనికి మార్గదర్శియగు నామదేవుఁడు, పరాత్పరుఁడగు విఠోబాతోకలసి తుకారామునకు కలలో ప్రత్యక్షమై యికముందు యభంగములఁ జేసి వానితో దైవమును గొలువుమని బోధించెను. అంతవరకు నితరులుచేసిన భగవత్కీర్తనలు పాడుచుండిన తుకారాము వారినెల్లఁ గట్టిపెట్టి స్వయముగఁ జేసిన యభంగములఁబాడ నారంభించెను. ఆతని యభంగములు సామాన్యమైనవి కావు. వానియందు వేదములందు నుపనిషత్తులందుగల నీతివాక్యములనేకములుగలవు. వేదాంతార్థమునిచ్చు నుత్కృష్టధర్మము లందనేకములు గలవు. ఆకాలమున పూర్వాచారపరాయణులు, ఛాందసులు నాతని నీతివాక్యములకు సంతసించుటకుమారుగ నాతని ద్వేషించ మొదలుపెట్టిరి. శూద్రుఁడిట్టి వేదవాక్యములు బోధించుటయె వారి యసూయతకు కారణము. ఆపట్టణమునగల బ్రాహ్మణులందఱుకలిసి యాతనిపై దండెత్తి పలువిధముల నతని నల్లరిపెట్టనారంభించిరి. అచ్చట గొప్పకుటుంబమున బుట్టి పేరు ప్రఖ్యాతులుగల రామేశ్వరభట్టను బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు తుకారాముని నభంగములు చేసినందుకు నిందించి వానినెల్ల నదిలో పారవేయుమని యుత్తరువు చేసెను. సాధుస్వభావముగలవాఁడు, సహజముగ మెత్తనివాఁడునగు తుకారామా బ్రాహ్మణుని మాటల ద్రోసివేయఁ జాలక తనయభంగముల వ్రాతప్రతులనెల్ల చుట్టబెట్టి నిందాప్రియుణి నదిలోఁ బారవైచెను. ఇట్లు జేసి నది మొదలాతని హృదయము మితిలేని సంతాపమునకు నిలయమయ్యెను. విఠోబా దైవము, నాతని ప్రియశిష్యుఁడగు నామదేవుఁడును తుకారాము నభంగములువ్రాసి వానితోఁ దమ్ము గొలువుమని కోరదివ్యజ్ఞాన సంపన్నుఁడు వేదాంగ వేద్యుఁడు, నగ్రివర్ణస్థుఁడునగు బ్రాహ్మణశ్రేష్ఠుఁడే యాకార్యమును నిషేధించి యహంకారముచే నభం

ములనెల్ల నదిపాలు జేసెను. దుఃఖమున మునిఁగియున్న తుకారాము చేయునదేమియులేక నతిదీనముగ వినువారి హృదయములు కరగునట్లు తన దైవమును దలఁచి యిట్లు విలపింపఁదొడఁగెను. "నీసంకల్పము నీవికల్పము నెవ్వరు దెలిసికొనఁజాలరు. నీవు మమ్ము మాయామోహితులుగఁ జేయుదువు. నాసమస్తశక్తులను నీకై వినియోగింపఁ జేసితిని. ఇంతకంటె నే జేయఁజాలినది వేఱొకటి కనఁపించదు. నాప్రార్థనలన్నియు గాలిపాలైనవి. నే జూడ మునుపటిస్థితిలోనే యుంటిని. విచారించి చూడఁగా మనుష్యుఁడు జేయఁజాలిన దొక్కటియుఁ గనుపించదు. నామనస్సు పూర్తిగ నొయ్యబారఁపోయినది" అభంగములు చేయుమని తనకనుజ్ఞ నొసఁగిన విఠోబాచే దైవమును నట్టియనుజ్ఞను దెలుపు నాధారము నేదైన తనకు సమకూర్పుమని తుకారాము విడువక ప్రార్థించెను. పిమ్మట సర్వశక్తుఁడు, సర్వాతీతుఁడు నగు నాపరమేశ్వరుని యభీష్టమును దెలుపు నద్భుత మొకటి కలిగెను. అదియేమన తుకారా మిట్లు అన్నాహారములెఱుఁగక తదేకధ్యానము జేయుచుండ నొకదినమున నాతని వ్రాతప్రతు లించుకయుఁ దడియక నదిపైఁదేలి యొకయొడ్డునకుఁ గొట్టుకొనివచ్చెను. ఆ యభంగముల ప్రతులు నదిపాలైన దాదిగ 13 దినము లుపవాసములు జేసి శుష్కించియున్న నాతని ప్రియశిష్యుఁ డొకఁడు వానికై వెదకి తుదకు నదియొడ్డున వానిఁగాంచి సంతోషమున చేతఁబుచ్చుకొని గురువునొద్దకు వచ్చి పాదములపైఁబడి వినయముతో వానినెల్ల సమర్పించెను. ఈప్రతులనెల్ల నదిపాలుచేసినది మొదలు తుకారాము భోజన మెఱుఁగడు. భగవంతునికృప తొలఁగిపోయిన పిమ్మట బ్రతుకుట నిరర్థకమని యతఁ డూహించుచుండెను. ఆసమయమున తన వ్రాతప్రతు లించుకైన దడువక, నేవిధముననుఁ చెడిపోక మరల నెప్పటిస్థితిలోఁ దనకు లభించినతోడనె తుకారాము సంతోషపరవశుఁ

డమ్యెను. అతని ప్రభువు, అతనిదైవమగు విఠోబా అతనియందలి దయచే ప్రపంచమంతకు తనభక్తుని శక్తిసామర్థ్యములను వెల్లడించెను. అందుచే తుకారాము దాఁ జేయుచున్న పనికి సిగ్గుపడవలసిన పని లేకపోయెను. విఠోబాదైవమే యాతనియందుఁ దనకుఁగల ప్రేమయు, నాతనికిఁ దానియమించిన కార్యము నీవిధముగ నందఱకుఁ దెలిపెను. తుకారాము హృదయము హాయిజెందెను. కాని యాసంతోషము పట్టుమని పదిదినములు నిలువలేదు. తుకారా మితరుల యందు రంధ్రాన్వేషణము చేయక నెల్లపుడు తనయందుగల లోపాలోపముల నెదకికొనుచు వాని దిద్దుకొనుటకు ప్రయత్నించువాఁడు. ఇట్లు చేయుటచేతనే యాతని సంతోషమంతయుఁ బోయి యొకగొప్ప సంతాపము మనసును పీడించెను. "అయ్యో! నాభక్తి విశ్వాసము లెంత నిస్సారమైనవి. నాకు నీయెడగల నమ్మకమెంత బలహీనమైనది. వీనియందలి లోపముచేతనేగదా నీకృపను నమ్మఁజాలకయద్భుతశక్తిని జూపుమని నిన్ను వేధించితి"నని చింతించుచు మరల నతని నిట్లు గొలువ నారంభించెను.

"ఓదయామయుఁడా! నేను గొప్పతప్పు జేసితిని. నీకృపను పరీక్షింపఁ బ్రయత్నించితిని. ప్రజల దుర్భాషలకు విచారించి నీమనసు కలఁత జెందించితిని నిన్నకరిమముగ నాయాసబెట్టితిని. నాకై శ్రమ గలుగఁ జేసితిని. నేనెంత నిర్భాగ్యుఁడను? ఎంతనీచపు జన్మమెత్తితిని? పదిమూఁడు దినములు కనులుమూసికొని కూర్చుండి సమస్తభారము నీపైఁ బడవేసితినిగదా! నామంచిచెడ్డ లన్నియు నీవేయని యెఱిఁగి యుండియు, నాయాఁకలి దప్పులదీర్చు మహనీయుఁడవు నీవేయని తెలిసియు నింతపని జేసితిని. అయ్యో! నిశ్చయముగ నీయపారకృపారసమును గనఁబఱచితివి. నీవాగ్దత్తమును నెరవేర్చి నాయభంగముల ప్రతులనెల్ల గాపాడి మరల నాకొసంగితివి. ప్రజల యసూయతాహేశనల జల్లార్చితివి. వివరైన నాతలను ఖండించినను నరె, దుర్మార్గులు

నన్ను బాధించిననుసరె యికముందెన్నఁడు నీకిట్టిశ్రమ నియ్యను ఈ కలుషవర్తనుఁడు తనపుస్తకముల రక్షించుకొనుటకు నిన్ను నీటి యందు ప్రవేశించునట్లుజేసి ఘోరపాపమునఁ గొడికట్టుకొనెను. నీవంటి మహనీయునకు శ్రమనిచ్చుట తప్పని యోచింపఁజాలనైతినిఁగదా! జర గిపోయిన దానికి వగచిన ప్రయోజనములేదు. ముందు నాప్రవర్తన మెట్లుండునో నీవేచూచి నామంచిచెడ్డల గ్రహింతువుగాక! ఓహరీ! నాతలపై శూలములతో నెవ్వరు బొడువకపోయినను నావెన్నుపైఁ బడి యెవ్వరు గొట్టకపోయినను నిన్ను రప్పించుటకు నేనెంతగోల జేసి తిని? నీయంశలను రెండు విభాగములుచేసి యొకటి నాయొద్దనుండి నన్ను కాపాడునట్లును ఆసమయముననే రెండవది నీటఁ బ్రవేశించి నాకాగితముల రక్షించునట్లును చేసితివిగదా! ఈరెండు ప్రదేశము లందు నాకేకీడు గలుగకుండ నీవెంత చమత్కారముతో కాపాడితివి? కొంచెము నేరము చేసినందుకే యొక్కొకతరి వీరావేశముతో నాగ్ర హముజెంది తలిదండ్రులు బిడ్డల చావఁగొట్టుదురుగదా! నాయెడ నీ వెంతయోర్పు దాల్చితివి. ఓర్పు సహనములు గలిగియుండుట యెం తకష్టము. ఈరెండు నీయందే పరిపూర్ణముగ నుండుననుటకు సంది యములేదు. నీవు నాకై యన్నియు సహించితివి. నీవంటి కృపాసము ద్రుఁడు వేఱొకఁడు లేఁడు. నిన్నెట్లు గొనియాడఁగలుగుదును. ఓద యామయుఁడా నీవు భాషాతీతుఁడవు. నిన్ను స్తుతించుటకు నాకు మాటలే కుదురుటలేదు."

తనలోపమున కిన్నివిధముల పరితపించు విఠోబా దైవమునకు తనయందు ప్రేమగలదోలేదో యని ముందెన్నఁడు సందేహించి యందలి నిజానిజముల గ్రహించుటకు పరీక్షింపఁ జూడరాదని తుకా రామది నిశ్చయించుకొనెను. ఐహిక విషయములకై ముందెన్నఁడు దైవమును ప్రార్థించరాదనియు, నవసరమున్నయపుడు సర్వాంతర్యా

మియంగు నాపరమేశ్వరుఁడే ప్రసన్నుఁడగుచుండునని యు నతఁడు దలంచెను. ఇఁక తుకారామును పలువిధముల నిందించిన రామేశ్వర భట్టును బ్రాహ్మణుని యవస్థజూడుఁడు తుకారాము విషయమున నదీ జలమున ప్రసన్నుఁడై యాతని యభంగముల సంరక్షించిన యాభగ వంతుఁడే యీబ్రాహ్మణుని విషయమున వేఱొకతీరుగ ప్రసన్నుఁడు గావలసివచ్చెను. సర్పరాజగు నాగనాధుని దేవాలయము ముందున్న కోనేరులో రామేశ్వరభట్టు స్నానముచేయుచుండ నాతని శరీరమం తయు భగ్గుభగ్గున మండనారంభించెను. రామేశ్వరభట్టున కెవరో శరీరమును నిప్పుతోఁ గాల్చుచున్నట్లుతోఁచెను. తాపము శమింపఁ జేసికొనుట కతఁడెన్నెనో ప్రయత్నములు జేసెను. కాని యవియన్ని యు నిష్ఫలమయ్యెను. ఇంతలో నతనికి దైవము కలయందు గనఁబడి నీవు ధ్యానేశ్వరుఁడు సిద్ధిజెందిన యలందరపురమునకుపోయి సేవింపు మనిజెప్ప నాతఁడు వెంటనే యాపురమున కరిగెను. గాని యచ్చటికిఁ బోయినను నతనికి శాంతిగలుగలేదు. అచ్చట నున్నసమయమున నిద్రలో నాతనికి ధ్యానేశ్వరుఁడు కనిపించి ఓయీ! నీవు దేహుగ్రా మమునకుఁబోయి తుకారాము పాదములపైఁబడినఁగాని నీ దురవస్థపో నేరదు. నీకుశాంతి గలుగనేరదనెను. పూర్వాచారపరాయణుఁడును, నగ్రవర్ణస్థుఁడునునగు నాబ్రాహ్మణోత్తమునకు శూద్రకులస్థుఁడగు తుకారామును సేవించుమనినతోడనే శరీరమంతయు నిలువున నీర య్యెను. ఇంతకంటె నెక్కుడు యవమానము మరియొకటిలేదు. కాని యతఁడు పడుచున్న బాధచేతను, దైవము కలలో ప్రత్యక్షమై యిచ్చిన సలహాచేతను నదిలోఁ బారవైచిన యభంగముల వ్రాతప్రతు లించుకైన తడియక, చెక్కుచెదరక నెప్పటియట్లు తుకారామునకు లభిం చినవని వినుటచేతను నాబ్రాహ్మణునకు పూర్వపు యహంభావము మనోగర్వము కొంత యడంగి తాను దలంచినట్లు తుకారాముకపట

సన్యాసి గాఁడనియు నాతనియందు మాహాత్మ్యము గలదనియు, భగవంతుఁడతనికి ప్రసన్నుఁడగుట నిశ్చయమనియు నిజముగ నాతని ముందు నిలుచుటకు బ్రాహ్మణ జన్మమెత్తి సమస్తశాస్త్రముల జదువుకొన్నను తన కెంతమాత్ర మర్హత లేదనియుఁ దెలిసికొనెను. అందుచేత గర్వమునెల్ల దిగఁద్రొక్కి, బుద్ధితెచ్చుకొని దైవాజ్ఞ ప్రకార మా బ్రాహ్మణుఁడు తుకారాము నొద్దకు బోయెను. అతఁడు తనయొద్దకు వచ్చినతోడనే తుకారామునకు ధర్మసందేహ మొకటి గలిగెను. ఈబ్రాహ్మణుని రక్షించుటకు నేను తగుదునా లేక దైవమును ప్రార్థించి యాతని నీకార్యము చేయుమని వేడుదునాయని పలువిధముల నతఁడు శంకించ మొదలుపెట్టెను. స్వల్పవిషయములకొరకు దైవమునకు శ్రమగలిగించితినని విచారించుచు నిదివరకే తన దైవమునకు వేయిక్షమార్పణలఁ జెప్పుకొనుచున్న తుకారామునకు మరల నీగొప్పసందేహము మనఃకంటకముగనుండెను. కాని భగవద్విషయములందుగల యభినివేశముచేతను చిరకాలానుభవముచేతను తుకారాము పూర్వముకంటె నెక్కువ జ్ఞానవంతుఁడయ్యెను. ధ్యానేశ్వరస్వామి తనభక్తిశ్రద్ధల పరీక్షించుట కనేక చమత్కారముల గల్పించుచుండెననియతఁడు తలంచెను. తనయభంగములలో నొకదానియందు నీవుసర్వశక్తియుక్తుఁడవు; అసమానుఁడవు. భక్తిమార్గమునందలి మహిమను ప్రపంచమునకు వెల్లడించుటకేగదా బ్రాహ్మణోత్తముని యల్పజ్ఞుఁడనగునన్ను గొలువుమని నియమించితివి" యనియతఁడు వ్రాసెను. తుకారామును సేవించిన తోడనే యతని యనుగ్రహమువలన రామభట్టునకు శరీరతాపమడంగెను. భగ్గుభగ్గుమని మంటలిడుచున్న దేహమంతయు చల్లఁబడెను. మనస్సునకు శాంతిగలిగెను. దేహమునఁబుట్టి పీడింపఁదొడఁగిన క్రొత్తరోగమంతయు నొక్కమారుగఁ గుదిరెను. ఈయద్భుతముతోనతనికి తుకారామునిపై మితిమీరినభక్తి గలిగెను.

పేరిమయందలి వేదాంతార్థమును, తనకొత్తశిష్యుఁడగు రామభట్టున కుపదేశించెను. "మనస్సు నిర్మలమైయున్నవానికి శత్రువులే స్నేహితులగుదురు. అట్టివానిని పులియైన సమీపింపఁజాలదు. విషసర్పము సైతము ముట్టఁజాలదు. నిర్మలహృదయుఁడగు మహాత్ముని శరీరమున ప్రవేశించెడు విషమంతయు నమృతమగును. ఇతరులకు బాధకరములుగ కనుపించు విషయములన్నియు నట్టివానికి సుఖప్రదములుగతోచును. అట్టివానికిఁ గలిగెడు కష్టములన్నియు సౌఖ్యముల క్రింద మారిపోవును. ప్రపంచమునెల్లమ్రింగివేయఁజాలెడు నగ్నిహోత్రజ్వాలలుసైతము సహజమగు తమయాటోపమును గట్టిపెట్టి శాంతస్వభావుఁడు, దైవజ్ఞుఁడు, నగుమహనీయుని ముందు శీఘ్రముగ చల్లారును. అట్టివానిని ప్రపంచమందలి ప్రాణప్రదముగఁ జూతురు. ప్రతివానియందు దైవాంశ ముండుటం జేసి సర్వము నారాయణ మయమని యనుభవము వలన గ్రహింపనగును. ఈయభంగమువలన రామేశ్వరభట్టురోగము కుదిరి యాతనికి జ్ఞానము కలిగెను. అంతటనుండి యతఁడుతుకారాము ప్రియశిష్యులలో నొకఁడయ్యెను.

తుకారాము విషయమై మఱియొక చమత్కారమైనకథగలదు. తుకారాము గ్రామవాసియగు నొకభూస్వామి. తనపొలములో ధాన్యరాసులను తక్కిన యితరపంటలను పశువులు పాడుచేయకుండ నతనిని కావలియుంచెను. ప్రతిదినము తుకారాము పొలమునకుఁబోయి హాయిగ మంచెపై నెక్కి కూర్చుని భగవత్కీర్తనలఁ బాడుకొనుచు భక్తిపారవశ్యమున చిదానందమయుఁడై యుండువాఁడుపొలములోని పంటనెల్ల వేలకొలఁది పశువులుచేరి పాడుచేయుచున్నను నతఁడు వానిబెదిరించియైన నెఱుఁగఁడు. ఇట్లుప్రతిదినము నిర్భీతిగ నాపొలమునఁబడిపశువులెల్ల హాయిగ విందారగించుచుండ నొకదినమున భూస్వామిస్వయముగపొలమునకువచ్చి యందలిస్థితిగతులనెల్లఁ గనిపెట్టి తుకారా

ముయజాగిరి _త్తవలన పంట ధ్వంసమయినదని తలంచి యాతనిపై నా గ్రహముజెంది వెంటనే గ్రామములోనికిఁబోయి గ్రామాధికారులతో నీసంగతినంతయు విన్నవించి తనతగవుదీర్పుమని గోరెను. ఆగ్రామాధికారులు తుకారామును బిలిపించి చీవాట్లుబెట్టి అతనిచే నాభూస్వామికిప్రతిసాలున నాభూమిలోనెంతపంట పండుచున్నదో అంతపంటయు నప్పచెప్పునట్లు కాగితము వ్రాయించియిచ్చిరి. కాని పశులుతినఁగామిగిలిన పంటనెల్ల కుప్పలువేయించినూర్చి ధాన్యమును కొలుచుకొనునప్పటికి నందఱకద్భుతము గలుగునట్లు ఆ సం॥ రపుపంట వెనుకటి సం॥ముల పంటకంటె రెండురెట్లధికముగనుండెను. అంతట గ్రామాధికారులు భూస్వామికి రావలసిన భాగమును పూర్తిగ నిప్పించి మిగిలినదాని తుకారామునకీయ్యగా నతఁడు దానియందు తృణమాత్రమైన ముట్టక విడిచిపెట్టెను. అందుచేత వారు శేషించినభాగమును విక్రయించి యాధనముతో నాగ్రామమందు శిథిలమగుచున్న దేవాలయమును బాగుచేయించిరి. ఇడియంతయు తుకారాము మహిమవలనజరిగినదని ప్రజలుచెప్పుకొందురు. తుకారా మీవిధముగ దైవసంకీర్తనలు పాడుకొనుచు, నితరులకు భక్తిమార్గమును బోధించుచుతనయద్భుతచర్యలచే ప్రజలయందనూనగౌరవముగాంచుచు తనమహిమలచే దేశమంతట ప్రఖ్యాతిగాంచుచు నలుబది యొక్క సం॥ లు జీవించెను. అతఁడు 1580 సం॥న జన్మించెను. 1571 సం॥న దైవాజ్ఞయైనదనియు విఠోబా దైవము తన్నుగొంపోవుననియు, నవసానకాలమాసన్నమగుటచేఁ దానీప్రపంచము విడువక తీరదనియు నతఁడు తనస్నేహితులకును, అనుచరులకును ముందు తెలియపరచెను. ఒకదినము తన్నస్నేహితులను, భక్తులనువెంటఁబెట్టుకొని బయలుదేరి సమీపమందలి నదీతీరమునకుఁబోయి యచ్చట దైవసంకీర్తనలు పాడుచుభక్తిచేమైమఱచి యాడుచు నావేశమున నొడలెఱుఁగక బడిబోవుచుపై

కుంఠమున దన్నైకై యెదురుచూచుచున్న విఠోబా దైవసన్నిధికరుగుచు న్నానని యరచుచు నతఁడు ప్రాణములవిడిచెను. ప్రాణమువిడుచు స మయమున నీక్రింది యర్థమిచ్చు పాటనతఁడు పాడెను.

"శంఖచక్రగదాధరుఁడగు నాహరియదుగో యిటవచ్చుచున్నా డు. గరుడుఁడు తనఱెక్కలనల్లార్చుచు వడిఁబర తెంచుచున్నాఁడు 'భ యపడకు భయపడకు' మని యఱచుచున్నాఁడు. తలపై కిరీటము చెవు లకుండలములు వీని దేదీప్యమానకాంతులు సూర్యకాంతిని దిగద్రొ క్కుచున్నవి. చల్లనివర్షమునిచ్చు నీలమేఘచ్ఛాయను బోలియున్నాఁ డు. ఆతని సౌందర్యము కన్నులకువిందొనర్చుచున్నది. చతుర్భుజము లు గలిగి యున్నాఁడు. కంఠహారము ఇంద్రధనస్సుకాంతుల మీరు కాంతుల వెదజల్లుచున్నది. పట్టుపీతాంబరముల ధరియించుచున్నాఁడు ప్రపంచమందలి పది దిక్కుల ప్రకాసింపఁజేయుచున్నాఁడు. వైకుంఠ మందలి ప్రీతమె బీసవాఁడగు తుకారాముకొఱకు కదలివచ్చుచున్నది. తుకారాముసంతసమున కిపుడు మేరలేదు. మిత్రులారా! నాకుసెల వొసంగుఁడు. నేనుపోయెదను. మీయాశీర్వచనము నొసంగుఁడు. అం దరిని నడిగితినని చెప్పుఁడు. నాకిదివరకేయాలస్యమైనది. పాండురం గఁడు కనిపెట్టుకొనియున్నాఁడు. లక్ష్మిగూడ నారాకకానంపఁచుచు న్నది. తుదకు నేఁటికి విఠోబా సంపూర్ణముగ ప్రసన్నుఁడైనాఁడు. తు కారామిపుడు శరీరముతో నంతర్ధానము నొందఁగలఁడు."

ఇట్లుపాడుచున్నతుకారాముచుట్టు నున్న ప్రజలెల్లనివ్వెఱవడు నట్లు వారికనులముందరనే యొకయద్భుతకాంతికలుగ నాకాంతిమధ్య నతఁడంతర్ధానమునొందెనని చెప్పుకొందురు. అతఁడు తిరిగివచ్చునేమో యని ప్రజలు మూఁడుదినములు కనిపెట్టుకొని యుండిరఁట. నాలుగవ దినమున వారికానదీతీరమున తుకారాము వాయించెడు చిరుతలును నాతనియభంగముల కాగితములును దొరకినవి. వారెల్లరు తుకారా

ముకటాక్షమున నవి. లభించినందుల కానందమొంది వానిందీసికొని యాతని జ్ఞాపకార్థము వానింబదిలపరచ నిశ్చయించుకొని గ్రామము నకుంజని యాతనికై జేయవలసిన విధ్యుక్తకార్యములనెల్లం జేసిరి.

—ooSoo—

# విక్రమార్కుని కథ.

విక్రమార్క మహారాజు ఉజ్జయనీనగరమును బాలించుచు దేశస్థితియెటులున్నదో స్వయముగాం దెలిసికొనుటకై మారువేషము వేసికొని పట్టణములకుం బల్లెలకుం బోవుచుండువాఁడు. అతఁడొకనాఁడు మారువేషముతో నొకయూరుపోయిమార్గాయాసముచేత నొకతోఁటలో జెట్టుక్రింద గూరుచుండెను. ఆసమయమున నాతోఁటలోనికి తోఁటయజమానుని కూతురు నామె చెలికత్తెయువచ్చి తోఁటలో గొంతసేపుతిరిగి అల్లనేరేడిపండ్లు కోసికొని యొకచోటఁ గూర్చుండి తినుచుండిరి. విక్రమార్కుఁడు వారినిజూచి సమీపించి తనకు రెండుపండ్లిమ్మని యడిగెను. తోఁట యజమానుని కూఁతు రామాటలువిని, "అయ్యా! మీకు వేఁడిపండ్లు కావలెనా చల్లనిపండ్లు కావలెనా" యని యడిగెను. ఆపలుకు లత్యద్భుతముగ నుండుటచే విక్రమార్కుఁడాశ్చర్యపడి నాకు వేఁడిపండేయిమ్మని యడిగెను. మహాప్రౌఢయగు నా కన్య సరేయని రెండుపండ్లు నేలఁబడవైచి తీసికొమ్మనెను. విక్రమార్కుఁడా ఫలముల రెంటినిగ్రహించి నేలఁబడుటచేత వాటికి యిసుక యంటినందున నోటితో నూదికొని తిని యాబాలికను జూచి వేఁడిపండిచ్చెదనని చెప్పితివి. కాని యీపండు వేఁడిగాలేదేమి? యనియడిగెను. అందులకాబాలిక యిట్లనియె: పండు వేడిగాలేనిపక్షమున నీవెందుకు ఊదుకొని తింటివి. ఊదుకొని తినుటచేత నిది తప్పక వేడిపండే. అప్ప

లుకులువిని విక్రమార్కుఁడు మునుపటికంటె నెక్కువ యాశ్చర్యము నుబొంది చమత్కారవచనములచేత తన్నెగతాళిచేసిన యాబాలిక యెవ్వరో తెలిసికొని యామె కన్యయైనపక్షమున క్షత్రియవైశ్యశూద్రకన్యలలో నొక్కతెయైనపక్షమున దప్పక వివాహము జేసికొనవలయునని కృతనిశ్చయుఁడై యాబాలికను జూచి "నీవెవ్వరిదానవు? నీకు వివాహమైనదా" యని యడిగెను. అందు కామెచెలికత్తె యిట్లనియె. "తగినవరుఁడు లభించినపక్షమున నీమె యీవఱకె వివాహమాడి యుండును. ఈమె క్షత్రియకన్య. ఉత్తమక్షత్రియుని వివాహమాడవలయునని యీమెకు సంకల్పముగలదు. సాహసవిక్రమార్కుని వివాహమాడవలయునని యీమెచిరకాలమునుండి సంకల్పించినది. ఆడిన నాతనినే వివావాఘాడును. లేనియెడల బ్రహ్మచర్యమునే నడపును." విక్రమార్కమహారాజునే కాని తదితరుని యాకన్య వివాహమాడదని వినినతోడనే మహారాజు సంతోషము మేరమీఱెను. తానేవిక్రమార్కుఁడనని బయలుపుచ్చుటకైఁ యతడించుక ప్రయత్నించెను. కాని మరల కొంచెమాలోచించి యాసమయమున తన్నెఱిఁగించుకొనక పోవుటయే యుత్తమమని తలంచి అట్లయిన విక్రమార్కుని యీమెయేల వివాహమాడలేదని యడిగెను. అందుకా క్షత్రియకన్య చెలికత్తె యిట్లనియె "అయ్యా! యీమెతండ్రి క్షత్రియుడేఁకాని ధనవంతుఁడుకాఁడు. విక్రమార్కుఁడు భూలోకదేవేంద్రుఁడు. అతఁడీమెనెట్లు పాణిగ్రహణము చేసికొనును. చక్కదనమునుబట్టి సౌశీల్యమునుబట్టి విద్యనుబట్టి వినయమునుబట్టి యీమె విక్రమార్కుని యంతఃపురములలో నుండఁదగిన బాలికయగును. కాని ధనమూలమిదం జగత్తన్నమాటనిజము. ధనములేనివారి కెంత చక్కఁదనమున్నను, ఎంతవిద్యయున్నను నిరుపయోగముగదా." అనవుడు విక్రమార్కుఁడు మందహాసముజేసి విక్రమార్కుఁడు గుణమునేకాని ధనమునుపరిధా

ముగఁ జూడఁడు. అయినను నాకు విక్రమార్కునితో నతిమైత్రిగలదు నేనే విక్రమార్కుఁడనని చెప్పఁదగినంత సాన్నిహిత్యము గలదు. ఈమెపేరు నీమెతండ్రిపేరు నాకెఱిఁగించినయెడల నేనీమె వివాహవిషయమునఁ బ్రియత్నించెదనని పలుక నాబాలిక చెలికత్తె "ఈమెపేరు కువలయమాల. తండ్రిపేరు చంద్రదత్తుఁ" డని బదులుచెప్పెను. అప్పలుకులు విని విక్రమార్కుఁడు వారినివీడ్కొనియథేచ్ఛంజనియెను. ఆక్షత్రియకన్యయుఁ జెలికత్తెయునాపురుషునిపలుకులకక్కజమునందుచునాతఁడెవ్వఁడై యుండునాయని తలపోయుచుగృహమునకుఁజనిరి.

అంతఁగొన్ని దినములకు విక్రమార్కునిపురోహితుఁడు చంద్రదత్తుకడకుఁబోయి మీకన్యను మారాజునకిచ్చి వివాహము సేయవలయునని కోరెను. చంద్రదత్తుఁడు పెన్నిధిగన్న పేదచందంబున మహానందభరితుండై దానికి సమ్మతించెను. అంతట విక్రమార్కుఁడు తన ఖడ్గమును బంపి దానికి వివాహముచేయించి తెప్పించుకొనియెను. చంద్రదత్తుఁడు తనస్థితికిఁ దగినట్లు కువలయమాలకు సారెలుచీరెలు పెట్టి చెలికత్తెనిచ్చి యుజ్జయినికిం బంపెను. ఆమె యుజ్జయనికి రాఁగానే విక్రమార్కుఁడామెను తనయంతఃపురములో బ్రవేశపెట్టక యూరుబైట నొకతోఁటలో నున్న మేడలో నామెను బ్రవేశపెట్టి తోఁట చుట్టు భటులను గావలివైచి పరపురుషుల నావరణలోనికైన రానియ్యవలదని కఠినశాసనముఁ జేసెను. చేసి తానొకనాఁడైన నామెను జూచుటకుఁ బోవక ఆమెను తనసన్నిధానమునకు రానియ్యక కావలసిన వస్తువులు మాత్ర మామెకు బంపుచు చిత్రవర్తనము గలిగియుండెను ఆతని ప్రవర్తనము గనిపెట్టి కువలయమాల మిక్కిలివిచారించి దానికింగారణమారయ లేక భర్తయనుగ్రహము బడయుటకై తగినసమయమునకుఉపాయమునువెదకుచుండెను. అట్లుమూడుసంవత్సరములుగడచెను. రాజుభార్యమాటమరచెను. ఆమెనొక్కసారియైనచూచియుండుటచే

తతనయెదుట నామె నిలువఁబడినను ఆమెనానవాలు పట్టుటకైన వీలు లేనంతగ నామెను మఱచిపోయెను. కువలయమాల యెన్నివిధముల తలపోసినను భర్తను సంకర్షించుటకు నామె కుపాయమేతోఁచలేదు. తనవల్ల నేరములేదని చెప్పుకొనుటకుఁగాని, ఉన్నయెడల క్షమింపు మని ప్రార్థించుటకుఁగాని, మగని సందర్శనముంగవలయునుగదా ? దర్శనమే లేనప్పుడామె యేమిచేయఁగలదు? అట్లు కొంతకాలము పం జరముననున్న చిలుకవలె కువలయమాల చెఱసాలలోనున్నట్లు ఆ మే డలోనుండి యొక్కనాఁడు తనచెలిమికత్తెం జేరఁబిలిచి ఓసీ! రాగల తా! రత్నము రాజకిరీటమును జేరక పెట్టెలోనడిగియున్నట్లు నేను మహా రాజు సాంగత్యములేక యీ మారుమూలఁబడియుంటిని. నాజీవనము వ్యర్థమైనది. వనమునగాసిన వెన్నెలయైనది. చక్కఁదనము బూడిద బోసిన పన్నీరైనది. కాఁబట్టి నేనింక వేదాంతగోష్ఠితోఁ గాలము గడుపఁదలంచితిని. అందుచేత యోగినులను దోడ్కొనివచ్చి నాకు యోగవిద్య నుపదేశము చేయింపుము.

అని కువలయమాల వేఁడుకొనగా కూరిమిచెలికత్తెయైన రాగ లత కొంచె మాలోచించి "సరే నీయభీష్టప్రకారము జేసెద" నని యానాఁడు మొదలుకొని నెలదినములుప్రయత్నము జేసి యొకయోగిని దోడ్కొనివచ్చెను. ఈయోగిని పూర్వాశ్రమమందొక బ్రాహ్మణ వితంతువు. బాల్యకాలమునందె భర్తలోకాంతరగతుఁడగుటచే నీమె స త్ప్రవర్తనముచే కాలముబుచ్చి వేదాంతవిద్యాభ్యాసము జేసి తుదకు యోగినియై తనజీవనము సార్థకమగునట్లు బ్రహ్మవిద్య స్త్రీలకునేర్పు చు లోకోపకారపరాయణయై దేహయాత్ర గడపుచుండెను. రాగలత ఆయోగినిం దీసికొనివచ్చినతోడనే కువలయమాల యామెనుగౌరవిం చి శిష్యురాలై యామెవలన వేదాంతశాస్త్రము నుపదేశముపొంది తానుగూడ యోగినికాదలంచి కాషాయవస్త్రములుగట్టుకొని పాన్పు

లమీఁదఁ బండుకొనక తలదువ్వుకొనక వెండ్రుకలు జడలుగ నల్లుకొనునట్లుపేక్షించి వైరాగ్యచింతతో నుండెను. ఉపదేశము చేయవచ్చిన యోగిని ప్రతిదినము కువలయమాలకడకు వచ్చుచుండుటచే నామెతోఁగూడ మఱికొందఱు యోగినులప్పుడప్పుడు వచ్చుచుండిరి. అందుచేత నాతోఁట పుణ్యాశ్రమమువలెను ఆమేడ మఠమువలెను నుండెను.

విక్రమార్కమహారాజు వేఁటాడుటకై యుజ్జయినీనగరప్రాంతములందున్న వనములకరిగెను. ఆవనములలో నతఁడు గుడారములు వేయించుకొని స్వల్పసేనాసమేతుఁడై యుండి, యుదయములందు వేఁటాడుచు నడవులలోనున్న యెఱుకవాండ్రతోను కోయవాండ్రతోను గలిసిమెలసి వినోదముగ బ్రొద్దులు పుచ్చుచుండెను. అట్లుండి యొకనాఁడు అడవిపందినొకదానిని తరుముకొనిపోయి చాలదూరమరిగి దానిని జంపలేక యలసి సమీపముననున్న యొకకోనేటిగట్టునకుఁ బోయి కాలుసేతులు మొగము గడుగుకొని బయటికివచ్చి నలుదెసలు బరికింపగా చెఱువుకావలియొడ్డున నొకమఱ్ఱిచెట్టుక్రింద నలుగురు స్త్రీలాయన కగబడిరి. వారు నలుగురు యోగినులు. అందఱు కాషాయవస్త్రములంగట్టిరి. అందఱు జడలు తాల్చిరి. అందరు రుద్రాక్షమాలలుధరించిరి. కనులపండువు సేయుచున్న యాయాఁడువాండ్ర గుంపును జూచి వారెవ్వరో కనుఁగొనవలయునని విక్రమార్కుఁడు సమీపమునకుఁబోయి నిలిచి చూచునప్పటికి వారిమధ్య దేదీప్యమాన ప్రభలతో పదియాఱునన్నె బంగారు బొమ్మచందంబున నొకస్త్రీ యోగినీ వేషముతో వెలయుచుండెను. విక్రమార్కుఁడామెనుజూచి మోహించి సంసారమును పరిత్యజించి వైరాగ్యములోనున్న పడంతిని వలచినందుకు తన్నుతానె నిందించుకొనుచు మరల మనస్సు నాపలేక ప్రక్కనున్న యోగినులలో నొకతెంబిలిచి యామె యెవ్వరని యడిగెను. అందుకామె యిట్లనియె. "మాపూర్వా

శ్రమముల వృత్తాంతము మమ్మును మీరడుగరాదు. మేము చెప్పరాదు. మీవేషభాషలఁజూడగా మీరుజ్జయినీ మహారాజులవలె నున్నారు. మహారాజులకు యోగినులతోఁ బనులేమి? కావున మాత్ర పోవిఘ్నము సేయక మీరావలకుంజనుఁడు." అనవుడు విక్రమార్కుఁడు విస్మితుఁడై యిట్లనియె. "నిజముగా నేను మీరన్నట్లు విక్రమార్కుఁడనె. మీ వైరాగ్యమును ముఖ్యముగ మీకు గురువగు నాపరమ యోగిని వైరాగ్యమునుజూడగా నాకుఁగూడ వైరాగ్యముపై బుద్ధి పారినది. మీవలె నేనుగూడ నాపరమయోగినికి శిష్యుఁడనై యుండె దను. ఇక్కడనుండి కదలను." అని తనసేవకులను బిలిచి తనగుడార ములా కోనేటియొడ్డున వేయించి, ఆయోగినులకు పాలు పండ్లు మొద లగునవి సమర్పింపుచు వారికిఁ గావలసిన కృత్యములన్నియు బంటు వోలె తానె తీర్చుచు నుండెను. తక్కిన ముగ్గురు యోగినులు యేవేని పనులమీఁదఁ బోయినప్పుడు బంగారుబొమ్మవంటి యాచక్కనియో గినికడకు తానుబోయి యామెకుగావలసిన వస్తువులు తానేయందిం చుచు, నేదేనివంక బెట్టి యామెను బలుకరించుచు, యామె నోటిమా టలు వెడలి చెవినిబడినప్పుడు అమృతముదాగినట్టుల బ్రహ్మానం దభరితుఁడగుచు, ఆమెనుచూడని సమయమున బాధపడుచు, ఆమె కంటికగపడినప్పుడు భూలోకస్వర్గమనుభవింపుచు విచిత్రచేష్టితుఁడై పట్టణమునకుఁ బోవక యచ్చటనే చెరలాడుచుండెను. అటులుండ నొకనాఁడు శిష్యురాండ్రైన ముగ్గురుయోగినులు కోనేటిగట్టుననున్న చెట్లపువ్వులుగోయుటకై యరుగగా నీపరమయోగిని యొక్కర్తె గూర్చుండి యప్పుడే తపముచాలించి యిట్టటుజూచుచుండెను. అంత లో నొకయడవియేనుగు మదించి యొడలెఱుఁగక యాదారిని వచ్చు చుండెను. అదిచూచి యోగిని భయపడి లేచి "సఖులారా! రక్షిం పుఁడు రక్షింపుఁడ"ని కేకలువేసి పరుగెత్తెను. ఆయార్తధ్వనివిని రాజు

పరుగుపరుగున నామెకడకు బోయి హస్తముబట్టుకొని తనగుడారము లోనికిం దీసికొనివచ్చి పీఠముపైం గూర్చుండంబెట్టి భయముదీర్చి విల్లుదాల్చి యొక్కబాణమున నాయేనుంగుం గూలనేసి మరల యోగి నికడకుంబోయి యామె ననేకప్రసంగములలో దింపి యారాజు యెట్ట కేలకు తనమనసుం బట్టంజాలక యిట్లనియె. "ఓసుందరీ! నీచక్కం దనమునకును నీజాణతనమునకును నీయోగినీవృత్తి తగినదికాదు. ఏ నరపుంగవునైన జెట్టబట్టి మహాభోగము లనుభవింపవలసిన యీనిండు జవ్వనము నిట్లువృథా సేయుట నీకు న్యాయముకాదు. కావున నీవు నన్ను వివాహమాడుము. క్షణముకిరిందట నీవేనుంగువలన భయపడి నప్పుడు నాకుడిచేతితో నీకుడిచేయి బట్టుకొంటి నదియే మనపాణి గ్రహణము." అని యింకను నేవియో పలుకంబోవుచుండగా నాయో గిని మహాకోపముతో చివాలున పీఠమునుండిలేచి గోకిలస్వరముతో 'రాజా! అధికారగర్వముచేతను మోహపారవశ్యముచేతను నీశరీరమును నీవెఱుంగకున్నావు. నీచదువులు కాల్పనా! సంసారమసారమని రోసి తపోవృత్తిం గైకొన్న యీండువాండ్రం బాడుచేయందలంచెదవా? మేము నిన్నిప్పుడనుగ్రహించితిమిగాని నీవాడినమాటలకు నిన్నిప్పుడు శపింపవలసినది. అందునా యనకుందునా యని సందేహింపక యెంత మాటవచ్చిన నంతమాటాడుదువా? ఛీ! నీయెట్టయెదుట నుండంగూడ దని విసవిసనడచి తనచెలిమికత్తెలయొద్దకుం బోయెను.

అంతట చెలిమికత్తెలాయోగినినిజూచి "చెలీ? రాజదర్శనలా భంబున కృతార్థురాలవైతివిగాంబోలు నని పరిహసించిరి. యోగిని యామాటలను సైపక మొగము చిటిలించుకొని వారివంక కోరచూ పులంజూచి తనమనోగతమైన కోపమును వెల్లడించెను. అప్పుడామెవద్ద మిక్కిలి చనవుగల యొకప్రియసఖి యామెను దూరముగం దీసికొని పోయి యొక్క పొదరింటం గూర్చుండంబెట్టి మెల్లమెల్లన నిట్లనియె.

"సఖీ! నీగుట్టు నావద్దనేల దాచెదవు. ఈమహారాజును జూచినదిమొదలు నీమనను మనసులోలేదు. నీవు కన్నులుమూసికొని పరమేశ్వరుని ధ్యానింపక యీమనుజేశ్వరుని ధ్యానించుచుంటివని నేదలంచెదను. నీవాలకముసుబట్టి నీచేష్టలనుబట్టి నీకు విక్రమార్కుడే భగవంతుఁడు లాగున గనఁబడుచున్నాఁడని తోఁచెడిని. నీసంకల్పము సంపూర్ణముగ నెరవేరినది. కావున మనసార నాతని వరింపుము." అనవుడు యోగిని తలవంచుకొని యూరకుండి యామాటలకు తనయంగీకార మును సూచించెను. అనంతర మా చెలికత్తె యేదోపనికల్పించుకొని విక్రమార్కుని గుడారమువైపునకు బోగా నతఁడామెనుబిల్చి యిట్లు ప్రార్థించెను. సుందరీ! నామనస్సు మీగురువైయున్న యాయోగిని యందు దగులుకొన్నది. నామనస్సు నేను త్రిప్పఁజాలను. ఆమెయెవ్వరికూఁతురో కన్యయో పరభార్యయో నాకెఱిగింపవలయు. పరభార్యయైనపక్షమున బ్రాణములైనఁ బోఁగొట్టుకొందునుగాని యామెనుస్పృశింపను. కన్యయైనయెడల నామెను బ్రార్థించి తల్లిదండ్రులను బ్రార్థించి యెట్లయిన నీతపము మానిపించి వివాహమాడెదను. ఈవిపత్సాగరమునుండి నన్ను దరిజేర్పఁగల యోడవు నీవు. కావున నన్ననుగ్రహింపుము." అని వేఁడుకొనఁగా నాచెలికత్తె యిట్లనియె. "ఆమెతల్లిదండ్రులపేరు నేను చెప్పను. ఆమె పరునిభార్యగాదు నీవు చేపట్టఁదగిన రాజకన్య. కారణాంతరముచేత వైరాగ్యముబూని యోగాభ్యాసము జేయుచున్నది. ఆమెకును నీయందనురాగము నిల్చినది. బెట్టుసరిమాటలేల? నీవెట్లుంటివో ఆమెయు నట్లేయున్నది. కాని నేను రెండుమూడుమాటలు చెప్పవలసియున్నది. నీవు చేపట్టినతరువాత ఈకన్య మీయుజ్జయనికి రాదు మీకోటలో నడుగుపెట్టదు. మీయంతఃపురము బ్రవేశింపదు' ఆమెతో నీవిక్కడనే నీయిచ్చవచ్చినంతకాలము విహరింపుము. అనంతర మామె తనగృహంబునకుఁ

బోవును. నీయిచ్ఛవచ్చినప్పుడు మరల నీవనప్రదేశమునకె వచ్చుచుండుము. నేను నిరంతరము నీసన్నిధానమునందుండెదను. ఆమె నీకుఁగావలసివచ్చినప్పుడు నీవు నాతోఁజెప్పినయెడల మరల నీయాశ్రమంబునకె దీసికొనివచ్చెదను. ఈప్రతిజ్ఞలు నీవు పరిపాలింతువేని యీ యోగిని నీయిల్లాలగును" అనవుఁడు రాజు పరమానందభరితుఁడై తనమనోరథసిద్ధియైనందుకు కృతార్థుఁడనైతిననుకొని యామెతో "సుందరీ! ధన్యుఁడనైతిని నీవుచెప్పినట్లె మీచెలికత్తె యుండవచ్చును. నాయింటికి రానక్కఱలేదు. నన్నుబరిగ్రహించినంజాలు" నని యెప్పుడామెను గలసికొందునా యని కుతూహలపడుచుండెను. అంతట నాచెలికత్తె యావలకుఁబోయి కువలయమాలను వెంటఁబెట్టుకొని రాజసన్నిధికింబోయి రాజునుద్దేశించి దేవా! ఇదిగో యీపె నిన్నువివాహమాడుచున్నది. గాంధర్వంబున బరిగ్రహింపుము. నేనును భూమియు నాకాశమును నీవివాహమునకు సాక్షులము. నీటముంచినను పాలముంచినను నీదేభారము. నీనిమిత్తమైన తపస్సులు మానుకొని వైరాగ్యమువదలుకొని ప్రపంచవ్యక్తిలో నీమె పడినది. రాజులకు యెదుట నున్నదే పెండ్లికూఁతురు. అందుచేత నీవీమెను కొంతకాలమైన వెనుక వదలివేయుదు వేమోయని భయము కలుగుచున్నది. ఈమె పేరు మాలతి" యని చెప్పి చేతిలోఁ జేయివైచి యప్పగించి మఱి యునిట్లనియె. "రాజా! నీవు కువలయమాలయను కన్యను వివాహమాడిదానిమొగమైన జూడకున్నావని లోకములోఁ బ్రతీతిగలదు. మా సఖగతికూడ నట్లుగాక యుండునా?" అనవుడు రాజిట్లనియె. "సుందరీ కువలయమాల మాటదలపెట్టకుము. కారణాంతరములచేత నేనామె మొగము జూడఁదలంచుకొనలేదు. ఆకారణములిచ్చట వెల్లడింపవలసినవి కావు" అనుచుండ యోగినీవేషముతో నున్న మాలతి తెల్లబోయి రాజువంకఁజూచెను. అప్పుడు రాజామెనుజూచి, తనయవస్థ

గూడ సల్లీవచ్చునని ప్రియురాలు శంకించి భయపడుచున్నదనుకొని యామెవీపుపై జేయి వైచి "సుందరీ! భయంపడకుము. నీయవస్థ కువలయమాలయవస్థవలె యుండదు. దానికిని నీకును నెంతోభేదముగలదు. నిన్ను నేను పట్టపుదేవింజేసెదను. నీయిచ్చవచ్చిన తెఱంగున నిన్ను జేసెదను." అని బుజ్జగించెను. అనంతరము విక్రమార్కుడును రాజకన్యయు నన్యోన్యానురాగముగలిగి యావనమందేయుండి యిచ్చవచ్చిన తెఱంగున విహరించుచు మూడుమాసములకాలము భూలోక స్వర్గమనుభవించిరి.

అట్లుండ నొకనాడుజ్జయనీనగరమునుండి మంత్రికడనుండియొకపురుషుడు వచ్చి విక్రమార్కునకొక జాబునిచ్చెను. రాజుజాబుందీసికొనిచదువుకొని తన ప్రియురాలింజూచి యిట్లనియె. "సుందరీ! మగధరాజు మన దేశముపై దండు వెడలజూచుచున్నాడని మంత్రి నాకిప్పుడే జాబు వ్రాసినాడు. కాన నేనిప్పుడు పోవలయు నీవు వివాహకాలమున జేసిన ప్రతిజ్ఞననుసరించి స్వగృహంబునకుం బొమ్ము. ఈచెలిమికత్తెను నాకడనుండనిమ్ము. నేనప్పుడప్పుడు నా నేమంబు దానిచేత నీకుం దెలియం బంపుచుండెద." అనవుడు మాలతి వియోగమునకు మిగులపరితపించి యెట్టకేల కొడంబడి దేవా! మీపాదుకలును మీముద్దుటుంగరమును నాకుంబ్రసాదింపుడు. మీరు దండయాత్రనుండి మరల దేశమునకు వచ్చువఱకు పాదుకలంబూజించుచు నుంగరము వీక్షింపుచు పొద్దులుపుచ్చెదను. అనవుడు రాజు సరేయని యామెకోరికలప్రకారమావస్తువులనిచ్చి యామెవద్ద సెలవుపుచ్చుకొనిదండయాత్రకుం బోయెను.

అనంతరము విక్రమార్కుడు మగధరాజును జయించి మహావైభవముతో నుజ్జయనీనగరము బ్రవేశించి తనప్రియురాలి చెలికత్తెనుబిలువనంపెను. కాని యాచెలికత్తె యెచ్చటంగానబడదయ్యె. విక్రమార్కునకుంబ్రియురాలిమీదమనసు బారుటచే నామె నెట్లయినం

జూడఁగోరెను. కాని యామెనెఱిఁగినవారెవ్వరును లేకపోయిరి. ఆమె తనజన్మస్థాన మెఱిఁగింపదయ్యె. తల్లిదండ్రులపేర్లు చెప్పదయ్యె. అందుచేత రాజు తనజన్మమువ్యర్థమయ్యెనని చింతాక్రాంత చిత్తుఁడై పిచ్చివానివలె విహరింపఁ జొచ్చెను. అట్లు కొన్నిమాసములు జరగెను. ఎన్నిమాసములు జరగినను బ్రియురాలిజాడ దెలుపువారెవ్వరును లేకపోయిరి.

ఈవిధముగా రాజు పరితాపమునొందుచుండగా నొకనాఁడంతఃపురస్త్రీలలో వృద్ధురాలొకతె యాయనవద్దకు వచ్చి "మహారాజా! ఈవింతవింటివా! నీవు తోఁటలో మేడకట్టి యొంటిగానిలిపిన యాకువలయమాలకు నెలదినముల క్రిందట యొకకుమారుఁడు కలిగెనఁట'యనివిన్నవించెను. ఆమాటలు వినగానే రాజు మహాగ్రహపూరితుఁడై "ఏమేమీ; వివాహమైనతరువాత నేనామె మొగమైనను జూడకపోయినను, ఆమెపుత్రవతియయ్యెగా! ఇంక నీదురాత్మురాలిని నేమిచేసినను బాపములేదు." అని సేవకునొకనింబిలిచి కువలయమాలతండ్రిని తత్క్షణమే తోడుకొనిరమ్మని వర్తమానమంపెను. రాజసందేశమును శిరసావహించి మరునాటికామెతండ్రి యుజ్జయనికివచ్చి రాజదర్శనముచేసెను. అతనింజూచి విక్రమార్కుఁడు కట్టలుకతో నిట్లనియె. నీకూఁతును వివాహముజేసికొని నేను పదుగురిలోఁ దలవంచుకొనవలసినవాఁడనైతిని. పెండ్లియాడిన నాలుగుసంవత్సరములనుండియు నేనామెమొగమైనంజూడకపోయినను, ఆమెకుమారునింగనిసిగ్గులేకయింకను జీవించియున్నది. నీకూఁతురు నీవంశమునకు మచ్చ తెచ్చినది. నావంశమునకు మచ్చ తెచ్చినది. పలుమాటలేల. రాచవంశమునకంత కళంకము దెచ్చినది. ఈదురాత్మురాలియునికి భూమికి భారము. కావున నీయెదుటనే యామెదోషమును నిరూపించి దుష్టజనశిరచ్ఛేదమునందాటితేటిన నాకత్తికామె నెరచేసెదరమ్ము". అని చివా

లున లేచి లోపలికిఁబోయి తనఖడ్గమును దెచ్చెను. ఆతనివాక్యములు వినినతోడనే కువలయమాలతండ్రికి గుండెఝల్లుమనియెను. నోట మాట రాకపోయెను. కూఁతురు ప్రాణముకంటె తనప్రాణముకంటె ప్రతిష్ఠ యెక్కువగ జూచుకొనువాఁడగుటచేత నాతఁడుమిక్కిలి సిగ్గుపడి రాజువెంట బయలుదేరెను. రాజును వాహనములేమియు నెక్కక పాదచారియై యిరువురు సేవకులను మాత్రము వెంటఁబెట్టుకొని మామగారినిదీసికొని యూరుబైటనున్న దోఁటకుం బోయెను. ఎన్నఁడు రాని రాజు లోపలికి వచ్చుచున్నాఁడని కువలయమాల చెలికత్తెలుతొట్రుపడి రాజునకును బరివారమునకును దగిన పీఠములు వేసిరి. ఆపీఠముల మీఁద వారుకూర్చుండగానే లోపలినుండి రాగలతయను పరిచారిక వచ్చి కువలయమాలతండ్రిని విక్రమార్కునిజూచి "అయ్యా! మీకు మనుమఁడు కలిగినాఁడు. అయ్యా! మీకుపుత్రరత్నము జనించినాఁడు". అనినవ్వుచుఁ బలికెను. ఆమాటలు రాజునకు కర్ణకఠోరములై యుండుటచే నాతఁడు వినఁజాలక "దురాత్మురాలా! దూరముగఁబొమ్ము. పేలకుమని దానినదలించి "పుత్రుఁడునాపుత్రుఁడుకాఁడు. మీకువలయమాల పుత్రునింగనెనని చెప్పుము." అనిపలికెను. అనవుడు రాగలత యిట్లనియె. "రాజా ముంజేతికంకణమున కద్దమక్కఱలేదు. జన్మించినబాలకుని మొగము, శుభలక్షణములు జూచినపక్షమున నాతఁడెవ్వరిపుత్రుఁడో తక్షణమే తెలియఁగలదు." అనివిసవిస లోపలికింబోయి యాబాలకునెత్తుకొని యీవలకుఁదెచ్చి వారికింజూపెను. తాతగారు మనుమనింజూచి సరిగా నీతఁడు నిన్నేపోలియున్నాఁడని విక్రమార్కునితోఁ బలికెను. ఆమాటలుసహింపక విక్రమార్కుఁడు బాలకునివంక జూడక, అతఁడు తనపుత్రుఁడన్నమాటనమ్మక మనుష్యుని బోలిన మనుష్యులుండవచ్చునని పలికి మామగారినిజూచి "పుత్రిక ప్రేమచేత నీవీప్రకారము పక్షపాతముచేతఁ బలుకుచుంటివిగాని నీ

మాట నిజమెట్లగును. పాణిగ్రహణకాలమునందప్పనేటి వలకామెస్పృశించి యెఱుఁగనుకదా. నాకామెయందు సంతానమెట్లు కలుగును. ఈబాలకుని తండ్రియెవ్వరో నీకూఁతురెఱుంగును. దైవమెఱుంగును". అనికఠినముగాఁబలికిన మామగారురోషము తెచ్చుకొని లేచి కూఁతురు కడకుబోయి "అమ్మాయీ! రాజునీమీఁద నపవాదములు వేయుచున్నాడు. నీసచ్ఛీలత్వమును నీవుస్థిరపరచుకొమ్ము" అనిపలుకుటయు, కువలయమాలరాజునకు వినఁబడునట్లు కలకంఠకంఠమెత్తి యిట్లనియె. "నాయనా! అగ్నిహోత్రమును చదలుపట్టవు. బంగారమునకు మాలిన్యమంటదు. నీగర్భవాసమున జనించినబిడ్డకు కళంకమెన్నటికి నుండదు ఈబాలకుఁడీ మహారాజుగర్భంబున జనించినవాఁడె. ఈయన నన్నుబరిగ్రహించియు లేనని వాదులాడుచున్నాఁడు. ఇది మగవారలకున్న లక్షణమే" యన రాజాపల్కులాలకించి "ఇది కేవల మసత్యము. కల్పితము." అనిబిగ్గరగా ననెను. "అట్లయిన నానవాలు చూపెదనని కువలయమాల పాదుకలను ఉంగరమును లోపలనుండి తెప్పించి రాగలతచేత రాజువద్దకు బంపెను. రాజవిచూచి యెంతో ఆశ్చర్యపడి యివి నీకెట్లులభించినవి. ఆయోగిని నీకిచ్చినదాయని యడిగెను. అందుకు కువలయమాలలోపలినుండి రాజునకు వినఁబడునట్టు లిట్లనియె. "రాజేంద్రా? జరిగినవృత్తాంతమంతయు వినిపించెద వినుము. మీరు నన్ను వివాహమాడి మరలఁ నామొగముఁజూడక యీమేడలో విడిచి మీరు దూరముగానుండుటచే నాదురవస్థకు నేనపరిమితపరితాపము నొంది యెట్లయిన నాచమత్కారముచేత మిమ్ము నావశముఁజేసికొనవలయునని సంకల్పించి యోగినుల సహవాసముచేసి నేనుగూడఁనొక యోగినీవేషము వేసికొని మీరుతఱుచుగా వేటకువచ్చునడవిలో గూర్చుండి మాయతపములు చేయుచుంటిని. మీరు వేటకువచ్చి నన్నుఁజూచితిరి. అనంతరవృత్తాంతము మీరేస్వయముగ నెఱుఁగు

దురు. అప్పుడు మీరునాకిచ్చిన యానవాళ్ళఁజూపితిని. ఆపలుకులువిని విక్రమార్కుఁడు కంఠధ్వని తనప్రియురాలికంఠధ్వనివలెనే యున్నదని చప్పుచప్పున లోపలికిఁబోయి యామె మొగముంజూచి తనప్రియు రాలామెయని నిశ్చయించుకొని "సుందరీ! నన్నుక్షమియింపుము. నిజస్థితిదెలియక నేను నీయెడ నపవాదములు నాడితిని. మొదటిసారి మనము కలిసికొన్నప్పుడు నీవు నాకు నేరేడుపండిచ్చిన సమయమున నీవుపలికిన పలుకులంబట్టి నీవు నెఱజాణవని తెలిసికొని యిట్లుపేక్ష చేసినచో నీవేమిచేయుదువో చూడవలయునని నీమొగముచూడక నిన్నితోటలోనుంచితిని. నీవు నీనెఱజాణతనమునుజూపి నన్ను వశము చేసికొంటివి. ఇదియే నాకుగావలసినది. అని క్షమియింపుమని మామ గారినిగూడ బ్రార్థించి దారపుత్రసమేతుఁడై తనయంతఃపురమునకు జని కువలయమాలమీదను కుమారునిమీదను, అతిప్రేమగలవాఁడై యుండెను.

---

# నరసింహఅప్పారావు

ఈయన నూజివీడు సంస్థానమును బరిపాలించిన వెలమప్రభువు. రాయనిభాస్కరుని తరువాత తెలుఁగుదేశమందు దాతృత్వమున కీమ హాత్ముఁడే ప్రసిద్ధుఁడు. ఈయనకుగల భూతదయ యసాధారణమని చెప్పుదురు. కొల్లేటిచెఱువుతీరమందు గొప్పదోమలుండుటచేత ఆప్రాం తములందు సంచరించెడి పశువులకపారమైన బాధకలుగుచున్నదని తెలిసికొని దయాళుఁడైన యీరాజు దోమలబాధ కలిగినప్పుడు పశువులు గోకికొనుటకు శరీరము రాచుకొనుటకు వందలకొలఁది స్తం భములక్కడక్కడ నాటింపఁజేసెనని పెద్దలు చెప్పుదురు. "అప్పారా

హోదునియామె నైరాజా, అప్పారాహో బొందిలో కైలాసం" అని బైరాగులు పాడుచుండగా మనము తఱుచు వినుచుందుము. ఈపాట లన్నియు, నీదాతనుగూర్చియే పాడబడుచున్నవి. బైరాగులకు గోసాయీలకు యీనరసింహప్పారావు భూలోకకల్పవృక్షము. ఏసాధువున కేమికోరికగలదో ఆకోరిక, యీప్రభువు దీర్చుచువచ్చెను. ఏబైరాగి కేమిగావలయునో అది యెల్లనీయన యిచ్చుచువచ్చెను. అందుచేత నిరంతర దేశాటనముసేయునట్టి బైరాగులు, యీయనకీర్తివర్ణించుచు వందలకొలదికృతులఁ జెప్పిరి. అవియే కాశీరామేశ్వరమధ్యభూముల యం దిప్పటికిని వ్యాప్తములైయున్నవి. ఈయనయే ద్వారకాతిరుమలి యని పేరుగల చిన్నతిరుపతిదేవాలయము గట్టించెనని చెప్పుదురు. ఈయన మృతినొందినప్పుడీదేవాలయము తలుపులు తమయంతటనవియే తెఱవబడి యుండెనఁట. ఏదో యొకసుగుణమున్నప్పుడటువంటి మహిమలారోపింపఁబడుట మనదేశములో నొకఆశ్చర్యము కాదు. దాతృత్వమునందు కలియుగ దానకర్ణుఁడని కైవారముసేయఁదగిన యీయాంధ్రప్రభువరేణ్యుని గూర్చి జనులొకచిత్రకథఁ జెప్పుకొనుచున్నారు. ఆకథ చమత్కారముగ నుండుటచేఁ జదువరులమనస్సులు రంజింపజేయుటకై యీక్రింద నుదాహరింపఁబడుచున్నది. ఆంధ్రకవిత్వము సరసముగాజెప్పగల నొకయాఱువేలనియోగి బ్రాహ్మణుఁడు పేదతనముచేఁ బీడితుఁడై తన దారిద్ర్యము మూలముట్ట బాపగల భూలోకమందారము నరసింహప్పారాయరూపమున నూజవీటిలో నున్నదని తెలిసికొని యాయననాశ్రయించుటకై యాగ్రామమునకుఁ బోయెను. అప్పారాయని దానవైఖరిఁజూచి కొడుకులును మంత్రులును సంస్థానమందలి భూములన్నిటిని మాన్యములుగను గ్రామములనన్నిటిని అగ్రహారములుగను, ఆప్రభువు బ్రాహ్మణులకిచ్చివేయునని భయపడి దర్శనమైన మాత్రముననే యాచకులకాయన

సమస్తమునిచ్చివేయుస్వభావముగలవారగుటచేతయాచకులకు గనబడ వద్దని బహువిధముల నాయనను బ్రార్థించి యొడంబరచిరి. అందు చేత నీనియోగికవి చిరకాలము కనిపెట్టుకొనియున్నను రాజదర్శన ముకాలేదు. కాకపోయిన నతఁడు పట్టినపట్టు విడువకయెప్పటికైన పట్టినపట్టు కాకపోవునా యని నూజవీటిలోనే యుండెను. అట్లు కొంతకాలముండ నరసింహప్పారావు సవారిలో గూర్చుండి తలుపులు మూసికొని యెక్కడికో బోవుచుండెను. యాచకులు కనబడుదురను భయముచేతనే యాయనతలుపులు మూసికొనెను. సవారితలుపులు మూయబడియుండుటచే నాయన దర్శనము వీరికి వీరిదర్శన మాయ నకు నగుటకు వీలులేదనియు; అట్లు లేనిపక్షమున కార్యము భంగ మగుననియు భయపడి యాకవి ప్రార్థనము చేతనో బలిమిచేతనో యేదో విధమున తలుపులు తీయించి రాజును దర్శించి తీరవలయునని నిర్ణయించుకొని యాపల్లకి సమీపమునకుఁబోయి కంఠమెత్తి యీ క్రింది పద్య పాదము జదివెను. "చ॥ వెలమకులంబులందు నిలువెళ్ళ రు కాంతలనంగవిందు నప్పలుకు లబద్ధమాయె." వెలమస్త్రీలు దేశ ములవెంట తిరుగుచున్నారని యీకవి యపనింద నారోపణ జేసినట్లు రాజునకర్థమయ్యెను. అర్థమైనతోడనే నరసింహప్పారావు, అంతఃపుర స్త్రీల నీవిధముగా దూలనాడినందుకు కోపోద్దీపితుఁడై కవినిబట్టిదం డింపవలయునని కృతనిశ్చయుఁడై పల్లకినాపుమని బోయల కాజ్ఞాపించి ఖడ్గముఁ జేతపట్టుకొని తటాలున తలుపులం దెఱచి పల్లకిలోనుండి దుమికి గవినిజూచి "ఏది యిప్పుడుకూసినకూఁత మరలకూయుమని యడిగెను. అప్పుడుకవి" వెలమ కులంబునందు నిలువెళ్ళరు కాంత ల నంగవిందు నప్పలుకు లబద్ధమాయెకులపాలకధీమణి యప్పరాయ రా ట్కులభమ కీర్తికాంత కృతికాంతమహీజయకాంత ముగ్వురుం గల జగమంతయుందిరుగగాగనుగొంటిని చిత్రమిద్ధజిన్."

అనుపద్యము పూరించి చదివెను. పద్యములో నెలమస్త్రీల నగా పరిభువు మొదటతలంచినట్టు లంతఃపురస్త్రీలు గాక రాజుగారి కీర్తికాంతకృతికాంత జయకాంత నను ముగ్గురు స్త్రీలని తెలిసెను. రాజు మహాసరసుఁడగుటచేతయాపద్యమునందలిసారస్యమును గ్రహిం చి యింతమంచిపద్యమును జెప్పఁదలఁచిన వాఁడవు నాకింతకోపమేల తెప్పించితి వనియడిగెను. కోపముతెప్పించనిపక్షమున దేవరవారి దర్శనమే నాకు కాకపోయియుండునని కవిబదులు చెప్పెను. అప్పుడు రాజు కుడిచేతనున్న ఖడ్గమును బల్లకిలోబెట్టి అనేక కవిపండితులకు దారిద్ర్యవిచ్ఛిన్నముగా ననేకదానములు చేసినయాపరిశస్తహస్తము తో, కవిశరీరమును దట్టి, ఆయనకొక యగ్రహారమునిచ్చెను. కవియు మనోరథము సిద్ధిపొందినందుకు సంతసించి యథేచ్ఛంజనియె.

---

## కళింగగంగు.

గోదావరీమండలమందు దాక్షారామమను పుణ్యక్షేత్రము కలదు. అక్కడనున్న భీమేశ్వరస్వామివారి యనుగ్రహముచేత పూర్వ మొకబ్రాహ్మణవితంతువుకుఁ గొడుకుపుట్టెను. ఆబాలుఁడు క్రమక్రమముగా విద్యలునేర్చి గొప్పకవియయ్యెను. ఆయనపేరు వేములవాడభీమకవి. ఆయనచేసిన గ్రంథములలో నిప్పుడు భీమఛంద స్సుమాత్రమున్నది. రాఘవపాండవీయ మాయన చేసెనని పెద్దలు చెప్పుదురు గాని యది యెక్కడను గానరాదు. ఈయన ముండకొడుకగుటచేత బ్రాహ్మణు లీయనకు వెలివేసిరని యు నీ కవి భీ మే శ్వ రు ని ప్ర సా ద ము న బు ట్టె ను. గావున నాదేవుఁడీయన కద్భుతశక్తుల నిచ్చెననియు నామహిమలచేత

నీతఁడు శతృవులగెలిచి గొప్పవాఁ డయ్యెననియుఁ జెప్పుదురు. ఈత నికిఁగలవాక్శుద్ధిఁ జెప్పనలవిగాదని యందురు. ఒకసారి నోటిమాట చేత విస్తళ్లలోని యన్నము సున్నముగాను అప్పములు కప్పలుగాను, యీాయసమార్చెనఁట. ఈకవి పరితిరాజు నద్దకుఁబోయి తాను భీమే శ్వరుని కుమారుఁడనని చెప్పుకొని కవిత్వముచెప్పి గౌరవములందుచు వచ్చెను.

పూర్వము కళింగదేశమున సజ్జనగరమని యొకపట్టణముండెను అది యిప్పుడెక్కడ నున్నదో చెప్పఁజాలము. దానిని రాయకళింగ గంగుఁడను రాజు పాలించుచుండెను. ఒకనాఁడా నృపాలుని జూడఁ గోరి భీమకవి యచ్చటికిఁబోయి రాజునకు వర్తమాన మంపఁగాఁ దనకు పనిసందడి యెక్కువగానుండుటచేత దర్శనమిచ్చుటకువీలులే దని కళింగగంగు వర్తమాన మంపెను. భీమకవి ముంగోపియు తిక్క కవి యగుటచేత తనవంటివానికి రాజు దర్శనమీయకపోనాయని కో పించి "పాపము యీాసందడి యంతయుఁ గొద్దికాలములోనే తగ్గిపోవు ను గాక" యని రాజునుశపించెను. ఆశాపము తగిలిన కొంతకాలము నకే లంచగొండులైన మంత్రుల ద్రోహముచేతను సేనాపతులకుట్రల చేతను తన యజాగ్రత్తచేతను కళింగగంగు శతృవులచేత నోడిపోయి భార్యను బిడ్డలను దన యత్తవారింటికిఁ బంపి వెంటవచ్చుటకు పరి వారములేక, ఎక్కుటకేనుఁగులు గుఱ్ఱములులేక పాదచారియై పారి ణములఁ దక్కించుకొని యెక్కడికో పారిపోయెను. శతృరాజు సజ్జ నగరము నాక్రమించుకొని హాయిగాఁ బరిపాలించుచుండెను. రాయ కళింగగంగు కుడువ కూడు కట్ట గుడ్డ కాఁపురముండుట కిల్లు లేక త నపేరు బహిరంగముగా జెప్పుకొన్నచో శతృరాజు తన్ను వెదకించి పట్టి చంపునేమోయన్న భయమున మారుపేరు పెట్టుకొని యీాసనవా లు తెలియకుండ మారువేషము వేసికొని సత్రములలో భోజనము

మఠములో నిద్రిసేయుచు బిచ్చమెత్తుకొని జీవనముఁ జేయుచుండెను శత్రురాజు వానికొఱకు వెదకించి యెందునుగానక యతఁడెక్కడో చచ్చిపోయి యుండుసని నమ్మి సుఖముగా గుండెమీఁదఁజెయివైచి కొని నిద్రిపోవఁజొచ్చెను. ఇట్లుండ నొకనాఁడు కళింగగంగురాత్రివే ళ నొకయూరిలో నేసత్రిములోనికో భోజనమునకు.బోవుచుండగా నప్పుడప్పుడె వర్షముకురిసియున్నందున కాలుజారి యొకగోతిలోఁ బ డెను. పడి "హా దైవమా అంతరాజ్యమేలినవానికి గాలిదివిటియైన లేక పోయెనుగదా" యని గట్టిగా బలికి మెల్లగాగోతిలోనుండి యీవలకు వచ్చెను. అప్పుడాదారి నొక మనుష్యుఁడుపోవుచు "అయ్యా; నీ వె వఁడ వని యడిగెను. "నేను వేములవాఁడ భీమకవిచేసిన జోగి" సని యతఁడు జవాబు చెప్పెను. అప్పుడా మనుష్యుఁడు "నీవు రాయకళిం గగంగువా" యని యడిగెను. అవునని యాతఁడు బదులు చెప్పగానే యామనుష్యుఁడు "నేనేవేములవాడ భీమకవిని. నాశాపము దగిలి నీకింత కష్టము గలిగినదా. నిన్ను నేను క్షమించితిని. ముందునెల పు న్నమవెళ్ళిన షష్ఠినాఁటికి నీకు రాజ్యము రాఁగలదు నీకు భయము లేదు. వెళ్ళు మని యాశీర్వాదము చేసి శాపము త్రిప్పి యాతనిఁ బంపివేసెను.

అనంతరము రాయకళింగగంగు సైనికులు గుఱ్ఱములుసహాయ ముచేసెడు రాజును ధనము మహాయుధములు లేక వట్టిచేతులతో నున్న తనకు జయము గలుగుట యసాధ్యమనియు భీమకవి తన దుఃఖోపశమనమును జేయుటకు రాజ్యమువచ్చునని దీవించెననియు మన స్సులో ననుకొని యెప్పటియట్లు యొకయూరినుండి యొకయూ రికి దిరుగుచుండెను. అట్లు తిరుగుచు మరుసటి నెల పున్నమి నాటికి సజ్జనగరమునకు సమీపమందున్న యొక గ్రామమునకుఁ బో యెను. ఆయూరిలోనున్న నాటకులు కొందఱు, ఒకచెట్టుక్రిందఁ గూ

ర్చుండి "ఏహావ్వా! రాజువేసగాఁడు దొరకినపక్షమున మన యదృష్ట
ము పండిపోవును గదరా" యని తమలోఁదాము చెప్పుకొనుచుండిరి.
ఆపలుకులు విని కళింగగంగు రాజువేసగాఁ డెందుకని వారినడిగెను.
అందుకు మేళనాయకుఁ డిట్లనియె. "అయ్యా! ప్రస్తుతము సజ్జనగర
ము నేలుచున్న రాజుగారు పూర్వమాయనచేత నోడిపోయి కళింగ
గంగును గురించి యొక నాటకము చేయించెను. అందులో కళింగగం
గు పొందిన పరాభవములు పరాజయములు, యీరాజుగారికి గలిగిన
విజయములు చక్కఁగాఁ వర్ణింపఁబడి యున్నవి. ఆనాటక మాడుమని
మాకిచ్చెను. చక్కఁగా నాడినపక్షమున వెయ్యినూటపదారు రూపా
యల నిచ్చెదనని చెప్పెను. మాకు రాజవేసగాఁడుకుదరలేదు. కాళ్ళ
ముందుకు వచ్చినసొమ్ము నిష్కారణము పోవుచున్నదని మేము విచా
రించుచున్నాము. ఆపలుకులువిని కళింగగంగు, "నాకు సంగీతము
వచ్చును. రాజవేషము నేను వేసెదను. నాకు సరదాదీర్చుకొనుటయే
గాని సొమ్మక్కరలేదు. సొమ్మమీరేపుచ్చుకొనుఁ"డని రాజవేసము
న కేర్పడిన దరువులుకీర్తనలు పద్యములు వచనములు వారివద్దవుచ్చు
కొని కంఠపాఠముజేసి మరునాటికే యప్పగించెను. పంచమినాఁడు స
జ్జనగర మహారాజుగారు కీర్తనచేయింపఁదలఁచిరి. నాటకులు సొమ్మ
కర్చక్కరలేకుండఁ జక్కనివాఁడు, సంగీతమునేర్చినవాఁడు, తెలివిగల
వాఁడు రాజవేసమునకుఁ గుదిరినందుకు మిక్కిలిసంతసించి నాటకము
సిద్ధముచేసిరి. పంచమినాఁడు రాజుగారికోటలో, పందిళ్ళువేయించి
రాత్రి కాగానే కాగడాలువేయించి నాటకము మొదలుపెట్టించి తానొక
పెద్దసింహాసనము వేయించుకొని వెండిపిడి విసనకఱ్ఱలతో స్త్రీలచేవిస
రించుకొనుచు కర్పూరతాంబూలము నమలుచు మిక్కిలి సంతోషము
తో నాటకము చిత్తగింపఁ జొచ్చెను. అదివరకేనాటకులు రాజవేసగా
నికోసము రాజుగారెక్కెడి గుఱ్ఱము రాజుగారు పట్టుకొను కత్తియు

నడిగి పుచ్చుకొనిరి. ఆగుఱ్ఱమెక్కి, ఆకత్తిఁ జేతఁబట్టుకొనగానే జనులంతయు జూచి విస్మయ మొంది నిజముగా కళింగగంగు వచ్చినాడని కొందరును, కళింగగంగు నాఁడే చచ్చిపోయి నాఁడు. నాటసులే వేషము వేసినప్పుడా వేషము కచ్చముగ సరి పడియుండురని కొందఱును జెప్పుకొనసాగిరి. శత్రురాజుకూడ వానిని జూచి "యిదివేషమా? కళింగగంగు విగ్రహమా? యని తలపోసి మె ట్టకేలకు వేషమేయని నిశ్చయించుకొనెను. అంతట కళింగగంగు కొం తసేపు కలాపము వినిపించి యుద్ధపు కథపట్టువచ్చినప్పుడు తీవ్రమైన పౌరుషముఁజూపి యొక్కసారి గుభాలున గుఱ్ఱముమీఁదనుండి దుమికి హాయిగా నాటకము చిత్తగించుచున్న శత్రురాజుమీఁదఁ బడి కత్తి తో వానిపుచ్చె కొబ్బరిపుచ్చెవలె నూడఁగొట్టి వానిని క్రిందికిలాగి యాసింహాసనము మీఁద తానెక్కికూర్చుండెను. రాజభటులు నిశ్చే ష్టులై యేమియుఁ జేయలేకపోయిరి. అంతలో పురజను లాయన నాస వాలుపట్టి తమమహారాజేయని గ్రహించి వానికి సాయముచేసిరి. శత్రురాజసైనికులు ధైర్యము తెచ్చుకొని కళింగగంగుమీఁద పడ జొచ్చిరి. కాని ప్రజలీయనపక్షమై వారినవతలకుఁ దోలిరి. మరునాఁడు అనగా షష్టినాఁడు నజ్జనగరమునమరల పట్టాభిషేకమయ్యెను

---

# ఖడ్గతిక్కన

ఈతఁడు తెనుఁగుభారతమునువిరాటపర్వము మొదలుకొని చివరవరకు రచియించిన తిక్కన సోమయాజికి పెదతండ్రి కుమారుఁ డు ఖడ్గతిక్కనయొక్క తండ్రియైన సిద్ధయమంత్రియు, తిక్కనసోమ యాజి తండ్రియైన కొమ్మనమంత్రియు సోదరులు. ఇద్దఱిపేరు తిక్క

నయే యగుటచేతను, ఆనవాలు నిమిత్తము, కవిత్వము చెప్పు తిక్కనను కవి తిక్కనయనియు, సేనాపతియై ఖడ్గముపుచ్చుకొని యుద్ధము చేయునట్టి తిక్కనను ఖడ్గతిక్కన యనియు జనులువాడుకొనఁజొచ్చిరి. ఈయిద్దఱు తిక్కనలుఁగూడ నెల్లూరిరాజయిన సిద్ధిరాజు కొలువులో నుండిరి ఒకఁడు మహాకవియై నిర్వచనోత్తర రామాయణమును మహాభారతమును దెనిఁగించి, నిర్వచనోత్తర రామాయణము నొకరాజున కంకితముజేసి కవిబ్రహ్మయను బిరుదంది జగత్ప్రఖ్యాతిఁ గాంచెను రెండవయతఁడు వేదము, ధనుర్వేదముగూడ నభ్యసించి గంటము కత్తికూడ పట్టనేర్చి "ఇదంబ్రాహ్మ్య మిదంక్షాత్రి" మను మాటల నిజముచేసి బ్రహ్మజ్ఞానము, శౌర్యము జతపరచి పరశురామునివలె శత్రుసంహారముజేసి రాజభక్తిగలిగిమహాప్రసిద్ధికెక్కెను. కవితిక్కనయని రెండవపేరుగల తిక్కనసోమయాజి సిద్ధిరాజు కొలువులో నాస్థానకవీశ్వరుఁడై యుండుటయేగాక యాతనికి ప్రధానమంత్రియై వ్యవహారముల నడపుచుండెను. అట్లుండ సిద్ధిరాజుయొక్క జ్ఞాతులగు, అక్కన్నబయ్యన్నలు నెల్లూరిమీఁద దండెత్తివచ్చి సిద్ధిరాజును బారఁద్రోలి రాజ్యమాక్రమించుకొనిరి. అప్పుడు తిక్కనసోమయాజి తన శిష్యులను వెంటఁబెట్టుకొని యందలమెక్కి ఆకాలమునందు ఓరుగల్లు పట్టణమేలుచున్న గణపతిదేవు మహారాజువద్దకుఁ బోయి ఆయనచేతగౌరవింపఁబడి తనభారత మాయనకు వినిపించి, ఆయనను సంతోషపెట్టి, ఆయన కేమికావలయునో కోరుమనఁగా తన ప్రభువైన సిద్ధిరాజునకు వచ్చిన కష్టములు చెప్పి సిద్ధిరాజును సింహాసనమెక్కింపుమని ప్రార్థించెను. గణపతిదేవుఁ డాయనమాట త్రోసివేయలేక గొప్పసైన్యమును దీసికొని నెల్లూరుపోయి, అక్కన్నబయ్యన్నల నోడించి సిద్ధిరాజును సింహాసనమెక్కించెను. అనంతరము సిద్ధిరాజు కొంతకాలము సుఖముగా రాజ్యమేలుచుండ నతనికి పల్నాటిప్రభునగు కా

టమరాజునకును కలహము సంభవించెను. ఆకలహ మంతకంతకు పెరిగి వారికి వీరికి గొప్పయుద్ధము లయ్యెను. ఆయుద్ధములలో ఖడ్గతిక్కన సిద్ధిరాజు పక్షమున సేనానాయకుఁడై ఘోరమైన యుద్ధము చేసెను. సిద్ధిరాజు బంట్లుకూడ ప్రాణముల కాశపడక పోరిరి. కాని దైవసహాయము లేకపోవుటచే సిద్ధిరాజు పరాజయము నొందెను. అప్పుడు చేయునది యేమియులేక ఖడ్గతిక్కన శత్రువులబారిపడి చచ్చుటకంటె బ్రతికియుండి మఱికొంత సైన్యమును గూర్చుకొని మఱియొకసారి శత్రురాజులమీఁదఁబడి గెలువవచ్చునని తలంచి యుద్ధభూమివిడిచి యింటికి పారివచ్చెను. ఖడ్గతిక్కనయొక్క భార్యయు, తల్లియు, మిక్కిలి యభిమానము గలవారు. అప్రతిష్ఠకంటె మరణమే మేలని తలంచువారు. అందుచేత ఖడ్గతిక్కన యుద్ధమునుండి పారివచ్చుట వారికి బొత్తిగా నిష్టములేకపోయెను. ఖడ్గతిక్కన యింటికివచ్చినతోడనే భార్యగాని తల్లిగాని వాని నాదరింపలేదు. అయ్యో! గాయములు తగిలినవా! శరీరము నొచ్చినదా! యని వగవలేదు. ప్రాణము దక్కించుకొంటివి మంచిపని జేసితివని మెచ్చుకొనలేదు. తరువాత మధ్యాహ్న మాయన స్నానమునకు లేచినప్పుడు భార్యయొక నులకమంచ మడ్డు పెట్టి రెండుబిందెలనీళ్ళు, పసపుముద్ద మంచముప్రక్కఁబెట్టి స్నానము జేయుఁడని భర్తతోఁ జెప్పెను. ఆయన స్నానముఁ జేయు స్థలమునకుఁ బోయి "యీనులకమంచ మేలయడ్డుబెట్టితివి. ఈపసపుముద్ద యెందు" కని భార్యనడిగెను. అప్పుడుభార్య "శత్రువులకు జడిసి యుద్ధములోనుండి పరుగెత్తివచ్చుటచేత మీరుకూడ, ఆఁడువారిలో జేరినారు గావున, ఆఁడవాళ్ళకుఁ బెట్టినట్లె మీకుఁగూడ మగవాళ్ళుకనఁబడకుండ నులకమంచ మడ్డుపెట్టి మొగమునకు రాచుకొనుటకు పసపుముద్ద నిచ్చితిని. మన యింటిలో మీయమ్మగారు మీరు నేను గలసి ముగ్గురాఁడువాళ్ళ మున్నా" మని బదులుచెప్పెను. ఈయంశమునే యొకకవి యీక్రింది పద్యముగాఁ జెప్పెను.

క. పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెల్లన్
ముగురాడవార మైతిమి
వగపేటికి జలక మాడవచ్చిన వేళన్.

భార్య యాపరిహాసము చల్లనిమాటలతో తనకు బుద్ధి చెప్పుటచేత ఖడ్గతిక్కన సిగ్గుపడి యెట్టెటో స్నానముచేసి లోపలికి పోయి భోజనముచేసెను. తల్లి చిట్టచివర విరిగిపోయిన పాలు కుమారునకు వడ్డించెను. కుమారుఁడు "అమ్మా! పాలు విరిగిపోయినవే" మని తల్లి నడుగ నామెయిట్లనియె. నాయనా! శత్రురాజులను గెలువలేక పిరికివాఁడవై కత్తి క్రిందబారవైచి నడుమువిరిగి నీవువచ్చితివి. అందుచే తపశువులు విరిగిపోయినవి. పాలు విరిగిపోయినవి. ఈక్రిందిపద్య మీ సందర్భముననే చెప్పఁబడినది.

క. అసదృశముగ నరివీరుల
బసమీరఁగ గెలువలేక పందక్రియన్నీ
వసివైచి విరిగి వచ్చిన
పశులున్ విరిగినవి వాని పాలు న్విరిగెన్.

భర్తయని గౌరవములేక భార్యయు, కడుపు తీపిమైనలేక తల్లియుఁ దన్నాడిన యెత్తిపొడుపు మాటలు యుద్ధములలో శత్రువులు వేసిన బాణములకంటె నెక్కువ వాడిమిగలిగి చుఱ్ఱుచుఱ్ఱున మనస్సును నొప్పించుటచే ఖడ్గతిక్కన క్షణమాత్రమైన గృహమందు నిలువలేక భోజనాంతరమున కవచము దొడిగికొని గుఱ్ఱ మెక్కి రణరంగమునకుఁ బోయి ఘోరముగా యుద్ధముచేసెను. జయాపజయములు దైవికములు గావున నతనిలోపము లేకపోయినను యుద్ధములలో నతఁడు పరాజయము నొందెను. కాని యీసారి వెనుకటియట్లతఁడింటికిఁ బారిపోక యెన్నోగాయములు తగిలిన శరీరముతో రాజభ

_త్తిపూరితమైన మనస్సుతో నిర్భరమైన హృదయముతో యుద్ధభూమియందు నిలిచి కత్తిపట్టుటకు ఓపిక యున్నంతవఱకు వారికి లొంగక కాలధర్మమునొందెను. ఈయననే రణతిక్కనయని గూడనందురు. ఆహాహా! తల్లి యనగా ఖడ్గతిక్కననుగన్నతల్లియే తల్లి; భార్య యనఁగ నాయన భార్యయే భార్య. ఎందుచేత నందురేమో చూడుడు. ఖడ్గతిక్కనసమస్తము దెలిసినవాఁడైనను వేళావిశేషముచేతప్రాణభీతినొంది రాజభక్తిమరచి దేశాభిమానముమరచి యుద్ధమును విడిచి యింటికిఁ బరుగెత్తుకొని వచ్చినప్పుడు తల్లియు భార్యయు జదువునేర్చిన యుత్తమస్త్రీలగుటచేత రాజభక్తిమరువగూడదనియు ధర్మము (డ్యూటి) ఆపత్కాలమున సయితము విడువగూడదనియు బుద్ధి చెప్పి మరల రణరంగమునకు వానినంపిరి. చదువుకొన్న భార్యలు భర్తలకు స్వధర్మముల జ్ఞాపకముచేయుచుండురు. మనోదౌర్బల్యము తొలఁగించి యుత్సాహము కలిగించుచుందురు. చదువుకొన్న తల్లులు కుమారుల మనస్సులను మొదటినుండియు ధర్మమునందే నెలకొలిపి, ధర్మమే గంగలో గలిపిననేమి నాకొడుకు నాకు దక్కినచాలు'నను కొనక మంచిమార్గముల చేర్పుదురు. కాఁబట్టి మగవారు సద్గుణవంతులు కావలయినన్న స్త్రీలు విద్యావతులు కావలయును.

---

## తరిగొండ వెంకమ్మ.

ఈమె నందవరీకనియోగస్త్రీ. వసిష్ఠగోత్రుఁడైన కృష్ణయమంత్రియొక్క పుత్రిక. ఈమె తెనుఁగుభాషలో రసవంతమైన చక్కనికవిత్వము జెప్పనేర్చి వేంకటాచలమాహాత్మ్యమను పద్యకావ్యమును, రాజయోగసారమను ద్విపదకావ్యమును రచించెను. ఈమెరచియిం

చిన కొన్నిశ్లోకములంజూడఁగా దెనుఁగునందేగాక సంస్కృతమునం దుఁగూడ నీమెకు గట్టిపాండిత్యము గలదని తోఁచుచున్నది. ఈమె కాపురము కడపజిల్లాలోనున్న తరికొండయని తోఁచుచున్నయది. ఈమె రచియించిన రెండుగ్రంథములను తరికొండ నరసింహస్వామి వారి కంకితము చేయుటచేత నీమె నివాసస్థము తరికొండయే యని యూహింపవలసి యున్నది. నందవరీక నియోగులు కడప కర్నూలు బళ్ళారిమండలములలో విశేషముగ నున్నారు. కడపమండలములో నందవరమను నొక గ్రామము గలదు. ఆయూరి బ్రాహ్మణులకు నందవరీకులని పేరువచ్చెను. వారు క్రమక్రమముగఁ జుట్టుప్రక్కల దేశమంతట వ్యాపించిరి. ఈబ్రాహ్మణులందఱకు చౌడేశ్వరి యను దేవత, యిలువేల్పుగానున్నది. ఈమెపార్వతియొక్క యవతారమని వారు చెప్పుదురు. పార్వతీదేవి నందవరీకులమీఁది యనుగ్రహముచే కాశీపట్టణము విడిచి నందవరమునకు వచ్చి చౌడేశ్వరియను పేరుతో వెలసియుండెనఁట. తరిగొండ వెంకమ్మ తనపుస్తకములలో దండ్రిపేరుమాత్రమే చెప్పుటచేతను, అత్తవారి యూరుపేరుగాని మగనిపేరుగాని యెత్తకపోవుటచేతను, యీమె బాలవితంతువైనట్లు తోఁచుచున్నది. ఆమెనుగూర్చి చెప్పుకొనుచున్న కథలనుబట్టిచూడ నీమెతప్పక బాలవితంతువెయని స్పష్టపడుచున్నది. బాల్యమునందు భర్తపోయినను మనదేశమందు తక్కినవితంతువులవలె తనజన్మమంతయు వ్యర్థముచేయక దుర్వ్యాపారములయందుఁ బ్రవేశింపక వెంకమ్మవిద్యాభ్యాసము జేసి చదువుకొన్న విద్య సార్థకమగునట్లు సత్ప్రవర్తనము గలిగి తనకాలము గలహములయందును వ్యర్థప్రసంగములయందుఁ బాడుచేయక నిరంతరము భగవద్భక్తిని వేదాంతమును బోధించు గ్రంథములం జదువుచు దీరికయున్నప్పుడు కవిత్వముఁ జెప్పుచుఁ దన దేహయాత్ర గడపెను. ఈమె

రమారమి డెబ్బదియెనిమిది సంవత్సరముల క్రిందటజీవించియుండెను మనజిల్లాలో జడ్జీపని జేసి తెనుఁగుభాషలో నొక నిఘంటువును రచియించి కీర్తిశేషులయిన శ్రీబ్రౌనుదొరగారు ఈమెను స్వయముగా నెఱిఁగియుండినట్టు తమనిఘంటువులో వ్రాసియున్నారు. కాబట్టి యీామె 1840 వ సంవత్సరప్రాంతమున జీవించియుండును. ఈమె కవిత్వము మృదువై సరసమై భక్తిరసప్రధానమైయుండును. శృంగార రసమువర్ణించుట యీామెకంతగా నిష్టములేదు. వర్ణించినను మిక్కిలి మృదువైనపదములతో మోటుతనమనునదెచ్చట లేకుండ వర్ణించి యున్నది. ఈమె వితంతువయ్యు తక్కినవితంతువులవలె పూర్వా చారపరికారము తలవెంద్రుకలఁ దీయించుకొనలేదు. శాస్త్రములఁ జదువుకొన్నది గావున దానియుద్దేశ మేమో యెఱిఁగి యెవరైనఁ దలవెండ్రుకలెందుకు తీయించుకొనలేదని యడిగినప్పుడు, అదిశాస్త్ర విరుద్ధమైన పని యనియు, దీయించుకొనవలసినదని యేశాస్త్రములో లేదనియు మంగలి పురుషుఁడగుటచేత పతివ్రిత పరపుషుని ముట్టగూడదనియు, అందుచేత మహాపాతకమువచ్చుననియు, తలవెండ్రుకల దీయించుకొన్నంతమాత్రిముచేత స్త్రీ పతివ్రితగానుండునాయనియు వాదనలసేయుచు వచ్చెను. ఈవాదనలసహింపక బంధువు లామెను, నామె సోదరులను వెలిబెట్టిరి. అప్పుడైనను భయపడలేదు. తరువాత నొకసారి యీామెయున్నగ్రామమునకు స్వాములవారు వచ్చి యామెను బిలిపించి శిరోముండనమేల చేయించుకొనలేదని యడిగిరి. అందుకామె వినయముతో "స్వామీా ! నేను తీయించుకొందునుగాని యవి కురల మొలవకుండ మీారు చేయఁగలరా ? అవి దేవుఁడిచ్చిన విగాని మనుష్యులు తెచ్చిపెట్టుకొన్నవికావు. పాతివ్రతధర్మము తల వెండ్రుకలతో నిలువదు. తలవెండ్రుకలతోఁపోదు. తీయించవలసిన దని యేశాస్త్రములో నున్నదో మీారు చెప్పఁగలరా యని యడి

గెను ఆమాటలకు స్వాములవారు తగినయుత్తరములు చెప్పలేక క్రో
ధోద్రేకముచేత నోడలేకుంగక యామె తోబుట్టువులను బెదరించి
వారి సమ్మతివడసి యామెకు బలవంతముగా దలగొరిగించిరనియొక
వాడుక గలదని కొందఱు చెప్పుచున్నారు. అట్లుచేయగానే వెంకమ్మ
చెరువునకుంబోయి స్నానము చేసి తనయిష్టదైవతమగు శ్రీకృష్ణునిఁ
బ్రార్థించెనట. వెంటనే యాదేవుని యనుగ్రహముచేత నామెబోడితల
యెప్పటియట్ల వెండ్రుకలతో నిండిపోయెనఁట. అదిచూచి స్వాముల
వారు యామె మహిమ మెఱిఁగి సిగ్గుపడి యాగ్రామమునుండి లేచి
పోయెనఁట ఈకథ కేవలము కల్పితముగాని నిజముగాదు. ఈశ్వరా
నుగ్రహ మెంతయున్నను నిట్టివింతలుమాత్రి మసంభవములు. స్వా
ములవారుగాని యామెబంధువులుగాని యుక్తికి శాస్త్రమునకు సరి
పడియున్న యామెపలుకులకు సరియైనయుత్తరముల నీయలేక దమ
మాట విన్నదిగాదని యహంకరించి క్రోధావేశమున నామెకు బల
వంతముగా ముండనముచేయించి యుండవచ్చును. వారట్లుచేసిరని
యక్కసుచే మరల నీమె పెంచుకొని యుండవచ్చును. లేక యిటు
వంటిపని జరుగకనే యుండవచ్చును. ఏమైనను ఆమెపాండిత్యముఆమె
మనోధైర్యము నెల్లవారు కొనియాడఁదగియున్నవి. చాల చదువు
కొన్న మగవారే తమచదువులు చట్టుబండలగునట్లు చట్టములకు
స్వాములవార్లకు మునలమ్మకు భార్యకు జడిసి మూఢవిశ్వాసములకు
దాసానుదాసులై యుండఁగా పిచ్చినమ్మకములలోబుట్టిపెరిగిన యొక
యాడుది చదువుకొని శాస్త్రములను శోధించి యాయాచారము
ఘోరమైనదని వాదించి గురుస్వాములను చట్టములను ధిక్కరించి
మనోధైర్యమును బ్రకటించి తనకుఁగల నమ్మకపరికారము చేసినద
నుట యెంతగొప్పమాటయో విచారింపుడు. మన దేశస్థు లతిఘో
రమైన యీశిరోముండనమును నాచారమునకు బానిసలైయున్నారు.

H 85

స్త్రీలకు శిరోముండనము జేయవలసినదని, వేదములయందుగాని మనుస్మృతియందుగాని కలియుగమునిమిత్త మేర్పడినపరాశరస్మృతి యందుగాని యెక్కడను జెప్పఁబడియుండలేదు. ఆపస్తంబుఁడు, అశ్వ లాయనుఁడు బోధాయనుఁడు మొదలగు ధర్మశాస్త్రవేత్తలు రచి యించిన సూత్రములందంతకుముందే లేదు. ప్రమాణ గ్రంథముల యందెక్కడను జెప్పఁబడని యీదురాచారము యీనీచపద్ధతి యీ ఘోరకృత్యము యేకాలమునం దెవరవలంబించిరో తెలియదుఁ దీని వలనఁ బ్రయోజనములేదు. శిరోముండనముఁ జేయించుకొనెడి యా చారములేని క్షత్రియులు కోమట్లు శూద్రులు పతివ్రతలైయుండుట లేదా? అదిగాక "తలలు బోడులైన తలఁపులుబోడులా విశ్వదాభి రామ వినురవేమ" యనునట్లు, ఇది కేవలము వ్యర్థము. అందుచేత తరిగొండ వెంకమ్మగారు చూపిన మంచిమార్గమునే యాంధ్రదేశ బ్రాహ్మణవితంతు లవలంబించుట యుక్తము.

# రాయన భాస్కరుఁడు

ఈభాస్కరుఁడు రాయన్నయను నాతని కుమారుఁడగుటచే రాయనభాస్కరుఁడని పేరుగలిగెను. కొండవీటి సీమనేలిన రెడ్డిరాజుల వద్ద నీతఁడు మంత్రియైయుండి కొంతకాలము కొండవీడుదుర్గమునకు వినుకొండ దుర్గమునకునధిపతియైయుండెను. రాయనభాస్కరునిపేరు తెనుఁగు దేశమంతట దాతృత్వమునకుఁ బ్రసిద్ధికెక్కియున్నది. భట్టు రాజులలో నీతనినిస్తవము చేయనివారు లేరు. ఒకభట్టురాజులేగాదు. తెనుఁగుదేశమందీయన పేరు విననివారు సాధారణముగ నుండరు. దానవిషయమున నితనికెంతకీర్తిగలదో యీక్రిందిశ్లోకము వలన దెలియును,

శ్లో. కృతేయుగే బలిర్దాతా
త్రేతాయాం రఘునందనః
ద్వాపరే సూర్యపుత్రశ్చ
కలౌ రాయనభాస్కరః.

తాత్పర్యము—కృతయుగమందు దాతబలిచక్రవర్తి. త్రేతాయుగమందు దాత శ్రీరాముఁడు; ద్వాపరయుగమందుదాతకర్ణుఁడు కలియుగమందు దాత రాయనభాస్కరుఁడు ఆహాహా! మహాదాతలైన బలికర్ణ రఘురాములతోడ నుపమానము చేయఁబడుట యెంతవానికి లభించును. నిజముగా రాయనభాస్కరుఁడెన్నెన్నో దానములఁ జేసియుండవలెను. కవులను పండితులను యాచకులను నెంతెంతో యాదరించి యుండవలెను. అనేకాగ్రాహారము లిచ్చియుండవలెను అనేకులకు వివాహములు చేయించి యుండవలెను. అన్నదానము వస్త్రదానము గృహదానము మితిమీరి చేసియుండవలెను. లేనిచో నెవఁడు కర్ణునితోఁబోల్పఁబడును. ఎవఁడు బలిచక్రవర్తితోఁ బోల్పఁబడును. ఎవఁడు శ్రీరామునితోఁ బోల్పఁబడును. ఈభాస్కరునిమీఁద కవులుచెప్పిన పద్యములు వందలకొలఁది యున్నవి. అందులో కొన్ని రసవంతములై చిత్రములైయున్నవి. రాయనభాస్కరుఁడు గుణింతము నేర్చుకొనుకాలమున లకార ఏకారములు 'లే' యనియు దకారఉకారములు "దు" అనియు గుణించలేదని యొక కవి పద్యములోఁ జెప్పియున్నాఁడు. అనఁగా గుణింతములు నేర్చునప్పుడైన నీమహాత్ముఁడు "లేదు" అనుమాట నోటితో ననలేదనియు చేతితో వ్రాయలేదనియు దీనిభావము. తెలుఁగుదేశము నిదివఱకు అనేకమంది మహారాజు లేలినారు. వారనేక సత్రములు వేయించినారు. దానములు చేసినారు. అగ్రహారము లిచ్చినారు. కాని వారి కెవ్వరికిని రాయనభాస్కరుని కీర్తివంటి కీర్తిమాత్రము రాలేదు. దీని

కాశ్చర్య మేమున్నది? ధాతసంవత్సరమందు సంభవించిన కరువులో పేదలకన్నప్రదానముఁ జేసినవార నేకులుగలరు. కాని గోదావరిజిల్లాలో నున్న గన్నవర నివాసియగు డొక్కా జోగన్నగారికిని ఆయనభార్య యగు సీతమ్మగారికిని గలిగిన కీర్తియు, కాకినాడపురవాసులైన శ్రీబచ్చు రామేశంగారికి గలిగిన కీర్తియు, ఉర్లాము బసవరాజుగారికిగలిగిన కీర్తియు మరియితరులకుఁ గలుగలేదు గదా! ఈరాయనభాస్కరుఁడు చనిపోయినప్పుడు లోకమునకు మహాపత్తు సంభవించినట్లు ఆంధ్రదేశస్థులు విచారించిరి. ఈక్రిందిపద్యమువలన నీసంగతి తేటఁబడును.

చ. సహజకళంకమూర్తులు కుజాతులు గూఢతరోదయప్రభా।
మహిములు గోత్రవిద్విష దమాత్యులు రాత్రిచ రానుకూల ధీ।
సహితులు మందవర్తనులు సర్పసమానులు రాజసేవక।
గ్రహములు గానవయ్యె నలరాయనభాస్కరుఁడస్తమింపఁగా!

భాస్కరుఁడు, అనఁగా సూర్యుఁడస్తమింపఁగనే, అదినఱకు సూర్యుని తేజస్సుముందర, అణఁగిపోయిన నీచగ్రహము లనేకములాకాశము మీఁదఁ గనఁబడినట్లే రాయభాస్కరుఁడు మృతినొందఁగానే అదివఱకు ఊరుపేరులేని నిర్భాగ్యులు తలలెత్తి రాజసంస్థానములలోఁ బెత్తనములుచేయ నారంభించిరి" దీనింబట్టి రాయభాస్కరుఁడు గొప్ప రాజులవద్ద మంత్రియై రాజకార్యములను నిరుపమ్మానములుగ నెఱవేర్చుచునుండెననియు, అతఁడు పోవుటవలన లోకమునకు వెలితి గలిగినదనియు, ఆనాటివారు విచారించినట్లు మనము గ్రహింపవలయును.

రాయనభాస్కరుఁడు మేరమీరిన దానములుచేసి మృతినొందుటచే నాతనికుటుంబము కాలక్రమమున పేదదయ్యెను. ఇది సహజమేకదా! ఆయనకుమారుఁడు కొండయ్య యనునతఁడు సేనాధిపతియై యుండి మిక్కిలిగౌరవముగఁ గాలముగడపెను. ఈకొండయమంత్రి

కుమారుఁడు అనగా భాస్కరమంత్రిమనుమఁడు మిక్కిలి బాలుఁడై యున్నప్పుడె కొండయ్యమంత్రి మృతినొందెను. పితామహుఁడు దానశీలుఁడై యాస్తిసంపాదింపకపోవుటచేతను, తండ్రి చిన్ననాఁడే పోవుటచేతను, చిన్నభాస్కరుఁడని పేరువడసిన యీబాలుఁడు తన తల్లితోఁగలసి యొకచిన్నయింటఁ గాపురముండి ధనమునకై చాలయి బ్బందిపడుచు నొకఁబడిలోఁ జదువుకొనుచుండెను. ఈచిన్నభాస్కరుఁ డొకనాఁడు బడిలోనుండఁగా నొకభట్టురా జక్కడికి బోయి పరిసంగ వశముచేత బడిపంతులతో "పోయెఁగదాకీరితి,యలరాయనభాస్కరుని తోడ" నని చెప్పెనఁట. ఆమాట వినఁగానే చిన్నభాస్కరుఁడు మిక్కిలి యభిమానముగలవాఁడై తనతాతగారు సంపాదించిన కీర్తి యంతయు నాయనతోనే పోయినందుకు తానేమియుఁ జేయలేనందుకు విచారించి రోసముపట్టలేక తనచేతినున్న రాగికడ్డీలమీఁది బంగారు మురుగులలో నొకదానిని దీసి యాభట్టురాజునకిచ్చెను. అదిచూచి భట్టు, ఆబాలుఁ డెవ్వఁడని పంతులునడిగి రాయనభాస్కరుని మను మఁడని తెలిసికొని యాతని సాహసమునకు చాలసంతసించి, ఆయన మనుమనివలన కీర్తినిలిచినదని పద్యముఁజెప్పి యామురుగుఁదీసికొని పోయెను. సాయంకాలమా బాలుఁడింటికిబోయి మురుగులేని తన మొండిచేయిజూచి తల్లికోపము సేయునేమోయని భయముపడి తన చేయి రుమాలుచాటుననే బెట్టుకొని పయికిఁదీయక, అన్నమునకు రమ్మని తల్లియెంతపిలిచినను తనగుట్టుబయలుపడునని యన్నమునకు వెళ్ళక యీచాటున, ఆచాటున దిరుగఁజొచ్చెను. కుమారుఁడు అన్న మునకు రాకపోవుటకు గారణము దెలియక తల్లిబిడ్డకడకుఁ బోయి, చేయిపట్టుకొని చూచునప్పటికి చేతిని మురుగులేదు. అదియేమైనదని యడుగఁగా చిన్నభాస్కరుఁడు తలవంచుకొని కొంతసేపు తల్లికుత్తర ముజెప్పక యెట్టకేలకు మెల్లమెల్లగా జరిగిన వృత్తాంతము జెప్పెను.

అదివినఁగానే తల్లికోపించి తెలివితక్కువపిల్లవాఁడా యని యొకచెంప కాయగొట్టెను. ఆదెబ్బతిని బాలుఁడు, అమ్మా! కొట్టకు కొట్టకు, ఆభట్టురాజెక్కడ నున్నాఁడో వెదకి, ఆమురుగు మరలదెచ్చెదనని యేడ్చెను. అదివిని యాయిల్లాలు మఱి త నొచ్చుకొని "ఓ తెలివితక్కువపిల్లవాఁడా, ఆమురుగు భట్టునకిచ్చినందుకు నేనుకొట్టలేదు. రాయనభాస్కరుని మనుమఁడవైయుండి, ఒక్కచేతిమురుగుమాత్రమే యిచ్చి పిసినిగొట్టుతనముచేత రెండవచేతిమురుగు దాఁచుకొని మీతాతకు తండ్రికి వంశమునకు అపకీర్తి దెచ్చితివని నేను గొట్టితిని. ఇప్పుడైనను గ్రామములోనికిబోయి భట్టురాజును వెదకి కనుఁగొని యీ రెండమురుగు గూడ వానికిచ్చిరమ్ము. రాయనభాస్కరుని మనుమఁడనిపించుకొనుము పొమ్ము." అని పలికిపంపెను. చిన్నభాస్కరుఁడు తల్లి పలుకులకు సంతసించి యాభట్టునకు రెండవ మురుగిచ్చెను. అహహా తెనుఁగు దేశమునందు రాయనభాస్కరునివంటి,చిన్నభాస్కరునివంటి మహనీయు లనేకులుందురుగాక! చిన్నభాస్కరుని తల్లివంటి మాతృదేవతలు పెక్కండ్రు పుట్టుదురుగాక?

---

## ఏలేశ్వరోపాధ్యాయులు.

తెనుఁగు దేశమందీయన మిక్కిలి ప్రసిద్ధుఁడు; "నీవేమి యేలేశ్వరోపాధ్యాయుఁడవా?" యని లోకులప్పుడప్పుడాయనపేరు సామెతగా వాడుకొందురు; కడప జిల్లాలోనో కర్నూలు జిల్లాలోనో యేలేశ్వర మనుగ్రామమున్నదనియు ఆగ్రామమే యీమహాత్ముని కాఁపురమనియుఁ బెద్దలు చెప్పుదురు. ఈయన మహాప్రఖ్యాతిగాంచిన సంస్కృత పండితుఁడు. ఈయన చదువని వేదములేదఁట. ఈయ

నకు రానిశాస్త్రము లేదఁట. ఈయన యెఱుఁగని పుస్తకములు లేవఁట. తెనుఁగు దేశపు వైదికులలో నొకరితో నొకరు వివాహసంబంధములు చేసికొనకపోవుట కీయనయే ప్రథమకారణమని చెప్పుదురు. ఇదియెంతవఱకు నిజమో మనము చెప్పఁజాలము. అయినను నీవిషయమును గూర్చి లోకమునందు వ్యాప్తమైనకథనీక్రింద వివరించెదము. ఆంధ్రదేశమందు వెలనాట్లు, తెలగాణ్యులు, కాసలనాట్లు, ములికినాట్లు పాకనాట్లు, అనుభేదములు బ్రాహ్మణులలో వైదికులకు గలవు. తెలగాణ్యులనఁగా తెలుగునాట్లు, అనగా తెనుఁగునాడున నున్నవారు. ఆవిధముగానే ములికినాడున నున్నవారు ములికినాట్లనియు కాసలనాడున నున్నవారు కాసలనాట్లనియు, పాకనాడువారికి పాకనాట్లనియు వెలనాడువారికి వెలనాట్లనియు పేళ్ళువచ్చెను. మన దేశమిప్పుడు జిల్లాలక్రింద విభజింపఁబడినట్లె పూర్వకాలమున నాడులుగ విభజింపఁబడెను; పూర్వ మొకరి నొకరు కలిసికొన్నప్పుడు మీ రేనాడువారని యడుగుటయేగాని యిప్పటివలె యేజిల్లావారనియడుగుట లేదు. దేశభాగమునకు నాడులసంజ్ఞలు పోయిన తరువాత సీమలసంజ్ఞలు కలిగెను. ఉండిసీమ, జల్లిసీమ, రెడ్డిసీమ, లంకసీమ, కొండవీటిసీమ, కోనసీమ మొదలగునవి మనము తఱచుగా నిప్పటికిని వినుచున్నారము. ఈపేళ్లు పెద్దలు వాడుటయేకాని యీనాటివారు వాడుట లేదు. పైనజెప్పబడిన వెలనాటులు మొదలగువారు తమస్వదేశములగు వెలనాడు మొదలగు ప్రదేశములు విడిచిపెట్టినను ఆదేశముల కానామములు పోయినను వెనుకటి పేళ్ళతోనే యిప్పటికిని వ్యవహరింపఁబడుచున్నారు. ఈపేళ్లు గలుగుట కాయన కారణము గాదు కానివీరిలో వీరు సంబంధములు లేకయుండుటకాయనయే కారణమని తెలియఁజేసెడు కథయిది. ఏలేశ్వరోపాధ్యాయులయొద్ద విద్యనేర్చుకొనుటకు తెనుగుదేశమంతటనుండి విద్యార్థులుపోయి గురుకులవాసముఁ జేయుచుండెడి

వారు. అందు కొందఱు విద్యార్థులకు, ఆయన స్వగృహమందే భోజ ముబెట్టి చదువుజెప్పెను. ఈయుపాధ్యాయులవద్ద చదువుకొనుటకు కృష్ణాతీరమునుండియో గోదావరీతీరము నుండియో యొకసారి యొక బాలకుఁడు పోయెను. ఆతనిఁజూచి నీవెవ్వరని యుపాధ్యాయులడుగఁగా నేను బ్రాహ్మణబాలకుఁడను మీకీర్తివిని మీవద్ద చదువుకొనుటకు వచ్చితినని జెప్పెను. ఉపాధ్యాయులు సరేయని వానికివిద్య చెప్పనారంభించెను. ఆబాలుని రూపురేఖా విలాసములంబట్టి వినయమునుబట్టి బుద్ధికుశలతంబట్టి సత్ప్రవర్తనముంబట్టి గురువున కాతనియందు విశేషమైన వాత్సల్యముగలిగెను. అందుచేత నతఁడా బాలకుని తనయింటనే బసచేయించి యెంతో శ్రద్ధతో తనకువచ్చిన విద్యలన్నియు నూరిపోసి కొంతకాలము గడచిన పిదప తనకుమార్తెనిచ్చి పెండ్లిచేసి యల్లుని యిల్లరికముంచుకొనెను. అల్లుఁడు కూఁతురు తనయింటనే యుండి కాపురము సేయుచు తన కభితానందము గలుగఁజేయుటచేతను, అల్లుని బుద్ధివిశేషము పాండిత్యము జనులెల్ల కొనియాడుటచేతను నుపాధ్యాయులవారు తామెంతో యదృష్టవంతులమని తలంచుకొనిరి. అటులుండ నొకనాఁడు, అల్లుఁడు కూఁతునకు నగలు చేయింపఁదలచి బంగారముగొని కంసాలినింటికిబిలిపించి తాను దగ్గరకూర్చుండి యేమోసము జరుగకుండ వేయికన్నులతోఁ గని పెట్టుచుండెను ఒకనాఁడు మామగారు జపము జేసికొనుచుండెను అల్లుఁ డేదో పనిమీద లోపలికిఁబోయి గడియసేపటివరకు రాకపోయెను కాని సుత్తితో బంగారము సాగఁగొట్టునట్టి శబ్దము మాత్రము వినఁబడెను. మరికొంత సేపా శబ్దము వినివిని యల్లుఁడు హఠాత్తుగా లోపలినుండి పరుగెత్తుకొని వచ్చి కంసాలినిజూచి నీవు నేను లేనప్పుడు, ఈమేలిమిబంగారములో నిత్తడిముక్కయో రాగిముక్కయో కలిపినావు. నీవు పని

జేయనద్దు ఆగుఆగు మని కేకలు వేసెను. ఈపడుచు బ్రాహ్మణుఁడు ఎప్పుడవతలకు నాలుగునిమిషములు దాటివెళ్ళునా యెప్పుడుబంగార ములో నేదైనఁ గలిపి కొంతమేలిమి తీసికొందునా యని కంసాలి న గలారంభించినది మొదలుకొని సమయము వెదకుచుండెను. ఈ పూఁట సమయము వచ్చినది గనుక అతఁడు కొంచెము రాగిముక్క కలిపినమాట నిజమేయైనను తనదొంగతన మొప్పుకొనక కలుపుటకు నాదగ్గరయేమున్నది? నేనేమియు గలుపలేదని కేకలువేయసాగెను. అంతలో జపముచాలించి యుపాధ్యాయులవారు వారివివాదము వి నుటకురాఁగా, అల్లుఁడు కంసాలియు దగవు చెప్పుమని యాయనను గోరిరి. బంగారములో నేదైన గలిపినట్లు మనకు సాక్ష్యమేమున్నదని యుపాధ్యాయులవారల్లుని నడిగిరి. అందు కల్లుఁ డిట్లనియె. కలిపిన ట్లు నేను శబ్దమునుబట్టి గ్రహించితిని. సుత్తితో మేలిమిబంగారము మీఁద గొట్టినపుడు వినఁబడెడు శబ్దము వేరు. కలితీబంగారముమీఁద కొట్టినపుడువచ్చెడు శబ్దమువేరు కావున తప్పక నితఁడేదో కలిపియుం డవలయును. ఆపలుకులు విని కంసాలి యుపాధ్యాయులవారితో నిట్ల నియె. "స్వామీ బంగారమునకేమిగాని మీరుమీకొంప దీసికొన్నారు మీయల్లుఁడు కంసాలిగాని బ్రాహ్మణుఁడుగాఁడు. ఈమాటనేనుప్రమా ణముజేసి చెప్పఁగలను. నేనురాగిముక్క బంగారములో గలిపినమాట నిజము. కడుపు కక్కుర్తికై యిట్లు గడ్డితింటిని. కాని శబ్దముచేతనే యీసంగతిగ్రహించుట కంసాలియింటఁ బుట్టి కంసాలియింటపెరిగి స్వయముగా బంగారపుపని కొంతకాలము చేసిన కంసాలికే గాని మ రియెవరికిని దెలియదు." ఆమాటలు వినఁగానే యుపాధ్యాయులవారు నిశ్చేష్టులైరి. అల్లుఁడు తెల్లబోయి మాటాడలేక పోయెను. అంతలో జుట్టుపక్కలబ్రాహ్మణులు పదిమందిచేరి యుపాధ్యాయులవారి య ల్లునిఁ జూచి మీదేదేశము? యింటిపేరేమి? గోత్రమేమి? మీచుట్టా

లిప్పు డెక్కడున్నారని నిలువతీసి ప్రశ్నలువేసిరి. అతఁడు తొట్రు పడి వారిప్రశ్నల కసందర్భములైన యుత్తరములు చెప్పెను. ఎట్టకే ల కాబ్రాహ్మణులు మఱింతనిర్బంధముఁ జేసి యడుగఁగా, నుపాధ్యా యులవారియల్లుఁడు తానుకంసాలి యైనట్టును బ్రాహ్మణవేషము వే సికొని యిల్లుబయలు దేఱి యుపాధ్యాయులవారిని మోసపుచ్చి కూఁ తుని బెండ్లాడినట్లును ఒప్పుకొని క్షమింపుమని మామగారి కాళ్ళమీ దఁ బడెను. అంతట నుపాధ్యాయులు విచారగ్రస్తుఁడై సిగ్గుపడి చేయు న దేమియులేక కూఁతును అల్లుని వేఱుగా నొకయంటనుంచెను. అట మీఁద నొకనాడువారితో మఱియొకనాడువారు వివాహసంబంధము లు చేయఁగూడదని శాసించెనఁట. దూరదేశములనుండివచ్చినవారితో సంబంధములుచేసికొనుటవలన అప్పుడప్పుడు ప్రమాదములు జరుగ వచ్చునని, ఆంధ్రదేశస్థులైన వైదిక బ్రాహ్మణులందఱు ఆశాసనము నంగీకరించి దానిప్రకారము నడువఁజొచ్చిరఁట. అదియే యిప్పటికిని నడచుచున్నదఁట. ఈయన చేసెనో మఱియొకఁడు చేసెనోకాని యీ కట్టుబాటుమాత్ర మిప్పటికినిగలదు. పూర్వము టపా పొగబండి తం తివార్త మొదలగునవి లేవుగావున నెవఁడైన దొంగవేషము వేసికొని మోసపుచ్చ వచ్చినచో తెలిసికొనుట కష్టముగా నుండెడిది. ఈదిన ములలో నట్టిభయములేదు గనుక దూరదేశములవారు సంబంధములు చేసికొనవచ్చును. అవిగాక యీనాడుభేదములు లేక వైదికులందఱుఁ దమలోఁదాము వివాహములు చేసికొనుట మిక్కిలి యుచితముగా నుండును.

---

# రుద్రమదేవి

సకలశాస్త్రకోవిధులై లోకజ్ఞానసంపన్నులై సరసకవితాధురంధరులై, వీరరసావతారలై విలసిల్లినస్త్రీలు మన దేశములోఁగొంతకాల ముక్రిందట గలరని తెలిపెడు చరిత్రములు కొన్ని లేకపోలేదు. మూఢాచారములకులోనై దేశభాషలడుగంటిన యీదినములలో నట్టివారిచరిత్రములు చదివినప్పుడు మన కాశ్చర్యము గలుగుచుండును. స్త్రీలు విద్యాభ్యాసముజేసియుండినచోఁ దమభర్తలకు చేదోడు వాదోడునై మెలంగుటయేగాక తమసంతతివారినిగూడ విద్యావంతులుగను నీతికోవిదులుగను లోకజ్ఞానపరాయణులుగను జేసి పరస్పరానురాగముగలిగి యైకమత్యముతో మెలంగునటులఁ జేయుచుందురుగదా! విద్యయే సకలకార్యముల సాధింపఁజేయును. విద్యయే మానవులనుద్ధరించును. విద్యయే సద్గుణములనొసంగును. అట్టివిద్య నభ్యసించిన దేశమెప్పుడును దరిద్రదేవతపాలు కానేరదు. స్త్రీలువిద్యావతులై పురుషులకంటె నెక్కుడు శౌర్యసాహసములనుజూపి దేశమును బరిపాలింపఁగలరనిన చో నిప్పటిప్రజలకుఁ గడువింతగానుండును. పూర్వము ఓరుగల్లు పట్టణమును గణపతిదేవుఁడను రాజొకప్పుడు పరిపాలించియుండెను. ఆతని యనంతర మతని భార్యయు దేవగిరిరాజుల యాఁడుపడుచు నగు రుద్రమదేవి యారాజ్యమును పరిపాలించెను. పురుషసంతానము లేనందున నీమె క్రి॥శ॥ 1257 సంవత్సరమున రాజ్యమును బరిపాలింపనారంభించి 1295 వ సంవత్సరము వఱకు నేలెను. ఈమెపరిపాలనాకౌశలమును గూర్చి జనులనేకవిధముల నిప్పటికి నీమెనుగొనియాడుచునే యుందురు. ప్రజలఁ దనబిడ్డలుగఁ జూచి గాపాడుటయందును, రాజకీయవ్యవహారముల ముచ్చటించుటయందును పెఱరాజుల నడంచి లోఁబఱచుకొనుటయందును నీమెకీమెయే సాటియనిచెప్పుదురు. ఈశౌర్య

రాశి పరిపాలించెడు కాలముననే యోరుగంటికోట శత్రువుల కభేద్య గానటుల పునర్నిర్మితము చేయఁబడినది. ఈమె ప్రజలను తనబిడ్డలుగఁ జూచుచుండుటంజేసి వారును సమయమువచ్చినప్పు డీమె కేమప్రాణ ముల నియ్యమన్నను జంకకయిచ్చి యెల్లవిధముల నీమెకులోబడి వర్తించెడువారని చెప్పుదురు.ఒకప్పుడీమె తనకోటను విడిచి దేవినుపా సించుటకై మొగలిచర్లయను గ్రామమునకుఁబోయి యట వసియించి యున్నప్పుడు హరిహరదేవుఁడు, మురారియనను సామంతరాజు లిరు వురు సమయముదొరకినదని యామెపైఁ దిరుగఁబడగా నామెయు రా జనీతివిశారద యగుటచే యుద్ధమున కదితరుణముగాదని యోచించి సామవాక్యములచే వారినిస్వాధీనము జేసికొని పిమ్మట గొంతకాల మునకు వారుచేయుమాయోపాయముల నెఱింగి తనదళములఁబంపి వారిని నిర్మూలించెను. మఱికొంతకాలమునకు తనపుట్టినింటివారగు దేవగిరిరాజులు తనపై దండువిడియ బంధుత్వమును పాటింపక పుట్టి నింటిపై నభిమానమునుదెగఁగోసి శరీరము లస్థిరములనియుఁ బ్రాణ ములు బుద్బుదంబులనియు పౌరుషముజూపి పోరాడి రాజ్యమును కా పాడినచోఁగీర్తి నిలుచుననియు నమ్మి తనసేనలఁబురికొలిపి వారిపైఁబడి పోరనారంభించెను. వారును రుద్రిమదేవి సాహసమునకు నక్కజప డుచు యుద్ధముచేసిరి. కాని తుదకు పలాయితులైరి. అంతటనీమె వా రిని వెన్నంటి దేవగిరివరకుఁ దరిమి వారివలనఁ గొంతధనమునుగ్రహిం చి మరలివచ్చెను. అంతట కొన్నాళ్ళకీమెకూఁతురగు ఉమ్మక్కకొక బాలుఁడుదయించెను. ఈబాలునకు ప్రతాపరుద్రుఁడను నామముం చిరి. రుద్రిమదేవి సామంతరాజులను బిలిపించి తనమనుమఁడగు ప్ర తాపరుద్రుని జూచి యీతఁడుమీరాజగునని చెప్ప వారును నా నందంబు యామెను బహూకరించిరి. తదనంతర మాదేవి కొంతకాల ము ప్రజానురంజకముగఁ బరిపాలించి 1295వ సంవత్సరమున స్వర్గస్థ

రాలయ్యెను. ఈమె పరిపాలించెడు కాలమున కావలసినచోటుల చెఱువులుత్రవ్వించి బాటలు బాగుపఱచి సత్రములుకట్టించి యెన్నివిధములనో జనులనాదరించెనని చెప్పుదురు. చదువుకొన్నస్త్రీలు రాజ్యమును బరిపాలించి ప్రజలను సౌఖ్యపెట్టుటలోఁ బురుషులకన్నమిన్నలని యీామెచరిత్రమువలనఁ దెలియుచున్నది. ఆనాటిసామంతరాజు లీమెకడ రాజనీతి నేర్చుకొనుచుండెడివారని చెప్పుదురు. పురుషులకువలె స్త్రీలును విద్యనేర్చినచో నేకార్యమునైన నెరవేర్పఁగలరుగదా! స్త్రీలువిద్యనేర్చి ప్రజానురంజకముగాఁ బరిపాలించిన దినములు మనదేశములో నీనాఁడు పురాణగాథలయ్యెను.

## బమ్మెరపోతరాజు

ఈ మహాత్ముఁడు, ఆత్మగౌరవముగల కవీశ్వరులలో నగ్రిగణ్యుఁడు. రాజులకు పుస్తకము లంకితములఁజేసి ధనధాన్యంబులు, మాన్యంబులు అందలములు గుఱ్ఱములు ఏనుఁగులు అగ్రహారములు సంపాదింప వలయునను కోరిక యీాధన్యచరిత్రుని హృదయమందేకోశమందునులేదు. ఇందు కీక్రిందిపద్యమే యుదాహరణము.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము బాసి కాలుచే
సమ్మెటవ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

ఈయన పరమభాగవతోత్తముఁడై సంస్కృత మహాభాగవతమును మిక్కిలి మనోహరమైనశైలితో నాంధ్రీకరించెను. ఈయన కవిత్వము గంగాప్రవాహమువలె స్వచ్ఛమై రసవంతమై, మనోహరమై

భక్తిశూన్యమైనహృదయమందుసయితముభక్తిబీజములనెలకొల్పును. రాజులకు గ్రంథము లంకితము సేయకపోవుటచేత నీతఁడు జన్మమంతయు మిక్కిలి దరిద్రుఁడై కాలక్షేపముఁ జేసెను. పేదతనమునం దీయనను కలియుగ కుచేలుఁడని చెప్పవచ్చును. ఇంత పేదవాఁడైనను కక్కుర్తిపడి యొక్కరాజుమీఁద నొక్కపద్య మైననుఁ జెప్పలేదు. ఈయన బావమఱఁదియగు శ్రీనాథమహాకవి తనపుస్తకముల నన్నింటిని మనుష్యులకంకితముచేసి, అగ్రహారములను ఆభరణములను బడసి అందలములెక్కి తిరుగుచుఁ జాలప్రఖ్యాతి వహించెను. పోతరాజున కట్లు చేయుట కిష్టములేక తనభూమి తానె దున్నుకొని పండించి జీవనము సేయుచు తీరికయున్నపుడెల్ల భగవదంకితముగ భాగవతము చెప్పుచు దేహయాత్ర గడపెను. ఆకాలమునందు వెంకటగిరి సంస్థానమును బరిపాలించుచున్న సర్వజ్ఞసింగభూపాలుఁడు తెనుఁగుభాగవతము తనకంకితము సేయుమని పోతరాజును బ్రార్థించెను. నరాంకితము సేయుట మహాపాపమని పోతరాజు నమ్మియుండుటచే రాజని భయపడక అగ్రహారాదులువచ్చునని యాసింపక తన హృదయమునందు కక్కుర్తికి చోటియ్యక యాతని ప్రార్థనల నిరాకరించెను. కట్టుకొనుటకు గుడ్డ తినుటకు తిండి లేని పేదబాపఁడు తనయంతవారి కోరిక నిరాకరించినందుకు సర్వజ్ఞసింగభూపాలుఁడు మహాకోపపూరితుఁడై పోతరాజును జెఱసాలలోఁ బెట్టించెననియు, ఆయన రచించిన యాంధ్రమహాభాగవతము నశించిపోవునట్లు భూమిలో పాతిపెట్టించెననియు బెద్దలు చెప్పుదురు. చెఱసాలఁ బెట్టినప్పుడు సయితము పోతరాజు మనంబున నీషణ్మాత్రము జంకక తనపుస్తకమును తనను భగవంతుని యధీనముచేసికొని భగవంతుఁడే రాజులకు రాజనినమ్మి భగవదనుగ్రహమున్నంతకాలము తనకుఁగాని తనగ్రంథమునకుఁగాని యేవిధమైన హాని రాదని విశ్వసించి తనను చెఱలోఁ బెట్టించిన రాజును

జూచి "ఓయవివేకీ! నీ మనస్సింతవఱకు చెడిపోయెనని నేను మిక్కిలి విచారించుచున్నాను. నీవు నశించెడు స్వభావముగల నాశరీరమును బంధించితివిగాని నా మనస్సును బంధింపలేవు. నా పుస్తకమును పాతిపెట్టించితివిగాని నా పాండిత్యమును నీవు పాతిపెట్టింపలేవు. నన్ను చెఱసాలలోఁబెట్టి నాకు నీమీఁద పేరిమగలుగునట్లు చేయఁజాలవు." అని తూలనాడి చెఱసాలలోనున్న యతఁడు తాను గానట్లు నిర్భయముగ నిర్విచారముగఁ బ్రవర్తింపఁజొచ్చెను. అతఁడు చెఱలోనుండఁగా సరస్వతీదేవి వానికిఁ బ్రత్యక్షమై ఈబాధలు పడలేక యొకవేళనన్ను నరాధములపాలుచేసెదవుసుమీ యని చెప్పుకొని యేడ్చెనఁట. ఆమె విలాపము విని చెఱలోనున్న పోతరాజు యీ క్రిందిపద్యముఁ జెప్పి యామెనోదార్చి యభయప్రదానమిచ్చెనఁట.

ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యో మదంబ యో
హాటకగర్భురాణి నిను నాఁకటిఁగొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!

ఇట్లు శారదాదేవి సాక్షాత్కరించుట సత్యమని చెప్పఁజాలము కాని పోతరాజు చిత్తము సరస్వతియందు నిరంతరమును లీనమై యుండుటచేత నతనికామె కలలోఁగనఁబడి యట్లు విచారించియుండ వచ్చును. భూమిలోఁ జిరకాలము పూడ్వఁబడి యుండుటచేత ఆంధ్రమహాభాగవతము చాలచోట్ల శిథిలమై పోయెననియు పోయినభాగములు వెలిగందల నారయ్య సింగయ్య పూరించెననియు వాడుక గలదు. ఇన్నివిధములచేత మహాబల సంపన్నుఁడగు రాజు తన్ను బాధపెట్టుచుండఁగా రవంతయేని మనోవైకల్యములేక పోతరాజు పుటముబెట్టిన బంగారు తెఱఁగున భాసిల్లి రాజుయొక్క మౌఢ్యమునకు విచారించెనేగాని తన విషయమై క్లేశపడలేదు. ఆహాహా! ఆత్మగౌరవము నిమిత్తము పోతరాజు పడిన బాధలు అనుభవించిన యవమాన

ములు చెప్ప నలవిగాదు గదా? ఒకనాఁడు పోతరాజు తనపొలము గట్టుమీఁద కూర్చుండి, కొడుకు అరకకు దున్నపోతులను గట్టి దున్నుచుండఁగా భాగవతము, వ్రాయుచుండెను. అప్పుడు మఱఁది యైన శ్రీనాథుఁడు పల్లకియెక్కి యాచారింబోవుచు పోతరాజుంజూచి ఓహో బావగారు హాలికులాయని పరిహాసముగాఁ బలికెను. హాలికు లనఁగా నేల దున్నుకొని జీవించువారు. ఆమాట వినఁగానే పోతరాజు కొంచెము కోపముఁ దెచ్చుకొని యీక్రిందిపద్యము చెప్పెను.

ఉ. బాలరసాలసాల నవపల్లవకోమలకావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పడుపుకూఁడు భుజించుటకన్న సత్కవుల్
హాలికులైననేమి గహనాంతర సీమల కందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై.

ఆహాహా! ఈపద్యమెంతరుచిగానున్నది. స్తోత్రపాఠములవల్ల జీవించు పురుష సర్పములకీ పద్య మీశ్వరవేరుగదా? మహామహుఁ డైన పోతరా జెన్నఁడీపద్యమును చేనిగట్టుమీఁదనుండి చెప్పెనో యానాటనుండి ఆచేనుగట్టు మీఁదనుండి యీ నాఁటివఱకు, ఆంధ్ర ప్రపంచమందంతట నీ పద్యము ఆత్మగౌరవ ప్రతిపాదకమై నీతిబోధ కమయి యుత్సాహజనకమయి ప్రతిధ్వని నిచ్చుచున్నదిగదా! కురూపి నిమన్మథుఁడని పిశినిగొట్టును దానకర్ణుఁడని కల్లలకు పుట్టినిల్లగువాని హరిశ్చంద్రుఁడని మహాజారుని యేకపత్నీ వ్రతస్థుఁడని కడుపుకక్కుర్తికి లోబడి ధనమున కాశపడి స్తోత్రములుచేసి పద్యములను కవిత్వ మును భాషను పాడుచేయునట్టి కవులకు అధికారుల యనుగ్రహమును సంపాదించుటకై ముఖస్తోత్రములఁజేయు మూర్ఖులకును స్వకాయ కష్టమువల్ల జీవించెడు వారిని హీనముగా జూచి తేరగాడబ్బు సంపా దించునట్టి వారిని గౌరవించువారికిని పోతరాజుచెప్పిన యీ పద్యము బుద్ధిమాంద్యమును బోఁగొట్టి జ్ఞాపప్రదాయినియై "ఒరులను స్తోత్ర

ము జేసి ధనము సంపాదింపకు. దానివలన ఆత్మగౌరవము చెడును; నీవు నశింతువు. నీచెక్కలను నీవు నమ్ముకొనుము. అప్పుడు ప్రపంచ మంతయు నిన్ను గౌరవించును." అనునట్టి వేదవాక్యములవంటి సత్య ము నుపదేశించుచున్నదిగదా!

ఆత్మగౌరవము నందును భగవద్భక్తియందును స్వభావోక్తి వర్ణించుట యందును బమ్మెరపోతరాజువంటి కవిరాజు లేదేశమందైన నగుదుగానుండదు. ఈమహాకవియొక్క యాత్మగౌరవమునుభక్తిని జూపుటకు నిదివర కుదాహరణము నిచ్చితిమిగాన ఈయనస్వభావోక్తిం జూపుటకు గూడ నొకయుదాహరణ మిచ్చెదము. ఈయన భాగవత ములో గజేంద్రమోక్షము కథను వర్ణించునపుడు.

మ. సిరికింజెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే।పరివా రంబును జీరఁడభ్రగపతింబన్నింపఁడాకర్ణి కా।తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోద్ధత శ్రీకుచో।పరి చేలాంచలమైన వీడఁడు గజ ప్రాణావనోత్సాహియై.

అనుపద్యమును జెప్పెను. గజేంద్రునిరక్షింపవలయునను తలం పుచే నాతని ప్రార్థనలు చెవినిబడగానే భక్తుఁడెంత బాధపడు చున్నాఁడో యని తొట్రుపడి వానియొద్దకు వెళ్ళి వాలవలయునని లక్ష్మీదేవితోఁ జెప్పక శంఖచక్రములుపుచ్చుకొనక యేపరివారమును వెంటరమ్మనక గరుత్మంతునిపై నెక్కక చేతిలోనున్న భార్య పైట కొంగైన విడువక పరవశుఁడై విష్ణుమూర్తి గజేంద్రునియొద్దకు వెళ్లు చుండెనని మీదిపద్యమునకు తాత్పర్యము. ఈయన మఱిదియగు శ్రీనాథుఁడు యీ పద్యమునువిని యిది స్వభావమునకు విరుద్ధ ముగా నున్నదని పోతరాజు నధిక్షేపించెను. ఎందుచేతనని పోతరా జడుగగా శ్రీనాథుడిట్లనియె. వెళ్ళునప్పుడు లక్ష్మీదేవితోఁ జెప్పలేదం టివి. ఎంతోదూర ప్రయాణము తగిలినప్పుడుభార్యతోఁజెప్పకుండ వె

ళ్ళుట స్వభావమా? భక్తునిమీఁద నెంతప్రేమ యున్నప్పటికి నామా
త్రము మాటయైన భార్యతోఁజెప్పుటకు తీరికలేదా? శంఖచక్రములు
పుచ్చుకోలేదంటివి. మొసలిం జంపి గజేంద్రుని రక్షించుటకు వెళ్ళు
నతఁడు ఆయుధములైన శంఖచక్రములను విడిచి వెళ్ళునా? గరుత్మంతు
నెక్కలేదంటివి. వైకుంఠమునకు గజేంద్రుఁడున్న స్థలమునకును,ఎన్నో
లక్షల క్రోసులదూరముండును. త్వరగావెళ్ళఁదలఁచినవాఁడు మిక్కిలి
వేగమున బోవు గరుత్మంతు నెక్కక నడచివెళ్ళునా? కాఁబట్టి యీ
పద్యము స్వభావోక్తిగాలేదు." ఆమాటవిని పోతరాజు తాను చెప్పిన
పద్యము సరిగాలేదని యొకరన్నందుకు ఖిన్నుఁడయ్యెను. ఆరాత్రి
శ్రీనాథ పోతరాజులు భోజనము జేయుచుండగా నొక బ్రాహ్మణుఁ
డువచ్చి తొట్రుపాటుతో "శ్రీనాథుఁడుగారూ! మీకుమారుఁడు నూ
తిలోఁ బడినాఁడండీ" యని చెప్పెను. పిడుగుబోలిన యావార్త వినుట
తోడనే శ్రీనాథుఁడు పోతరాజు, అన్నమువిడిచి లేచిరి. శ్రీనాథుఁడు
ఎవరినిం బిలువక కుమారా! కుమారా! యని తపించుచు నూతివద్దకుఁ
బోయి దానిచుట్టుం దిరుగఁజొచ్చెను. ఆవార్తజెప్పిన బ్రాహ్మణుఁడపు
డాతనిం జూచి "ఓయీ వెఱ్ఱివాఁడా! కుమారా కుమారా యని విల
పించుచు నూతిచుట్టుందిరిగిన నేమిప్రయోజనము. తట్టలు త్రాళ్ళు
నిచ్చెనలు తేవలెను. నూతిలో నురికి పిల్లవానిని పైకెత్తు సాహసులం
దేవలెను. పిల్లవాఁడు ఆసాధనములవల్ల బ్రతుకునుగాని నీతొట్రుపా
టువలన బ్రతుకునాయని పలికెను. అప్పకులువిని శ్రీనాథుఁడిట్లనియె.
"అయ్యోనామనసు మనసులోలేదు. నాకేమియుఁదోఁచుటలేదు. ఆ
మాట వినగానే నూతిదగ్గరకు వచ్చిపడినాను. తట్టలు త్రాళ్ళు నిచ్చె
నలు వాటంతటవియే నావెనుకవచ్చును. నేనిక్కడనుండి కదలి వెళ్ళఁ
జాలను." అంతలో పోతరాజు తట్టలు త్రాళ్ళు నిచ్చెనలు తెప్పించెను.
ఈసడుమ, బ్రాహ్మణుఁడు ఆవలకుఁబోయి శ్రీనాథునికొడుకును చంక

బెట్టుకొని వచ్చి యిట్లనియె. "ఇదిగో నీకొడుకు. ఈతఁడు నూతిలోఁ బడలేదు. పోతరాజుగారి పద్యము స్వభావోక్తిగా నున్నదని తెలుపుటకై నేనీ చిత్రికథ కల్పించితిని. నీకొడుకు బావిలోఁబడినాఁడని వినగానే నీకెంత తొట్రుపాటు కలిగినదో, గజేంద్రుని యార్తధ్వని చెవిని బడగానే విష్ణుమూర్తికంత తొట్రుపాటు కలిగినది. త్రాళ్ళు మొదలైన సాధనములు తీసికొనిపోకుండ నూతివద్దకు వెళ్ళవలెనని నీకెంత తొందర గలిగినదో శంఖచక్రములు మొదలయినవి తీసికొనిపోకుండ గజేంద్రునివద్దకు వెళ్ళవలెనని విష్ణుమూర్తికిగూడ నంతతొందర గలిగినది. తల్లిదండ్రులకు బిడ్డలమీఁద నెంతప్రేమయుండునో భగవంతునకు భక్తునిమీఁద నంతప్రేమయుండును. త్రాళ్ళు మొదలైనసాధనములు వాటంతటవియే వచ్చునని నీవెట్లుతలంచితివో యట్లే శంఖచక్రములు మొదలైన ఆయుధములు గరుత్మంతుఁడు మొదలయిన పరివారము తమంతటతామే వచ్చునని విష్ణుమూర్తిగూడ తలంచెను. నిజముగా శ్రీహరి తలంచినట్లే శంఖచక్రములు లక్ష్మీదేవి గరుత్మంతుఁడు వైకుంఠములోనున్న తక్కిన పరివారము శ్రీమన్నారాయణుని వెనుకనే వెళ్ళిరని తరువాతిపద్యములో చెప్పఁబడియున్నది. ఆ తరువాతి పద్యమైనజూడక పోతరాజుగారి పద్యము స్వభావోక్తిగా లేదని నిష్కారణముగనంటివి. "సిరికిం జెప్పఁడు" అన్నపద్యము స్వభావోక్తిగా నున్నట్లిప్పుడైన నీకుఁదోఁచినదా!"

బ్రాహ్మణుని పలుకులువినగానే శ్రీనాథుఁడు తెల్లబోయి పోతరాజునుజూచి "బావగారూ! ఈయన నాకు బుద్ధిచెప్పుటకై వచ్చిన శ్రీవిష్ణువుగాని కేవల బ్రాహ్మణుఁడు గాడు. తండ్రికి కుమారునియం దెంత ప్రేమయుండునో భగవంతునకు భక్తునిమీఁద నంతప్రేమయుండును. మీపద్యమెంతో స్వభావోక్తిగ నున్నది. లోకానుభవము సరిగాలేక నే నాపద్యము బాగులేదంటిని. క్షమింపు" మని బ్రతిమాలుకొనెను.

శ్రీనాథునకు బుద్ధిచెప్పుటకై విష్ణుమూర్తి బ్రాహ్మణవేషము ధరించివచ్చి యీచిత్రకథ కల్పించెనని తెనుఁగువారిప్పటికిని నమ్ము చున్నారు. అది నమ్మఁజాలముగాని సాహసముగల బ్రాహ్మణుఁడెవఁ డో యొకఁడు పోతరాజుగారిమీఁది యభిమానముచేత శ్రీనాథునకుఁ దెలివి గలిగించుటకై యిట్లుచేసియుండవచ్చును.

తనపుస్తకములన్నిటిని మనుష్యులకంకితముజేసి చాల దేశము లు తిరిగి మహారాజులయొక్కయు మంత్రులయొక్కయు వర్తకులయొ క్కయూ ననుగ్రహమునకుఁ బాత్రుఁడై పల్లకులెక్కి తిరుగుచు తన జీవితమంతయు రాజాశ్రయమందే గడపిన శ్రీనాథునియొక్కయు, భగవంతుఁడే తల్లి దండ్రి సోదరుఁడు చుట్టము మిత్రుఁడుననుకొని,అత ని పాదపద్మములనే నమ్ముకొని పేదతనమే యీశ్వరప్రసాదమనితలం చి రాజులమీఁద నొక్కపద్యమైనఁ జెప్పని పోతరాజుయొక్కయు కడపటి యవస్థలను బోల్చిచూతము. శ్రీనాథుఁడు తనపోషకులగు రాజులందఱునశింపఁగా డబ్బున కిబ్బందిపడి కృష్ణాతీరమందలి బొడ్డు పల్లెయను గ్రామము గుత్తకు పుచ్చుకొని చెల్లింపవలసిన 700 లటం కములు రాజునకు చెల్లింపలేకపోయెను. గుత్తకిచ్చినరాజు కోపించి శ్రీనాథుని బట్టించి యెండలో నిలువఁబెట్టించి కాళ్ళకుసంకెళ్ళు చేతు ల కరదండములువేయించి వీపుమీఁద నల్లరాయియెత్తించి బాధపె ట్టెను. శ్రీనాథుఁడు తినుటకన్నములేక కట్టుకొనుటకు మంచిబట్టలు లేక మిక్కిలి యిబ్బందిపడి మృతినొందెను. పోతరాజు, ఒకనాఁడైశ్వ ర్యము గలుగుట ఒకనాఁడు పేదతనముగలుగుట యనునవస్థాభేదములు లేక యెల్లప్పు డొక్కరీతిగానే యుండి పేదతనమందు బుట్టి పేదతన మందు బెఱిగి మనుష్యుల నెవ్వరి నమ్మక రాజుల నాశ్రయింపక దే హియని నోరు తెఱచి చేయిజాచి యెవ్వరినడుగక ఒకరు దయావంతు లై యిచ్చినం బుచ్చుకొనక కష్టపడి చెమటయూడ్చి నేలదున్నుకొని

కుటుంబపోషణముం జేసికొని గౌరవముగ దేహయాత్రగడపి పరిశాంతచిత్తుఁడై పరలోకమునకుం జనియెను. కాఁబట్టి యాత్మగౌరవము నిలుపుకొనుట యెంతగొప్పవాఁడైన స్వయముగా పాటుపడుట సుఖసాధనములని పోతరాజు చరిత్రమువలన మనమునేర్చికొనవలెను.

---

# గోపరాజు రామన్నమంత్రి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుండనియు లౌకికులలోఁ గొందఱికి, ఆఱువేలనియోగులనుపేరువచ్చుట కీయనయే కారణమనియు వైదికులకు నియోగులకుఁ బరస్పరవివాహసంబంధములు లేకుండునట్లు శాసించినమంత్రి యితఁడేయనియు లోకులుచెప్పుదురు. ఇతఁడేకాలమువాఁడో యేరాజువద్ద మంత్రిగానుండెనో నిర్ణయించుటకుఁదగిన యాధారములులేవు. వైదికులకు నియోగులకు సంబంధములు లేకుండునట్లితఁడు శాసించినాఁడని నిర్ణయించుటకు నయితము గ్రంథస్థములైన యాధారములేవియు గానరావు. అయినను లోకమునందు వ్యాప్తమై యున్న కథ నొకదాని నీక్రింద వివరించెదము. ఈకథను చరిత్రకారులు నిజమనినమ్మక దీనియథార్థస్థితిని తరచికనుఁగొని పిమ్మట సత్యాసత్యములు గ్రహింపవలయునని కోరుచున్నాము.

గోపరాజు రామన్న తెనుఁగుదేశమందొక మహారాజువద్దమంత్రియైయుండ రాజ్యకార్యనిర్వాహణమునందు నిరుపమానప్రజ్ఞగలవాఁడై రాజునకు మిక్కిలి యిష్టుఁడై ప్రజారంజకుఁడై యుండెను. ఆకాలమునందులౌకికవృత్తియందున్నవారికి మంత్రులనియు వైదికవృత్తియందున్నవారికి వైదికులనియు బ్రాహ్మణులలో సంజ్ఞలుండెనుకాని

యిప్పటివలె కులమునుఁబట్టి లౌక్యవైదికభేదము లేదఁట. అందుచేత వైది కవృత్తిలోనున్న వారికి లౌక్యవృత్తిలోనున్న వారికి వివాహములు జరుగుచు వచ్చెను. గోపరాజు రామన్న మంత్రియొక్క చెల్లెలు రాజు గారి పురోహితునకిచ్చి వివాహము చేయఁబడెను. ఇట్లుండుట యా శ్చర్యముకాదు. మాధ్వులలో లౌక్యవైదిక భేదములేదు. వారిలో లౌక్యవృత్తినవలంబించునతఁడు పంతులనియు వైదికవృత్తి నవలంబిం చు నతఁడాచార్యుఁడనియు జెప్పఁబడును. వైష్ణవులలో నీభేదము మొద లే లేదు. ఈపై రెండుశాఖలలోను వైదికవృత్తుల నవలంబించువారికి వివాహసంబంధములు కలవు. ఈవిధముగానే పూర్వకాలమందు, అద్వయితులలో లౌక్యులకు వైదికులకు సంబంధముండియుండవచ్చు ను. రామన్న మంత్రియైయుండుటచేతను, ఆతని చెల్లెలిమగఁడు పురో హితుఁడైయుండుటచేతను రాజుగారియొక్క లౌక్యవైదికవ్యవహార ములు సమస్తజనులు మెచ్చునట్లు జరుపబడుచు వచ్చెను. అటులుండ నొకకాలమందు రాజుగారియింట నొకపుణ్యస్త్రీ మృతినొందెను. పు ణ్యస్త్రీలు మృతినొందునప్పుడు పుట్టినింటివారు పదియవనాఁడు ము త్తయిదువునకు తలయంటి మూసివాయనమిచ్చుట పసపుకుంకుమ చేటలు ముత్తయిదువులకు బంచిపెట్టుట మన తెనుఁగుదేశమం దాచా రమైయున్నది. పూర్వమందుగూఁడ నీయాచారముండుటచే రాజు గారియింటి పరిచారికలు పురోహితుని భార్యయైన రామన్నమంత్రి చెల్లెలను జెఱువుగట్టునకుఁ దీసికొనిపోయి యక్కడ నామెకు తల యంటి మూసివాయనమీయఁబోయిరి. ఆవాయనములో బెట్టిన చీర, ఆమె మనస్సునకు నచ్చినదిగాకపోయినందున, ఆమె కోపగించి మూ సివాయనము పుచ్చుకొనుట కిష్టపడదయ్యెను. ఆమాట పరిచారికలు మంత్రిగారికి విన్నవించిరి. మంత్రి యావార్తవిని బాలప్రాయమున నున్న పుణ్యస్త్రీ మృతినొందెనని యెల్లవారును విచారించుచుండఁగ

తన చెల్లెలే కష్టకాలమని యోచింపక పదిమందియు నేమనుకొందు రోయని సందేహింపక చీరె మంచిదికాదనువంకబెట్టి మూసివాయన ము పుచ్చుకొనక తగవులాడుచున్నందులకు మిక్కిలి విచారించి సిగ్గు పడి మఱియొకచీర తెప్పించియిచ్చి యామెనొడంబరచి కార్యము జరి గించి తరువాత వైదికవృత్తిలోనున్నవారికి లౌకృవృత్తిలోనున్నవా రికి వివాహసంబంధము లుండఁగూడదని కట్టుబాటుచేసెను. అప్పటి దేశకాలపద్ధతుల ననుసరించి యాకట్టుబాటు సరిగానున్నదని తోఁచి నందున, ఆకాలపు లౌకికులందఱు దానిని మన్నించిరి. ఇటీవలి వారుగూడ చిరకాలమునుండి వచ్చుచున్న యీయాచారమును శా స్త్రనిబంధనగానెంచి లోబడియున్నారు. స్మృతులయందుగాని సూ త్రములయందుగాని వేదములందుగాని బ్రాహ్మణులలో వైదికులు నియోగులునను తెగలు చెప్పబడియుండలేదు. లౌకికులు మీసములు పెంచుకొనవచ్చుననియు పొగచుట్టలు త్రాగవచ్చుననియు శాస్త్రము లంగీకరించుట లేదు. వైదికులు మీసములు పెంచఁగూడ దనియు చుట్టలు త్రాగకూడదనియు శాస్త్రములు నిషేధిం చుటలేదు. ఉభయులు బ్రాహ్మణులే; ఉభయులు నద్వైయి తులే. ఉభయులకు వేదములు శాస్త్రములు సమానములే. ఉభయులకు కర్మ లవశ్యములే. అందుచేత శాస్త్రదృష్టిచేత లౌకికులు వైదికులు సమానులు. ఈభేదపు కట్టుబాటు నడు మవచ్చినదిగావున యిప్పుడు దాని నంతరింపఁజేసి లౌకికవైదికులు సంబంధములుచేసికొనిన మిక్కిలి బాగుండును. అట్లయిన వైదికుల తోడి సంబంధములు చేసినపక్షమున రామన్నమంత్రికి వచ్చినచిక్కు లవంటివి లౌకికులకు రాకపోవునాయని కొందఱడుగవచ్చును. ఇప్ప టిదినములలో నట్టిచిక్కులు రావు. ఏలయన ఉద్యోగములుచేయు లౌకికులుద్యోగములుచేయు వైదికులతోను, కృషివల్ల జీవించువారు

కృషిచేయువారితోను సంబంధములు చేసికొనవచ్చును.

రామన్న మంత్రినిగూర్చి మఱియొకకథగలదు. రామన్న మంత్రి యేరాజులవద్ద మంత్రిగానుండెనో, ఆరాజునను గ్రహముబడసి తన కాఱుగడియలసేపు రాజముద్రి నిమ్మని వేడెనఁట. రాజు వాని కోరిక దీర్పఁదలఁచి ముద్రి నిచ్చెనఁట ఆయాఱుగడియలలో నతఁడా ఱువేలమంది లౌక్యులకాఱువేల గ్రామముల కరణీకములు వ్రాయిం చి వాటిపై రాజముద్రి వేసెనఁట. అదివరకు కరణీకములు కంసాలు ల యధీనములో నుండెనఁట. నాటనుండి కరణీకములు నియోగుల పాలైనవఁట. ఆపట్టాలఁబుచ్చుకొన్న యాఱువేలమంది, ఆఱువేల నియోగులై లోకమున వ్యవహరింపఁబడుచున్నారఁట. ఇవియన్ని యుఁ బుక్కిటి పురాణములేకాని యదార్థములని మనము నమ్ముటకు వీలులేదు. ఇట్టికథ లన్నిటినిఁ జేర్చి దేశచరిత్రకారులు నిగ్గు తీయుదు రుగాక యని యాకట్టుకథల నిట్లు ప్రకటించుచున్నారము.

---

# మంత్రియుగంధరుఁడు

---

క్రీ॥ శ॥ 1295 వ సంవత్సరము మొదలుకొని రమారమి 1330 వ సంవత్సరమువఱకు తెనుఁగుదేశమంతను ప్రతాపరుద్రమహా రాజు పరిపాలించెను. ఈయనకు రాజధాని యోరుగల్లుపట్టణము. దీనిని సంస్కృతమున, ఏకశిలానగరమందురు. ప్రస్తుత మీపట్టణము వారంగల్ అనుపేరుగలిగి నిజాము రాజ్యమునం దున్నది. ఈపట్టణ మునందు శిథిలములైయున్న కోటలు మొదలగునవి ప్రతాపరుద్రుని యొక్కయు, ఆతని పూర్వులయొక్కయు గీర్తిని వేయినోళ్ళ చాటు చున్నవి. ప్రతాపరుద్రుఁడు శూద్రికులజుఁడు. కాకతీయవంశస్థుఁడు.

గణపతిదేవమహారాజుయొక్క కూఁతురు కొడుకు. గణపతిదేవునకు పురుషసంతానము లేనందున, ఆయన యనంతరమున కూఁతురగు రుద్రమదేవి 38 సంవత్సరములు భూమి పరిపాలించి తనకూఁతురు కొమారుఁడైన ప్రతాపరుద్రుఁడు యుక్తవయస్కుఁడై నపిదప నతనికి పట్టాభిషేకముఁ జేసి విశ్రాంతి నొందెను. ఈకాకతీయవంశస్థుల కాలమున, ఆంధ్రదేశమునఁ జాలభాగమువారి యధీనమునందేయుండెను. ఇటు గోదావరి మొదలుకొని అటు హైదరాబాదునఱకు గలరాజ్యమంతయు వారిదే. చిరకాలము తురకలకు రాజధానియైన గోలకొండపట్టణము మొట్టమొదట వీరిదే. భాస్కరరామాయణమును రచియించిన మహాకవి హుళక్కిభాస్కరుఁడు, ఈప్రతాపరుద్రుని యాస్థానకవులలో నొక్కరుఁడు. ప్రతాపరుద్రీయమను నలంకారశాస్త్రమును సంస్కృతమున రచియించిన విద్యానాథుఁడీయన యాస్థానపండితుఁడని వేరుగఁ జెప్పనక్కరలేదుగదా! ఈకాకతీయప్రభువుల కాలమునందె, ఇప్పుడు తెనుఁగుదేశమునందు జమీందారులైయున్న శూద్రప్రభువుల పూర్వులు సేనాపతులై యుండిరని చరిత్రకారులు చెప్పుచున్నారు. యుగంధరుఁడు ప్రతాపరుద్రుని మంత్రులలో నొకఁడని వాడుకగలదు. ఆరాజు మంత్రులలో నీపేరుగల యతఁడున్నట్లు గ్రంథములలోగాని తామ్రశిలాశాసనములలో గాని కనబడదు. ఆయన మంత్రులకు శివదేవయ్య నాగయ్య గన్నయ్య మొదలగు పేర్లు గలవుగాని యీపేరు లేదు. యుగంధరుఁడు యౌగంధరాయణుఁడు నను మంత్రులు పూర్వము వత్సరాజులవద్ద నుండిరి. కాబట్టి ప్రతాపరుద్రుని మంత్రులలో నెవరికో యొకరికి, అతని ప్రజ్ఞావిశేషముచేత యుగంధరుఁడను బిరుదువచ్చి యుండవచ్చును. ఇది పౌరుషనామమే కాని మరియొకటికాదు. ఎట్లైనను యీయుగంధరునిఁగూర్చి యాంధ్రదేశస్థులు చెప్పుకొనునట్టి కథ మిక్కిలి విచిత్రముగాను

నీతిబోధకముగాను నున్నది. కావున దాని నీక్రింద విశదించు చున్నాము.

క్రీ॥ శ॥ 1320 వ సంవత్సర ప్రాంతములందు కిల్జీవంశపు తురకరాజులు ఢిల్లీరాజ్యము గోల్పోయిరి. వారి యనంతరమున టోగ్లాకువంశపు రాజులు ఢిల్లీచక్రవర్తులైరి. అందు మొదటిచక్రవర్తియొక్క పెద్దకుమారుఁడగు ఉలూబుఖానుఁడు తెనుఁగుదేశముమీఁదికిదండెత్తివచ్చి మాయోపాయముచేత ప్రతాపరుద్రదేవుని సేనలను పరాజయముఁనొందించి యతనిని ఖైదీగా బట్టుకొని ఢిల్లీనగరమునకుఁ దీసికొనిపోయెను. ఈమాట నిజము. ఈవిషయము హిందూదేశచరిత్రమునందు స్పష్టముగాఁ జెప్పబడియున్నది. రాజు తురకలచేత ఢిల్లీకి గొంపోబడినతోడనే దేశమరాజకమై నందున చుట్టుప్రక్కల రాజులు దండెత్తి రాకుండఁగను దేశగర్భమున కుట్రలుబయలు దేఱకుండగను యుగంధరుఁడు చక్కని యేర్పాటులుచేసి రాజ్యము స్థిరముచేసి ప్రతాపరుద్రదేవుని భార్యను బిడ్డలను తల్లిని యోదార్చి ప్రజల కభయప్రదానమిచ్చి సేవకులకు ధైర్యము పురిగొల్పి సేవకులకుత్సాహముఁ గలిగించి యాఱుమాసములలోపుగ ఢిల్లీనుండి తనరాజును మరల స్వదేశమునకుఁ దోడుకొనివత్తుననియు రాజును దీసికొని రానిపక్షమున మరల తనదేశమును త్రొక్కిచూడననియు ఘోరమైనశపథము జేసి యిల్లుబయలుదేఱి వెళ్ళెను. అహాహా! యుగంధరుని ధైర్యము మనోబలము మెచ్చఁదగినవికదా! ఎక్కడియాంధ్రదేశము ఎక్కడి ఢిల్లీపట్టణము. బయలుదేఱునపు డాతనివెంట సైనికులుగాని పరివారములు గాని లేవు. అట్లు పురమువెడలి మాఱువేషము వేసికొని ఢిల్లీనగరమునకుఁ బోయి, అక్కడ యుగంధరుఁడు పిచ్చివానివేసమువైచికొని యెవ్వరితో మాటాడక తనలో దాను గొణుగుకొనుచు తన్నుతానే తిట్టుకొనుచు నిష్కారణముగా నితరుల దూషించుచు ప

ట్టణమందలి వీథులెల్లఁదిరుగుచు "ఢిల్లీసుల్తాన్ పట్టుకపొతాన్" అని మాటిమాటికి నరచుచు స్వేచ్ఛగ విహరింపఁజొచ్చెను. ఢిల్లీచక్రవర్తి ని ఖైదీగా పట్టుకొనిపోవుదునని యతఁడు పలుకుచుండుటచేత నతఁడు నిజముగా పిచ్చివాఁడో వెఱ్ఱినభినయించుచున్న టక్కరియో తెలిసికొన వలయునని చక్రవర్తియొక్క యుద్యోగస్థులకుఁ దోఁచఁగా వారుకొందఱు సైనికులను వీనివెంట బంపి వానియునికి యెక్కడో, భోజనము చేయునో లేదో కనుగొనిరమ్మని యాజ్ఞాపించిరి. యుగంధరుఁడు పగలెల్ల వీథులలో నిట్లు తిరిగితిరిగి రాత్రి పట్టణము మాటుమణిగినతరువాత యమునానదిలో స్నానముజేసి శ్మశానభూమికిఁబోయి యక్కడనొకమఱ్ఱిచెట్టుక్రింద కుండతో వంటజేసికొని భుజియించి యాచెట్టుక్రిందనే నిద్రించుచుండెను. ఒకనాడు చక్రవర్తి బంట్లు వానివెంట నంటి తిరిగియతఁడు స్నానమునకుఁ బోయినప్పుడు వానికిదెలియకుండమఱ్ఱిచెట్టెక్కి కూర్చుండిరి. తన్నెవ్వరుగనిపెట్టలేదను కొని యుగంధరుఁడు వంటజేసికొనుచుండెను. అంతలో నతని కావులింతవచ్చెనఁట. రాఁగానే యుగంధరుఁడనుమానపడి వింతలేనియావులింత యెన్నఁడు రాదని తన్నెవరో గనిపెట్టుటకు వచ్చియుండవచ్చునని యనుమానపడి పిచ్చివానివలె క్రిందికి పైకి యెగాదిగజూచి యెవరో చెట్టుమీఁదనున్నారని గ్రహించి వారు నిజముగా తన్నుపిచ్చివాఁడే యనుకొనునట్లుభినయింపఁదలచి యొక పెద్దకఱ్ఱపుచ్చుకొని పొయ్యిచుట్టు దిరిగి "గుడగుడశబ్దం కుండకు నష్టం" అనిపలుకుచు ఉడుకుచున్న యన్నముగల కుండను కఱ్ఱతో ఫడేలునగొట్టి చెక్కలుచేసి చింకిచాపలు చంకను బెట్టుకొని గుడ్డపేలికలు మీఁద వేసికొని మరల పట్టణమువైపు బోయెను. అదిచూచి రాజభటులతఁడు నిజముగాపిచ్చివాఁడే యని నమ్మి యతనినిఁగూర్చి యనుమాన పడనక్కరలేదని యధికారులతో జెప్పిరి. ఆమాటనమ్మి యధికారులుగూడ నిర్భ

యముగ నుండిరి. యుగంధరుఁ డెప్పటియట్లె పిచ్చిచేష్టలుచేయుచు "ఢిల్లీసులాన్ పట్టుకపోతాన్" అని పదములు పాడుచుండెను. అంతలో నొకనాఁడుదయమున యమునానదిలోనికి గొప్పయోడయొకటి వచ్చెను. అందువెలలేని రత్నములు వజ్రములు ముత్యములు కెంపులు పచ్చలు మొదలగు మణులుండెను. ఆయోడతోవచ్చిన వర్తకులు పట్టణమందు బసచేసి చక్రవర్తిదర్శనమునుఁబడసి తాము దూరదేశము నుండివచ్చినరత్నాలవర్తకులమనియు తమసరకులుచూచుటకు బేరములుచేయుటకు డిల్లీశ్వరుఁడుదక్క సమర్థులెవరు లేకపోవుటచే అక్కడికిరావలసివచ్చినదనియు జెప్పిరి. తమసరకులఁజూచుటకు, ఒకసారి యోడలోనికిరమ్మని చక్రవర్తినిబ్రార్థించిరి. ఆచక్రవర్తి వారిమాటల నమ్మి స్వల్పపరివారమును వెంటఁబెట్టుకొని, రత్నాలపరీక్ష జేయుటకై ప్రితాపరుద్రునిగూడ దోడుకొని యోడనెక్కెను. వారివెనుక పిచ్చివాఁడు "ఢిల్లీసుల్తాన్ నేఁడే పట్టుకుపోతాన్" అనిచేటలమీఁద వాయించుచు నోడ యెక్కెను. పిచ్చివాఁడుగదాయని వానిజోలికెవ్వరు బోరయిరి. అంతట వర్తకులు, అదివఱకెన్నడు నెవరుజూచి యెఱుంగని యమూల్యరత్నములను దెచ్చికన్నులు మిరుమిట్లుగొలుపునట్లు చక్రవర్తియెదుట పోసిరి. చక్రవర్తియువానియాప్తులును రత్నపరీక్ష జేయుచుండగా పిచ్చివానియాజ్ఞవల్ల చక్రవర్తికిఁ దెలియకుండగనే యోడ రేవు విడిచి బయలుదేఱి యతివేగమున యమునానదిమీఁదబోవసాగెను. సాయంకాల మగునప్పటికి చక్రవర్తి యోడపై చెక్కమీఁదికివచ్చి చూచి ప్రదేశము క్రొత్తగానుండుటచే మనమిప్పు డెక్కడనున్నామని యడిగెను. పిచ్చివాఁడంతకుమున్నె తనవేషముదీసివేసి యెప్పటియుగంధరుఁడై చక్రవర్తి యెదుట నిలిచి "ఇప్పుడు ఢిల్లీకి చాలదూరములో నున్నాము. నేనుప్రితాపరుద్రుని బంటునగు యుగంధరుఁడను. మా రాజును మీరు ఖైదీగాఁబట్టి తెచ్చినందుకు శాస్తిగా మిమ్మిప్పుడో

రుగల్లుకు ఖైదీగాఁబట్టుకొని పోవుచున్నాను. మీపట్టణమందుదిరిగిన తెనుఁగు దేశపు పిచ్చివాఁడను నేనే యని యుత్తరముచెప్పెను. ఆమాటలువిని చక్రివర్తి తెల్లబోయి భయపడగా యుగంధరుఁడు "దేవా! మీరు భయపడవద్దు. మీకుహానిచేయను. మిమ్మవమానింపనని య భయమిచ్చి ప్రతాపరుద్రునకు మంచిదుస్తులిప్పించి రత్నాలంకార ములు కిరీటము ధరియింపఁజేసి ఆయనను చక్రివర్తిని సమానముగా గౌరవించి సముద్రప్రయాణముముగించి యొకరేవులో దిగి రాజును చక్రివర్తిని యేనుఁగులమీఁద నెక్కించి యోరుగల్లు గొనిపోయెను. ఈమాటప్రజలకు ముందుగాదెలిసినందున వారు లక్షలకొలదిగా వీరికెదురుగాఁ బోయి తమరాజును తమకుఁదెచ్చుటయే గాక పైపెచ్చుచక్రివర్తిని ఖైదీగాఁ దెచ్చినందుకు మంత్రి యుగంధ రునకుఁ, గృతజ్ఞులై యాతని ప్రజ్ఞ బహువిధములఁగొనియాడి మహానం దభరితులైరి. యుగంధరుఁడు ప్రతాపరుద్రునకు మఱలపట్టాభిషేక ముజేసి పిమ్మట నెన్నోబహుమానములిచ్చి యెంతోగౌరవముతో చ క్రివర్తిని డిల్లీకి పంపెను. యుగంధరుని చరిత్రమతిచిత్రము. అతిపవి త్రము. యుగంధరుఁడు మూర్తీభవించిన రాజభక్తి. యుగంధరుఁడు పు రుషాకారము ధరించిన దేశాభిమానము. యుగంధరుఁడు తెనుఁగుదేశ మునకలంకారము. ఆతని చరిత్రము తలఁచుకొన్నమాత్రమున తెను గువారిమనస్సు లుప్పొంగును. శరీరములు పులకలెత్తును.

సమాప్తము.



# చమత్కారమంజరి

## రెండవభాగము.

## కోరందేవి

పదునాలుగు వందల నలుబదియారు గ్రామములకు నాయక మణియు ఆంధ్రసంస్థానమున కధిపతియునగు మాణిక్యరావునకు నవ రూపలావణ్యశీలయు, గుణసంపన్నయు నగు కోరందేవియను పుత్రి కారత్న మొండు గలదు. ఆంధ్రనగరమునబుట్టి యామె బాల్యమం తయు నచ్చటనె గడపెను. ఆయబల నేర్పరియగుటచే దర్పగాంభీర్యాది గుణసహాయమున దండ్రిని పూర్తిగవశపఱచుకొని, మంత్రి సామం తాది పరివారమునెల్ల గోట దాల్చి, తనయిచ్చవచ్చిన రీతిని రాజ్య తంత్రముల నడుపఁజొచ్చెను. ఆమె కులధర్మములు, కుటుంబధర్మ ములు చక్కఁగ నెఱిఁగినదగుటచే తండ్రిగృహమున కరుదెంచెడు నతిథి యభ్యాగతుల నాదరించు భారమంతయు తానె వహించెను. మాణి క్యరావు సంపన్నగృహస్థుఁడగుటచే నెందఱోయతిథులాతని గృహము పావనముచేయుచుండువారు. ఆతని గృహమున కరుదెంచెడు పరపురు షులు తాము సంచరించిన దూరదేశములు, మహానగరములు, నందలి యాచారములు మున్నగువాని గూర్చి చిత్రవిచిత్రములగు కథల దెలుపుచుండ కోరందేవి యుత్సాహసంభ్రమములతో నాలించుచుం డెడిది. ఆగృహమున కాలుబెట్టిన యతిథులందామె మన్ననల కానం దించనివారు లేరని చెప్పవచ్చును.

ఇట్లుండఁ గొండొకనాఁడు 1407 వ సంవత్సరమున నామె గృహ మున కొక వింతపురుషుఁ డరుదెంచెను. ఆతఁ డాప్రాంతమండలి వన

# చమత్కారమంజరి

రెండవభాగము.

## కోరందేవి

పదునాలుగు వందల నలుబదియేను గ్రామములకు నాయక మణియు ఆంధ్రసంస్థానమున కధిపతియునగు మాణిక్యరావునకు నపు రూపలావణ్యశీలయు, గుణసంపన్నయు నగు కోరందేవియను పుత్రి కారత్న మొండు గలదు. ఆంధ్రనగరమునబుట్టి యామె బాల్యమం తయు నచ్చటనె గడపెను. ఆయబల నేర్పరియగుటచే దర్పగాంభీర్యాది గుణసహాయమున దండ్రిని పూర్తిగా గవశపఱచుకొని, మంత్రి సామం తాది పరివారమునెల్ల గోట దాల్చి, తనయిచ్చవచ్చిన రీతిని రాజ్య తంత్రముల నడుపఁజొచ్చెను. ఆమె కులధర్మములు, కుటుంబధర్మ ములు చక్కగ నెఱిఁగినదగుటచే తండ్రిగృహమున కరుదెంచెడు నతిథి యభ్యాగతుల నాదరించు భారమంతయు తానె వహించెను. మాణి క్యరావు సంపన్నగృహస్థుఁడగుటచే నెందఱోయతిథులాతని గృహము పావనముచేయుచుండువారు. ఆతని గృహమున కరుదెంచెడు పరపురు షులు తాము సంచరించిన దూరదేశములు, మహానగరములు, నందలి యాచారములు మున్నగువాని గూర్చి చిత్రవిచిత్రములగు కథల దెలుపుచుండ కోరందేవి యుత్సాహసంభ్రమములతో నాలించుచుం డెడిది. ఆగృహమున కాలుబెట్టిన యతిథులం దామె మన్ననల కానం దించనివారు లేరని చెప్పవచ్చును.

ఇట్లుండఁ గొండొకనాఁడు 1407 వ సంవత్సరమున నామె గృహ మున కొక వింతపురుషుఁ డరుదెంచెను. ఆతఁ డాప్రాంతమందలి వన

ముంకెల్ల తేఁడు. ఆకారసౌందర్యాదులం దతఁడు నంతవరకామెగన్న పురుషులలో నొక్కనికిని సరిరాడు. గుణసంపదయం దేరికిని సదృశుఁడుగాఁడు. ఇట్టులయ్యు ప్రపంచమున నాతనికి సరివచ్చువారు లేరనునట్లు లాతనిఁ జూచినతోడనె కోరందేవి తనమనసంతయు నాతనిపై నిల్పి, యాతని దప్ప నొరుల బెండ్లాడరాదని మది నిశ్చయించి, పూర్తిగ నాతని వశమై వినయముతో భృత్యునట్ల సంచరింపఁదొడఁగెను. ప్రేమ గ్రుడ్డిదనుట సత్యమేయైనను నీమెప్రేమ యీదారి బట్టుటకు కారణము లేకపోలేదు. అందముచే ప్రఖ్యాతి గాంచకున్నను 'సాధు' యనుపేరుగల నీమన్నె దొర యధిక బలసమన్వితుఁ డనియు, రణశూరుఁడనియు, పౌరుషవంతుఁడనియు నలుదిక్కులఁ బేరుగాంచెను. సూర్యరశ్మి చొరని వనభూములందును, మనుష్యసంచార మెఱుఁగని కొండగహ్వరములందును నాతనిపేరుజెప్పిన మృగతతులు సయితము తల్లడిల్లక తీరదు. సింధుమహానది ప్రవహించు సుక్షేత్రములందు సైతము నీమహాబలశాలి యద్భుతపరాక్రమము పేరెన్నికగాంచెను. ఈతనిదండయాత్రలు నాగపురసీమకుఁ గూడ వ్యాపించినవగుటచే నాప్రాంతములందు గూడ నీతని భుజబలపరాక్రమముల చవిగొనని వారును, నీతఁ డజేయుఁడని యెఱుఁగనివారును లేరనియే తలంపవచ్చును. కోరందేవి మనసీతనిపైఁ దగుల్కొనుట కీతని ధైర్య, సాహస, భుజవిక్రమములుదప్ప వేఱొండు కారణము లేదు.

ఈశూరశిఖామణి యద్భుతక్రియల నెన్నిటినో మాణిక్యరావు వినియుండెను. అందుచేతనే యతఁడు శత్రురాజుల జయించి, ధనరాసుల గొల్లగొని, తన వనగృహమును బ్రవేశించు సమయమున మాణిక్యరావాతనిఁ దన 'యాంధు' నగరమునకు విచ్చేయుఁడని యాహ్వానము నంపెను. ఈయాహ్వానము నంగీకరించి యాతఁడు వెంటనే యచ్చట కరుదెంచెను. ఇట్లరుదెంచిన 'సాధు'ను గన్నతోడనె కోరం

దేవికి మదనవికారము జనించెను. ఆమె ప్రేమ నిజమైనదగుటచే తల త్రోక లేక హద్దుమీరియుండెను. ప్రేమానుబంధబీజము లోనంకురించిన దాదిగ నారాణి చురుకుదన మంతయు నంతరించెను; పూర్వపుటుత్సాహము వెనుకదారి పట్టెను. ఇంతటి మహాబలశాలిని బెండ్లాడఁదలంచుటయం దేదోషము లేదనుట నిశ్చయము. ఆమె యిచ్చవచ్చిన మహాపురుషు నెన్నుకొనుట ధర్మమనుట తథ్యము. ఒక్కసంగతి మాత్రి మాలోచింపవలసియున్నది. ఆమె తండ్రి యిదివరకె రహతూరువంశపు యువరాజున కొకని కామెనిచ్చి వివాహముచేయ నిశ్చయించి ప్రధానముకూడ గావించియుండెను.

సాధు వచ్చుటకొకటి రెండు దినములకుముందు 'మునిధరు' రాజకుటుంబమున జనించిన రహతూరువంశస్థుఁడగు యువరా జొకం డామెను వివాహమాడదలంచి వచ్చెను. పచ్చని మేనికాంతులచేతను నెనలేని సంపదచేతను నొప్పు యాసుందరపురుషుఁ డాకాలమున నామె కన్నులకు చందమామవలె నుండుటచే నాతని బెండ్లాడుట కామె యంగీకరించెను. సాధు అను పేరఁ బరగెడు నీమన్నెదొర రాకున్న నామె యాతని పెండ్లాడియుండును. ఆరహతూరువంశస్థుఁ డన్నివిధముల నామెకుఁ దగిన వరుఁడైనను, సాధును జూచినది మొదలు కోరందేవికి రహతూరువంశస్థునిపైఁబుట్టిన యనురాగమడంగిపోయెను ఇట్లు కోరందేవి విచారముఁబడి ముఖవిలాసముఁ దక్కి నిరుత్సాహముతో మసలుచుండ, తండ్రి యావిచారకారణ మారయఁగోరి కుమార్తెను సమీపించి మెత్తని మనసుతో నామెం జేరదీసి మెల్ల మెల్లగ చమత్కారముగ ప్రశ్నింపఁదొడఁగెను. తండ్రికి తనయెడగల ప్రేమానురాగ మెఱిఁగినదగుటచే నాదేవినెమ్మదిగ తన విచారకారణ మెఱిఁగించి తన కామన్నెదొరపైఁ బుట్టిన గాఢానురాగము మళ్ళునది గాదని నిట్టూర్పులఁ బుచ్చుచు దెలిపెను. ఆకథావిధాన మంతయు

సవిస్తరముగఁ దెలిసికొని మాణిక్యరావు మోసమువాటిల్లెనని తలంచి కుమార్తె నిశ్చితాభిప్రాయము నెట్టులైన మరలింప మది నిశ్చయించి యామెతో నిట్లు సహేతుకముగ ముచ్చటించ నారంభించెను.

'అమ్మా! నీప్రేమ సరియైనది కాదని నాయభిప్రాయము. నీవీవిషయమున బాగుగ నాలోచించితివికావు. వాగ్దానముచేసిన పిమ్మట దానిని మన్నింపక వేఱువిధముగ వర్తించుట మనవంటి మర్యాదగల గృహస్థులకు తగినపనికాదు. నిన్నురహతూరు వంశస్థుఁ కిచ్చెదనని వాగ్దానము జేసియుంటిని. ఇప్పుడు మాటదప్పి సంచరించు నెడల నాతఁడు మన కుటుంబముపై కక్షవహించి కసిదీర్చుకొనఁ జూచును. నీవెట్లైన నామాటపాటించి యీక్రొత్తప్రేమను త్యజించి రహతూరు వంశస్థునే పెండ్లియాడి నాపరువు దక్కింపుము.'

ఈమాటలువిని కోరందేవి, తండ్రీ! నన్ను క్షమియింపుము. నేనీవిషయమున నీమాట మన్నింపఁజాలను' అని ప్రత్యుత్తర మిచ్చెను. అంతట మాణిక్యరావు కొమార్తె నొడిలో, బరుండఁ బెట్టుకొని యామెశిరోజములు మెల్లగ జమురుచు, నిట్లు పలికెను. అమ్మా! కొంచెమోపికబట్టుము. ఇప్పుడు నీమనమం దంకురించిన ప్రేమబీజము ఈసాధు మనగృహముఁ విడచి తనయరణ్యగృహము నకుఁ బోయినతోడనె తప్పక పోఁగలదని నాయభిప్రాయము.'

ఈమాట వినినతోడనె యాదేవిచివాలున లేచి తండ్రిపాద ములపైఁబడి యేడ్చుచు నిట్లనెను.

"తండ్రీ! నేను రహతూరు వంశస్థునిఁ బెండ్లాడఁజాలను నాకెవ రిపై మక్కువగలదో యాతని వరించుట ధర్మము. నాకీసాధుపై గాఢానురాగ ముదయించెను ఈతనిదప్ప నేనొరులఁ బెండ్లాడఁజాలను మీరెన్ని జెప్పిన నాకు రుచించదనినఁ గోపించకుఁడు ఈతనిఁబెండ్లా డక తప్పదు నాప్రేమ యిట్టిదట్టిదని జెప్పఁజాలను ఈతనిఁబాసి

నేనొక్కనిముసమైన బ్రతుకఁజాల మీరేట్లులైన నన్నీతనికిచ్చి వివాహముచేసి యీతనితోఁ బంపుఁడు; వెయ్యేల! తండ్రీ! ప్రేమ-ప్రేమ; దీనింగూర్చి నేనింకేమి చెప్పఁగలను?

ఇట్లు దుఃఖించు కుమార్తెను జూచినతోడనే మనసుకరగి మాణిక్యరావుఁ జేయిబట్టి ఆమెను లేవనెత్తి యామెతో నీయిచ్ఛవచ్చినట్లే జేసెదనని వాగ్దానము జేసెను. పిమ్మట నతఁడు మఱుదిన ముదయమున సాధుయొద్దకుఁబోయి యాతనితో తనకుమార్తె కథనంతయు మరుగువెట్టక దెలిపి తనకుంగల చిక్కు నెఱిఁగించెను. ఆమె ప్రేమను గూర్చి వినినతోడనె సాధు సంతోషభరితుఁడై ఆమెవంటి గుణశీల ధైర్యశాలి భార్యయగుటకంటె వేఱుభాగ్యములేదని తలంచెను. కాని, యుదారచిత్తుఁడగుటచే మాణిక్యరావు యవస్థకుఁ జింతించి, సాధు, తనచేత నగునెడల నాతని దుఃఖవిమోచనముచేయ నిశ్చయించుకొనెను. మునిధర కుటుంబమునఁబుట్టిన పృథ్వీశ్వరున కామె నిచ్చి వివాహముచేయ నిశ్చయింపఁబడి యుండుటచే మాణిక్యరావుకు మాటదప్పుట పాటిగాదని తలంచి సాధు గౌరవ సమన్వితముగ నిట్లుబలికెను. "ఓ రాజా! నీకిష్టమగునెడల నీ పుత్రికను జూడకయె నేనీతావు విడచిపోయెదను. నీయింటికతిథినై వచ్చి భుజియించి నీకు చెరుపుదలంచుట భావ్యముకాదు. నేనెన్నఁడట్లు దలంచువాఁడగాను. సెలవైనఁ బోయెదను.

ఇట్లనిన సాధుతో మాణిక్యరా విట్లుబదులు చెప్పెను. అయ్యా! మీరు కొల్లగొనిన ధనరాసులతో వనరాజ్యముచేయుటయే ధర్మమని తలంచెదను నాకుమార్తె నిశ్చితభావ మెత్తెరంగుననుండునో చెప్పఁజాలను. ఆమెయేదోయొక తీర్పుజేసుకొను పర్యంతము మీ రోపికఁబట్టి వనభూములందలి మీమందిరమున వేచియుండుఁడు. ఆమె సందేశమును మీరతి శీఘ్రముగ వినఁగలరు.

ఈసంభాషణ జరిగినపిమ్మట సాధు పయనమై తనదారినిఁదా బోయెను. కాని యతఁడుగృహమువిడిచిపోయిన మాటవిననతోడనె కోరందేవి యాతనివెంటనె నొకసందేశమంపెను. ఆతఁడిల్లు జేరులోపల నామెభటుఁడు ఆతనిం గలిసికొని కోరందేవియొక్క యీదిగువ సందేశమెఱిఁగించెను.

నానిశ్చితాభిప్రాయము ప్రపంచము తలక్రిందైనను మారునదికాదు. ప్రేమకు హేతువాదములతోఁ బనియేమి? అదితనంతఁబుట్టి యొరులపాలగును. నామనసిపుడు దుఃఖభాజనమైయున్నది. నాతండ్రి మెత్తనిహృదయమునకుఁ గంటకమున్నైనొప్పిగలిగించితిని. నేనునీసొమ్ము. నన్నుగాక యొరులఁ దలంచుట పాదిత్యమని యెఱుంగుము భారమునీయదియ; గనుక నిటవచ్చి భార్యం గైకొనుము.

మాణిక్యరావు, కుమార్తె మాట కెదురాడఁ జాలఁడు. ఆమెమనసునొప్పించనొల్లఁడు. అందుచే పట్టుదలతోనున్న కుమార్తె యభిమతము సిద్ధింపఁజేయుటకే తుదకాతఁడును సంకల్పించుకొనెను. కుమార్తె యభిప్రాయమునకు వ్యతిరేకముగ సంచరించి యామెకు బలవంతముగ వివాహముచేయుట కిష్టములేక మాణిక్యరావు మునిధ రకుటుంబమున జనియించినరహతూరు రాజునువిడచి యొకకొండరాజుయల్లుఁనిగఁ బడయనిశ్చయించుకొనెను. ఇట్లుచేయుటచే రహతూరురాజువలన తనకు హానివాటిల్లునని గూడ యతఁ డెఱుంగును. మాణిక్యరావునకు కోరందేవితప్ప వేఱుసంతానము లేనందున నెట్లులైన నామె వివాహము జయప్రదముగఁ జేసి యారాజపుత్రిక గౌరవమునకు తగినట్లు వెలలేని యాభరణములు, సారెచీరలు మున్నగునవన్ని యునిచ్చుట కాతఁడు నిశ్చయించుకొనెను. ఇట్లు నిశ్చయించుకొనిన పిమ్మటనాతఁడు సాధునురావించి వివాహముచేసి కుమార్తెకు బంగారుయాభరణములు, వెండిపాత్రలు, బంగారునంది, పెట్టెలకొలఁది చీని

చీనాంబరములు మున్నగున వెన్ని యోకానుకలుగనొసంగి భర్తయింటి కిఁబోవునపు డామెతో చురుకుతనము, తెలివితేటలుగల 13 గ్గురు దాసీజనులఁగూడ నంపెను. కాని రహతూరు రాజపుత్రుని నిరాకరించినందున మాణిక్యరావునకు మనసున భయముమాత్రము వదలలేదు. అందుచేతనే వధూవరులు తనగృహము విడిచిపోవునపుడు వారితోన తఁడు తగినంతమంది పరివారమును సాయముగఁ గొనిపొమ్మని సల హానిచ్చెను. మామగారి సలహాకు సాధు నవ్వి తనయొద్దనున్న 700 మంది పరిజనము మార్గమధ్యముగ నెంతటి శత్రు వడ్డుకొనినను తృటిలోజయింపఁజాలుదురనియు తనకు వేఱుసాయ మక్కఱలేదనియు గర్వముతోఁ బలికెను. కాని, తనకు మాణిక్యరావు చేసిన పరాభవమునకు, కోరందేవిజూపిన యనాదరణమునకు నొడలుమండి రహతూరురాజా దంపతులపై కసిదీర్చికొన నిశ్చయించి మిక్కిలి బలశాలురగు 400 మంది భటులతో దారికాచి ఛాదానను ప్రదేశమునవారిరాక కెదురుచూచుచుండెను. సాధువచ్చుటనున్న శత్రుపరివారమునుజూచినతోడనే యుద్ధముతప్పదని నిశ్చయించెను. రహతూరు వంశస్థులు పౌరుషవంతులు, రాజనీతిగలవారునగుటచే నారాజు తనపెద్దసేనతో నొక్కమారుగ సాధుపైఁబడి యుద్ధముచేయుట యధర్మమని తలఁచి సాధుతో నిరువురి సేనలందలి బలశాలులకు ద్వంద్వ యుద్ధము గల్పించియుద్ధము సాధుదగ్గర బంధువగు జయసింగునకును రహతూరు సేనయందు తలమొదలు పాదమువఱకు నొక్కటే కవచము ధరించిన మరియొకరణశూరునకు జరిగెను. కాని యందు రహతూరు వీరుఁడు చెట్టుకూలినట్లుకూలిపోయెను. పిమ్మటనిట్టిద్వంద్వయుద్ధములుమఱికొందఱుబలశాలులకుగూడజరిగెను. కానియొకమారు సాధుపక్షమువాఁడు నింకొకమారు రహతూరుపక్షమువాఁడు పరాజయ మొందుటఁజూచి యిట్లుజయాపజయముల నిర్ణయించుట దుర్ఘటమని దలంచి యిరుపక్ష

ముల నాయకులు నీవిధానమును గట్టిపెట్ట గుంపుయుద్ధముచే జయాప జయాముల నిర్ణయింపఁజూచిరి. కాని యాపద్ధతిగూడ తృప్తిగనుండ నందున జయాపజయముల నిర్ణయింపఁజాలక తుదకు పరిముఖులగు నె రుకకులనాయకులు యుద్ధమునకు స్వయముగ డీకొన నిశ్చయించిరి. అంతట సాధు గనచముధరించియాయుధహస్తుఁడై సింహప్రఁగొాద మచండమున కన్నులగ్నికణములు గురియ భయంకరాకారములతో హాహాకారములఁ జేయుచు శత్రుసేనఁజొచ్చి తన యందుబాటులోను న్న వారినెల్లనొక్కొక్క వేటున యమపురమున కంపుచు రహతూరు సేనను భీభత్సము జేయ నారంభించెను. దూరమున నొకతేరుపైఁగూ ర్చుండి కోరందేవి తన భర్త యొక్క శౌర్యగాంభీర్యాదుల కచ్చెరు వడి చూచుచుండ నతఁడు రెండుమారులు శత్రుసేనను భీభత్సముపాలు జేసి యొక్కగాయమైన తినకుండ మరల వెనుకకువచ్చి తనసేనఁ జేరఁ గలిగెను. అప్పటికి సాధుసేనలో సగమును రహతూరు సేనలో నారు వందల మందియు మృతులైరి. అంతటసాధుమూడవమాఱు శత్రుసే నఁదాకునపుడు శత్రుసంహారమో తనమృతియో నీమారుజరిగినఁగా ని వెనుకకు రానని శపథముపట్టి తనదేవియొద్దకు సెలవుగైకొనఁబో వనామె యాతనిమరింత యుత్సాహపెట్టి యుద్ధమునకే ప్రోత్సాహప రచుచు నిట్లుబలికెను:—"ప్రియుఁడా! నీసాహసమెట్టిదో చూచుభా గ్య మీదినమున గలుగఁగలదు. నీవు మృతినొందునెడల నేనుగూడ నీతో జమునంతిపురికి వచ్చెదను.

పిమ్మట నిరుపక్షముల నాయకు లొండొరుల దాకి యతి ఘోరముగఁ బోరాడునప్పుడు బరువగు సాధుఖడ్గపువేటువలన రహ తూరుఁడుకంఠము తెగికూలుటయు రహతూరుని తీవ్రనిశాతాసిచేసా ధుఁదల ఖండింపఁబడుటయు నొక్కమారుగ జరిగెను. కాని సాధుకు తగిలిన గాయము తీవ్రమైనదగుటచే నతఁడు మరణబాధపడుచుండ,

రహతూరుఁడు తనగాయమంత కఠినమైనది కానందున నందుండిపరి వహించు రక్తపరివాహముచే మూర్ఛఁజెంది పడియుండెను. అంతనీ యుద్ధమున కంతకు మూలకారణమగు కోరందేవితనభర్తయగుసాధుని సమీపించి ప్రాణమువిడుచుచున్న యాతని ముఖము నవలోకించి ప లు తెరంగుల విలపించి విచారము కోఁ బనిలేదని నిశ్చయించి ఖడ్గము దీసి ధైర్యముతో తనయెడమభుజమును ఖండించుకొని భటునొ కనిఁ బిలిచి:

"దీని నీయరణ్యమధ్యమున నివసించు నాప్రాణనాయకునితం డ్రి యొద్దకుఁ గొనిపోయి వానితో మీరుజూడ నోచుకొనిన కోడలి పరిభావ మిట్టిదని యెఱిఁగింపుఁడు. అనిపలికెను.పిమ్మట భయకంపితు లైనిలిచియున్న తనభటులఁజూచి వారిలో విశ్వాసముగలవాని నొ క్కనిఁ బిలచి తనకుడిభుజమును ఖండించుమని యుత్తరువుచేసెను. వాఁడట్లు చేసినతోడనే వానితోనామె యిట్లుపలికెను. "దీనిగొనిపో యినాతండ్రికిమ్ము. దీనితోఁగూడ నాతఁడిచ్చిన వస్తువాహనములను, సాహెచ్చీ రెలను నాతని కప్పగించి కుమార్తె తెఱఁగంతయు నెఱిఁగించి విచారింప వలదని పలుకుము" పిమ్మట నామెభర్త చనిపోయిన తా వున చితి బేర్పించి యందు చనిపోయిన భర్తతోఁదానుగూడఁ బ్రవేశించి యగ్నిహోత్రమున కాహుతియై ప్రాణముల విడచెను. రహతూరుని గాయముతత్కాలముగ నప్పుడు కుదిరినను ఆఱు మాస ములైన పిమ్మట చీము పట్టి వృద్ధియగుటచే నతఁడును జాడ్యపీడితుఁ డై చనిపోయెను.



# పోర్చుగీసు సోదరులు

పదునాఱవ శతాబ్దమున పోర్చుగలు దేశము నాగరికతయందు ను వాణిజ్యమందును తక్కిన యూరపుఖండ దేశము లనేకముకంటె ప్రఖ్యాతిఁగాంచి యున్నతదశయందుండెను. ఈ పోర్చుగలువారు మ న దేశముతో విరివిగ వర్తకము జేయుచుండెడివారు. మన దేశమున వీరు గోవా మొదలగు గొప్పపట్టణముల సంగ్రహించి వానిని వర్తక ప్రదేశములుగఁ జేసికొనియుండిరి. పశ్చిమతీరమున నీగోవానగరమె వా రి వాణిజ్యమునకు ముఖ్యపట్టణము. ఈపోర్చుగీసు వారె మన దేశమున కు సముద్రముపై సమీపమార్గమును గనిపెట్టిరి. ఈ 16వ శతాబ్దప్రా రంభమున పోర్చుగలు రాజ్యమునకు ముఖ్యపట్టణమగు లిస్బనుపట్టణ మునుండి మన దేశమందు వారియైశ్వర్యమునకెల్ల ప్రధాన పట్టణమగు గోవానగరమునకు సరకులతోనిండిన వర్తకపు యోడలెల్లప్పుడువచ్చు చుండెడివి. ఒకసమయమున నొక యోడపై 1200మంది పోర్చుగీసు వారు ప్రయాణమైవచ్చుచుండిరి. ఇందున్న వారిలో నావికులు బాట సారులు మాత్రమెకాక మతగురువులు బోధకులుగూడ ననేకులుండిరి. వీరిప్రయాణము ప్రారంభమున నుత్సాహదాయకముగనుండెను. కా ని ఆఫ్రికా దేశపు దక్షిణపుకొనయందున్న 'గుడుహోపు' యనుగుడ మునుదాటి యోడ తూర్పుముఖమై హిందూ దేశమువైపునకు గొంత దూరము ప్రయాణముచేసినతోడనె సముద్రమందలి యొకకొండకు తగిలి బ్రద్దలై, నీరుపోసికొని మునుగనారంభించెను. అంతటదాని యందలి ప్రధాననావికుఁడు గతియేమియుఁదోచక నోడకుఁగట్టియున్న చిన్నపడవను విప్పి యందు రొట్టెలుమొదలగు నాహారపదార్థములఁ బడవైచి 19గురు జనములతోఁ దానందు దుమికెను. ఈదుమికినవారంద రు చేతఖడ్గముల దాల్చియుండిరి. నీటఁబడి మునిగిపోవుచున్నతక్కిన వారుగూడ ప్రాణముల సంరక్షించుకొనదలంచి యాపడవపై కెగబ్రా

కఁజూచిరి. కాని పడవయందలి 19గురు కత్తులతో వారినెల్ల బెదరఁ గొట్టి యొక్కరిని జేరనియ్యక వడివడి పడపనుగెంటుకొని హిందూ మహాసముద్రమున ప్రవేశించి ప్రయాణము చేయ మొదలు పెట్టిరి.

వీరిపడవకు చుక్కానిలేదు. ఏదిక్కునకుప్రయాణము చేయుచున్నది తెలిసికొనుటకు యంత్రసహాయములేదు. త్రాగుటకు వీరికి మంచినీళ్లులేవు. దైవవశమున వర్షముకురిసిన నోరుతడుపుకొనవలసినదే కాని వీరికి మరియేయాధారములేదు. వీరుకొంతదూరము ప్రయాణముచేయునప్పటికి పెద్దయోడ సంపూర్ణముగ మునిఁగి యందలి జనులెల్ల జలమరణము నొందిరి. ఈచిన్నపడవయందలివారు విసుఁగు విరామములేక నాలుగుదినములు దివారాత్రములు కష్టపడి పడవను నడుపునప్పటికి రోగముతోనున్న ప్రధాననావికుఁడు కాలధర్మమునొందెను. ఇతని మరణమునలన తక్కినవారికి ధైర్యము చెడెను. వారియందొక్కరును నావికావృత్తినెఱుఁగరు. పడవను నడుపఁగల సామర్థ్యమొక్కరికిలేదు. అందుచే వారియందు కలవరముబుట్టి యెవరికి వారె పెత్తనము వహింపఁ బ్రయత్నించిరి. పెత్తనముచేయదలంచువారెకాని వినువారొక్కరు లేనందున కొంతకాలముపోరాడి తుదకందఱు నొకనిబెద్దగనేర్పరచుకొన సమ్మతించి ఉన్నవారిలో బుద్ధిమంతుని ప్రధాననావికునిగఁ జేసికొనిరి. పడవయందలి యాహారపదార్థములు తగ్గిపోవుచుండెను. ఆపదార్థములున్నవారికి పట్టుమని పది పనములకైన చాలవు. ఎన్నిదినములు ప్రయాణము చేయవలెనో దైవమునకేగాని యొరుల కేరికిఁ దెలియదు. అందఱు చనిపోవుటకంటె కొందరు బ్రతికినను మంచిదేయని యెంచి క్రొత్తప్రధాననావికుఁడు చీట్లువేసి చీట్లలో ప్రతినాలుగవచీటియందలి పేరుగలవానిని సముద్రమున త్రోసివేసినయెడల మిగిలిన యాహారముతో తక్కినవారు మరికొంత కాలము బ్రతుకబెనుగులాడవచ్చునని పలికిరి. అందఱందుకు సమ్మ

తించిరి. పడనయందిపుడు 19 గురుగలరు. వీరిలో మతబోధకుఁడొ కఁడును, వడ్రంగి యొకఁడును గూడగలరు. మతబోధకుఁడు చనిపోవు వారికి మంత్రిములఁజదివి, ముక్తిమార్గము జూపఁగలఁడు. వడ్రింగిపడవ కెచ్చటరంధ్రముపడినను బాగుచేసి యున్నవారి కుపకారము చేయఁ గలఁడు అందుచేవీరిరువురి ప్రాణములు విలువగలవే వీరిరువురు బ్రతికి యుండుటావశ్యకము. ఈసంగతులనెల్ల పడవయందలివారు తమలోఁ దాముచర్చించుకొని పైముప్వురవిడచిపెట్టి తక్కినవారిలో చీట్లువేయ నిశ్చయించుకొనిరి. పాపము ప్రధానవికుఁడుగూడ మిగిలిన 16గురి లోఁజేర ప్రియత్నించెనుగాని వారెల్ల రతని బ్రతిమలాడి నిలిపివేసిరి. అందుచే మిగిలిన 16 గురిలో నలుగురు చావవలసి వచ్చెను. ఈనలు గురిలో ముగ్గురు దైవమును ధ్యానించి మరణమునకు సంసిద్ధులై నిలు వఁబడిరి. నాలుగవపోర్చుగీసువానికి ఆపడవలోనె యొకతమ్ముఁడు గల డు. ఆతమ్ముడు తనయన్నగారిదుర్దశకు వలవలనేడ్చి పట్టరాని దుఃఖ ముతో నన్నను గౌఁగలించుకొని యతనిపక్షమున తాను ప్రాణముల విడచెదననియు నందుకు సమ్మతింపుమనియు పరిపరివిధముల బ్రార్థిం చెను. అన్నగారికి భార్యయు, బిడ్డలుండుటచేతను తమకు ముప్వురు సోదరీమణులుండుటచేతను వారికెల్లపోషకుఁడగునన్న బ్రతికి యుండు టావశ్యకమనియు, ఒంటరియు బ్రహ్మచారియునగు తాను ప్రాణము లు విడచిన విచారింపబనిలేదనియు నతఁడు జెప్పవినువారలకు నన్న కుఁగూడ నద్భుతము గలిగెను. సద్గుణశీలుఁడగు తమ్ముని యుదారబు ద్ధికి సంతసించి యాతనిమాటలచే మనసుకరఁగి యన్నగారుతనపక్షము న నట్టిబుద్ధిమంతుని, నట్టిప్రేమగలవానిని ప్రాణములు విడువనిచ్చుట యక్రమము, నన్యాయమనితలంచి యందుఁకియ్యకొనఁడయ్యెను. అ న్నగారు తమ్మునితో తనయాస్తినంతయుఁ దీసికొని, భార్యనుబిడ్డలను సోదరీమణులను దయతోఁజూడుమనియు, తానేజలమరణమునొందెదని

యుఁ బలికిఁతమ్మునిచావునకు సమ్మతింపఁడయ్యెను. కాని, తమ్ముని ప్రేమయపారమగుటచే నీమాటల విన(జాలక యతడన్నపాదములపైఁ బడి తనప్రార్థన మంగీకరింపఁబడువరకు విడువఁడయ్యెను. పడవయందలి వారెల్ల లాగినను లక్ష్యముచేయక భ్రాతృభక్తియే ప్రధానముగనెంచి మూర్ఖపుపట్టుతోనుండిన యాచిన్నవాని బుద్ధినెవ్వరు మరలింపజాలరైరి అన్నయు తుదకుసమ్మతించవలసివచ్చెను. పిమ్మట నీతని పడవనుండి యందలివారు త్రోసివేసిరి. కాని యీతయం దసమానప్రజ్ఞగలవాఁడగుటచే నపుడు వడిగ నీదుకొనివచ్చి పడవను కలసికొని చుక్కాని పైఁ జేయివేసి పట్టుకొనగా నావికుఁడొకఁడా చేతిని ఖడ్గముతో ఖండించెను. అంతట నాచేయిబోవ సముద్రమునబడి యతఁడు రెండవ చేతితోఁ మరలనీదుకొనివచ్చి చుక్కానిపై యాచేతినుంచెను. కాని నిర్దయహృదయుఁడై యానావికుఁడు మరల దానిగూడ ఖండించెను. ప్రాణముపైదీపి మెట్టిదోగాని పాపమతఁడు మొండిచేతులతోడను కాళ్ళతోడను నీదనారంభించెను. ఇతనికిఁగల భ్రాతృప్రేమయు, ప్రాణముపైఁదీపియుఁ జూచినతోడనె మనసుకరగి పడవయందలివారు 'పాపమతని నొక్కనినెటులైన రక్షింతము ఒక్కడేగదా' యని తలపోసి, వానిని పడవయందెక్కించుకొని యచ్చట వీలగు విధమున నాతని చేతులకుఁ గట్లుకట్టిరి. మఱియొక దినమిట్లు ప్రయాణముచేసిన పిదప దైవానుగ్రహమున వారికిభూమికనఁబడ నొకకొండదరికిఁ జేరిరి. ఆ కొండ యాఫ్రికాదేశపు, 'మొజాంబికుకొండ' దాని సమీపమున పోర్చుగీసువారి. కాదేశమున వలసరాజ్యముగలదు. అందుచే ధైర్యము దెచ్చుకొని వారచ్చటనిలువ "లిస్బను" నగరమునుండి పోవువర్తకపు యోడ యొకటి వారి కగపడెను.ఆయోడలోనివారు వీరియవస్థనెఱిఁగి దగ్గరకువచ్చి వీరి నెక్కించుకొని సురక్షితముగా గోవానగరముజేర్చిరి. భ్రాతృప్రేమకు ప్రసిద్ధిగాంచిన సోదరులు తమవృత్తాంతమంతయు

/

గోవాయందున్న లింఖోర్టు దొరకు సవిస్తరముగ నెఱిఁగించిరి, వారి భాతృప్రేమ మెట్టిదో చూఁడు!

# అపకారికి నుపకారము

ఇటలీదేశ మొక ద్వీపకల్పము ద్వీపకల్పమనగా నొకప్రక్క తప్ప తక్కిన మూఁడుప్రక్కల జలపరివృతమైన దేశము. ఈదేశము యూరపు ఖండమున దక్షిణభాగమున నున్నది. ఇది పూర్వకాలమున తక్కిన యూరపుఖండదేశములు పేరుప్రతిష్టలు లేక, నాగరికత యనునే మొయెఱుఁగక మిక్కిలి తక్కువస్థితియందున్నప్పుడె, సుప్రసిద్ధమగు నాగరికతచేతను, అసమానమగు విజ్ఞానముచేతను, వెలలేని యైశ్వర్యముచేతను వన్నెకెక్కి యూరపుఖండమంతకు సుజ్ఞానకాంతుల వెదజల్లుచు ప్రభాకరుమాడ్కి భాసిల్లుచుండెను. ఈదేశము పూర్వ మొకకాలమున చిన్న చిన్న రాష్ట్రములక్రింద విభజింపబడియుండెను. అట్టిస్వదేశరాష్ట్రములందు జినోవారాజ్య మొకటి కలదు. ఇందు ప్రజాపరిపాలనము సుప్రసిద్ధముగ జరుగుచుండెను. కొంతకాల మీరాజ్యము ధనికులు, భాగ్యవంతులు, సత్కులవంతులు, గొప్పకుటుంబీకులు నగు ప్రభులచే పరిపాలింపఁబడెను. కాని వారు తమయైశ్వర్యమున కన్నుగానక, ప్రజాభిప్రాయముల మన్నింపక, జనకంటముగ పరిపాలించుటచే వారియధికార మంతరించుటయు, ప్రజలే రాజ్యభారమూని తమప్రతినిధుల నేర్పఱచుకొని వారిమూలమున రాజ్యముచేయుటయు సంభవించెను. ఈప్రజారాజ్యమునకెల్ల మూలపురుషుఁడు 'యుబర్టో' యను ప్రసిద్ధనాముఁడు. ఇతఁడే ప్రజానాయకుఁడు. ఇతనియందే ప్రజలందఱకు నిండువిశ్వాసము కలదు. ఇతఁడొక బీదగృహస్థుని పుత్రుఁడు. బాల్య

మున దరిద్రమును పూర్తిగ చవిగొన్న నీతఁడు తనబుద్ధి సంపదచే తను, తెలివితేటలచేతను, పట్టుదలచేతను, పూనికచేతను సకలకష్టములపడి యోరిమితో పనిచేసి నానాటనైశ్వర్యసంపన్నుఁడై యచ్చటివర్తకశ్రేష్ఠులలో నొకఁడై తనకుటుంబమునకు కీర్తిదెచ్చెను. ప్రజలు రాజ్యమూనుటయు, నందు ముఖ్యముగ ఉబర్టో యను తక్కువకులస్తుఁడు, బీదకుటుంబీకుఁడు నధికారమువహించుటయుఁ జూడప్రభువర్గమునకెల్ల కడుపు మంటగనుండెను. ఉబర్టో యెంతన్యాయబుద్ధితో రాజకార్యముల చక్కబెట్టుచున్నను ప్రజారాజ్య మెంతజనరంజకముగనున్నను ప్రభువర్గమునకు మాత్రము తృప్తియు మనశ్శాంతియు లేదయ్యెను. మనమున కక్షవహించియున్న ప్రభువర్గమువారు ప్రజాపరిపాలకులపై నపవాదములఁ బుట్టించుచు, మాయోపాయములచే తుదకు వారి నోడించి తాము మరల రాజ్యపరిపాలనమును సంపాదించిరి. తమకధికారమువచ్చినతోడనే, మరల మున్నెన్నడు బ్రజలు తల యెత్తకుండునటులఁ జేయనెంచి ప్రభువులు తమజయమును దుర్వినియోగముచేయ మొదలిడిరి. వీరు ప్రజానాయకుల బట్టి హింసించనారంభించిరి. నిరంకుశాధికారముపై నాసగల దుర్నీతిపరుల ప్రవర్తనమే దేశమందునేకాలమందు నిట్లేయుండును. జినోవా రాజ్యమందలి ప్రభువర్గము కక్షగట్టి ప్రథమమున ఉబ్టోను బట్టుకొని యతనియాస్తినంతయు నపహరించి, పిమ్మట దేశమునుండి వెడలఁగొట్టిరి. అంతటితో నతనివిడిచిపెట్టుటయే వారతనికి చేయఁగలిగిన మహోపకారము నిన్ను దేశభ్రష్టుని చేయఁదలఁచితిమి. నీవీ రాజ్యమును! విడిచిపొమ్ము. ప్రవాసగతుని జేసి యింతటితో విడిచినందుకు సంతసింపు'మని తెలుపుటకే వారతని దోడ్కొనిపోయి జినోవా పట్టణమందలి ప్రధానన్యాయాధిపతిముందు నిలువఁబెట్టిరి. ఆకాలమున నచట 'ఎడోర్నో'యనునతఁడు న్యాయాధిపతిగనుండెను. సహజముగ మెత్తనిహృదయముకలవాఁడై

నను ప్రభువర్గములోనివాఁడు, అధికారకాంక్షగలవాఁడు నగుటచే నతఁడు తన యహంభావమును, నధికగర్వమును నడఁచుకొనఁజాలక ఆగ్రహముచే నదరిపడుచు ‹ఉబర్టో›ను చూచినతోడనే యిట్లుబలికెను "దరిద్రగొట్టు కుటుంబమున బుట్టిన నీచుఁడవు, నిర్భాగ్యుఁడవునగు నీవు,యీజినోవాపట్టణమందలి,ప్రభువర్గమువారము,ధనికులముఁ నైశ్వర్యసంపన్నులము, యశోవంతులము నగుమమ్ము నీకాలిక్రిందనడఁగఁ ద్రొక్క సాహసించితివి. కాని, ప్రభువర్గము నిన్ను కటాక్షించిరి. నీకు ప్రవాసశిక్ష విధించితిమి పొమ్ము నీవెట్టిదరిద్రమునుండి యెట్టి హైన్యమునుండి తలయెత్తితివో మరల నాగతియే నీకు దిక్కు కాఁగలదు. అదియే నీకు తగినది పొమ్ము"

ఈమాటలు వినినతోడనే ‹ఉబర్టో› వినయ గౌరవములతోఁ దల వంచుకొని ‹అయ్యా! మీరాడిన కఠినోక్తులకు వగవ వలసిన కాలము ముందు రాగలదు" అని ప్రత్యుత్తరమిచ్చి వెంటనే యారాజ్యము విడిచి పయనమై యిటలీలోని నేపిల్సు రాజ్యమునకుఁబోయెను. ఈకాలమున నేపిల్సుపట్టణము యిటలీదేశమున విస్తీర్ణమైన పట్టణము. ఇది మిక్కిలి యందమైన పట్టణమగుటచేతనే "చనిపోవులోపల నేపిల్సు పట్టణము నొకమారు చూచి మరీచనిపొమ్ము" అని యందఱు చెప్పుకొందురు. ఉబర్టో గొప్పవర్తకుడఁగుటచే నాపట్టణపు వర్తకులెందఱికో ద్రవ్యము నప్పిచ్చి యుండెను. అందుచేత నీధనమును రాబట్టుకొని కాలక్షేపము చేయుటకే నతఁడచ్చటికి బోయెను. ఈతనిజూచిన తోడనే యీతనియొద్ద ధనమును గొన్నవారందఱు నీసచ్చారిత్రునకుఁ గలిగిన యాపదకు కడువగచి పైసలతో నతనిద్రవ్యము నిచ్చివేసిరి. గుణవంతుని యాదరింపనివారు, గౌరవింపనివారు నెవ్వరుందురు? ఉబర్టో తనకు రావలసిన ధనమును బుచ్చుకొని "వెనీసు" రాజ్యమునకరిగి యచ్చటనుండి పయనమై యారాజ్యమునకుఁ జెందియున్న

సమీపమందలి ద్వీపమున కరిగి యచ్చట గాపురముండి మరల వర్తకము ప్రారంభించి కొలఁదికాలమున పూర్వముకంటె ధనవంతుఁడయ్యెను. కట్టుగుడ్డలతో స్వరాజ్యమును విడిచిపోయిన ఉబర్టో జినోవాన్యాయాధిపతి యన్నట్లు దరిద్రుఁడుగాక ధనవంతుఁడై యయ్యెను ఇటలీదేశమునకు దక్షిణమున ఆఫ్రికాఖండమున్నది; ఈఖండమునకు, నిటలీదేశమునకుమధ్య, మధ్యధరాసముద్ర మున్నది. ఆఫ్రికాఖండమున కుత్తరభాగమున ట్యూనిసురాజ్యము గలదు. ఈరాజ్యము మహమ్మదీయులది. ఆకాలమున నిటలీదేశమందలి వెనీసు జినోవా మొదలగు సంస్థానములకు ట్యూనిసు రాజ్యమునకు బద్ధవైరము గలదు. అందు ముఖ్యముగ ట్యూనిసురాజ్యమునకు జినోరాజ్యమునకు నధికవిరోధము. ఇదిగాక నచ్చటి మహమ్మదీయులు యుద్ధమున జిక్కిన క్రైస్తవులను బానిసలుగఁ గొనుచుండెడివారు. మధ్యధరాసముద్రమునందలి ద్వీపమున కాపురమున్న ఉబర్టో యీట్యూనిసు నగరమునకు వర్తకవ్యాపారములపై తరుచు పోవుచుండువాఁడు. ఒకమారీ యుబర్టో ట్యూనిసు నగరమందలి యొక గృహస్థునియింటికిఁ బోవలసివచ్చెను. ఆగృహస్థునియింట బాలుఁడగు నొక క్రైస్తవుఁడు బానిసగ నుండెను. ఈబానిసబాలుని కాలుసేతులకు బరువైనసంకెళ్ళు కలవు. ఈతఁడు పారతో నేదో పనిచేయుచు మధ్యమధ్యనలసటచే విశ్రాంతికొఱకు కొంచెమాగుచుఁ గన్నుల నీరుగార్చుచు, నుస్సురని నిట్టూర్పులుబుచ్చుచు మిక్కిలి ప్రేమతోఁ బాటుబడుచుండెను. ఆతని యవస్థను జూచినతోడనే యుబర్టోకు మనసున జాలిబుట్టి యతనిని యిటలీదేశపుభాషతోఁ బలుకరించి కొన్నిప్రశ్నల నడిగెను. స్వదేశభాష చెవిబడ్డతోడనె ప్రాణము హాయిజెందిన యాబాలుఁడు ఆప్రశ్నల కెల్లను త్తరువులిచ్చెను. ఈసంభాషణవలన నాబాలునిది జినోవా పట్టణమనియు నతఁడు తన్ను శిక్షించిన ఎడోర్నో యను

న్యాయాధిపు నిపుత్రుఁడనియు నతఁడెఱింగెను. ఈవార్త చెవిబడినతోడనె యుబర్టోకు గుండె గుభాలుమనెను; మనమున కలవరముబుట్టెను. ఈదీనావస్థకు కారణమేమో యని యతఁడు ఆశ్చర్యపడ నారంభించెను. ఇట్లతఁడు కొంతపడికి మనమందలి యాశ్చర్యమడంచుకొని తనవృత్తాంత మేమియుఁ జెప్పక మెల్లగ నాతావు విడిచి చని, యాబాలుని బానిసగఁ గొన్న యధికారిని సమీపించి యెంతద్రవ్యమిచ్చిన నీబాలుని విడిచిపెట్టెదవని యతనిం బ్రశ్నించెను. ఈబాలుఁడు గొప్పకుటుంబము వాఁడగుటచే రు 10,000 ల నిచ్చినగాని విడువనని యాయధికారి ప్రత్యుత్తరమీయ నీతఁడు తత్క్షణమ యాధనమిచ్చి యాబాలునికి స్వేచ్ఛ నొసంగెను. ఉబర్టో యెంతమంచి వాఁడో చూడుఁడు. ఒకసేవకుని వెంటఁబెట్టుకొని తానే స్వయముగ నాబాలునియొద్దకరిగి యాతని కాలిసంకెళ్ళను తనచేతులతో నూడఁదీసి క్రొత్తదుస్తుల నతనికిచ్చి తొడిగించి యాతనితో నింటికరిగెను."నీవిఁక బానిసవు కావు. నీకు స్వేచ్ఛను సంపాదించితిని. రమ్మ" అనిఉబర్టో పలికినను బాలుఁడగు ఎడోర్డో జరిగినదంతయు కలయై యుండునా యని శంకించ నారంభించి కదలుటకు సందేహించ మొదలుపెట్టెను.

కాని, యుబర్టో, యతని నింటికిఁదీసికొనిపోయి తనతో సమముగ సకలసౌఖ్యములఁగల్పించి యతని కుటుంబ గౌరవమునకు తగినమర్యాదతో నాదరించినప్పుడుగాని చిన్నయెడోర్డో నిజస్థితి నెఱుఁగజాలడయ్యెను. ఆబాలుని యుబర్టో మితిమీరిన గౌరవముతో నాదరించి సమయము వచ్చువఱకు వేచియుండి యొకనాఁడు ఇటలీదేశమునకుఁబోవు యోడనచ్చినతోడనె యతని కాహారపదార్థములను, ప్రయాణపు కర్చులను మాత్రమే గాక మరికొంత ద్రవ్యమును గూడ నిచ్చి యందెక్కించి యతని దేశమునకంపెను. ఆబాలునిఁ బంపునప్పుడు, ఉబర్టో యత

నితో నిట్లనినెను "మిత్రమా! నిన్నుకొంతకాలము నాయొద్దనుంచు కొననలెనని మనమున కుతూహలమున్నను, తలిదండ్రుల జూచువేడుక నీమనమున పెచ్చుపెరిగి యుండుట సహజమగుటచే నీవందులకాతురత పడుచుందునని తలంచి నిన్నింత శీఘ్రముగ ప్రయాణము చేసితిని. ఈయాహారపదార్థములతో విందారగించుచు, హాయిగ నిల్లుచేరి నీ తలిదండ్రుల సేవింపుము ఈయుత్తరమును మాత్రము మరువక మీ తండ్రికిమ్ము నీకభ్యుదయమగుంగాక! నిన్ను నేనెన్నఁడు మరచువాడను గాను నీవును నాయెడల నట్లే యుందువని తలంచెదను" ఇట్లు పలికిన 'ఉబర్టొ' మాటలువినినతోడనే 'ఎడోర్నో' పరిపరివిధముల తనవిశ్వాసమును దెలుపుచు నతనికి వందనముల నాచరించెను. వారిరువురనేకమారు లొండొరుల నాలింగనము జేసికొని యోడకదలు సమయమున నేడువ నారంభించిరి. ఓడ కదలినతోడనే 'ఉబర్టొ' యింటికింజనెను.

జినోవానగరమున పెద్దయెడోర్నో యును నతని భార్యయు సముద్రముపై జనిన తమకుమారుఁడు ఓడపగిలి జలమరణమునొంది యుండునని మనమున నిశ్చయించుకొని, యాశలనెల్ల వీడి దుఃఖసముద్రమున మునింగియుండిరి. పుత్రశోకమున గ్రుంగి మతిలేక సంచరించు తలిదండ్రుల యెదుటకుఁ జని తలవని తలంపుగ చిన్నయెడోర్నో నిలిచినతోడనే వారి దుఃఖసముద్రమంతయు సుఖసముద్ర మయ్యెను సంతోషపరవశులైన తలిదండ్రులట్టెలేచి కుమారుని గౌఁగిలించుకొనిరి; కాని మితిమీరిన యానందమున నోరు తెరచి మాటలాడఁ జాలరైరి. పిమ్మటనచ్చట వారియాతురత యాందోళనము కొంచెముతగ్గినతోడనే యాబాలుఁడు తానేవిధమున మహమ్మదీయుల చేతబడినది యెట్లువారు తన్ను బానిసగఁగొని హింసించినది సవిస్తరముగఁ దెలిపెను. అప్పుడు తండ్రి నాయనా! నీకు స్వేచ్ఛనొసం

గిన మహాత్ముఁడెవ్వరు. నాకు పుత్రభిక్షపెట్టిన దాతయెవ్వరు. నేనె వరి యెడల కృతజ్ఞుఁడనై యుండనోపు. ఆకథకూడ దెలిపి నన్ను సంతోషపెట్టుము అని పలికెను. ఇట్లనినతోడనె కుమారుఁడు ఉబర్టో యిచ్చిన యుత్తరమును తండ్రికందిచ్చి ఈయుత్తరమును జూచిన నీకు సమస్తము బోధపడఁగలదుఁ అని బదులుచెప్పెను. అంతట తండ్రి యాలేఖను విప్పి యిట్లు చదువనారంభించెను.

దరిద్రిగొట్టు కుటుంబమున బుట్టిన నీచుఁడననినన్ను మీారెగ తాళి చేసినప్పుడు, యానీచునిపై మీారాడిన కఠినోక్తులకు వగవవల సిన కాలము ముందురాఁగలదని నేనుపలికితిని, నాయభిమతము నేఁ టికి సిద్ధించినది. గర్వాంధకారమునమునిఁగి యుండుమీాకొక సంగతి ని దెలుపఁగొరెదను. మీాయేకపుత్రుని బానిసతనమునుండి సంరక్షించి నదియు పుత్రశోకమునుండి మిమ్ముకాపాడినదియు మీారు ప్రవాస మునకంపిన యుబర్టోయే.

ఇట్లువిన్నవించు.

ఉబర్టో (దేశభ్రష్టుఁడు.)

ఈయుత్తరము చూచినతోడనే ఎవడ్నో దానిని క్రిందవైచి చేతులతో మొగముకప్పుకొని, సిగ్గుచే దలవంచుకొని మాటాడక పరితపించుచుండఁ బ్రక్కనున్నకుమారుఁడు ఉబర్టోయొక్క సుగుణ ములఁ గొనియాడుచు, తనకాతఁడు తండ్రికంటె నెక్కువగఁజూపిన యాదరణనుగూర్చి ముచ్చటించుచుండెను. తానపకారము చేసినను దానిందలంపక యుపకారముచేసి తనగృహమును నిలిపిన ఉబర్టోపై నతనికి భక్తిగౌరవములు గలుగుటచే నెట్లయిన నతనికి ప్రత్యుపకార ము చేసి ఋణవిముక్తుఁడగుటకు నిశ్చయించి పెద్దయెడ్వోర్నో జినో వాపట్టణమందలి ప్రభువులనందఱ వశపరచుకొని ఉబర్టోను, మరల రప్పించుమని కోరెను. ఈతనిపై ప్రభువులకు విశ్వాసముండుటచేతను

కాలము గూడ మారి రాజ్యమున శాంతి నెలకొనియుండుటచేతను వారాతనిమాట నామోదించిరి. ఇట్లువారిసమ్మతినొందిన పిమ్మట నతఁడు తనపూర్వపు పరివర్తనమునకు క్షమించుమనియు, పుత్రభిక్షము పెట్టినందుకు వందనము లాచరించుచుంటిననియు, మరల దేశమునకు రమ్మనియు వేడుచు నుబర్టోకొక యుత్తరమును వ్రాసెను. అనంతరము యుబర్టో మరల జినోవాపట్టణమునకువచ్చి యచ్చట పూర్వము తన్ను ద్వేషించిన ప్రభువులందఱిచే గౌరవముతో నాదరింపఁబడి సుఖముగ నుండెను. అంతటినుండియు 'ఉబర్టో' యెడోర్నో లిరువురుప్రాణమిత్రులై యుండిరి. ప్రేమచే శత్రుత్వమును జయించి ఉబర్టో లోకమునకు కలకాలముండు నీతిని బోధించెను.

---

# దీపాలదేవి

## గుజరాతు

రమారమి 600 సం॥ రములకిందట మన దేశమును ఖిల్జీవంశస్థుఁడగు అల్లాయుద్దీనుచక్రివర్తి పరిపాలించుచుండెను. ఇతఁడు తన మామయగు జలాలుద్దీనుయొద్ద దండనాయకుఁడుగనుండి యధికారకాంక్ష మనమునఁ బెచ్చుపెరుగ బంధుప్రేమను విడనాడి మోసబుద్ధితో వృద్ధుడఁగు మామను సంహరించి రాజ్యలక్ష్మిని చేకొనెను. పరదారాపహరణమందును, పరధనకాంక్షయందును, పరదేశదండయాత్రలందును నతని కన్యులు సాటిగారని చెప్పవచ్చును. అతఁడు రాజ్యపరిపాలన జేయుకాలమున గుజరాతు దేశమునకు 'కరనురాయి' యను నతఁడు రాజుగ నుండెను. అల్లాయుద్దీను గుజరాతు దేశముపై నొకమారు దండువెడలి రాజగు 'కరనురాయి'ని జయించి దేశము నుండి యాతని పారదోలి రాజ్యలక్ష్మిని వశపరచుకొని యాతని ధన

కనకవస్తువాహనములనెల్ల నపహరించుటయెగాక లావణ్యవతియగు ‹కమలాదేవి' యనునతని భార్యనుగూడ తనయధీనముచేసికొనెను. శత్రుదాడికోడిన ‹కరనురాయి' యొక నిమ్నమైన దేశమున నిలువఁ జాలక నెట్టెటో ప్రాణమును మాత్రము దక్కించుకొని పారిపోయెను

మహమ్మదీయచక్రవర్తులకు శాస్త్రయుక్తముగఁ గట్టుకొన్న భార్యలతోఁబాటు యంపుడుకత్తె లనేకులుండు యాచారముగలదు. ఇట్టి యుంపుడుకత్తె లెంత యధికముగనుండిన నంత గౌరవమని వారుభావించువారు. అందుచే నెచ్చట నేలావణ్యవతియున్నను నామెను వడయుటకు అల్లాయుద్దీను సకలశ్రమలఁ బడుచుండెడివాఁడు. ఇట్టి విషయమున సంకల్పసిద్ధుఁడగుట కెంతధనమునైన వెచ్చించువాఁడు. ఒక్కధనమననేల? వలయునేని దండయాత్రవెడలి సేనాసమూహమును బలిపెట్టియైన కృతార్థచిత్తుఁడగువాఁడు. గుజరాతు దండయాత్రయందు తనచేఁ జిక్కిన అధికలావణ్యవతియగు కమలాదేవిని జూచినతోడనె యానందపరవశుఁడై యల్లాయుద్దీను శీఘ్రముగ నామెను సంభ్రమోత్సాహములతోఁ గొనిపోయి తనయంపుడు గత్తెలుండు రాజమందిరమున సకలభోగములకిరవై, సమస్తపరికర శోభితమై రాజకన్యకలుండుట కనువై, విశాలమై యొప్పునొకభాగమున బ్రవేశపెట్టెను. సౌందర్యమున నొరులు సాటిరాని కమల తానెంతటి సాహసురాలోగాని చక్రవర్తి చేఁజిక్కిన దాదిగ హిందూస్త్రీలకెల్ల ప్రాణధనమగు పతివ్రతాధర్మమును పారమార్థిక చింతను నొకమూల ద్రోసి తుచ్ఛసుఖముల కాసించియు బుద్బుదప్రాయమగు సంపదలు స్థిరమని నమ్మియు యల్లాయుద్దీనుచక్రవర్తిపై మనసునిలిపి తనకై విలపించుచు దేశాంతరగతుఁడైన పతినెంతమాత్రము తలపోయదయ్యెను. చీనిచీనాంబరముల ధరించి వెలలేనియాభరణములచే నలంకృతమై సకలభోగపరివృతమై రాజమందిరమున శృంగారముగ విహ

రించు కమల పసిమికాంతుల తిరస్కరించు తనమేనికాంతులచేతను, నిరుపమాన సౌందర్య గరిమచేతను, సౌకుమార్య సంపద చేతను, మృదుమధుర సంభాషణచేతను, అల్లాయుద్దీనుచక్రవర్తిని పూర్తిగవశపరచుకొని యతనిప్రేమకెల్ల తానె నిధానమైయుండెను. మాంత్రికునిచేతి కీలుబొమ్మవలె నల్లాయుద్దీను కమల చేతఁజిక్కి యామె యెట్లాడించిన నట్లాడఁజొచ్చెను. ఆమెను సంతుష్టురాలుగఁ జేయుట కేమిజేయవలసిన చక్రవర్తి యదిచేయుచుండువాఁడు. ఆమెకానందము గల్పించుటయే యతనికి పరమానందము. కమలయన్ననో చక్రవర్తిని తనబానిసగఁ జేసికొని యతని భార్యలందెల్ల దానె యగ్రగణ్యయై మందిర మందలి యుంపుడుకత్తెలందఱిపై నధికారముఁ జేయుచు కుటుంబవిషయములతోఁ దృప్తిఁ జెందక పరిపాలనావ్యవహారములందును రాజమందిరమున జరుగు కుట్రలందును దానెయై చక్రవర్తికి సలహానిచ్చు ప్రధానరాణియై ప్రఖ్యాతి వడసెను. చక్రవర్తియే యామెయధీనమగుటచే ఆమెతలఁచిన తలంపెల్ల శాసనమయ్యెను. ఈమెయధికారము సాగినంతవరకు మంత్రివర్గము వారెల్ల తమయంతరాత్మల మాటగట్టి యొకమూల నుంచి మంచిచెడ్డలతోఁ బనిలేక నామె యభిమతమెఱిఁగి వర్తించువారు. ఇట్లుభోగచిత్తయై సకలసంపదల నోలలాడుచున్న కమల తన పూర్వచారిత్రము నొకమారైన తలంపదయ్యెను. ప్రాణపదముగఁ జూచుకొని ప్రేమనెల్ల దన కేయర్పించిన భర్తయగు 'కరనురాయి' నొకమారైన స్మరింపదాయెను. ఎంత యైశ్వర్యమున తులతూఁగుచున్నను, ఎంతటి మహనీయుని చేపట్టినను కమలకుమాత్ర మపుడపుడు మనోల్లాసమునెల్ల నొక్కమారుగ దిగమ్రింగఁ జాలు విచారకారణము లేకపోలేదు. ఒంటరిగనుండు కాలమున మనమందలి యాందోళనము నాపుకొనఁజాలక ఆమె వేడినిట్టూర్పుల పుచ్చుచుం

డును. పుత్రికాప్రేమచే పొరలివచ్చు దుఃఖము నెన్నివిధముల నణ గఁద్రొక్కఁజూచినను అదియట్లణగక యంతకంతకు వృద్ధియై వెల్లివిరి యుచుండును. ఇట్లు కమల విచారగ్రస్తయగుటకు కారణము అల్లా యుద్దీను దండయాత్రసమయమున గలిగిన పుత్రికా వియోగముతప్ప వేఱొకటికాదు. కమలకు సౌందర్యరాసియగు తనపుత్రిక జ్ఞాపకము వచ్చినతోడనె దుఃఖముచే హృదయము బరువెక్కుచుండును; నిముస ములో యుత్సాహమెల్ల చెదరి మనసు నీరగుచుండును. పుత్రికా వియోగజనితమగు పరితాపమనెడు కారుమబ్బు మనోవికాసమునెల్ల గప్పివేయును; ఈ మబ్బుయొక్క ఛాయయే యామెముఖచంద్రునిపై బడి కలకలలాడు వికాసమునెల్ల హరించును. అంతఃపురమున వసించు కమల యొకనాఁడిట్లు విచారమునఁబడి తలవంచుకొని కంటికి నేల కేకధారగ నేడ్చుచుండ చక్రవర్తి యల్లాయుద్దీనచ్చటికివచ్చెను. వచ్చినతోడనే తలవంచుకొని విచారించు ప్రియురాలిని యామెకండ్ల నుండి దిగజారువేడిబాష్పములఁగాంచి మదినేదో యూహించి నిము సములో నాగ్రహముఁజెంది యంతఁడిట్లు పలికెను.

"ఏమి! కన్నీళ్ళే! నిర్భాగ్యుఁడగు కరుణ రాయుని తలఁచు కొని చింతించుచుంటివా? నేననీయెడఁ జూపు ప్రేమ చాలదా? నా ప్రేమ నీకుబరువయ్యెనా?" ఇట్లతఁడు పలికినతోడనే కమలాదేవి ముహూర్తమాత్రమైన నాలస్యముచేయక వెంటనే యిట్లు పలికెను. "మహాప్రభూ! అదిగాదు! అదిగాదు! ఏలిన వారీదాసిదాసికిఁ జూపరాని కటాక్షమునెల్లఁ జూపిరి. ఏలినవారు చేసిన లోపమొక్కటి యు లేదు. కాని-కాని"

ఇట్లు కమలాదేవిమాట పూర్తిచేయక. మునుపె యడ్డుకొని యల్లాయుద్దీను 'కానియనుచుంటివేమి' యనియడిగెను. చక్రవర్తి తన్ను ప్రేమించుటతప్ప యొరుల ప్రేమించుట యెంతమాత్రము

గిట్టదని మెఱఁగినదగుటచే కమల తన మనోభీష్టితము నాతని కెఱిఁగింప నిశ్చయించుకొని యించుక భయపడుచు నిట్లు పలికెను:—

"మహాప్రభూ! కొంచెముకటాక్షించి యాగ్రహించక ఈ బానిసదాని మొరనాలింపుఁడు. ఏలినవారి దండయాత్రకాలమున నీబానిసదాని పుత్రికారత్నము ఆమెతండ్రితోఁగూడఁ బడి యెట్లు తప్పించుకొని పోయెనో యేలినవారికె విశదము. ఆమెయిప్పుడు జ్ఞాపకమువచ్చినది. నాగర్భవాసమున జనించిన పుత్రికారత్న మొక్కతెయు నొక్క పరిచారికయైనలేక, నిలువనీడలేక యొంటరిగ కష్టములపాలై చరించవలసి వచ్చెఁగదాయనియు, ఆమెను కష్టములనుండి కాపాడి గట్టెక్కించువారు లేకపోయిరిగదాయనియు తలపోయుచుండ దుఃఖమాగక యిట్లు పొరలివచ్చినది ఈతప్పు క్షమియింపుఁడు."

ఇట్లనినతోడనే మనసుకరగి యల్లాయుద్దీను "భయమొందకుము. నాగడ్డముతోడు నీకుమార్తెను నీయొద్దకు రప్పించెదను. నా చేతిక్రిందనున్న దండనాయకులకెల్ల నామెను వెదకి తీసికొనిరమ్మని యుత్తరువుచేసెద." నని పలికెను.

ఈకథ నిట్లుంచి కరనురాయి సంగతి యెట్లున్నదో కొంచెము విచారింతము. ఆతఁడు చక్రవర్తిచే తఱుమఁబడి రాజ్యమును విడిచి నదులు, వనములు, పర్వతములు దాటి బహుదూరమరిగి యొకచో సురక్షితముగఁ జేరి తనకుమార్తెను పదిలముగఁ గాపాడుకొనుచుండెను. కష్టకాలమున నామెయె యాతని పాలి పెన్నిధానమై యుండెను. ఆమెయే యాతనిప్రాణము; ఆమెయె యాతనిధనము. వేయేల ఆతఁడామెను జూచి తనవిచారమును కొంచెము మరచువాఁడు తన రాజ్యమును మరల సంపాదించుమార్గముల నూహించువాఁడు: తన కోర్కెలు మరల కొనసాగుకాలము వచ్చునని యుత్సాహముతో నపుడపుడు తలపోయుచుండువాఁడు. కాని భార్యావియోగమునకు

బెంగటిలి శత్రురాజుచేఁ జిక్కినయామెగతికి చింతించి తనదురవస్థను తలపోసి దుఃఖముచే సగమై తుదకు తన ప్రాణమును ధారపోసియైన రాజ్యమును మరల సంపాదించుకొనుటకును తన పుత్రికారత్నమును గుజరాతు రాజ్యమున నభిషిక్తురాలుగఁ జేయుటకును వ్రతముబూనెను

గుజరాతురాజగు కరనురాయి కుమార్తె దీపాలదేవి తల్లికంటె వేయిరెట్లధిక సౌందర్యవతి. స్త్రీజనములో నీమె కెనవచ్చువా రొరు లుండరనియే తలపవచ్చును. ఆమెను జూచిన వారెల్లరు ఆమె లావణ్యమున కచ్చెరువొంది అనేకవిధముల స్తోత్రము చేయుచుండువారు ఒకరి స్తోత్రముతోఁ బనియేల? ప్రతిదిన మామెచూచుకొను నద్దము లే యామె యెట్టిసౌందర్యవతియో వేనోళ్ళ చాటుచుండును. ఇట్లద్దములకడ తన మేనియందమును చూచుకొని దీపాలదేవి తనలో తానానందించుచు, నొంటరిగఁ గూర్చున్నపుడు తనస్థితిగతులఁగూర్చి యోచించుచుండును. ఆమెయున్న 'బగ్లానా' కోటకు చుట్టు విశాలమైన ప్రదేశ ముండుటచేతను అచట కితరులెవ్వరుఁ బోవు వాడుక లేనందునను, ఆమె హాయిగ చుట్టుప్రక్కల స్వేచ్ఛావిహారము చేయుచుండును. సాయంకాలము తానొంటరిగ తిరుగునపుడు తనసౌందర్యమునకు కులగౌరవమునకు, తగిన వరుఁడెవరు తనకు లభించునోయని యు, తన లావణ్యమున కానందించి భార్యగ గైకొని తన్ను సుఖపెట్టఁజాలెడు గుణ సంపన్నుఁడు, తేజోనిధియగు పృథ్వీశ్వరుఁడెవఁడైన లభించునో లేక తన జీవితమంతయు నిరర్థకమగునో యనియు చింత మనసును పీడించుచుండును. ఇట్లు తండ్రిదురవస్థను గూర్చియు తన భావిస్థితిని గూర్చియు యోచించుచుండ నొకదినమున నెఱుకల దొకతె యచ్చటకువచ్చి దీపాలదేవిని గని 'అమ్మా! చేయి నిటిమ్మా ప్రశ్న చెప్పెదనని యనెను. మొదట దానింజూచినతోడనే యిదియేమి చెప్పునో యని గుండె కొట్టుకొన నామె దానిదగ్గరకు పోవుటకు

సందేహించెను. కాని కొంచెమాలోచించిన పిదప మనమున వేడుక సంపాదింప నిది యేమి చెప్పునో చూచెదఁగాక యని తలఁచి చల్లగ చేయిజాచి కూర్చుండెను. అంతట నాయెఱుకలది చేతియందలి రేఖలనెల్ల బాగుగఁ బరీక్షించి భయపడుచున్న యాదేవి మొగముచూచి 'అమ్మా! ఈప్రాణికి ప్రస్తుతము సుఖములేదు. కాని యచిరకాలమున నీప్రాణికి మరియొక ప్రాణితో సంబంధము కలియఁగలదు. అని పలికెను. ఈమాటలవినతోడనే మనమున నేదో యాందోళనము గలుగ దీపాలదేవి చివాలున చేయిలాగికొని లేచి యింటిలోనికి పారిపోయెను.

గుజరాతు రాజ్యమును పరిపాలించుచుండిన కరను రాయి రాజపుత్ర వంశస్థుఁడు. ఈతని రాజ్యమునకు సమీపమున దేవఘురు రాజ్యముగలదు. ఈరాజ్యమును పరిపాలించు నతఁడు మహారాష్ట్రుఁడు. మహారాష్ట్రులకును, రాజపుత్రులకును సంబంధ బాంధవ్యములు లేవు. కాని కరనురాయి యవస్థ చెడియుండుటచేతను,అతని కుమార్తెయగు దీపాలదేవి సుగుణ సౌందర్యములు లోకప్రసిద్ధ మగుటచేతను దేవఘురురాజు ఆమె నెట్లయిన తనకుమారుఁడగు శంకల దేవునకు వివాహముచేయనెంచి మెల్లగ తనయుద్దేశమును కరనురాయికి తెలియపరచెను.'కరనురాయి' రాజ్యమేలుచు నెప్పటియట్లయిశ్వర్యమున తులతూగుచుండిన నీదేవఘురురాజు యిట్టి సందేశమంపఁజాలఁడు. ఒకవేళయవివేకమున నట్లు చేసినయెడల ప్రాణములతో మరల రాజ్యమేలజాలఁడనుట నిశ్చయము. దీపాలదేవి కీవార్త తెలిసినతోడనే మనమున చెప్పరాని యసూయకలిగెను. శంకల దేవు పరాక్రమవంతుఁడు, యౌవనవంతుఁడనుట సత్యమే కాని యతని జీవనముమాత్రము నీతిమాలిన జీవనము. అతనిప్రవర్తన యన్ననో దుష్ప్రవర్తన. అతనికి రాజులలో మంచిపేరు లేదు. ప్ర

జలందు గౌరవములేదు. ఏదైన కీర్తియున్న వ్యభిచారియను చెడుకీర్తి తప్ప మఱియొకటిలేదు ఈసంగతులన్నియు వినియున్నదీపాలదేవి తన కీతఁడు పతిగాఁగల ప్రయత్నములు జరుగుచున్నవని వినినతోడనె మన మున బెంగపెట్టుకొని, యీయాపద దాటింపుమని భగవంతుని రేయిం బగళ్ళు వేఁడుకొనుచుండెను. దీపాలదేవియొంటరిగ కూర్చుని తనలో అన్నన్నా! ఎంతపని పుట్టినది? ఎంతటిగ్రహచారదినములాసన్నమై నవి! మాతండ్రియే రాజ్యమేలుచుండిన నీ దేవఘురురాజు తనకుమారు నకు నన్నిమ్మని యడుగ సాహసించఁగలఁడా? రాజ్యలక్ష్మిఁబాసి ని లువనీడలేక మాతండ్రి సంచరించుటయు, నతనికి భటచయముగాని, శస్త్రాస్త్రములుఁగాని లేకుండుటయుఁ గదా నింతటి దుస్థితికి కారణ ము. మాతండ్రియే బలశాలిగనున్న యెడల దేవఘురురాజింత తలక్రొ వ్వి సంచరించునే? నాకింతటి నిర్భాగ్యపుదశ పట్టనగునా? అయ్యో! ముందేమికానున్నదో కదా! రాజపుత్రవంశమునబుట్టిన నేను మహారా ష్ట్రవంశస్థునా పెండ్లాడవలసినది? అంతటిపని జరుగునా? ఇంతకంటె నీ చము కలదా? ఏమిదుర్దినములు? ఎంతటియవమానము. దీని భరించు టెట్లు, కర్తవ్యమేది? దైవమా, యని వితర్కించుకొని తుదకు విచార మును పట్టఁజాలక వెక్కివెక్కి యేడువనారంభించెను.

కరనురాయి ప్రత్యుత్తరమును రాయబారులు అలాఫుఖాను కెఱిఁగింప నాతఁడు మృదుసంభాషణతోఁ బ్రయోజనము లేదని మది తలంచి, తనదండుతో నాకస్మికముగ నాతనిపైఁబడ నిశ్చయించెను. మొగలాయిసేన దండనాథుని యుత్తరువైనతోడనే రాజపుత్రునిపైఁ బడెను. అసహాయుఁడగు కరనురాయి శత్రుసేనలకొఱ కెదురుచూచి యవి సమీపించినతోడనె వాని ధాటి కాగఁజాలమని మది నెఱింగి యాచోటువిడిచి పాఱిపోయెను. కరనురాయి తనప్రాణరక్షణతో తృప్తి నొందక కుమార్తెయగు దీపాలదేవినిగూడ యెట్లైనా యనలకు దాఁ

టించెను. అలాఫుఖాను రాజపుత్రుని కొంతదూరము వెన్నంటిపరిమి యు పట్టుకోఁజాలక వెనుకకు మరలివచ్చి దీపాలదేవికై వెదుకనారంభించెను. ఆమెకూడ తండ్రితో నడఁచినదని యాతఁడెఱుఁగఁడయ్యెను. అందుచే నతఁడంతట గాలించి యామె నెచ్చట గనఁజాలక తుదకు మోసముజరిగినదని గ్రహించి, మనమున తనబుద్ధిహీనతకు కడు వగచి, తన్నుఁదా నిందించుకొని తనలోఁ దానిట్లనుకొనెను. ‘ఆహా! ఎంత మోసము వాటిల్లినది. కరనురాయి యెట్లుకండ్లలో దుమ్ముగొట్టెను. అల్లాయుద్దీనుచక్రవర్తి నెట్లుదర్శింతును. ఆతనితో నేమిమనవి చేసికొందును. నాగ్రహచార మెట్లున్నదోకదా! అయినను నెచ్చటకు పోఁగలఁడు. ప్రస్తుతము చక్రవర్తి రెండవపనుపు నెరవేర్చుటకు దియోఘురు పట్టణమునకుఁబోయి యారాజ్యమును ముట్టడించియున్న మిత్రుఁడగు మేలికాఫరును కలిసికొని హిందూరాజ్యము నేలమట్టముచేసెదను.” అని యిట్లుపలికి అలాఫు సైన్యముతోఁ బయనమై దియోఘురు రాజ్యమును చేరఁబోయెను.

కరనురాయి మొగలాయిసేన తనపై నెచ్చటఁబడునో యని భయమొంది తనప్రాణముకంటె నెక్కుడు ప్రాణమగు కుమార్తెను రక్షించు టావశ్యకమని తలంచెను, కుమార్తె మహమ్మదీయుల చేత బడుటకంటె మహారాష్ట్రరాజపుత్రుని వరించియైన హిందువై యుండుట మంచిదని యతఁడూహించెను. ఆమెను దియోఘురురాజ్యమునకుఁ బంపి యారాజకుమారుఁడగు శంకలదేవునకిచ్చి వివాహము జేసినయెడల తనగతి యెట్లున్నను నామెయైన సుఖింపఁగలదని భావించి తన యనుచరులలో శూరశిఖామణులఁ గొందఱజతేయిచ్చి యామెను దియోఘురురాజ్యమున కనిపెను. ఇట్లనుపునపుడు తనకుమార్తెకు మార్గమధ్యమున నేదైన చిక్కుగలుగునని తోఁచునెడల నామెను సమీపమందలి యెల్లోరాగుహాలకుఁ గొనిపోయి యందలి రహస్యప్రదేశముల దాచు

మని యతఁడనుచరుల కుత్తరువిచ్చెను. ఆదేవియు దిలావరుఖానుడు కోటను చుట్టుముట్టియున్న మొగలాయి సేనలం గని గుండెచెదరి, తనప్రాణ మచట సురక్షితముగ నుండఁజాలదని గ్రహించి, యెల్లోరాగుహాలందే తల దాచుకొనఁ నిశ్చయించి, భటులతో వెనుకకు మరలుమని చెప్పి, యాగుహలఁ జేరి యందుఁ బ్రవేశించి యచట సురక్షితముగ నుండెను.

ఈపనిజరిగిన కొన్నిదినములలో నలాఫుఖాను తనమిత్రుఁడగు మేలికాఫరును కలసికొనుటకు ప్రయాణమైపోవుచు మార్గమధ్యమున నద్భుతమగు ఎల్లోరాగుహలఁ జూడవేడుకపొడమ నొకచో నాగెను. పూర్వకాలపు కట్టడములలో నందమందును, చిత్రపుఁబనియందును నెల్లోరాగుహలకుఁ జాలినవి మఱియొకటి లేవు. అచ్చట నొక మహాశిలను అనేక స్తంభములపై నిలుచు విశాలమందిరముగఁ జెక్కియుండిరి. ఆరాతిపై చెక్కఁబడిన నగిషీపనిచేతను, చిత్రితములగు రాతి స్తంభముల సొబగుచేతను నద్భుతముగొల్పు గొప్పవిగ్రహముల యాకారముచేతను చూచువారల కానందమొసఁగు నాప్రదేశమును సందర్శించుటకెందఱో యచ్చటికిఁ బోవుచుందురు. అలాఫుఖాను తనవేడుక దీర్చికొనుట కాగుహలకరిగి యంతటఁ దిరిగి యచ్చట నద్భుతములఁగాంచి యానందించి పిమ్మట వెనుకకు మరలెను. మరలివచ్చునపు డతఁడొక ద్వారముకడ కొంచెము నిలిచి వెనుకకుఁ దిరుగ నాతనికంటికి మెఱుపుతీఁగవలె తళతళలాడెడు నొక నవలావణ్యవతియు, నామె చెలికత్తెయుఁ గనిపించిరి. కాని యలాఫు కనుమూసి తెఱచునంతలో వారిరువురు వెనుకప్రక్కనున్న ద్వారముదాటి యదృశ్యులైరి. మొగలాయి దండు గుహలఁ జూడవచ్చిరని వినినతోడనే దీపాలదేవి నిమిషములో పరివారసమేతముగ నాతావువిడిచి క్రొత్తమార్గములఁ ద్రొక్కి పోనారంభించెను. అంత సౌందర్యముగల యాయువతి యెవరై యుండునా

యని యలాఫు మనమున తలపోసి యేమియుఁ దోఁచక నామె మంచి చెడ్డలనెల్ల నాప్రాంతములఁదెలిసికొనఁగోరెను. ఇట్లు తెలిసికొనులోపల నామె యెచ్చటికిఁ బోవునోయని భయపడి ముందుగ తన సైనికులఁ గొందఱ నామెను నిలుపుమని వెనువెంటఁ బరుగెత్తించెను. పిమ్మట నలాఫు ఆగుహాలందచటచట నివసించు సన్యాసులను, మతగురువులను సమీపించి, వారివలన నావృత్తాంత మెఱుఁగఁజాలక తుదకు ధనమే సమస్తవస్తుసాధనమని తలంచి యొకసన్యాసికి నీవిచ్చటనున్న స్త్రీ రత్న మెవ్వరో యెఱిఁగించితివా నీకుఁగావలసినంత బంగారు నిచ్చెద నని యాశబెట్టెను. ధనకాంక్షచే నా సన్యాసి పేరాశం దగులుకొని 'నాయనా! ఆమె రాజపుత్రిక; దిమోఘరు రాజ్యమునకుఁ బయనమై పోయినది. అని బదులుచెప్పెను. అంతట నాఖాను 'ఆమె యల్లేలపో యినది? దిమోఘరు రాజవంశముతో నామెకేమైన సంబంధముకల దా' యని యడుగ మరల నాసన్యాసి 'ఇంతవఱ కేసంబంధము లేదని సంగ్రహముగఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఈమాటలు వినినతోడనే యలాఫుకూడ తన సైనికులు బోయిన మార్గమున నతివేగమునఁ బ్రయాణమై పోనారంభించెను.

అలాఫు సైనికులు రెండుగంటల కాలము పరుగెత్తి యాయాస ముచే బుసకొట్టుచు తుదకాదేవి పల్లకిని సమీపించిరి. స్వామిభక్తియం దు ప్రాణముల తృణప్రాయముగఁ దలంచు కరనురాయిభటులు వారిని జూచినతోడనే పల్లకిగుడారమును దిగలాగి యాపల్లకిచుట్టు యుద్ధసన్న ద్ధులై నిలబడిరి. కాని యలాఫుభటదయమధికముగ నుంటచే వారా రాణిని కాపాడఁజాలరైరి. పల్లకియొద్ద కరనురాయిభటులు చక్రవర్తి సైనికులను కొంతవఱ కెదిరించిరిగాని తుదకు గతిలేక లొంగవలసివ చ్చెను. ఇంతలో నలాఫుకూడ నచ్చటికివచ్చెను ఆతఁడు వచ్చినతోడ నే బోయలచే పల్లకినిదింపించి తానుస్వయముగ పల్లకిగుడారముకడ

కుఁ జనెను. అంతట తన భటచయ మోడుటయు దైవాజ్ఞకూడతనకు వ్యతిరేకముగనుంటయు నెఱిఁగిన యారాణి తెరనొత్తిగించుకొని చివాలున బయటకువచ్చి ధైర్యసాహసములతో నదురు బెదురు లేక యిట్లు పలికెను.

"నేను గుజరాతురాజపుత్రికను. నావలన మీరపేక్షించునదే మి? నన్ను మీరు ఖైదిగ గొనఁదలఁచితిరా? అట్లయినఁ జెప్పుఁడు."

ఈమాటలు వినినతోడనే యలాపునకు దేహము ఝల్లుమనెను. అతఁడెన్నఁడామె గుజరాతురాజు కుమార్తెయని తలంచలేదు. గుజరాతువారు రాజపుత్రులగుటచే వారి కుటుంబమున జనించిన స్త్రీలకు మహారాష్ట్రవంశములతోఁ బనియుండదని తలంచుటచే నతఁడెన్నఁడామెను దియోఘురు రాజ్యమునగాని యాచుట్టుపక్కలఁగాని గనఁజాలుదునని కలయందైన నూహించియెఱుఁగఁడు. అందుచేతనే యాకస్మికముగ నారాణినిఁ గన్నతోడనే యతనికద్భుతమయ్యెను. ఆమె చక్కదనముచే మనమున వికారము జనించియే యలాపు అమెను తరుముకొనివచ్చెను. కాని యామెయే కరనురాయి పుత్రికయని తెలిసినతోడనె చక్రవర్తియాజ్ఞను శిరసావహించి యామెను ఢిల్లీనగరమునకుఁ గొనిపోని యెడల తనకు మానప్రాణములు దక్కవని తలంచి యలాపు మనమున నేదురభిప్రాయమును చొరనీయక శీఘ్రముగ పల్లకి నెత్తించి యామెను సురక్షితముగఁ గొనిపోయి చక్రవర్తి మందిరమునఁ బ్రవేశపెట్టెను. అచ్చట దీపాలదేవి తల్లిముందుకుఁగొనిపోఁబడినపుడు వారిరువురును నిశ్చేష్టులై యొండొంటల మొగములు జూచుకొనుచు మాటాడనోరురాక కొంతకాలము నిలువఁబడియుండిరి. ఈక్రొత్తయవస్థ గడచినతోడనే వారిరువురు సంతోషపరవశులై యొండొరుల గాఢాలింగనముఁ జేసికొని యంతవఱకు మనమున దహించుచు దేహముల కృశింపఁజేయుచున్న దుఃఖదవానలము నొక్కమా

ముగ జల్లార్చుకొనిరి. అంతటనుండియు తల్లియు, బిడ్డయు, చక్రవర్తి మందిరమున పరిచారిక లెందఱో యనుదినము సేవింపుచుండ, చక్రవర్తియే స్వయముగ తమయభీష్టసిద్ధి జేయుచుండ, కోరికలకు కొదువలేక, సౌఖ్యములకు కొఱంతలేక వెలలేని యైశ్వర్యమున తులదూగుచుండిరి. ఈరాజమందిరముఁ బ్రవేసించినతోడనే మొదటనుండియు దానసూయతతోఁ జూచుచున్న శంకలదేవు బారిఁ బడకుండ తప్పించుకొను భాగ్యమబ్బెనుగదా యని దీపాలదేవి సంతసింపఁ దొడఁగెను. ఢిల్లినగరమందలి రాజమందిరమున తల్లియుబిడ్డయు వేఱువేఱుగదులందునివసించుచుండిరి. చక్రవర్తియు నీదేవిని తనపుత్రికగభావించి యామెకు సకలసుఖములఁ జేకూర్చి వెలలేని బహుమతుల నొసంగెను.

ఇఁక కరనురాయి యనవస్థ యెట్లున్నదో చూతుఁడు. అతఁడు నిలువనీడలేక తినతిండిలేక రాజ్యభ్రష్టతకుఁ దోఁడు, భార్యావియోగమునకును, పుత్రికావియోగమునకును విలపించుచు నేకాకియై తిరుగరాని భూములనెల్ల తిరిగి తుదకు దిక్కుమాలిన మరణమునొందెను.

తల్లిపోషణయందు రాజాంతఃపురమునఁ బెరుగుచున్న దీపాలదేవి తల్లివలెనె నేర్పరియై యొంటరిగనున్నపుడు నెఱుకలదాని వచనములఁ దలపోయుచు తనకెట్టిపతి లభించునోయని యూహించుచుండెను. వయసుతోఁబాటు ఆమె సౌందర్యముగూడ హెచ్చనారంభించెను. ఒకనాఁడామె సూర్యాస్తమయమైనతోడనె మందిరకవాటమునఁగూర్చుండి తనయుద్యానవనమును వీక్షించుచు చల్లగాలిననుభవించుచు నాలోచనల మునిఁగియుండెను. ఇట్లుండ నది పున్నమ రేయియగుటచే చంద్రోదయమైనతోడనె చల్లని వెన్నెలలు క్రమముగ వనమంతటఁ గప్పి వింతయందము నిచ్చుచుండెను. ఆసమయమున దీపాలదేవి యద్భుతమగు తనజీవచరిత్రమును, తండ్రిదురవస్థను తలపోయుచుండ నొక యౌవనవపురుషుఁడు తటాలున తలుపు తెఱచుకొని లోనంబ్రవేశిం

చెను. ఆతఁడచ్చటకు రావలెనని వచ్చియుండలేదు. దీపాలదేవిసౌం దర్యము నాతఁడెన్నఁడును గనియుండలేదు. పొరబాటున నాకస్మిక ముగ నచ్చటకువచ్చిన యాపురుషుఁడు అల్లాయుద్దీనుచక్రవర్తి ప్రథమపుత్రుఁడు. అల్లాయుద్దీను తదనంతరము మొగలాయిరాజ్యమునకభిషిక్తుఁడగుట కేర్పడిన యదృష్టవంతుఁడు. పరాక్రమమున తండ్రికిఁ దీసిపోనివాఁడు. సౌందర్యమున దీపాలదేవి కెనవచ్చువాఁడు. సుగుణసంపదచేతను ప్రజానురాగముచేతను దేశమంతట ప్రఖ్యాతిగాంచినవాఁడు. ఇట్టి సౌకుమారశీలునిఁ గన్నతోడనే చక్రవర్తి పుత్రుఁడని గ్రహించియాదేవి భయసంభ్రమములతో తొట్రుపడిలేచి చేతులుజోడించుకొని తలవంచి యాతనితో నిట్లనెను. "దేవా! మీసందర్శనమున నీనిర్భాగ్యురాలు ధన్యురాలైనది. మీరిచ్చటకురాగతం బేమి? దేవరవారికి నేను చేయఁగలసేవ యెద్ది?"

ఆదేవినిఁ గన్నతోడనె మనోవికారముగలిగి యామెసౌందర్యమున కద్భుతపడుచు నిశ్చేష్టుఁడై నిలువఁబడియున్న చక్రవర్తిపుత్రుఁడు పైమాటలువిన్నతోడనె "నీపాదసేవకాశించితిని. ఇంతకంటె నాకు వేఱుకోరిక లేదని" బదులుచెప్పి యామెను సమీపించి ముద్దాడెను. ఆమెయు చక్రవర్తితనయునకు తనసైఁగల వలపునెఱిఁగి యడిగినదీ తడవుగ నాతనిఁ బరిణయమగుటకు సమ్మతించి సిగ్గుచే తన యభీష్టమును సగము సగముగఁ దెలిపెను.

ఆతఁడంతట నామెసెలవు గైకొనిపోయి మఱునాఁడుదయమున తన తండ్రియొద్దకుఁజని తన మనోభీష్టమును మరుగుపరచక యతనికిఁ దెలిపెను. ఆతఁడును నాదేవిని సుఖపెట్టఁదలఁచినవాఁడగుటచే కొమారుని కోరిక కడ్డుజెప్పక యావివాహమునకు సంతసించి వివాహమునకు సంతసించి తన మంత్రివర్గమును రావించి వివాహపుఁ బ్రయత్నములు జయప్రదముగ జరుప నియోగించెను. అంతట పట్టణ

మంతయు కన్నులపండువగ నలంకరింపఁబడెను వివాహదినమున నంతట నుత్సవములు, విందులు, జరుపఁబడెను. దీపాలదేవియు చక్రవర్తి పుత్రుని వరించి సుఖముండెను. ఎఱుకలదాని వచనము లీతీరున నిజమయ్యెను.

---

# రాక్ ఫెల్లరుగారికథ

---

(ప్రపంచమందలి కోటీశ్వరులందగ్రగణ్యుఁడు.)

అమెరికాఖండము పరిశ్రామిక వ్యాపారములందు దినదినాభివృద్ధి గాంచుచున్నది. ఆఖండమందలి సంయుక్తరాష్ట్రపరిశ్రామికవ్యాపారముల నభివృద్ధిలోనికిఁ దెచ్చిన ప్రజ్ఞాఢ్యులందు రాక్ ఫెల్లరను వాఁడు ప్రాముఖ్యుఁడు ఆతఁడాదేశపు రాజకీయ విషయములందు కూడ నభిమానముతో పనిచేయువాఁడగుటచే ధనసంపన్నతయుతో డు దేశాభిమానము, ప్రజానురాగముఁకూడ నాతనికిఁ గలదని చెప్పవలసి యున్నది. ఆతనిభాగ్య మంతులేదనిన నాశ్చర్యము జనింపవచ్చును. కాని యాతఁడే ప్రస్తుతము ప్రపంచమందలి కోటీశ్వరులందగ్రగణ్యుడు. అతని ధనమంతయు నూనె వ్యాపారమునందు గణింపఁబడినధను. గొప్పవ్యాపారములు గొప్పలాటచే నాతని నూనెరాజని పిలుతురు. గొప్పవ్యాపారములు గొప్పలాభములు ననేమొ యెఱుంగని మనబీదదేశమున నిట్టిమహనీయుని కథ కలలోనివార్తగ గనిపించవచ్చును. కాని యిట్టి మహనీయుని నిజచారిత్ర మెఱుంగుటవలన వర్తకమందభినివేశముగల బుద్ధిమంతులందొక్కనికైన నెక్కువప్రోత్సాహము, పూనిక, పట్టుదల జనింపవచ్చుననియు నాతనిమూలమున నీదేశపు పరిశ్రమ లభివృద్ధిగాంచవచ్చుననియు తలంచి యాతని జీవితమును సంగ్రహముగాఁ దెలుపుచుంటిమి.

రాక్ ఫెల్లరుగారికిపుడు 72 సం॥ ముల వయస్సుకలదు. ఆయన చారిత్రి మెఱిఁగినవారొకరు 1865 సం॥ మున ఆయనకు వేయి పౌనుల ఆస్తి అనఁగా రు 15000ల ఆస్తిగలదని వ్రాసిరి. రెండుసం॥ ములకిందట ననఁగా రాక్ ఫెల్లరుగారికి 70 సం॥ ములు వయస్సు వచ్చునప్పటికి ఆయనయాస్తి పౌ 140,000,000లు అనఁగా రెండువందల పదికోట్ల రు॥ లవరకు పెరిగినది. ఈయన 80 సం॥ ములు వచ్చువరకు అనఁగా 1919 వ సం॥రము వరకు జీవించునెడల నప్పటికీయనకు మూడువందలకోట్ల రు॥ల యాస్తి చేరఁగలదు.

రాక్ ఫెల్లరుగారు ప్రారంభమున వారముకు తొమ్మిదిరూపాయలు జీతముగల చిన్నగుమస్తా యుద్యోగమునఁ బ్రవేశించిరి. ఆ యుద్యోగమందున్నకాలమున మితవ్యయముచేసి 19 యేండ్లవయస్సు వచ్చునప్పటికి సుమారు రు 3000 లను కూడఁబెట్టిరి. ఈమాత్రపు నాధారము కనిపించిన తోడనె పనిచాలించుకొని మరి మూడువేలు రు॥ ల ఋణముచేసి స్వయముగాకిరసనాయిలు వ్యాపార మారంభించిరి. అప్పటికి ఈయనసోదరుఁడగు విల్లియందొార స్టేండర్డు ఆయిల్ వర్క్సను పేర కంపెనీపెట్టి వ్యాపారము చేయుచుండెను. ఇట్లుండ 1867 సం మున నీయిరువురు సోదరులు తమ రెండు కంపెనీలను కలిపివేసి ,రాక్ ఫెల్లరు అండుకో, యనుపేర వర్తక మారంభించగా వీరితో హెచ్. యంప్లేగ్లరను మూడవదొారయొకఁడు వచ్చి భాగస్థుఁడుగాచేరెను. ఈమూడు కంపెనీలు కలిసినమీఁదట వీరు ముగ్వురు తమలో రాక్ ఫెల్లరుగారి నధ్యక్షునిగా అనగా పెద్దగా నేర్పరచుకొని పనిచేయనారంభించి 1870 వ సం॥ మున 30 లక్షుల రు॥ ల పెట్టుబడితో ఓహియో పట్టణమున ,స్టేండర్డు ఆయల్ కంపెనీ' యను పేర కంపెనీని స్థాపించి కెరసనాయిల్ ,వ్యాపారమారంభించిరి. ప్రారంభమున ఓహియో పట్టణమున బయలుదేరిన యీకంపెనీ దినదినా

భివృద్ధిఁగాంచి దేశమంతట నల్లుకొని వానిభాగ్యమునకు పునాది య య్యెను. రాక్ ఫెల్లరుగారు మంచిబుద్ధిసూక్ష్మత, చురుకుతనముఁ గల వారగుటచే నతిశీఘ్రముగ వర్తకమును వృద్ధిచేయఁగలిగిరి. ఈయన దేశమందు నూనెవ్యాపారముచేయు ప్రతిచిన్నవర్తకసంఘమును ధన మిచ్చి కొని క్రమముగ 1881 సం॥ము నాటికి వర్తకముమీఁద రు 210,000,000 ల పెట్టుబడిపెట్టిరి. ఈపెట్టుబడి క్రమక్రమముగ వ్యాపారముతో రు 285,000,000 ల వరకు పెరిగినది. ఈముప్పురు ప్రారంభించిన వ్యాపారము రాక్ ఫేల్లరుగారి బుద్ధివిశేషమువలన దేశ మంతట వ్యాపించినది. ఈయన మరియొకవర్తకుని తలయెత్తనీయక దేశమున నేప్రాంతమున గనులున్న నచ్చట తాను తప్ప నితరు లను రానీయక ప్రపంచమందలి కెరసనాయిలువర్తకమునకు తా నా ధారభూతుఁడై పేరువహించెను. ఈకంపెనీవారి నూనెయమ్ముడు పోని దేశము, పట్టణము ప్రపంచమున లేదని చెప్పుకొనునట్లు వర్తక ముచేసి కోటీశ్వరులందరిలో నీయనయధికుఁడయ్యెను. ఈయనభాగ్య మెట్టిదో యీక్రిందిసంగతివలన తెలియఁగలదు. దేశమం దింకొక వర్తకుని తలయెత్తనీయక కట్టుకట్టి పనిచేయ నారంభించిన రాక్ ఫె ల్లరుగారిపై వర్తకులనేకులకు క్రోధముజనింప వారు ఈకంపెనీవారు ను వీరిశాఖలవారును ధనాశచే కుచ్ఛితముగ వ్యాపారముచేసి తమ కపకారము చేయుచున్నారని న్యాయస్థానమున 20 సం॥ల క్రింద దావాలు తెచ్చిరి. ఆదావాలందు ఈకంపెనీవారియందు నేర మా రోపించి న్యాయాధిపులు వీరికి వ్యతిరేకముగ తీర్పులనిచ్చిరి. ఈదా వాలయుద్ధమందు వీరు 1906 సం॥రమువరకు వెనుదీయక పోరిరి. ఆ సంవత్సరమున దొరతనమువారి న్యాయవాది స్టేండర్డు ఆయిల్‌కంపెనీ మీఁదను వీరిచేతిక్రింద పనిచేయు 70 శాఖలవారిమీఁదను కుచ్ఛితప్ర వృత్తితో దేశవాణిజ్యమున కపకారము చేయుచున్నారని యభియోగ

మనుదెచ్చెను. ఈయభియోగమును విచారించిన న్యాయాధిపులు వీరి శాఖయగు వాల్టరు పియర్సుకంపెనీవారికి రు 24345000 ల జరిమానావిధించిరి. ప్రతివాదులు అప్పీలుచేయఁగా అప్పీలులోకూడ వారి నేరము స్థిరపడెను. ఈసందర్భమున రాక్ ఫెల్లరుగారి స్టేండర్డు ఆయిల్ కంపెనీకికూడ రు 87,720000 లు జరిమానాపడెను. వీరివలన లోప ములేదని రుజువుచేయుటకు వీరి ప్లీడరు 500రు॥ల హేతువులనుదహరించి స్టేటుమెంటును దాఖలుచేసినను వీరివాదము నిలువదయ్యెను. ఈ కంపెనీవారిమీద మొత్తము మీఁద వేరువేరుగ 21 అభియోగములు తేబడెను.

రాక్ ఫెల్లరుగారు బేప్టిస్టుక్రైస్తవమతస్థుఁడు. ఆయనకు మత మందు మతగురువులందు అభిమానముకలదు. 1906 వ సం॥ రమున నొక మతగురువునకు బంగాళాదుంపలను బహుమతిగ సంపుచు ఆ దుంపలమధ్య రు 15 ల వెలగల బంగారునాణెములను బోసి ఖాళీస్థలము పూర్తిచేసి పంపిరి. ఒకప్పుడు ధనార్జనమునుగూర్చి ఆయనయిట్లు పలికిరి:—"మనుష్యునకు ఎంతధనముసంపాదించుటకు శక్తిగలదో యంతధనమును శ్రమపడి దైవభీతితో సంపాదించుట విధియని నా నమ్మకము. సంపాదించునపుడు దైవభీతితో, న్యాయముగ, క్రమపద్ధతిని సంపాదించి, ధర్మముజేయునపుడు సర్వమును ప్రజోపకార మొసఁగు టుచితము" ఈయన నెఱిఁగినవారు కొందఱువ్రాసినదానినిబట్టి కూడ ఈయన యభిప్రాయమిట్టిదని తెలియఁగలదు. ఈయనకు ధన విషయమున తప్ప తక్కినవిషయములందు పిచ్చిలేదు. ఈయన మంచిక్రైస్తవుఁడే గాని యీయనతో వ్యాపారముచేయునపుడుమాత్రము చాల జాగ్రతగనుండవలెను" ఈయన సహకారి యొకఁడు యీయననుగూర్చి యిట్లు పలికెను. "నేను రాక్ ఫెల్లరుగారితో 35 సంవత్సరములనుండి వర్తకముచేయుచున్నాను. ఇంతకాలమునుండి వర్తక

ముచేయుచున్నప్పటికి న్యాయముగా నావద్దనుంచి ఒకడోలరు (1 డో లరు=సుమారు ౩ రూ లు) రాబట్టుట కాధారమున్న యెడల ఆయన దాని ని విడిచిపెట్టువాఁడుకాఁడు"

ఈపై చారిత్రముపలన నైకమత్యములోడను, పూనికతోడను పనిచేసి రాక్ ఫెల్లరుగా రెంతటి ధనాఢ్యుఁడయ్యెనో తెలియఁగలదు. మన హిందూదేశమున గొప్పవ్యాపారములు బయలువెడలి యెన్నడు దేశపరిశ్రమ లభివృద్ధిలోనికి వచ్చునోగదా!

అమెరికాఖండమందలి జనరల్ వాషింగ్టన్. సంయుక్తరాష్ట్రము నప్రజలుస్వాతంత్ర్యమును సంపాదించి ప్రజాస్వామికప్రభుత్వమును స్థాపించిన పిదపవాషింగ్టన్ అను సేనాని కొంతకాలము ఆదేశమునకు ప్రభువయ్యెను. ప్రజాస్వామిక రాజ్యముల పరిపాలించు ప్రభువులను ప్రెసిడెంటని పిలుతురు. ప్రెసిడెంటు అనగా అగ్రాసనాధిపతి యని యర్థము. ఈ ప్రెసిడెంటు యుద్యోగము 4-5 సం॥ముల కొకమారు మారుచుండును. దేశపరిపాలనప్రజాసభ లీతని సహాయముతో నిర్వర్తించుచుందురు. ఈసభలయందు పనిచేయు ప్రజాప్రతినిధులే యప్పుడప్పుడు తమయందలి విజ్ఞానవంతుని రాజకీయపరిజ్ఞాతను ప్రెసిడెంటుగ నేర్పఱచుకొనుచుందురు. వాషింగ్టన్ప్రభువు ప్రెసిడెంటుగనున్న కాలమున జరిగిన యొక చమత్కారము నెఱిఁగించినయెడల మా చదువరులకు నిజమైన దేశోపకారుల ప్రవర్తన యెట్లుండునో తెలియఁగలదను నమ్మకముతో నీచిన్నకథను వ్రాయుచున్నాము. విద్యాధికులయ్యు నీతిదూరులై విధికృత్యముల నెఱుఁగక వర్తించు బుద్ధిహీనులు తమయందణుమాత్రమైన నిత్యభిలాష యున్నపక్షమున నీకథ నెఱుఁగుటవలనతమ మలినవర్తనమును విడనాడి నయవర్తనపరులై గౌరవముగ మననేర్తురనికూడ దలంచవచ్చును

సంయుక్తరాష్ట్రపరిపాలకుఁడగు వాషింగ్టన్ప్రభువుకు ప్రాణ

మిత్రుఁ డొకఁడుగలఁడు. అతఁడు వాషింగ్టన్ప్రభువుతో కలిసి దేశ స్వాతంత్ర్యమునకై బ్రిటిషువారితో హోరాహోరిగఁబోరినశూరా గ్రేసరుఁడగుటయెగాక యనుక్షణ మాప్రభువుకు తోడునీడయై చరించిన యాప్తమిత్రుఁడు. వీరిరువురు అరమరలేక యెల్లప్పు డొకచోనం చరించు మిత్రులుగాని సామాన్యులుగారు. ఈమిత్రుఁడు గుణశీలుఁడు, నిగర్వి, నయవర్తనుఁడు, సహజసద్భావము గలవాఁడగుటంజేసి ప్రభువున కాతనిపై యనూనానురాగము గలదు. ఈతఁడు దేశాభిమానియెగాని రాజకీయవిషయపరిజ్ఞాత మాత్రము కాఁడు. ప్రపంచజ్ఞానమంత యధికముగ లేదనుటయెగాని మంచితనమందు ఆతని కెనవచ్చువారులేరు. వాషింగ్టన్ప్రభువు తన మిత్రుని సహజసద్గుణములనుబట్టి ఆతని నొక్కనిమునమైన విడచియుండువాఁడుగాఁడు. వీరిమైత్రిలోక ప్రసిద్ధమైనదని చెప్పవచ్చును. ఇట్లుండ నొకప్పుడు వాషింగ్టన్ప్రభువు నొద్ద నొక గొప్పయుద్యోగము కాళీవచ్చినది. ఆయుద్యోగమునకనేకులు దరఖాస్తుల నంపుకొనిరి. ఈదరఖాస్తులంపుకొనినవారిలో వాషింగ్టనుగారి మిత్రుఁడుకూడగలఁడు. అందుచేత నాయనకు కుడిహస్తమై మెలంగి దేశాభిమానముతో శత్రువులనెదిరించినయాయనమిత్రునకుఁ దప్ప ఆయుద్యోగ మొరులకు లభించదనియు, మనుష్యమాత్రుఁడగు వాషింగ్టన్ప్రభువు మిత్రుని నిరాకరించి యన్యుల కాయుద్యోగమిచ్చుట కలలోని వార్తయనియు నితర దరఖాస్తుదారులు తలంచి నిరాశతో నుండిరి. ఈయభిప్రాయము వీరికిమాత్రమేగాక ఆప్రభువు మిత్రుల కనేకులకుఁగూడ గలదు ఆయుద్యోగమునకు రాజకీయవ్యవహారములందు వాషింగ్టన్గారికి విరోధియైన బుద్ధిమంతుఁ డొకఁడుకూడ దరఖాస్తు పెట్టెను. ఈయనకు రాజకీయవిషయపరిజ్ఞానము, ప్రపంచజ్ఞానము వీనికితోడు నీతి .గౌరవము, నయవర్తనము కూడ గలదు. కా

ని యీయన వాషింగ్టన్ ప్రభువువారి ప్రతికక్షులలోనివాఁడు; అది వరలో ననేకమాఱులు ఆప్రభువు తలపెట్టిన కార్యములకు విఘ్నము గలిగింపఁజూచినవాఁడు నగుటం జేసి యాతని కావని లభించుట దుర్ఘటమని యనేకులు దలంచిరి. దీనికితో డీదరఖాస్తుదారుఁడు తనప్రవర్తన మంచిదైనట్లు గొప్పవారినుంచి సత్ప్రవర్తనాపత్రములనైన గొనియుండలేదు. అందుచే వాషింగ్టంన్ప్రభువు సర్వవిధముల తన మిత్రున కుద్యోగ మిచ్చుటకే యాక్షేపణ గనిపించద య్యెను. కాని, యేమిజరిగినదో చూడుఁడు! ఆయుద్యోగము వాషింగ్టన్ప్రభువు తన శత్రునకే యొసంగెను. ఈప్రవర్తన జూచి యందఱు అన్నివిధముల నాశ్చర్యము బడనారంభించిరి. కాని యీప్రభువు నడుగువాఁ డెవ్వఁడు?

ఆయనపక్షమువారికి ఈయుద్యోగము వాషింగ్టన్ప్రభువును చిరకాలమునుండి కనిపెట్టికొనియున్న మిత్రునకిచ్చుట ధర్మమని యభిప్రాయముకలదు. అందుచేత ఆయనమిత్రుఁ డొకఁడు వాషింగ్టన్గారీవిషయమున నన్యాయము చేసిరని తలంచి యొకనాఁడు ధైర్యముతో ఆయనవద్ద నీప్రసంగమునుదెచ్చి మీరేల యిట్టి యన్యాయము జేసితిరి. ఇది మీకు తగునా!" యని యడిగెను.

దీనికి వాషింగ్టన్గారొసంగిన ప్రత్యుత్తరము చూడుఁడు! ఈప్రత్యుత్తరమువలన ఆయనకు విధికృత్యమం దెట్టిగౌరవము గలదో తెలియఁగలదు. ఆయన ప్రత్యుత్తరమిది:—"నామిత్రుని నేనధిక గౌరవముతో నాదరింతును. ఆతనికి నాగృహమందు స్వాగతమొసంగుదును; నాహృదయమును వెలిబుత్తును. ఆతఁడు సుగుణవంతుఁడని నేనెఱుఁగుదును. ఎన్ని మంచిగుణములున్న నేమి? ఆతఁడు మంచివ్యవహారతకాఁడు. ఆతని కక్షిదారుఁడన్ననో, నాకు శత్రువైనను వ్యవహారపరిజ్ఞానము కలవాఁడు. ఈవిషయమునకు స్వాభిలాషతో నెంతమా

త్రము ప్రసక్తిలేదు. ఇతరసమయములందు జార్జివాషింగ్టన్ సామా న్యమాత్రుఁడేగాని ఈవ్యవహారమును దీర్చునపుడు మాత్రము "సం యుక్త రాష్ట్రముల ప్రెసిడెంటగు జార్జివాషింగ్టన్" అని యెఱుంగుము. జార్జివాషింగ్టన్‌గా నామిత్రునకు శక్తిగలంది యుపకారము చేయఁ గలను. కాని సంయుక్త రాష్ట్రాధిపతిగ మాత్రము నామిత్రునకు సాయ మొనర్పఁజాలను."

అర్హానర్హతలువిచారింపక బంధువులకు మిత్రులకు నుద్యో గములిచ్చి యన్యుల కపకారము జేయసాహసించు విద్యాధికులు తది తరులుకూడ నీకథ నెఱింగి నయమార్గవర్తను లగుదురుగాక !!!

## కోయవాండ్రు-వర్తకుఁడు

పూర్వకాలము వింధ్యపర్వతసమీపమున మహారణ్యములలో నివసించుచు కోయవాండ్రనేకు లుండిరి. వారు వ్రాయను చదువను నేర్వక పోయిన నైకమత్యముఁ గలవారై కష్టపడి తమ జీవయాత్రను నడపుచుండిరి. వారామహారణ్యమునఁగల ఘాతుకమృగముల సంహ రించుచు వాని చర్మముల బాగుచేయుచుండుటయు, దట్టముగ బలిసి యున్న వృక్షముల నఱికి యావిపినమధ్యమున సేద్యము చేయుటయు మాత్రము నేర్చియుండిరి. వారు సమస్తవిధములైన కాయధాన్యము లను పండించుచు దూరముననున్న పల్లెలకుఁ గొనిపోయి యాధాన్య ముల నక్కడనుండు వర్తకులకిచ్చి వారివలన వస్త్రములు వ్యవసా యపు సామానులు చిత్రములైనవస్తువులు మొదలగునవి గొనిపోవు చుండిరి. ఇట్లుండఁ గొంత కాలమునకు సమీపమున నొకపల్లెలో నివ సించియున్న ధనగుప్తుండను నొకవర్తకుఁ డాకోయవాండ్ర యమా యకత్వమును గ్రహించి వారికడకేగి యెట్టయిన చర్మములను, పుల

తేనెను, కాయధాన్యములను సంగ్రహించి వారి ప్రాపకము సంపాదింపవలయునని తలంచుచుండెను. అట్లు తలంచుచు నొక్కనాఁడు కొన్ని పిండివంటలను, మధురాహారములను, సన్నదువ్వలువలను గొంపోయి, కోయవాండ్రనాయకుని సందర్శించెను. ఆకోయనాయకుఁడాధనగుప్తుఁడు తెచ్చిన వంటకంబుల భక్షించి సన్న దువ్వలువల ధరియించి సంతుష్టాంతరంగుఁడై కూర్చుండి వర్తకునితో ముచ్చటించుచుండ ధనగుప్తుఁ డాతనితో నిట్లనియెను. "అయ్యా! మీకోయదొరలందఱును దూరముననున్న పల్లెలకుఁబోయి చాలశ్రమపడి తుదకు మంచిసరకులఁగొని తెచ్చుకొనలేకున్నారు. మీకాశ్రమ యక్కరలేకుండ మీవారికందఱకుఁ గావలసిన సరకుల నన్నిఁటిని మీవద్దకుఁ గొనివచ్చి యిచ్చుచుందును. అందుకు ప్రతిఫలముగా మీరు నాకు కాయధాన్యములను చర్మములను నొసంగిన చాలు"నని చెప్పెను.

కోయనాయకుఁ డావర్తకుని పలుకుల నాలించి మావారికందఱకు నీవార్త విన్నవించి వారి యనుమతి పొందెదనని ధనగుప్తునితోఁ జెప్పి తక్కినవారియనుమతిని ధనగుప్తునికోరిక నెరవేర్చెను. ధనగుప్తుఁడును వారికి కావలసిన సమస్తపదార్థములఁదెచ్చి యిచ్చుచు వాటికి పదిరెట్లు విలువగల చర్మముల, కాయధాన్యములఁ గొంపోయి సుఖముగ కాలము గడపుచు భాగ్యభోగ్యములచే నతిశయించి తోడివారిలో గౌరవముగ మెలంగుచుండెను. కోయవాండ్రును ధనగుప్తునికిఁ గావలసిన సరకులనెల్ల నిచ్చుచు నాతఁడు తెచ్చిన సరకులపుచ్చుకొని సుఖముగఁ గాలము గడపుచుండిరి. ఇట్లుకొంతకాలము నడచునప్పటికి ధనగుప్తుని భాగ్యమునుజూచి సహింపఁజాలక మరియొక వర్తకుఁడు వానిమోసమును బయలుపెట్టఁగోరి యొక్కనాఁడు కోయవాండ్రవద్దకుఁబోయి సరియైన ధరయిచ్చి వారికడనున్న చర్మములను జొన్నలు మొదలగు కాయధాన్యములను గొనెను. అట్లుగొనుటయే

గాక యీధనములోఁ గొంత వెచ్చించినచో మీకు కావలసిన సర కులన్నియు వచ్చుననియు మిగిలినసొమ్ము మీరు మరియెందుకైన వి నియోగింపవచ్చుననియు నావర్తకుఁడు వారికుపదేశించి ధనగుప్తుని మాయాపరివర్తనము నంతను వెలిబుచ్చెను.

అంతట మఱికొంతకాలమునకు ధనగుప్తుఁ డాయరణ్యమునకు బోవునప్పటి కాకోయవాండ్రు బంగారుసగలతోడను, చిత్రిచిత్రవస్త్ర ములతోడను, చక్కని గృహోపకరణములతోడను నొప్పియుండుటఁ జూచి తనమోస మెవ్వఁడో దుర్మార్గుఁడు బయలుపెట్టినాఁడని గ్ర హించి వెనుకటివలెనే వారియొద్దకుఁ బోలు కొన్నిభక్ష్యముల వస్త్ర ములనిచ్చి తనకుఁ గావలసిన పదార్థము లిమ్మని కోరెను. అప్పుడా కోయనాయకుఁడు వర్తకునిఁజూచి "ధనగుప్తా! ఇంతకాలమునుం డియు మమ్ము మోసపుచ్చి నీవు గొంపోయిన సరకులకు పొందిన లాభముతోఁ దృప్తిపొందనేరక యింకను మమ్ము వంచింపఁదలఁచి నావు. ఇది యేటిన్యాయము. తిన్నయింటివాసములు లెక్కపెట్టుమ న్నట్లు మమ్ము నిర్ధనులుగ నిర్భాగ్యులుగఁ జేసి యెల్లపుడును పరుల, చేతిక్రింద జీవించునటులఁ జేయఁదలఁచిన కూరుఁడవు నిన్నేమిచేసి నను పాపములేదు. దుర్మార్గుఁడా! మాక్షేమము గోరినవాఁడవేమైన నొక్కనాఁడైన మాసరకుల విలువయు నీవు మాకొసంగు వస్త్రముల యొక్కయు, భక్ష్యముల యొక్క విలువయు మాకెఱింగించితివా? పాపము! దైవసమానుఁడైన మరియొక వర్తకుఁ డొక్కతూరిమముఁ జూడవచ్చి దీనిరహస్య మంతయు వెలిబుచ్చి మాకు మహోపకా రము చేసినాఁడు. అట్టివాని నెప్పుడు మరువఁగూడదు. కావున నీవు మావలన సంపాదించిన ధనమంతయు మాకిచ్చివేయుము. లేకున్న నిన్ను ప్రాణములతో విడిచిపెట్ట"మని పలికెను. ఆపలుకుల విని ధన గుప్తుఁడు గజగజ వడఁకుచు బిడ్డలు కలవాఁడననియుఁ నాభాగ్యములో

సగముపాలు మీకొసంగుదుననియు నన్ను కాపాడవలెసనియు నంగ లార్చుచు కోయవాండ్రి కాళ్ళపైఁబడెను. దయాస్వభావముగల యాకోయదొర వానితప్పునుమన్నించి ధనమునుమాత్రము గ్రహించి ప్రాణములతో విడిచిపుచ్చెను. ధనగుప్తుఁడును మోసవృత్తి యెన్న టికిఁ దగదనియు, నితరుల వంచించి మోసమున బ్రతుకుచున్న చో నెన్నటికైన నది బయలుపడి ప్రాణహానిఁ దెచ్చుటయేగాక వంశక్షు యముఁగూడ జేయుననియు, నందఱు సమానముగ ననుభవింపఁదగిన వారేయని గ్రహించి సన్మార్గమున నడచుచు దయాసత్య శౌచములు గల పురుషు లెన్నటికైన నభివృద్ధిఁ జెందఁగలరని దలంచుచు తన సొత్తంతయు కోయవాండ్రి కొసంగి దరిద్రుఁడై దేశములపాలై పోయెను. కోయవాండ్రును తమ యమాయకత్వమును గ్రహించి మోసముచేసిన ధనగుప్తున కేయపకారమును జేయక వాని భాగ్యము ను మాత్రము గ్రహించి కాలక్రమమున లోకజ్ఞానము గలవారై ప రుల మోసమునకు చిక్కక సుఖముగఁ గాపురము చేయసాగిరి.

## వృషకేతుఁడు

రామాయణ, భారతాది యుద్ధగ్రంథముల జదువునప్పుడానాఁడు పసిబాలురు సైతము సమరధర్మములఁ జక్కగ నెఱుఁగుదురనియు నా టివారికి యుద్ధములన్నను, వేఁటయన్నను సాము కసరతు లన్నను, విద్యాభ్యాస మన్నను, ధర్మ పరిర్తన యన్నను, నీతియన్నను, సత్య పరివర్తనయన్నను మిక్కిలి గౌరవమనియుఁ జదువరులు తలంపకపోరు. మఱియు నాఁడు సంఘమునకు వేరు పురుగులవంటి యతిబాల్య వివా హము మొదలగు దురాచారములుగాని, విద్య నేర్వని యువతులు గాని, ధర్మములఁ బ్రబోధింపని నారీమణులుగాని యున్నట్టు తోఁచ

దు. ఆగ్రంథములలోని యితిహాసములు నీతిదాయకములై, ధర్మసంస్థాపనములై, పాత్రివంతములై చదువువారి మనముల రంజింపంజేయుచుండును. అందలి రసములు చదువువారి శరీరములఁ బులకాంకితములఁ జేయుచుండును. అట్టి మహాగ్రంథముల మన దేశీయు లిప్పటికిని గొన్నిపల్లెలలోఁ బురాణము చెప్పించుకొని వీనుల విందుగ వినుచు నానందసాగరమున నోలలాడుచు నాఁటివారి పరిజ్ఞానములఁ గొనియాడుచు, ధర్మపరివర్తనను మెచ్చుకొనుచు, నీతిబలమునకుఁ దల యూచుచు వేయివిధముల వినోదించు చుందురు. ఆగ్రంథములో భారతము మహాసముద్రమువంటిది. అందలి కథలన్నియు మిక్కిలి మనోహరములుగ నుండును.

కౌరవులకు పాండవులకు గలిగిన మహాయుద్ధములో కృష్ణాది మహావీరులందఱను గడతేర్చి సమరధర్మము ననుసరించి పాండవులు బాలుర వృద్ధుల, సేవకజనంబుల సంరక్షించిరి. అట్లు రక్షింపఁ బడినవారిలోఁ గర్ణుకుమారుఁడగు వృషకేతుఁడొక్కఁడు. మహాయుద్ధమున వంశక్షయము గావించిన పాతకమును బాపుకొనుటకై ధర్మరాజు చింతించుచుండ వ్యాససంయమి యాతనికడకు వచ్చి, యశ్వమేధంబు గావించిన నీకీ కిల్బిషము పోవునని చెప్ప ధర్మరాజు యోగ్యంబైన యశ్వం బెచ్చట దొరకునని యాతని నడిగెను. అడుగుటయు "భద్రావతీపురమును బరిపాలించు యౌవనాశ్వునికడ జన్నంబునకుఁ దగిన లక్షణములుగల గుఱ్ఱమున్నయది. కాని యాపట్టణమును చొఱుట యసాధ్యము. వానియాజ్ఞ లేకుండ పోతుటీగకు నైన నాపట్టణమునకుఁబోవ శక్యముగాదు. ఎట్లైన నాయశ్వమును సంపాదించినచో నీయజ్ఞంబు నెఱవేఱు"నని వ్యాసుఁడు బదులుచెప్పెను. ఆతనివచనములనాలించి సమరమున నిదివఱకే డస్సియున్న నాయనుజుల నీకార్యమునకు నియోగింపనేరననియు, నాకు బందుగుఁడుఁ గూరిమిచెలికాఁడు, విశే

షించి మమ్మెల్లప్పుడు గంటికి ఱెప్పవలెఁ గాపాడువాఁడునగు వాసుదే వుఁడు దూరముననున్నాఁడనియు, ఘటోత్కచ నందనుని మేఘవర్ణుని యుద్ధమునకుఁ బంపుట ధర్మము కాదనియుఁ దలంచి చింతించు చుండ సమీపముననున్న వృషకేతుఁడు, పదునాలుగువత్సరముల ప్రాయముగల బాలుఁడు ధర్మజు నీక్షించి "రాజా! నీకావంత యావంతయు వలదు. దేవర ముదల యయ్యేనేని నేనొక్కఁడన బోయి యౌవనాశ్వునితోఁ బోరాడి హయముంగొనివచ్చి యాక్షణము సమర్పింతుగావున నన్నుఁ బంపసమ్మతింపుఁడు. బాలుఁడనని సంకోచింపవల" దని పలికెను. ఆపలుకులు నాలించి ధర్మరాజు "వత్సా! సమర రంగమున నీతండ్రిని గడదేర్చిన నాఁటనుండియు నీమొగముఁ జూచినపుడెల్ల మేము సిగ్గుపడుచుంటిమి. అదియునుఁగాక, నీవు బాలుఁడవు ముక్కుపచ్చలారని వాఁడవు. నిన్నాజికిఁ బంపుట న్యాయముగా" దని పలికెను. ఎంత చెప్పినను వినక వృషకేతుఁడు భద్రావతికిఁ బంపుమని బలవంతపెట్ట తుదకు భీముని దోడిచ్చి ధర్మరాజు గుఱ్ఱమును దోడితెమ్మని పంపెను. అనంతరము భీముఁడు వెంటరా వృషకేతుఁడు భద్రావతీ పట్టణమునకుఁ బోయి యజ్ఞమునకుఁ దగినగుఱ్ఱముసు గాంచి పట్టి కొనివచ్చుచుండ యౌవనాశ్వుని సేన లెదిరించి వానితోఁ బోరాడెను. తనపైఁబడిన సేనల నన్నిఁటిని నుగ్గుచేసి క్షాత్రము దీపింప నాబాలుఁడు నిలిచియుండ మరల కొంత సేనతో యుద్ధమునకు వచ్చుచున్న యౌవనాశ్వుఁడుగాంచి "ఔరా! ఈపసిబాలుఁడేనా! నా సేనల నన్నింటిని బిల్కుమార్చినది? ఏమివీని క్షాత్రము? ఇట్టిచక్కని వానిని క్షాత్రవంతుని నాచేతులార నెట్లుజంపుదు" నని తనలోఁదాను దలంచి సమీపించి గుఱ్ఱమును విడువుమని వృషకేతునడిగెను. వృషకేతుఁడును యౌవనాశ్వునిఁ దిలకించి "యీ యశ్వమును మాధర్మరాజుగారు కోరికొన్నారు గావున మీరు మనఃపూర్వకముగా నొసంగ

వలయును. ఒసఁగుటకు సమ్మతింపలేని నాతోఁ బోరాడి జయలక్ష్మీ యుతులై దీనినిఁ గొంపోవలయు" నని పలికెను. యౌవనాశ్వుఁ డందుకు సమ్మతింప నందున వారిరువురకును సంకుల సమరము జరిగె. బాలుఁడని కనికరింపక యనేకవిధముల యౌవనాశ్వుఁడు సిలుగులఁ బెట్టుచుండఁ గాపాడుటకు వచ్చిన భీమసేనుఁడు దూరమునుండి గాంచి సమీపించి "వత్సా! నీవు పదాతివి; వారు రథికులు. గావున నీవు వారితోఁ బోరాడ నేరవు. అదియునుఁగాక నీసేనామణి నన్ను వరియించినది. కావున నీవుచేర వావిగా"దని పలికెను. ఆపలుకుల నాలించి వృషకేతుఁడు చిఱునవ్వునవ్వుచు "దేవరకుఁ గోడలైన యీసేనావధూటి మీమొగము జూడఁజాలక యెట్లు తన మొగము వంచినదియో చూఁడుఁడు. నేను దీనింబరిగ్రహింపఁ దగినవాఁడ"నని వాలియున్న జండాలఁ జూపెను. అంతట భీమసేనుఁడు పైనుండి చూచుచుండఁ గొంతసేపు వారిరువురును బోరాడిరి. బాలుని బాణప్రహారము లఁదాళఁజాలక యౌవనాశ్వుఁడు వృషకేతుని సమీపించి వృద్ధుఁడనగు నన్నలయింపక హయముం గొంపొమ్మనియు, నీక్షాత్త్రమునకు మెచ్చితి ననియుఁ బలికి వానికంఠమున బూలహారము వైచెను. అంతట భీముఁడు యౌవనాశ్వుని తమవెంట రావలయునని గోర నట్లు వత్తునని చెప్పి గుఱ్ఱమును వెంటఁబెట్టుకొని వృషకేతన భీమసేనులు వెంటరా యౌవనాశ్వుఁడు ధర్మరాజుపాలికిఁ బోయెను. బాలుఁడైన వృషకేతుని పౌరుషమునకు మెచ్చుకొని వానికిఁ దగిన గౌరవము జేయుచు ధర్మరాజు వృషకేతునిపై భక్తిగలిగి మెలంగుచుండెను.



# సోలను-క్రోయిససులకథ



మన ఆసియాఖండపు పశ్చిమోత్తర దిశయందు చిన్న ఆసియా యనునొక దేశము కలదు. క్రీస్తుశకమునకై దా.సవందల సం॥ములకు పూర్వము అనగా సుమారు రెండువేల అయిదువందల సం॥ములకిృంద ఆచిన్న ఆసియా దేశమందలి లిడియారాజ్యమును "క్రోయిసస్సు" ను రాజు పాలించుచుండెను. ఆరాజ్యమందలి ప్రజలగు లిడియసులును, యూరపుఖండమందలి గ్రీసు దేశమువారగు గ్రీకులును పూర్వమొక కాలమున నొక సంతతివారని చెప్పుదురు. ఆచారవ్యవహారాదులందు నీరెండుజాతులకుఁ గలపోలిక పై వాదమును స్థిరపఱచును. లిడియారాజ్యమేలిన క్రోయిసస్సు చాలదేశమును జయించి శత్రురాజుల కజేయుఁడై బలపరాక్రమములకు ప్రఖ్యాతి గాంచెను. అతఁడు గొప్పధనవంతుఁడగుటచే దేశదేశములనుండి మహాపండితులువచ్చి యుచిత రీతిని సత్కరింపఁబడువారు. క్రోయసస్సను భూలోక కుబేరుఁడని చెప్పుకొనువారు. ఆతని ధనాగారములందలి ధనమునకును, మందిరమందలి వెలలేనిరత్నభూషణములకును మితి లేదు; ఇంతభాగ్యమున్నను నతని యాశకు మేరలేదు; కాంక్షకు హద్దులేదు; కోరికలకు కొదువలేదు. భోగపరాయణుఁడగు క్రోయిసస్సు విచ్చలవిడి ద్రవ్యమును వెచ్చబుచ్చి సకలసౌఖ్యముల ననుభవించుచు నెల్లప్పుడు తనబలము, తనపరాక్రమము తనధనము, తన సౌఖ్యము స్థిరమని నమ్మియుండువాఁడు. భగవత్ప్రీతికరమగు కార్యములకు ధనము వెచ్చింపకున్నను ధానధర్మములకు ప్రఖ్యాతి గాంచకున్నను, శరీరసౌఖ్యమున కుపకరించు విషయములందు మాత్రము ధనమును తృణప్రాయముగ నెంచి యథేచ్ఛగ కర్చుబెట్టు వాఁడు. ఇంద్రియలోలత్వమున మునింగి భోగపరాయణుఁడై చరించు క్రోయసస్సు క్రమముగ మహాబలశాలిని భాగ్యశాలిని యనిగర్వించి

మైమరచి తిరుగువాఁడు అతఁడు కొన్ని విషయముల మంచివాఁడనుట నిశ్చయమె కాని ఆతసియందొక గొప్పలోపముగలదు. అదియేదన దుర్నీతిపరుల స్తోత్రపాఠములకుబ్బి యానందించువాఁడు. వేయేల! ధనాగారములు, మణిభూషణమందిరములు, నవరత్న ఖచిత సువర్ణాంబరములు కండ్లారఁజూచి యానందించుచు తన్నుమించిన భాగ్యశాలు లుండుట యరిదియని తలపోయుచు, ధనమేబలముగను ధనమే యారోగ్యముగను, ధనమే ప్రాణముగను పరిగణించుచు నతఁడు విఱ్ఱవీగుచుండెడివాఁడు. ప్రపంచమున సామాన్యముగ ధనమే పావనమగుటచే నిట్లున్న క్రోయసస్సును ప్రతివారు సన్నుతించువారు; ప్రతివారు భక్తి గొలుచువారు; ప్రతివారు ముఖస్తుతి చేయువారు ఎందఱెన్నివిధములఁగొనియాడినను తనివిసనక క్రోయిసస్సు తనసంపదను, భాగ్యమునొక్కమారు గ్రీకు దేశమందలి యేథేన్సు పురవాసియగు "సోలను" అను మహాపండితునకుఁజూపి యాతని నాశ్చర్యనిమగ్నునింజేసి యాతనివలనగూడ స్తోత్రపాఠముల నందఁగోరెను. ఈయుద్దేశముతో ఏథేన్సు పురమందలి యామహాపండితున కాహ్వానము చేయఁగా నాతఁడు, క్రోయిసస్సు నభీష్టమెద్దియొ యెఱుంగఁగోరి యాతఁడు కొలువుదీర్చియున్న సార్డిసునగరమున కరుదెంచెను. అచ్చట రాజు సోలను నతిగౌరవముగ మన్నించి యమితవైభవముతో నాదరించెను ఆసోలను గ్రీసుదేశపు మహాతత్త్వవేత్తలలో నొకఁడు. ఏథెన్సురాజ్యమందలి ప్రజలకీ మహామహునియం దమితగౌరవముగలదు. వారొక సమయమున ధర్మాధర్మము లెఱుఁగక వర్తించుటఁజూచి ఈతఁడు వారికి ధర్మశాస్త్రములువ్రాసి యందలి నిబంధనల తాఁజెప్పువరకు మార్చకుండ ప్రమాణముచేయించి పట్టణమున నున్నవానిని మార్చుమని బాధింతురనుభయమున, దేశక్షేమమును ప్రజాక్షేమమునుగోరి పదిసం॥రములపాటు వారికంటఁబడక దేశముకూడ విడచి యతఁడు

విదేశములకుఁ బోయెను. ఇదిగాక సోలను ఆకాలపుజ్ఞానులలో మహాజ్ఞాని ; విరాగులలో గొప్ప విరాగి. వేదాంతాది శాస్త్రములనెల్ల జక్కగఁజదివినసోలనునకు ప్రపంచకము మిథ్యయనియు, సంపదలు క్షణభంగురములనియు, తనువులశాశ్వతములనియు ఆత్మయే సత్యమనియు, పరాత్పరుఁడే నిత్యమనియు నిండువిశ్వాసము కలదు. ఇట్టిమహనీయుఁడువచ్చి కొలువుకూటము నలంకరింప రాజగు కోయిసన్సు అజ్ఞానాంధకారమున కన్నుగానక తనసంపదయే యీజగత్తున కాధారమనితలంచి నవరత్నఖచిత సువర్ణభూషణభూషితుఁడై, బంగారువలువలుదాల్చి మంత్రిసామంతాదిబృందపరివేష్టితుఁడై సింహాసన మధిష్టించి సోలనుతో నిట్లనెను.—మిత్రమా! మీరు సర్వజ్ఞులు; మీకీర్తి జగద్విఖ్యాతమైనది. మీరరుగని దేశములు, చూడనిరాజులు నెచ్చట నుండదు. కాని మీరు చూచిన పరాక్రమవంతులు, యశోవంతులునగు రాజులలో నొక్కరైన నావలె వెలలేని యాభరణములు, పసిఁడిదువ్వాలువలుధరించి యింతయందముగ, నింతదర్పముగ నింతఠీవిగ నెంౘడైన కఁపించిరా? నన్నుమించిన వారెచ్చటైనగలరా? రాజుప్రశ్నకు నిసుమంతయు జంకక సోలను యిట్లుబదులుచెప్పెను:--"ఆ. లేకేమి? దూరముపోనేల? నిన్నుమించినవారు నీరాజ్యమందే కలరు. అందమున నిన్నుమించిన నెమళ్ళను కోళ్ళను నెన్నిటినో గనియుంటిని. అవి నీవలె సకలశ్రమలపడి విలువరాళ్ల నతికించుకోఁబనిలేదు. దానియలంకారములు, అంబరములు ప్రకృతి సిద్ధములు, దైవదత్తములుగాని కొని తెచ్చుకొనినవికావు. వానికిఁగల యాధిక్యత నీకులేదు.

సోలను నదురు బెదురులేక మహారాజున కంతమోటతనముగ ప్రత్యుత్తరము జెప్ప నాతని నిర్లక్ష్యమునకు, తెగువకు రాజచ్చెరువొంది సేవకులఁ బిలిచి తన ధనాగారములను మణిభూషణమందిరము

లను తెలిపి యామహావిద్వాంసున కొక్కమారు తనభాగ్యమును జూపుమని యుత్తరువుచేసెను. పిమ్మట సోలను వానినెల్ల జూచిన పిదప 'నాతో సమానమైన సౌఖ్యవంతుని మీరెవ్వనైనఁ గని యెఱుఁగుదురా' యని రాజాతని నడిగెను. దానికి సోలను ఇట్లు బదులు చెప్పెను. "రాజా! నేను జూచినవారందఱిలో నాకొక్కఁడుమాత్రము సౌఖ్యవంతుఁడు కనిపించెను. అతఁడు మాయేథెన్సుపురవాసి యగు "పెల్లసు" అతఁడు దరిద్రుఁడని చెప్పుటకు వీలులేదు. కానిధనవంతుఁడుమాత్రముకాఁడు. ఆతనియవస్థ యెప్పుడు చూచినను గోచికెక్కువగ, గొంగళికి తక్కువగ నుండును. కాని భాగ్యశాలి కాకున్నను సుగుణ సంపదచే రాజిల్లు వాఁడగుటచే పెల్లసు తనపుత్రుల నాదరిద్రముననే సకల విధముల సౌఖ్యపెట్టి ప్రజల గౌరవమునకు ప్రేమకు పాత్రులగునట్లు చేసెను. తుద కాతఁడు తన మాతృభూమికొఱకు శత్రువులతో ఘోరయుద్ధముచేసి తన ప్రాణములఁగూడ దేశమునకర్పించెను. అతనికంటె నెక్కువఘనుఁడు సౌఖ్యవంతుఁడు మరియొకఁడు లేఁడని నాయభిప్రాయము." స్వసౌఖ్యమునకు ధనము, భాగ్యము, సంపద యాధారమని తలంచక ధనరాసులనెల్ల తృణప్రాయముగఁజూచిన సోలను ప్రవర్తన కచ్చెరువొంది రాజు పెల్లసు తరువాత రెండవ యదృష్టవంతుని క్రిందనైన తన్నతఁడు పరిగణింపఁడాయని తలంచి "అయ్యా! మీరుచూచిన సౌఖ్యవంతులలో పెల్లసుతరువాత నేను రెండవవాని క్రిందనైన రానా" యని యడిగెను.

దానికి సోలను మరల యిట్లు బదులు చెప్పెను. "రాజా! పూర్వము మాయేథెన్సు నగరమున గుణవంతులు, బుద్ధిమంతులునగు సోదరు లిరువు రుండువారు. ఆసోదరుల మాతృభక్తికి, పితృభక్తికి మెచ్చి తల్లి వారిసుగుణ సంపదను మనమున తలపోసి యానందించుచు తనపుత్రుల వాత్సల్యమును పరిగణించి యైన వారియెడ ప్రసన్నభా

వము వహింపుమని యనుదినము దైవమును ప్రార్థించుచుండెను. ఇట్లుండఁ గొంతకాలమున కామె ప్రార్థన లంగీకరింపఁబడెను. ఆ సోదరు లిరువు రొకదినమున దేవాలయమున కరిగి దైవమును గొలిచిన పిమ్మట నచ్చటనె నిద్రించి నిద్రలో ప్రాణములు విడిచిరి."

అంతట క్రోయిసస్సు సోలనుతో "అయ్యా! మీరు నేను సౌఖ్యవంతుఁడనని తలంచరా? ఇన్ని సంపదలతో తులతూగుచున్నను నేను సౌఖ్యవంతుఁడగానా?" యని ప్రశ్నించెను.

అంతటసోలను మరలయిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "రాజా! నీవిప్పుడు బలవంతుఁడవు, ధనవంతుఁడ వనుట నిశ్చయమెకాని, నీ బ్రతుకంతయు నీవిధమున గడచునని యెచ్చటనున్నది? మనజీవితకాలమున నెప్పు డేమార్పు వచ్చునో యెవరుచెప్పఁగలరు? అస్థిరములు, అనిత్యములునగు సంపదలను నమ్ముకొని భాగ్యవంతుఁడను, నదృష్టవంతుఁడను నని యానందించుట యవివేకము. దైవానుగ్రహమున నెవ్వఁడు జీవితమంతయు సుఖముగఁ గడిపి హాయిగమరణము నొందునో యతఁడే యదృష్టవంతుఁడుగాని యొరులు గాసేరరు. అందుచే మరణాంతమువఱకు నితఁడదృష్టవంతుఁడు, ఇతఁ డదృష్టహీనుఁడనియేరినిగూర్చిగాని నిర్ణయింపరాదు."

ఇట్టి నిరుత్సాహ వచనములఁ బలికిన సోలనుమీఁద నసహ్యము, కోపమువచ్చి రాజతని సత్కరింపకయే వెడలనంపెను.

క్రోయిసస్సు తానదృష్టవంతుఁడననియు, బలవంతుఁడననియు పొంగుచుండ కొంతకాలమునకు పారసీక దేశము నేలు "సైరసు" అను రాజు లిడియా దేశముపై దండెత్తి, క్రోయిసస్సు సేనల నోడించి రాజధానియగు సార్డిసు నగరము బ్రవేశించి దానిని స్వాధీనపరచుకొని క్రోయిసస్సును ఖైదీగఁ బట్టుకొనెను, ధనరాసుల నెల్ల తన యధీనము

చేసికొనినపిమ్మట క్రోయిసస్సును కాలుసేతులు బంధించి తగులబెట్టు మని సైరసు తనభటుల కానతి యిచ్చెను. వారును రాజాజ్ఞప్రకారము చితిచేర్చి క్రోయిసస్సునందు బడవైచి, యగ్నిదాపనాతఁడు "అన్నా! సంపద లెంత యనిత్యములు" అని తలపోసి. పూర్వపు యవివేకము నకు చింతించి యాసమయమున మహనీయుఁడగు సోలసుపేరు జ్ఞప్తికి రాగా ముమ్మారు "సోలను, సోలను, సోలను" అని గట్టిగ నరచెను అప్పుడు సైరసు ‹ఇదియేమి యితఁడిట్లరచుచున్నాఁడ›ని యడిగి పూర్వపువృత్తాంతమునెల్లఁ దెలిసికొని, మనస్సున జాలిబుట్టగా చితి నార్పించి క్రోయిసస్సును బైకి తీయించి, క్షమించి రాజుకుఁజూపఁదగి నమర్యాదనెల్లఁ జూపి దయతో నాదరించెను.

---

## సుమంతుఁడు

సుహ్మదేశమున కమలాకరమను రాజ్యముకలదు. దానిని సుమంతుఁడను రాజు నీతికోవిదుఁడై శత్రుదుష్ప్రరీక్ష్యముగఁ బ్రజా నురంజకముగఁ బరిపాలించుచుండెను. త్రాగుఁబోతులు, జూదరులు, కన్నగాండ్రు, లంచగొండులు మొదలగు దురాచారులువలననేభయ మును జెందక, నాతని పాలనమునకు లోఁబడిన ప్రజలందఱును సుఖ ముగఁ గాపురముచేయుచు పాడిపంటలతోఁ దులతూగుచు నైశ్వర్య సమృద్ధితో విలసిల్లుచుండిరి. శాంతస్వభావుఁడు నిర్మలహృదయుఁడు సత్యవంతుఁడునైన సుమంతునియెడ గౌరవము గల తోడిమహా రాజు లందఱు వానితో మాటలాడుటయు, వాని చెలికారముసంపా దించుటయు, వాని యనుగ్రహమునకు పాత్రులగుటయు, వాని బాం ధవ్యము గలిగి యుండుటయు, వానికి ప్రీతికరములగు కార్యములఁ

జేయుటయు, మహాభాగ్యముగఁ దలంచి యెల్లవేళల వానిని స్మరించుచు నాతనికీర్తి చంద్రికను లోకమునఁ బ్రకాశింపఁజేయుచు నానాఁటివారిలో మేటియని చాటుచుండిరి. ఇట్లుండఁ గొంతకాలమునకు సుహ్మదేశమునేలు రాజునకు సుమంతునిగుణాతిశయములు వినవచ్చెను. ఆతని ప్రవర్తనా కౌశలత్వమునకును నిర్మలహృదయమునకును సుహ్మదేశపు రాజగు శూరసేనుఁడు సంతసింపక తన పాలనమునకు లోఁబడిన రాజులందఱు వానినే గౌరవించు చున్నారని యించుక కినుకఁబూని సమయము వచ్చినప్పుడు తగిన పరాభవమును జేయ నిశ్చయించు కొనియుండెను.

సుమంతుఁ డప్పుడప్పుడు తన రాష్ట్రమున సంచరించుచు నీతి బోధకములు, నైకమత్యాభివృద్ధికరములగు నుపన్యాసముల నిచ్చి ప్రజలకు తనయందు గౌరవము గలుగునట్లు నడచుచుండెను. తన రాష్ట్రమునఁగల జనుల కేబాధకలిగినను దనకుఁ గలిగినట్లు తలంచుచు వారిక్షేమము తనదిగ భావించుచు జ్ఞానసంధాయకుఁడై సుమంతుఁడు మెలంగుచుండెను. ఆతని పరిపాలనకు లోఁబడిన ప్రజలు వానియెడ మిక్కిలిగౌరవము కలవారై సమయము వచ్చినప్పుడు తమప్రాణములనైన తమయేలిక కర్పింపనంసిద్ధులై మెలంగుచుండిరి. మఱియువాని రాష్ట్రమునఁగల జనులందఱు శరీరసుఖముల త్యజించి లోకోపకారార్థము పాటుపడుచు కాయకష్టంబునగడియించిన ధనముచే నుదరపోషణముఁ గావించుకొనుచు ఋజుమార్గంబునఁ జరియించుచుండిరి.

సుహ్మదేశపు రాజగు శూరసేనుఁ డన్ననో తనకులోఁబడిన సంస్థాన ప్రభువులకు తగినంతస్వాతంత్ర్యము నీయకపోయినను వారియెడ దయగలిగియైన వర్తింపుచుండుట లేదని ప్రజలు చెప్పుకొనుచుండిరి. ఈతఁడు మహాపండితుఁ డనియు, భగవద్భక్తుఁ డనియు లోకులు చెప్పుకొను చుందురు. కాని వాని పరిపాలనకులోఁబడిన

ప్రజలుమాత్రి మాతనియం దసూయకలవారై మెలంగుచుండిరి. ఇట్లుండ గొంతకాలమునకు సుమంతుని కీర్తికాంత దేశమంతట సంచరించుచుండఁ జూచి శూరసేనుఁడు, సహింపఁజాలక వానిపై దాడివెడల నిశ్చయించి మంత్రులకుసామంతులకు సేనానాయకులకుఁ దనవెంటరమ్మని యాజ్ఞాపించెను. శూరసేనుని యాజ్ఞ శిరసావహించి వానికి లోబడిన మహారాజులందఱు బాసటలై వానివెంటపోయి కమలాకరపుకోటను ముట్టడించిరి. తనకు లోబడిన చిన్నసంస్థానాధీశునిపై సమరమున కియ్యకొనిన శూరసేనుని యవివేకమునకు రిచ్చపడుచు సుమంతుఁడు "దేవర కెప్పుడు నేయపరాధముఁ జేసినవాఁడ కానని యు తమవంటి రారాజులు నాపైఁ గత్తికట్టుట న్యాయము కాదనియుఁ గావున నన్ను మన్నించి యుద్ధము మానవలసిన" దనియు వర్తమానమంపెను. ఆవార్తవిని శూరసేనుఁడు "నీవు మాయెడ గౌరవము చూపక మాచిత్తానుసారము మెలంగక స్వేచ్ఛగాసంచరింపుచున్నావు కావున నీరాజ్యమును స్వాధీనముచేసికొనక మాన" నని సమాధానముచెప్పెను. సామమున కయ్యము జరుగకుండఁగఁ జేసికొనవలెనని సుమంతుఁ డెంతప్రయత్నించిన నాతని ప్రయత్నము లన్నియు నిష్ప్రయోజనము లయ్యెను. సామంతరాజులందఱు సుమంతునియెడ గౌరవము గలవా రగుటచే సూరసేనుని వారింపఁ జూచిరికాని యాతఁడు వారిని నిందింపఁ దొడంగెను. సుమంతుఁడును శాంతమున కార్యము చక్కఁబడు మార్గము లేకపోవుటచేఁ గత్తికట్టియుద్ధముచేయ సమకట్టి తనబలముల ప్రోత్సాహపఱచెను. అంతట సుమంతుని మంత్రియగు కృష్ణకాంతుఁ డాతనిజూచి "రాజా! నీతికోవిదులైన బ్రహ్మచాఁగులు, భక్తితత్పరులు సన్మార్గవర్తులు నైన ప్రజలు నీరాజ్యమున నుండ పగతునివలన మన కేభయమును గలుగ నేరదు. మీపవిత్రనమె మిమ్ము రక్షించు. సత్యవాక్యసంపన్నులు, పరోపకారపరాయ

ణులునగు మీవంటివారిని, దుర్నీతిపరులు దురాచారులు నగు పగతురు నిర్జింపఁగలరా? విశేషించి యేకపత్నీ వ్రతస్థులైన మిమ్ము దుష్టవర్తనుఁడైన శూరసేనుఁ డెట్లు గెలువగలఁడు? నీతిబలము గలవారికి నవి నీతులవలన నేభీతియుఁగలుగ" దని హెచ్చరించెను.

అంతట వారికిద్దఱకు సంకులసమరము జరిగెను. తోడిసామంత ప్రభువు లందఱు శూరసేనుని పక్షమున నిలిచినను వాని కేసాయము నుఁజేయక నూరకుండిరి. శూరసేనుఁడు తనబలము తరిగిపోవుటయు పగతురు పైఁబడి తరుము చుండుటయుఁ జూచి సుమంతునిఁజూచి మిత్రమా! నీధైర్య సాహసములఁ బరీక్షింప నీపై దాడివెడలితిగాని నిన్ను యుద్ధరంగమున బరిమార్ప వలయునని గాదు. నీధైర్యమునకు మెచ్చితిని. కావున నింక మనమిరువురము మిత్రులమై మెలంగవల యు"నని వర్తమాన మంపెను. సన్మార్గుఁడు, దయా స్వభావుఁడునైన సుమంతుఁడు శూరసేనుని మాయమాటలవిని యుద్ధరంగముననుండి వెడలిపోయెను. శూరసేనుఁడును గుట్టున తప్పించుకొని బ్రతికితిఁగదా యని తలంచుకొనుచుఁ దనపురమునకుఁ బయనమై పోవుచు దారిలో నీతిమంతులకు ఋజుమార్గవర్తనులకు సాధ్యములు గాని కార్యములు లేవనియు దుర్నీతిపరుల కెన్నటికైన నాశము తప్పదనియుఁ దలంచి సుమంతుని మార్గము ననుసరించి ప్రవర్తింపఁదొడంగెను. సుమంతుఁడును వెనుకటివలె సుఖముగ రాజ్యమునేలుచు తనపైఁబడి బాధించి నను శూరసేనుఁడు తనకు రారాజగుటచే వానియెడ భక్తికలవాఁడై సుఖముగఁ గాలము గడపుచు శత్రుభయంకరుఁడై కొంతకాలము రాజ్యమేలెను.

# వేటకాఁడు కపోతము

ఒక పల్లెయందొక వేటకాఁడుగలఁడు. అతఁడనుదినమును సమీపముననున్న కాననమున కేగి పక్షులను మృగములనుసంహరించి తాను కొన్ని తినుచు మిగిలిన వమ్ముకొనుచుఁ గాలము గడుపుచుం డెను. ఇట్లుండ నొకనాఁడావేటకాఁడు పక్షివేటకుపకరించు సాధన ముల నాయత్తపఱచుకొని సమీపముననున్నవనమునకుఁ బోయి తన సాధనంబులతో ననేకపక్షులఁబట్టి సంచిలోబడవైచి మరలివచ్చుచుండ నాకసము చిల్లిపడునటుల భోరుమని పెద్దవర్షము కురిసెను. అప్పుడప్ప క్షిధ్వంసకుఁడు తడిసి చలిబాధకోర్వలేక సమీపముననున్న యొక చెట్టు క్రిందికిఁ బోయినిలిచెను. నిలిచి తానుకట్టుకొన్న బట్టలుతెడిసి యుండుటచే భుజముపై నున్న పక్షులసంచిని సాధనములను గ్రింద దింపి బట్టలనున్న నీరు పిండి కట్టుకొనుచుఁ దనలోఁ దానిట్లు విచారిం చెను. "అయ్యో! చలి పిక్కలు వంచివేయుచున్నది. ఈచలిబా ధను నివారించుకొనుటకు సాధనమేది దైవమా! నాకిక్కడ దిక్కె వ్వరును లేరు. ఏతీరున నాబాధ తగ్గునోకద."

అని యావేటకాఁడు విచారించుచుండ నాచెట్టు తొఱ్ఱలో నున్న యొకగువ్వ తనప్రియసఖియేమయ్యెనో యనితలంచి నల్దిక్కులు బరికించి యేమియుందోచక "ఈపెను వానచేఁ గాననంబున నావల్లభ యేమయ్యెనోగదా? ఇంతసేపెన్నడు నుండలేదు. చాలప్రొద్దుపోయినది. నాచిత్తానుసారము మెలంగుచు నాకుచేదోడువాదోడునై సంచరింపు చు నాకష్టసుఖములు తనవిగా భావింపుచు నెల్లప్పుడు నాక్షేమమునే గోరుచు నన్నువిడనాడ నొల్లని నాప్రాణసఖి నేఁడింకను రాకుండుటచే నామందిరముపాడువారుచున్నది. అయ్యో! నాప్రియసఖి యెటనేమ య్యెనోగదా. అధికానురాగ యుక్తయగు నాప్రాణేశ్వరి సుగుణంబు లైహికాముష్మికసుఖసాధనంబులు కావున నొక్కనిమేషమైనను బాసి

యుండలేక యిట్లుచింతింపవలసె" నని మెలుఁగత్తి యేడ్వసాగెను. అప్పు డావేఁటకాని వలలోఁ జిక్కువడిన నాకపోతముయొక్క వల్ల భయుఁ దననాథుఁడు విచారించుచుండ విని నెమ్మనమున సంతసించి "నేనిప్పుడు ధన్యనైతిని. ఇఁక నే బ్రతుక నక్కఱలేదు. నా జన్మము సార్థకమైనది. నానాథుఁడు నన్ను మెచ్చుకొనుటయే సకల భాగ్యములు నాకు సమకూడుట. నిజనాథుని మెప్పువడసితిఁగావున నా విషయమై చింతింపఁదగదని తనలోఁ దాను విచారించి నాథునకు తన తెలుఁగఱింగించి విధికృతంబునకు విచారింప పనిలేదనిచెప్పి, మఱియు నిట్లనియె. "నాథా! నావిషయమై నీవు విచారింపవలదు. శరణాగతుండగువానిని కాపాడవలయునని పెద్దలు చెప్పుదురు. చలిబాధ కోర్వ లేక యీ దీనుఁడు పరితపించుచున్నాఁడు. వీనిని సంరక్షించు నుపాయంబు వెదకుము. అనంతరము నావిషయమై చూచుకొందము" అని ప్రియసఖి చెప్పినతోడనే గువ్వయు నావేఁటకాని సమ్మానించి ధైర్యముచెప్పి కోటరంబునుండి వెలుపలికివచ్చి కాననంబునఁగల యెండుచిదుకులఁదెచ్చి పోగుపెట్టి సమీపముననున్న యొకపల్లెకుఁ బోయి నిప్పుతోనున్న యొకపుల్లను నోటితోఁ గఱచి తెచ్చి యందుంచెను. అంతట నాపుల్ల లన్నియు మండుచుండ వేఁటకాఁడు తన దేహమంతయు కాఁచుకొని చలిబాధ నివారింపఁజేసికొనెను. చలిబాధపోయిన తోడనే యావేఁటకాఁడు తనకాకలివేయుచున్నదని గువ్వతోఁ జెప్ప నాగువ్వయు నెమ్మనమున విచారించి చేయునదిలేక నాతని నుపలక్షించి యిట్లనియె. "స్వామీ! పక్షులాహారపదార్థముల నాయత్త పఱచుకొనుట కలవడి యుండలేదు. పగలెల్ల నందందు సంచరించి దొరకిన గింజల నాహారించి కోటరంబుఁ జేరుపక్షు లేరీతి మీ కాతిథ్యము సేయఁ గలవు ఎట్లయిన మీయాఁకలి తీరవలయును. అయినను విచారింపఁబనిలేదు. నా శరీరం బాహారంబుగ నిచ్చెదఁగాను" మని గుభాలున నాయనలజ్వాలలఁబడి. చచ్చెను.

అదిచూచి యావేఁటకాఁడు మాఱిప్పడి "ఔరా! దీనిసాహసము. ఛీ! నాజన్మమెందుకు? ఇతరులనిమిత్తమై యీపక్షి తన దేహమును సయితము పోఁగొట్టికొనెను. దేహము లశాశ్వతములు. పరుల బాధల నివారింపుచు నెవరికి నేయాపదరాకుండఁ గాపాడుచు సంచరించువారే పుణ్యాత్ములు. పక్షియైననేమి? నాకష్టములు తనవిగా భావించి నాచలిబాధ బాపుటయేగాక తుదకు తన దేహమునుగూడ నాశనంగెను. నేను పాపాత్ముఁడను. చిన్ననాఁటనుండియు ననేక మృగములను పక్షులను సంహరించిన పాతకుఁడను. ఇఁకనైన బుద్ధి తెచ్చుకొని పాపకార్యములను జేయక సన్మార్గమున మెలంగవలయు నని వలలోనున్న పక్షులనన్నిటినివిడిచి తనదారిం దానుబోయెను. వలలోఁ జిక్కువడిన గువ్వయు తననాథుని మరణమునకు వగచి తన్నునమ్మి చరించుచుఁ దనకష్టసుఖములలోఁ బాలుపంచుకొన్న ప్రియనాథుని బాసిన జీవితము వ్యర్థమని తలంచి చిచ్చురికి నాథుని మార్గము ననుసరించెను. పరోపకారపరాయణులు, సజ్జనులు మహామహులునైన పురుషులు పరులబాధల నివారింపవలసి వచ్చినప్పుడు తమశరీరములనైన పరిత్యజించుటకు వెనుదీయరు గదాయని మనవేఁటకాఁడును నీతివంతుఁడై కపోతము తనగురువుగా భావించి సన్మార్గమున సంచరింపుచు పరోపకార పారీణుఁడై మెలంగఁజొచ్చెను.

---

## అపరాధక్షమ.

పూర్వకాలమున బ్రహ్మదత్తుఁడను నొకబలశాలియగు రాజు వారణావతమును పాలించుచుండెను. తన రాజ్యముకన్న విస్తీర్ణమున చిన్నదయైన సమీపపు కోసలరాజ్యము నేలుచున్న దీర్ఘహేతియను రాజుపై దండెత్తి, యాతని రాజ్యమును జయించి దానిని తనదాని

తోఁ జేర్పవలెనను సంకల్పముతో బ్రహ్మదత్తుఁడు దాశివెడలఁగా, దీర్ఘహేతి భీతిజెంది పలాయితుఁడై తన రాజ్యమును సులభముగ శత్రువశము గావించెను. రాజ్యభ్రష్టుఁడైన కోసలాధీశుఁడు కొన్నాళ్లు భార్యా సమేతుఁడై ప్రచ్ఛన్నవేషముతో వివిధ ప్రదేశములందు తిరిగి తుదకు తానును రాణియు నొక శిల్పకారునింట కాలము గడుపుచుండిరి. అచ్చట రాణి ప్రసవమై పుత్రుఁడు జన్మించినందున నా యర్భకునకు దీర్ఘాయువను పేరిడిరి.

"నే నాతని రాజ్యమును జయించితిని గనుక ఆతని నేను చంపకున్న పక్షమున నన్నాతఁ డెప్పుడో కపటోపాయములచేతఁ జంపునని లోన భయముపెట్టుకొని బ్రహ్మదత్తుఁడు దీర్ఘహేతికొఱకు వెదకించి దొరకిన వెంటనే యాతని వధింప నిశ్చయించెను. ఇంతలో కొన్ని యేండ్లుగడచిపోయెను. ఈమధ్యకాలమున దీర్ఘహేతి శ్రద్ధతో తన సుతునకు విద్యలనేర్పి యాతని సమర్థుని, ప్రజ్ఞావంతునిఁ గావించెను. బ్రహ్మదత్తుని ప్రయత్నము లప్పటికి సఫలములై దీర్ఘహేతియొక్క జాడ లాతనికిఁ దెలిసినందున తన వధోద్యోగమునం దాశతుఁడుండుట దీర్ఘహేతికని పెట్టి, తనప్రాణముల కాసింపక పుత్రుఁడు క్షేమముగ నుండినఁజాలునని తలఁచి, యాబాలుని దూరస్థలమున కంపెను దేశభ్రష్టుఁడైన రాజు చిరకాలమునకే బ్రహ్మదత్తునిచేతఁ జిక్కి రాజ్ఞిసమేతముగ వధింపఁబడెను.

దీర్ఘహేతిని ఆతని రాణిని కడతేర్చితిని; కాని వారి పుత్రుఁడగు దీర్ఘాయువు బ్రతికియున్నాఁడు. వాఁడు నన్ను చంపుటకు సాధనముల నాలోఁచించుచుండును. ఇది నిశ్చయము. వానినెవ్వరు నెఱుఁగరు. వానిని కనుఁగొనుటకు సాధనములు కానరాకున్నవి" అని బ్రహ్మదత్తుఁడు తలపోయుచు భయాక్రాంతుఁడై, అస్వస్థచిత్తుఁడై దినములు గడుపుచుండెను.

పితృమరణానంతరము దీర్ఘాయువు మారుపేరు పెట్టుకొని, బ్రహ్మదత్తుని లాయములలో కొలువునకుచేరి హత్తీఖానాలో పనిచేయుచుండెను. అచట దీర్ఘాయువు అందఱకును విధేయుఁడై సంచరించుచు తన ప్రజ్ఞాధిక్యతచేత శీఘ్రకాలముననే రాజాదరణముఁ బొందగల్గెను. ఒకనాఁడు రాజు చిన్నవానిని తన సముఖమునకు రావించి యాతని సంభాషణముతోఁ బ్రీతుఁడై నాటనుండియు నాతఁడు తన నగరునం దుండునటుల నాజ్ఞాపించి, పిమ్మట కొలఁది కాలముననే యాస్థానమునందు గొప్పయుద్యోగము నిచ్చెను.

ఒకనాఁడు రాజు వనమునకు వేఁటకుఁబోయి తన పరిజనమునకు దవ్వయి, తానును దీర్ఘాయువు మాత్రమొకకడచేరిరి. మృగయా వినోదియైన రాజలసటఁ జెంది దీర్ఘాయువు తొడపై తలమోపి యపుడు సుఖసుప్తుఁడయ్యెను.

అప్పుడు దీర్ఘాయు విట్లు తనలో తలపోయ సాగెను. "ఈ రాజు నాకపకృతి గావించినాఁడు. నాతండ్రి రాజ్యమునుబలిమిని గైకొనెను; నాజననీజనకుల యసువులఁ గైకొనెను. అట్టివాఁడిప్పుడు పూర్ణముగ నాచేతఁజిక్కి యున్నాఁడు అని బ్రహ్మదత్తుని వధించుటకు నొఱనుండి కత్తినిదీసి వెంటనే తనతండ్రి తనకు చిన్నతనమున నేర్పిన నీతిని జ్ఞప్తికి దెచ్చుకొని, యీరాజు క్షంతవ్యుఁడు కాని హంతవ్యుఁడు గాడనియు కృపణబుద్ధిని మాని యాతని క్షమించుట యుత్తమధర్మమనియు నమ్మి, కత్తిని మఱల నొఱలో దోపెను.

మార్గాయాసము తీరి రాజునకుఁ గొంత సేపటికి మెలకువ వచ్చి యాత్రముతో నలువంకల నాతఁడు చూచుచుండ, ఏల నట్లు భయాక్రాంతులుగ నున్నారని యాబాలుఁడు రాజునడిగెను. దానికి రాజిటుల సమాధానము చెప్పెను. "నాకెప్పుడును కలతనిద్దురయే. దీర్ఘాయువు నన్నుపట్టుకొని చంపఁబోవుచున్నాడని నేనెప్పుడును కల

లను కనుచుందును. ఆకలయే యిప్పుడు భీకరముగ వచ్చి నానిద్రను భంగము కావించి నన్ను భయకంపితునిఁ గావించినది."

అప్పుడా బాలుఁడు కత్తిని పైకితీసి "నేనే దీర్ఘాయువును. నీవు నాకు చిక్కితివి. పగఁదీర్చుకొనుటకునాకు మంచి సమయము దొరకినది." అనెను. రాజప్పుడా బాలుని పాదములపై వ్రాలి తనకు ప్రాణదానముసేయ వేడుకొనెను "ఓరాజా" నీవు నాకు ప్రాణదానము చేయవలెను. నన్ను వెదకించి పట్టితెప్పించి చంపుటకు నీవు కొన్ని యేండ్లనుండి ప్రయత్నము చేయుచుంటివి. నే నిప్పుడు నీకండ్లఁ బడితిని గాన నన్ను రక్షించి నాప్రాణములను నిలుపుదునని నాకు వరమీయవలెన"ని యాబాలుఁడుప్రత్యుత్తరమిచ్చెను.

అప్పుడు బ్రహ్మదత్త దీర్ఘాయువు లొండొరులను రక్షించుటకు ప్రమాణములఁ జేసికొనిరి. ఒకరినొక రాలింగనము చేసికొని యన్యోన్యము హానిని తలపెట్టకుండ శపథముల గైకొనిరి. దీర్ఘాయువుని యుదారమనస్కతకును క్షమాశీలతకును బ్రహ్మదత్తుఁడుప్పొంగి సంతోషపరవశుఁడై తనపుత్రిక నాతనికిచ్చి వివాహము చేసి, కోసలరాజ్యమున కల్లుని రాజ్యాభిషిక్తునిఁ గావించెను.

ద్వేషము ద్వేషముచేతగాక క్షమచేత నివారణము కాగలదనుదాని కీకథ నిదర్శనము దివ్యప్రేమభవనమునకు అపరాధక్షమ సింహద్వారమువంటిది. దీని ననుష్ఠించువారు గర్వాదంభరహితులై ద్వేషప్రతీకారబుద్ధి లేక, శాంతచిత్తులై స్వస్థమానసులై యుండఁ గల్గుదురు.

---

# కౌశికుఁడు

సకలవిద్యాపరిపూర్ణులై దయాసత్యశౌచములు గలిగివర్తించువాఁడేజాతివాఁడైనను బ్రాహ్మణుఁడనిపించుకొను దినములు గడచిపోయినవి. కాలక్రమమున దురాచారములు ప్రబలి యీర్ష్యాస్వభావులైన నరులు తోడివారల యౌన్నత్యమునుజూచి సహింపలేక తమ యౌన్నత్యమునకు భంగముఁ దెచ్చుకొనుచు దేశమును,దుర్నీతిపాలు సేయుచున్నారు. తమయందుఁగల లోపములఁ గ్రహియించి బాగుపడవలయునను తలంపుగల మనుజులెన్నఁటికైన నభివృద్ధినొందక మానరు. తొల్లిసంతతాధ్యయన తత్పరుఁడగు బ్రాహ్మణుండొకఁడు కలఁడు అతనిపేరు కౌశికుఁడు. ఆతఁడొకనాఁడొక వృక్షమూలంబున గూర్చుండి వేదంబులు గుణియించుచుండ తదీయశాఖాగతంబైన కొక్కెరయొక్కం డాతనిపై రెట్టవైచెను. వెంటనే యావిప్రుఁడు మహాకోపముతో దానిని జూచినతోడనే యదిప్రాణములఁ గోల్పోయి నేలపైఁబడెను. పడుటయు నావిప్రుఁడించుక చింతించి "అయ్యో నేనింత కనికరములేనివాఁడనై దానినేల శపింపవలయు" నని వగచి చేయునదిలేక గూర్చుండెను. అంతట మధ్యాహ్నమగుటయు నాతఁడు బిక్షార్థము సమీపముననున్న గృహమునకుఁబోయి "భిక్షాందేహి" యని తలవాకిటనిలిచెను ఆయింటిసతియు నావిప్రుని వచనములవిని భర్తకుపచారములు చేయుచుండుటచే నించుకసేపు తాళి భిక్షంగొనుచుఁ జనుదెంచుచుండ గాంచి కౌశికుండిట్లనియె "ఏమమ్మా! అడిగినవెంటనే బిక్షంబిడక యింతయాలస్యంబేలచేసితివి? నీమగండంత యెక్కుడయు భూసురులింతతక్కువయునా? విప్రు లలిగినచోఁ జేయరానికార్యము లేదని నీవెఱుంగవా? నీకింత నిర్లక్ష్యమేల?"

అని యాకౌశికుఁడు బలికినతోడనే యాసతియు విప్రులయలుక మితిమీరిన దనియుఁ దొల్లివిప్రశాపహతులైన వారిచరిత్రలనెఱింగియేయున్నాననియుఁ, జెప్పి వానితో నిట్లనియె. "పతియేనాకు

దైవము నేనెల్లప్పుడు నాపతియొక్క హితమునే గోరుచుండుదాన. నీ పతికోపుండవనియు నీకోపానలజ్వాలలపాలై యొక్క కొక్కెర మడిసెననియు నెఱుంగుదు క్రోధ మోహ నామకులైన శత్రువులజయింపనివాఁడు బ్రాహ్మణ నామమునకెట్లు పాత్రుఁడగును? అంతరంగమునం దారెంటినిజయించినవాఁడే బ్రాహ్మణుఁడు. ఎవ్వఁడుసత్యముఁ బలుకుచు నింద్రియముల జయించి యెల్లవారల తనవానిగ భావించి పరోపకారార్థము పాటుపడుచుండునో వాఁడే బ్రాహ్మణ నామమునకుఁ దగినవాఁడు. ధర్మంబు బహుమార్గదుష్టంబయి యుండు నీవు కేవల స్వాధ్యాయపరుండ వగుట ధర్మసూక్ష్మంబుల నెఱుంగవు. మిథిలానగరంబున జితేంద్రియుండను సత్యవాదియుం సజ్జనసేవితుఁడు నగు ధర్మవ్యాధుండను కిరాతుఁడు కలఁడు. ఆతండఖలధర్మంబుల నీకు పరిబోధించి సంశయచ్ఛేదంబు చేయంగలవాఁడు. కావున వానికడకుఁ బోయి పరిజ్ఞానుండవగుము. పొమ్ము. వనితలు ధర్మమర్మంబు లెఱుంగనివారు గావున నాతప్పు సైరింపవలయునని కోరుచున్నాను. అని యామె పలికినతోడనే యాకౌశికుఁడించుక మనశ్శాంతిఁ దెచ్చుకొని "అమ్మా! నీచేసిన బోధవలన నించుకఁ బ్రశాంతుఁడనైతిని. నేనాధర్మవ్యాధునికడకుఁబోయి సకల నీతుల నెఱింగెద. నాకు సెలవొసంగవలయు" నని పలికి యాక్షణమ బయలుదేరి మిథిలానగరంబునకుఁబోయెను. పోయి ధర్మవ్యాధునిఁగాంచునప్పటి కాతఁడు మాంసఖండబులంగడిం బచరించి బేహారంబు సేయుచుండె. అప్పుడు కౌశికుఁడు వాని సమీపమునకుఁ బోనొల్లక దూరముననిలిచెను. నిలుచుటయు నాధర్మవ్యాధుఁడును నాతఁడువచ్చిన పనిని తనమనోబలమున గ్రహించి కౌశికునికడకుఁ బోయి "మహాత్మా! మీరు పతివ్రతాతిలకము నా తెఱంగెఱింగింపఁ జనుదెంచినారని యెఱుంగుదు చాల సంతసించితి. మీరాక నాగృహము పావనముసేయుగాక"

యని పలికి వానిని వెంటఁబెట్టుకొని తనగృహమునకుఁ బోయెను. కౌశికుఁడును నాతఁడు తనవృత్తాంతము నంతయుఁ దెలిసికొనుట కచ్చెరువడి పతివ్రతాతిలకమును మెచ్చుకొనుచు వానివెంటఁ బోయెను. పోయి ధర్మవ్యాధుఁడు చేయు సపర్యలఁ గొనుచు నాతనితో నిట్లనియె. "మహాత్మా! నీవు సకలధర్మంబుల నెఱింగినవాఁడవని చెప్పుకొనుచుండిరి. నీవీకూరకర్మము నేల సేయుచుంటివి? దీనంజేసి పాతకములు నిన్నెట్లు బొరయకుండు." అని కౌశికుఁడు పలికినతోడనే యాధర్మవ్యాధుఁడు "మహాత్మా! కులధర్మము విడువఁగూడదనియు జీవహింస పాతకహేతువనియు నే నెఱుంగుదు. ఎన్నండును జంతువుల సంహరించినవాఁడనుగాను. ఒరులు తెచ్చిన మాంసమును మాత్రమే విక్రయించుచుఁ గులధర్మములఁగాపాడుకొనుచుంటిని నీవుధర్మంబుల నెఱుంగఁగోరి నాకడకువచ్చితివి గావున నెఱింగించెద విను" మని యాతనితో నిట్లనియె." విషయవాంఛలపై నాసయుండఁగూడదు. పరిత్యాగశీలునకుఁ జాలినవాఁడీజగంబున మరియొకఁడు లేడు. ఎల్లప్పుడు సుజనులఁ బూజింపవలయు ధర్మముదప్పి చరించరాదు. దీనత్వముఁజెంది యొరుల యాచింపఁగూడదు. స్వతంత్ర జీవనముపై యాస విడువరాదు. దేహము రథమువంటిదనియు నింద్రియములే గుఱ్ఱములనియు నాత్మయే సూతుఁడనియు నెఱింగి ధైర్యమను రజ్జువుచే నాయశ్వములఁ గుదియించి పట్టినవాఁడు స్వర్గమార్గమునఁ బ్రయాణము సేయఁగలఁడు కావున నెల్లప్పుడు నితరుల క్షేమమునుఁగోరుచు నెవ్వరికి నేకీడు సేయక చరింపవలయు, అట్టివాఁడే సకలధర్మంబుల నెఱింగినఁవాఁడు, ఇంద్రియములఁ గుదియించుటయే స్వర్గమనియు నట్లుగుదియింపక స్వేచ్ఛగాఁ జరియించువాఁడు దుర్గతిపాలు గాఁగలఁడనియుఁ దెలిసికొనుము. చదువుకొని సకలశాస్త్రములలోని సారము నెఱింగి నీతుల నితరులకు బోధింపవచ్చును, కాని తానాచరించుట

ప్రతివానికిఁ గష్టము. కావున నట్లునడచుటకై ప్రయత్నింపుము. నిజమైనవర్తనమే యెన్నటికైన మనకు సుఖమునుఁ బ్రసాదింపగలదు. కావున నీధర్మంబులు నే మరక వర్తింప వలయునని హితోపదేశము చేసెను. కౌశికుఁడును వాని బోధల వలని తనదుర్గుణములఁ బాఱఁదోలి సన్మార్గుఁడై మెలంగుచు కాలముఁగడపెను. నీతిబాహ్యులు, గోత్రాచారభ్రష్టులు దుర్మార్గులునైన విప్రులకంటె సత్యసంధులు సన్మార్గవర్తనులు పరోపకారపారీణులునైన కిరాతులే మేలనిగ్రహించి నిజమైన ప్రవర్తనమునుఁ బ్రధానముగాఁ గొని జీవయాత్ర నడపువారికీధర్మవ్యాధుఁడే తార్కాణము.

---

## జయపాలుఁడు

పూర్వ మొకప్పుడు విష్ణువర్ధనమను పురమును జయపాలుఁడను రాజు పరిపాలించుచుండెను. అతఁడు సత్యవాక్యపరిపాలకుఁడై ధర్మతత్పరుఁడై ప్రజానురంజకముగ పుడమిఁ బరపాలించుచుండెను. వాని రాజ్యమునగల ప్రజలందఱు నామహారాజుయొక్క సుగుణసంపదకు మెచ్చుకొనుచు వానిపై భక్తిగలిగి సకలసంపదలతో దులదూగుచు సుఖముగఁ గాలము బుచ్చుచుండిరి. జయపాలునకు సుశీలయను నొకపుత్రిక గలదు ఆమెయుఁ దండ్రివలెగుణవంతురాలై సకలవిద్యల నారితేరి యౌవనమున నలరారుచుండెను. ఇట్లుండ నొకనాఁడా సుశీల యుద్యానవనమున నెచ్చెలులతోఁ గూడి విహరించుచుండ కేశవపురమునేలు మహారాజు దేవదత్తుఁడను నతఁడామెను చూచి మోహవిభ్రాంతుఁడై సమీపించి "చెలీ! నీతల్లిదండ్రు లెవ్వరు? నీకు బరిణయమైనదా" యని యడుగ నామె చెలికత్తె మధురిక మహారాజునుజూచి , రాజా! స్త్రీలు విహరించు నుద్యానవనముకు వచ్చుటయు

రాచకన్నెల ప్రశ్నించుటయు మీకుఁ దగినది కాదు అయిన మీ రామె తండ్రిపుణ్యనామమును దెలిసికొనఁగోరితిరి. కావున నెఱింగిం చెద వినుఁడు ఏమహారాజు సత్యవాక్యపరిపాలకుఁడై ధర్మమార్గాను వర్తియై ప్రజానురంజకముగ నేల నేలుచుఁ దొడ్డి మహారాజులలో పేరువడసెనో యట్టి జయపాలమహారాజుగారి గారాబుకూఁతు రైన సుశీల. ఈమెకింకను బరిణయము కాలేదు. కావున మీరీమెను ప్రశ్నించుట న్యాయముకాదు" అనవుడు దేవదత్తుఁడాపలుకులువిని పరిచారిక నీక్షించి "మీనెచ్చెలిపై నాకనురాగము కలిగినది.ఆమెను వివాహ మాడవలయునని నేనిదివరకు ప్రయత్నించుచున్నాను. రాజు లకుఁ గాంధర్వంబున బరిణయమాట న్యాయముగదా! కావున నన్నిపుడామె పరిగ్రహించుట న్యాయ" మని పలుక మధురికయు "సత్పురుషు లనఁదగిన వచనముల ననుట న్యాయము. ఆమె వివాహ విషయమున నస్వతంత్రురాలగుటచె నిప్పుడు మిమ్ము జేపట్టనొల్లదు. మీరును జయపాలుని యనుమతిని నీమెను జేపట్టవచ్చును. కావున నీ యుద్యానవనమును బాసి మీవచ్చిన చొప్పున నేగుట ధర్మము. మీరాక మాజయపాలమహారాజుగా రెఱింగినచో మాకు ప్రమా దము వాటిల్లు" నని పలికెను. ఆపలుకులవిని దేవదత్తుఁడటు చేయు దునని చెప్పి తనదారిం దాను పోయెను. అనంతరము సుశీలయుఁ దన చెలికత్తెతో నింటికిఁబోయి దేవదత్తుని వృత్తాంతమంతయు దండ్రి కెఱిఁగించెను. జయపాలుఁడును దేవదత్తుఁడు దుర్నీతిపరుఁడగుటయు దుర్మార్గుఁడగుటయుఁ దలపోసి తానాతని పరిపాలనకు లోబడియుం డుటచేఁ జేయునదిలేక కర్తవ్యమునుగూర్చి యోజింపుచుండెను. తన మిత్రులగు సామంతరాజులకు దేవదత్తుని కోరిక నెఱింగించి సామ మున కార్యము సాధింపఁబడనిచో దనకు సాయము చేయవలయునని జయపాలుఁడు వర్తమానముల నంపెను. జయపాలుని మిత్రులగు

సామంతపరిభువులను, దేవదత్తుని నిర్మూలింపఁదగిన సమయము దొరకినదని సంతసించి మాచేతనైన సాయమును శక్తివంచన లేక చేయుదుమని జయపాలునకు వర్తమానము లంపిరి. సామంతపరిభువులు సందేశముల విని జయపాలుఁడును ధైర్యముబూని మెలంగు చుండెను.

ఇట్లుండ కొంతకాలమునకు దేవదత్తుఁడు జయపాలునిభావము నెఱింగి వానిపై దాడివెడల నిశ్చయించి "నీపుత్రికను సుశీలను నా కిచ్చి వివాహము చేయుము. లేనియెడల నిన్ను రణరంగమునఁ బరిమార్చి రాజ్యమును స్వాధీనము చేసికొందునని నమ్ము" మని వర్తమాన మంపెను. జయపాలుఁడావార్త విని సంస్థానప్రభువుల సాయమున గెలువవచ్చునని నిశ్చయించుకొని దేవదత్తునకుఁ బ్రత్యుత్తర మొసంగక యూరకుండెను. తోడిసంస్థానపరిభువులును పరివర్తనాకౌశల ముగలిగి, ప్రజలఁ దనబిడ్డలుగఁ జూచుకొనుచు నితరుల కేయాపద వచ్చినను దనకుఁ గలిగినట్టు భావించుకొనుచు ధర్మమార్గానువర్తియై మెలంగు జయపాలునియెడ విశ్వాసముగలవారై దేవదత్తుని బాధల పడలేక యెట్లైన వానిని రాజ్యభరిష్టునిగఁ జేయఁబ్రయత్నించు చుండిరి. దేదత్తుఁడును జయపాలుని వద్దనుండి యే ర్త వ మానమును రాకుండుటచే వానికోట ముట్టడింప సమకట్టి తనకులోఁబడి వర్తించుచున్న సామంతరాజులను సాయము రమ్మని కోరెను. దేవదత్తుని, సందేశమును విని "యిదివరకెంద ఱినో రాకన్నెల చెట్టబట్టిన నీవు ఖరల జయపాలునికూఁతును పరిగ్రహించుట పాడిగాదనియు, జయపాలుఁడు నీతిమంతుఁడు సత్యసంపన్నుఁడునగుటయేగాక యేకపత్నీవ్రతస్థుఁడై ప్రజానురంజకముగ రాజ్య మేలుచుండెను. అట్టి సన్మార్గునిపై నిష్కారణముగ కత్తికట్టుటధీమంతులగు మీకు న్యాయముకాదనియు, మీరు తప్పక పోరుసలుపనెం . . . . —

. . . .

తురేని మీయాజ్ఞ నుల్లంఘింపనేరమనియు సామంతరాజు లందఱు వర్తమానము లంపసాగిరి. ఆవార్తలవిని సుశీలను పెండ్లియాడక మాననియు జయపాలుఁడు తనకిచ్చి వివాహముచేయుటకు సమ్మతింప లేదనియు. కావున వానిని తప్పక బరిమార్పవలయుననియు మరల సామంతరాజులకు వర్తమానమంపి పదునైదు దినములలో వానికోట ముట్టడింపవలయును గావున నప్పటికి వారందరు తప్పక రావలయునని దేవదత్తుఁ డాజ్ఞాపించెను.

దేవదత్తుని నిశ్చయమును సామంతప్రభువు లెఱింగి విష్ణువర్ధన పురమున మిమ్ముం గలిసికొందుము గావున సేనాసమేతముగ వచ్చి మీరుతప్పక కోటను ముట్టడింపవలయునని తెలియజేసిరి. దేవదత్తుఁ డును విష్ణువర్ధనపురము కోటను ముట్టడించెను. సామంతప్రభువులు దేవదత్తునకు బాసటలై నిలిచినను దగినప్రోత్సాహమునుమాత్రము చేయక యూరకుండిరి. ఇట్లు వారిరువురకుఁ గొంతకాలము సంకుల సమరము జరిగెను. ఎంతకాలము తాను జయపాలుని సేనల నాశము చేయఁ బ్రయత్నించినను జయముపొందు మార్గము మాత్రము కనుపించుట లేనందున దేవదత్తుఁడు వానితో సంధి జేసికొన బ్రయత్నించి మంత్రియగు భానుమంతునితో నాలోచింప నాతఁడు రేనితో నిట్లని మనవిచేసెను. "దేవా! నేను తొలుదొల్త జయపాలునితో యుద్ధమునకుఁ బోవలయుతనియు నతఁడుపవిత్రనానిర్మలత్వమున పేరువడసిన వాఁడగుటచే మీబోటిసామాన్యులు వానినిఁ బరిమార్ప లేరనియు నెంతచెప్పినను వినక మీదుమిక్కిలి నన్ను నిందించిరి. దయాసత్య శౌచములు గలిగి నిర్మలహృదయులై ధర్మమార్గంబున బ్రజలనేలు మహీపాలురతో మిముబోటి సామాన్యులు, దుర్నీతిపరులు యుద్ధముచేసి జయముఁగాంచుట బహుదుస్తరమని నాఁడు నేను చెప్పినప్పుడు కసరికొట్టితిరి. ఎప్పటికైన నిజమైన పవిత్రనమే మనుజుని

సంరంక్షించుఁ గావున నిప్పుడైనను బుద్ధిగలిగి వానితో సంధి జేసి కొని సుఖముగా రాజ్యమేలుచుండవలయునని మంత్రి బోధించెను. మంత్రిమాటలువిని యించుక క్రోధముఁ దెచ్చుకొని తనక్రోధమును జూపుట కది సమయముగాకుండుటచే నప్పటికూరకుండి జయపాలునితో సంధి జేసికొనఁ బ్రయత్నించెను. జయపాలుఁడందులకు సమ్మతింపకపోవుటచే దేవదత్తుఁడు రాజ్యము వదలి పలాయితుఁడై వనములవెంట సంచరింపఁదొడంగెను. జయపాలుఁడును దేవదత్తుని సంస్థానమును లోబరచుకొని సుఖముగఁ గాలక్షేపము సేయుచు ప్రజల ధర్మమార్గంబునఁ బరిపాలించుచుండెను. నిజమైన సత్యప్రవర్తనగల వా రెన్నటికైన నున్నతదశకు వత్తురనియు దుర్మార్గులు, దుస్స్వభావులు, దుర్నీతిపరులునైన మనుజులకు నాశ మెన్నటికైన తప్పక వచ్చుననియు నమ్మి కేశవపుర సంస్థానపు ప్రజలందఱు జయపాలుని యందు మిక్కిలి ప్రేమ గలిగి వర్తింపజొచ్చిరి. జయపాలుఁడును ప్రజల తనబిడ్డలుగ నమ్మి వారికేయాపద రాకుండఁ గాపాడుచు నిర్మలహృదయుఁడై మెలంగుచు కొంతకాలము రాజ్యమేలెను.

## కాంచన సేన.

పూర్వము సూరసేన దేశమున నందివర్ధనమను పురముగలదు. ఆపురమును దేవద్యుతియను మహారాజు పాలించుచుండెను. ఇతఁడు సూర్యవంశపు రాజు. దేవద్యుతికి కాంచనసేనయను నొక కూఁతురు గలదు. ఈమె విద్యావతియై, సుందరియై వినయాది గుణములు గలిగి విలసిల్లుచుండెను. నందివర్ధన రాజ్యమునకు లోబడిన చిన సంస్థానము లనేకములు కలవు ఆసంస్థానాధిపతులందఱు దేవద్యుతికి కప్పముఁ గట్టుచు వానిచిత్తానుసారము మెలంగు చుండెడివారు. కాని, యీ దే

వద్యుతి మాత్రము క్షాత్త్రధర్మము వీడి పరరాష్ట్రములపై దండు విడియుట కియ్యకొనక యంతిపురినే కాలముగడపు చుండెను. ఇట్లుండుటచే నాతనికి లోబడిన సామంతరాజు లందఱు "దేవద్యుతి మిక్కిలి పిరికివాఁడనియు రాజ్యము నేలుటకుఁ దగినవాఁడు కాఁడనియు బరరాజులు నందివర్ధనమును లోబరచుకొనఁబ్రయత్నించు చుండుట యెఱింగియు నూరకుండుననియుఁ దలంచి వానికడకుఁబోయి రాజ్యమునకుఁ గలుగనున్న యాపదను నివేదించిరి. దేవద్యుతి సామంతరాజుల మాటలు విని "మీరందఱు సాయముండ మన రాజ్యమునకు భంగముకలుగదనియు యుద్ధములు సేయుట మంచి పనిగాదనియుఁ జెప్పి రాజ్యమున కేయపాయము రాకుండఁ గాపాడుటకుఁ దగిన ప్రయత్నములు సేయుదు నని యానతిచ్చెను. అనంతరము సన్మార్గుఁడు దయావంతుఁడునైన దేవద్యుతి యమాయకత్వమునుగూర్చి ముచ్చటించు కొనుచు సామంతరాజులందఱు దమతమ రాజ్యములకుఁ బయనమై పోవుచుండిరి.

అప్పు డూరు బైటనున్న యుద్యానవనమున డోలికావిహారము సలుపుచున్న కాంచనసేనను కొందఱు సామంతరాజులు యామెసౌందర్యమును మెచ్చుకొనుచు దేవద్యుతికూఁతురగుట నెఱిఁగి తమదారిం దాము పోయిరి. అప్పటికి కాంచనసేన నిండు యౌవనమున నలరారు చుండెను. ఈమె విలువిద్య నేర్చి వేటాడుటయు పగతురమాయోపాయంబున బట్టుకొనుటయు మొదలగు సమర ధర్మములఁ జక్కగ నేర్చెను, ఈమె నిండుయౌవనమున నొప్పియుండుటచే దేవద్యుతి వివాహముచేయఁ బ్రయత్నించెను. కాని యీామె హృదయము సామంతరాజులలో నొక్కరుఁడు నీతివంతుఁడు సుగుణరత్నాకరుఁడునైన మహేంద్రసేనునిపైఁ దగుల్కొనియెనని మాత్రమాతఁడెఱుంగఁడు.

ఇట్లుండఁ గొంతకాలమునకు సామంత రాజులలో ననేకులు కాంచనసేనను తమ కిమ్మనియు నట్లీయకున్నచో బలవంతముగ నామెను పరిగ్రహింతు మనియు దేవద్యుతికి వర్తమానములంపిరి. ఆవర్తమాన మంపినవారిలో నొక్కరుఁడైన నీతివంతుఁడు లేకుండు టచే దేవద్యుతి మిక్కిలి పరితపించి సవ్వార్త దన గారాబుకూఁతున కెఱిఁగించెను. తండ్రివలన సామంతరాజుల మనోభావముల నెఱింగి కాంచనసేన నీవు భయపడనక్కరలేదనియు కుసుమపురసంస్థానాధీశుఁడగు మహేంద్రసేనుఁడు నన్ను బరిగ్రహింపఁ గలవాఁడనియు తండ్రికిచెప్పి యాదుబాత్మలకుఁ దగిన వర్తమానములంపుమని యానతిచ్చెను. అంతట దేవద్యుతి మిక్కిలి సంతసించి మహేంద్రసేనున కుఁదనకూఁతునిచ్చి పెండ్లిసేతునని వారికి వర్తమానములంపెను. అనంతరము కాంచనసేన తన పరిచారికల పిలిచి మీరు మారువేష ములతో దేశములవెంట సవరించి సామంతరాజుల ప్రవర్తనమును బరిశీలించి నాకు చెప్పవలయునని యానతిచ్చి యట్లుపంపెను. కాంచనసేన వచనముల శిరసావహించి పరిచారికలనేక వేషములతో నానా రాజుల సందర్శించి వారిగుణాతిశయముల బరిశీలించి మరల కొంత కాలమునకు గాంచనసేనను కలిసికొనిరి. కాంచనసేనయు దేశము యొక్క దుస్థితినిగ్రహించి దుర్నీతిపరులు దుర్మార్గులునైన పరిపాల కులుగల యీదినములలో నుత్తమవంశ సంభూతుఁడు నీతికోవిదుఁడునైనపురుషుని జేపట్టినను సుఖము గలుగదని తలంచి తండ్రికడకుఁ బోయి స్వయంవరమును జాటఁబంచుమనియు నప్పుఁడువచ్చినరాజపుత్రులలో నాయిచ్చవచ్చిన వానినిఁ బరిగ్రహింతుననియు జెప్పెను. దేవద్యుతియుఁ గాంచనసేన చెప్పినచొప్పున జాటఁబంచిసామంతరాజుల రావించి కొలువుదీర్చి యుండెను. అప్పుఁడు కాంచనసేనవెలలేని రత్నాభరణముల ధరియించి దనదివ్యసుందరవిగ్రహమును జూచి

మహారాజులు రిచ్చవడ గొలువుకూటము బ్రవేశించెను. మహారాజు లందరును దమలో నెవ్వనివరించునో యని యొకరిమొగము నొకరు చూచుకొనుచుఁ గూర్చుండిరి. అప్పుడు మహేంద్రసేనుఁడును నామహారాజులమధ్య గూర్చుండి తన్ను వరించునో లేదో యని తలంచుచుండెను. అంతట కాంచనసేనయు నామహారాజులను దేరిపారిజూచి వారితో నిట్లనియె.

"దేశోద్ధారకులైన యోవీరపూరుషులారా! మీరందఱును నాకొఱకై యిటకు విచ్చేసిరి గదా! మీలో నొక్కరికి నైదారుగురు భార్యలున్నను దిరిగినన్ను వరింప నిశ్చయించుకొనిరి. దేశమన్ననో దుర్నీతిపాలై దురాచారములకాకరమైయున్నది మీరును శరీరసుఖములకు లోనై దయాసత్యశౌచముల నెఱుంగక దుర్నీతిపరులై మెలఁగుచుండిరి. పరరాజులనేకులు మీపైఁబడి మీనాశమునుగోరుచున్నారు. ఆవిషయమును గ్రహింపలేక మీరీస్వల్పభాగ్యంబులతోఁ దనవినోందుచుఁ బ్రజల ననేకవిధముల బాధించుచు హీనదశకురానైయున్నారు. ఇట్టి దినములలో నేను వివాహమాడినను సుఖము జిక్కదు గావున మీకు మార్గదర్శినై యుండఁగోరి శరీరసుఖములఁ బాయనెంచితిని. మోక్షాపేక్షగల నరులు రాజధర్మములు నెరవేర్పవలయును. దేశము నుద్ధరింపవలయును. సన్మార్గులై ప్రజలు తమబిడ్డలుగ గాపాడుచు ధర్మమార్గంబున నేలవలయును. అట్లు పరిపాలించు వారీదినములలో నొక్కరును లేరు కావున నిఁకనైనను బుద్ధిగలిగి మీవర్తనముతోపాటు దేశమునుగూడ జక్కఁజేయ బ్రయత్నింతురుగాక." అని పలుకుచుఁ గుబాలున నేలపైఁబడెను. అంతట నామహారాజులందఱును తెల్లబోయి చూడసాగిరి. ఆకాలమున బట్టలకు పూసికట్టుకొన్న కొంతసేపటికి ప్రాణములుపోవువిషమొకటి యుండెను. ఆవిషప్రయోగమున నామె చనిపోయినదని గ్రహించి మహారాజులందఱు సిగ్గుపడి

తమతమ రాష్ట్రమునకుబోయి యామె యుపదేశ వాక్యములకు మహానందమునొందుచు కాలము గడుపసాగిరి. దేవద్యుతియుఁగూఁతు రుచనిపోయినందులకు మిక్కిలి వగవసాగెను. మహేంద్రసేనుఁడును వీరమతియైన యాకాంచనసేనను జేపట్టుభాగ్యము లేకపోయెగదా యని వగచి కత్తితోఁ బొడుచుకొని కాలధర్మము నొందెను.

---

# జయదేవకవి

శ్రీ జగన్నాథమునకు (పూరి) సమీపమున కుందు బిల్వ మను చిన్న గ్రామమున నొక బ్రాహ్మణునింట జయ దేవుఁడు జననమందెను. ఇతఁడు దైవనియోగమువలన దైవజనుఁడుఁగా పుట్టెను. యుక్తకాలమున నీతనికి తలిదండ్రు లుపనయనాది సంస్కా రములొనరించి శాస్త్రవిద్యాభ్యాసము చేయించుటకు బీదతనముచే శక్తిలేకయుండిరి. అయనను దేవుని దయవలన జయదేవుఁడు చుక్క లలో చంద్రునివలెఁ బ్రకాశింపుచు వేదవ్యాసుని యవతార మోయనునట్లు, ఎల్లప్పుడు భగవన్నామసంకీర్తనముఁ గావింపుచు, కాలక్రమమున జనులు భగవద్భక్తిని గ్రహించి తరించుటకై గీతగో విందము, లేక "అష్టపది" యను పేరుగల యొకగ్రంథమును రచియిం చెను. ఈగ్రంథము పైకి కేవల శృంగారరసపూరితముగఁ గనఁబడిన ను దాని అంతర్భావములెల్ల విశుద్ధబ్రహ్మజ్ఞానసంపన్నములై యు న్నవి, కొందఱు విద్వాంసులీ యష్టపదికి అద్వైతమత సిద్ధాంతరీతిని వ్యాఖ్యానము వ్రాసియున్నారు. ఆపుస్తకము జదివిన నింతశృంగార భాషయందిట్టి వేదాంతతత్వార్థమెట్లు ఇమిడెనోయని విద్వాంసులకైన నాశ్చర్యగౌరవముల బుట్టింపకమానదు. ఇట్టియోగ్యతగల యష్టపది గ్రంథమాకాలమున జనులెల్లరచే మిగులఁ గొనియాడఁబడుచుండెను

జయదేవునికాలమున జగన్నాథములో సాత్యకియను పేరుగల రాజు రాజ్యము చేయుచుండెను. ఇతఁడు విద్వాంసుఁడు భక్తుఁడునై యుండి జయదేవునిపై యీసున దా నొకగ్రంథ మష్టపదికంటె రమణీయముగ నుండునట్లు రచించి రాజగుటచే జనులందఱు తాను రచించినగ్రంథమే చదువవలెనుగాని, జయదేవుని గ్రంథము చదువకూడదని, చదివినవారల శిక్షించెదనని శాసించెను. జనులుపైరెండుగ్రంథములను జదివి జయదేవుని యష్టపదియే ప్రశస్తముగ నున్నటుల గ్రహించి తాము దానినే చదివెదముగాని రాజుచేసినగ్రంథము బాగుండనందున దానిం జదువమని రాజునకుఁదెల్పిరి. ఈరెండుగ్రంథములయొక్క శ్రేష్ఠత నిశ్చయించుటకై రెండుపుస్తకములు శ్రీజగన్నాథస్వామి పాదములకడ రాత్రియుంచి గుడితలుపులమూయఁబడినతరువాత రాజు తలుపులపై శీలువేసికొనిపోయిన మరునాఁడుదయమునవచ్చి గుడితలుపులు తెరచి చూచువరకు, జయదేవునిపుస్తకము దేవుని పాదములయొద్దనే యున్నది, కాని రాజుగారిపుస్తకము దేవాలయపు టావరణమునకు వెలుపల పెంటగుట్టపైఁ బొరలాడుచుండెను. ఇది దైవవంచనయగుటచే రాజేమియుఁ జేయలేక ఒకపెద్దపండితసభ చేయించి అందు తనగ్రంథమునకు ప్రసిద్ధి గలుగనిచోఁ దన ప్రాణములనైన గోల్పోవుటకు, నిశ్చయించుకొంటినని ప్రకటించెను. జగన్నాథుఁడొక పండితునిస్వరూపమున నాసభలోనికి వచ్చి రాజుచేసిన గ్రంథములోని 24 శ్లోకములు జయదేవుని గీతగోవిందమున వ్రాయఁబడునట్లాజ్ఞాపించి యంతర్ధానమొందెను.

జగన్నాథపట్టణమున నొకధనవంతుఁడగు బ్రాహ్మణు నింట నొక యాఁడశిశువు జనించెను, దానికన్నులు విశాలముగనున్నందున పద్మావతియను పేరుపెట్టిరి. చిన్ననాటనుండి ఈశిశువునకు శ్రీకృష్ణుడే భర్తకావలెనని తలిదండ్రులు నిశ్చయించిరి. ఆచిన్నదానికి పెండ్లి

యీడువచ్చునప్పటి కనేకు లాచిన్నదాని నడుగవచ్చిరి కాని తలిదం డ్రులు తమ నిశ్చయమునుఁదెలిపి వారలనంపివేయుచువచ్చిరి. ఇట్లుండ నొకనాఁడు శ్రీకృష్ణుఁడా బ్రాహ్మణుని స్వప్నములోఁగనఁబడి పద్మావతిని తనకిచ్చి పెండిలిసేయుటకంటె తనభక్తుఁడగు జయదేవునకిచ్చి వివాహముచేసినయెడల తనకు తృప్తికరముగనుండునని చెప్పెను. ఆప్రకారము పద్మావతి మిగుల వైభవముతో జయదేవునకు వివాహము చేయఁబడెను. ఆమెయు మిగుల పతిభక్తిగలిగి ప్రవర్తించుచుండెను.

పిమ్మట కొన్ని సంవత్సరములకు సకలగుణసంపన్నుఁ డొకవర్తకుఁడు జయదేవునియొద్దకువచ్చి తనకుపదేశము చేయవేఁడెను. జయదేవుడావర్తకున కుపదేశించి యాతనిప్రార్థనము చొప్పున నాతనితో గూడ సమీపమందున్న వానిగ్రామమునకుఁబోయి కొంతకాలమం దుండి తనశిష్యునిచే సమస్తోపచారముల మన్ననల నందుచుండెను. కొన్నినాళ్ళయినపిమ్మట జయదేవుఁడు తనస్వగృహమునకు మరలిపోవ లెనని వర్తకునికిఁ దెలుప నంఁదొకరథము సిద్ధముచేసి యందొకమూల విశేషధనము నానావిధరత్నములనుంచి జయదేవునంపెను. ఆవర్తకుఁ డారథముతోఁ గూడ తనసేవకులనిద్దరనంపెను. ధనాతురులగు నాసేవకులు మార్గమధ్యమున నొకచోట జయదేవుని కాలుసేతులుదెగనరికి యాతని నొక నీళ్ళులేని పాడుబావిలో బడవైచి యాతనిరథముమీది ధనము, రత్నములు మున్నగునవి సమస్తము దోచుకొనిపోయి కొంచెముకాలమా వర్తకుని సేవలోనుండి పిమ్మట వానికొల్వువిడచి పోయిరి. జయదేవుఁడాపాడునూత ననహాయుఁడై హరిభజన జేయుచుండెను. అంతనొకరాజు వేటనిమిత్త మాప్రదేశమునకుఁబోయి యాపాడునూయి బరీక్షింప నందు జయదేవుఁడు గన్పడెను. రాజు తనసేవకులచే జయదేవుని యొడ్డుజేర్పించి నీకాలుసేతులు లేకపోవుటకుఁ గారణ మేమని యడుగ తనపుట్టుకేయిట్లని జయదేవుఁడుత్తరమిచ్చెను.

పిమ్మట నారాజు జయదేవుని తనగృహమునకుఁ గొనిపోయి కాలక్రమమున నతనిభక్తియోగ్యతలు గ్రహించి యాతనివలన నుపదేశము పొంది తనగురువుగాఁ జేసికొని యాతని సమస్తవిధములఁ బూజింపుచుండెను. ఇట్లుండ నొకనాఁడు పూర్వము జయదేవునికాలు సేతులు ఖైగనఱికిన దుష్టులిరువురు సాధువులవేషముతో నారాజమందిరమునకు భిక్షార్థమైవచ్చిరి. వారలను జయదేవుఁడు చూచిపోల్చెను వాండ్రును నాతనిఁబోల్చి యతఁడు రాజునకు తాముగావించిన దౌర్జన్యమును దెలియపరచి తమ్ముశిక్షింపఁజేయునేమోయని చాలభయపడిరి. కాని జయదేవుఁడట్లుచేయక వారలకు గావలయునంతధనము రాజుచే నిప్పించి రెండుమూడుదినములచట నాపి సన్మానించి యంపెను. వారు మార్గమున బోవుచుండగా నొకచో వారలపాదముల క్రింద భూమి బ్రద్దలై యొకయగాధమేర్పడి వాండ్లందు మునింగి చచ్చిరి.

అనంతర మొకనాఁడు శ్రీకృష్ణుఁడు తనపరమభక్తుఁడగుజయదేవునికిఁ బ్రత్యక్షమై యతనికి కాలుసేతులెప్పటియట్ల వచ్చునట్లనుగ్రహించి యదృశ్యుండయ్యె. రాజు తనగురువుయొక్క కాలుసేతులు యథాప్రకారము వచ్చుట గనుంగొని యాతఁడు కేవలదైవమేయని గురికుదిరి జయదేవునితనమందిరముననె స్థిరముగా నుంచుకొనఁగోరి యాతనిభార్యయగు పద్మావతిని రప్పించి యాదంపతుల, నిరువుర, మిక్కిలి భక్తితోను ప్రీతితోను సేవించుచుండెను. రాజుభార్యయగు రాణియు పద్మావతిని మిక్కిలి యాదరముతోఁ గారవింపుచుండెను.

ఇట్లుండ నొకనాఁడంతఃపురమున రాణియు, పద్మావతియు తక్కినస్త్రీలును గూర్చుండియుండ నొకసేవకుఁడువచ్చి రాణిగారి సోదరుఁడు చనిపోయెననియుఁ ఆయనభార్య భర్తతోఁ గూడ సహగమనము గావించెననియుఁ జెప్పెను. ఆమాటలువిని పద్మావతి, స్త్రీ

పతివ్రతయే యగునేని భర్తయుఁగూడ జిచ్చరికి ప్రాణముల గోల్పో వలయునాయని పలికినపలుకులు రాణి చెవులకు ములుకులవలెనుండి యామె పద్మావతినిఁ బరీక్షింపవలెననిసమయముకొఱకు వేచియుండెను

ఒకనాఁడు రాజు వేటకుఁబోవుచుఁ దనగురువగు జయదేవుని గూడ బిలిచికొనిపోయెను. ఇంతలో రాణి యొకకుటిలపన్ని స్త్రీలంద ఱంతఃపురమున గూర్చుండియుండ నొకసేవకుఁడువచ్చి అమ్మా! వేటలో జయదేవు నొకపులి పైఁబడి చంపియెత్తుకొనిపోయెనని చెప్పు నట్లుచేసెను. ఆప్రకారమా వార్త వినగానే పద్మావతి కనులుమూసి ప్రాణములు విడిచి నేలపయింగూలెను; అంతట రాజువేటనుండివచ్చి యంతఃపురంబునజరిగిన చరియవిని ఈయాపదకంతయుఁ దానేకారణ మని యెఱింగి వెంటనే తనపుత్రుని రాజ్యమున కభిషిక్తుంగావించి యాతనికి మంత్రులకు సేవకులకుఁ జెప్పవలసినసంగతులు చెప్పి తా నగ్నిహోత్రప్రవేశంబు గావింపఁగృతనిశ్చయుండై తనగురువగు జయ దేవునియొద్దకుఁబోయి, యాతనిపాదములపయింబడి తనయాత్మకు శాంతిగలుగ నాశీర్వదింపుమని వేడెనుకాని జయదేవుఁడు, రాజాత్మ హత్యగావించుకొనుటుచితముగాదని చెప్పి తానును, రాజును గలిసి పద్మావతి పడియున్నచోటికిఁ బోయిరి. అనంతరము జయదేవుఁడు 24 అష్టపదులు నృత్యముచేయుచు గానముసేయ జగన్నాథుండు ప్రత్యక్షమై యాతనిభక్తికిమెచ్చి పద్మావతిని బునర్జీవితగా నొనర్చి జయదేవుఁడొనర్చిన యష్టపదులు గానముచేసిన నాభక్తులు ముక్తి నొందెదరుగాకయని వరమిచ్చి యంతర్ధానమొందెను. అంతనుండి యు గీతగోవిందము ప్రతియింట గానముచేయఁ బడుచు భక్తిరసప్ర ధానగ్రంథముగా వాడబడుచున్నది.

---

# నందో రాజా భవిష్యతి

ఈమాట తెనుఁగు దేశపువారందఱు సామెతగా వాడుకొను చున్నారు. భవిష్యత్కాలమున నేదియెటుకాఁగలదో మనకు స్పష్టముగాఁ దెలియదను విషయమును చెప్పుటలో మన దేశస్థులు నందోరాజా భవిష్యతి యనుచున్నారు. ఈసామెత,లోకములో వ్యవహరింపఁబడుటకుఁగారణము లేకపోలేదు. ఇందుకొక చిన్నకథగలదు. పూర్వకాలమున మగధ రాజ్యమునకుఁ బాటలీపురము రాజధానిగా నుండెను. ఇది గంగాతీరమున పాట్నాయనుపేరుతో నొప్పుచున్నది. ఇప్పటికి రమారమి రెండుమూఁడువేలవందల సంవత్సరముల క్రిందట మగధరాజ్యమును ఉత్తుంగభుజుఁడను రాజు పాలించుచుండెను. అప్పుడు పాటలీపురము మిక్కిలి నాగరికతగలదై సకలవస్తుసంపూరితమై యెంతో శోభిల్లుచుండెను. ఉత్తుంగభుజునకిద్దఱు భార్యలు గలరు. అందు పెద్దభార్యకు నందుఁడను కుమారుఁడుండెను. ఆరాజున కేమి కారణముచేతనో రెండవభార్యయందు మిక్కిలి యనురాగమును పెద్దభార్యయందు అనిష్టమును పుట్టెను ఇది సాధారణముగ లోకములో మనము చూచుచున్నవిషయమే. ఉత్తుంగభుజుఁడు రెండవభార్య చక్కదనమునకుఁ జమత్కారవచనములకు నోడిపోయి పరవశుఁడై యామె గీచినగీటుదాఁటక, యామెయనుగ్రహమే తనకు స్వర్గము మోక్షము ననుకొని యెల్లవిధముల నామెను మెప్పించుచు పట్టపుదేవియు నామెకొడుకును బ్రతికియుండిరో లేదో తెలిసికొనుటకైన నిష్టములేనివాఁడై ప్రవర్తించుచుండెను. వేయేల? పెద్దభార్యకుసరిగా గట్టుకొనుటకు వస్త్రములైన నీయఁడయ్యెను. ఆమెకుమారుని దగ్గరకైనఁ బిలువఁడయ్యె. ఎల్లప్పుడును సవతితల్లికుమారునే తనతండ్రి చేరఁబిలిచి యాదరించుటచేత బాలుఁడైనకుమారుఁడు చిన్నఁబోయిన మొగముతో మనోవికాసములేక యెట్టెటో పెరుగుచుండెను, ఇటు

లుండ నొకనాఁడు పట్టణములోనున్న గొప్పవర్తకుఁ డొకఁడు వేయి వరహాలవెలగల గొప్పచీరెలు రెండు తెచ్చెను. ఉత్తుంగభుజుఁడు ఆచీరెలలో నొకటికొని రెండవభార్యకిచ్చి యామెముచ్చట తీర్చెను. అట్టిచీరె తనకుఁగూడ నొకటికావలయునని పెద్దభార్య మహారాజు గారివద్దకు వర్తమానమునంపెను. కాని యాయన యావర్తమాన మును దీసికొనివెళ్ళిన దాసినికసరికొట్టి "తనయందమున కిదివరకున్న చీరెలు చాలును. ఈచీరె తనకక్కరలే"దని బదులుచెప్పెను. ఆపలు కులు దాసీముఖమున విని పట్టపుదేవినైన తనకింతగతి వచ్చెనుగదా యని మిక్కిలి విచారింపఁజొచ్చెను. అప్పుడు మిక్కిలి చమత్కారి యైన యొకదాసి యాదేవిసమ్ముఖమునకుఁ బోయి యామెతో మెల్లన నిట్లనియెను. "అమ్మా! ఈచీరెగట్టుకొనవలయునని మీకు మిక్కిలి ముచ్చటగానున్నది. గనుక నేనొక్కయుపాయము చెప్పె దనువినుండు. ఆరుమాసములలో యీచీరెవెల యిచ్చెదనని చెప్పి యీవర్తకులవద్ద అరువుతీసికొనుము" అనుచుండగానే యాదేవి యిట్ల నియె. "ఓసీ! నీతెలివితక్కువతనమునకు నేను మెచ్చుకొంటినిగాని అప్పు తీర్చుటయెట్లే అరువీయుమని యడుగవచ్చును. వర్తకుఁడు మనమాట నమ్మి అరువీయవచ్చును. మనమాతని ఋణమెట్లు తీర్పగలము. అత నిఋణమునఁబడి యుండుమందువా? అప్పులెగబెట్టుటకంటె గొప్పత ప్పు మరియొకటిలేదు. అప్పుచేసి పప్పుకూడు తినుమన్నట్లు ఋణములు చేసి చీరెలు తెచ్చుకొని నగలుచేయించుకొని కులుకుటకంటె మంచి చీరెలు నగలు లేకుండ పేదతనముననే యనుభవించుట మంచిది. మ హారాజుగారి యనుగ్రహమే నాకు వెలితియైనప్పుడు చీరెలు వెలితి యైననేమి. నగలు వెలితియైననేమి! ఋణముతీర్చెడు మార్గమున్నపక్ష మున తప్పక చీరెకొనుట నాకిష్టమే." దేవిపలికిన యాయధైర్యపు పలుకులువిని దాసి పక్కుననవ్వి యీక్రింది శ్లోకముతోఁ బ్రత్యుత్త రము జెప్పెనఁట.

శ్లో. ఉత్తుంగ భుజనాశోవా; దేశకాలవిపర్యయః
వణిగ్వర వినాశోవా నందో రాజభవిష్యతి

అర్థము—"ఈ యాఱుమాసముల లోపుగ మీభర్తగారైన ఉత్తుంగభుజమహారాజుగారు చావవచ్చును. దేశకాలములలో మార్పు జరుగవచ్చును. ఈవర్తకుఁడైన చనిపోవచ్చును. లేదా మననందుఁడు రాజుకావచ్చును." ఈమాటలు చెవినిబడగానే పట్టపుదేవికి దాసి మాటయందు కొంచెము నమ్మికముకుదిరి చీరెకొనవలయునని యాశ పుట్టెను. కాని మరల నొకసందేహ మామెమనసునకుఁదోప దాసిని జూచి యిట్లనియె. "ఓసీ నీవాడినమాటలలోఁ దక్కినవన్నియు బాగున్నవి కాని మహారాజుగారు పోవచ్చునన్నమాటమాత్రము బాగుగలేదు. ఆయన లేనప్పుడు నాకీచీరెయెందుకే. ఆయననుండుటచేతనే నాకీచీరెపై మనసుపోయినది."

అనవుడు దాసి యామెనుఁజూచి తల్లీ! మహారాజుగారు పోయినతరువాత మీరుకట్టుకొనకపోయినను ఆయన యున్నంతకాలమైనను మీరు సుఖముగా గట్టుకొనవచ్చును. ఆయన పోయినపక్షమున రాజ్యము మీకుమారునిచేతిలోనికే వచ్చును గనుక వర్తకునకు సొమ్మిచ్చివేయవచ్చును. అనంతర మాచీరె మీకోడలు కట్టుకొనవచ్చును. ఆయనపోకపోయినపక్షమున మరియొకమార్పేదో వచ్చును. కాబట్టి యీచీరెమీరు తప్పక పుచ్చుకొనుఁడని గట్టిగానొక్కిపలికెను. తన సవతి చీరెకొని కట్టుకొనుచున్నదన్న యీర్ష్యచేతను ఆడుదియగుటచేతను మనసు దానిమీఁదనుండి త్రిప్పుకొనలేకపోవుటచేతను, ఆదేవికి దాసిమాటలు నచ్చెను. అందుచే [illegible]మె వర్తకుని బిలిపించి ఆరుమాసములలో వెలయిచ్చునట్లొడంబడి వర్తకునిచేత ఒప్పించి తనకుమారునిచేత తాటియాకుముక్కమీఁద పద్దువ్రాయించి చీరెతీసికొని కట్టుకొనియెను. అందువలన నామె మనోరథము సంపూర్ణముగాఁ దీరెను.

తల్లి మనోరథము తీరినందుకు నందుఁడు మిక్కిలిసంతసించెను. తనబుద్ధివిశేషమువలన దేవిగారి ముచ్చట తీరెనని దాసి యెంతోసంతోషించెను. ఇట్లయిదుమాసములు జరుగునప్పటికి ఉత్తుంగభుజమహారాజుకు రోగమువచ్చెను. వైద్యులచికిత్సలు వ్యర్థములయ్యెను. కాలమాసన్నము కాగా నారాజు రెండవభార్యకుమారునకు పట్టాభిషేకము చేయవలసినదని మంత్రినితోఁ జెప్పి గాలధర్మమునొందెను. ఉత్తుంగభుజుని మరణానంతరమున మంత్రులందఱు జేరి నందుఁడు పట్టపుదేవికిం బుట్టిన జ్యేష్ఠకుమారుఁడగుటచేతను ధర్మశాస్త్రములుకూడ నాతనిపక్షముననే తీర్పుచేయుచుండుటచేతను లోకులందఱకును నాతనియందే యెక్కుడనురాగ ముండుటచేతను విద్య, వినయము, ఔదార్యము, బాహుబలము, శౌర్యము చక్కదనము వానియందే యుండుటచేతను నందునకే బట్టాభిషేకము జేసిరి. ఈతఁడు మగధరాజ్యమును పాలించినరాజులలో సుప్రసిద్ధుఁడు. నందుఁడు రాజుకాగానే మొట్టమొదట తనతల్లికిచీరెలరువిచ్చిన వర్తకునిబిలిపించి చీరెఖరీదైన వేయివరహాలు ముందు గానిప్పించి తాము పేదదశలోనుండినను తమయందు నమ్మకముగలిగి తమకకువిచ్చినందుకు మఱివేయివరహాలు వానికి బహుమాన మిప్పించెను.

—o—

## ముసలమ్మబలి

అనంతపురముజిల్లాలో బుక్కరాయసముద్రమనుగ్రామముకలదు బుక్కరాయలు తుంగభద్రాతీరమందలి విజయనగరమును క్రీ॥ శ॥ 1347 మొదలుకొని 1350 వఱకుఁ బరిపాలించిన మహారాజు. ఈమహారాజే విద్యారణ్యస్వాములవారి శిష్యుఁడై రాజ్యమును సంపాదిం

చెనని చెప్పుదురు. బుక్కరాయసముద్రము, బుక్కరాయల పేరనే కట్టఁబడినట్టు తోఁచుచున్నది. ఈయూరిలో నొక గొప్పచెరువుగలదు. పూర్వమొక సంవత్సరమున వర్షకాలమున నాకాశము చిల్లివడినట్లు రేయింబవళ్ళెడతెఱిపిలేక గొప్పవానలు కురిసినవఁట. ప్రళయకాలవర్షములవంటి యా వానలచేత చెఱువంతయు నిండి గట్టున కెగదాసి క్షణములోనో, అరక్షణములోనో గట్టు తెగిపోవునట్లు కనఁబడెను. ఆగట్టు తెగిపోయెనా బుక్కరాయసముద్రమేగాక చుట్టుపక్కల పల్లెలనేకములు కొట్టుకొనిపోవును. కొట్టుకొనిపోయెనా పశువులకు పంటలకు జనమునకు నష్టము సంభవించును. అందుచేత బుక్కరాయసముద్రపుజనులు బెంగగొని యేమియుఁ దోఁచక దైవమును బ్రార్థించుచు తమతమ యదృష్టముల నిందించుకొనుచు ప్రారబ్ధకర్మమని యేడ్చుచు ప్రాణములరచేతిలోఁ బెట్టుకొనియుండిరి. అటులుండగా వారియాపద గడువంబెట్టుటకు, ఆకాశవాణి యిట్లని పలికెనఁట. "ఓజనులారా! మీగ్రామములోనున్న ముసలమ్మయను నామెను వానదేవునకు మీరు బలియిచ్చినపక్షమున యీవర్షము లాగిపోవును. అట్లు చేయుఁడు"

ఈమాటలు వానపిడుగులవలెనే జనుల కందఱకుఁ గర్ణకఠోరముగ వినఁబడెను. కొందఱిశరీరములు జల్లుమనెను. ఏలయన ముసలమ్మ, ఆయూరి జనులకెల్ల తలలో నాలుకయై యెల్లవారి కిష్టముగ మెలఁగుచుండెను. ఈముసలమ్మ యొకపంటకాఁపు భార్య. ముసలమ్మయనుటచేత వృద్ధస్త్రీయని తలంపఁగూడదు. మగవారిలోఁ జిన్నవారికిఁగూడ తాతయ్య యని పేరున్నట్లే ఆఁడువారిలో పడుచువాండ్రకు గూడ ముసలమ్మయని పేరుండవచ్చును. ఈముసలమ్మ పడుచుదనము చక్కదనము మంచితనము గలిగి, అత్తమామలయెడలభక్తిగలిగి భర్తయెడల ప్రేమగలిగి పెద్దలయెడల వినయముగలిగి యెంతో

మంచిపేరు వహించెను. ఆకాశవాణి పలికిన యాపలుకులు వినగానే తక్కినవారివలె నామె భయపడలేదఁట. భయపడక యక్కడి జనులనుజూచి నేను తప్పక బలిగాఁ బోయెదను. మీరు విచారింపకుఁడు. లోకులకందఱకు క్షేమముజేసి మృతినొందుటకంటె వేఱుభాగ్యము లేదు. పాము మనుష్యులను హింసించుచు వేయేండ్లుబ్రతుకును. కాకి యూరుపేరులేక నూరుసంవత్సరములు జీవించును. అట్టిబ్రతుకుగాక పరోపకారార్థమై ప్రాణములు విడచినవారి జన్మమే జన్మము. నా పుణ్యముచేత నాకట్టి మరణము సంభవించుచున్నది గనుక మీరు నన్ను వారింపవద్దు. ఎప్పటికైనను చావుతప్పదు. ఇటువంటిమరణము మాత్రము మరల దొరకదు. కాఁబట్టి యీవిషయమున నాకు సహాయముఁ జేయుఁడు" అని నిర్భయముగాను నిశ్చలముగాను బలికెనఁట. ఆమెమాటలు విని యచ్చటనున్న జనులందఱు మిక్కిలి యాశ్చర్యపోయిరి. అత్తమామ లాపలుకులువిని నాతల్లీ! నీవు భూదేవతవు. నీవుండబట్టి వానలు కురియుచున్నవి. నీవుండబట్టి పంటలు పండుచున్నవి. నీవు మాగృహలక్ష్మివి. నీవులేకుండ మేము బ్రతుకఁజాలము. నీవు పోవద్దు మాయమ్మా" యని కౌగిలించుకొనియేడ్చిరి. పెనిమిటి కంటికినేలకు నేకధారగనేడ్చి యట్టిసాహసకార్యము జేయవద్దని పరిపరివిధముల బ్రతిమాలుకొనెను. ఎవ్వరేడ్చినను నెవ్వరుబ్రతిమాలినను ఆపనిలోకోపకారమని యామెకు గట్టినమ్మకము గలిగి యుండుటచేత మనోనిశ్చయము మారలేదు. అంతట నామె తలదువ్వుకొని మొగమునిండ పసపురాచికొని పెద్దకుంకుమబొట్టు పెట్టుకొని పసపుచీరగట్టుకొని బాజాభజంత్రీలతో నింటివద్దనుండి చెఱువువద్దకు బయలుదేరివచ్చెను. వేలకొలఁదిజనులు చుట్టుజేరి యాశ్చర్యముగఁ జూచుచుండిరి. అప్పుడు ముసలమ్మ లంకలోనగ్నిహోత్రమున బ్రవేశించిన సీతవలె, అడవిలో కాఱుచిచ్చున దుమికిన చంద్రమతి

వలె, మనస్సునందు జంకుగొంకులేక కలకలలాడుచున్న మొగము తో మహాలక్ష్మివలె నీటిగొయ్యనునిలిచి, అత్తమామలకు మగనికి నమస్కరించి పెద్దలకందఱకు దండములుపెట్టి, అత్తవారియింటికిఁ బోవునాఁడుపడుచువలె నందఱివద్ద సెలవుబుచ్చుకొనివాన దేవునకుమ్రొక్కి కన్నులు మూసికొని గుభాలున చెఱువులో దుమికెను. దుమికి యొక టి రెండుసారులు తేలి యట్టడుగునకుఁబోయి మరల గాన్పింపదయ్యె.

ఇటులామె బలియైనతరువాత వర్షములాగిపోయినవఁట. ఇప్పటికిని యాయూరి చెఱువుకట్టకు ముసలమ్మచెఱువుకటయని పేరు గలదు.ఆయూరిజనులామెను, అమ్మవారుగఁజేసి యిప్పటికిని గొలుచుచున్నారు. ఇప్పటికి ఏటేట పొంగళ్లు పిండివంటలుజేసి యామెకు నైవేద్యములు పెట్టుదురు. ప్రజలందఱిప్పటికిని యీకథ నమ్ముచున్నారు. ఈకథయొక్క సారాంశమేమో మనము గ్రహింపవలయును. ముసలమ్మ బలిగావలయునని యాకాశవాణిపలుకుటకు నమ్మదగినమాటగాలేదు. జనులనేకులు మూఢవిశ్వాసముగలవారు. అమ్మవారులకు జడిసియు దయ్యములకుభయపడియు, ఎండలకు వానలకు వరదలకు జంకియు జనులు కోళ్ళను మేఁకలను పశువులను, అప్పుడప్పుడు మనుష్యులను, ఒకప్పుడు బిడ్డలనుగూడ మనదేశమున బలి యిచ్చుచుందురు. బుక్కరాయసముద్రపుజనులు గూడ తెరపిలేని వానలకు జడిసి మూఢవిశ్వాసముచేత మనుష్యబలి యిచ్చినపక్షమున యా యాపదతగ్గనని తలంచియుందురు. ముసలమ్మయనునామె పరోపకారబుద్ధిగలదగుటచే బలియగుట కొప్పుకొనియుండును. ఇదియే నిశ్చయమై యుండవచ్చును. కాని యాకథకు గొప్పతనమును గల్పించుటకు, ఆకాశవాణి యట్లుపలికినదని కల్పించియుందురు. ఎటులైననేమి, ముసలమ్మ తనచావువల్ల తనయూరిజనులకు మేలుగలుగునని తలంచి నమ్మి యాపనిజేసెనన్నమాటనిశ్చయము ఈకథనే యింగ్లాం

షు దేశమందు కేంబ్రిడ్జి కళాశాలలోఁజదువుకొని దేశచరిత్రములందు గట్టిపండితుఁడై యిప్పుడు మైసూరులో గొప్పపనిలోనున్న మ॥ రా॥ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు "ముసలమ్మమరణము" అను పేరుతో తెనుగుపద్యకావ్యముగ రచియించిరి. ఈకథజరిగి యెంత కాలమైనదో మాత్రము తెలియలేదు. ఆయూరిలో నిప్పటికిని ఏదో యొక శిలాశాసనమున్నదని తెలిసినది. అదియెవరైనవ్రాసి మాకు పంపినయెడల దానిని బ్రకటించి వారియెడ మేము మిక్కిలి కృతజ్ఞులమైయుందుము.

---

## కబీరుదాసు

ప్రపంచమునం దెల్లపుడు ప్రతివాఁడును సత్పురుషుల చారిత్రములను చదువుకొనుటవలనగాని వినుటవలనగాని, సదాచారుల సహవాసమునగాని తనప్రవర్తనలను చక్కబరచుకొని, నీతిమార్గమును విడువక, తోడిమానవుల యభివృద్ధికిని, దేశౌన్నత్యమునకును పాటు పడవలసి యున్నది. ఏదేశమునగాని పాపమధికమగునపుడును, ప్రజలు దురాచారులగునపుడును, వారిని సదాచారులుగఁ ద్రిప్పి దేశమున పుణ్యమును నెలకొల్పు వారెల్లప్పుడు మహనీయులే. మహనీయులనగా ద్రవ్యవంతులుకారు. సద్గుణవంతులు; దయా,సత్య, శౌచములే భూషణములుగాగల నిగర్వచూడామణులు; దివ్యజ్ఞానసంపాదకులు. అట్టిమహనీయులలో చెప్పఁదగినవాఁడు కబీరుదాసు. కబీరను పేరునకు మహనీయుఁడని యర్థము 1914 సం॥ జనాభా లెక్కల ప్రకారము కబీరుదాసు శిష్యులు 8, 43, 171 మందియున్నను ఆయన నీతివర్తనయు, దివ్యజ్ఞానమును మనదేశమునందు అజ్ఞానమున మునిఁగియున్న యనేకులకు జ్ఞానోదయము గలిగించినను, ఆతఁడెట్టివాఁడో

ఆతని మతమేమో ఎఱుగనివా రనేకులున్నారు. ఆతఁడు మన దేశమున 400 సంవత్సరములకు పూర్వమే ప్రఖ్యాతిగాంచి చనిపోయినను ఇప్పటికిని యనేకులకు మార్గదర్శిగా నున్నాఁడు. అతఁడు వయస్సునకు మీఱిన పరిజ్ఞావంతుఁడు; ఆకాలమున కధికుఁడైన జ్ఞానవంతుఁడు; ఆత్మజ్ఞానమందును తత్వవిచారణ మందును, లోతుపాతులఁ గనిపెట్టిన బుద్ధిమంతుఁడు. అస్థిరమగు మనజీవితములను గూర్చియు మానవుని తత్వమునుగూర్చియు, ఈప్రపంచమునందలి సుఖ, దుఃఖములనుగూర్చియు, మనము దినదినము పొట్టకై తన్నుకొనెడు ననేక విషయములనుగూర్చియు కబీరుపలికిన పలుకులను విన్నవారందఱును నిజముగ నతఁడు దీర్ఘదర్శియనియు, ప్రవక్తయనియు నొప్పుకొనక తీరదు. హిందువులును, మహమ్మదీయులును గూడ నీతనివాక్యములు భగవత్ప్రేరితములే యని తలంచిరి. ఇతఁడు నిజమైనజ్ఞానసముద్రుఁడు. ఈతనిజ్ఞానసముద్రమున ఈతనేర్చిన మహనీయులు సైతము తమప్రజ్ఞాబలముచే చిరకాలమీదినను సులభముగ గ్రహింపరాని యగాధములును సామాన్యులు సైతము తరింపఁగోరినయెడల మునిఁగి స్నానము చేయఁదగు మెరకలును గలవు, ఈతనివాక్యములయందలి యంతరార్థమును ప్రపంచసౌఖ్యములనే యాసించినవారు గ్రహించలేకపోయినను, దివ్యజ్ఞామునకై పరితపించు నీతని శిష్యులును, యోగాభ్యాసము నభ్యసించఁగోరువారును గ్రహించుటయేగాక, యాతని నపారమగు గౌరవముతోఁ జూతురు. కబీరుని జ్ఞానవచనములు జనసామాన్యము దాము తరుచుగ వినుచుండెను. సామెతలనియే తలంతురు. సూర్యరశ్మి యుండినగాని వృక్షజాతియంతయు నెట్టభివృద్ధి జెందనేరదో అట్లేదివ్యజ్ఞానముండినగాని మన ఆత్మయు నభివృద్ధినొందనొందజాలదు. అందుచేత దివ్యజ్ఞానమను సూర్యరశ్మితో నోలలాడుమనెడు కబీరు, ఆసూర్యరశ్మిని దారితెన్నెఱుఁగక యంధకారమున

గొట్టుకొనుచున్న పామరజనులకు తెచ్చి యిచ్చెను. ఎండ తీవ్రమైన యెడల చిన్న మొక్కలు మలమల మాడిపోవును. అందుచేత వృక్షములకన్నిటికి నెండ ప్రాణాధారమైనను, ఏచెట్టున కెంతయెండ ఉండవలెనో మనము సహజముగఁ జూచుచుందుము. ఈవిధముననే ఆత్మజ్ఞానము లేనివారికి, బుద్ధిపరిపక్వ మొందనివారి కీకబీరొక్కసారిగానే బ్రహ్మోపదేశముచేసి వారిని పాడుసేయక ఎవరి కేవిధమగు జ్ఞానోపదేశము చేసిన వారు బాగుపడుదురో ఆవిధముగనేనీతివాక్యములచేతను చిన్నచిన్న పిట్టకథల మూలముననుప్రజలకు జ్ఞానరహస్యముల నతఁడు వెల్లడించెను. మహనీయులగు వారెల్లపుడు జ్ఞానము నీవిధముననే ప్రజలకు కలిగింతురు. మనోవ్యధచే బాధపడువారికి కబీరునివాక్యములు దివ్యౌషధము. ఆతనివాక్యములు విన్నవారు ప్రపంచమును మరచి పరవశత్వము నొందుదురు; దేశమందలి పాపభూయిష్టమగు దుర్వాయువుల పీల్చుటమాని, నీతిప్రసారములగు పర్వతశిఖరవాయువుల పీల్చగలిగి రమ్యమనోరథులు, ఆరోగ్యసంపన్నులగుదురు. ఈతఁడు నీతివాక్యములు పలువిధములుగ నుపదేశించుచుండును. కొన్నిసమయములం దలంకారయుక్తముగను, మరికొన్ని సమయములందు శృంగారరసఫలితముగను వేఱొక సమయమందు గంభీరవాక్యములతోను ఆత్మజ్ఞానము ప్రజలకతఁ డుపదేశించుచుండును. కాని యతఁ డేవిధముగ నుపదేశించినను, వినువారికిమాత్రము ప్రతివాక్యమును ఆనందమునే యొసఁగును. ఆతని జ్ఞానసూత్రములనువినఁగోరువారు సంస్కృతభాషయందే, వాటిని చదువవలెనుగాని, ఎంతబాగున్నను నితరభాషలయందలి తర్జుమాలను చదువుటవలన నాతనిమాటలయందలి ద్వంద్వార్థములను, చమత్కారములను, గ్రహింపఁజాలరు. అతఁడు ప్రజలందఱితో కలసిమెలసియుండి తానెక్కడుండిన నక్కడనే ప్రజల కుపదేశముల చేయుచుండెడివాఁడు. కబీరు మన దేశమం

దలి మతసంస్కర్తలలో నొకఁడు. తమసంస్కర్తలలో మహనీయుఁడగు రామానుజ స్వాములవారి శిష్యుఁడు రామానందుఁడు గలఁడు. ఈ రామానందుని శిష్యుఁడే మనకబీరుదాసువలె సభలుచేసి మతము నుపదేశింపలేదు. దేశమున ఈనాటివారివలె నుపన్యాసములనిచ్చి కీర్తిగాంచలేదు. అతఁడెక్కడ నే గడ్డిమీఁదఁ గూర్చున్న నదియేనిజమైన మతపాఠశాల. అచ్చటనే పలువురుజేరి యాతనినోటినుండివచ్చెడువాక్యములు శ్రవణానందముగ నాలకించుచుందురు. అతనికి వేఱే గృహములేదు. ఈప్రపంచమే గృహముగను, కట్టుగుడ్డయే చీనిచీనాంబరముగను ఆకాశమే తనయింటికప్పుగను, నక్షత్రము లేదీపములుగను ప్రజలే తన సోదరులుగను పరిగణించి, దేహసౌఖ్యము కాశింపక, తత్వజ్ఞానమును,ఆత్మజ్ఞానమను రెండే తనధనమనినమ్మి, తనశరీరమును బుద్ధిని, మనస్సును దైవమునకే యర్పించి యేచెట్లునీడనో జేరి చిదానందభరితుఁడై కాలము గడుపుచుండువాఁడు ఇతనికిని బౌద్ధమతస్థాపకుఁడగు గౌతమబుద్ధునకును ననేకవిషయములయందు పోలికగలదు. గౌతమబుద్ధుఁడు తత్వజ్ఞానమునకై కృషిజేయుచున్న కాలము నొక వృక్షముక్రింద కూర్చుని నిజమైన దైవజ్ఞానమును సంపాదించెను. అందుచేతనే యావృక్షమునకు బోధివృక్షమని పేరుగలిగినది. ప్రపంచమందలి బౌద్ధమతస్థులందఱు పూర్వమీవృక్షముండిన స్థలము నిప్పటికిని పుణ్యస్థానముగాఁ జూచుచుండిరి. కబీరుకూడ నొకమఱ్ఱిచెట్టుక్రిందఁ గూరుచుండు వాడుక యుండుటచే నీచెట్టునుగూడనీతనిశిష్యులు అతిగౌరవముగఁ జూచుచుందురు. బుద్ధునిజన్మదినమున అనేకాద్భుతములు గలిగినట్లు బుద్ధమతగ్రంథములయందున్నట్లేతని పుట్టుకదినమున నట్టియద్భుతములుగలిగినట్లు ప్రజలు చెప్పుకొనుచుందురు.కబీరు పుట్టగానే యీక్రిందిమాటలు నుచ్చరించునట్లొక పిట్టకథగలదు."నేను మీబుద్ధిని గోచరముకాని స్థలమునుండి వచ్చినాను. నేనుస్త్రీసంభూ

తుఁడనుగాను. నేనీవిధముగానే జన్మించినాను. కాశీసమీపమ్మున జన సంచారములేని యొకస్థలము నాజన్మస్థానము. నన్నొకసాలివాఁడు తీసికొనివచ్చినాఁడు. నాశరీరము పంచభూతములతో నిండియుండక జ్ఞానముతోనే నిండియున్నది. నేను దివ్యజ్ఞానముతో జన్మించినాను నాపేరునకే జ్ఞానమని యర్థము" గౌతమబుద్ధుఁడు పుట్టినపుడును నతఁ డిట్టిమాటలనే యాడినట్లు బౌద్ధులు చెప్పుదురు. బుద్ధునివలెనే యితఁ డును గొప్పపండితులతో వాదములుచేసి వారినోడించినట్లు కథలుగల వు. వీరిద్దఱియొక్క నీతివాక్యములకునుగూడ పోలికగలదు. ఇది గాక వీరిద్దఱును జాతిని పాటింపనివారే. ఇద్దరునుగూడ విగ్రహారా ధన కూడదని ఖండించినమహనీయులే ఇద్దరునుగూడ మాంసభక్ష ణము, జంతుహింసయు కూడదనియు, దుంపకూరలే యాహారము నేర్పరచుకొనిన సాత్వికభావ మబ్బుననియు, మత్తుద్రవ్యముల నిషే ధించుటచే చులకనగా జ్ఞానమార్గమబ్బుననియుబోధించినవారే. ఇతని చరిత్రమును అలహాబాదు సర్వకళాశాలయందు సభ్యుఁడుగనున్న యొకపండితుఁడు వ్రాసియున్నాఁడు అందులో నీతనినిగూర్చినగ్రంథ ములపేర్లును వివరించియుండుటచే నితనిసంగతిని తెలియఁగోరువారా గ్రంథములనుండి యనేకసంగతులు తెలిసికొనవచ్చును.

---

## గొల్లదొరసాని

ఏదేశమునబుట్టినను, ఏకులమునకు నన్నెదెచ్చినను; ఏజాతికి చెందినను సధర్మ్మలగువారి చరితమే కలకాలము నిలుచును. అందు చేత నట్టివారి చరిత్రము నెఱిఁగించినయెడల మనదేశమందలి యువ తీమణులేగాక పురుషశ్రేష్ఠులుగూడ దయార్ద్రహృదయులై సధర్మ

ములఁజేయ సమకట్టుదురను తలంపుతో "ధర్మాత్మురాలగు మిసు హెలను. మిల్లరుగొల్డు" దొరసానికథను వ్రాయఁబూనితిని.

ఈమె అమెరికాదేశ సంయుక్తరాష్ట్రములలో ప్రఖ్యాతిగాంచినస్త్రీ. ఆద్దేశమందలి ప్రజలందఱీమెనుచాల ప్రేమింతురు. స్త్రీజాతికంతకీమె భూషణమని తలంచి ప్రజలకీమె నొకరాణిగ భావింతురు. స్వలాభాపేక్ష యనుమాటైన ఈమెవినియెఱుఁగదు. ఈమెరమారమి కోటిరూపాయల ఆస్తియున్నను, బీదల బాధను తొలఁగించుటకును; గతిలేనివారికి గతికల్పించుటకును తప్ప తనస్వసౌఖ్యము నెన్నఁడు చూచుకొనదు. తనదేశమందలి స్త్రీపురుషులదుర్గతిని తొలంగించుటయే యీమె ముఖ్యోద్దేశము. ఈమెకు మతమందభిమాన మధికము అందుచేతనే తనకంటె తక్కువవారి యభివృద్ధికి పాటుపడి, దాతృత్వభావముతో గట్టిగ పనిచేసి తరింపవచ్చునని యీమెయభిప్రాయము. "ఏదినముననుగూడస్వసౌఖ్యము తలపెట్టకుము" అను క్రైస్తు వచనమామె హృదయపీఠముననే లిఖించుకొనెను. ఒకదినమున స్త్రీల సభయందు మాటలాడుచు నామెయిట్లు చెప్పెను.

"ద్రవ్యవంతులగు స్త్రీజనులందఱు తమ స్వసౌఖ్యములను జూచుకొని కాలము గడిపిన కార్యములేదనియు సంతకంటె వారు చేయవలసినపని యెక్కువగలదనియు నేనెల్లప్పుడుపదేశించుచుందును ఇతరులకు సహాయముచేయుట ధనికురాండ్రగు స్త్రీలందఱకు విధియైయున్నది. ముఖ్యముగా అబలలగు వారిదుర్గతినిబాపి వారిజీవనము సౌఖ్యప్రదముగా చేయుచుండవలెను. ఇతరులకు సౌఖ్యము నొసంగినకొద్ది యీపనియందుత్సాహమధికమై ప్రతివారును దేశమందంతట విరివిగా సౌఖ్యమును వెదఁజల్లఁగలుగుదురు. ఆమె తానేర్పఱచుకొన్న ధర్మమునే నమ్మి పూనికతోఁబనిచేయును. ధర్మకార్యములగురించి [illegible] యామెక్రింద పద

మంది కార్యదర్శులు గలరు. ఆమె యొకమూల ధర్మకార్యముల చేయుచు మరియొకమూల తనద్రవ్యము వినియోగింపఁదగిన క్షాత్రకార్యములనుఁగూర్చి యాలోచించు, చుండును. ఆమెకు సాలుకు ముప్పదిలక్షలరూపాయ లాదాయము. ఈద్రవ్యములో స్వల్పమొత్తమును మాత్రము తన సొంతఖర్చున కుంచుకొని మిగిలినమొత్తమును పైసయైన ముట్టక దీనజనపోషణమునకై మీఁదు గట్టియుంచునట్లు నిలవజేసి యుంచును. తనసమానులగు కోటీశ్వరుల తోఁబాటు గొప్పవిందులఁ జేసి ద్రవ్యమును వెచ్చించుటగాని, తాను స్వయముగ నట్టివిందులకుత్సాహముతోఁ బోవుటగాని యామె కలవాటులేదు. ఆమెకుత్సాహము గలిగినపుడెల్ల తనపట్టణమందలి కూలివాండ్రలోని ఆడపిల్లల నందఱినిఁబిలిచి వారలకు విందు చేయు చుండును. విద్యలేకున్నయెడల తనపిత్రార్జితమగు ధనమును పాడుచేసి కొనవలసివచ్చుననుభయముచేత,నామెన్యూయార్కు పట్టణమున విద్య నభ్యసించి, న్యాయశాస్త్రపరీక్షకు జదివెను. కాని నిగర్వియగుటచేత తోడిబాలికలతోపాటు తానును పరీక్షనిచ్చినయెడల ధనికురాలగుట చేత వార్తాపత్రికలు స్తోత్రముచేయ మొదలుపెట్టునని భయపడి తా ను పరీక్షకు వెళ్ళలేదు. బాధపడువారి బాధలతొలఁగించుటయు, మత మేమో యెఱుఁగక మృగప్రాయులుగ నున్నవారికి మతమందభిరుచి గలిగించుటయు నాపనియైయుండును. "హడ్సను" నదీతీరమున నొక దివ్యభవనమును; కాలుచేతులు లేనివారు గ్రుడ్డివారు మొదలగు నవ ధ్యులకొఱకు తనగ్రామమున నామెకట్టించెను. ఈగృహమున ప్రత్యే కము గతిలేక గాలిజీవనముచేయు పిల్లలనే జేర్చుకొనును. ఈ గృహ ముచుట్టును నందనవనమువంటి యుద్యానవనమున్నది. ఇందుసకలపు ష్పములు దొరకును. ఎన్నఁడు సరియైనగాలిని సైతమెఱుఁగక తల దాఁచుకొన గృహమైనను లేనివారి నీమెయిందు ప్రవేశపెట్టినతోడనే

వారు సంతోషముతో పరవశత్వము నొందుదురు. న్యూయార్కు పట్టణమునందలి బీదలవైద్యశాలలలో నిద్దఱిరోగులకు ప్రతిసంవత్సర మయ్యెడు కర్చు నీమెయిచ్చును. అమెరికావారికి స్పెయినువారితో యుద్ధమువచ్చినప్పుడు అమెరికావారికి మూఁడులక్షలరూపాయలను యుద్ధపుకర్చుం నిమిత్తమిచ్చి అన్ని దేశములవారి స్తోత్రములకామె పాత్రురాలయ్యెను. మరియొకసారి స్త్రీలచే స్థాపింపఁబడిన జాతీయసంరక్షణ సంఘమునకు రు 75000 ల నామెదానమిచ్చెను. యుద్ధమందు గాయములు తగిలియు, రోగము సంభవించియు, బాధపడుచుండెడు సిపాయలవద్దకు నామె స్వయముగఁ బోయి వారియెడల విపరీతమగు ప్రేమనుజూపి వారికి ధన సహాయము చేయుటయేగాక ముక్తి మార్గమున కుపచరించు మతరహస్యములను గూడ నామె బోధించుచుండెను. సేనలోఁజేరిన ప్రతిభటునకామె యొక 'బైబిలు' పుస్తకమును ఇప్పటికిని బహుమతిగా నిచ్చుచుండునఁట. యుద్ధము ముగియునప్పటికి తనపట్టణమందేగాక చుట్టుప్రక్కల గ్రామమందున్న ప్రతిగృహమును నొక యాసుపత్రిగఁ జేసి యందుయుద్ధములో గాయములు తిన్నవారినందరినిఁజేర్చి వారికి పెద్దవైద్యశాలలందుకూడ జరుగని విధమున వైద్యము చేయించి వారిప్రేమకును, విశ్వాసమునకును పాత్రురాలయ్యెను.

ఏదేశమందును నావకళాసులగువారు క్రొద్దికుటుంబములనుండియే వత్తురు. వీరికి విద్య సామాన్యముగ తక్కువగ నుండును. ఆకాలమున నమెరికా సంయుక్తరాష్ట్రములందు 'బ్రూక్లి పట్టణమున నావలనుగట్టు స్థలములో బనిచేయువారందఱు తమపనికాఁగానే యచ్చటనుండి యూరిలోనికిఁబోయి, నీతిమాలిన వర్తనమందుఁబడి చెడిపోవుచుండిరి. అందుచేత నాదేశపు జనుల క్షేమముఁగోరిన విద్యావంతుఁడగు దేశాభిమానియొకఁడు వీరిప్రవర్తనమును చక్కఁబఱుప ప్ర

యత్నించి వీరినిమిత్తము ముందుగ నొకసంఘము నేర్పరచెను. ఇందు బాగుపడఁ దలంచినవారలనేకులు చేరిరి. ఈసంగతి తెలిసినతోడనె గొల్డుదొరసాని తానుస్వయముగ నచ్చటికిఁ బోయి, సంగతినంతయుఁ దెలిసికొని వారి సంఘమునకు కావలసిన భవనముకొరకు వెంటనే వలయుసొమ్మంతయు నిచ్చివేసెను. ఇప్పుడీమె భవనమున వేలకొలఁది యోడకళాసులుందురు. ఈభవనమందు సదుపాయముగ భోజనము పెట్టు పూటకూటియిల్లును వందమందియుండుటకు తగినగదులు, మంచములు, పఱుపులు పుస్తకభాండాగారము, ఫలహారములుచేయు గదులుగూడ గలవు. ఈగృహమువలన నిజముగ ననేకులగు కళాసులు దుర్మార్గముల బడకఁ బాగుపడిరి. వీరు ధనముదాచుకొనుట కిందొక చిన్న భీమాకంపెని గూడఁగలదు. ఈమెకు దినమునకు నూఱుత్తరములను తక్కువ గాకుండ నేదో సహాయముఁగోరుచు నెవరో వ్రాయుచుందురు. ఇవియన్నియుఁగూడ మొదట కార్యదర్శిచూచి పనికిమాలినవాటిని చింపివేయుచుండును. ఒకవారములో దీనులు కోరిన మొత్తమంతయుఁ జూడ రు 7500000 లున్నవి. మొత్తము మీఁద యాచకులుకోరు మొత్తము వారమునకు రు 4,50000 లుండును.

ఆమె సం॥ మున కొకసారి కొన్నివారములపాటు పర్వతప్రాంతములయొద్దనున్న 'రక్సుబరీ' కిఁ బోవుచుండును. అచ్చట నున్నపుడామె కొద్దిగొప్పల నాలోచింపక, బీదబాలికలతోఁగూడి, తనకుటుంబమువారితో ముచ్చటలాడునట్లె ముచ్చటలాడుచు వారినతిప్రేమతో నాదరించును. వారును నీమెను నధికగౌరవముతోను ప్రేమతోను గూడ తమతల్లివలెభావింతురు. ఈమె వేసవికాలమున తనగృహమందున్నపుడు చుట్టుపక్కలనున్న బిడ్డలందఱికి విందుచేయుటయు వారితో నాడుకొనుటయు, గుఱ్ఱములెక్కితిరుగుటయుగూడగలదు. ఆమె

బాలకులకు ఆటపాటలు నిమిత్తము కావలసినప్పుడు ధనసహాయము చేయుచుండును. వారినిమిత్తముకూడ నొకగృహము నామెకట్టించి ఆ యింటితలుపుపై నీక్రింది ప్రకటనపత్రిక నంటించెను.

'ఈగృహమును, దీనిచుట్టునున్న దొడ్డియు నీ రాక్సబరీ'లో చదువుకొనియెడు విద్యార్థులనిమిత్త మేర్పడినవి. పిల్లల నిమిత్తమిది ఉదయము 8 గంటలు మొదలు 12 గంటల వరకును మధ్యాహ్నము 2 గంటలు మొదలు 6 గంటల వరకును తెరచియుండును. ఆదివారమునను, పిల్లలు బడియందుండు కాలమునను మాత్రమిది మూయఁబడి యుండును. ఈ యావరణలో పరుష వాక్యము లెవ్వగును మాటలాడఁ గూడదు.

రాక్సబరీ తనతలిదండ్రుల వివాహమైన పట్టణమగుటచేత, నామెకాపట్టణమందును, అందలి ప్రజలందును అభిమాన మెక్కువ. ఆసమీపముననే తనతండ్రిగారి జన్మస్థానముండుటచేత నీమె ఆయన పేరు కలకాలముండుట కొక దేవాలయమును చాలసొమ్ము వ్యయముచేసి కట్టించెను. తన తలిదండ్రులకు వివాహమైనగృహము నీమె కొని దానియందు ధర్మార్థ మొక పుస్తకభాండాగారమును స్థాపించెను ఈమె ధర్మములు చమత్కారముగ చేయుచుండెను: ఒకనాఁడు తన తండ్రిగారు పుట్టినయింటికిఁబోయి ఆయింటఁ గాపురమున్న బీద కాపులను రొట్టెపాలునిమ్మనిఅడిగెను. ఆమెయాయింటనున్న వారితో మాటలాడుచు రొట్టెతిని పాలుత్రాగి మెల్లగ వారికేమియు నియ్యక వెళ్ళిపోయెను. కాని కొంత సేపటికి గిన్నె యెత్తగానే దానిక్రింద బ్యాంకునోటుండుటఁజూచి పరమానంద భరితులై ఆగృహస్థులు దాని నెత్తుకొనిరి. ఆమె దేవాలయమునకుఁ బోవునపుడును నొక సామాన్యురాలివలెనే యుండును. దానము చేయునపుడు నెవరికిఁదెలియకుండ నామె చేయుచుండును. అమెరికాదేశమందలి జనులంద టీమె

నుపొగడుచుండ, వారిపొగడ్తలతో గర్వమొందక యామె యన్నితర గతులజనుల నొకరీతిని జూచుచుండును. అప్పుడపుడు విందులు చేయ వలసి వచ్చినపుడు మనలోని కొందఱు బుద్ధిమంతులవలె తరగతి వారిలను బెట్టక కోటీశ్వరులతో సమముగ నీమె గుడిసెల వసించు కాపువాండ్రను గూడ నాదరించును. శీతకాలమున న్యూయార్కు పట్టణమున నున్నపుడీమె యెప్పుడుజూచినను బీదలకు సేవఁజేయుచు నెక్కడనో యుండునుగాని యెన్నఁడు నింటియొద్ద దొరకుటయే దుర్ఘటము; మానవజాతికై యీవిధమున పాటుపడెడు నీమె జన్మమే నిజముగ సార్థకమైనది. మన దేశమున నిట్టివారు స్త్రీలులేరు సరికదా, పురుషులైన పదుగురుండిన మన భాగ్యమేమని చెప్పవచ్చును!

---

## రాజు—యోగి

ఒక రాజు పగలెల్ల రాజకార్యములతో వేగి రాత్రియైనతోడనే భోజనముచేసి విశ్రాంతినిమిత్త మంతఃపురమున కరిగెను. అంతఃపురమందున్న వారందఱు గాఢముగ నిద్రించుచుండిరి. కోటకాయుచున్న కావలివాండ్రుగస్తీతిరుగుచున్న తలారులుఁదప్ప తక్కినపుర జనులు నిద్రలో నుండిరి. కాని భూలోక దేవేంద్రుఁడై కోట్లకొలఁది ప్రజలయర్థప్రాణములకధిపతియై యెందఱో రాణులకుభర్తయై యెందరో సామంతరాజుల కేలికయై ధనమునఁ గుబేరుఁడై భూమండల మేకచ్ఛత్రముగనేలుచున్న యామహారాజునకు మాత్రి మెందుచేతనో కన్ను మూఁతవడినది కాదు. అనేక రాజకార్య విషయముల యాలోచనతో నిండిన వానిశిరస్సు విశ్రాంతి నెఱుఁగక పోవుటచేతను ఎంత ప్రయత్నించి తెచ్చుకొన్నను నిద్దుర రాకపోవుటచేతను రాజు తోఁచక విశాలమైన తన మేడమీఁద సిటటూఁ బచారుచేయ సాగెను. సకల

సౌఖ్యములుండి, తనరాజ్యమందలి నిఱుపేదవానికి సయితముఁ బ్రియత్న మక్కఱలేకుండ వచ్చునట్టి యానిద్ర యా రాజునకు మిక్కిలి ప్రయత్నము చేసినను రాదయ్యెను. ఎన్ని సారులో యతఁడు తన హంసతూలికా తల్పముమీఁద నిట్టటు పొర్లెను. ఎన్ని సారులో గోడమీఁద వ్రాయఁబడిన చిత్తరువులను ఱెప్పవాల్పక చూచెను. ఎన్ని సారులో కన్నులుమూసికొని నిశ్శబ్దముగఁ బండుకొనెను. కాని కన్నులకు నిద్దురయు మనస్సునకు శాంతియు హృదయమునకు సంతుష్టియుఁ గలుగదయ్యె. ఆమహారాజిట్లవస్థపడుచుండఁగానే తెల్లవాఱెను. నిద్రలేకయున్న రాజుమొగమువలెనే తూర్పుదిక్కు తెల్లబడ నారంభించెను. నాఁటి ప్రభాతమున రాజును మేలుకొలుపుకు వైతాళికులు మంగళగీతములఁ బాడిరి. కాని యవి యక్కఱయే లేక పోయెను. అంతలో వెలుతురు వచ్చుటయు రాజు మేడమీఁద నొక కిటికిలోనుండి క్రిందికిఁజూడ వట్టియిసుకలో హాయిగఁ బండుకొని గుఱ్ఱుపెట్టి నిద్రపోవుచున్న యొక మనుష్యుఁ డాయనకంటి కగపడెను అగపడుటయు రాజు తనలో నిట్లు వితర్కించుకొనెను. "ఏమీ! ఈ నిర్భాగ్యుఁడు పక్క కొకగుడ్డయైనఁ బఱచుకొనకుండ వట్టియిసుకలో నెంతహాయిగ నిద్రించుచున్నాఁడో! మీఁదఁ గప్పుకొనుట కొకచిన్న గుడ్డయైన లేదుకదా. ఆకాశమే వీనికి కప్పుకొను కంబళియైనది. ఈ హంసతూలికా తల్పమున నీజరీశాలువలు కప్పుకొని నేనావిధముగ నిద్రపోయిన నెంతబాగుండును." అట్లు తలంచుచు నతఁడు క్రమక్రమముగ నతిశయమగుచున్న వెలుతురుపైఁబడ నిద్రించుచున్న యామనుష్యునిఁ జూచిచూచి మనసుపట్టఁజాలక చప్పటలఁ జఱచి 'ఓయబ్బీ! పరిక్కదుప్పటికాని కప్పుకొనుగుడ్డకాని లేక నీలాగున నిద్రయెట్లు పట్టుచున్న" దని బిగ్గరగా నడిగెను. ఈపలుకులు చెవిఁ జొరనందున వానికి మెలఁకువయే రాదయ్యెను. అంతట రాజు తన బంటునొక

నిఁబిలిచి నిదురించుచున్న యీమనుష్యుఁడు సంసారమును వర్జించి జ్ఞానసంపాదనముఁజేసి తనజ్ఞానతేజముచేత లోకుల మనసులలోనున్న యంధకారమును బాపునట్టి మహనీయుఁడైన యోగియని తెలిసెను. అందుచేత నామహాత్ముని మేలుకొలుపుట కాబంటు కొంచెముజంకి యు రాజాజ్ఞ నెఱవేర్పవలసి యుండుటచే నాతని సమీపించి వినయముతో 'స్వామీ! మామహారాజుగారు మేడమీఁదనుండి మిమ్మును బిలుచుచున్నారు. ఆయనరాజకార్యములచేత మనస్థిమితము లేక రేయింబవళ్ళు నిదురయెట్టిదో యెఱుఁగక చాల డస్సియున్నారు. అదిగో మహారాజుగారు కిటికీలోనుండి చూచుచున్నారు. మీకు నిద్రాభంగము కావించినందుకు నన్ను గరుణించి క్షమించి నావెంట దయ చేయుఁ'డని ప్రార్థించెను. అయోగి మేలుకాంచి, సేవకునిపై నించుకేనియుఁ గోపింపక వానివెంట మేడమీఁదికిఁబోయి రాజుంగాంచి కోపముతో "ఓరిపశువా! నిదురనుండి మేలుకొలుపవలసినంత యవసరము నీకేమిగలిగెనురా" యని యడిగెను. మహనీయులైన యోగుల కాగ్రహమే యుండదనియు నపుడాయన మొగముమీఁద కనఁబడినకోపము తెచ్చిపెట్టుకొన్నదేకాని నిజమైనది కాదనియు గ్రహించి రాజు చిఱునవ్వు నవ్వి స్వామీ! ఒక్కసంగతి మిమ్మడుగవలయునని జ్ఞానమూర్తులు దయాస్వరూపులునగు మీరది తప్పక చెప్పుదురని నే నెఱుంగుదును. నీపాన్పుఁజూడగా నాకోర్వలేని తనము కలుగలేదు. కాని నిరుపమానమైన నీ నిదురజూచి నేనోర్వలేక యున్నాను. ఆకటికనేలమీఁదఁ బండుకొన్నప్పుడు నీకేలాగునున్నదో తెలిసికొనఁ గోరుచున్నాఁడ" నని పలికెను. ఆయోగి నిదురలేమి వసివాడియున్న రాజు కోమలిముఖముఁజూచి సమస్తాలంకారములతో నిండియున్న యాతని పడకగదిజూచి యా గదిలో పసిఁడికోళ్ల మంచముమీఁద వేయఁబడిన హంసతూలికాతల్పముఁ జూచి మెల్లన నిట్లనియె. "నా

కేలాగున నున్నదో చెప్పెద వినుము. కొన్ని విషయములలో నీతో సమానముగాను కొన్నివిషయములలో నీకంటె సౌఖ్యముగాను నున్నది." అది యెట్లని రాజు మరల నడుగుటయు యోగి వెండియు నిట్లనియె. "నేను పండుకొనఁగానే దేనిమీఁదఁ బండుకొన్నానో తెలి యనంతటి నిదుర నాకు వచ్చుచుండును. నేనది కటికనేల పాన్పన్న మాట మఱచిపోవుదును. ఆమఱుపుచేతనే నాకటికనేల నీహంస తూలికాతల్పమువలె మెత్తగానుండును. ఈ విషయమున నీతో సమానుండను. ఇఁక నీకన్న నెందులో నెక్కువ సౌఖ్యవంతుఁడనో చెప్పెద వినుము. నీమనస్సు నిరంతరము భూసంబంధమైన విషయ ములతో ననఁగా మట్టితోఁజేరిన విషయములతో నిండియుండును అవసరములున్న విచారములు లేని విచారములుఁ దలలోఁ బెట్టుకొని నీవెల్లప్పుడు మనోవ్యాధితో మఱుగు చుందువు. ఓ రాచపసరమా! అందుచేత కంటినిండ నిర్మలమైన నిద్ర నీజన్మములో నీవెన్నఁడు నెఱుఁగవు. ఇంక నామనస్సో! సంసార సంబంధమైన తాపత్రయముల తోఁగాని లౌకిక వ్యవహార సంబంధములగు మనోవ్యాధులతోఁగాని నిండియుండక నిర్మలమై యుండుటచేత, పిలుచుటయే తడవు నిద్రవచ్చి నా కన్నులమీఁదఁ గూర్చుండును" అనవుడు రాజి ట్లనియె- ఓజ్ఞానసముద్రుఁడ! ఓస్వామీ! ఓమహాత్మా! నీకు తలదాఁచుకొనుటకు నీదని చెప్పఁదగిన కొంపైనలేదు. కట్టు కొనుటకు పాఁతపేలికలే కాని వస్త్రములులేవు. కటికి నేలయేగాని పాన్పయినలేదు. అయినను మీముఖము విచారమెట్టిదో యెఱుంగక తేజస్సు గ్రక్కుచు నిస్తరంగమైన సముద్రమువలెనున్నది. మీశరీ రమో యింత వయస్సువచ్చినను జెక్కుచెదరక యుక్కు తును కవలెనున్నది. బహుతాపములకు నిలయమైన హృదయముతో బహుదుఃఖములకు భాజనమైన మనసుతో నున్న నేను గూడ

దేవరవారివలె సంపూర్ణమైన మనశ్శాంతి గలిగి గాఢమైన నిద్రగలిగి సుఖయించు దారి నాకుం జూపవలయునని ప్రార్థించుచున్నాఁడ. ఆపలుకులువిని మందహాసముఁజేసి యోగి మహారాజున కిట్లనియె. "ఉన్నదే యొక్కదారి; అనవసరములైన విచారములను దెచ్చిపెట్టు కొనక మనస్సు నెప్పుడునిర్మలముగా నుంచుకొనుము మాంసములేని వట్టియెముక నిమిత్త మొకకుక్క మఱియొక కుక్కతోఁ బోరాడు నట్లు పరమార్థములకు దూరములైన రాజ్య కాంక్షలచేత రాజులతో గిల్లి కయ్యములు తెచ్చి యుద్ధములు చేయకుము. అప్పుడు నీవుకోరిన మనశ్శాంతియు నిర్మల నిద్రయు నీవశములైయుండును. ఇదియే పరమార్థము."



# యోగి—సర్పము



ఒకనాఁడొక యోగి యడవిలో నడచిపోవుచుండగ నొకనల్ల త్రాచు బాటకడ్డముగఁ బండుకొనియుండెను. దాని వైఖరింజూడ నది మనుష్యులంజూడఁగనే బుసలుకొట్టుచు పైనబడజూచు లోకములోని సామాన్య సర్పములవలెం గాక యెంతో శాంతభావము గలదాని వలెఁ గనఁబడెను. ఆ యోగి మహానుభావుఁడనియు బ్రహ్మజ్ఞాననిధియనియు, దివ్యజ్ఞాన సముద్రమనియు, చెఱువులోని చేపలయొక్కయు పాఱెడుపక్షులయొక్కయు, ప్రాఁకెడు పాములయొక్కయుఁ జేష్టలంబట్టియు ధ్వనులంబట్టియు నడకలంబట్టియు వానియభిప్రాయ మెఱిఁగి వానితో మాటలాడఁగల మేటియనియు, లోకమునం బ్రసిద్ధికలదు. భగవంతుని మహాను భావులగు యోగులకు నొకనియమముగలదు. భగవంతుని చేత సృజియింపఁబడిన సమస్తజంతువులు అనఁగా చీమ మొదలుకొని ...

సింహమువలెకుఁగల యెల్లప్రాణులువారిదృష్టికి సమానులే గనుకప్రతి కియున్న జంతువేదైనను దోవనడ్డముగ నున్నప్పుడు దానిమీద నుండి దాఁటివెళ్ళఁగూడదని వారినియమము. ఇట్టినియమము యోగులుదాల్చుటకు ముఖ్యకారణమిది. మనుష్యులు ప్రియజనమగు దారపుత్రులను బంధుమిత్రులను విడిచి యోగులగుట సర్వభూతముల యందు సమానదృష్టి కలుగుటచేతనేగదా. అందువల్ల తమబిడ్డలు పాపలు త్రోవకడ్డముగనేలఁబండుకొన్నప్పుడు వారెందుచేత నట్లుచేసిరోయని తహతహపడినట్లె మనుష్యులు తమకంటె నితరజంతువులు త్రోవలోఁ బండుకొన్నపుడు వాటిబాధయేమో తెలిసికొనిగాని యెవ్వరుదాటి వెళ్ళఁగూడదని యోగులు నియమమేర్పరచుకొనిరి. అందుచేత నీపరమయోగి పామునుఁజూచి జాలిపడిదానిభాష యెఱింగినవాఁడుగావున దానిసమీపముననిలిచి యిట్లనియె. "ఓసర్పమా!నీవు దారికడ్డముగఁ బండుకొంటివి. ఇంచుక యెత్తిగిలి నాకు రవ్వంతదారి యిడుదువేని నేనవ్వలకుఁబోదును. నేను నీమీఁదనుండిఁ దాఁటిపోఁజాలను. ఏలయన నీవును నావంటిజంతువేను." అనవుడు సర్పము తల యెత్తి యోగికిట్లు బదులుచెప్పెను.. "ఓయోగీశ్వరా! మీరు వచ్చుటవినియే నేను దారికడ్డముగఁ బండుకొంటిని. మీయాజ్ఞయైనపక్షమున మీకు నేను దారియొసంగుదు. నేలఁమీఁద నెల్లప్పుడు ప్రాకిబ్రదుకవలసినదాన నగుటచే విసిగిపోయితిని. నాకొక్క ధర్మమెఱింగింపుఁడు జ్ఞానమువచ్చినది మొదలుకొని యెన్నోపక్షుల నెన్నోసరీసృపముల నెందఱినో మనుష్యుల బట్టి కరచి చంపితిని. ఇట్టిపరమ విషజంతువు నగు నేనెట్లుబాగుపడుదును. వెనుకటి పాపములకు నేనెట్లు ప్రాయశ్చిత్తముచేసికొందును. నన్నుజూచి "ఛీ యిదిపాపజంతు"వనిజనులుభయపడి నిందసేయుట యెట్లుమానుదురు." అదివిని యోగిమందహాసముతో నిట్లనియె. "సర్పమా! యిఁకమీఁద నెవ్వరిని గరవకుము అప్పు

డుజనులు నిన్ను నిందింపరు." అనగానే పాముదారియిచ్చి యోగిని వెళ్ళనిచ్చి యానిముసము మొదలుకొని తనక్రూరవృత్తిమానిమనుష్యులు నడచెడుపుంతప్రక్కను పరమసాధువై యెండలోఁ గన్నులు మూసికొని పండుకొనెను. అట్లుండఁగా కొందఱుబాలకు లాడుకొనుటకు ఆప్రక్కకువచ్చి బగుగుమేనిలో బండుకొనియున్న యాపాముం జూచి అమ్మయ్యో అమ్మయ్యోయనిగుండెలుబాదుకొనితిరిగిచూడక యిండ్లకుఁ బరుగెత్తిరి.మరునాఁడాపిల్లలేమరలనచ్చోటికాడుకొనవచ్చి వెనుకటిదినమందువలెనే కదలక మెదలకపండుకొనియున్నయాపాముం జూచియిదిచచ్చినదియని కేకలువేసిపుల్లలతో పొడిచి బాధపెట్టిరి.పాము వారుపెట్టిన బాధలన్నియు పడెనేకాని వారిజోలికిఁ బోలేదు. అందుచేత నాబాలకులు మరింత ధైర్యముదెచ్చుకొని దినదిన మాస్థలమునకుఁబోయి తమజోలికి సొంటికి రానియాపామును లోకువజేసి పెద్ద కఱ్ఱలతో బాదియు ఱాళ్ళతో మోదియు ముండ్లగ్రుచ్చియు బరబర యీడ్చియు నానాబాధలుపెట్టి యంతటితోఁ దనివినొందక దానినోటికడకుఁబోయి చేతులతోఁ దవుడలు బద్దలుచేసి గొంతు వఱకుఁ దమచేతులు జొనిపిరి. అప్పటికిని సర్పము బుసకొట్టక వారికిష్టము యినట్లు నోరు దెఱచి విషపుతిత్తులు వారిచేతులకుఁదగులునేమోయని భయమున మెల్లగ వెనుకకుఁద్రోసికొనుచు నర్భకుల కేహాని జేయకుండెను. ఇట్లు బాలకులు దినదినమునచ్చోటికిఁబోయి బలుబాములు బెట్టజొచ్చిరి. ఎన్ని బాములుబెట్టినను పాము వారి నోరిమితోఁ బడెనేగాని బాలకులకు హానినేయదయ్యెను. అట్లుండ నొకనాఁడు కూలివాండ్రు కొందఱడవిలో పుల్లలు కొట్టి యాపుల్లలనుమోపుగా గట్టుటకు త్రాడు లేకపోవుటచేతచిక్కుబడి సమీపమునఁ గదలక మెదలకపడియున్న నల్లత్రాచును జూచి ఇదిచచ్చియైనా నుండవచ్చు లేదా కదలలేనంత ముసలిదైనాగావచ్చు

కాబట్టి దీనిని పుల్లలమోపు గట్టుకొనుటకు త్రాడుగ నుపయోగించు కొందము. అని దానికడకుంబోయిరి. అట్లుగట్టుటలో వారు పామును మడతవేసియు మెలిపెట్టియు బిగించియు ముడివేసియు పలుతెఱగుల నొప్పించిరి. అప్పుడైన సర్పము తన సహజక్రౌర్యమును వహింపక పరమశాంతముతో నాబాధలెల్ల బడెనే కాని తననోటిలో నున్న మహావిషమును వారిపైఁ బ్రయోగించి పగదీర్చుకొనలేదు. అంతట కూలివాండ్రు పుల్లలమోపు తరువు వేసికొని యమ్ముకొనుటకుఁ బట్టణమునకుఁదెచ్చి మోపువిప్పి యాపాము నావలపారవైచిరి. పాప మాసర్పము తనకుఁగలిగిన గాయములచేత శరీరమునుండి నెత్తురులు గార మిక్కిలి బాధపడజొచ్చెను.

అట్లు కొన్నిగడియలు బాధపడిపడి యాపా మొకసారి కన్ను లెత్తిచూచెను. చూచునప్పటికి దానియెట్టయెదుట క్రౌర్యకముమాని యెవరిని గరవక మునివృత్తినవలంబించి యుండుమని మునుపు తనకుప దేశము చేసిన యాపరమయోగియే ప్రత్యక్షమయ్యెను. అగుటయు సర్ప మాతని కిట్లనియె. ‹ఓ యోగీంద్రా! వెనుక మీదారి కడ్డముగ బండుకొ'' ని మీవల్ల నుపదేశమునుబొందిన యాపామును నేనే. అప్పుడు నేనెంతో సుందరముగా ప్రాంకి పరుగులెత్తఁగలిగితిని. ఇప్పుడు నాయ వస్థజూడుఁడు. మీయుపదేశమువల్లనేనిరపరాధినైయూరకఁబడియుండ జనులు నన్ను శతవిధముల నొప్పించి హింసించిరి. ఎంతహింసించినను వారిని నేను గరవనైతిని. దానికిప్రతిఫల మేమనఁగా శరీరమెల్ల చీరు కొనిపోయి నెత్తురుముద్దయైనది. మరణవేదన పడుచున్నాను మీరు జ్ఞానసంపన్నులై యుండవచ్చును గాని యావిషయమున మీయా లోచనము మంచిది కాదు. ఎవరినిం గరవకుమని మీరు నాకుపదే శించిరి. మీయుపదేశము నాకొంప దీసినది. నన్ను బాధించినవారి నైనను నేనుగరువ[illegible] ముద్దేశ

ముకాదు. నాసంరక్షణనిమిత్తమే దేవుఁడు నాకీవిషమునిచ్చెను. అనవుఁడు యోగి పాముసకిట్లనియె. 'సర్పమా! ఎవ్వారింగరవవద్దని నేను నీకుఁ జెప్పినమాట నిజమేకాని నీశాంతము కనిపెట్టి నీకునిష్కారణము హానిచేయవచ్చువారిమీఁద బుసకొట్టవద్దని చెప్పితినా? నీమీఁదికి మిక్కిలి చొరవగా వచ్చువారికి నీబుసలు మిగుల భయంకరములై వారి నిట్టిపనికిఁ జొరనియ్యవు. నీకు బుసలు గొప్పయాయుధములు. అవి యున్నంతకాలము నీజోలి కెవ్వరును రారు. కరచుట మానుకొన్నందువల్లగాదు నీకీయాపద వచ్చినది. బుసగొట్టుట మానుకొన్నందువల్ల.బుసకొట్టితివా ప్రాణములు తీయనక్కఱలేకయే మనుష్యులను భయపెట్టవచ్చును. ఆత్మసంరక్షణము ప్రతిజంతువునకవశ్యము.అందుచేతనే భగవంతుఁడు నీకు విసము, బుసయను రెండాయుధముల నిచ్చెను. వెనుకటిదానికేమి; ఇప్పుడైనను బుద్ధితెచ్చుకొనుము. నీమెత్తదనముజూచి నీచుట్టుప్రక్కలనున్నవారు నీకెప్పటికైన బాధఁగలిగింప యత్నింతురు. నీవిదివఱకే బాధపడిపడియున్నావు. ఇఁక పడఁజాలవు. బుసలుకొట్ట నారంభింతివా ఎవ్వరిప్రాణములుఁ దీయక నీయందు భయము గౌరవము జనులకుఁగలుగునట్లు చేసికొనఁగలవు. మనుష్యులు బాధనేయు జంతువుల జోలికిఁబోరు నీవింతకు మునుపే బుసలు కొట్టుచుండినపక్షమున నెవ్వరిని గరవకపోవుటవల్ల గలిగెడు పుణ్యము గలుగును. నీకు హానియుఁ గలుగకపోవును." ఈ యుపదేశవాక్యములు వినినతోడనే పాము తలయెత్తి రెండుమూడుసార్లు బుసకొట్టెను. కొట్టఁగానే చుట్టుప్రక్కలనున్న జనులు నాలుగుమూలలకుం బరుగెత్తిరి. ఆయదను గనిపెట్టి పాము జరజర ప్రాఁకి నేలఁబడియున్న చెట్టుయాకులలో దూరెను. దూరియచ్చటనేయుండి ప్రక్కకువచ్చినవారినెల్ల బుసకొట్టి తరుముచు తరుముటయేగాని యెవ్వారింగరవక యోగీశ్వరు నుపదేశము మనస్సులోఁ బెట్టుకొని పరమసాధువై చాలకాలము బ్రతికెను.

# బంగారము చేయువిధము

గోదావరీతీరమున ప్రతిష్ఠానమను పేరుగల యొకపట్టణముండెను. ఆపురమును దేవగుప్తుండను రాజు పాలించుచుండెను. ఆరాజునొద్ద విశారదుండను మంత్రియుండెను. ఈమంత్రి నీతిశాస్త్రమునందు మిక్కిలి ప్రజ్ఞగలవాఁడు. ఆవులించినవారి ప్రేవులు లెక్కపెట్టుటలో నంతవాఁడు లేఁడు. నీటిలోఁదిరుగుజంతువుల జాడలైనను, అతఁడు కనిపెట్టగలడు., ఇన్నిమాటలెందుకు? ఆతని బుద్ధిబలముచేతనే మిక్కిలి కట్టుదిట్టముగ జనులకు సుఖప్రదముగ శత్రువులకు భయంకరముగ జరుగుచుండెను. దేవగుప్తుఁడు పాండిత్యము పరాక్రమముగలవాఁడే కాని యెవరేమిచెప్పిన నది వెంటనే నమ్మునట్టి స్వభావముగలవాఁడు. అందుచేత మంత్రికిఁదెలియకుండ బలుటక్కరులు రహస్యముగ రాజుదర్శనము జేసి తమవద్ద లేనిప్రజ్ఞలున్నవని చెప్పి ధనమును సంగ్రహించి పోవుచుందురు.

ఒకనాఁడు ప్రతిష్ఠానపట్టణమునకు గొప్పబైరాగివచ్చెను. అతనిముఖవర్చస్సు మిక్కిలి ప్రకాశమానముగ నుండెను. వానిజడలు పొడవులై మఱ్ఱియూడలవలె క్రిందికి వ్రేలాడఁజొచ్చెను. అతనిని జూడఁగానే జనులు వానివద్దనేదో గొప్ప మహిమ యున్నదనుకొని మూకలు మూకలుగా వానిచుట్టునుజేరి వానికి పండ్లు పాలు సమర్పించి విభూతినిమ్మనియు రక్షరేఖలిమ్మనియు వానిని ప్రార్థింపఁ జొచ్చిరి. అతఁడు మొదట రెండుదినము లొక చెట్టుక్రిందబసచేసియుండి పిమ్మట యేటియొడ్డున నొకతాటియాకుల కుటీరము వేయించుకొని యందులోనుండి తన్ను సేవింపవచ్చిన పురజనులకు విభూతి మొదలైనవిచ్చుచు వారివలన పాలు పండ్లు పిండి బెల్లము మొదలై

నవి గ్రహించుచు కాలము బుచ్చుచు, తనయందు మిక్కిలి భక్తి గలవారితో తనకు బంగారము చేయునట్టివిధము తెలియునని చెప్పుచు వచ్చెను. ఆమాట వినగానే ప్రతిమనుష్యుని హృదయమందు ఆశ పుట్టెను. ప్రతివాఁడు బైరాగివద్ద సువర్ణయోగము, నేర్చుకొని తన యిల్లంతయు బంగారము జేసికొని సుఖపడవలయునని తలంచెను. ఈకోరిక మనహిందువులలో నిప్పటికిని ననేకులకుఁగలదు. రసవాదశాస్త్రము, అనగా బంగారముచేయు శాస్త్రము తెలిసిన మహాయోగులు మన దేశమందిప్పటికినిగలరని మనవారికి నమ్మకముగలదు. ఈబైరాగియొద్దకు ప్రతిష్ఠానపురజనులు సువర్ణయోగము తమకు నేర్పుమని ప్రతిదినము వందలకొలఁదిగావచ్చుచుండిరి. అతఁడు రేపుచెప్పెద మాపుచెప్పెదనని వారిని సమాధానముజేసి పంపుచువచ్చెను. ఈవాడుక పట్టణమంతట విశేషముగ వ్యాపించి దేవగుప్తమహారాజుగారి చెవులబడెను. ఆయనకు రసవాద శాస్త్రముమీఁద మిక్కిలినమ్మకము గలదు. ఆయనఖజానాలో డబ్బు మిక్కిలి తక్కువగా నుండుటచే సువర్ణయోగము నేర్చికొని మట్టి యినుము రాగి మొదలైనవాటిని బంగారముజేసి యైశ్వర్యమనుభవింపవలెనని చిరకాలమునుండి తలంచుచువచ్చెను. ఈబైరాగి తనపట్టణములో నున్నాఁడని వినఁగానే ఆయనప్రాణము లేచివచ్చెను. మంత్రికిఁ దెలిసినపక్షమున నతఁడేవో యాటంకములు కల్పించునని వానికిఁ దెలియకుండ నొకబంటును బైరాగివద్దకు పంపి రాత్రి తనమేడమీఁదికి వానిని బిలిపించుకొని యతనితో బంగారము మీరుచేయఁగలరా! మీ రెవరిదగ్గర నేర్చుకొన్నా" రని పలికెను. అందుకు బైరాగియిట్లనియె. "రాజా! నా ప్రతిజ్ఞ నేను చెప్పుకోఁగూడదు. అయినను నీవడిగితివి గాన చెప్పెదను ఏబదిసంవత్సరములు నానావస్థలబడి నేనీవిద్యనేర్చుకొంటిని. ఉత్తర దేశమందు మిక్కిలి ప్రసిద్ధికెక్కిన దేవానందయోగి మాగురువు.

ఆయనపేరు విననివారుండరు. నేనుముప్పదిసంవత్సరములు శుశ్రూష చేయగా నాకీవిద్య నుపదేశించినారు. ఇరువదిసంవత్సరములనుండి నేనిందులోఁగృషిచేయుచున్నాను. ఎన్నోకొండలెక్కి యెన్నోగుహలలోదూరి యెన్నోనదులలోదిగి యెన్నోయడవులలోఁగాపురముండి యెన్నోపుట్టలలోఁ జేతులుపెట్టి యీాపసరులు యీామూలికలు సంపాదించినాను. మట్టి బంగారము చేయఁగలను. ఇనుము బంగారము చేయఁగలను. రాగి బంగారము చేయఁగలను. కాని వెండి బంగారము జేయుట మిక్కిలి సులభము. తులమువెండి తులముబంగారమగును. మీకు చేయించవలెనని యున్నపక్షమున వెండిమీాఁదనే చేయింపుఁడు. ఒకలక్షరూపాయలవెండి నాచేతికియ్యండి. అది యిరువది లక్షలరూపాయలబంగారము చేసెదను." ఈపలుకులు రాజునకెంతో శ్రవణానందము గలుగఁజేయగా నతఁడు బైరాగినిజూచి "ఈవిద్య మీారు నాకుపదేశము చేయవలె" నని వేడెను. వానిప్రార్థనవిని "రాజా! ఇదిసంసారుల కుపదేశము చేయఁగూడదు. అయినను నీకునాయందు పరమభక్తి కలదు గాన నీకుపదేశము చేసెదను. ముందుగా నీవుకోరిన వస్తువులను బంగారముగమార్చి నేనీయూరినుండి వెడలునపుడు చిట్టచివర నీకుపదేశము చేసెదను. ఇది మనుష్యులు కాపురమున్నచోట చేయఁగూడదు. ఈయూరి బైటనున్న మీాతోఁటలో చేసెదను. అక్కడ నాలుగెత్తయిన గోడలుపెట్టించి ఆగోడలమధ్య నామిత్తమొకకుటీరము వేయించుము. అందులో నేనుకాపురముండి నీవిచ్చిన వెండి యంతయు, ఆగోడలమధ్యవేసి ఏకముగాబంగారముచేసియిచ్చెదను. నామీాఁద నీకు నమ్మకములేనిపక్షమున నీసైనికుల నాగోడలచుట్టు కావలియుంచుకొనుమ"ని పలికెను. అదివిని రాజు "మీారు చెప్పినట్లుచేసెదను. మీామీాఁద కావలి గీవలిపెట్టను. నాకుమీామీాఁద నమ్మకముగల" దని చెప్పి వానినిపంపి మరునాఁటినుండి తోఁటలో

గోడలు పెట్టింపఁజొచ్చెను. ఈగోడలు కట్టుట పదిదినములకు పూర్తి యయ్యెను. గోడలు పెట్టించుట ప్రారంభించినతరువాత నాలుగు దినములకు మంత్రి కీసంగతి తెలిసెను. అప్పుడు రాజుతో మాటాడి యతనిపూనిక మానిపించుటకు వీలులేదని నమ్మి మంత్రి రాజుగారికి నష్టము గలుగకుండఁ జేయుటకై యెన్నోయుపాయముల నాలోచింపఁజొచ్చెను. అంతలో యోగివద్దకు ముగ్గురు శిష్యులువచ్చి అతనిని పరమభక్తితోఁ గొలుచుచు శుశ్రూషచేయఁజొచ్చిరి. బైరాగి తరుచుగా రాత్రులు రాజుగారిదర్శనముచేయుచు వచ్చెను. రాజుగారు బైరాగికి శిష్యులకుఁ గావలసిన భోజనపదార్థములు ప్రతిదినము పంపజొచ్చెను. తోఁటలో గోడలు, కుటీరము తయారైనతరువాత బైరాగి శిష్యులతోఁగలసి యందులోఁబ్రవేశించెను. రాజుగారు లక్షతులముల వెండి, అక్కడకుఁ బంపిరి. ఈవెండి మంత్రికిఁ దెలియకుండునట్లు రాత్రులమాత్రమే తీసికొనిపోఁబడెను. బైరాగి సువర్ణయోగమారంభించెను. మంత్రి యిదియంతయుఁ బరస్పరముగా నెప్పటికప్పుడు తెలిసికొని తనకు మిక్కిలి నమ్మకముకల వేగులవారి నిద్దఱబిలిచి బైరాగియొక్కయు వాని శిష్యులయొక్కయు వ్యాపారములను జాగ్రత్తగాఁ గనిపెట్టి తనకుఁ దెలియఁజేయవలయునని యాజ్ఞాపించెను ఆవేగులవారిలో నొకఁడు చెట్లమీఁదఁగూర్చుండి యొకఁడు నేలమీఁద గోతులు త్రవ్వుకొని వాటిలోఁగూర్చుండి బైరాగుల రాకపోకలు తెలిసికొని యెప్పటికప్పుడు మంత్రితోఁ జెప్పఁజొచ్చిరి.

ఆవేగులవాండ్రు తనతోఁ జెప్పుచున్నమాటలనుబట్టి లక్షతులముల వెండి వంచకులపాలైపోవుచున్నదని భయపడి రాజు తనతో నీసంగతి చెప్పకపోయినను దాని స్వయముగఁ గల్పించుకొని ఆయనకు నచ్చచెప్పవలయునని తలంచి ఏమోరాజుచిత్తమెట్లుండునోయని సందేహించి కేవలము స్పష్టముగాఁజెప్పక అన్యాపదేశముగ రాజులకు బు...

ద్ధిచెప్పుట యుచితమని యోచించి చాలసేపు వితర్కించి యొక్క యుపాయముపన్నెను. ఒకనాఁడు రాత్రి రాజు భోజనముచేసి వెన్నెల లోఁగూర్చుండి కార్యాంతరముమీఁద మంత్రిని బిలువనంపి కొంతసే పు మాటలాడి తనఖజానాలో ధనము తక్కువగానున్నదని మంత్రి చెప్పగా రాజు పొరపాటుచేత "మనకు గావలసినంత, బంగారము కొద్దిదినములలో వచ్చు" నని పలికెను. ఆమాటలువిని మంత్రి నిలువ దీసి యెక్కడనుండివచ్చునని యడిగెను. రాజు విధిలేక తాను బంగా రము చేయించుచున్న సంగతి చెప్పవలసివచ్చెను. అదివిని మంత్రి రాజును చీవాట్లుపెట్టుట మంచిదికాదని మృదువచనములతో నాతని మందలింపఁదలఁచి యిట్లనియె. దేవా! బంగారము చేయించుటకు పొరుగూరునుండి బైరాగిని పిలువనక్కరలేదు. మట్టి బంగారముచేయు వారు ఇనుము బంగారముచేయువారు మనపట్టణమందేయున్నారు వారిని నేనెఱుఁగుదును. అనవుడు రాజుతుల్లిపడిలేచి "ఏమీ! సువర్ణ యోగము దెలిసినవారు మనయూరిలోనే యున్నారా? అట్లయిన తక్షణము వారిని నావద్దకు పిలిపింపు" మని పలికెను. రేపుదయమున దప్పక వారిని మీవద్దకు పిలిపించెద" నని మనవియొనర్చి సెలవుగై కొని తన గృహంబునకరిగి పండుకొని తెల్లవారుజామున నే లేచి తన సేవకులంబిలిచి "యోరీ! గురునాథుని, సుబాహుని, నీలకంఠుని తెండు' అని యానతిచ్చెను. ఆయన సెలవుప్రకారము సేవకులుపోయి మువ్వు రను దోడుకొనివచ్చిరి. అనంతరము మంత్రి కాల్యకృత్యములందీర్చి కొని యాముగ్గురు మనుష్యులను వెంటఁబెట్టుకొని రాజమందిరమున కుం జని మహారాజుగారి దర్శనముచేసి యిట్లనియె. "మహాప్రభూ! వీరుమువ్వురు బంగారము జేయఁగలరు. వీరికి సువర్ణయోగము తెలి సిన ట్లెవరికిం దెలియదు. దేవరవారు చిత్తమువచ్చినట్లు వారినడుగన చ్చును." అనవుడు రాజు సంతోషించి వారిమువ్వురిం దేరిపారచూచి

యందులో గురునాథునింబిలిచి "ఓయీ నీవెవ్వఁడవు నీవేమిబంగారము చేయగలవు. నీవిద్య యెవనియొద్ద నేర్చుకొంటివి? ఎంతకాలము నుండి నీవు సువర్ణము చేయుచుంటి"వని యడిగెను. అందుకు చేతులు జోడించి భక్తిశ్రద్ధలతో గురునాథుఁడిట్లు మనవిచేసెను. "స్వామీ! నేను మట్టి బంగారము జేయఁగలను. నాకీవిద్య మాతండ్రి నేర్పెను, అతనికి మాతాత నేర్పెను. నేనుచిన్ననాటనుండియు నీవిద్య నభ్యాసము జేసితిని. నేను నాకుమారునకుంగూడ నీవిద్య నదివఱకే నేర్పితిని. కులముచేత నేను కుమ్మరిని." అనఁగానే రాజు మరింత సంతోషించి యేవిధముగానీవు బంగారముచేయుచున్నావో ఆయోగము తత్క్షణము నాకుచెప్పుము; అని యాజ్ఞాపించెను చిత్తము; అనిగురునాథుఁడిట్లనియె. "దేవరవారు నన్ను క్షమింపవలయును. మట్టి బంగారముచేయుటనగా వనమూలికలచేత గాదు. పసరులుపోసిగాదు. మంత్రములచేతగాదు. మాయలచేతగాదు. మేము కుమ్మర్లమగుటచేత మట్టితెచ్చి దానితో నానావిధములైన కడవలు దాకలు పిడతలు మూకుళ్ళు చేయుదుము. వాటి నావములోవేసి కాల్చి కష్టపడి కావళ్ళతో మోసికొని సంతలకుఁబోయి అమ్ముకొందుము. అమ్మగావచ్చిన సొమ్ము మితముగా కుటుంబవ్యయముక్రింద వాడుకొని తక్కినసొమ్ము నిలవచేసికొందుము. కష్టపడి సంపాదించిన యాధనముతో నాభార్యకు నేను వేయిరూపాయల బంగారపునగలు చేయించితిని. ఈవిధముగానె నేను మట్టి బంగారము చేసితిని. ఏలినవారు మాకు తల్లిదండ్రులవంటివారు గావున మీకు నాసంసారపుగుట్టు చెప్పినను తప్పులేదు. ఇప్పుడు నాలుగ్గువేఁరూపాయలు నావద్ద వడ్డికిఁదిరుగుచున్నవి పూర్వము గుడిసెలలోఁ గాపురముండెడివాఁడను. ఇప్పుడు పెంకుటింట నివసించుచుంటిని. ఇదియే నాసువర్ణయోగము. ఇంతకంటె నేమియునెరుగను. ఈకథ వినగానే రాజు తెల్లబోయి కొంతసేపటివఱకు నత్యాశ్చర్యము

చేత బలుకఁజాలక రెట్టకేలకు రెండవవాఁడైన సుబాహునిం బిలిచి నీవేమి బంగారము జేయుదువని యడిగెను. రాజుతో సుబాహుఁడిట్ల ని మనవిజేసెను. దేవా! నేను కమ్మరిని. నేను ఇనుముతో పారలు గునపములు కత్తులు కొడవళ్ళు గరిటెలు పెనములు మేకులు మొదలగు సరకులం జేసి లోకులకమ్మెదను. ఇనుము లోకులకన్నిపనులకు నుపయోగించెడు వస్తువగుటచేతను నేనుకష్టపడి సరకులను సరిగాచేయుట చేతను న్యాయమైన వెలకు విక్రయించుటచేతను లోకులందఱు నా వద్దనే కొనజొచ్చిరి. అందుచేత నేను స్వల్పకాలములో భాగ్యవంతుఁడనయితిని. నాయింటినిండ నినుమున్నది. నాభార్యవంటినిండ బంగారమున్నది. ఇదియే యినుము బంగారముచేయునట్టివిధానము. ఇంతకంటె నేనెఱుఁగను. ఈపలుకులువిని రాజు సరేయని తలయూచి మూఁడవవానిం బిలిచి నీవేమి సువర్ణము చేయుదువని యడిగెను. ఆతఁడిట్లనియె. నేను కంసాలిని. వెండితెచ్చి ఆకులు, దొన్నెలు, కంచములు చెంబులు మొదలయిన వస్తువులను అందెలు మొదలగు నగలుగాను జేసి వాటినమ్మి చాలసొమ్ము సంపాదించి మేడకట్టితిని. భూములు సంపాదించితిని. ఇదియే వెండి బంగారముచేయువిధము.” ఈ మూఁడుకథలువినఁగానే రాజు చిఱునవ్వునవ్వి మంత్రిమొగముచూచి “ఓయీ! నీవు నాకు వివేకము బోధించుటకై యీపన్నుగడ పన్నితివి. చమటయూడ్చి కష్టపడి బంగారము సంపాదింపవలయునుగాని పరులవలన బంగారముకాదని నీవు నాకు నీతినిబోధించితివి. అట్లయిన బైరాగిచేయుచున్న దబద్ధమా యనెను. అనవుడు మంత్రి యిట్లనియె “స్వామి బైరాగి మీరిచ్చినవెండి శిష్యులచేత దూరపదేశమునకుఁ బంపి యక్కడ దానిని పాతేయించినాఁడు. రేపురాత్రి జేపరమేశాయని యీచోటువిడిచి మరల జన్మమధ్యమున మనకుఁ గనబడకుండ శంకరగిరి మన్యమునకుఁ బోదలఁచుకొన్నాఁడు. ఇది వేగు

లవాండ్రవలన నాకుఁదెలిసినది. అనఁగానే రాజు విస్మితుఁడై వెండి దాచినచోటు తనకుఁ జూపుమనెను. మంత్రి సరేయని మహారాజును వేగులవాండ్రను మఱికొందఱు మనుష్యులను వెంటఁబెట్టుకొని యొకచోటికిం దీసికొనిపోయి యక్కడత్రవ్వించి వెండిచూపించెను. అది చూచి రాజు మహాకోపముతో బైరాగినిపిలిపించి వానిని వానిశిష్యులను జెఱసాలలో బంధించి మంత్రిబుద్ధిసూక్ష్మతకు, జాగ్రత్తకు మెచ్చుకొనెను.

## అభయప్రదానము

పాటలీపురమందొక క్షత్రియుఁడొక బౌద్ధునితో మతసంబంధమైన వాదముచేసి తనమాట యోటువడినందున కోపావేశపరవశుఁడై యాతనిం జంపి పారిపోవుచుండ మృతినొందిన యాతని మిత్రులు చుట్టములు వానిం బట్టుకొనఁదలచి తఱుముకొనిపోయిరి. అది చీఁకటి రాత్రి యగుటచే నాతఁడు సందు గొందులం బడి యెట్టకేల కూరి ప్రక్కనే యున్న యొకతోఁటలో డాగఁదలచి చుట్టుగోడదాటి యాతోఁటలోఁ బడి 'స్వామీ! మతవైషమ్యముచేతఁ గోపమాపుకొనలేక నేనొక 'నరహత్య గావించితిని.నాకుశరణమిచ్చి రక్షింపుము. నానిమిత్తము శత్రువులు వెదకికొనుచు వచ్చుచున్నా' రని ప్రార్థించెను. ఆబౌద్ధుఁడు వాని దీనాలాపముల విని జాలినొంది 'ఓయీ! నీకు శరణమిచ్చితి. ఈతోఁటలోనున్న యింటిగదిలో నిన్ను బెట్టి తాళము వేసి ప్రస్తుతము నిన్ను దాచి నీశత్రువులు మఱలి పోయినవెనుక నీకు భోజనముపెట్టి యొక గుఱ్ఱము నిచ్చెదను. దానినెక్కి రెండుజాములరాత్రియైనతరువాత బయలుదేఱి తెల్లవాఱువఱకుఁ జాలదూరము పోఁగలవు. అంతట నీప్రాణము సురక్షితమగునని వానిం గదిలోఁబెట్టి

బీగమువేసి తాను భోజనముచేయుటకు వాని కన్నముదెచ్చుటకు నగరమధ్యమందున్న తనయింటికిఁబోయెను. పోవునప్పటి కాయింటి యవస్థ నేమిచెప్పుదును. ఆతనిభార్యయు, బిడ్డలు చుట్టములు నొకశవముపైఁబడి గుండెలు బాదుకొని యేడ్చుచుండిరి. ఆధ్వనివిని బౌద్ధుఁడు భయవిహ్వలుఁడై యొక్క పాణముతో లోనికింజని చూచునప్పటికి తన కుమారుని శవమే వానికన్నులకుం గనపడెను. కటకటా! యీబౌద్ధుని శరణుజొచ్చిన క్షత్రియునిచేతఁ జంపంబడినయామనుష్యుఁ డీతని కుమారుఁడె. అయినను బౌద్ధుఁడు సత్యవాక్యపరిపాలనమం దాసక్తి గలవాఁడగుటచే కుమారునికొఱకు చాలసేపు విచారించి తానుమాత్రము భోజనము చేయక శరణుజొచ్చిన యాక్షత్రియునికొఱకు తన వాగ్దానపరికారము కొంత యన్నము పట్టించుకొని యొకగుఱ్ఱముందీసికొని తోఁటకుఁబోయెను. దుఃఖము పట్టలేక నిర్జనప్రదేశమునకుఁ బోయి యాతఁడేడ్చునుగాఁ బోలునని చుట్టములందఱుఁదలంచిరి. అట్లు పోయి యతఁడు తలుపు తాళముతీసి క్షత్రియుని బిలిచి సుష్టుగా భోజనముపెట్టి తానుదెచ్చిన గుఱ్ఱముఁజూపి యిట్లనియె. ‹అయ్యా! నీచేతఁ జంపఁబడిన మందభాగ్యుఁడు నాకుమారుఁడె. నాకతఁ డొక్కఁడేకొడుకు. వివాహమై మూడుమాసములైనఁ గాలేదు. నేను మొదట నీ కభయప్రధాన మొసఁగకయుండినచో నీదౌర్జన్యమునకు నిన్ను నేను తుత్తునియలుగా ఖండించియుందునుగదా. అయినను మాట తప్పుట భావ్యము కాదుగదా. నిన్ను రక్షించెదనని వాగ్దానము చేసితినిగాన మఱియొక విధముగ నేను చరింపను. ఇదిగో! నీగుఱ్ఱమునెక్కి సుఖముగాఁ బొమ్ము. నిన్ను వేగముగ తెల్లవారులోపన కతిదూరము తీసికొనిపోఁగల మంచిగుఱ్ఱము నేనిచ్చితిని. ఈచీఁకటిమాటున నీ వపాయమును దప్పించుకొనుము ఇఁకముందైన నీవు పరమతసహనము గలిగి బ్రతుకుము. పొమ్ము నీకు

శుభమగుఁగాక!" ఆపలుకులు విని యాక్షత్రియుఁడు మిక్కిలి సిగ్గుపడి క్షమింపుమని వానిం బ్రార్థించి మెట్టెటో గుఱ్ఱము నెక్కి జీవచ్ఛవము వలె గానిమీఁదఁ గూర్చుండి బౌద్ధుని యౌదార్యమునకు భూతదయ కు మిక్కిలి యాశ్చర్యము నొందుచుఁ బోయెను.

# మంత్రముల పెట్టె

ఒకనాఁడొక రాజు కొలువుఁదీర్చియుండెను. అప్పుడు భాగ్య వంతులు పేదవారు బలవంతులు దుర్బలులు తమ తమకు సంభవించి న విపత్తులను నివారింపుమని వేఁడుకొనుటకు జరిగిన యన్యాయము ల నివేదించుకొనుటకు నిరాటంకముగ రాజసన్నిధికివచ్చి నిలిచియుం డిరి. రాజు సింహాసనము మీఁదఁ గూర్చుండెను. ఆతనికుడిప్రక్కను గూర్చుండి మంత్రి ప్రజలు చేసికొను దీనాలాపములను మిక్కిలిశ్రద్ధ తో నాలకించుచు నెవ్వరి మనవుల కేయుత్తరము లీయవలయు నవి యిచ్చుచు దుఃఖముచేత ముకుళించిన హృదయములను వికాసమొం దఁ జేయుచు నుండెను. ఆసమయమున ప్రాఁతగుడ్డ పేలికలం జుట్టఁబెట్టు కొన్నయొక మనుష్యుఁడు సింహాసనమునకు సమీపముననిలిచియుండి రాజువంకను, ఆతఁడు గూర్చున్న గద్దెవంకను వెఱ్ఱివెఱ్ఱిచూపులఁ జూ డఁదొడఁగెను. ఆమనుష్యుఁడు తానెందుకువచ్చెనో యాసంగతి మ ఱచి రాజసభలో నున్నమాటమఱచి ప్రజలందఱు మనవిసనవులు చే సికొనుచుండ తానెయ్యదియు మనవి చేసికొనక. దీర్ఘాలోచనలో ము నిఁగి రాజునెడఁ జూపవలసిన విశేషవినయము భక్తిఁజూపక వెఱ్ఱివాని యట్లు యుండెను. అప్పుడు రాజు మంత్రింజూచి యిట్లనియె. "ఏపురు షుని గురించియైన మిక్కిలి యెక్కువ శ్రద్ధదీసికొని సౌఖ్యపెట్టువా

రెవరు?", దానికిమంత్రి "దేవా! భార్యకంటె నీకె నెవరున్నా"రని బదు లుచెప్పెను. అట్లుచెప్పుటయు గద్దెపరిక్క ప్రాతగుడ్డలతోనున్న యీ వింత మనుష్యుఁడు "దేవా! ఆమె పతివ్రతయైన పక్షమున మగని నాదరించును. కాదేని శరీరసౌఖ్యమును గాని యాత్మసౌఖ్యమునుగాని చూడక తుదకు నాశన మొందఁజేయు"నని తొట్రుపాటులేక మెల్లఁగాఁ బలికెను. ఆమాటలు రాజువిని చిఱునవ్వునవ్వి "యీలోకముననన్ని టిలో నేవస్తువు మిక్కిలియుపయోగమైనదని" మంత్రి నడిగెను. అన వుడు "ధనమే మహాప్రభూ! దానిచేతనే సమస్తసౌఖ్యములుజరుగు" నని మంత్రి ప్రత్యుత్తర మిచ్చెను. "అది చేతిలో పుష్కలముగా నున్నపుడు సౌఖ్యముజరుగుట"యని యీవింతపురుషుఁడు వెనుకటి యట్లె చల్లగా బలికెను.

అతఁడిచ్చిన యా రెండుత్తరములు విని యతఁడు మిక్కిలి జ్ఞానియని గ్రహించి రాజు వానిం జేరఁబిలిచి "నీవెవ్వఁడవు ఇచ్చట కేలవచ్చితివి. ఇక్కడికి వచ్చినవారందఱుఁ దమతమ దైన్యముల మ నవిచేసికొనిరి. నీవొక్కఁడవే యేదియుం జెప్పుకొనక యేమియు నడు గక యున్నాఁడవు. నీకేమికావలయు" ననియడిగెను. అనవుడు నాపు షుఁడిట్లనియె. "దేవా! నేను మీవద్దకెప్పు డుపకార మపేక్షించి రాఁద లఁచుకొనలేదు. ఇప్పుడేల వచ్చితి వందువా! నాకీప్రపంచములో నాప్రాణముకంటె నెక్కువ ప్రియమైన దొకతె యున్నది. ఆమె నా భార్య. ఆమె మూలమున వచ్చితిని. కానిచో రాకపోదును. నేను కొం చెము చదువుకొన్నవాఁడను. నాపుస్తకములే నాసర్వధనము, అన్ని వ్యాపారములుఁ గట్టిపెట్టి నేను రాత్రియనక పగలనక యాపుస్తకము లు చదువుకొనుచుఁ గూర్చుండుదును. ఐహికవస్తువుల సంపాదింపక నేను జ్ఞానమునే సంపాదించుటకుఁ బాటుపడితిని. పరమపతివ్రతయగు నాభా ర్యకు నాకుఁ, గడుపునిండ పట్టెడన్నము నీళ్ళు దొరకుచుండినంత కాల

ము నాకు దారిద్ర్యమన్న నెంతమాత్రము భయములేక పోయినది. ఒకరియొద్దఁ జెయిఁజాపవలసినంత యవసరము లేకపోయినది. నిన్నటి వఱకు నేనీవిధముగ నన్నపానములకు లోటులేక భూలోకస్వర్గ మను భవించుచుంటిని. కాలవశమున నాభార్య మంచి యాహారము లేక తగిన పోషణలేక క్రమక్రమముగా జబ్బుపడుచున్నదని నేను నిన్న దెలిసికొంటిని. కాఁబట్టి మీరు నాకుఁ గొంత సహాయము చేయవల యును. ఉచితముగా నాకు దానిమీరీయ నక్కఱలేదు. నాచేతఁగొంత పనిఁజేయించి మీరు ధనసహాయము చేయవచ్చును. ఈసాయము మీరుచేసిన పక్షమున నాభార్య యారోగ్యముఁజెంది బలముగలిగి మునుపటియట్లె తన చిఱునవ్వులచేత నన్ను మహానందభరితునిఁజేసి నాకు సౌఖ్యమీయఁజాలును. ఈపుణ్యము మీరుకట్టుకొనవలయును.

ప్రాఁత పేలికలఁ గట్టుకొని బ్రహ్మతేజము గ్రక్కుచున్న మొగముతోడను శాంతరస మొలుకుచున్న మాటలతోడను జ్ఞాన మును వెదజల్లుచున్న నిర్మల నేత్రములతోడను వెలయుచున్న యా జానుబాహువులుగల విగ్రహమునుజూచి రాజు మిక్కలి యాశ్చర్యము నొంది మంత్రితోనిట్లనియె. "ఈతనిని నాయాస్థాన పండితులలో నొకనిగాఁ జేసితిని. ఇతని కేమి గావలసిన నది యిచ్చి పండితులకు జరుగవలసిన మరియాదలం జరుపుము"

ఆదినము మొదలుకొని యాప్రాతపేలిక మనుష్యుఁడు రాజు గారి యాస్థాన పండితులలోనెల్ల గొప్పవాఁడని పేరువడసి మునుపటి వలె గుడ్డపేలికలు కట్టుకొనకపోయినను రాజుగారిసన్నిధి నున్నపుడు దప్ప తదితరసమయములలో నెల్లప్పుడు పుస్తకములఁ దిరుగవేయుచు నుండెను. విద్యకేగాక యతఁడు శాంతస్వభావమునకుఁ బరోపకార మునకుఁగూడ దేశమంతట ప్రఖ్యాతికెక్కెను. నిజ పేదతనములో నయితేము మగఁడు తనపాలిఁటి భగవంతుఁడేయని యాతని యడుగు

లనే గొలుచుచువచ్చిన యాతని యిల్లాలు వానినిప్పుడు మఱింతమహా నుభావుఁడని తొల్లింటికంటె నెక్కువ గౌరవముతో నాదరించుచువచ్చెను ఈమైశ్వర్యమువలన వానియిల్లు వాకిలి కట్టుగుడ్డలు మాత్రమే మార్పుజెందెను. కాని; తక్కినలక్షణములు మార్పుజెందలేదు. అనఁగా విద్యాసక్తి మొదలైనవి యెప్పటియట్లెయుండెను. అట్లు కొంత కాలమున్నపిదప నతని నిర్మలవర్తనముఁ జూచియు నిగర్వస్వభావము జూచియు నతఁడుచెప్పునట్టి యద్భుతములైన యాలోచనలంబట్టియు రాజు మిక్కిలి భక్తుఁడై వానినిమంత్రినిఁ జేసెను.

తినఁగూడులేక కట్ట గుడ్డలేక మనమందఱముఁ జూరవేసిన పాతపేలికలు గట్టుకొనునట్టి గర్భదరిద్రునకేమి యింత మహైశ్వర్యమేమి యని రాజుకొలువుకాండ్రిందఱు నీర్ష్యచేత వానినెట్లయినఁ జంపఁదలఁచి వానిమీఁద లేనిపోని యపవాదముల నెన్నోలోకమున వ్యాపింపఁజేసి యెవరికి వీలైనప్పుడు రాజుకడకుఁబోయి కొండెము లిట్లు చెప్పసాగిరి. "మహాప్రభూ! మీవద్దమంత్రిగానున్న యీమహానుభావుఁడు సామాన్యుఁడుగాఁడు. దయ్యాలపోతు. ప్రతిదినము మీ దర్బారునకు వచ్చుటకు బయలుదేఱునపుడు ముందుగా నొకచిన్న గదిలోనికిఁబోయి యొకవెండిపెట్టె మూఁతఁదీసి యందులోనున్న యొకరక్షరేఖకు సాష్టాంగదండము పెట్టి పిమ్మట నిల్లువిడుచునని యందఱుఁ జెప్పుకొనుచున్నారు. ఏలినవారేమనుకొన్న సరే కాని వీఁడు తప్పక యేదోమంత్రబలముచేత మీమనసు విఱిచి మిమ్ముఁవశ పఱచుకొన్నాఁడు. కాకపోతే మహాప్రభూ! మొన్నటిదాఁక చింకి పాఁతలు కట్టుకొని పట్టెడన్నమునకు మిమ్ము యాచింపవచ్చిన వాఁడే మిటి నేఁడు మీకింత యిష్టుఁడై మీతరువాత మీయంతవాఁడై మహావైభవముతో వెలుగొందుట యేమిటి? మేము గిట్టక చెప్పినామ నుకొనక మీరుకొంచెమాలోచించి దయ్యాలపోతుతనమును గురించి

కొంచెము జాగ్రత్తగా మాత్రముండుఁడు. ఇంతకంటె మనవిచేసికొన వలసినది లేదు."

తనకొలువుకాండ్రు చెప్పినపలుకులువిని మొదటరాజునవ్వెను కాని తనకు మిక్కిలి యాప్తులగువారు గూడ పలుమాఱు జాగ్రత్త జాగ్రత్త వాఁడునమ్మఁదగినవాఁడు కాఁడని నొక్కిచెప్పసెట్టకేల కతఁడది యాలోచించవలసినవిషయమే యని మంత్రియెడనించుక యనుమానముఁబూని తనయాప్తులతో "నాతోఁగూడరండి మీరు చెప్పినది నిజమో కాదో నేను స్వయముగాఁబోయి చూచెద" ననిపలికెను. పలికి వారినందఱ వెంటఁబెట్టుకొని మంత్రిగృహమునకుం జనియెను. తనకు వసియించుట కిల్లిచ్చిన రాజుగారే మరల దానింజూచుటకు వచ్చినందుకు మిక్కిలి సంతసించి మంత్రి రాజును బరివారమును మిక్కిలి గౌరవించెను.

అన్యోన్య గౌరవములు యోగక్షేమ విచారణలుఁ గొంతసేపు జరిగినపిదప రాజు మంత్రికిట్లనియె. నీవిప్పుడే దర్బారునకు రావలయును. ఇప్పుడు నీతో నాలోచన జేయవలసిన రాజకార్యము లవసరములైనవి కొన్ని కలవు గావున తత్క్షణమురమ్ము. అనవుఁడు మంత్రి నిముసమాగి ఏలినవారు సెలవిత్తురేని నిముసము సేపు లోపలికరిగి పిదపవచ్చెద' నని బదులుచెప్పెను. యీపలుకులు వినఁగానే రాజువెంట వచ్చిన కొలువుకాండ్రు తమమాట నిజమగుచున్నదని సంతసింప నారంభించిరి. రాజు మాత్రము 'నీవీక్షణమే రావలయు' నని పట్టుబట్టెను. అనవుఁడు మంత్రి మరల సందేహించి నే నొక్క నిముసము కంటె లోపల నెక్కువసేపుండను కావున దేవరవా రనుగ్రహించి నాకు సెలవియ్యవలయు నని ప్రార్థించెను. మంత్రి యట్లనుటయు రాజు మొగ మించుక జేవురింప లోపలికి బోయియేమి చేసెద వని గట్టిగబలుక మంత్రి లేదండి! యొక్కనిమేష మీచిన్నిగదిలోనికిఁ

బోయి మీవెంటనే దర్బారునకువత్తునని ప్రత్యుత్తరమిచ్చెను గొలు పుకాండ్రి మొగములు మఱింతవికాసమొందెను. రాజు నేనుగూడ నీతో నీగదిలోనికి వచ్చెద ననెను. మంత్రి తత్తరపడి తెల్లబోయి అదిదేవరవారు రాఁదగిన చోటుగాదు మీకదియొక లెక్కలేదుగాని నాబ్రతుకంతయు దానితోనేయున్నదని పలికెను.

రావలదని మంత్రియెంతబ్రతిమాలినను రాజు వినక పట్టుబట్టి నందున మంత్రి యెట్టకేల కాయన నాగదిలోనికిం దోడ్కొనిపోయె ను. ఆగదిలో వందలకొలఁది తాటియాకుల పుస్తకములుండెను. ఆ పుస్తకములనడుమ నొకచిన్న వెండిపెట్టె కలదు. గదిఁ బ్రవేశించిన తోడనే మంత్రి రాజువంకఁజూచెను. రాజుకోపముతో మంత్రివంకఁ జూచెను. తరువాత నేమియుం బలుకక మంత్రి వెండిపెట్టెమాత్రం దెఱచెను. తెఱచుటయు నాపెట్టెలో కాషాయవస్త్రముల పేలికలు రాజున కగపడెను.అగపడుటయు రా జవియేమిటనియడిగెను. మంత్రి రాజునకిట్లనియె. 'దేవా! ఇవినేను మహాదరిద్రదశలో నున్నపుడు కట్టుకొన్నగుడ్డలు మహైశ్వర్య మనుభవించుచున్న యీదినములలోఁ గూడ, పూర్వము ధరించినవాఁడనునేనే అనిజ్ఞాపకముఁ జేసికొను టకై వీటి నీపెట్టెలోఁబెట్టిదాచితిని. ప్రతిదినము దేవరవారి దర్బారు నకు బయలుదేఱునపుడు ముందుగా నీగుడ్డలనుజూచివత్తును. ఇవికట్టు కొని నేనెట్లుంటినో తలంచుకొందును. ఇవిధరించిననాఁడు నేనెట్టియవ స్థలో నుంటినో స్మరించుకొందును. ఇట్లుస్మరించుకొనుట యెందుకన గాఁ దినతిండి కట్టగుడ్డలేని బీదవారెట్టి దురవస్థలపాలగుచుందురో తెలి సికొనుటకొఱకు. నేను కొంతకాలము నిజముపేదతన మనుభవించిన వాఁడనగుటచే నీగుడ్డలు చూచినతోడనే పేదవా రెంత కష్టపడుచుం దురో నాకుజ్ఞాపకమువచ్చును. ఈమాటలు రాజు మిక్కిలి యాశ్చర్య ముతో విని మంత్రిని ధనపతివారములున్న చోటికి తీసికొనవచ్చి మిక్కిలి

కోపముబూని యిట్లనియె ‹అయ్యలారా! నేనిదిగో దయ్యాలగది నుండి యీవలకు వచ్చినాను. మంత్రియొక్క మంత్రిములపెట్టెను దానిలోనున్న రక్షరేకులను గన్నులారఁ జూచితిని. ఇదిగో! మంత్రికి కఠినమైన దండన విధించుచున్నాను. ఈతఁడే నారాజ్యమునకంతకు బ్రతికియున్నంతకాలము మంత్రియైయుండుఁగాక! ఆపలుకులు విని కొలువుకాండ్రందఱు సిగ్గుపడిపోయిరి.

---

# త్యాగరాజు

త్యాగరాయకృతులని యిప్పటికిని లోకమందు ప్రసిద్ధిగలిగి సంగీతపాటకులందఱిచే సాధారణముగ గానముచేయఁబడు పాటలు రచియించిన మహనీయుఁడెవరో ఎట్టిగుణసంపన్నుఁడో మున్నగుసంగతులు తెలిసికొనుటావశ్యకముగాదా? త్యాగయ్య పూర్వికులు తంజావూరుజిల్లా తిరువానూర్కారు కాపురస్థులు. ఈ త్యాగయ్యగారి పితామహుఁడు గిరిరాజకవి. గొప్పవిద్వాంసుఁడు; పరమభక్తుఁడు. ఈయన శాస్త్రపరిజ్ఞానమునకును భక్తికినిమెచ్చి తంజావూరు మహారాజగు మహాజీగారు మిక్కిలి యౌదార్యమగు నీవుల నిచ్చి యనేకవిధముల నాదరింపుచుండెను. ఈయన సంగీతసాహిత్యములయందసమానప్రజ్ఞగలవాఁడు. ఈయన భక్తిరసపూరితములగు పాటలు తెలుఁగుభాషయందు రచియించెను. ఈయన కైదుగురు పుత్రులు గల రందు కనిష్ఠునిపేరు రామబ్రహ్మము. ఈయనయుఁ దన తండ్రివలెనే పరమభక్తుఁడై జీవనము జరుపుకొనుచుండెడివాఁడు. ఈ రామబ్రహ్మము మిక్కిలి బీదస్థితియందుండుటచే పూర్వనివాసమగు తిరువాన్గూరువిడచి తిరువయ్యూరుగ్రామమున గాఁపురముండఁబోయె

ను. రామబ్రహ్మము మిగుల బీదవాఁడయ్యును, దైవము తనకులభిం పఁజేసిన యుపాధితోనె కాలముగడపుచుండెను. ఈకాలమున తంజాపూరు మహారాజు పదునైదుగృహములునిర్మింపించి యవి పరమభక్తులును శ్రోత్రియులును నగు బ్రాహ్మణుల కీయఁదలంచుకొని యందొకటి రామబ్రహ్మమున కీయనిశ్చయించెను. కాని ఆయన యీగృహదానము గ్రహించుట కొప్పుకొనలేదు. రామబ్రహ్మమున కీ ప్రాపంచిక విషయములం దెంతమాత్రి మాశలేమికి మహారా జాశ్చర్యపడెను. రాజిచ్చు గృహదానము బుచ్చుకొనుటకు రామబ్రహ్మము మిగుల బలవంతపెట్టుటచే నెట్టకేల కంగీకరించి, తనవలెనే మిక్కిలి బీదవాఁడగు నింకొక బ్రాహ్మణున కాగృహము నిచ్చివేసెను. రామబ్రహ్మమునకు ముప్వురుకొడుకులు గలరు. అందు త్యాగయ్య కనిష్ఠుఁడు. త్యాగయ్య పదునాలుగేండ్లవాఁడై యుండ తండ్రియగు రామబ్రహ్మము చనిపోయెను. త్యాగయ్య తనతండ్రివలెనే పరమభక్తుఁడై శ్రోత్రియ వృత్తి నవలంబించెను. ఇతఁడు చిన్నప్పుడు సంస్కృతమును వేదాధ్యయనమును నభ్యసించెను. చిన్నప్పటినుండి త్యాగయ్యకు సహజముగా సంగీతమునం దభిరుచి గలిగియుండుటచే శొంఠి వెంకటరమణయ్యరను సంగీతపాటకునియొద్ద ప్రవేశించి యావిద్య నేర్చుకొన నారంభించి యతని బుద్ధికుశలతచే శీఘ్రకాలముననె తనగురువుతో సమానవిద్వాంసుఁడయ్యెను. త్యాగయ్య విగ్రహారాధకుఁడు. పరమభక్తుఁడు. ఇతఁడన్నలతో పిత్రార్జితముబంచుకొనినప్పుడు సొత్తులన్నియు సోదరులకు విడచిపెట్టి, తాను దేవతార్చనపెట్టె మాత్రము తీసికొనెను. దేవలోకగానవిశారదుఁడగు నారదుఁడు త్యాగయ్య కొక వృద్ధబ్రాహ్మణరూపమునఁ గనఁబడి, స్వరార్ణవమను పేరుగల యొక సంగీతశాస్త్రగ్రంథ మాతనికిచ్చెనని యొకకథ చెప్పెదరు. ఈకథ నిజమని మేము నమ్మఁజాలము, కాని త్యాగయ్యకృతులలో నారదస్తోత్రముగల పాటలు కొ

న్నియున్నవి. ఈయన పాటలుపాడి భజనచేయుచు దేవుని బూజించు వాఁడు గాన నొకప్పు డీతనిసోదరు లింటిలో నీభజనగడబిడ సహిం పఁజాలక త్యాగయ్య దేవతార్చనపెట్టెలోని విగ్రహములను రహస్య ముగాఁ దీసికొనిపోయి కావేరినదిలోఁ బాఱవైచిరి. త్యాగయ్య తన దేవతార్చనపెట్టెలోని విగ్రహము లకస్మాత్తుగాఁ గనపడక మాయమైనందుకు మిగుల విచారగ్రస్తుఁడై నిద్రాహారములులేక పరితపించు చుండఁగా,నతని యిష్టదైవమగు రాముఁడు స్వప్నావస్థయందుగనబడి తానున్నస్థలమతనికిఁదెలిపి యచట వెదకించుమని చెప్పెను. ఆప్రకార ము త్యాగయ్య వెదకించి యావిగ్రహములు దొరకినయనంతర మతఁ డాసంతోషముబట్టఁజాలక తత్సూచకముగ మిక్కిలి రమణీయమైన కృతులరచించెను. త్యాగయ్యయొక్క ప్రసిద్ధి లోకమంతట నానాటికి వ్యాపించి తంజావూరు మహారాజు శరభాజీయను నాయన కాతనిపా ట వినవలెనని కోరికగలిగి,రమ్మని వర్తమానపంపెఁగాని త్యాగయ్య రాజుల నాశ్రయింపఁ గోరికలేనివాఁడగుటచే రానని నిరాకరించెను. రాముని నాశ్రయించి సేవించుటకంటె, నస్థిరము నిరర్థకమునగు ధనము సుఖదాయకమాయని ప్రశ్నింపుచు త్యాగయ్య "నిధిచాలసుఖమా" యను కృతిరచియించెను. ఈతనితండ్రి రామబ్రహ్మము షహాజీమహా రాజిప్పించిన గృహము నిరాకరింపలేదా? ఆయనకొడుకగు త్యాగయ్య శరభాజీమహారాజుయొక్క బహుమానాది మన్ననల నిరాకరించు టొక వింతకాదు.

పూర్వకాలమున, నిప్పటివలె రయిలుబండ్లు బాటలు మున్నగు ప్రయాణసౌలభ్యములు లేకపోయినను జనులు దూరదేశములకు యాత్రార్థమై పోవుచుండెడివారు. అట్టియాత్రలు మిగులవ్యయప్రయా సములకును నొకప్పుడు యిల్లుబయలుదేరినవారు మరల దానిం జేరఁ గలుగుదురో లేదో యను సందేహముతోను ఏమైననుసరే యను

నొకవిధమైన మొండిధైర్యముతోను జేయుచుండెడివారు. ఇట్టికష్టదినములలో పూర్వాచారపరాయణుండును పరమభక్తుఁడును నగుత్యాగయ్య పుణ్యతీర్థయాత్రలకు బయలుదేరెను. ఈమహనీయుఁడు తాను దర్శించిన ప్రతిస్థలమందును, తనభక్తియు సంగీతసాహిత్యప్రౌఢిమయుఁ గన్పరచుచు ననేకకృతులు రచియించుచు వచ్చెను. ఈయన తిరుపతి శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శింపఁబోయినప్పుడు, విగ్రహమున కెదుట నొక తెరవేయఁబడియుండెను. ఆర్యావర్తముయొక్క మూరుమూలగ్రామముల నివసించెడి నీభక్తులు నినుసేవించి నీముడుపులు చెల్లించుటకై సకలశ్రమలకోర్చి వచ్చుచుండఁగా నట్టివారికి నీదర్శనము స్వేచ్ఛగాను సులభముగాను లభింపకుండ నీయసూయాగర్వచిహ్నమగు నీతెరయేమిటి? ఇది వేయి చీలికలై నేలంబడుఁగాకయని త్యాగయ్య "తెరతీయరాదా" యను కృతిని రచియించి గానపూర్వకమగు ప్రార్థనగావించెను. త్యాగయ్య తాను భూలోకస్వర్గమని తలంచిన శ్రీరంగపుణ్యక్షేత్రమున ననేక కృతులు రచియించెను. ఈమహనీయుఁడు కొవూరునకుఁబోయిన జ్ఞాపకమునిమిత్త మాయూర వేంచేసియున్న అంబాదేవి సహితమగు సుందరేశస్వామిపై కొన్నికృతులు రచియించెను. ఆదినములలో కొవ్వూరు గ్రామమున సుందరేశ మొదలాఁయను ధార్మికుఁడును దేశోపకారియునుండెను. ఆతఁడు త్యాగయ్యకు వేయిరూపాయలు బహుమతి నీయఁబోఁగా నాయన, నాకక్కరలేదని నిరాకరించెను కాని త్యాగయ్య శిష్యులాయనకుఁ దెలియకుండ నావేయిరూపాయలు బుచ్చుకొని త్యాగయ్యపల్లకిలో నొకమూల దాచియుంచిరి. ఈసంగతులు కొందఱు దొంగలెటో పసిబట్టి, త్యాగయ్యపల్లకి నిర్మానుష్యమగు నరణ్యమార్గమునఁ బోవుచుండుతఱి నాపల్లకిఁ జుట్టుముట్టి యాపిరి. తనవద్ద ధనమేమియు లేదని యెఱింగియున్న త్యాగయ్య పల్లకి నాపించి పల్లకిలో ధనమేమియులేదని దొంగ

లకుఁ దెలియఁజేయించెను కాని త్యాగయ్యశిష్యులు, తాము, మొద లారివద్ద వేయిరూపాయలు దీసికొని పల్లకిలో నొకమూల నుంచితిమని ఆయనతోఁ జెప్పిరి. అందుపై త్యాగయ్యకు మిగుల నాగ్రహముగలిగి తన పరివారమునందఱిని దిట్టి పల్లకిలోనున్న రూపాయలసంచిదీసి యావలఁబారవై చెను. పిమ్మట దొంగ లారూపాయలసంచి నెత్తికొని పారిపోవఁగలిగిరా? లేదులేదు. ఇద్దఱాజానుబాహులగు క్షత్రియోత్తములు దొంగలపై బాణములఁ బఱపుచుండిరి. దొంగ లావీరులపయిఁ దిరుగఁబడి వారిని ప్రహరించుటకుఁగాని, వారిబాణములదెబ్బలఁ దప్పించుకొని పారిపోవుటకుఁ గాని ప్రయత్నింపక మీఁదుమిక్కిలి యా క్షత్రియవీరుల సౌందర్యాతిరేకంబునకును, వారిబాణముల లక్ష్యలాఘవంబునకును నిశ్చేష్టితులై యచ్చటనే నిలుచుండిరి. కొంచెము సేపటి కారాజపుత్రు లిరువురు నంతర్ధాన మొందిరి. అప్పు డా దొంగలు త్యాగయ్య వద్దకుఁబోయి, తమపై బాణవర్షము గురిపించి నిశ్చేష్టితులఁ గావించిన వా రెవ్వరని యడిగిరి. అట్టి రాజపుత్రులు తనకగపడనందున, నట్టివా రెవరు నిక్కడలేరని చెప్పెనుగాని వారిర్వురు తానుపూజించు రామలక్ష్మణులై యుందురనియు తన్ను దొంగల బారినుండి రక్షించుటకు వచ్చియుందురనియు గ్రహించెను. రామలక్ష్మణు లీతీరున పూర్వము రామదాసుని రక్షించిన తెఱఁగుననే త్యాగయ్యనుగూడ రక్షింపవచ్చిరనుమాట సారవంతమైన బుద్ధిగలవారి చాతుర్యమగు కల్పనయేగాని నిజమని మేము నమ్మఁజాలను.



# సరియైన దారి

ఒకరాజు కొలువులోనున్న గొప్ప యుద్యోగస్థుఁ డొకఁడు పండ్రెండుగురు బోయల పల్లకి నెక్కి దివాణమునకుఁ బోవుచుండఁగా మార్గమునకుఁ గొంచెము ప్రక్కగా నొక మనుష్యుఁడు కూర్చుండి యొక గొయ్యి త్రవ్వుచుండెను. వాలకమునుబట్టి చూడఁగా వాఁడు కూలినాలిచేసికొని జీవనము సేయునట్లు గనఁబడెను. బట్టలు ముఱికి యోడుచుండెను. అదిచూచి యుద్యోగి పల్లకినాపించి వానింబిలిచి యిట్లనియె. "అక్కడ గొయ్యెందుకు త్రవ్వుచున్నావు? ఓరి మూర్ఖుఁడా! ఈగొయ్యి యీదారినిఁబోవువారి కపాయముకదా? అనేకులు నీమూలమున నిందులోఁబడి కాలుచేతులు విఱుగఁగొట్టుకొనరా? ఇంతమాత్రము బుద్ధిలేదా?" గొయ్యి త్రవ్వుచున్న యామనుష్యుఁడు చిఱునవ్వునవ్వి తలపంకించి యుద్యోగికిట్లనియె. "నీవు నన్ను మూర్ఖుఁడనుచున్నావా? నేను మూర్ఖుఁడనుకాను. నాగోతిలోఁబడువాఁడే మూర్ఖుఁడు. ఏలయన సరియైన దారినిఁ బోవువాఁడు దీనిలోఁబడఁడు. పడినాఁడా వాఁడు సరియైనదారిని వెళ్ళనట్లే యెంచవలయును. నాగొయ్యి దారికించుక ప్రక్కగా నున్నది గాని దారిలో లేదు. కాఁబట్టి దారినేవెళ్ళి దారినేవచ్చువారికిది యపాయకరముకాదు. ఆయుద్యోగస్థుఁడు జ్ఞానమును వెళ్ళగ్రక్కుచున్నవాని యుత్తరమును విని యతఁడు వట్టికూలివాఁడు కాఁడని గ్రహించి, తనసేవకులం బిలిచి. యామనుష్యుని తనగృహమునకుఁ దీసికొనిపోయి యన్నము బెట్టి, మంచిబట్టలిచ్చి, తాను దివాణమునుండి తిరిగి వచ్చువఱకు జాగ్రత్తగా నాదరించునట్లానతిచ్చెను. సేవకు లట్లుచేసిరి. ఉద్యోగి గృహమునకు వచ్చినపిదప నామనుష్యునిఁ బిలిచి "నిన్న నాకు నీవి

చ్చిన ప్రత్యుత్తరమునకుఁ జాల సంతసించితిని. ఏలయన దానియం దెంతో యర్థమున్నది. నీవు నాయింటనుండి యవసరమైన యపుడెల్ల నిట్టిజ్ఞానోపదేశము సేయుచుందువా?" యని యడిగెను. అందుకతఁడు సమ్మతించినందున తెక్కలకష్టము చేసికొని జీవించువానివలెఁ గనఁ బడు నామనుష్యుఁ డాయుద్యోగస్థున కుపదేశకుఁ డయ్యెను. అది మొదలుకొని యాయుద్యోగి ప్రతిదినము, ప్రతిరాజకార్యమున వాని యాలోచనమడిగి దానిని రాజసభలో విన్నవించుచు వచ్చెను. తక్కిన లౌక్యుల యాలోచనలకంటె నీతని యాలోచనము సర్వవిధముల శ్రేష్ఠముగా నుండుటచే రాజు వానిబుద్ధికి మెచ్చి వానినె ప్రధానమంత్రినిగఁ జేసికొనెను.

రాజుకొలువులో నున్నవారందఱు వానికిఁ బట్టిన యీగొప్ప యదృష్టమునకు, నదృష్టకారణమైన బుద్ధికి నాశ్చర్యపడి "మునుపు వీనిమొగమున కళాకాంతులు లేవు. తెలివితేటలు కంచుకాగడాలు వేసి వెదకినను గానఁబడునవికావు. ఇప్పుడు వీనికింత తెలివి యెచ్చట నుండి వచ్చెను చెపుమా? దీని కేదో కారణముండవలయు" నని తల పోసి యాకారణముం గనిపెట్ట నిశ్చయించుకొని మాఱువేసముల వేసి కొనియు, సేవకులకు లంచములాసపెట్టియు బహువిధములఁ జాలకాలము ప్రయత్నించిరి. ఎడతెగక చేయఁజేయ నెట్టిదుర్లభకార్యమైన నెరవేరునుగదా. ఎట్టకేల కింటి వంటబ్రాహ్మణుఁడు కొంత హిరణ్యా శ్రాద్ధము తిని, తృప్తుఁడై యీవిధమున నింటి గుట్టంతయుఁ బగవారి కెఱిఁగించెను. "కొంతకాలముక్రిందట నొకకూలివానిని మాపంతులు గారింటికి రప్పించి యన్నవస్త్రములిచ్చి పోషించుచుండిరి. ఈయన వానితో నెల్లప్పుడు గదిలోఁ గూర్చుండి గుసగుసలాడుచుండును. వానిమాట శిరసావహించును. అతఁడు గొప్పజ్ఞానియని చెప్పుకొను చున్నారు. అతని నడుగక మాపంతు లేపనియుఁ జేయఁడు. ఇదియం

తయు వాని మహాత్వమువల్లనే కావచ్చును." విశ్వాసములేని సేవకుల వల్ల నొకప్పుడు కొంపలు మునుఁగుచుండునుగదా! ఈవృత్తాంతము తత్క్షణమే తక్కినమంత్రులు మొదలగువారు రాజున కెఱిఁగించిరి.

తనగుట్టుమట్టు, తనయద్భుతబుద్ధి, పుట్టు పూర్వోత్తరములు, రాజునకు, లోకమునకుఁ దెలిసినవని విని యాప్రధానమంత్రి మిక్కిలి వగచి తనకుఁ జిరకాలమునుండి మిత్రుఁడై యెల్లకార్యములలో సహాయకుఁడై నమ్మియున్న యామనుష్యుని గడతేర్చి తనగుట్టు దాచుకొనఁదలంచెను. ఆమనుష్యుఁడు బీదవాఁడై పొలము దున్నుట, కూలిచేయుట మొదలగు వృత్తులవలనఁ దొలుత జీవనముచేయుచు వేషభాషలవలన నీచునియట్లు కనఁబడుచున్నను నిజముగా గొప్పవే దాంతియై, జ్ఞానధన మపారముగాఁ గలిగి సంతుష్టిగలిగి, రాజులకంటె నెక్కుడు మనస్సౌఖ్య మనుభవించు చుండెను. అట్టివాని నీమంత్రి స్వలాభము నిమిత్తము తుదముట్టింపఁదలఁచి రాత్రియంతయు బాగుగ నాలోచించి మఱునాఁ డుదయమున వానిం జేరఁబిలిచి యొకజాబు వ్రాసి చేతికిచ్చి యిట్లనియె. "ఈజాబుమీఁద నెవరి పైవిలాస మున్నదో వారికి దీనిందీసికొనిపోయి యిమ్ము. నీస్వహస్తములతోనే యీయవలయును. మిక్కిలి ముఖ్యమయిన రాజకార్యమునుగూర్చి దీనిని వ్రాసితిని. చావో బ్రతుకో యీలేఖ యందుటలోనున్నది." జ్ఞానియు జాబుం గైకొని "చిత్త" మని, పైవిలాసముకలవాని కాజాబు నంపచ్చుటకు తత్క్షణమే బయలుదేఱెను. అతఁ డాలేఖను గొనిపోవుచుండ దైవవశమున మార్గమధ్యమునం దామంత్రికుమా రుఁడు వానికగపడి "నాకు నీవొక పనిజేసిపెట్టవలెను. నాభార్య యా వలవీథిని మాయత్తవారి యింటనుండి నారాక కెదురు చూచుచు న్నది. ఇప్పుడే మానాయన ,నానిమిత్తము వర్తమాన మంపెను. నే నక్కడకు ముందుగాఁ బోవలయును. కాఁబట్టి యీజాబుదీసికొని

నీవు తత్క్షణమే మాయత్తవారియింటికిం బోయి నాభార్యకిచ్చి యామెయుత్తరమును మరల నాకుఁ దేవలయు" ననెను.

జ్ఞాని మిక్కిలి యాతురతతో నున్న యాబాలుని మోముఁ జూచి, తనచేతనున్న యుత్తరముఁజూపి, యాతనితో నిట్లనియె. "అబ్బాయీ! వీలులేదు. క్షమింపుము. మీనాయనగారు నన్నొక పనియందు నియోగించిరి. క్షణమైన జాగుసేయరాదు. అదిగో! ఆకనఁ బడుచున్న యింటియజమానునకే నేనీజాబు నీయవలయును. నన్ను విడిచిపెట్టుము నాయనా."

అనవుఁడు ప్రియురాలిమీఁదనే మనసంతయు నిల్పిన యాబాలుఁడు వానినిఁజూచి "సరే! ఆయింటి యజమానునకేగద? నేబోయి నీజాబు వానికిచ్చెదను. ఈపైవిలాసము గలవాఁడు పెద్దతలారి. నాలేఖ తత్క్షణమే నీవు కొనిపొమ్ము. నేను ప్రత్యుత్తరమునకెదురుచూచుచుందు" ననెను ఆపనిచేయుదునా మానుదునా యని జ్ఞాని తనలో వితర్కించుకొనుచుండ మోహాపరవశుఁడగు బాలుఁడు వానిచేతనున్న చీటి బలవంతముగా నూడఁదీసికొని, తనజాబు వానిచేతిలోఁబెట్టి "పోపొ"మ్మని వానిఁదోలెను. రెండుగడియల తరువాత జ్ఞాని మరల మంత్రిగృహముఁజొచ్చి యాబాలుని కొఱకు వెదకఁ జొచ్చెను. మంత్రి వానిరాక కాశ్చర్యమును గోపమునుజెంది పండ్లుకొఱుకుచు "ఓరి, దౌర్భాగ్యుఁడా! నీవు తిరిగి యెట్లురాగల్గితివి? ఈలాగున మరల నాకడకు నిన్ను బంపకుండ వానివద్దకే చీటియిచ్చి నిన్ను బంపియుంటినిగదా!" యని పల్కెను. నావుడు జ్ఞాని యిట్లనియె. "అయ్యా! మీకుమారుఁడు తనభార్యకిమ్మని నాచేతి కొకజాబిచ్చి మీరు నాకిచ్చిన చీటి తానుగైకొని పైవిలాసముగల పురుషునకిచ్చుట కరిగెను. ఇదిగో మీకోడలు భర్తకిచ్చిన ప్రత్యుత్తరము. కావలయు ననినఁ జూడుఁడు."

అతిదారుణమైన యాపలుకు విని మంత్రి నిశ్చేష్టుఁడై లేచి మొగమున నుత్తరీయము వేసికొని గోలుగోలుమనుచు నిట్లు విలపించెను. "అయ్యో! ఎంతదిక్కుమాలినవాఁడవురా నాయనా! నాబ్రతుకు వృథాయయినది. అయ్యో! కొడుకా కొడుకా నన్నుఁబాసిపోయితివా? ఓరిమందభాగ్యుఁడా! అది తీసికొనివెళ్ళినవానిని తత్క్షణమే వధింపుమని పెద్దతలారికి వ్రాసిన యాజ్ఞాపత్రిక యని యెఱుఁగక నీవు కొనిపోయి మృత్యుదేవతపాలయితివి. నాచేతులతో నేనే నీకు మరణదండన విధించితిని. నీచేతులతో నీవే దాసిని గొనిపోయితివి. నాచేతితో నురివేసితిని. నీచేతితో బిగించుకొంటివను సామెత నిజమయినది"

ఆయేడుపు విని జ్ఞానియవ్వి మంత్రి నిట్లని మందలించెను "నీవు నీకొడుకుకన్న నెక్కువ మూర్ఖుఁడవు. నీవు సరియయినదారిని వెళ్ళినంతకాలము వృద్ధిఁబొంది సంపదలతోఁదులదూఁగితివి వంకరదారిని నడువనారంభించిననాఁడే పడిపోతివి. ఈమాటలు నాఁడు నేను గొయ్యి దీయుచుండఁగాఁ జెప్పలేదా? సర్వముఁదెలిసి చిట్టచివరకు నీవు నేను త్రవ్వినగోతిలోనే పడితివి. దారినేవెళ్ళి దారినే రానివారి గతి యింతే కదా! చెడపకురా చెడియెదవన్నమాట యబద్ధమా"

## ఇదియు నొకందుకు మంచిదే

ఒకరాజువద్ద వివేకియయిన మంత్రియొకఁ డుండెను. ఆమంత్రి తనకుఁగాని, యితరులకుఁ గాని సుఖము వచ్చినపుడు, కష్టము వచ్చినపుడు భేదభావము చూపక "ఇదియు నొకందుకు మంచిదే" యని పలుకుచుండును. ఒకనాఁడు రాజు చిన్నకత్తితో గోళ్ళుదీసికొనుచు వేలు కోసికొనెను. గాయమునుండి నెత్తురు జొటజొట గారఁజొచ్చెను. మంటచేత రాజు బాధపడుచుఁ దనవ్రేలు తెగెనని మంత్రితోఁజెప్ప నతఁడెప్పటియట్ల "ఇదియు నొకందుకు మంచిదే" యనెను. ఆమాట విని రాజు మహాకోపము నొంది మంత్రిఁ

జెఱసాలలోఁబెట్టించెను. చెఱసాలకుఁ బోవునపుడు మంత్రి యథాపూర్వ కారము "ఇదియు నొకందుకు మంచిదే" యని పలికి వెళ్ళెను. అంతటఁ గొన్నినాళ్ళకు రాజు పరివారసమేతుఁడయి వేఁటనిమిత్త మడవికిఁబోయి సాయంకాలమువఱకు వేఁటాడి గృహమునకు మరల బోవుచుండఁగా గొప్ప గాలిదుమారము పట్టెను. దానితోఁగూడ కుంభవృష్టిగ వర్షము కురిసెను. పరివారము చెల్లాచెదరై విడిపోయెను. కోయవాండ్రు రాజునెఱుఁగక యెవ్వఁడో యనుకొని వానిని దమ పోలేరమ్మకు బలియీయఁదలఁచి దానికిం దగుసన్నాహముఁజేసిరి. అపుడు కోయలకువృద్ధు, రాజుశరీరమంతయుఁ బరీక్షించి ,యప్పటికి సరిగా మానక యున్న వ్రేలిమీఁదికత్తినాటుఁ జూచి "ఛీ! వీనికిదివరకే కత్తినాటున్నది. వీఁడు బలికి పనికిరాఁ"డని త్రోసివేసెను. మృత్యుముఖమునుండి బయటబడినందుకు సంతసించి రాజు గృహమునకువచ్చి మంత్రి పలికినట్లు కత్తినాటు మంచిదే యయినదనుకొని, మంత్రినిఁ జెఱనుండి విడిపించి "ఓయీ! నీమాట నావిషయమున నిజమయినది. చెఱలోనికిఁ బోవుచు "నిదియు నొకందుకు మంచిదే" యనియంటివి. అది యెట్లుమంచిదో చెప్పు" మని యడిగెను. మంత్రి యిట్లనియె "స్వామీ! చెఱలోనుండకపోయిన నేను మీతో వేఁటకు వచ్చియుందును.కోయవాండ్రు కత్తినాటుకలదని మిమ్ము విడిచి యట్టి దోషము లేదని నన్ను బలియిచ్చి యుందురు. చెఱనుండఁబట్టి బ్రతికితిని." వానియుక్తికి రాజు చాల సంతసించి మరల వానిని మంత్రి జేసెను.

---

# శాంతోబాయొక్క ఘనమైన భక్తి

మొగలాయీలకాలమున మహారాష్ట్రదేశమున రంజనాని గ్రామమునందు శాంతోబాయను నొకఁడు నివసించుచుండెను. ఇతఁడు మిగుల ధనవంతుఁడై యఖిలభోగము లనుభవించుచు జనరంజకుఁడై సంతోషముతోఁ గాలముగడపుచుండె. ఒకనాఁడాగ్రామమున నొకభక్తవరుఁడువచ్చి ప్రసిద్ధిఁగాంచిన తుక్కారాం మునియొక్క మతనీతినిగూర్చి యుపన్యసించెను. ఆయుపన్యాసము శాంతోబా వినినంతమాత్రమున నతని మనస్సున నద్భుతమైనభక్తి జనించెను. శాంతోబా సమస్తభోగముల నొకనిమిషములో త్యజించి తన ధనమంతయు బీదలకు బ్రాహ్మణులకు తననౌకరులకుఁ బంచిపెట్టి భగవద్గీతలు పదునెనిమిదవ యద్యాయములోని 78 వ శ్లోకమే తనకు శరణ్యముగాఁ దనమనంబున నిశ్చయించుకొని ప్రసిద్ధిఁగాంచిన పురందరదాసువలె హరినామకీర్తనముఁజేయుచు నిలువెడలి భీమరథీనది యొద్దున నున్నయొక కొండపై నొకనిర్మానుష్యప్రదేశంబునఁ దన యాశ్రమ మేర్పఱచికొనెను. శాంతోబా సర్వకాల సర్వావస్థలయందును భగవద్భక్తిపరాయణుఁడై యతనినామసంకీర్తనమున కాలము గడపుచుండెను. ఆతనితల్లి తనప్రియపుత్రు నెడబాయుదుఃఖమును భరింపఁజాలక మరల నాతని సంసారమున కాకర్షించునుద్దేశముతో మిగుల సుందరవతియు, పతివ్రతయు, గుణవతియునగు నతనిభార్యను మిగులవెలగల నగలతో చీరలతో నలంకరించి కొడుకునొద్దకుఁ బంపెను. ఈమె భర్తను సమీపించి వలపింపఁజూచెనుగాని శాంతోబా మనస్సు చలింపకుండెను. శాంతోబాభార్య యాతనికి నమస్కరించి ప్రభువా! నాకుభర్తవు, దైవమవునగు నీశరణముగోరి వచ్చితినని పలికెను. ఓచిన్నదానా? నీవు వెలగలనగలన్నియు, బట్టలు విడచి

నారచీరధరించి నాతోపాటుకందమూలములు, ఆకలములు దిని కష్ట సుఖములకోర్చియుండఁగలిగినయెడల నుండవచ్చు, లేనియెడల నీయి చ్చవచ్చినచోటికిఁబోవచ్చు" ననిశాంతోబా చెప్పెను. అత్తయుకోడ లు ననుకొనినట్లు శాంతోబా వలలోఁ జిక్కఁడయ్యె.ఆతనిభార్యయు గుణవతిగాన తనభర్త్తోడిదె లోకమనినమ్మి తననగలు మున్నగునవి తీసివేసి భర్త్తయాజ్ఞచొప్పున నారబట్టలుధరించి నాటనుండియు భర్త్త తోఁ గలిసి కొండమీఁద నాశ్రీగుమందె నివసింపుచుండెను. ఇ ట్లుండ నొకనాఁడు శాంతోబా మిక్కిలి యాఁకలిఁగొని భార్యనుబిలి చి "నీవూరిలోనికిఁబోయి యింటింటనొకఅరయప్పము చొప్పున భిక్షు మడిగి తెమ్మని యాజ్ఞాపించెను. కాని, యామె చిన్ననాఁటనుండి సం పత్సమృద్ధిలోఁ బెరిగినదగుటచే యాచించుటెట్లో యెఱుంగకుండెను. ఎట్లయినను భర్త్తయాజ్ఞపరిపాలనముచేయక తీరదుగాన నామెయూరిలో నికిఁబోయి యింటింట భిక్షమడుగుచు తిన్నగా తనయాఁడుబిడ్డ గృహ మునకుఁ బోయెను. ఆయాఁడుబిడ్డ శాంతోబాభార్య నాదీనస్థితిలోఁ జూచి మీగతి యింతకు వచ్చెనా యని దుఃఖింపసాగెను. భర్త్తగా రాకలిగొనియున్నారు. నేనుత్వరితముగఁబోవలెనని శాంతోబాభార్య త్వరపడినను వినిపించుకొనక శాంతోబాసోదరి నేతితోఁ గొన్ని యపూపములువండి యామెచేతికిచ్చి పంపెను. ఆమెవానిందెచ్చిభర్త్త ముందరబెట్ట, తానాజ్ఞాపించిన చొప్పున తనభార్యచేయనందున తానా యపూపములు ముట్టనని శాంతోబా యామెకుత్తరమిచ్చెను. వెంట నే యామె ఆయప్పముల తనయాఁడుబిడ్డయింటికిఁ గొనిపోయి అర యప్పముతప్ప తక్కినవన్నియు నామెకిచ్చివేసి తక్కినయిండ్లవద్ద భిక్షమెత్తిన అరయప్పములఁగైకొని భర్త్తవద్దకువచ్చుచుండ నింతలో గొప్పవానగురిసి యామెతడిసెను. కాని యప్పము లెంతమాత్రము చెడకుండ భద్రము చేసెను.ఆమె గ్రామములోనుండి మరలి వచ్చునప్ప

టికాయేరు ఒడ్డులొరసి పారుచుండెను. నదియొడ్డున మనుష్యు లెవరు ను గాన్పింపరైరి. అప్పుడామెస్థితి యాందోళన మూహింపఁదగినదే గాని వివరింప శక్యముగాదు. ఆసమయమున పాండురంగఁడు తప్ప మరియెవ్వరును సహాయము పడువారులేరైరి. ఆమెయేకాగ్రచిత్తయై పాండురంగనిధ్యానింప భక్తవత్సలుండగునాతఁడొకపల్లెవానిరూపము నగనపడి అమ్మా? యేలపలవించుచున్నావని యడిగెను. అయ్యా నాభర్తయగు శాంతోబా ఆవలియొడ్డున కొండమీఁద నాఁకలిబాధచే శ్రమనొందుచున్నవాఁడు, నేనీయప్పము లాతనికిఁగొనిపోవుచున్నాను. ఈయేరుదాటుటకు శక్యముగాకున్నది. నన్ను నీసోదరిగా భావించి యెట్లయిన నన్నావలియొడ్డునకుఁ జేర్చితివేని నీకుఁ జాలపుణ్యమువ చ్చును. నన్నీసమయమున కాపాడుటకై దైవము నిన్నంపి యుండఁ బోలునని దీనాననయై మిక్కిలి పరితపించుచుఁ బలికెను. బెస్తవాఁ డామెమాటలాలించి యామెను తనభుజముపై నెక్కించుకొని యీఁ దుచుఁబోయి నామెనావలియొడ్డునకుఁజేర్చి అమ్మా! సెలవుగైకొనెద నని చెప్పి యామెకనుల యెదుటనె యంతర్ధానమయ్యెను. ఆమెయునత్యా శ్చర్యమునఁదుచు వేగమ తనభర్త యాశ్రమము జేరెను. ఆమెనుజూ చి సుందరీ! నది యొడ్డులొరసి ప్రవహింపుచున్నదే నీవెట్లురాఁగలిగితి వని శాంతోబాయడుగ నాతనిభార్య జరిగినసంగతియంతయుఁ జెప్పి తాఁదెచ్చిన యప్పముల నాతనిముందుబెట్టెను. కాని, శాంతోబా భగవానుఁడగు పాండురంగఁడు మనకుదర్శనమిచ్చువఱకీయప్పముల మనము భక్షింపకుందమని పలికెను. సమస్తహృదయముల నెఱింగి యుండుభగవానుఁడు శాంతోబాయొక్క యెడతెగనిభక్తికి మనో నిశ్చయమునకుమెచ్చి ఆయూరనే నివసించు తనభక్తుండగు నొకవై శ్యునికలలోఁ గనంబడి శాంతోబా మిక్కిలి యాఁకలిగొనియున్న వాఁడు. ఆతనికి షడ్రసోపేతమగు భోజనమిడి. సంతృప్తునిగావించిన

నీకు సకలసంపదలుగల్గునని చెప్పెను. ఆప్రకారమా వైశ్యుఁ డనేక భక్ష్యభోజ్యములు తయారుచేయించి శాంతోబాయాశ్రమమునకుఁ దీసికొనిపోయి ప్రభువాజ్ఞప్రకార మీపదార్థములు దెచ్చితి దయచేసివీని భక్షింపుమని శాంతోబాతో చెప్పెను. శాంతోబా కన్నీళ్లతో వెక్కి వెక్కి యేడ్చుచు మునుపటికంటె నధికసంతాపముతో నాకీ యాహారము గొనిపొమ్మని నీకాజ్ఞాపించిన ప్రభువు నాకు దర్శనమిచ్చినఁగాని దీని నేభుజింపనొల్లనని. వైశ్యునితోఁ జెప్ప నతఁడు శాంతోబా తనప్రార్థన మంగీకరింపఁడని తలఁచి యాతనివిడచి తననెలవునకుఁబోయెను.

శాంతోబా తనశరీరసంరక్షణము నంతగాఁ బరిగణింపక, యాహారమేమియుఁగొనక, ప్రభువునం దేకాగ్రచిత్తముతో భక్తి సలుపుచు ప్రభువు తనకు దర్శనమీయనియెడలఁ దనప్రాణమునైన బలియిచ్చుటకు నిశ్చయించుకొని యుండెను. భక్తపరాధీనుండగు పాండురంగఁడు శాంతోబాకు తన సగుణరూపంబున దర్శన మిచ్చి యతని నాశీర్వదించెను. అంతటినుండియు శాంతోబా తృప్తుఁడై సర్వకాల సర్వావస్థలయందును భగవద్దివ్యగుణానుభవము వలన నానందపరవశుఁడై మనోవాక్కర్మంబుల నీశ్వరార్పితము జేసి సుఖియైయుండె.

రంజనాని గ్రామమున నొక బ్రాహ్మణుఁడు గలఁడు. కంచు కాగడాలువేసి వెదకినను ఈబ్రాహ్మణుని హృదయమున ఈశ్వర భక్తి యెచ్చటను గానరాదు. ఈతఁడు పలుమారు భార్యతోఁ గలహింపుచు నామె తనకు విధేయురాలై యుండనిచో శాంతోబావలె తానిలువిడచి యరణ్యమునకుఁబోదునని భార్యను బెదరింపుచుండును ఆస్త్రీ మిక్కిలి బేలయై గడసరికానందున భర్తకు విధేయురాలై సత్ప్రవర్తన గలిగి కాలముగడపుచుండెను. ఇట్లుండ నొకనాఁడు శాంతోబా భిక్షమడిగికొనుట కాబ్రాహ్మణుని యింటికివచ్చెను. అప్పుడు

బ్రాహ్మణుఁ డింటలేఁడు. ఆతనిభార్య శాంతోబాకు భిక్షముపెట్టి తన భర్తయొక్క పరివర్తనముగుగూర్చి యాతనితో మొఱబెట్టుకొనెను. అమ్మా! భయపడకుము. నీవును నీభర్తకుఁ దగినట్టు నటింపవలెను. ఈసారి నిన్నతఁడు బెదరించినయెడల నీకిష్టమగుచోటికిఁ బోవచ్చునని ధైర్యముగాఁ బలుకుము. అప్పుడతఁడు నా వద్దకువచ్చును. పిమ్మట నేనాతనికి బుద్ధిచెప్పి మరల నీయొద్ద కనిపెదనని శాంతోబాచెప్పి వెడలిపోయెను. అంత నొకనాఁడా బ్రాహ్మణునిభార్య వేళకువంటచేయక పోవుటచేత నామెనుచీవాట్లుపెట్టి తానిల్లువిడచిపోయి జంధ్యాలుత్రెంపుకొని సన్యసించెదనని మామూలు బెదిరింపుమాటలు పలికెను. "ఆట్టే ఆలస్యముకాకుండ, ఆచేయఁదలఁచుకొన్నదేమిటో పెందలాడే చేసికొనుటకు మీయిష్టమువచ్చినచోటికివెళ్ళవచ్చు"నని భార్యధైర్యముగాఁబలికెను. ఈమాటలువినఁగానే బ్రాహ్మణుఁడు కోపోద్దీపితుఁడై యిట్టిమాటలు వచ్చిన తరువాత నిఁక నింటనుండఁగూడదని తలంచి చెంబొకటి దీసికొని యిలువెడలి తిన్నగా శాంతోబాయాశ్రమము నకుఁబోయెను.

బ్రాహ్మణుఁడు శాంతోబానుచూచి నేనుగూడ సంసారమును విడచిపెట్టి నీవలన నుపదేశము బొందవచ్చితినిగాన నన్ను గరుణింపవలయునని యడిగెను. శాంతోబా బ్రాహ్మణునిజూచి అయ్యా! నీవుధరించిన వస్త్రములు నీచేతిలోచెంబు నాతంకముగా నున్నవి. వాని నావలఁ బారవేయుము. ఈనారబట్టధరించి మ్రానిపాత్రనుదీసికొని నదికిఁబోయి నీళ్ళు తెమ్మని యాజ్ఞాపించెను. బ్రాహ్మణుఁడు చాలసేపను మానించి తానుకట్టుకొన్నబట్టలను, చేతిచెంబును విడువలేక విడచిపెట్టి శాంతోబాయిచ్చినశాటీకట్టుకొని మ్రానిపాత్రతో నదికి నీళ్ళు తేఁబోయెను. ఇంతలో శాంతోబా ఆతనిబట్టలు తునకలుగాఁ జించివైచి చెంబవతలపారవేసెను. బ్రాహ్మణుఁ డాశ్రమమునకు మరల

వచ్చునటకు శాంతోబాయు నతనిభార్యయు నెద్దియో తినుచుండిరి. తనకును ఆఁకలిగానున్నదని బ్రాహ్మణుఁడుచెప్పెను. అప్పుడుశాంతో బా తాముదినుచుండిన వేఁపపండ్లు కొన్ని బ్రాహ్మణునకిచ్చి తినుమ నెను. నినుశరణుజొచ్చినందున కిదియా ఫలితమని బ్రాహ్మణుఁడు కో పోద్దీపితుఁడై పలికెను. నీవీలోకమును వర్జించితివి కద? వర్జించుటయన గా సమస్తకోరికలు బంధములు వదలుకొనుటకద? ఈదేహములో ప్రాణము నిల్వఁబెట్టుటకేనయిన తినవలయుగాన మనకులభించిన దాని తో తృప్తిపొందవలయునని శాంతోబా మెల్లగా నుత్తరమిచ్చెను. బ్రాహ్మణుఁ డామాటలువిని విశ్రాంతిదక్కి, ఒకమూల ఆఁకలిబా ధింప నొకమూల చలిచే గడగడవడఁకుచు లోకమును వర్జించుట య నఁగానేమో గ్రహించి బాలునివలె నేడ్చుచు నేనింటనుండిన నింతతిం డియైనఁ గడుపునిండ దొరకునుగదా? నాయవివేకమునకుఁ దగిన శా స్తియైనది. ఇఁకచాలు నని బ్రాహ్మణుఁడుత్తరమిచ్చెను. అప్పుడు శాం తోబా బ్రాహ్మణునినూరార్చి నీకువచ్చినభయములేదని యాతని వెంటఁబెట్టుకొని యాతనిగృహమునకుఁబోయి, వానిభార్యనుబిలిచి, అమ్మా, ఇదుగోనీభర్త. ఇతఁడిఁకమీద నిన్నేమనక నీమనసునచ్చి నట్లుమెలఁగఁగలఁడని చెప్పి వారిరువుర సఖ్యపఱచి,తనయాశ్రమమునకు మరలిపోయెను. అనంతరము శాంతోబా, భార్యాసమేతము శిష్య బృందము వెంటరా, హరినామసంకీర్తనము గావింపుచు పాండురంగ విఠలుని యాలయముఁబ్రవేశించి యందే స్థిరముగానుండి కాలము గడపెను.

---

# బుద్ధిచెప్పుట

ఒకరాజు తనతోఁటలో నొకమేఁడనుగట్టుకొనఁదలఁచి స్థలము చాలకపోవుటచేఁ దనతోఁటప్రక్కనున్న యొకపొలము నాక్రమింపఁ దలఁచెను. ఆపొల మొకదిక్కులేని వితంతువుది. భర్తపోయిన నాట నుండి యామె యాపొలముపంటవల్ల జీవనముచేయుచున్నది. ఆభూములు వారికుటుంబములోఁ బదిపండ్రెండు తరములనుండియుండెను. రాజు కొంతధనము తీసికొని భూమి తనకిమ్మని వితంతువు నడిగెను. కాని, యామెపూర్వులు సంపాదించిన భూములగుటచే నది యెవ్వరి కిమ్మఁదలంచుకొనలేదని రాజునకు బదులుచెప్పెను. తనవంటివాఁడడుగుచుండఁగా నిచ్చుటలేదని చెప్పుట కామె పెంకితనమేల యుండవలయునని కోపించి యాభూమిని రాజు బలవంతముగ నాక్రమించుకొని యందొక సుందరమైన మేడకట్టెను. మగదిక్కులేని యావితంతువు చేయునదేమియు లేక రాజుచేసిన దౌర్జన్యమును నాతనిగురువుతోఁ జెప్పెను. అతఁడు రాజుచేసిన దన్యాయమని ప్రత్యక్షముగఁ జెప్పుటకు జడిసి తగినసమయము వచ్చినప్పుడు వితంతువునకు న్యాయముచేయుదునని చెప్పెను. రాజులు చీవాట్లకు లొంగరనియు చమత్కారసంభాషణలవలనను జిత్రములైన కార్యములవలనను వారు తాముజేసిన తప్పులు దెలిసికొని దిద్దుకొందురనియు గురువభిప్రాయపడి యదను వచ్చినప్పు డట్టివానివలన రాజుమనస్సు త్రిప్పఁదలంచెను. ఒకనాఁడు రాజు వితంతువుయొక్కభూమిలోఁ గట్టినమేడవద్ద బచారులు చేయుచుండఁగాఁ గురువు వానిసన్నిధికిఁబోయి తనకు గోనెసంచెడుమట్టి త్రివ్వుకొనుటకు సెలవిమ్మని యడిగెను. అందుకు రాజు సమ్మతించుటయు నతఁడు మట్టిత్రవ్వి సంచినిండఁబోసి యది తనకెత్తుట కెవ్వరు

లేనందున శిష్యుఁడగుటచే రాజునే యెత్తుమనెను. రాజు నవ్వుచు గురువున కది యెత్తఁబోయి మిక్కిలి బరువుగానుండుటచేఁ గ్రిందఁబడవైచెను. అప్పుడు గురువు నవ్వి "యీమట్టి వితంతువుభూమిలో నొక చిన్నభాగముకదా! ఇదియె మోయలేనప్పు డన్యాయముగ నీవితంతువుభూమినాక్రమించుకొన్న పాపభార మెట్లు మోయఁగలవు? అది యింతకంటె వేయిరెట్లు బరువుండునుగదా!". అనవుడు రాజు తనతప్పును దెలిసికొని వితంతువునకుఁ దానుకట్టిన మేడతోఁగూడ పొలము వదిలిపెట్టెను.

---

## పిత్రార్జితము



ఒక ముసలివాఁడు చావుకు సిద్ధముగనుండి తనకుమారుని దగ్గరకుఁబిలిచి యొక రాళ్ళసంచిచూపి యిట్లనియె. "నాయనా! నీకు నేను యియ్యవలసిన పిత్రార్జిత మిదే. దీనిని మాతండ్రి నాకిచ్చెను. ఇచ్చునప్పుడు నీకిది మహోపకారము చేయఁగలదు. దీనినిమాత్రి మెప్పుడు వదలవద్దని నొక్కిచెప్పెను. మాతండ్రిపోయి యేఁబదిసంవత్సరములైనను మోతబరువేగాని దీనిలాభము నేను గనిపెట్టఁ జాలనైతిని. నీవదృష్టవంతుఁడవైనపక్షమున దీనిలాభముఁ గనిపెట్టఁగలుగుదువు. కాబట్టి దీనిని జాగ్రత్తపెట్టుకొనుము" అనిచెప్పి మరణమొంద, కుమారుఁడు, ఆరాళ్ళసంచి పుచ్చుకొని దేశాటనము చేయనారంభించెను. ఆదేశాటనముచేయునప్పుడు పలుమారులు వాఁడు తనలో 'ఛీ! మోతచేటేగాని యీరాళ్ళసంచియెందుకు దీనిని మోయుటచేత భుజము కాయగాచినది. పారవేయుదునా' యనితలంచుచు మరల తం

డిరిమాట జ్ఞప్తికిఁదెచ్చుకొని యెప్పటికైన దానిరహస్యముదెలియు నేమో యనునాశచే పారవేయక మోసికొనిపోవుచుండెను. ఒకనాఁడు సాయంకాల మతఁ డొకచెట్టుక్రింద బడలికచేఁ గూర్చుండఁదలఁచి భుజముమీఁదనున్న సంచి గుభాలున నేలఁబడవైచెను. వేసినతోడనే మూతికికట్టినతాడు విడిపోయి కొన్ని రాళ్ళు క్రిందఁబడెను. ఆపడినవాటిలో కొన్ని చిరకాలము సంచిలోనుండి యొకదానికొకటి యొరసికొనుటచేతగాఁబోలు మెఱయఁజొచ్చెను. ఆపేదవాఁడు మెఱయుచున్నయారాళ్ళనుజూచి యవి రత్నములై యుండవచ్చునని చప్పుచప్పున నవి మరల సంచిలోకట్టి యొకపట్టణముబోయి రత్నములు సానబట్టెడువాని దుకాణమున కొంతకాలము పనినేర్చుకొని యింటికిఁబోయి యారాళ్ళనన్నింటిని సానబట్టెను. పట్టినతోడనే యవి యన్నియు రత్నములయ్యెను. అందుచే మునుపు భిక్షాధికారైన యతఁడు లక్షాధికారియయ్యెను. నిరుపమానమైన యైశ్వర్య మనుభవించెను.



## దయాశాలి

పూర్వకాలము తురకలు హిందువులు ఘోరయుద్ధములు చేయుచుండిరి. ఒకయుద్ధములో మహమ్మదీయ సేనాధిపతికొడుకు హిందూసేనాధిపతిచేతులో చిక్కగా నతఁడు వానిని ఖైదీగాఁబట్టుకొని కొంతకాలముంచెను. ఈనడుమ హిందూసేనాధిపతి కొడుకు యుద్ధములో చనిపోయెను. కొడుకుచనిపోయిన కొన్నాళ్ళకా హిందూసేనాధిపతి తురకబిడ్డను తనయెదుటకిఁ బిలిచి యిట్లనియె. ఓయీ నాకున్న యొక్కకుమారుఁడు యుద్ధములో మృతినొందెనుగదా! పుత్రశోక మెంతతీవ్రమైనదో నాకిప్పుడు తెలిసినది. నాకుమారుని

నిమిత్తము నేనెంత విచారించుచున్నానో నీకొఱకు నీతండ్రియు నంత విచారించుచుండును. కావున నీవిఁక సత్త్వరము మీతండ్రియొద్దకుఁ బొమ్మ." అని పలికి యాతని విడిచిపెట్టెను.

---

## సోక్రిటీసు

---

గ్రీసుదేశము యూరపుఖండ దేశములలో నొకదేశము. క్రీస్తుశతమునకు పూర్వ మీదేశము తక్కిన యనేకదేశముల కంటె నెక్కువ నాగరికతనొంది ప్రపంచమంతట ప్రఖ్యాతిఁగాంచెను. పూర్వకాలమున నా దేశమున సోక్రటీసు అనునొక గొప్పవేదాంతిగలఁడు. సామాన్యముగ మానవజన్మమెత్తిన ప్రతివానికి నప్పుడప్పుడు కోపమువచ్చుట సహజము. సోక్రిటీసుగూడ మానవుఁడేయగుటచే నప్పుడప్పుడు కోపమునకు లోనగుటఁజూచి దానినిమొదలంటరూపుమాప నిశ్చయించుకొని తనమిత్రులతో తనయందెన్నఁడైన నీదుర్గుణము కనిపించినయెడల మందలింపుమని కోరెను. గ్రహచారవశమున నెన్నఁడైన కొంచెము కోపమువచ్చినపుడు మిత్రులెవరైన జ్ఞాపకము చేసినతోడనె యతఁడు కోపమును దిగమ్రింగి శాంతుఁడయ్యెడివాఁడు ఈవిధమగుశిక్షవలన నితఁడు కొలఁదికాలమున కోపమునన దెఱుఁగక సంపూర్ణశాంతమూర్తియయ్యెను. అతని శాంతమెట్టిదో యీక్రింది సంగతులవలనఁ దెలియఁగలదు. ఒకనాఁడు బానిసయొకఁడేదో లోపముచేసినపుడు సోక్రిటీసునకెంతో యాగ్రహము వచ్చెను. ఆయాగ్రహములో నాబానిసనుజూచి యతఁడిట్లనెను. "నా కిపుడెంతో యాగ్రహముగనున్నది. గాని లేకున్న నీవీ దినమున దెబ్బలు తినియుందువు" సోక్రిటీసు యెక్కువకోపమువచ్చినను కోపముచే నోడ లెఱుఁ

గక ప్రవర్తింపలేదు. బానిసవానిపై చేయివేయలేదు. మీఁదుమిక్కిలి చేసినతప్పునకు కోపమురాకున్న శిక్షించి యుందుననెను. ఒకనాఁడొకఁడు సోక్రటీసును చెంపపైఁ గొట్టఁగా నతఁడు శాంతముతో మందహాసముచేయుచు నిట్లనెను. ఏసమయమున శిరస్త్రాణమును ధరింపవలెనో యెప్పుడు తీసివేయవలెనో యెఱుఁగకుండుటగూడ నొకలోపమే; అనగా శిరస్త్రాణమున్న దెబ్బతగులక యుండుననుభావము ఈకార్యమువలన నతఁడెంత శాంతము గలవాఁడో తెలియఁగలదు. మరియొక సమయమున సోక్రటీసు కొందఱు మిత్రులతోఁగూడి యెచ్చటికోఁ బోవుచు మార్గమధ్యమున నొకపెద్దమనుష్యునకు నమస్కరించెను. కాని యాతఁడా నమస్కారమునందుకొనకయే తనదారినిపోయెను. సోక్రటీ సంతటివాఁడు నమస్కరింపఁగా దానినందుకొనక గర్వముతోఁబోయిన పెద్దమనుష్యుని ప్రవర్తనకు మిక్కిలికసలిఁ సోక్రటీసు మిత్రులతో నిట్లనియె. "ఆపెద్దమనిషి పరువు మర్యాద లెఱుఁగకున్నాఁడు. అతని మర్యాదమాలిన ప్రవర్తనకు మాకెంతో కోపము గనున్నది. ఎటులైన నీతని పొగరడఁపవలె నని యున్నది." ఈమాటలువిని సోక్రటీసు వారివెఱ్ఱితనమునకు నవ్వి శాంతముతో నిట్లనెను. "దారిఁబోవునపుడు శరీరలోపము గలవారెవరైనను నెదురైన మావలెనుండక 'మీరిట్లుండఁబనియేమి' యని వారిపై కోపగించుటతగునా? ఇట్టి న్యాయమెచ్చటనైన నుండునా? మీవంటివారట్టిపని యెన్నఁడు చేయయరుగదా? అట్టితరి మీకుమాత్రము బుద్ధిలేకుండ వారియెడ కోపగించుటన్యాయమగునా? ఇందు కోపకారణమేమున్నది. ఒకటి శరీరము నాశ్రయించినరోగము; రెండవది మనసునకుఁ బుట్టినరోగము. సోక్రటీసు మతమున శరీరరోగము గలవారెట్లుందురో యట్లే మనోరోగము కలవాఁగుగూడ నుందురనియు వారు మనవలెనుండకపోవుటేమని యాగ్రహించుటయు

వారిలోపాలోపములఁ బాటించి చింతించుటయు సత్పురుష లక్షణ ముకాదనియు గ్రహింపవలసియున్నది. ఈతనిగూర్చిన చమత్కారములఁ దెలిసికొనుటకు పైకిబోనవసరములేదు. ఆతని గృహచరిత్రమే చాలును. ఆతని యోరిమి యెట్టిదో తెలిసికొనవలెనన్న గృహామం దపుడపుడు జరిగెడు స్వల్పవిషయములవినిన చాలును. అతని భార్య పేరు 'జాంతిపి' ఆమె స్త్రీలలో బ్రహ్మరాక్షసి. గయ్యాళులలో మహా గయ్యాళి. ఆకాలమున సోక్రిటీసు యోరిమి మాహాత్మ్యమెట్టిదో పరీ క్షింపఁగోరి బ్రహ్మ యాకాలమున నామెను సృజియించెనని యను కొనవచ్చును. పూర్వము కలహకంఠి చంద్రమతిపాలిటికై ట్లవతరించెనో యీామెయు నట్లే నీమహనీయునిపాలిటి కవతరించెను. ఈమె యాగ్రహమునకు మేర లేదు. పంతగొండితనమున కొకరు సరిరారు. ధూర్తత్వమునకు పెట్టినదిపేరు ఇట్టి శంఖిణిజాతిస్త్రీని భార్యగఁ బడసిన వేదాంతి పాట్లు యెట్లుండునో యూహింపనగును. సృష్టియం దేమి చిత్రమున్నదో గాని ప్రపంచమున సత్పురుషులకు ప్రజ్ఞావంతులకు నచ్చటచ్చట దుష్టులు, గయ్యాళులు భార్యలగు టయు, దుష్టులు, ద్రోహులగు వారికి మహాపతివ్రతలు, సత్యశీలలు భార్యలగుటయుఁ గలుగుచుండును. జాంతిపి యెట్టిగయ్యాళియోచూ డుఁడు. ఈమె నోరెత్తి సోక్రిటీసును తిట్టనితిట్టు తిట్టని దినములేదు. కొన్నిసమయములం దీమె యాతనిపైఁబడి కొట్టుటకు సిద్ధమగుచుం డెడిది. ఒకదినమున,కోపావేశముచే నోడలెఱుఁగక భర్తను తిట్టుటతో తనివినొందక వీథిలో నాతనిపైఁబడి కట్టుబట్టల ముక్కల క్రింద చింపి వేసెను. ఈదుర్వర్తనఁజూచిన సోక్రిటీసుమిత్రు లామెపైఁ గల తమ యసూయతను బట్టఁజాలక సోక్రటీసుతో నిట్లనిరి. "ఈమెకథ బాగు న్నదికాదు. చూడఁజూడ మేమే భరింపఁజాలకున్నాము. నీవిట్లూర కుండుట భావ్యముకాదు. రెండు గట్టిగ తగిలించినఁగాని యీరోగ

ముకుదురదు." ఈమాటలువిని సోక్రిటీసు తనమిత్రులతో చమత్కారమున నిట్లుబలికెను. "మేము తన్నులాడుకొనుచుండఁజూచి యానందింపవలెనని మీకున్నది కాఁబోలును. మాతగవులకు మరింతపురి యెక్కించవలెననియున్నదా? మేము పోరాడునపుడు "వహావా? బాగుచేసితివి సోక్రిటీసని యొకరు (దిట్టముగ దన్నితివి జాంతిపీయని మీలో మరొకరును వెనుకనుండి హెచ్చరింతురు కాఁబోలు! మరియొకసమయమున భార్యపోరు పడిపడి విసికి వీధిలోనికిపోయి సోక్రిటీసు యరుగుపైఁ గూర్చుండెను. ఎంతయరచి గొంతుకు చించుకున్నను యెన్నికూయరాని కూఁతలు కూసినను తన్నుఁగానట్లు లెక్కచేయక మనోచింత లేనివానివలె హాయిగ వీధిలో భర్తయానందించుచుఁ గూర్చుండుటజూచి జాంతిపియుడుకుబోతుతనమును, నాగ్రహమునుఁ బట్టఁజాలక మరింతపిచ్చి యెత్తి కోపముతో మేడఁమీాది కరిగి పేడ నీళ్ళు చిక్కగఁగలిపి యతనితలపైఁ గొట్టెను. సోక్రిటీసు యెట్టి శాంతముగలఁవాఁడో చూడుఁడు! ఆనీరుతో తల ముంచెత్తినభార్యనుజూచి నవ్వుచు నతఁడిట్లనెను. ఇంతకాలమునుండి చేసినమేఘగర్జనల కీమాత్రము చినుకులుండుట యాశ్చర్యముగాదు. ఈతనిచరిత్రముమిక్కిలి యద్భుతమైనది. ఈపైసంగతులఁబట్టి యీతఁడెట్టి శాంతికలవాఁడో తెలియఁగలదు.

స మా ప్త ము.



శ్రీసుజనరంజనీ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.

